ఒక్క కుటుంబంలోని సభ్యులు కూడా (మీ కుటుంబ సభ్యుల కంటే) ఎక్కువ అవమానం అప్రతిష్ఠల పాలు కావడం నాకు ఇష్టమయ్యేది కాదు. కాని ఈ రోజు యావత్తు ప్రపంచంలో మీ కుటుంబ సభ్యులే ఇతర కుటుంబాల సభ్యుల కన్నా ఎక్కువ గౌరవ మర్యాదలు పొందడం నాకు ప్రియమైన విషయం". దైవప్రవక్త (సల్లం) ఈ మాటలు విని "నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ శక్తిమంతుని సాక్షి! నీ యీ ప్రేమాభిమానాలు మరింత అధికమవుతాయి" అని అన్నారు.

ఆ తరువాత హిందా (రజి) ఇలా అన్నది: "దైవప్రవక్తా! (నా భర్త) అబూసుఫ్యాన్ పిసినిగొట్టు మనిషి. అలాంటప్పుడు నేను (అతని అనుమతి లేకుండా) అతని సంపద నుండి నా పోషణ కోసం, అబూసుఫ్యాన్ పిల్లల పోషణ కోసం కొంత డబ్బు తీసుకోవచ్చా?" దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "ధర్మయుక్తంగా చేసే ఖర్చు కంటే ఎక్కువ ఖర్చు చేయడాన్ని నేను ధర్మసమ్మతంగా భావించడం లేదు" అని అన్నారు.★ .

**(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం-మనాఖిబుల్ అన్సార్, 23వ అధ్యాయం - జిక్రుహింద్ బిన్తె ఉత్బా)**

## 5వ అధ్యాయం- అనవసరమైన ప్రశ్నలు అడగడం, హక్కుల ఉల్లంఘన నిషిద్ధం

1117. హజ్రత్ ముగైరా బిన్ షాబా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: దేవుడు ఈ విషయాలను మీకు నిషేధించాడు - (1) మాతృమూర్తులకు అవిధేయత చూపడం, (2) స్త్రీ సంతానాన్ని సజీవ సమాధి చేయడం, (3) మీపై ఉన్న ఇతరుల హక్కుల్ని నెరవేర్చకుండా మీకు లేని హక్కులను గురించి ఇతరుల్ని డిమాండ్ చేయడం, అలాగే (1) వ్యర్థ ప్రేలాపనలు, (2) అక్కరకు రాని ప్రశ్నలు వేయడం (3) ధన దుర్వినియోగం కూడా దేవునికి అప్రియమైనవి.

**(సహీహ్ బుఖారీ:- 43వ ప్రకరణం - ఇస్తిఖ్రాజ్, 19వ అధ్యాయం- మా యున్హా అన్ ఇజా అతిల్ మాల్)**

## 6వ అధ్యాయం- న్యాయంగా తీర్పివ్వడానికి కృషి చేసిన అధికారికి పుణ్యఫలం

1118. హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- న్యాయాధికారి ఏదైనా వ్యవహారంలో శక్తివంచన లేకుండా న్యాయంగా తీర్పివ్వడానికి కృషి చేసినప్పుడు ఆ తీర్పు సరయినదయి ఉంటే అతనికి రెట్టింపు పుణ్యఫలం లభిస్తుంది. ఒకవేళ ఎంత కృషి చేసినా

---

★ ఒకరి హక్కులు నిర్వహించే బాధ్యత మరొకరిపై ఉన్నప్పుడు అతనా బాధ్యత నిర్వహించకపోతే, రెండవ వ్యక్తికి చట్టపరంగా తన హక్కు పొందడం సాధ్యపడని పక్షంలో అతను మొదటి వ్యక్తి అనుమతి లేకుండా అతని సంపద నుండి తన హక్కు పొందడం ధర్మసమ్మతమేనని ఈ హదీసు ద్వారా రూఢి అవుతుంది. సలఫీ ధర్మవేత్తల అభిప్రాయం కూడా ఇదే. కాని ఇమామ్ అబూ హనీఫా (రహ్మలై), ఇమామ్ మాలిక్ (రహ్మలై) ల దృష్టిలో ఇలా చేయడం ధర్మసమ్మతం కాదు.

ఈ హదీసుని బట్టి అవసరమయినప్పుడు పర స్త్రీ చెప్పే మాటలు వినడం కూడా ధర్మ సమ్మతమేనని తెలుస్తోంది. అయితే ఆమె భర్త దీన్ని అపార్థం చేసుకోకూడదు.

అలాగే (న్యాయాధికారి దగ్గర) ప్రతివాది లేకపోయినా తీర్పునివ్వడం ధర్మసమ్మతమేనని కూడా ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. కాకపోతే ఈ విషయం గురించి ధర్మవేత్తల్లో కొంత భేదాభిప్రాయం ఉంది. ఇమామ్ అబూహనీఫా (రహ్మలై), కూఫా ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం ఎదుట ప్రతివాది లేకుండా తీర్పునివ్వడం ధర్మసమ్మతం కాదు. ఇమామ్ షాఫయి (రహ్మలై) అధిక సంఖ్యాక ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం మానవ హక్కుల్లో ధర్మసమ్మతమేగాని, దైవ హక్కుల్లో ధర్మసమ్మతం కాదు.

(ఇమాం నవవీ - రహ్మలై)

తప్పుడు తీర్పు జరిగిపోతే అప్పుడు కూడా అతనికి ఒకింత పుణ్యఫలం తప్పకుండా లభిస్తుంది.[1]

**(సహీహ్ బుఖారీ:- 96వ ప్రకరణం- ఏతిసామ్, 21వ అధ్యాయం - అజ్రుల్ హాకిమి ఇజజ్తహద ఫ అసాబ అల్ అఖ్తఅ)**

## 7వ అధ్యాయం - న్యాయమూర్తి కోపోద్రేకాల స్థితిలో తీర్పివ్వరాదు

1119. హజ్రత్ అబూబక్రహ్ (రజి) సజస్తాన్‌లో (న్యాయమూర్తి హోదాలో) ఉన్న తన కుమారునికి ఇలా ఉత్తరం రాశారు: తీర్పరి కోపంగా ఉన్నప్పుడు ఇద్దరు వ్యక్తుల మధ్య ఉన్న వివాదం గురించి తీర్పివ్వడం అతనికి తగదని దైవప్రవక్త(సల్లం) ప్రవచిస్తుండగా నేను విన్నాను. అందువల్ల నీవు కోపంగా ఉన్నప్పుడు ఇద్దరు వ్యక్తుల మధ్య వివాదం గురించి ఎన్నటికీ తీర్పివ్వకు.[2]

**(సహీహ్ బుఖారీ:- 93వ ప్రకరణం- అహ్కాం, 13వ అధ్యాయం-హల్ యఖ్జిల్ హాకిము అవ్ యుఫ్తి వహువ గజ్‌బాన్?)**

## 9వ అధ్యాయం- తప్పుడు తీర్పులు, కొత్త పోకడలు (బిదాత్)

1120. హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ఎవరైనా మన ధర్మంలో (ఖుర్ ఆన్ - హదీసులలో) లేని కొత్త విషయాన్ని ప్రవేశపెడ్తే అది త్రోసిపుచ్చదగినది. (అంటే

---

(1) ఇమాం నవవీ (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం న్యాయాధికారి ఆజ్ఞాపించే, తీర్పునిచ్చే సామర్థ్యం కలిగి ఉండటంతో పాటు అతను ధర్మవేత్త (ఆలిమ్) కూడా అయి ఉండాలి. ధర్మజ్ఞానం లేని అధికారి తీర్పివ్వడం ధర్మ సమ్మతం కాదు. ఒకవేళ అలాంటి న్యాయాధికారి ఆజ్ఞ జారీ చేస్తే లేదా తీర్పిస్తే అతను పాపాత్ముడవుతాడు; అతని తీర్పు సరయినదయినప్పటికీ అతను దేవుని దృష్టిలో పాపిగానే పరిగణించబడతాడు. అదే విధంగా ధర్మవిద్యాపారంగతుడు (ముజ్తహిద్) చిత్తశుద్ధితో తన శక్తి మేరకు బుద్ధీ జ్ఞానాలను ఉపయోగించి ఏదైనా సమస్య విషయమై తీర్పిచ్చినప్పుడు ఆ తీర్పు తప్పయిపోయినప్పటికీ అతనికి ఒక యూనిట్ పుణ్యఫలం మాత్రం తప్పకుండా లభిస్తుంది. దానిక్కారణం అతను నిజాయితీగా న్యాయాన్ని, పుణ్యాన్ని అన్వేషించడానికి కృషి చేయడమే. ఇది ఆ కృషి ఫలితమే.

ఈ హదీసుని బట్టి ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై), ఇమామ్ మాలిక్ (రహ్మాలై), ఇమామ్ షాఫయి (రహ్మాలై), ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మాలై), ఇమామ్ దావూద్ జాహిరి (రహ్మాలై), ఇమామ్ సుఫ్యాన్ సౌరీ (రహ్మాలై), ఇమామ్ ఔజాయి (రహ్మాలై), ఇమామ్ ఇస్‌హాఖ్ బిన్ రాహూయా (రహ్మాలై), ఇమామ్ బుఖారీ (రహ్మాలై), ఇమామ్ అష్‌హబ్ (రహ్మాలై), ఇమామ్ సహ్‌నూన్ (రహ్మాలై), ఇమామ్ ఇబ్నె ముబారక్ (రహ్మాలై), ఇమామ్ షిబర్మ (రహ్మాలై), ఇమామ్ అబూ యాలా (రహ్మాలై), ఇమామ్ వకీ (రహ్మాలై), ఇమామ్ అబూ యూసుఫ్ (రహ్మాలై), ఇమామ్ ముహమ్మద్ (రహ్మాలై), ఇమామ్ జఫర్ (రహ్మాలై), ఇమామ్ ముజ్నీ (రహ్మాలై), ఇమామ్ తహావి (రహ్మాలై), ఇమామ్ అబూసౌర్ (రహ్మాలై), ఇమామ్ ఇబ్నె మంజర్( రహ్మాలై), ఇమామ్ లైస్ బిన్ సాద్ (రహ్మాలై), ఇమామ్ ఇబ్నె తైమియా (రహ్మాలై), ఇమామ్ ఇబ్నె జరీర్ తబ్రి (రహ్మాలై), ఇమామ్ షౌకానీ (రహ్మాలై), ఇమామ్ ఇబ్నె ఖయ్యిమ్ (రహ్మాలై) వగైరా పూర్వపు ధర్మ విద్యా పారంగతులకు వారు సూచించిన ప్రతి సమస్యా పరిష్కారానికీ, ప్రతి తీర్పుకూ గాను ఒక యూనిట్ పుణ్యఫలం తప్పకుండా లభిస్తుంది. వారు చేసిన కృషిలో తప్పుడు పరిష్కారం లేదా తీర్పు జరిగినప్పటికీ, వారి వల్ల పొరపాటు జరిగిపోయినప్పటికీ వారికీ పుణ్యఫలం తప్పకుండా లభిస్తుంది. వారిలో ప్రతి ఒక్కరూ కేవలం దైవ ప్రసన్నత కోసం సమస్యల్ని పరిష్కరించడానికి శక్తివంచన లేకుండా కృషి చేశారు; కష్టపడి పని చేశారు. అందువల్ల ముస్లింలు వారి పట్ల సదా కృతజ్ఞులయి ఉండాలి. వారిని గురించి ఎంత మాత్రం కువిమర్శలు చేయకూడదు. వారందరి చిత్తశుద్ధి, శ్రమ, కృషి, అన్వేషణలకు గాను దేవుడు వారికి పుణ్యఫలం ప్రసాదించుగాక. తథాస్తు.
(అనువాదకుడు)

(2) ఇమామ్ నవవీ (రహ్మాలై) ఇలా రాస్తున్నారు - కోపతాపాలే కాకుండా, ఏ విధమైన మానసిక ఒత్తిడికి, ఆవేశానికి లోనయి ఉన్నా వ్యవహారాలను పరిష్కరించడం, తీర్పులివ్వడం మానెయ్యాలి. ఉదాహరణకు: ఆకలి దప్పులు కలిగి ఉన్నప్పుడు; తీవ్రమైన విచారంతో, హద్దులు మీరిన సంతోషంతో ఉన్నప్పుడు. ఇలాంటి భావోద్రేకాల స్థితిలో మనిషికి ఒక్కోసారి మానసిక సమతౌల్యం సరిగా ఉండదు. అదీగాక ఆ స్థితిలో అతని దృష్టి వేరే విషయాల వైపుకు పోతుంది. తీర్పివ్వవలసిన వ్యవహారం మీద పూర్తిగా మానసిక ఏకాగ్రత ఉండదు. అయితే న్యాయాధికారి ఒకవేళ అలాంటి స్థితిలో ఏదైనా వ్యవహారంలో తీర్పివ్వడం జరిగితే అది సరయిన తీర్పుగానే భావించబడుతుంది. కారణం దైవప్రవక్త (సల్లం) హజ్రా సెలయేరు వ్యవహారాన్ని కోప స్థితిలో పరిష్కరించడమే.

అది అధర్మమయినది, అంగీకారయోగ్యం కానిది).[1]

(సహీహ్ బుఖారీ:- 53వ ప్రకరణం- సులహ్, 5వ అధ్యాయం- ఇజస్ తలహూ అలాసుల్హి జౌరిన్ ఫహువమర్దూద్)

## 10వ అధ్యాయం[2] - భావ నిర్ణయ కర్తల్లో అభిప్రాయభేదాలు (సహజం)

1121. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- ఇద్దరు స్త్రీలు తమ తమ బిడ్డలను ఎత్తుకొని ఎక్కడికో వెళ్తున్నారు. దారిలో ఒక తోడేలు వచ్చి ఆ ఇద్దరు స్త్రీలలో ఒకామె పిల్లవాడ్ని ఎత్తుకెళ్ళింది. అప్పుడు వారిద్దరిలో ఒక స్త్రీ "తోడేలు నీ బిడ్డను ఎత్తుకెళ్ళింద"ని అన్నది. రెండవ స్త్రీ "నా బిడ్డను కాదు, నీ బిడ్డనే ఎత్తు కెళ్ళింద"ని అన్నది. చివరికి వీళ్ళిద్దరు హజ్రత్ దావూద్ (అలైహి) గారి న్యాయస్థానానికి వెళ్ళి ఆయన ముందు తమ జగడాన్ని నివేదించుకున్నారు. హజ్రత్ దావూద్ (అలైహి) అంతా విని వాళ్ళిద్దరిలో (వయసులో) పెద్ద మహిళకు అనుకూలంగా తీర్పిచ్చారు: (అంటే సజీవంగా ఉన్న పిల్లవాడు పెద్దామెదని, తోడేలు ఎత్తుకెళ్ళిన బిడ్డ చిన్నామెదని తీర్పు చెప్పారు).

ఆ తరువాత ఆ మహిళలిద్దరు, దావూద్ (అలైహి) కుమారుడు సులైమాన్ (అలైహి) దగ్గరి కెళ్ళి జరిగిన సంగతి చెప్పి తమకు న్యాయం చేకూర్చమని అభ్యర్థించారు. అప్పుడు హజ్రత్ సులైమాన్ (అలైహి) వారితో "అయితే ఓ కత్తి తెచ్చివ్వండి నాకు. నేనీ పిల్లవాడ్ని రెండు ముక్కలుగా చేసి మీరిద్దరికీ చెరో ముక్క ఇచ్చేస్తాను" అని అన్నారు. చిన్నామె ఈ మాటలు వినగానే (కంగారుపడుతూ) 'వద్దు వద్దు. అలా చేయకండి. దైవం మిమ్మల్ని కరుణించుగాక! ఈ పిల్లవాడు ఆమె బిడ్డే అని నేను ఒప్పుకుంటున్నాను" అని అన్నది. అప్పుడు హజ్రత్ సులైమాన్ (అలైహి) పిల్లవాడు చిన్నామె కొడుకని తీర్పిచ్చారు.

(సహీహ్ బుఖారీ - 60వ ప్రకరణం- అంబియా, 40వ అధ్యాయం- ఖౌలిల్లాహి తఆలా (వవహబ్నాలిదావూద సులైమాన్)

## 11వ అధ్యాయం- న్యాయమూర్తి ఇరుపక్షాల మధ్య రాజీ కుదర్చడం అభిలషనీయం

1122. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ఒక వ్యక్తి మరొక వ్యక్తి దగ్గర కొంత భూమి కొన్నాడు. ఆ భూమిలో బంగారం ఉన్న ఒక లంక బిందె దొరికింది. దాంతో భూమి కొన్నవాడు అమ్మినవాడితో "ఇదిగో ఈ బంగారం నీదే తీసుకో. నేను నీ దగ్గర భూమి మాత్రమే కొన్నాను, బంగారం కొనలేదు కదా!" అని అన్నాడు. కాని భూమి అమ్మినవాడు (అందుకు

---

(1) దైవగ్రంథంలో ప్రవక్త సంప్రదాయంలో లేని ప్రమాణ రహితమైన ప్రతి విషయమూ గర్హనీయమైనదే. పనికి మాలినదే. దానికి దూరంగా ఉండాలి. దాన్ని ఆచరించకూడదు. అది పైకి ఎంత మంచి విషయంగా కనిపించినా సరే దాని జోలికి పోకూడదు. మంచి చెడులు, తప్పొప్పులను గురించి నిర్ణయించే అధికారం దేవునికి, ఆయన ప్రవక్త (సల్లం)కు మాత్రమే ఉంది. ఇతరులెవరికీ లేదు. కొందరు తమకు తోచిన విధంగా, తమ కిష్టమైన రీతిలో ధర్మంలో చేర్చే నూతన పోకడలన్నిటికీ (బిద్అత్ విషయాలన్నిటికీ) ఈ హదీసు గొడ్డలి పెట్టు వంటిది. (అనువాదకుడు)

(2) ధర్మంలో ఇజ్తెహాద్ చేసే వారిని (షరీయత్ సూత్రాల అన్వయింపుకై పాటుబడేవారిని) ఉద్దేశించి అనువాదకుడు తెలుగులో ప్రవేశపెట్టిన కొత్త పదం ఇది. కాగా ఇజ్తెహాద్ చేసే వ్యక్తిని అరబీలో ముజ్తహిద్ అంటారు. సంకలనకర్త

తిరస్కరిస్తూ) "నేను నీకు భూమిని, అందులో ఉన్న సమస్తాన్నీ అమ్మివేశాను. (కనుక ఈ బంగారంతో నాకెలాంటి సంబంధం లేదు)" అని అన్నాడు.

చివరికి వీళ్ళిద్దరు తమ తగాదాను పరిష్కరించుకోవడానికి ఒకతని దగ్గరకు వెళ్ళారు. అతను వారిద్దరితో "మీ ఇద్దరికీ సంతానం ఉందా?" అని అడిగాడు. ఇద్దరిలో ఒకతను "నాకొక కొడుకున్నాడ"ని అన్నాడు. రెండవతను "నా కొక కూతురున్నద"ని చెప్పాడు. అప్పుడు తీర్పరి ఇలా తీర్పిచ్చాడు- "అయితే మీరిద్దరూ మీ మీ పిల్లలకు పరస్పరం పెళ్ళి చేసి ఈ బంగారాన్ని వాళ్ళిద్దరి కోసం ఖర్చు చేయండి, అందులో కొంత దైవమార్గంలో కూడా ఖర్చుపెట్టండి."

(సహీహ్ బుఖారీ:- 68వ ప్రకరణం- అంబియా, 54 అధ్యాయం - హద్దసనా అబుల్ యమాన్)

# సంప్రాప్త వస్తు ప్రకరణం

## దొరికిన వస్తువుల్ని ఏం చేయాలి?

1123. హజ్రత్ జైద్ బిన్ ఖాలిద్ (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవ ప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి దొరికిన వస్తువు గురించి విచారించగా దైవప్రవక్త (సల్లం) ఇలా చెప్పారు:- "అతని డబ్బు సంచిని, దాని మూతి కట్టుడును గుర్తుంచుకొని ఒక ఏడాది పాటు ప్రజలలో దాన్ని గురించి ప్రకటిస్తూ ఉండు. సంచి యజమానివస్తే దాన్ని అతనికిచ్చివేయి. రాకపోతే నువ్వే దాన్ని కోరిన విధంగా ఖర్చుపెట్టుకో." ఆ వ్యక్తి (మరో విషయం ప్రస్తావిస్తూ) "మరి ఎవరికైనా తప్పిపోయిన మేక దొరికితే దాన్ని ఏం చేయాలి?" అని అడిగాడు. "అదీ నీదవుతుంది లేదా నీ (ధార్మిక) సోదరునిదవుతుంది లేదా తోడేలుదవుతుంది" అన్నారు దైవప్రవక్త (సల్లం). తిరిగి ఆ వ్యక్తి తప్పిపోయిన ఒంటె విషయం ఏమిటని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "దాని సంగతి నీకెందుకు? దాంతో పాటు అతని నీటితిత్తి, చెప్పులు ఉంటాయి. దాని యజమాని వచ్చి తోలు కెళ్ళే వరకు అది ఆకులు అలములు మేస్తూ, నీళ్ళు త్రాగుతూ తిరుగుతుంటుంది" అని అన్నారు.★

**(సహీహ్ బుఖారీ:- 42వ ప్రకరణం-ముసాఖాత్, 12వ అధ్యాయం- షుర్బిన్నాసివద్దవాబ్బి మినల్ అన్హార్)**

1124. హజ్రత్ అబీ బిన్ కాబ్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) కాలంలో నాకొక (డబ్బు) సంచి దొరికింది. అందులో వంద దీనార్లు ఉన్నాయి. నేను దాన్ని తీసుకొని దైవ ప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి

---

★ ఇతరులకు చెందిన విలువైన ప్రతి అభద్రతా వస్తువును షరీఅత్ పరిభాషలో 'లుఖ్తా' అంటారు. దీన్ని తెలుగులో దొరికిన వస్తువని అనువదించడం జరిగింది. ఆ వస్తువు తనంతట తాను కాపాడుకోజాలదు. అది నష్టపోయే ప్రమాదం ఉంది. దొరికిన వస్తువుని ఏం చేయాలనే విషయంలో ధర్మవేత్తల్లో భేదాభిప్రాయాలున్నాయని ఇమామ్ నవవీ (రహ్మలై) వ్రాస్తున్నారు: అలాంటి వస్తువుని తీసేసుకోవడం అభిలషనీయం అన్నది సరయిన అభిప్రాయం. దాన్ని తీసుకోవడం తప్పనిసరి (వాజిబ్) అన్నది రెండవ అభిప్రాయం. మరొక అభిప్రాయం ప్రకారం ఆ వస్తువు పడి కన్పించిన చోటు భద్రమైనదయితే దాన్ని తీసుకోవడం అభిలషనీయం, ఆ చోటు భద్రమైనది కాకపోతే దాన్ని తీసుకోవడం తప్పనిసరి. అంటే ముస్లింకు చెందిన సొత్తు కొల్లగొట్ట బడకూడదని అర్థం.

పోతే ఆ వస్తువు విలువైనదయితే, వస్తువు యజమాని దాని గుర్తులు తెలిపి తీసుకెళ్ళమని ఒక ఏడాది పాటు ప్రకటన చేస్తూ ఉండటం అనివార్యం (వాజిబ్). అయితే ఈ పని తరువాత దాన్ని సొంతం చేసుకోవచ్చున్న ఉద్దేశ్యం ఉన్నప్పుడే ఇలా చేయాలి. వస్తువుని కాపాడే ఉద్దేశ్యం మాత్రమే ఉన్నప్పుడు దాన్ని గురించి సంవత్సరం పాటు ప్రకటన చేస్తూ ఉండటం తప్పనిసరి కాదు. వస్తువు యజమాని వచ్చే వరకూ దాన్ని కాపాడుతూ ఉంటే సరిపోతుంది. అయితే యజమానికి తన వస్తువు ఫలానా వ్యక్తి దగ్గర ఉందని తెలియాలంటే దాన్ని గురించి ప్రకటన చేయడం చాలా అవసరం. అది అంతగా విలువలేని వస్తువయితే దాన్ని గురించి సంవత్సరం పాటు ప్రకటన చేయవలసిన అవసరం లేదు. యజమాని ఇక రాడని నమ్మకం ఏర్పడేవరకు ప్రకటన చేస్తే చాలు.

ప్రకటన చేసే పద్ధతి కూడా గమనార్హమైనది. యజమాని వచ్చి తాను పోగొట్టుకున్న వస్తువు గుర్తులు చెప్పి తీసుకోవడానికి వీలుగా వస్తువు తీసిన వ్యక్తి అది దొరికిన చోట, బజార్లలో, మస్జిద్‌లలో, సమావేశాల్లో దాన్ని గురించి ప్రకటన చేయాలి. నిర్ణీత గడువులోగా యజమాని వచ్చి గుర్తులు చెబితే దాన్ని అతనికి అప్పగించాలి. గడువు దాటిన తరువాత అయినా సరే యజమాని వచ్చి గుర్తులు చెబితే, వస్తువుని తీసుకున్నవాడు దాన్ని సొంతం చేసుకున్నప్పటికీ, అది పెరిగి లేదా రెండింతలు అయినప్పటికీ అంటే, పశువు అయినప్పుడు అది బాగా బలిసిపోవడం, దూడను ఈనడం వగైరా జరిగినప్పటికీ దాన్ని యజమానికి ఇప్పించడం ధర్మసమ్మతమే. అయితే ప్రకటన గడువు దాటి దాన్ని సొంతం చేసుకున్న తరువాత అసలు యజమానికి ఇప్పించేందుకు అతనిపై వత్తిడి చేయకూడదు.

విచారించాను. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "సంచి యజమాని అన్వేషణ కోసం ఒక యేడాది పాటు దాన్ని గురించి ప్రకటన చేస్తూ ఉండు" అని అన్నారు. నేను ఒక ఏడాది పాటు అలా ప్రకటన చేశాను. తరువాత దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి ఇప్పుడేం చేయాలని అడిగాను. "మరో సంవత్సరం పాటు ప్రకటన చేస్తూ ఉండు" అన్నారు ఆయన. నేనలాగే మరో సంవత్సరం పాటు ప్రకటన చేశాను. ఆ తరువాత మళ్ళీ దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి అడిగాను. ఆయన ఇంకొక సంవత్సరం పాటు ప్రకటన చేస్తూ ఉండమని చెప్పారు. నేను ఇంకొక సంవత్సరం పాటు ప్రకటన చేసి నాల్గవసారి దైవప్రవక్త (సల్లం) సన్నిధిలో హాజరయ్యాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) నన్ను ఉద్దేశించి "దాన్ని లెక్కపెట్టుకొని, దాని మూతి కట్టుడు, పాత్ర (వగైరా) ఆనవాళ్ళను గుర్తుపెట్టుకో. (మరి కొన్నాళ్ళు వేచి చూడు. ఈలోగా) దాని యజమాని వస్తే ఇచ్చేయి. లేకపోతే నువ్వే దాన్ని వాడుకో" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 45వ ప్రకరణం - లుఖ్తా, 10వ అధ్యాయం - హల్‌యా ఖుజుల్లుఖ్త వలాయద్ వుహ....)**

## 2వ అధ్యాయం - యజమాని అనుమతి లేకుండా పశువు పాలను పితకరాదు

1125. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ఎవరైనా సరే అనుమతి లేకుండా ఇతరుల పశువుల పాలను పితకకూడదు. ఎవరైనా మీ ధాన్యాగారంలో ప్రవేశించి, గాదులు, పెట్టెలు విరగ్గొట్టి ధాన్యాన్ని దోచుకెళ్తే మీకెలా ఉంటుంది? మీలో ఎవరైనా ఈ విషయాన్ని ఇష్టపడతారా? అలాగే పశువుల పొదుగులు కూడా వారికి ఆహార గిడ్డంగులే. అందుచేత ఇతరుల పశువుల పాలను వారి అనుమతి లేకుండా పితకకండి.

**(సహీహ్ బుఖారీ:- 45వ ప్రకరణం-లుఖ్తా, 8వ అధ్యాయం- లా తుహ్తలబు మాషియతు అహదిన్ బిగైరి ఇజ్న్)**

## 3వ అధ్యాయం - అతిథి మర్యాద

1126. హజ్రత్ అబూ షురైహ్ అదవీ (రజి) కథనం:- నేను కళ్ళారా చూశాను, చెవులారా విన్నాను. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు- "దేవుడ్ని, అంతిమ దినాన్ని విశ్వసించేవారు తన ఇరుగు పొరుగును తప్పనిసరిగా గౌరవించాలి. అలాగే దేవుడ్ని, అంతిమ దినాన్ని విశ్వసించేవారు విధిగా తన అతిథిని సత్కరించి ఆతిథ్యమివ్వాలి". అప్పుడు కొందరు అనుచరులు "దైవప్రవక్తా! ఈ సత్కారం ఎన్ని రోజులు జరగాలి?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చారు -"ఒక రోజు బాగా సత్కరించాలి. మూడు రోజులు సాధారణ ఆతిథ్యమివ్వాలి. అంతకంటే ఎక్కువ రోజులు ఉంటే అది (అతిథికి) దానం (ఇచ్చినట్లు)గా పరిగణించబడుతుంది. పోతే దేవుడ్ని, అంతిమ దినాన్ని విశ్వసించేవాడు పలికితే మంచి మాటనే పలకాలి, లేకపోతే మౌనంగా ఉండాలి."

**(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం- అదబ్, 31వ అధ్యాయం - మన్‌కాన యూమిను బిల్లాహి వల్ యౌమిల్ ఆఖిరి ఫలా యూజి జారహు)**

1127. హజ్రత్ అబూ షురైహ్ కాబి (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- దేవుడ్ని, అంతిమ దినాన్ని విశ్వసించేవాడు తన అతిథికి మర్యాద చేయాలి. ఒక పగలు, ఒక రాత్రి ఆతిథ్యమివ్వడం అతని విధి. మూడు రోజులు ఆతిథ్యమిస్తే చాలా మంచిది. అంతకంటే ఎక్కువ

రోజులు ఆతిథ్యమిస్తే అది దానం (సదఖా)గా పరిగణించబడుతుంది. అయితే ఆతిథ్యమిచ్చేవాని ఇంట అతనికి కష్టం కలిగేటంత కాలం వరకు తిష్ఠవేసి కూర్చోవడం సమ్మతం కాదు.

**(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం- అదబ్, 85వ అధ్యాయం- ఇక్రాముజ్జైఫి వఖిద్మతుహు ఇయ్యాహు బినఫ్సిహీ)**

1128. హజ్రత్ ఉఖ్బా బిన్ ఆమిర్ (రజి) కథనం:- మేము ఓ రోజు దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ "మీరు మమ్మల్ని (ఎక్కడికైనా) పంపినపుడు ఒక్కోసారి మేము మాకు ఆతిథ్యమివ్వని వారి దగ్గరి కెళ్ళి బస చేయవలసి వస్తుంది. అలాంటి పరిస్థితిలో మేము ఏం చేయాలి?" అని అడిగాము. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "మీరేదయినా తెగవారి ప్రాంతానికి వెళ్ళి విడిది చేసినప్పుడు ఆ తెగవాళ్ళు మీకు సంప్రదాయం ప్రకారం తగిన ఆతిథ్యమివ్వడానికి ముందుకు వస్తే సరే, లేకపోతే మీరు మీకు దక్కవలసిన (అతిథి) హక్కును వారి నుండి రాబట్టుకోండి" అని అన్నారు.*

**(సహీహ్ బుఖారీ:- 46వ ప్రకరణం- మజాలిమ్, 18వ అధ్యాయం - ఖిసాసిల్ మజ్లూమి ఇజా వజదమాల జాలిమిహీ)**

★ ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మాలై), ఇమామ్ లైస్ (రహ్మాలై) లు ఈ హదీసు బాహ్యార్థాన్ని తీసుకున్నారు. అధిక సంఖ్యాక ధర్మవేత్తలు దీని అంతరార్థాన్ని తీసుకుంటూ "అతిథి తీవ్రమైన ఆకలి బాధతో ఉన్నప్పుడు, ప్రాణాపాయ స్థితిలో అతనికి విధిగా ఆతిథ్యం ఇవ్వవలసి ఉంటుంది. ప్రజలెవరూ అతనికి ఆతిథ్యమివ్వని పక్షంలో అతను బలవంతంగానైనా తన అవసరాన్ని వారి నుండి తీర్చుకోవచ్చు లేదా నోటితో వారికి తనకు రావలసిన హక్కేమిటో చెప్పి తీసుకోవచ్చు" అని అన్నారు. అయితే ఇది ఇస్లాం ప్రారంభకాలంలో ఉండిన స్థితి అని, తరువాత ఇది రద్దయిపోయిందని మరికొందరు అభిప్రాయపడ్డారు. కాని ఈ ఆజ్ఞ రద్దయిపోయిందనడానికి ఎలాంటి ఆధారం లేదు. (ఇమామ్ నవవీ - రహ్మాలై).

# జిహాద్ (ధర్మపోరాటం) ప్రకరణం

## 1వ అధ్యాయం - దైవ సందేశం స్వీకరించని అవిశ్వాసులపై చర్య

1129. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) బనీ ముస్తలిక్ తెగ వారిపై దాడి చేశారు. ఆ సమయంలో వారు ప్రమత్తంగా ఉన్నారు. వారి పశువులు నీరు త్రాగుతున్నాయి. చివరికి దైవప్రవక్త (సల్లం) వారిలో ఎదురు దాడికి దిగిన వారితో యుద్ధం చేసి వారిని హతమార్చి వారి స్త్రీలను, పిల్లలను ఖైదీలుగా పట్టుకున్నారు. అనాడే హజ్రత్ జువైరియా (రజి) కూడా ఖైదీగా పట్టుబడ్డారు. (ఆ తరువాత ఆమెను దైవప్రవక్త -సల్లం- వివాహమాడారు).

ఈ యుద్ధంలో హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కూడా పాల్గొన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 49వ ప్రకరణం - ఇత్ఖ్, 13వ అధ్యాయం - మమ్మలక మినల్ అరబి రఖీఖా)**

## 3వ అధ్యాయం - యుద్ధ సమయంలో శత్రువుల పట్ల మృదు వైఖరి

1130. హజ్రత్ సయీద్ బిన్ అబీబుర్దా (రహ్మలై) కథనం:- మా తాత హజ్రత్ అబూ మూసా (రజి)ను, హజ్రత్ ముఆజ్ (రజి)ను దైవ ప్రవక్త (సల్లం) యమన్‌కు పంపుతూ వారికి ఇలా ఉపదేశించారు - "(ప్రజలకు) సౌలభ్యం కలగజేయండి, కాఠిన్యాలలోకి నెట్టకండి, శుభవార్తలు అంద జేయండి, ద్వేషం కలిగించే మాటలు చెప్పకండి".

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం- అల్‌మగాజి, 11వ అధ్యాయం - బుయిస అబీమూసా వముఆజ్ ఇలల్ యమన్ ఖబ్ల హజ్జతుల్ విదా)**

1131. దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ప్రవచించారని "హజ్రత్ అనస్ (రజి) తెలిపారు, సౌలభ్యాన్ని కలగజేయండి. కష్టాల్లో పడవేయకండి. ప్రజలకు శుభవార్తల్ని అందజేయండి. ద్వేషం రగల్గొల్పే మాటలు చెప్పకండి."

**(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం-ఇల్మ్ - మాకానన్నబియ్యు (సల్లల్లాహు అలైహి వ సల్లం) యత ఖవ్వలుహుం బిల్ మవ్ యిజతి వల్ ఇల్మి కైలా యన్ఫిరూ)**

## 4వ అధ్యాయం - ప్రమాణ భంగం

1132. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ప్రళయ దినాన ప్రమాణ భంగం చేసిన ప్రతి ఒక్కడి పేర ఒక జెండా పాతబడుతుంది. దాని వైపు చూపిస్తూ ఇది ఫలానా వ్యక్తి కొడుకు ఫలానా మనిషి భంగపరచిన ప్రమాణం అని చెప్పబడుతుంది.

**(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం- అదబ్, 99వ అధ్యాయం - మాయుద్ అన్నాసు బిఆబాయిహిమ్)**

1133. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:-

ప్రళయదినాన ప్రతి మోసగాడి పేర ఒక జెండా పాతడం జరుగుతుంది. ఆ జెండాను బట్టి అతను ఆ రోజు (మోసగాడని) గుర్తించబడతాడు.

(సహీహ్ బుఖారీ :- 58వ ప్రకరణం- జిజ్యా, 22వ అధ్యాయం - ఇస్మిల్‌గాదిరి లిల్ బర్రి వల్ ఫాజిర్)

## 5వ అధ్యాయం - యుద్ధంలో శత్రువును ఏమార్చటం, ఎత్తుగడలు వేయటం ధర్మ సమ్మతమే

1134. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- "యుద్ధమంటే మోసం, ఎత్తుగడలే".

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం-జిహాద్, 157వ అధ్యాయం - అల్ హర్బు ఖుద్ అతున్)

1135. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) మోసం, ఎత్తుగడలకు మారు పేరే యుద్ధమని అన్నారు.★

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం-జిహాద్, 157వ అధ్యాయం - అల్ హర్బు ఖుద్ అతున్)

## 6వ అధ్యాయం - యుద్ధాన్ని కోరుకోరాదు, అయితే శత్రువుని ఎదుర్కోవలసి వస్తే సహన స్థైర్యాలు చూపాలి

1136. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- శత్రువులతో యుద్ధం చేసే పరిస్థితి రావాలని కోరుకోకూడదు. అయితే యుద్ధం అనివార్యమైతే మాత్రం సహనం, స్థైర్యం, స్థిరత్వాలతో పోరాడాలి.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 156వ అధ్యాయం - లాతమన్నౌ లిఖా అల్ అదువ్వి)

1137. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబీ ఔఫా (రజి) కథనం:- హజ్రత్ ఉమర్ బిన్ ఉబైదుల్లా (రజి) హురూరియా తరఫున (ఖార్జియాలతో యుద్ధం చేయడానికి) బయలుదేరినప్పుడు హజ్రత్ అబ్దుల్లా బిన్ అబీ ఔఫా (రజి) ఆయనకు ఇలా ఒక ఉత్తరం రాశారు - దైవప్రవక్త (సల్లం) తాను పాల్గొన్న కొన్ని యుద్ధాలలో ఒక సందర్భాన సూర్యుడు అస్తమించే వరకు నిరీక్షించిన తరువాత జనం మధ్య నిలబడి ప్రసంగిస్తూ ఇలా అన్నారు- "ప్రజలారా! మీరు ఎన్నడూ యుద్ధాన్ని కోరుకోకండి. ఎల్లప్పుడూ శాంతినే కోరుకుంటూ దైవాన్ని ప్రార్థించండి. అయితే శత్రువుతో యుద్ధం చేయవలసిన పరిస్థితే వస్తే మటుకు స్థిరంగా నిలబడి ధైర్యంగా పోరాడండి. గుర్తుంచుకోండి, 'స్వర్గం ఖడ్గచ్ఛాయల క్రింద ఉంది'. ఆ తరువాత దైవప్రవక్త(సల్లం) ఇలా ప్రార్థించారు: 'అల్లాహుమ్మ మునజ్జిలల్ కితాబి వ

★ దైవ ప్రవక్త (సల్లం) ఈ మాటను ఖన్దఖ్ (కందకం) యుద్ధ సమయంలో అన్నారు. అప్పుడు ఆయన హజ్రత్ నయీమ్ బిన్ మస్‌వూద్ (రజి) ని శత్రువుల దగ్గరకు పంపిస్తూ ఖురైషీయులు, బనీ గత్ఫాన్ తెగవాళ్ళు, యూదుల మధ్య పరస్పరం అపోహలు సృష్టించి, విద్వేషం కలిగించి అపనమ్మకపు వాతావరణాన్ని జనింపజేయమని చెప్పారు. ఇమామ్ నవవీ (రహ్మలై) తమ అభిప్రాయాన్ని రాస్తూ "యుద్ధంలో శత్రువుల్ని మోసగించడం, ఎత్తుగడలు వేయటం ధర్మసమ్మతమేనన్న విషయాన్ని దర్మవేత్తలంతా ఏకీభవించారు. అయితే ఈ మోసం, కుట్రలలో ఒప్పందం ఉల్లంఘన, శాంతి ఒడంబడికను కాలరాయడం వంటివి ఉండకూడదు" అని అన్నారు. ఒప్పందం చేసుకున్న తరువాత లేదా, రక్షణ నిచ్చిన తరువాత మోసం చేయడం ఎట్టి పరిస్థితిలోనూ ధర్మసమ్మతం కాదు. ఇది పూర్తిగా నిషిద్ధం. (సంకలనకర్త)

ముజ్రస్సహాబి వ హాజిమల్ అహ్జాబి అహ్జి ముహుమ్ వన్ సుర్నా అలైహిమ్' ("దేవా! దివ్యగ్రంథాన్ని అవతరింప జేసినవాడా! మేఘాలను నడిపించినవాడా! శత్రు శిబిరాలను తుదముట్టించినవాడా! ఈ శత్రువుల్ని కూడా పారద్రోలి నీ సహాయంతో మాకు వీరిపై విజయాన్ని ప్రసాదించు").

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 156వ అధ్యాయం - లాతమన్నౌ లిఖా అల్ అదువ్వి)

## 8వ అధ్యాయం - యుద్ధంలో స్త్రీలను, పిల్లలను హతమార్చడం నిషిద్ధం

1138. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవ ప్రవక్త (సల్లం) పాల్గొన్న ఒక యుద్ధంలో ఒక స్త్రీ వధించబడింది. దైవప్రవక్త (సల్లం) ఇది చూసి స్త్రీలను, పిల్లలను హతమార్చడంపట్ల తన అయిష్టతను వ్యక్తపరుస్తూ, ఆ చర్య నుండి (అనుచరుల్ని) వారించారు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 137వ అధ్యాయం - ఖత్లిస్సి బ్యానిఫిల్ హర్బ్)

## 9వ అధ్యాయం - మెరుపుదాడిలో అనుకోకుండా స్త్రీలు, పిల్లలు హతులైతే ఆ చర్య ధర్మసమ్మతమే

1139. హజ్రత్ సాబ్ బిన్ జష్షామా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) అబ్వా ప్రదేశం లేక వద్దాన్ ప్రదేశం మీదుగా ప్రయాణం చేస్తున్నప్పుడు నేను (కూడా) ఆయన వెంట ఉన్నాను. అప్పుడు ఒక వ్యక్తి మాట్లాడుతూ "దారుల్ హరబ్ (శత్రుదేశం)లోని బహుదైవారాధకులపై మెరుపుదాడి చేసినప్పుడు వారి స్త్రీలు, పిల్లలు కూడా హతమార్చబడటం జరిగితే (ఈ చర్య ధర్మ సమ్మతమేనా?)" అని అడిగారు. దైవప్రవక్త సమాధానమిస్తూ వారు వాళ్ళలోనే ఉన్నారు కదా అన్నారు. (అంటే అలాంటి సందర్భంలో స్త్రీలకు, పిల్లలక్కూడా (శత్రు) పురుషులకు సంబంధించిన ఆజ్ఞే వర్తిస్తుందన్న మాట).

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 146 వ అధ్యాయం - అహ్లిద్దారి యబీ తూన ఫయుసా బుల్ ఉల్దాను వజ్జరారీ)

## 10వ అధ్యాయం - అవిశ్వాసుల (శత్రువుల) చెట్లు నరకడం, కాల్చడం ధర్మసమ్మతమే

1140. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) (యుద్ధ సందర్భంగా) బనీ నజీర్ (యూద) తెగవారి చెట్లను తగల బెట్టించారు, నరికించారు. అప్పుడు ఈ సూక్తి అవతరించింది- "మీరు ఖర్జూర చెట్లలో కొన్నిటిని నరికారు, మరి కొన్నిటిని వాటి వేరులపై అలాగే ఉండనిచ్చారు. అదంతా దేవుని అనుజ్ఞతోనే జరిగింది". (హష్ర్: 5)

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం- మగాజి, 14వ అధ్యాయం - హదీసి బనిన్నజీర్)

## 11వ అధ్యాయం - విజయప్రాప్తి ప్రత్యేకంగా ముస్లిం సమాజానికి ధర్మ సమ్మతం చేయబడింది

1141. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- గత ప్రవక్తలలో ఒక ప్రవక్త యుద్ధ నిర్ణయం తీసుకొని తన జాతి ప్రజలతో ఇలా అన్నారు - "కొత్తగా వివాహం చేసుకొని తన భార్యతో తొలి రేయి గడపని వ్యక్తి, ఇల్లు కట్టుకొని ఇంకా కప్పు వేసుకోని వ్యక్తి, సూడి

ఒంటెలు, మేకలు కొని, అవి ఎప్పుడు ఈనుతాయా అని ఎదురు చూస్తున్నవాడు యుద్ధానికి నా వెంట బయలు దేరనవసరం లేదు. (ఇలాంటి వారి మనస్సులు ఆయా విషయాలపైనే లగ్నమయి ఉంటాయి)". ఆ తరువాత ఆ దైవ ప్రవక్త (అలైహిస్సలాం) యుద్ధానికి బయలుదేరారు. వారు అస్ర్ వేళకు, లేదా దాని దరిదాపు సమయానికి ఒక ఊరికి చేరుకున్నారు. అప్పుడా ప్రవక్త సూర్యుడ్ని సంబోధిస్తూ "నీవు కూడా ఆజ్ఞాబద్ధుడవే, నేను కూడా ఆజ్ఞాబద్ధుడనే. దేవా! మా కోసం సూర్యుడ్ని (అస్తమించనీకుండా) ఆపు" అని అన్నారు. సూర్యుడు ఆపబడ్డాడు. దేవుడు వారికి ఆ ఊరిపై విజయం చేకూర్చే వరకు సూర్యుడు అస్తమించకుండా ఆగిపోయాడు.

యుద్ధం ముగిసిన తరువాత ఆ ప్రవక్త విజయప్రాప్తిని ఒక చోట సమీకరించారు. దాన్ని భక్షించడానికి (ఆకాశం నుండి) అగ్ని వచ్చింది. కాని అది దాన్ని భక్షించలేదు. అప్పుడా ప్రవక్త (సైనికుల్ని ఉద్దేశించి) మీలో ఎవరో (విజయప్రాప్తిలో ఏదో వస్తువుని) తప్పకుండా దొంగిలించి ఉంటారు. కనుక ప్రతి తెగ నుండి ఒక్కొక్క వ్యక్తి వచ్చి నా చేతి మీద చేయి వేసి ప్రమాణం చేయండి" అని అన్నారు. సైనికులు అలా ప్రమాణం చేస్తుంటే ఒకతని చేయి ప్రవక్త చేతికి అతుక్కుపోయింది. ప్రవక్త అతనితో "నీ తెగలోనే ఎవరో దొంగతనం చేసి ఉంటారు. అంచేత మీ తెగవాళ్ళంతా ప్రమాణం చేయాలి" అని అన్నారు. అలా ఆ తెగ సైనికులు ప్రమాణం చేస్తుంటే వారిలో ఇద్దరి ముగ్గురి చేతులు ప్రవక్త చేతికి అతుక్కుపోయాయి. దైవప్రవక్త వారిని ఉద్దేశించి "మీరే దొంగతనానికి పాల్పడ్డారు" అన్నారు. దాంతో వారు (తాము దాచిన) బంగారంతో చేయబడిన ఆవు తల తెచ్చి విజయప్రాప్తిలో పెట్టారు. అప్పుడు అగ్ని వచ్చి మొత్తం యుద్ధ సొత్తును భక్షించింది (అంటే దహించి వేసింది).

ఆ తరువాత ఈనాడు మన కోసం దేవుడు విజయప్రాప్తిని వాడుకోవడాన్ని ధర్మ సమ్మతం చేశాడు. మన బలహీనత దీనావస్థల కారణంగానే దేవుడు మన కోసం విజయప్రాప్తిని ధర్మసమ్మతం చేశాడు.★

**(సహీహ్ బుఖారీ:- 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖుమ్స్, 8వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి ఉహిల్లత్ లకుముల్ గనాయిము)**

## 12వ అధ్యాయం - విజయప్రాప్తి పంపకం

1142. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) నజద్ ప్రాంతానికి ఒక సైనిక దళాన్ని పంపారు. అందులో హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కూడా ఉన్నారు. ఆ దళానికి అక్కడ

---

★ ఇమాం నవవీ (రహ్మాలై) కథనం ప్రకారం ఈ హదీసులో ప్రస్తావించబడిన దైవప్రవక్త పేరు హజ్రత్ యూషె బిన్ నూన్ (అలైహి). ఈయన మూసా ప్రవక్త (అలైహి) ప్రతినిధిగా వచ్చారు. ఇక్కడ 'ఊరు' అంటే సిరియా దేశంలోని ఒక చిన్న పట్టణం. ఈ యుద్ధం శుక్రవారం జరిగింది. సూర్యాస్తమయం అయిన తరువాత శనివారం వస్తుంది. శనివారం యూదులకు పవిత్రదినం. ఆ రోజు యుద్ధం చేయడం నిషిద్ధం. అందువల్ల హజ్రత్ యూషె (అలైహి) సూర్యుడ్ని అస్తమించకుండా ఆపమని దేవుడ్ని ప్రార్థించారు. ఇలా ఆ పట్నం జయించబడేవరకు సూర్యుడు ఆగిపోయాడు. కొత్తగా పెళ్ళయిన వారు, సూడి పశువుల్ని కొన్నవారు, ఇల్లు కట్టుకుంటున్నవారు తమ తమ కార్యకలాపాల్లో నిమగ్నులయి ఉంటే , మనస్ఫూర్తిగా యుద్ధంలో పాల్గొనరు గనక హజ్రత్ యూషె (అలైహి) అలాంటి వారిని యుద్ధంలో పాల్గొన వద్దని వారించారు. ఈ హదీసు ద్వారా గత సమాజాలకు విజయప్రాప్తి వాడుకోవడం నిషేధించబడిందని కూడా తెలుస్తోంది. వారా విజయప్రాప్తిని బలిపీఠం మీద పెడ్తారు. ఆకాశం నుండి అగ్ని వచ్చి దాన్ని కాల్చివేస్తుంది. ఇలా అగ్ని విజయప్రాప్తిని కాల్చివేస్తే వారి యుద్ధం, త్యాగాలు (దైవంచే) స్వీకరించబడినట్లుగా పరిగణించబడేది.

విజయప్రాప్తిగా అనేక ఒంటెలు దొరికాయి. ప్రతి యోధుని వాటా కింద పదకొండు లేక పన్నెండు ఒంటెల చొప్పున లభించాయి. ఆపై అదనంగా ఒక్కొక్క ఒంటె చొప్పున బహుమానం రూపంలో అందరికీ లభించింది.

(సహీహ్ బుఖారీ:- 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖుమ్స్, 15వ అధ్యాయం - వమినద్దలీలి అలా అన్నల్ ఖుమ్స లిన్నవాయిబిల్ ముస్లిమీన్)

1143. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) యుద్ధానికి పంపే సైనిక దళాలలో కొందరికి ప్రత్యేకించి (వారి అవసరాల దృష్ట్యా) సాధారణ సైనికులకు ఇచ్చే వాటాల కన్నా కొంచెం ఎక్కువ (విజయప్రాప్తి) వాటా ఇచ్చేవారు.

(సహీహ్ బుఖారీ:- 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖుమ్స్, 15వ అధ్యాయం - వమినద్దలీలి అలా అన్నల్ ఖుమ్స లిన్నవాయి బిల్ ముస్లిమీన్)

## 13వ అధ్యాయం - హతుని ధన వస్తు సంపదకు అతడ్ని వధించిన యోధుడే హక్కుదారుడు

1144. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం:- హునైన్ యుద్ధం జరిగిన సంవత్సరం మేము దైవప్రవక్త (సల్లం) వెంట బయలుదేరాము. శత్రువులను ఎదుర్కొన్నప్పుడు ప్రారంభంలో ముస్లింలు ఓటమి చవిచూడవలసి వచ్చింది. ఆ సందర్భంలో ఒక బహుదైవారాధకుడు ఒక ముస్లింపై ఆధిక్యత పొందడం గమనించగానే నేను అతని వెనుక వైపు నుండి తిరిగొచ్చి ఖడ్గంతో అతని భుజమ్మీద ఒక వ్రేటు వేశాను. అతను వెంటనే నా వైపు తిరిగి నన్ను తన వైపుకు లాక్కొని గట్టిగా అదిమి వేశాడు. నాకా సమయంలో ఊపిరి పోతుందా అన్నట్టు మృత్యువు నా కళ్ళ ముందు తాండవించింది. తరువాత అతను ప్రాణం విడిచాడు, నన్నూ వదలి పెట్టాడు. ఆ తరువాత నేను ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి)ను కలుసుకొని "ముస్లింలకు ఏమయింది?" అని అడిగాను. దానికాయన "దేవుని ఆజ్ఞ (ఉద్దేశ్యం) ఇదే కాబోలు" అన్నారు. తరువాత ముస్లింలు మరలి వచ్చారు (అంతిమ విజయం లభించింది). దైవప్రవక్త (సల్లం) కూర్చొని "మీలో ఎవరు (తన) శత్రువుని వధించినట్లు సాక్ష్యం తీసుకువస్తాడో అతనికే ఆ హతుని సంపద, సామగ్రి లభిస్తుంది" అని అన్నారు. ఈ మాట విని నేను లేచి "(నేనొక అవిశ్వాసిని వధించాను) నాకెవరైనా సాక్ష్యం చెప్పే వారున్నారా?" అన్నాను. అలా చెప్పి కూర్చున్నాను. దైవప్రవక్త (సల్లం) మరోసారి ప్రకటన చేస్తూ "ఎవరు శత్రువుని వధించి అందుకు సాక్ష్యం తీసుకువస్తాడో అతనికే ఆ హతుని సంపద, సామగ్రి లభిస్తాయి" అని అన్నారు. నేను మళ్ళీ లేచి "నాకెవరైనా సాక్ష్యం ఉన్నారా?" అని అడిగి కూర్చున్నాను. దైవప్రవక్త (సల్లం) మూడోసారి కూడా అదే విధంగా ప్రకటన చేశారు. అప్పుడు ఒక వ్యక్తి లేచి "దైవ ప్రవక్తా! ఈయన (హజ్రత్ అబూ ఖతాదా (రజి)) నిజమే చెబుతున్నారు. ఆ హతుని సంపద, సామగ్రి నా దగ్గర ఉన్నాయి. (ఇవి నా దగ్గరే ఉండేలా) మీరు కాస్త ఈయన్ని ఒప్పించండి" అని అన్నాడు.

హజ్రత్ అబూ బకర్ (రజి) ఈ మాట విని "వీల్లేదు. దైవసాక్షి! ఎంత మాత్రం అలా జరగదు.

ఆ హతుని సంపద, సామగ్రి నీకు దక్కేలా దేవుడు, దైవప్రవక్త (సల్లం)ల తరపున (శత్రువులతో) పోరాడిన ఒక పులిని దైవప్రవక్త (సల్లం) ఒప్పించాలా?" అని అన్నారు (ఆగ్రహంతో). దైవప్రవక్త (సల్లం) కూడా ఆయన్ని సమర్థిస్తూ "సిద్దీఖ్ చెప్పింది నిజమే" అన్నారు. అప్పుడా వ్యక్తి ఆ ధనం, సామగ్రి అంతా తెచ్చి నాకిచ్చి వేశాడు. నేనందులో ఒక కవచాన్ని అమ్మి ఆ డబ్బుతో బనీ సల్మా వాడలోని ఒక తోటను కొన్నాను. నేను ఇస్లాం స్వీకరించిన తరువాత ఇది నాకు లభించిన మొట్టమొదటి విజయప్రాప్తి.

**(సహీహ్ బుఖారీ:- 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖుమ్స్, 18వ అధ్యాయం - మల్లమ్ యుఖమ్మిసిల్ అస్లాబ వమన్ ఖతల ఖతీలన్ ఫలహూ సలబుహూ)**

1145. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి) కథనం:- బద్ర్ యుద్ధం జరిగిన రోజు నేను సైనిక పంక్తిలో నిల్చొని కుడి ఎడమ వైపు కలియజూస్తే నాకు అన్సార్ వర్గానికి చెందిన ఇద్దరు పిన్న వయస్కులైన యువకులు కన్పించారు. వాళ్ళను చూసి నేను వీరి కంటే బలాఢ్యులయిన యువకుల మధ్య ఉంటే ఎంత బాగుండేది అన్పించింది నాకు. సరిగ్గా అదే సమయంలో వారిలో ఒకతను "బాబాయి! మీకు అబూజహల్ ఎవరో తెలుసా?" అని కళ్ళతోనే సైగ చేస్తూ అడిగాడు. నేను "తెలుసు, అయితే అతనితో నీకు పనేమిటీ?" అని అడిగాను. అప్పుడా బాలుడు ఇలా అన్నాడు. "అతను దైవప్రవక్త (సల్లం)ను గురించి అనరాని మాటలు అంటుండేవాడని విన్నాను. అందుకే ఎవరి అధీనంలో నా ప్రాణం ఉందో ఆ శక్తి స్వరూపుని సాక్షిగా చెబుతున్నాను - నేను గనక అతడ్ని చూస్తే, మా ఇద్దరిలో ఎవరో ఒకరు హతమయి అటో ఇటో తేల్చుకోనంత వరకు నేను అతడ్ని వదలిపెట్టను".

నేనా బాలుడి మాటలు విని ఆశ్చర్యపోయాను. అంతలో రెండవ బాలుడు కూడా వచ్చి నన్ను సైగ చేస్తూ మొదటి బాలుడు మాట్లాడినట్లే మాట్లాడాడు. అప్పుడు సైనికుల మధ్య తిరుగుతున్న అబూజహల్ మీద నా దృష్టి పడింది. నేనా నవ యువకులతో "అదిగో! మీరడిగిన వ్యక్తి అక్కడున్నాడు చూడండి" అన్నాను. వెంటనే వాళ్ళిద్దరు ఖడ్గాలు తీసుకొని అతని వైపుకు పరుగెత్తారు. అతనిపై విరుచుకు పడి (కాస్సేపట్లోనే) అతడ్ని మట్టుపెట్టారు.

ఆ తరువాత వాళ్ళిద్దరు దైవప్రవక్త (సల్లం) దగ్గరికెళ్ళి అబూజహల్ కథ సమాప్తమైనట్లు ఆయనకు తెలియజేశారు. దైవప్రవక్త (సల్లం) అది విని "అతడ్ని మీ ఇద్దరిలో ఎవరు వధించారు?" అని అడిగారు. ఇద్దరిలో ప్రతి ఒక్కడూ తానే అతడ్ని వధించినట్లు చెప్పారు. "సరే మీ ఖడ్గాలు కడుక్కున్నారా?" అని అడిగారు దైవప్రవక్త (సల్లం). లేదని సమాధానమిచ్చారు వారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇద్దరి కరవాలాలను పరిశీలించి "మీరిద్దరూ అతడ్ని హతమార్చారు. సరే, అతని సంపద, సామగ్రి అంతా ముఆజ్ బిన్ అమ్ర్ బిన్ జమూకు లభిస్తుంది" అని అన్నారు. వారిద్దరిలో ఒకతని పేరు ముఆజ్ బిన్ అఫ్రా. రెండవతని పేరు ముఆజ్ బిన్ అమ్ర్ బిన్ జమూ.★

**(సహీహ్ బుఖారీ:- 57వ ప్రకరణం- ఫర్జుల్ ఖుమ్స్, 18వ అధ్యాయం - మల్లమ్ యుఖమ్మిసిల్ అస్లాబ వమన్ ఖతల ఖతీలన్ ఫలహూ సలబుహూ)**

---

★ అబూ జహల్‌ని ఆ ఇద్దరు యువకులూ వధించారు. అయితే దైవప్రవక్త (సల్లం) వారిద్దరి ఖడ్గాలు చూసి ఎవరి ఖడ్గం ఎక్కువగా వ్రేటు వేసిందో పరిశీలించి దాని ప్రకారం అబూ జహల్ సంపద, సామగ్రి ముఆజ్ బిన్ అమ్ర్ బిన్ జమూకు లభిస్తుందని తీర్పిచ్చారు.

## 15వ అధ్యాయం - యుద్ధం జరగకుండానే లభించే విజయప్రాప్తి గురించి

1146. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం:- బనీ నజీర్ (యూదు తెగ) నుండి లభించిన సిరి సంపదలు దేవుడు స్వయంగా దైవప్రవక్తకు ప్రసాదించిన ప్రత్యేక విజయప్రాప్తి. దాని కోసం ముస్లింలు తమ గుర్రాలు, ఒంటెలను వారి మీద నడపలేదు. ఈ కారణంగానే ఈ సిరిసంపదలు దైవప్రవక్త (సల్లం)కు మాత్రమే ప్రత్యేకించబడ్డాయి. దైవప్రవక్త (సల్లం) ఈ సంపద నుండి తమ భార్యా పిల్లల పోషణ కోసం ఒక ఏడాదికి సరిపడినంత ధనం తీసుకునేవారు. మిగిలిన ధనాన్ని ఆయుధాలు, గుర్రాల కోసం, దైవ మార్గంలో ఇతర ఖర్చుల కోసం వినియోగించేవారు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 80వ అధ్యాయం - అల్మిజన్నివమయ్యు తరసు బిత్తరసి సాహిబిహీ)

1147. హజ్రత్ మాలిక్ బిన్ ఔస్ (రహ్మాలై) కథనం:- నన్ను ఓ రోజు హజ్రత్ ఉమర్ (రజి) పిలిపించారు. (నేను వచ్చి ఆయన కొలువులో కూర్చున్నాను.) అంతలో ఆయన ద్వార పాలకుడు యర్ఫా వచ్చి "హజ్రత్ ఉస్మాన్, హజ్రత్ అబ్దుర్రహ్మాన్, హజ్రత్ జుబైర్, హజ్రత్ జైద్ (రజి)లు వచ్చారు. మిమ్మల్ని కలుసుకోవడానికి అనుమతి అడుగుతున్నారు" అని అన్నాడు. "వాళ్ళను లోపలికి పంపించు" అన్నారు హజ్రత్ ఉమర్ (రజి). ద్వారపాలకుడు వెళ్ళి వాళ్ళను లోపలకు పిలుచుకు వచ్చాడు. కాస్సేపటికి అతను మళ్ళీ వచ్చి "హజ్రత్ అబ్బాస్, హజ్రత్ అలీ (రజి) వచ్చారు. వాళ్ళు కూడా లోపలికి రావడానికి అనుమతి ఉందా?" అని అడిగాడు. హజ్రత్ ఉమర్ (రజి) అనుమతించారు. వాళ్ళిద్దరు కూడా లోపలికి ప్రవేశించారు.

అప్పుడు హజ్రత్ అబ్బాస్ (రజి) మాట్లాడుతూ "అమీరుల్ మోమినీన్ (విశ్వాసుల నాయకా)! ఇతనికి (హజ్రత్ అలీకి), నాకు మధ్య వచ్చిన వివాదాన్ని పరిష్కరించండి" అని అన్నారు - దేవుడు బనీ నజీర్ (యూదుల) నుండి దైవప్రవక్త (సల్లం)కు 'ఫై' రూపంలో ప్రసాదించిన విజయప్రాప్తి విషయంలో వీరిద్దరి మధ్య వివాదం ఏర్పడింది - ఈ చర్చ సందర్భంగా హజ్రత్ అలీ (రజి), హజ్రత్ అబ్బాస్ (రజి)ల మధ్య తీవ్ర వాగ్వివాదం కూడా జరిగింది. అప్పుడు సభకు హాజరయినవారు కల్పించుకుంటూ "అమీరుల్ మోమినీన్! వీళ్ళిద్దరి వివాదాన్ని తప్పకుండా పరిష్కరించి, ఇద్దర్నీ ఈ జగడం నుండి విముక్తి కలిగించండి" అని అన్నారు. "తొందర పడకండి, కాస్త ఓపిక పట్టండి. ఎవరి ఆజ్ఞతో భూమ్యాకాశాలు నెలకొన్నాయో ఆ దేవుణ్ణి సాక్షిగా బెట్టి నేను మీ అందర్నీ ఒక మాట అడుగుతున్నాను, చెప్పండి. దైవప్రవక్త (సల్లం) తమ వారసత్వపు ఆస్తి వారసులకు పంపిణీ చేయబడదని, అది సదఖా (దానం) అని అన్నారు. ఈ సంగతి మీకు తెలుసా?" అని అన్నారు హజ్రత్ ఉమర్ (రజి). సభికులంతా "తెలుసు. దైవప్రవక్త (సల్లం) ఈ మాట అన్నారు" అని పలికారు.

ఆ తరువాత హజ్రత్ ఉమర్ (రజి) హజ్రత్ అలీ (రజి), హజ్రత్ అబ్బాస్ (రజి)లను ఉద్దేశించి "నేను దేవుణ్ణి సాక్షిగా బెట్టి మిమ్మల్నిద్దర్నీ అడుగుతున్నాను. దైవప్రవక్త (సల్లం) ఈ మాట అన్నారని మీకు తెలుసా?" అని అన్నారు. దానికి వాళ్ళిద్దరూ "ఔను. దైవప్రవక్త (సల్లం) ఈ మాట అన్నారు నిజమే" అని చెప్పారు.

అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) ఇలా అన్నారు: "ఇప్పుడు మీకు ఈ వ్యవహారం గురించి అసలు సంగతి చెబుతాను వినండి. దేవుడు యుద్ధ సొత్తు విషయంలో మరెవరికీ ఇవ్వని ఓ ప్రత్యేక అధికారాన్ని దైవప్రవక్త (సల్లం)కు ప్రసాదించాడు. స్వయంగా దేవుడు తన దివ్యగ్రంథంలో - దేవుడు వారి నుండి తీసి తన ప్రవక్త (సల్లం)కు అందజేసిన సంపద (సాధారణ విజయప్రాప్తి కాదు. దాని)ని పొందడంలో మీరు మీ గుర్రాలను, ఒంటెలను నడపలేదు. దేవుడు తన ప్రవక్తలలో తాను కోరిన వారికి ఆధిక్యతను ప్రసాదిస్తాడు. ఆయన ప్రతి విషయంపై అధికారం కలిగి ఉన్నాడు. (హష్ర్:6) - కనుక ఇలాంటి సంపదలన్నీ కేవలం దైవప్రవక్త (సల్లం)కు ప్రత్యేకించబడ్డాయి. ఇతరులకు వాటిపై ఎలాంటి అధికారం లేదు. అయినప్పటికీ దైవసాక్షిగా చెబుతున్నాను దైవప్రవక్త (సల్లం) ఈ సంపద మొత్తాన్ని తమ సొంతానికే ఉపయోగించుకోలేదు. దాన్ని మీ అందరికీ ప్రసాదించారు, పంచి పెట్టారు. ఇలా పంచిన తరువాత మిగిలిపోయిన సంపదలో నుంచి తమ కుటుంబ పోషణకై సంవత్సరానికి సరిపడ సొత్తును మాత్రమే తీసుకునేవారు. మిగతా సంపదను ఏ కార్యకలాపాల కోసం సాధారణ దైవ సొత్తు ఖర్చు పెట్టడం జరుగుతుందో ఆ కార్య కలాపాల కోసమే ఖర్చు పెట్టేవారు. ఈ విధంగా ఆయన తమ జీవితాంతం చేశారు. ఆయన ఇహలోకం వీడిపోయిన తరువాత (ఆయనకు వారసుడుగా వచ్చిన ఖలీఫా) హజ్రత్ అబూ బకర్ (రజి) తాను దైవప్రవక్త (సల్లం)కు వారసుణ్ణని చెప్పి ఈ సంపదనంతటినీ (అధికార పూర్వకంగా) స్వాధీనం చేసుకున్నారు. దైవప్రవక్త (సల్లం) గతంలో ఏఏ పనుల కోసం ఎలా ఖర్చు పెట్టారో హజ్రత్ అబూ బకర్ (రజి) కూడా ఆయా పనుల కోసం అలాగే ఖర్చు పెట్టారు".

హజ్రత్ ఉమర్ (రజి) హజ్రత్ అలీ (రజి), హజ్రత్ అబ్బాస్ (రజి)లను ఉద్దేశించి ఇలా అన్నారు: "మీరిద్దరూ హజ్రత్ అబూ బకర్ (రజి) పద్ధతిని విమర్శిస్తూ ఉండేవారు. ఆయన గురించి రకరకాలుగా వ్యాఖ్యానించారు. అబూబకర్ (రజి) తమ ఆచరణా విధానంలో ఎంతటి నీతిమంతులో, నిజాయితీపరులో, సన్మార్గగాములో, సత్యావలంబీకులో దేవునికి తెలుసు. ఆయన చనిపోయిన తరువాత నేను వారిద్దరి అధికార పీఠాన్ని అధిరోహించాను. నా పాలనలో రెండేండ్ల నుంచి ఈ ఆస్తులు నా అధీనంలో ఉంటున్నాయి. నేను వీటి విషయంలో దైవప్రవక్త (సల్లం), ఆయన తరువాత హజ్రత్ అబూబకర్ (రజి) అవలంబించిన విధానాన్నే అవలంబించాను. ఈ వ్యవహారంలో నేనెంతటి నీతిమంతుణ్ణో, నిజాయితీపరుణ్ణో, సన్మార్గగామినో, సత్యావలంబీకుణ్ణో దేవునికి తెలుసు. గతంలో ఓ సారి మీరిద్దరూ నా దగ్గరి కొచ్చి ఇద్దరూ ఒకే మాట అన్నారు. అప్పుడు మీరిద్దరి సమస్య కూడా ఒక్కటే. తరువాత అబ్బాస్! మీరు (ఒక్కరే) నా దగ్గరకు వచ్చారు. 'మా (ప్రవక్తల) ఆస్తి వారసులకు పంపిణీ జరగదు. ఇది సదఖా (దానం)గా పరిగణించబడుతుంది' అని దైవప్రవక్త (సల్లం) పలికిన ప్రవచనాన్ని నేను మీకు గుర్తు చేశాను. (చివరికి కొన్ని పరిస్థితుల కారణంగా) నేనీ ఆస్తుల్ని మీ ఇద్దరికీ అప్పగించడానికి నిర్ణయించుకొని, మీరిద్దరు దేవునితో, దైవప్రవక్త (సల్లం)తో చేసిన ప్రమాణాలను నెరవేర్చాలని, దైవప్రవక్త (సల్లం) ఆ తరువాత హజ్రత్ అబూబకర్ (రజి), పాలకుడయినప్పటి నుండి నేను ఈ ఆస్తుల్ని ఎలా వినియోగించామో అదే పద్ధతి ప్రకారం మీరూ వినియోగించవలసి ఉంటుందని చెప్పాను. మీరు కోరితే ఈ షరతుపై నేనీ ఆస్తుల్ని మీకు అప్పగిస్తాను. ఈ షరతు మీకు

ఆమోదయోగ్యం కాకపోతే నాతో ఇక ఈ వ్యవహారం గురించి మాట్లాడకూడదు అని అన్నాను. దానికి మీరు ఆ షరతుపైన్నే ఈ ఆస్తుల్ని మీకు అప్పగించమని అడిగారు. నేనలాగే చేశాను. ఇప్పుడు మీరు దీనికి భిన్నంగా మరేదయినా పరిష్కారం కావాలని కోరుతున్నారా? ఎవరి ఆజ్ఞతో భూమ్యాకాశాలు నెలకొన్నాయో ఆ దేవుని సాక్షి! నేనిక ప్రళయం వరకూ మరెలాంటి పరిష్కారం చేయను. అయితే ఈ ఆస్తులను రక్షించడం మీ వల్ల కాకపోతే వాటిని తిరిగి నాకు అప్పగించండి. మీకు శ్రమ లేకుండా నేను వీటి బాధ్యత కూడా తీసుకుంటాను".

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజీ, 14వ అధ్యాయం - హదీసి బనీ నజీర్)**

## 16వ అధ్యాయం -"మాకు వారసులెవరూ లేరు. మా ఆస్తి దానంగా పరిగణించబడుతుంది"

1148. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) నిర్యాణం తరువాత ఆయన భార్యలలో ఒకరు తమ వారసత్వపు ఆస్తుల్ని అప్పగించమని హజ్రత్ అబూబకర్ (రజి)ని అడిగేందుకు ఆయన దగ్గరికి హజ్రత్ ఉస్మాన్ (రజి)ని పంపడానికి నిర్ణయించుకున్నారు. అప్పుడు నేను జోక్యం చేసుకుంటూ "మా (ప్రవక్తల) ఆస్తికి వారసులుండరు. మేము వదలి వెళ్ళిన ఆస్తి దానంగా పరిగణించ బడుతుంది" - అన్న దైవప్రవక్త (సల్లం) ప్రవచనం మీకు తెలియదా? అని అన్నాను.

**(సహీహ్ బుఖారీ:- 85వ ప్రకరణం - ఫరాయిజ్, 3వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) లానూరిసు మా తరక్నా సదఖా)**

1149. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) కుమార్తె హజ్రత్ ఫాతిమా (రజి) (ఖలీఫా) హజ్రత్ అబూబకర్ (రజి) దగ్గరికి ఒక వ్యక్తిని పంపారు. మదీనా, ఫిదక్‌లలో దేవుడు తన ప్రవక్త (సల్లం)కు ప్రత్యేకంగా ప్రసాదించిన ఆస్తుల్ని గురించి, ఖైబర్‌కు చెందిన ఖుమ్స్ ఆస్తులలో మిగిలిన ఆస్తుల్ని గురించి హజ్రత్ అబూబకర్ (రజి)ని అడిగి రమ్మని ఆమె అతడ్ని పంపించారు. హజ్రత్ అబూబకర్ (రజి) ఈ మాట విని ఇలా అన్నారు - "దైవప్రవక్త (సల్లం) తమకు వారసులెవరూ ఉండరని, తాము వదలి వెళ్ళిన ఆస్తి దానం (సదఖా)గా పరిగణించబడుతుందని అన్నారు. అయితే దైవప్రవక్త (సల్లం) కుటుంబీకులు ఈ సంపదలో నుంచి తమ కనీసావసరాలను పొందుతూ ఉండవచ్చు. దైవప్రవక్త (సల్లం) నిర్ణయించిన దానాలు (సదఖాత్) ఆయన కాలంలో ఏ స్థితిలో ఉండేవో నేనా స్థితికి భిన్నంగా వాటిని మార్చలేను. వాటి విషయంలో దైవప్రవక్త (సల్లం) ఎలా ఆచరించేవారో నేనూ అదే విధంగా ఆచరిస్తాను."

హజ్రత్ అబూబకర్ (రజి) ఇలా చెప్పి హజ్రత్ ఫాతిమా (రజి)కు ఆ ఆస్తులలో నుంచి ఏ మాత్రం ఇవ్వలేదు. ఈ కారణంగానే హజ్రత్ ఫాతిమా (రజి)కు హజ్రత్ అబూబకర్ (రజి)పై కోపం వచ్చి ఆయనతో మాట్లాడటం మానేశారు. ఈ విధంగా ఆమె చనిపోయే వరకూ హజ్రత్ అబూ బకర్ (రజి)తో మాట్లాడలేదు. హజ్రత్ ఫాతిమా (రజి) దైవప్రవక్త (సల్లం) నిర్యాణం తరువాత ఆర్నెల్లు మాత్రమే బ్రతికి ఉన్నారు. ఆమె చనిపోయిన తరువాత ఆమె భర్త హజ్రత్ అలీ (రజి) అదే రాత్రి ఆమెను ఖననం చేశారు. ఆమె చనిపోయిన సంగతి హజ్రత్ అబూ బకర్ (రజి)కు తెలియజేయలేదు. స్వయంగా ఆయనే ఆమె అంత్యక్రియల నమాజ్ చేశారు.

హజ్రత్ ఫాతిమా (రజి) జీవించి ఉన్నంత కాలం హజ్రత్ అలీ (రజి)కి ప్రజలలో ఓ ప్రత్యేక హోదా, స్థానం ఉండేవి. హజ్రత్ ఫాతిమా (రజి) చనిపోయిన తరువాత ప్రజల దృష్టి హజ్రత్ అలీ (రజి)పై నుండి తొలగిపోయింది. (అంటే ప్రజలలో ఆయనకు గతంలో ఉన్న పేరు ప్రతిష్ఠలు తగ్గిపోయాయి.) అందువల్ల ఆయన హజ్రత్ అబూబకర్ (రజి)తో రాజీపడదామని ఆయన్ని ఖలీఫాగా అంగీకరించి ప్రమాణం (బైత్) చేద్దామని నిర్ణయించుకున్నారు. ఇలా నిర్ణయించుకొని హజ్రత్ అబూబకర్ (రజి) దగ్గరికి ఒక సందేశం పంపారు. "మీరు ఓ సారి మా ఇంటికి రండి. మీరు ఒక్కరే రావాలి. మీ వెంట మరెవరూ ఉండకూడదు" అని ఆ సందేశంలో అన్నారు. (హజ్రత్ అబూ బకర్ (రజి) వెంట హజ్రత్ ఉమర్ (రజి) రావడం హజ్రత్ అలీ (రజి)కి ఇష్టం లేదు. అందువల్ల ఆయన ఈ విధంగా మీరొక్కరే రావాలని అన్నారు.)

హజ్రత్ అలీ (రజి) పంపిన సందేశం గురించి విని హజ్రత్ ఉమర్ (రజి), "వద్దు. మీరాయన దగ్గరకు ఒంటరిగా వెళ్ళకండి" అని అన్నారు. "ఎందుకు? ఆయన నాకేదయినా (కీడు) తలపెడతారని మీరు భావిస్తున్నారా? దైవసాక్షి! నేను తప్పకుండా ఆయన దగ్గరకు ఒంటరిగానే వెళ్తాను" అని అన్నారు. హజ్రత్ అబూబకర్ (రజి) అలా చెప్పి ఆయన హజ్రత్ అలీ (రజి) ఇంటికి వెళ్ళారు.

హజ్రత్ అలీ (రజి) దైవస్తోత్రం చేసిన తరువాత ఈ విధంగా అన్నారు: "మాకు మీ విశిష్ఠత, ఔన్నత్యాలను గురించి తెలుసు. దేవుడు మీకు ప్రసాదించిన దాన్ని గురించి కూడా మాకు తెలుసు. దేవుడు మీకు చేసిన మేలు పట్ల మాకెలాంటి అసూయ లేదు. అయితే మీరు ఖిలాఫత్ విషయంలో సర్వాధికారిగా వ్యవహరిస్తున్నారు. మేము దైవప్రవక్త దగ్గరి బంధువులయిన కారణంగా అందులో (సలహా సంప్రతింపులలో) మాక్కూడా భాగం ఉందని భావిస్తున్నాను".

ఈ మాటలు విన్న తరువాత హజ్రత్ అబూబకర్ (రజి) కళ్ళు చెమర్చాయి. (ఎంతో బాధపడిపోయారు.) మనస్సు కాస్త కుదుటపడిన తరువాత ఆయన ఇలా అన్నారు: "ఎవరి అధీనంలో నా ప్రాణం ఉందో ఆ శక్తిమంతుని సాక్షి! నా బంధువుల కన్నా దైవప్రవక్త బంధువులే నాకు ఎక్కువ ప్రీతికరమైన వారు. ఈ ఆస్తుల వ్యవహారంలో మీకు - నాకు మధ్య విభేదాలు వచ్చాయి (అంటే దానికి కారణం నా వ్యవహార సరళి మీకు నచ్చకపోవడమే). నేను మాత్రం పుణ్యం, శ్రేయోభిలాష వాంఛించే విధానం పట్ల అణు మాత్రం వైముఖ్యం కనబరచలేదు. ఈ ఆస్తుల విషయంలో దైవప్రవక్త (సల్లం) కాలంలో నేను ఏఏ పద్ధతుల్ని చూశానో అవన్నీ అవలంబించాను. వాటిలో నేను ఏ ఒక్కదాన్నీ వదలిపెట్టలేదు."

ఆ తరువాత హజ్రత్ అలీ (రజి) ఆయనతో "మేము మీ బైత్ (ఖిలాఫత్ గుర్తింపు ప్రమాణం) కోసం సాయంత్రం వేళను నిర్ణయిస్తున్నాము" అని అన్నారు. హజ్రత్ అబూ బకర్ (రజి) జుహర్ నమాజ్ ముగిసిన తరువాత (మస్జిద్‌లో) వేదిక ఎక్కి దైవస్తోత్రం తరువాత తాను హజ్రత్ అలీ (రజి)ని కలుసుకున్న సంగతిని ప్రస్తావించారు. ఆయన తన ఖిలాఫత్ గుర్తింపు ప్రమాణం చేయడంలో ఎందుకు వెనుకంజ వేశారో, అందుకు ఆయన చెప్పిన కారణాలేమిటో అన్నీ వివరించారు. తరువాత

హజ్రత్ అలీ (రజి) లేచి ఇస్తిగ్ఫార్ (పాప మన్నింపు ప్రార్థన) చేశారు. దైవస్తోత్రం చేశారు. హజ్రత్ అబూ బకర్ (రజి) విశిష్టత ఔన్నత్యాలను అంగీకరించారు. ఆ తరువాత ఇలా అన్నారు: "నేనీ (బైత్) విషయంలో ఏదైనా చేస్తే దానిక్కారణం హజ్రత్ అబూ బకర్ (రజి) పట్ల అసూయ కాదు. నాకాయన పట్ల ఎలాంటి అసూయ లేదు. ఆయనకు దేవుడు ప్రసాదించిన హోదా, ఔన్నత్యం, విశిష్టతలను కూడా నేను నిరాకరించలేదు. కాకపోతే ఖిలాఫత్ వ్యవహారంలో మాక్కూడా భాగం ఉందని, హజ్రత్ అబూ బకర్ (రజి) మమ్మల్ని సంప్రదించకుండా మా సలహాలు కోరకుండా ఆయన ఒక్కరే (సర్వస్వం) ఈ బాధ్యతను నిర్వహిస్తున్నారని మాత్రమే మేము భావించాము. దీనివల్ల మాకు బాధ కలిగింది".

ఈ మాటలు విని ముస్లింలంతా సంతోషం వ్యక్తపరిచారు. (ఎట్టకేలకు) మీరు సరయిన నిర్ణయం తీసుకున్నారని అన్నారు వారు. ఆ తరువాత ముస్లింలు హజ్రత్ అలీ (రజి)కి మళ్ళీ దగ్గరయ్యారు. అంటే హజ్రత్ అలీ (రజి) మంచి విషయాన్ని అవలంబించగానే వారు మళ్ళీ ఆయనకు చేరువయి ఆయన్ని అభిమానించసాగారు.

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 38వ అధ్యాయం - గజ్వతి ఖైబర్)**

1150. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి)కథనం:- దైవప్రవక్త (సల్లం) నిర్యాణం తరువాత ఆయన కుమార్తె హజ్రత్ ఫాతిమా (రజి); "దైవప్రవక్త (సల్లం) వదలి వెళ్ళిన ఆస్తి నుండి, ఆయనకు దేవుడు 'ఫై' రూపంలో ప్రసాదించిన విజయప్రాప్తి నుండి వారసత్వంగా నాకు రావలసిన వాటాను నాకు ఇచ్చేయండి" అని హజ్రత్ అబూబకర్ (రజి)ని అడిగారు. హజ్రత్ అబూబకర్ (రజి) ఆమెకు సమాధానమిస్తూ "దైవప్రవక్త (సల్లం) తమకు వారసత్వపు ఆస్తులేమీ ఉండవని, తాము వదలిన ఆస్తి దానంగా పరిగణించబడుతుందని ప్రవచించారు కదా! (అందువల్ల నేను మీకు ఈ ఆస్తుల నుండి ఎలాంటి వాటా ఇవ్వలేను)" అని అన్నారు. ఈ సమాధానం విని హజ్రత్ ఫాతిమా (రజి)కు కోపం వచ్చింది. ఆ రోజు నుండి హజ్రత్ అబూబకర్ (రజి)తో మాట్లాడటం మానేశారు. ఆమె చనిపోయే వరకు ఈ సత్సంబంధాల పునరుద్ధరణ జరగలేదు. దైవప్రవక్త (సల్లం) నిర్యాణం తరువాత హజ్రత్ ఫాతిమా (రజి) ఆర్నెల్లు మాత్రమే జీవించి ఉన్నారు.

హజ్రత్ ఆయిషా (రజి) ఇలా అంటున్నారు - దైవప్రవక్త (సల్లం) ఖైబర్, ఫిదక్, మదీనా సదఖాలలో వదలి వెళ్ళిన ఆస్తుల నుండి (వారసత్వంలో) తమకు రావలసిన వాటా ఇమ్మని హజ్రత్ ఫాతిమా (రజి) హజ్రత్ అబూబకర్ (రజి) ని అడిగారు. కాని హజ్రత్ అబూ బకర్ (రజి) ఆమె కోరికను త్రోసి పుచ్చుతూ "(ఈ ఆస్తుల విషయంలో) దైవప్రవక్త (సల్లం) ఎలా వ్యవహరించారో నేనూ అలాగే వ్యవహరిస్తున్నాను. నేనా విధానంలో ఎలాంటి మార్పు చేయలేను, దేన్నీ వదలిపెట్టను. దైవప్రవక్త (సల్లం) ఆజ్ఞలలో, ఏ ఒక్క దాన్ని అమలు పరచకపోయినా నేను మార్గభ్రష్టుణ్ణవుతానని భయంగా ఉంది" అన్నారు. అయితే ఆ తరువాత హజ్రత్ ఉమర్ (రజి) (తన పాలనా కాలంలో) మదీనా సదఖా ఆస్తుల్ని హజ్రత్ అలీ (రజి) కి, హజ్రత్ అబ్బాస్ (రజి) కు ఇచ్చేశారు. ఫిదక్, ఖైబర్ ఆస్తులు మటుకు తన అధీనంలోనే ఉంచుకున్నారు. వాటిని గురించి ఆయన ప్రస్తావిస్తూ "ఈ రెండు (ఖైబర్, ఫిదక్) ఆస్తులు (ప్రజల) హక్కులు నెరవేర్చడానికి, దైవప్రవక్త (సల్లం)కు ఎదురయ్యే కొన్ని వ్యవహారాలకు

ఖర్చు అవుతుండేవి. అందువల్ల వీటి నిర్వహణా బాధ్యత రాజ్యాధినేతపై ఉంటుంది" అని అన్నారు. కనుక ఈ రెండు ఆస్తుల వ్యవహారం ఈ నాటికీ అదే పద్ధతి ప్రకారం నిర్వహించబడుతున్నాయి.★

(సహీహ్ బుఖారీ:- 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖుమ్స్, 1వ అధ్యాయం -ఫర్జుల్ ఖుమ్స్)

1151. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- నా వారసత్వపు ఆస్తిలో ఒక్క దీనార్ కూడా (వారసులకు) పంచివ్వడం జరగదు. నేను వదలిన ఆస్తిలో నా భార్యల పోషణ ఖర్చులు, నిర్వాహకుల జీతభత్యాలు పోగా మిగిలినదంతా దానం (సదఖా) గా పరిగణించబడుతుంది.

(సహీహ్ బుఖారీ:- 55వ ప్రకరణం - వసాయా, 32వ అధ్యాయం-నఫఖతిల్ ఖయ్యిమిలిల్ వక్ఫి)

## 19వ అధ్యాయం -ఖైదీలను నిర్బంధించడం, జైల్లో ఉంచడం, ఉపకార భావంతో వదలి పెట్టడం ధర్మసమ్మతమే

1152. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఒక సైనిక దళాన్ని నజద్ ప్రాంతానికి పంపారు. వారక్కడ సుమామా బిన్ ఆసాల్ అని పిలువబడే ఒక వ్యక్తిని బంధించి (మదీనాకు) తీసుకువచ్చారు. మస్జిద్‌లో ఒక స్తంభానికి కట్టిన తరువాత దైవప్రవక్త (సల్లం) అతని దగ్గరికి వచ్చి "సుమామా! మా గురించి నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగారు. ఆ వ్యక్తి బదులిస్తూ "అంతా బాగానే ఉంది. ఓ ముహమ్మద్! ఒకవేళ మీరు నన్ను వధిస్తే (నేను యుద్ధంలో అనేక మంది ముస్లింలను వధించి ఉన్న కారణంగా) ఒక హంతకుణ్ణి వధించిన వారవుతారు. దీనికి భిన్నంగా మీరు నాకు మేలు చేస్తే మేలు మరచిపోని ఒక కృతజ్ఞుడికి మేలు చేసిన వారవుతారు. ఒకవేళ మీరు గనక నా బదులు ధన సంపద కోరితే మీరు కోరినంత ఇస్తాను, అడగండి" అని అన్నాడు.

ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) మరునాడు కూడా అతని దగ్గరికి వచ్చి "సుమామా! ఇప్పుడు

---

★ ఇమామ్ నవవీ (రహ్మలై) ఈ హదీసుపై వ్యాఖ్యానిస్తూ "దైవప్రవక్తల ఆస్తులకు ఎవరూ వారసులుండరనేదే అధిక సంఖ్యాక ధర్మవేత్తల అభిప్రాయం. కాని హజ్రత్ హసన్ బస్రీ (రహ్మలై) అభిప్రాయం ప్రకారం ఇది దైవప్రవక్త ముహమ్మద్ (సల్లం)కు మాత్రమే ప్రత్యేకం. ఎందుకంటే హజ్రత్ జిక్రియా (అలైహి) "ప్రత్యేకంగా నీ దగ్గర్నుంచి నాకొక వారసుణ్ణి అనుగ్రహించు" (19:5) అని దైవాన్ని ప్రార్థించారు. హజ్రత్ సులైమాన్ (అలైహి) గురించి "దావూద్‌కు సులైమాన్ వారసుడయ్యాడు" (27:16) అని దైవసూక్తి ఉంది. అయితే ఈ రెండు సూక్తుల్లోనూ దైవదౌత్యానికి సంబంధించిన వారసత్వం గురించి మాత్రమే ప్రస్తావించబడింది; ప్రాపంచిక వారసత్వం కాదు. అందువల్ల అధిక సంఖ్యాక ధర్మవేత్తల అభిప్రాయమే సరయినది.

ఖాజీ అయాజ్ (రహ్మలై) ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఆస్తుల వివరాలు ఈ విధంగా ఉన్నాయి-(1) బనీ నజీర్ యూదుల ప్రాంతంలో ఏడు తోటలున్నాయి. ఉహుద్ యుద్ధం నాడు ముస్లిం అయిపోయిన ఒక యూదుడు రాసిన వీలునామా ప్రకారం ఈ తోటలు దైవప్రవక్త (సల్లం) కు లభించాయి. (2) మదీనాలో అన్సార్ ముస్లింలు దైవప్రవక్త (సల్లం)కు సమర్పించుకున్న భూములు. (3) బనీ నజీర్ (తెగవారు) మదీనా నుండి బహిష్కరించబడేటప్పుడు ఎలాంటి యుద్ధం జరగకుండానే వారు వదలి వెళ్ళిన ఆస్తులు. (4) ఖైబర్ జయించబడిన తరువాత జరిగిన ఒప్పందం ప్రకారం ఫిదక్ భూముల్లోని అర్థ భాగం. (5) ఖురా లోయలో మూడింట ఒక భాగం. (6) ఖైబర్‌లోని వతీనా, సలాం అనే రెండు కోటలు. ఇవి ఒడంబడిక ప్రకారం లభించిన కోటలు. (7) ఖైబర్‌కు చెందిన పంచాదాయం (ఖుమ్స్) నుండి దైవప్రవక్త (సల్లం)కు లభించిన వాటా. ఇవన్నీ దైవప్రవక్త (సల్లం) ఆస్తులు. వీటిలో ఎవరికీ ఎలాంటి భాగం లేదు. దైవప్రవక్త (సల్లం) ఈ ఆస్తుల్ని తమ భార్యా పిల్లలు, ముస్లిముల అవసరాల కోసం ఖర్చుపెట్టే వారు. అందువల్ల ఇవి ఎల్లప్పుడూ దానాలు (సదఖాత్)గానే ఉండాలి. వీటిని ఎవరైనా సొంతం చేసుకుంటే అది ధర్మసమ్మతం కాజాలదు.

నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగారు. "ఇది వరకు వెల్లడించిన అభిప్రాయానికే కట్టుబడి ఉన్నాను. మీరు గనక నాకు మేలు చేస్తే మేలు మరవని ఒక కృతజ్ఞుడికి మేలు చేసిన వారవుతారు" అని అన్నాడు ఆ ఖైదీ. దైవప్రవక్త (సల్లం) అతడ్ని అతని మానాన వదలి వెళ్ళారు. తిరిగి మూడో రోజు కూడా "సుమామా! నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగారు. "నేను ఇది వరకు విన్నవించుకున్నదే ఇప్పుడూ విన్నవించుకుంటున్నాను" అని అన్నాడు ఖైదీ. అప్పుడు దైవప్రవక్త (సల్లం) తన అనుచరులతో "సుమామాను విడిచిపెట్టండి" అని అన్నారు.

సుమామా ఖైదు నుండి విముక్తి పొందగానే మస్జిద్ సమీపంలో కొంచెం దూరాన ఉన్న ఒక చెరువు దగ్గరికి వెళ్ళి స్నానం చేశాడు. తరువాత మస్జిద్‌కు తిరిగొచ్చి ఇలా అన్నాడు: "అల్లాహ్ తప్ప మరో దేవుడు లేడని, ముహమ్మద్ దేవుని ప్రవక్తని నేను సాక్ష్యమిస్తున్నాను. ముహమ్మద్ మహనీయా! దైవసాక్షిగా చెబుతున్నాను. ఇంతకు పూర్వం యావత్ప్రపంచంలో నాకు మీ ముఖం కంటే అప్రియమైన ముఖం మరేదీ లేదు. ఇప్పుడు యావత్తు ప్రపంచంలో మీ ముఖారవిందం కంటే ప్రియమైన ముఖం మరేదీ లేదు. దైవసాక్షి! గతంలో మీ ధర్మం కంటే నాకు అప్రియమైన ధర్మం మరొకటి ఉండేది కాదు. ఈనాడు మీ ధర్మం కంటే ప్రియమైన ధర్మం మరేదీ లేదు. లోగడ మీ పట్టణం కంటే నాకు అప్రియమైన పట్టణం మరొకటి ఉండేది కాదు. ఇప్పుడు ఈ పట్టణమే నాకు అన్నిటికంటే ఎంతో ప్రియమైన పట్టణం. మీ సైనికులు నన్ను బంధించడానికి వచ్చినప్పుడు నేను ఉమ్రా యాత్రకై (కాబా) వెళ్తున్నాను. ఈ విషయంలో మీ ఆజ్ఞ ఏమిటో సెలవీయండి".

దైవప్రవక్త (సల్లం) ఈ మాటలు విని అతనికి శుభవార్త తెలియజేసి, ఉమ్రా యాత్ర చేయమని ఆదేశించారు. దాని ప్రకారం ఆయన (ఉమ్రా యాత్ర కోసం) మక్కా వెళ్తే అక్కడ ఒక వ్యక్తి ఆయనతో "నీవు కూడా మతభ్రష్టుడయి పోయావా?" అని అడిగాడు. దానికాయన సమాధానమిస్తూ "లేదు, నేను మహనీయ ముహమ్మద్ (సల్లం) చేతిలో ఇస్లాం స్వీకార భాగ్యాన్ని పొందాను. చెవులు రిక్కించి విను. దైవసాక్షిగా చెబుతున్నాను. ఇప్పుడు దైవప్రవక్త (సల్లం) నుండి అనుమతి లభించనంతవరకు మీకు ఎమామా నుండి ఒక్క గోధుమ గింజ కూడా దొరకదు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం-మగాజి, 70వ అధ్యాయం- వఫ్ది బనీ హనీఫత వహదీసి సుమామా బిన్ ఉసాల్)**

## 20వ అధ్యాయం - హిజాజ్ (మదీనా) నుండి యూదుల బహిష్కరణ

1153. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- మేము మస్జిద్‌లో కూర్చుని ఉండగా దైవప్రవక్త (సల్లం) వచ్చి "యూదుల దగ్గరికి నడవండి" అని అన్నారు. మేము ఆయన వెంట బయలుదేరాము. చివరికి 'బైతుల్ మిద్రాస్'★ ప్రదేశానికి చేరుకున్నాము. దైవప్రవక్త (సల్లం) నిలబడి యూదుల్ని ఎలుగెత్తి పిలుస్తూ "యూదులారా! ఇస్లాం స్వీకరించండి, మీరు సురక్షితంగా ఉంటారు" అని అన్నారు. దానికి యూదులు (స్పష్టంగా సమాధానమివ్వకుండా) "అబుల్ ఖాసిం! మీరు (మీ) సందేశాన్ని అందజేశారు

★ బైతుల్ మిద్రాస్ అంటే యూదులు కూర్చొని తౌరాత్ పఠించే ప్రదేశం అన్న మాట.

(ఇక చాలు)" అని అన్నారు. "నా ఉద్దేశ్యం కూడా అదే" అన్నారు దైవప్రవక్త (సల్లం). తిరిగి మరోసారి ఆయన ఆ మాటలే అన్నారు. యూదులు కూడా అదే సమాధానమిస్తూ "అబుల్ ఖాసిం! మీరు (మీ) ప్రచార బాధ్యతను నెరవేర్చారు (ఇక చాలు)" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) మూడోసారి తమ మాటను పునరుద్ఘాటిస్తూ "ఒక విషయం తెలుసుకోండి. ఈ భూమి దేవునికి, దేవుని ప్రవక్తకు చెందినది. నేను మిమ్మల్ని ఈ ప్రాంతం నుండి బహిష్కరించ దలిచాను. కనుక మీలో ఎవరి దగ్గరయినా ధన వస్తు సంపద ఉంటే దాన్ని అమ్ముకోవచ్చు. లేకుంటే గుర్తుంచుకోండి. భూమి దేవునికి, ఆయన ప్రవక్తకు చెందిన ఆస్తి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 89వ ప్రకరణం - ఇక్రాహ్, 2వ అధ్యాయం - ఫీ బైయిల్ ముక్రహీ వనహ్వీహి ఫిల్ హఖ్ఖి వ గైరిహీ)

1154. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- బనీ నజీర్, బనీ ఖురైజా (యూద) తెగలు (రెండూ) యుద్ధం చేశాయి. అయితే దైవప్రవక్త (సల్లం) బనీ నజీర్ తెగను మాత్రమే దేశ బహిష్కరణ చేశారు. బనీ ఖురైజా (తెగ) వాళ్ళను వారి ప్రాంతంలోనే ఉండనిచ్చారు. పైగా వారికి అనేక మేళ్ళు కూడా చేకూర్చారు. (అయినప్పటికీ) బనీ ఖురైజా తెగవాళ్ళు (చేసిన మేలు మరచి, శాంతి ఒప్పందాన్ని ఉల్లంఘించి) మళ్ళీ యుద్ధానికి పాల్పడ్డారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) వారిలో పురుషుల్ని హతమార్పింపజేసి, వారి స్త్రీలు, పిల్లలు, సిరిసంపదలను ముస్లింలకు పంచిపెట్టారు.

(దానికి పూర్వం) వారిలో కొందరు దైవప్రవక్త (సల్లం) దగ్గరికి (రక్షణ పొందే నిమిత్తం) వచ్చారు. దైవప్రవక్త (సల్లం) వారికి (ప్రాణదానం చేసి) ఆశ్రయమిచ్చారు. ఆ తరువాత వారు ఇస్లాం స్వీకరించి ముస్లిములయిపోయారు. ఈ విధంగా దైవప్రవక్త(సల్లం) మదీనా నుండి యూదులందర్నీ బహిష్కరించారు.

ఉదాహరణకు:- హజ్రత్ అబ్దుల్లా బిన్ సలాం (రజి)గారి తెగయిన బనీ ఖైనుఖా, బనీ హారిసా, ఒక్కటేమిటి మదీనాలో ఉండే యూదులందర్నీ బహిష్కరించారు.★

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం- మగాజి, 14వ అధ్యాయం - హదీసి బనీ నజీర్)

## 22వ అధ్యాయం - ఒప్పందం ఉల్లంఘించిన వారితో యుద్ధం చేయడం ధర్మ సమ్మతమే

1155. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- బనీ ఖురైజా తెగ యూదులు హజ్రత్ సాద్ బిన్ ముఆజ్ (రజి)ని మధ్యవర్తిగా స్వీకరించి ఆయుధాలు క్రింద పడవేయడానికి అంగీకరించారు. అప్పుడు

★ బనీ నజీర్, బనీ ఖురైజా అనేవి యూదులకు చెందిన ప్రముఖ తెగల పేర్లు. ఆ పేర్లతోనే వారి నివాస ప్రాంతాలు కూడా ప్రసిద్ధి చెందాయి. మొదట బనీ నజీర్ తెగను (మదీనా నుండి) బహిష్కరించడం జరిగింది. తరువాత బనీ ఖురైజా తెగ ఒప్పందం ఉల్లంఘించినందున దైవప్రవక్త (సల్లం) ఇరవై అయిదు రోజుల దాకా వారి కోటలను ముట్టడించి దిగ్బంధం చేశారు. ఆ తరువాత వారు ఓటమిని అంగీకరించారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) వారి యోధులను హతమార్చి వారి స్త్రీలను, పిల్లలను బానిసలుగా చేసుకోవాలని ఆదేశించారు. ఆ సందర్భంలో వారిలో పారిపోయి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి చేరుకున్న యూదులు మాత్రమే బ్రతికి బయటపడ్డారు. ఆ తరువాత వారు ఇస్లాం స్వీకరించి ముస్లిములయిపోయారు. (సంకలనకర్త)

దైవప్రవక్త (సల్లం) హజ్రత్ సాద్ (రజి)ను పిలవనంపారు. హజ్రత్ సాద్ (రజి) ఒక గాడిద మీదెక్కి వచ్చారు. ఆయన దైవప్రవక్త (సల్లం)కు దగ్గరగా వచ్చినప్పుడు దైవప్రవక్త (సల్లం) (తమ అన్సార్ అనుచరుల్ని ఉద్దేశించి) "మీ నాయకుడు వస్తున్నాడు. ఆయనకు గౌరవ సూచకంగా లేచి నిల బడండి" అన్నారు. హజ్రత్ సాద్ (రజి) వచ్చి దైవప్రవక్త (సల్లం) చెంత కూర్చున్నారు. దైవప్రవక్త (సల్లం) ఆయనతో మాట్లాడుతూ "మీరు చెప్పే తీర్పుని సమ్మతించే షరతుపై వీరు ఆయుధాలు క్రింద పడవేయడానికి అంగీకరించారు" అని తెలిపారు. "అయితే నేనీ విధంగా తీర్పు చెబుతున్నాను; వారిలో యుద్ధ సామర్థ్యం కలిగి ఉన్న పురుషులందర్నీ హతమార్చి వేయాలి. వారి స్త్రీలను, పిల్లలను ఖైదీలుగా చేసుకోవాలి" - అన్నారు హజ్రత్ సాద్ (రజి). దానిపై దైవప్రవక్త (సల్లం) వ్యాఖ్యానిస్తూ "నిస్సందేహంగా మీరు వారి విషయంలో రాజాధిరాజు తీర్పు (దేవుని తీర్పు) వంటి తీర్పిచ్చారు" అని అన్నారు.★

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం-జిహాద్, 168వ అధ్యాయం - ఇజానజలల్ అదువ్వు అలాహుక్మి రజులిన్)**

1156. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- హజ్రత్ సాద్ (బిన్ ముఆజ్) కందకం యుద్ధంలో గాయపడ్డారు. ఖురైష్ తెగకు చెందిన హిబ్బాన్ బిన్ అర్ఖా అనే వ్యక్తి ఆయన మీదికి బాణం వదిలాడు. అది ఆయన మెడ నరంలోకి దిగబడింది. అందువల్ల దైవప్రవక్త (సల్లం) ఆయన కోసం మస్జిద్‌లోనే ఒక గుడారం వేయించారు. దగ్గరగా ఉంటే ఆయన్ని గురించిన సమాచారం ఏదైనా సులువుగా తెలుస్తుందన్న ఉద్దేశంతో ఇలా చేశారు. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) కందకం యుద్ధం నుండి తిరిగొచ్చి ఆయుధాలు దించి వేశారు. స్నానం కూడా చేశారు.

కాని అంతలో హజ్రత్ జిబ్రయీల్ (దైవదూత) ముఖమ్మీద పడిన దుమ్ము ధూళి తుడుచుకుంటూ వచ్చి "మీరు అప్పుడే ఆయుధాలు దించి వేశారా! మేమింకా ఆయుధాలు దించి వేయలేదు" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ మాటలు విని "మళ్ళీ ఎక్కడికైనా పోవాల్సి ఉందా?" అని అడిగారు. హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) బనీ ఖురైజా (యూదుల) ప్రాంతం వైపుకు సూచించారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) బనీ ఖురైజా ప్రాంతానికి వెళ్ళారు (సాయుధులయి).

---

★ బనీ ఖురైజా తెగ మదీనాలోని ఔస్ తెగకు మిత్ర పక్షం. దైవప్రవక్త (సల్లం) ఒక ఒప్పందం ద్వారా ఆ తెగ యూదులను వారి భూములు, కోటలలోనే ఉండనిచ్చి వారికెం తో మేలు చేశారు. కాని వారు ఖన్దఖ్ (కందకం) యుద్ధ సమయంలో ఒప్పందాన్ని ఉల్లంఘించి ఖురైష్ బహుదైవారాధకులతో చేతులు కలిపారు. అందువల్ల ఆ యుద్ధం ముగిసిన వెంటనే ఆయన (సల్లం) బనీ ఖురైజా వాడను ముట్టడించారు. ముట్టడి ఇరవై అయిదు రోజుల పాటు సాగింది. చివరికి వారు కాళ్ళ బేరానికి వస్తూ తమ మిత్ర పక్షం నాయకుడైన హజ్రత్ సాద్ బిన్ ముఆజ్ (రజి)ను మధ్యవర్తిగా పెట్టి, ఆయన ఇచ్చే తీర్పును తాము శిరసావహిస్తామన్న షరతుతో కోట తలుపులు తెరవడానికి అంగీకరించారు. ఔస్ తెగ (ఇస్లాం స్వీకరించక) పూర్వం నుండే తమ మిత్ర పక్షంగా ఉంటూ వస్తున్నందున ఆ తెగ నాయకుడు హజ్రత్ సాద్ (రజి) తమ పట్ల సడలింపుల వైఖరి అవలంబిస్తారని వారు భావించారు. కాని హజ్రత్ సాద్ (రజి) తౌరాత్ గ్రంథం ప్రకారం తీర్పిచ్చారు. బనీ ఇస్రాయీల్ (యూదుల) రాజులు యుద్ధ ఖైదీల విషయంలో తౌరాత్ గ్రంథం ప్రకారమే నిర్ణయం తీసుకునేవారు.

హజ్రత్ సాద్ బిన్ ముఆజ్ (రజి) కందకం యుద్ధంలో గాయపడినందున ఆయనకు వైద్య సదుపాయాలు కలిగించి, బాగోగులు చూడటానికి వీలుగా దైవప్రవక్త (సల్లం) ఆయన కోసం మస్జిదె నబవీలోనే ఒక గుడారం వేయించి, ఆయన్ని ఉంచారు. యూదుల్ని గురించి తీర్పివ్వడానికి ఆయన్ని పిలిచినప్పుడు ఆయన ఒక గాడిద ఎక్కి వచ్చారు. ఆయన దగ్గరకు రాగానే మీ నాయకునికి గౌరవసూచకంగా లేచి నిలబడండని దైవప్రవక్త (సల్లం) అన్సార్ (ఔస్ తెగ) ముస్లింలను ఆదేశించారు. ఇలా గౌరవ సూచకంగా లేచి నిలబడి స్వాగతమివ్వడం ధర్మవేత్తలు, మహనీయుల విషయంలో ధర్మసమ్మతమే. అయితే ఒక వ్యక్తి (ఎంత గొప్పవాడయినప్పటికీ) కూర్చొని ఉండగా కొందరు ఆయన ముందు చేతులు కట్టుకొని నిలబడటం మాత్రం ధర్మ సమ్మతం కాదు.

యూదులు దైవప్రవక్త (సల్లం) ఆదేశాన్ని శిరసావహిస్తూ ఆయుధాలు క్రింద పడవేయడానికి ఒప్పుకున్నారు. అయితే దైవప్రవక్త (సల్లం) తీర్పు చేసే బాధ్యతను హజ్రత్ సాద్ బిన్ ముఆజ్ (రజి)పై ఉంచారు. హజ్రత్ సాద్ (రజి) తీర్పిస్తూ "నేను వీరి విషయంలో ఇలా తీర్పిస్తున్నాను; యుద్ధ సామర్థ్యం గల వారందర్నీ వధించాలి. స్త్రీలను, పిల్లలను బానిసలుగా చేసుకోవాలి. వారి ఆస్తి పాస్తుల్ని ముస్లింలకు పంచాలి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం-మగాజి, 30వ అధ్యాయం-మర్జియిన్న బియ్యి - మినల్ అహ్జాబ్)

1157. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- హజ్రత్ సాద్ బిన్ ముఆజ్ (రజి) దైవాన్ని ఇలా వేడుకున్నారు: "దేవా! నీ ప్రవక్త (సల్లం)ను తిరస్కరించి ఆయన్ని స్వస్థలం నుండి బహిష్కరించిన వారికి వ్యతిరేకంగా నేను నీ మార్గంలో పోరాడటం కంటే మించిన ప్రియమైన విషయం నాకు మరేదీ లేదు. ఈ సంగతి నీకు బాగా తెలుసు. దేవా! మాకు, మా శత్రువులకు మధ్య సాగిన యుద్ధాన్ని నీవు అంతం చేశావని భావిస్తున్నాను. ఒకవేళ ఖురైషీయులతో జరిగిన యుద్ధంలో ఇంకా ఎవరైనా మిగిలి ఉంటే నన్ను కూడా సజీవంగా ఉంచు, నేను నీ మార్గంలో (మరోసారి) యుద్ధం చేస్తాను. ఒకవేళ నీవీ యుద్ధాన్ని నిజంగా సమాప్తం చేసి ఉంటే నా గాయాన్ని తెరచి అందులో నుంచి రక్తం స్రవించేలా చెయ్యి. ఆ విధంగా ఈ గాయం నా మరణానికి కారణభూతమయ్యేలా చెయ్యి."

ఇలా ప్రార్థించిన తరువాత ఆయన గాయం నుండి రక్తం స్రవించసాగింది. జనం అది చూసి భీతావహులయ్యారు. హజ్రత్ సాద్ (రజి) గాయం నుండి ఏకధాటిగా రక్తం ప్రవహిస్తూ మస్జిద్‌లోని గఫ్ఫార్ (తెగ) గుడారం దాకా ప్రవహించింది. వారు కంగారుపడుతూ గుడారం వాసులారా! మీ గుడారం వైపు నుండి ఇటు ప్రవహిస్తున్న దేమిటి? అని అన్నారు. అప్పుడు వారు వెళ్ళి చూస్తే హజ్రత్ సాద్ బిన్ ముఆజ్ (రజి) గాయం నుండి రక్తం (ఏరయి) పారుతోంది. చివరికి ఆ గాయం వల్లనే ఆయన చనిపోయారు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం-మగాజి, 3వ అధ్యాయం-మర్జియిన్న బియ్యి - మినల్ అహ్జాబ్)

## 23వ అధ్యాయం-ఒక ముఖ్యమైన పని ఉండగా మరో ముఖ్యమైన పని వచ్చి పడినప్పుడు

1158. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) కందకం యుద్ధం ముగిసిన తరువాత అక్కడ్నుంచి తిరిగొచ్చి "బనీ ఖురైజా (యూద) వాడలోకి చేరుకోనంతవరకు ఎవరూ అస్ర్ నమాజ్ చేయకూడదు" అని ఆదేశించారు (తమ అనుచరుల్ని). (దాంతో యోధులందరూ బయలుదేరారు). కొందరు కొంత దూరం నడచిన తరువాత దారిలోనే అస్ర్ వేళ అయింది. అప్పుడు వారిలో కొందరు 'మనం బనీ ఖురైజా ప్రాంతానికి చేరుకోనంతవరకు అస్ర్ నమాజ్ చేయకూడదు' అని అన్నారు. మరికొందరు "కాదు, మనం ఇక్కడే నమాజ్ చేయాలి. దైవప్రవక్త (సల్లం) ఆదేశానికి అర్థం అస్ర్ నమాజ్ ఖజా చేయాలని కాదు కదా!" అని అన్నారు. ఆ తరువాత ఈ వ్యవహారం దైవప్రవక్త

(సల్లం) దృష్టికి తీసికెళ్ళడం జరిగింది. ఆయన ఆ ఇరువర్గాలలో ఎవరి పట్టుదల పట్ల కూడా తన అయిష్టతను వ్యక్తపరచలేదు.

(సహీహ్ బుఖారీ:- 12వ ప్రకరణం-సలాతిల్ ఖౌఫ్ , 5వ అధ్యాయం-సలాతిత్తాలిబివల్ మత్లూబ్ రాకిబన్ వ ఈమాఅన్)

## 24వ అధ్యాయం - ముహాజిర్ ముస్లింలకు అన్సార్ ముస్లింలిచ్చిన కానుకలు

1159. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- ముహాజిర్ ముస్లింలు మక్కా నుండి మదీనాకు వలస వచ్చినప్పుడు వారి దగ్గర ఆస్తిపాస్తులు ఏమీ లేవు. అన్సార్ ముస్లింలకు మాత్రం భూములు, జాగీరులు ఉన్నాయి (దైవప్రవక్త (సల్లం) వారుభయుల మధ్య సహోదరీకరణ చేయించడంతో అన్సార్ ముస్లింలు తమ ఆస్తిపాస్తుల్లో సగం ఇవ్వడానికి ముందుకొచ్చారు). అన్సార్ ముస్లింలు ప్రతి యేడూ తమ తోటలలో పండిన పండ్లు వగైరా ముహాజిర్ ముస్లింలకు ఇస్తుండేవారు. ముహాజిర్ ముస్లింలు (వారిచ్చింది తిని కూర్చోకుండా) వారితో కలసి కష్టపడి పని చేసేవారు.

(హజ్రత్ అనస్, హజ్రత్ అబ్దుల్లా బిన్ అబీతల్హాల తల్లి) హజ్రత్ ఉమ్మె సలీం (రజి) దైవప్రవక్త(సల్లం) కు ఒక ఖర్జూర వృక్షాన్ని ఇచ్చారు. ఆ వృక్షాన్ని దైవప్రవక్త (సల్లం) స్వేచ్ఛ పొందిన తమ బానిస మహిళ హజ్రత్ ఉమ్మెఐమన్ (రజి) కు ప్రసాదించారు. ఆమె హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కు తల్లి అవుతారు. దైవప్రవక్త (సల్లం) ఖైబర్ యుద్ధం నుండి మదీనాకు తిరిగొచ్చిన తర్వాత ముహాజిర్ ముస్లింలు తమకు లోగడ అన్సార్ ముస్లింలు ఇచ్చిన పండ్లు వగైరా కానుకలన్నీ తిరిగి వారికి ఇచ్చివేశారు. దైవప్రవక్త (సల్లం) కూడా గతంలో నా తల్లి (హజ్రత్ ఉమ్మె సలీం) ఇచ్చిన ఖర్జూర చెట్టును తిరిగి ఆమెకు ఇచ్చివేశారు. ఆయన హజ్రత్ ఉమ్మె ఐమన్ (రజి)కు ఆ చెట్టుకు బదులుగా తమ తోటలోని కొన్ని చెట్లను ప్రసాదించారు.

(సహీహ్ బుఖారీ:- 51వ ప్రకరణం- హిబ, 35వ అధ్యాయం-ఫజ్లిల్ మనీహ్)

1160. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) మదీనాకు వలస వచ్చిన తరువాత (ఆయనపై కానుకల వర్షం కురవనారంభించింది). కొందరు ఆయనకు ఖర్జూర చెట్టు ఇస్తే, మరికొందరు మరో వస్తువు ఇచ్చేవారు. ఈ కానుకల పరంపర బనీ ఖురైజా, బనీ నజీర్ (యూద తెగల) ప్రాంతాలు జయించబడేవరకు కొనసాగాయి. ఆ తరువాత నా కుటుంబం వారు లోగడ దైవప్రవక్త (సల్లం) కు ఇచ్చిన (ఖర్జూర) చెట్లను గురించి అడిగేందుకు నన్ను ఆయన దగ్గరకు పంపించారు. ఆ చెట్లు మొత్తం గాని, లేదా వాటిలో కొన్నిగాని ఆయన మాకు తిరిగిస్తారేమో కనుక్కొని రమ్మని పంపారు. దైవప్రవక్త (సల్లం) ఈ చెట్లను హజ్రత్ ఉమ్మె ఐమన్ (రజి)కు ఇచ్చివేశారు. ఈ సంగతి తెలియగానే హజ్రత్ ఉమ్మె ఐమన్ (రజి) వచ్చి నా మెడలో వస్త్రం పడేసి (లాగుతూ), "అలా ఎన్నటికీ జరగదు. ఏకేశ్వరుని సాక్షి! దైవ ప్రవక్త (సల్లం) ఈ చెట్లను మీ కెన్నటికీ ఇవ్వరు. వీటిని ఆయన నాకు ప్రసాదించారు-లేదా హజ్రత్ ఉమ్మె ఐమన్ (రజి) ప్రమాణం చేసి మరో విధంగా అన్నారు- దైవప్రవక్త (సల్లం) (తన తోటలోని ఒక చెట్టును చూపిస్తూ) "వీటిని తీసుకో" అన్నారు ఆమెతో. కాని ఆమె అందుకు నిరాకరిస్తూ "వద్దు, అలా జరగడానికి వీల్లేదు" అన్నారు. చివరికి దైవప్రవక్త (సల్లం) హజ్రత్ ఉమ్మె ఐమన్ (రజి) కు ఆ చెట్లకు పదిరెట్ల చెట్లు ఇచ్చి ఒప్పించారు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం- మగాజి, 30వ అధ్యాయం-మర్జియిన్న బియ్యి, మినల్ అహ్జాబ్)

# 25వ అధ్యాయం -శత్రు ప్రాంతంలో ఆహార పదార్థాలు దొరికితే?!

1161. హజ్రత్ అబ్దుల్లా బిన్ ముగప్ఫిల్ (రజి) కథనం:- మేము ఖైబర్ కోటను ముట్టడించి ఉన్నాము. ఆ సందర్భంలో (ఓసారి) ఒక వ్యక్తి (కోటపై నుండి) కొవ్వున్న ఒక (తోలు) సంచి విసిరాడు. దాన్ని చూడగానే తీసుకుందామని నేను ముందుకు లంఘించాను. కాని వెనక్కి తిరిగి చూస్తే ఎదురుగా దైవప్రవక్త (సల్లం) నిలబడి ఉన్నారు. ఆయన్ని చూసి నేను సిగ్గుతో తలవంచుకున్నాను.

(సహీహ్ బుఖారీ:- 57వ ప్రకరణం- ఫర్జుల్ ఖుమ్స్, 20వ అధ్యాయం - మాయుసీబు మినత్త ఆమ్ ఫీ అర్జిల్ హర్బ్)

# 26వ అధ్యాయం - హెరక్లియస్‌కు ఇస్లాం సందేశం అందజేస్తూ దైవప్రవక్త (సల్లం) లేఖ

1162. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- నేను అబూ సుఫ్యాన్ (రజి) నోట ఈ సంభాషణ విన్నాను. ఆయన ఇలా తెలియజేశారు: 'నాకు, దైవప్రవక్త (సల్లం)కు మధ్య (హుదైబియా) ఒప్పందం జరిగి ఉన్న రోజుల్లో నేను (వ్యాపార నిమిత్తము విదేశాలకు) ప్రయాణమయ్యాను. నేను సిరియాలో విడిది చేసినప్పుడు (రోమ్ చక్రవర్తి) హెరక్లియస్ పేర దైవప్రవక్త (సల్లం) లేఖ ఒకటి చేరింది. దాన్ని హజ్రత్ వహ్యా కల్బీ (రజి) తీసుకొచ్చారు. ఆయన దాన్ని బుస్రా పాలకునికి అందజేశారు, బుస్రా పాలకుడు దాన్ని హెరక్లియస్ దగ్గరకు పంపాడు. ఈ లేఖ హెరక్లియస్‌కు అందిన తరువాత అతను సభాసదులతో "తనను తాను దైవప్రవక్తనని ప్రకటించుకున్న వ్యక్తి జాతికి చెందినవారు ఎవరైనా ఈ ప్రాంతంలో ఉన్నారా?" అని ప్రశ్నించాడు. దానికి వారు ఉన్నారని సమాధానమిచ్చారు.

హజ్రత్ అబూ సుఫ్యాన్ (రజి) ఇలా అన్నారు: ఆ తరువాత నన్ను పిలిపించారు. నా వెంట ఖురైష్ తెగకు చెందిన మరి కొందరు వ్యక్తులు కూడా ఉన్నారు. మేమంతా హెరక్లియస్ దగ్గరకు వెళ్ళాము. అతను మమ్మల్ని తన ముందు కూర్చోబెట్టి "మీలో దైవప్రవక్తనని ప్రకటించుకున్న వ్యక్తికి బంధుత్వం రీత్యా ఎక్కువ సన్నిహితులెవరు?" అని అడిగాడు. "అందరికంటే నేనెక్కువ సన్నిహితుడ్ని" అన్నాను నేను. అప్పుడతను దుబాసీని పిలిపించి "దైవప్రవక్తనని ప్రకటించుకున్న వ్యక్తిని గురించి నేనితడ్ని కొన్ని ప్రశ్నలు అడుగుతాను. ఒకవేళ ఇతను నాతో అబద్ధమాడితే నీవు దాన్ని ఖండించాలి. ఈ విషయం వీరందరికీ తెలియజెయ్యి" అని అన్నాడు.

హజ్రత్ అబూ సుఫ్యాన్ (రజి) ఇలా చెబుతున్నారు: 'దైవసాక్షి! నా అనుచరులు నా మాటలను నిరాకరిస్తారన్న భయం లేకపోతే నేను తప్పకుండా అబద్ధమాడేవాడ్ని'. తరువాత హెరక్లియస్ తన దుబాసీతో "ఆ వ్యక్తి (దైవప్రవక్త) వంశం, గోత్రం ఎలాంటివో ఇతడ్ని అడుగు" అని అన్నాడు. నేను సమాధానమిస్తూ "మా అందరిలో కెల్లా ఆయన వంశం, గోత్రం ఎంతో ఉన్నతమైనవి" అని చెప్పాను. "సరే ఆయన తాతముత్తాతలలో ఎవరైనా చక్రవర్తి అయ్యారా?" అని అడిగాడతను. నేను లేదన్నాను. "దైవదౌత్య ప్రకటనకు పూర్వం ఆయన ఎప్పుడైనా అబద్ధమాడినట్లు నీవు విన్నావా?" అని అడిగాడు హెరక్లియస్ తిరిగి. నేను లేదన్నాను. "ఆయన్ని (ఎక్కువగా) ధనికులు అనుసరిస్తున్నారా? లేక పేదలు అనుసరిస్తున్నారా?" అడిగాడతను మళ్ళీ. నేను "ధనికులు కాదు, పేదలే" అన్నాను. "ఆయన్ని

విశ్వసిస్తున్న వారి సంఖ్య పెరుగుతోందా లేక తగ్గిపోతోందా?" అడిగాడతను. "తగ్గిపోవడం లేదు, ఇంకా పెరిగిపోతోంది" అన్నాను నేను.

"అతని అనుచరుల్లో ఎవరైనా అతని ధర్మం స్వీకరించిన తరువాత, అది మంచిది కాదని భావించి దాన్ని వదలి పెట్టడం జరిగిందా?" అడిగాడు హెరక్లియస్. నేను "అలాంటిదేమీ జరగ లేద"న్నాను. "మీరు ఆయనతో ఎప్పుడైనా యుద్ధం చేశారా?" ప్రశ్నించాడతను. నేను చేశామన్నాను. "అయితే ఫలితాలు ఎలా ఉండేవి?" అడిగాడతను. "మాకు, వారికి మధ్య యుద్ధం బొక్కెన మాదిరిగా ఉంటుంది. ఒకప్పుడు వాళ్ళు గెలిస్తే, మరొకప్పుడు మేము విజయం సాధిస్తుంటాము" అన్నాను నేను. "సరే ఆయన ఎప్పుడైనా వాగ్దాన (ఒప్పంద) భంగం చేస్తారా?" అడిగాడతను. "లేదు, అయితే ప్రస్తుతం ఆయనకు - మాకు మధ్య ఒక నిర్ణీత గడువుకు గాను ఒడంబడిక జరిగింది. కాని ఈసారి ఆయన ఏం చేస్తాడో మాకు తెలియదు" అన్నాను నేను.

అబూ సుఫ్యాన్ (రజి) కథనం:- మొత్తం సంభాషణలో ఈ ఒక్కమాట తప్ప నా తరపున మరే విషయం కలపడానికి అవకాశం లభించలేదు. అతను నన్ను, "ఇలాంటి (దైవదౌత్య) ప్రకటన ఇంతకు పూర్వం (అరబ్బుల్లో) ఎవరైనా చేశారా?" అని అడిగాడు. నేను లేదన్నాను. ఆ తరువాత హెరక్లియస్ తన దుబాసీతో నాకు చెప్పమని ఇలా అన్నాడు.

"నేను నిన్ను ఆయన వంశం గురించి అడిగాను. నీవు మీ అందరి కంటే ఆయనది గొప్ప వంశమని చెప్పావు. నిజం, దైవప్రవక్తలు ఎప్పుడూ ఉన్నత వంశాలలోనే జన్మిస్తారు. నేను నిన్ను, ఆయన తాత ముత్తాతలలో ఎవరైనా చక్రవర్తి అయ్యారా అని అడిగాను. నీవు లేదన్నావు. ఆయన తాతముత్తాతలలో నిజంగా ఎవరైనా చక్రవర్తి అయి ఉంటే ఈయన తన తాతముత్తాతల రాజ్యాధికారం కోరుతున్నాడని నేను దీన్ని బట్టి భావిస్తాను. (కాని అలాంటిదేమీ లేదు) తరువాత నేను, ఆయన అనుయాయుల్లో ధనికులున్నారా, పేదలున్నారా అని అడిగాను. నీవు పేదలే ఉన్నారని అన్నావు. నిజం, దైవప్రవక్తలకు (సాధారణంగా) పేదలే అనుయాయులవుతారు".

దైవదౌత్య ప్రకటనకు పూర్వం ఆయన ఎప్పుడైనా అబద్ధమాడినట్లు చూశావా అని నేను నిన్ను అడిగాను. నీవు లేదన్నావు. దీన్ని బట్టి ప్రజలతో ప్రజల వ్యవహారాలను గురించి ఎన్నడూ అబద్ధమాడని వ్యక్తి దేవుని విషయంలో అబద్ధమాడలేడని నేను భావిస్తున్నాను. ఆయన అనుచరుల్లో ఎవరైనా ఆయన ధర్మం స్వీకరించిన తరువాత అది నచ్చక దాన్ని వదలెయ్యడం జరిగిందా అని అడిగాను. నీవు లేదన్నావు. అదే నిజమైన విశ్వాసమంటే. మనిషి ఒక విషయాన్ని హృదయపూర్వకంగా విశ్వసించినపుడు ఇక దాన్ని మానెయ్యలేడు. నేను నిన్ను ఆయన అనుచరుల సంఖ్య పెరుగుతోందా తగ్గిపోతోందా అని అడిగాను. నీవు పెరుగుతోందని చెప్పావు. నిజమైన విశ్వాస పరిస్థితి ఇలాగే ఉంటుంది. అది దిన దిన ప్రవర్థమానమవుతూనే ఉంటుంది. చివరికి అది పరిపక్వదశకు చేరుకుంటుంది. నేను నిన్ను మీరెప్పుడైనా ఆయనతో యుద్ధం చేశారా అని అడిగాను. నీవు చేశామని, ఒక్కోసారి మేము, ఒక్కోసారి ఆయన యుద్ధంలో విజయం సాధించడం జరుగుతుంటుందని అన్నావు. దైవప్రవక్తలందరి పరిస్థితి కూడా ఇలాగే ఉంటుంది. ప్రారంభంలో వారు (దేవుని చేత) పరీక్షించబడతారు. చివరికి అంతిమ

విజయం వారికే లభిస్తుంది.

"నేను నిన్ను ఆయన ఎప్పుడైనా ఒప్పందం ఉల్లంఘించడం గాని, వాగ్దానభంగం చేయడం గాని జరిగిందా అని అడిగాను. నీవు లేదన్నావు. దైవప్రవక్తలు ఎన్నటికీ ఒప్పందాలు ఉల్లంఘించి మోసానికి పాల్పడరు. నేను నిన్ను ఇలాంటి ప్రకటన ఆయనకు పూర్వం (అరబ్బుల్లో) ఎవరైనా చేశారా అని అడిగాను. నీవు లేదన్నావు. ఆయనకు పూర్వం ఎవరైనా ఇలాంటి ప్రకటన చేసి ఉంటే ఈయన కూడా అలాంటి మాటలే పలుకుతున్నాడని మనం భావించవచ్చు. కాని అలాంటిదేమీ లేదు".

హజ్రత్ అబూ సుఫ్యాన్ (రజి) ఇలా అంటున్నారు - ఆ తరువాత హెరక్లియస్ "ఆయన మిమ్మల్ని ఏ విషయాలను గురించి ఆదేశిస్తున్నాడు"? అని అడిగాడు. "ఆయన మమ్మల్ని నమాజ్, జకాత్ (పేదల ఆర్థికహక్కు), బంధువుల పట్ల ప్రేమాభిమానాలు, పవిత్రత పరిశుద్ధతలను గురించి ఆదేశిస్తున్నారు" అని అన్నాను నేను.

"నీవు చెప్పిన విషయాలన్నీ నిజమయితే ఆయన తప్పకుండా దైవప్రవక్తే. అందులో ఇక ఎలాంటి సందేహం లేదు. ఒక దైవప్రవక్త ప్రభవించనున్నారని నాకు ముందే తెలుసు. కాని ఆ ప్రవక్త మీ (జాతి)లో ప్రభవిస్తారని నేను అనుకోలేదు. నేనాయన దగ్గరకు చేరుకోగలిగితే తప్పకుండా ఆయన్ని కలుసుకోవడానికి ఇష్టపడతాను. ఒకవేళ నేను ఆయన దగ్గర ఉంటే తప్పకుండా ఆయన కాళ్ళు కడుగుతాను. ఆయన రాజ్యం ఈనాడు నా అధీనంలో ఉన్న భూభాగం దాకా తప్పకుండా విస్తరిస్తుంది" అన్నాడు హెరక్లియస్.

హజ్రత్ అబూసుఫ్యాన్ (రజి) కథనం:- హెరక్లియస్ ఈ సంభాషణ తర్వాత దైవప్రవక్త (సల్లం) దివ్యలేఖను తెప్పించి దాన్ని చదివాడు. అందులో ఇలా ఉంది - "కరుణామయుడు, కృపాసాగరుడయిన అల్లాహ్ పేరుతో ప్రారంభం. దైవప్రవక్త ముహమ్మద్ తరఫున రోమ్ చక్రవర్తి హెరక్లియస్ పేర వ్రాయునది. సన్మార్గం అవలంబించే వానికి సలాం. నేను ఏకేశ్వర వచనం ద్వారా నిన్ను ఇస్లాం స్వీకరణ వైపుకు ఆహ్వానిస్తున్నాను. ఇస్లాం స్వీకరించు. ఈ ధర్మమే నీ శాంతీ రక్షణలకు హామీనిస్తుంది. నీవు ముస్లింగా మారితే దేవుడు నీకు రెట్టింపు పుణ్యఫలం ప్రసాదిస్తాడు. ఒకవేళ నీవు దీనికి అంగీకరించకపోతే గుర్తుంచుకో, నీ ప్రజల★ పాపభారం కూడా నీ మీదే వచ్చి పడుతుంది - (ఖుర్ఆన్ సూక్తి): ఓ గ్రంథవహులారా! మీకు మాకు మధ్య ఉన్న ఉమ్మడి విషయం వైపుకు రండి. అదేమిటంటే మనం అల్లాహ్‌ను తప్ప మరెవర్నీ ఆరాధించకూడదు. ఆయనకు ఎవర్నీ సాటి కల్పించకూడదు. మనలో ఏ ఒక్కరూ ఆ దేవుడ్ని వదలి మరెవర్నీ మన ప్రభువుగా చేసుకోకూడదు. (ప్రవక్తా!) ఈ విషయాన్ని వారు

---

★ ఇక్కడ మూలభాషలో 'అరీసీన్' అనే పదం ప్రయోగించబడింది. అంటే రైతులని ఒక అర్థం. మొత్తం ప్రజానీకం కోసం కూడా ఈ పదాన్ని వాడతారు. లేదా ప్రముఖ క్రైస్తవ పండితుడైన అబ్దుల్లా బిన్ అరీస్ అనుచరులని కూడా అర్థముంది. ఈ పండితుడు మసీహ్ ధర్మంలో కొత్త కొత్త విషయాలను సృష్టించి దాన్ని పూర్తిగా మార్చివేశాడు. ఈ విధంగా అతను హజ్రత్ ఈసా (అలైహి) గారి ధర్మానికి విముఖుడైపోయాడు. ఇక్కడ నీ ప్రజల పాప భారం కూడా నీమీదే వచ్చి పడుతుంది అంటే, నేనిప్పుడు నిన్ను అసలైన మసీహ్ ధర్మం (ఇస్లాం)వైపుకు పిలుస్తున్నాను, నీవీ పిలుపును స్వీకరించకపోతే, నిన్ను అనుసరిస్తూ మార్గ భ్రష్టత్వంలోనే పడిఉన్న నీ ప్రజల పాప భారం కూడా నీ మీద పడుతుందని అర్థం. (సంకలనకర్త).

అంగీకరించకపోతే, 'మేము (ఒక్క దేవుడ్ని మాత్రమే ఆరాధించే) ముస్లింలము. దీనికి మీరే సాక్షులు' అని వారికి స్పష్టంగా చెప్పెయ్యి. (3:64)

హెరక్లియస్ ప్రవక్త లేఖ చదవడం పూర్తి చేయగానే ప్రజల కేకలు, అరుపులు మిన్నుముట్టాయి. పెద్ద కలకలం బయలుదేరింది. రకరకాల మాటలు వినరాసాగాయి. అప్పుడు హెరక్లియస్ తన భటుల్ని ఆజ్ఞాపించి మమ్మల్ని బయటికి పంపివేశాడు.

హజ్రత్ అబూసుఫ్యాన్ (రజి) కథనం:- మేము అక్కడ్నుంచి బయలుదేరుతున్నప్పుడు నేను నా అనుచరులతో "అబూ కబ్షా కొడుకు★ (అంటే దైవప్రవక్త) హోదా అంతస్థులు బాగా పెరిగిపోయాయి. ఇప్పుడు ఆయనకు రోమన్ల చక్రవర్తి కూడా భయపడుతున్నాడు" అని అన్నాను. ఈ సంఘటన తరువాత దైవప్రవక్త (సల్లం) త్వరలోనే (యావత్తు ప్రపంచంలో) ఆధిక్యత పొందగలరని నాకు నమ్మకం ఏర్పడింది. చివరికి దేవుడు నాక్కూడా ఇస్లాం స్వీకార సద్బుద్ధిని ప్రసాదించాడు.

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, అలిఇమ్రాన్ సూర, 4వ అధ్యాయం - ఖుల్ యా అహ్లల్ కితాబి తఆలౌ......)**

## 28వ అధ్యాయం - హునైన్ యుద్ధం

1163. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం:- ఒక వ్యక్తి హజ్రత్ బరా (రజి)తో మాట్లాడుతూ "అబూ అమ్మారా! మీరు (అంటే దైవప్రవక్త, ఆయన అనుచరులు) హునైన్ యుద్ధం నుండి పారిపోయారా?" అని అడిగాడు. దానికి హజ్రత్ బరా (రజి) ఇలా సమాధానమిచ్చారు: "లేదు. దైవప్రవక్త (సల్లం) ఏ మాత్రం వెనక్కి మరలలేదు. కాకపోతే ఆయన అనుచరుల్లో ముందు చూపులేని కొందరు యువకులు (సరయిన) ఆయుధాలు లేకుండా తొందరపడి ముందుకు పురోగమించారు. అప్పుడు శత్రువర్గం నుండి ఆరితేరిన విలుకాండ్రు వారికి ఎదురయ్యారు. హవాజన్, బనీనసర్ తెగలకు చెందిన ఆ విలుకాండ్రు వదిలే బాణాల్లో ఒక్కటి కూడా గురితప్పేది కాదు. దాంతో ముస్లింలు ఆ బాణాల ధాటికి తట్టుకోలేక (పారిపోయి) దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చేశారు.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఒక తెల్లని కంచర గాడిదపై ఎక్కి ఉన్నారు. ప్రవక్త పెదనాన్న కొడుకు అబూసుఫ్యాన్ బిన్ హారిస్ దాన్ని పగ్గం పట్టుకొని నడిపిస్తున్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ పరిస్థితిని చూసి గాడిద పై నుండి దిగి సహాయం కోసం దేవుడ్ని ప్రార్థించారు. తరువాత ఆయన "నేను దైవప్రవక్తను. ఇందులో ఎలాంటి సందేహం లేదు. నేను ఎంత మాత్రం అసత్యవాదిని కాను. నేను అబ్దుల్ ముత్తలిబ్ కుమారుడ్ని" అని అన్నారు. ఆ తరువాత ఆయన అనుచరుల (యోధుల) పంక్తుల్ని సరికొత్త పంథాలో తీర్చిదిద్దారు. (నూతనుత్తేజంతో శత్రువులపై విరుచుకుపడి వారిని ఓడించారు).

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం- జిహాద్, 97వ అధ్యాయం - మన్‌సప్ప అస్‌హాబహూ ఇన్దల్ హజీమా......)**

---

★ అబూ కబ్షా కొడుకు లేక ఇబ్నె అబూ కబ్షా అనేది, దైవప్రవక్త (సల్లం) క్షీర సంబంధపు తండ్రి అయిన హారిస్ బిన్ అబ్దుల్ ఉజ్జాగారి మారుపేరు. ఇక్కడ దైవప్రవక్త (సల్లం) ను ఆయన కన్నతండ్రి హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్దుల్ ముత్తలిబ్ పేరుకు బదులు వ్యంగ్య ధోరణిలో ఆయన్ని అబూ కబ్షా కొడుకు అని పేర్కొనడం జరిగింది. (సంకలన కర్త)

1164. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం:- ఒక వ్యక్తి హజ్రత్ బరా (రజి)తో మాట్లాడుతూ "హునైన్ యుద్ధంలో మీరు దైవప్రవక్త (సల్లం)ను వదలి పారిపోయారటగా" అని అడిగాడు. దానికి హజ్రత్ బరా (రజి) ఇలా సమాధానమిచ్చారు: "అది నిజమే. కాని దైవప్రవక్త (సల్లం) మాత్రం యుద్ధ భూమి వదలి పారిపోలేదు. అసలు జరిగిందేమిటంటే, హవాజన్ తెగవాళ్ళు విలువిద్యలో ఆరితేరిన వారు. మేము అవిశ్వాసులపై దాడి చేసినప్పుడు (ప్రారంభంలో) వారు పరాజయం పొంది పారిపోవడం మొదలెట్టారు. మేము ఆ వెనువెంటనే విజయప్రాప్తి వైపు ఎగబడ్డాము. (అవకాశం కోసం కాచుకొని ఉండిన) విలుకాండ్రు మాపై బాణాల వర్షం కురిపించారు. ఆ సమయంలో చూస్తే దైవప్రవక్త (సల్లం) తెల్లని కంచరగాడిదపై ఎక్కి ఉన్నారు. హజ్రత్ అబూసుఫ్యాన్ (రజి) దాని పగ్గం పట్టుకొని ఉన్నారు. దైవప్రవక్త (సల్లం) "నేను దేవుని ప్రవక్తను, సత్యవాదిని" అని పలకసాగారు.[1]

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం- మగాజి, 54వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా వ యౌమ హునైన్ ఇజ్ అ అజబత్కుం కస్రతుకుం)**

## 29వ అధ్యాయం - తాయిఫ్ యుద్ధం

1165. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) తాయిఫ్ పట్టణాన్ని ముట్టడించినప్పుడు (ఎంత పోరాడినా) విజయం లభించలేదు. అప్పుడాయన (తన అనుచరులతో) "దైవచిత్తమయితే రేపు మనం ఇక్కడ్నుంచి వెళ్ళిపోతాము" అని అన్నారు. ఈ మాటలు విని వారు బాధపడిపోతూ "మనం దీన్ని జయించకుండానే వెళ్ళిపోదామా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "సరే, రేపు మళ్ళీ యుద్ధం చేయండి" అన్నారు. మరునాడు ఉదయం తిరిగి యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో ముస్లింలు గాయపడ్డారు. అది చూసి దైవప్రవక్త (సల్లం) "దైవచిత్తమయితే రేపు మనం వెళ్ళిపోతాము" అన్నారు. అప్పుడు (వాస్తవం గ్రహించి) అందరూ సంతోషించారు. వారి స్థితి చూసి దైవప్రవక్త (సల్లం) చిరునవ్వు చిందించారు.[2]

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం-మగాజి, 56వ అధ్యాయం - గజ్వతిత్తాయిఫ్)**

---

(1) హునైన్ యుద్ధంలో ముస్లింలు పారిపోతున్నప్పుడు దైవప్రవక్త (సల్లం) తమ స్థానంలో స్థిరంగా నిలబడ్డారు. ఆ సమయంలో ఆయన వెంట నలుగురు అనుచరులు ఉన్నారు. వారిలో ముగ్గురు బనీ హాషిం వంశానికి చెందినవారు, కాగా ఒకరు వేరే వంశానికి చెందినవారు. హజ్రత్ అలీ (రజి) , హజ్రత్ అబ్బాస్ (రజి) దైవప్రవక్త (సల్లం) కు కొంచెం ముందున్నారు. హజ్రత్ అబూ సుఫ్యాన్ బిన్ హారిస్ (రజి) కంచర గాడిద పగ్గం పట్టుకొని ఉన్నారు. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) ఒకరి పక్కన ఉన్నారు. (సంకలనకర్త).

(2) దైవప్రవక్త (సల్లం) చిరునవ్వు చిందించడానికి కారణం ఆయన యుద్ధం విరమించి వెళ్ళిపోదాం అంటే అనుచరులు తమ అభ్యంతరాన్ని వెలిబుచ్చారు. యుద్ధం కొనసాగిద్దామన్నారు. కాని మరునాడు యుద్ధంలో గాయపడటంతో, యుద్ధం విరమించి వెళ్ళిపోదామనగానే అందుకు సమ్మతించారు. దైవప్రవక్త (సల్లం) అభిప్రాయమే వారికి నచ్చింది. కోటను జయించకుండానే వెళ్ళిపోవడానికి దైవప్రవక్త (సల్లం) తీసుకున్న నిర్ణయానికి కారణం తాయఫ్ వాసులు ముందుగానే పూర్తి ఏర్పాట్లు చేసుకోవడమే. వారు ఒక సంవత్సరానికి సరిపడా ఆహారం, ఆయుధాలు తదితర సామగ్రిని సేకరించుకున్నారు. ఔతాస్ యుద్ధంలో ఓటమి చవిచూడటం వల్ల వారు తాయఫ్ లోనే తమ కోటలో ఉండిపోయారు. అంచేత వారిపై ముస్లింలు విజయం సాధించలేకపోయారు. ఈ కారణాల వల్లనే దైవప్రవక్త (సల్లం) యుద్ధం విరమించి వెళ్లిపోవాలని నిర్ణయించారు. (సంకలన కర్త).

## 32వ అధ్యాయం - కాబా గృహం నుండి విగ్రహాల తొలగింపు

1166. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం:- (మక్కా జయించబడిన తరువాత) దైవప్రవక్త (సల్లం) మక్కా పట్టణంలో ప్రవేశించారు. కాబా నలువైపులా 360 విగ్రహాలు ప్రతిష్ఠించబడి ఉన్నాయి. దైవప్రవక్త (సల్లం) తన చేతిలోని బెత్తంతో ఒక్కొక్క విగ్రహాన్ని చరుస్తూ "సత్యం వచ్చింది. అసత్యం అంతమయ్యింది. అసత్యం అంతమయ్యేదే (ఖుర్ఆన్-17:81)" అని పఠిస్తూపోయారు.

(సహీహ్ బుఖారీ:- 46వ ప్రకరణం - మజాలిమ్, 32వ అధ్యాయం - హల్ తుక్సరుద్దినా నుల్లతీ ఫీహా ఖమ్ర్)

## 34వ అధ్యాయం - హుదైబియా ఒప్పందం

1167. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) హుదైబియా వారితో ఒప్పందం కుదుర్చుకున్న సందర్భంలో హజ్రత్ అలీ (రజి) ఉభయపక్షాల తరపున ఒక దస్తావీజు రాశారు. అందులో ఆయన "దైవప్రవక్త ముహమ్మద్ (సల్లం)" అని రాశారు. దానిపై బహుదైవారాధకులు అభ్యంతరం తెలుపుతూ "దైవప్రవక్త ముహమ్మద్ (సల్లం) అని రాయకండి. మేము ఈయన్ని దైవప్రవక్త అని ఒప్పుకుంటే ఇక మీతో పోరాడవలసిన అవసరం ఏమిటి?" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) హజ్రత్ అలీ (రజి)తో "సరే దాన్ని కొట్టివేయి" అని అన్నారు. కాని హజ్రత్ అలీ (రజి) (అందుకు నిరాకరిస్తూ) "నేను దీన్ని కొట్టివేయలేను" అని అన్నారు. అప్పుడు స్వయంగా దైవప్రవక్తే (సల్లం) ఆ పదాన్ని తన చేత్తో కొట్టివేశారు. ఆ ఒప్పందంలో "వచ్చే యేడు మీరు, మీ అనుచరులు మక్కాలో మూడు రోజులు మాత్రమే ఉంటారు. ఆయుధాలు 'జులుబ్బాన్'లోనే ఉంచి మక్కాలో ప్రవేశిస్తారు" అని అవిశ్వాసులు షరతు పెట్టారు.

"జులుబ్బాన్" అంటే ఏమిటీ? అని అడిగారు కొందరు ఉల్లేఖకుడ్ని. "జులుబ్బాన్ అంటే వరలు, అందులోని వస్తువులు" అని సమాధానమిచ్చారు హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి).

(సహీహ్ బుఖారీ:- 53వ ప్రకరణం-సులహ్, 6వ అధ్యాయం - కైఫ యక్తుబు హాజా మాసాలహ ఫులాన్ బిన్ ఫులాన్)

1168. హజ్రత్ అబూ వాయిల్ (రహ్మాలై) కథనం:- మేము 'సిఫ్ఫీన్' (హజ్రత్ అలి (రజి), - హజ్రత్ ముఆవియా (రజి)ల మధ్య యుద్ధం జరిగిన ప్రదేశం)లో ఉన్నాము. అప్పుడు హజ్రత్ సహెల్ బిన్ హనీఫ్ (రజి) నిలబడి ఇలా అన్నారు: "ప్రజలారా! మీరు చేసిన పొరపాటేమిటో కాస్త ఆత్మ పరిశీలన చేసుకోండి. హుదైబియా ఒప్పందం జరిగినప్పుడు మేము దైవప్రవక్త (సల్లం) వెంట ఉన్నాము. మేము పోరాడదలచుకుంటే అప్పుడు యుద్ధం జరిగేదే (కాని యుద్ధానికి బదులు రాజీ ఒప్పందం జరిగింది). ఆ సమయంలో హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) వచ్చి - 'దైవప్రవక్తా! సత్యం మన వైపు లేదా? వారి (బహుదైవారాధకుల) వైపు అసత్యం లేదా'? అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) 'ఎందుకు లేదూ?' అన్నారు. 'మన హతులు స్వర్గానికి, వారి హతులు నరకానికి పోతారన్న విషయం వాస్తవం కాదా?' అని అడిగారు హజ్రత్ ఉమర్ (రజి) మళ్ళీ. 'ఎందుక్కాదూ?' అన్నారు దైవప్రవక్త (సల్లం). "మరయితే మన ధర్మానికి జరుగుతున్న ఈ అవమానాన్ని ఎందుకు సహించాలి? మనకూ-వారికి మధ్య దేవుడు ఇంకా (జయాపజయాలను గురించిన) నిర్ణయం తీసుకోక ముందే మనం వచ్చిన దారినే

వెళ్ళిపోవాల్సిందేనా?" అని అడిగారు హజ్రత్ ఉమర్ (రజి). దానికి దైవప్రవక్త (సల్లం) 'ఖత్తాబ్ పుత్రుడా! నేను నిస్సందేహంగా దైవప్రవక్తనే, దేవుడు నన్ను ఎన్నటికీ అప్రతిష్ఠ పాల్జేయడు' అని అన్నారు. హజ్రత్ ఉమర్ (రజి) ఈ మాట విని హజ్రత్ అబూబకర్ (రజి) దగ్గరకు వెళ్ళారు. ఆయన దగ్గర కూడా అలాగే మాట్లాడారు. దానికి హజ్రత్ అబూబకర్ (రజి) కూడా, ఆయన నిస్సందేహంగా దైవప్రవక్తేనని, ఆయన్ని దేవుడు ఎన్నటికీ అప్రతిష్ఠ పాల్జేయడని అన్నారు. ఆ సందర్భంలో 'ఫతహ్ సూరా' అవతరించింది. దైవప్రవక్త (సల్లం) దాన్ని మొదలు నుంచి చివరి దాకా హజ్రత్ ఉమర్ (రజి)కు విన్పించారు. హజ్రత్ ఉమర్ (రజి) అది విని "దైవప్రవక్తా! ఈ ఒప్పందం (మన పాలిట) విజయమా?" అని అడిగారు. దైవప్రవక్త (సల్లం) ఔనన్నారు.★

(సహీహ్ బుఖారీ:- 58వ ప్రకరణం - జిజ్యా, 18వ అధ్యాయం - హద్దసనా అబ్దాన్)

## 37వ అధ్యాయం - ఉహుద్ యుద్ధం

1169. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం:- ఉహుద్ యుద్ధంలో దైవప్రవక్త (సల్లం) గాయపడిన విషయం గురించి అడిగిన ప్రశ్నకు హజ్రత్ సహెల్ (రజి) ఇలా సమాధానమిచ్చారు - దైవప్రవక్త (సల్లం) ముఖారవిందం గాయపడింది. ఆయన ముందరి పన్నొకటి విరిగిపోయింది. శిరస్త్రాణం విరిగి శిరస్సులో దిగబడింది. హజ్రత్ ఫాతిమా (రజి) ఈ పరిస్థితి చూసి రక్తం కడిగివేయడానికి ప్రయత్నించారు. హజ్రత్ అలీ (రజి) నీరు పోయసాగారు. కాని ఎంత కడిగినా రక్త ప్రవాహం ఆగకపోగా అది మరింత ఎక్కువ కావడంతో హజ్రత్ ఫాతిమా (రజి) ఒక చాప ముక్క కాల్చి దాని బూడిదను గాయానికి పూసారు. దాంతో రక్తస్రావం ఆగిపోయింది.

(సహీహ్ బుఖరీ:- 56వ ప్రకరణం-జిహాద్, 85వ అధ్యాయం - లుబ్సిల్ బైజా)

1170. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) (గత ప్రవక్తల్లో) ఒక ప్రవక్తకు సంబంధించిన సంఘటనను వివరిస్తున్నప్పుడు కూడా నేనాయన్ని చూశాను. ఆ ప్రవక్తను ఆయన జాతి ప్రజలు రక్తం కారేలా తీవ్రంగా కొట్టారు. అయినప్పటికీ ఆ ప్రవక్త ముఖంమీ్మది రక్తం తుడుచుకుంటూ, "దేవా! నా జాతి ప్రజలను క్షమించు, వీరు తెలీక ఇలా చేస్తున్నారు" అని ప్రార్థించారు.

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 54వ అధ్యాయం - హద్దసనా అబుల్ యమాన్)

## 38వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) చేత వధించబడిన దౌర్భాగ్యుడిపై దైవాగ్రహం

1171. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- తన ప్రవక్త పట్ల ఇలా ప్రవర్తించిన జాతిపై దేవుని ఆగ్రహం

---

★ ఆ సందర్భంలోనే ఫతహ్ సూరా అవతరించింది. దైవ ప్రవక్త (సల్లం) హుదైబియా ఒప్పందాన్ని విజయంగా పరిగణించారు. దారుణమైన షరతులతో కూడిన హుదైబియా ఒప్పందం విజయం ఎలా అవుతుందో అనుచరులకు అప్పుడు అర్థం కాలేదు. అయితే ఆ తరువాత జరిగిన సంఘటనలు నిజానికి ఈ ఒప్పందమే ముస్లింల పాలిట గొప్ప విజయమని రుజువయింది. హజ్రత్ సహెల్ బిన్ హనీఫ్ (రజి) సఫీన్ యుద్ధ సమయంలో హుదైబియా ఒప్పందాన్ని దృష్టిలో పెట్టుకొని ఇప్పుడు మనం యుద్ధం కొనసాగించడానికి బదులు ఎలాంటి షరతులతోనైనా సరే ఒప్పందం చేసుకోవడమే మంచిదని (తమ సహచరులకు) సలహా ఇచ్చారు.

(సంకలన కర్త).

విరుచుకుపడిందని దైవప్రవక్త (సల్లం) అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ విషయం తెలియజేస్తూ తమ (విరిగిన) పంటి వైపు సూచించారు. దైవప్రవక్త (సల్లం) దేవుని మార్గంలో పోరాడుతుండగా ఆయన చేత వధించబడిన దౌర్భాగ్యుడిపై దైవాగ్రహం విరుచుకుపడింది.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 24వ అధ్యాయం - మా అసాబన్నబియ్య, మినల్ జిరాహి యౌమ ఉహుద్)

## 39వ అధ్యాయం - బహుదైవారాధకులు, కపటుల వల్ల దైవప్రవక్త (సల్లం)కు కలిగిన కష్టాలు

1172. హజ్రత్ అబ్దుల్లాబిన్ మస్వూద్ (రజి)కథనం:- దైవప్రవక్త (సల్లం) కాబా గృహానికి దగ్గరలో నమాజు చేస్తున్నారు. అంతలో అక్కడ కూర్చున్న అబూజహల్, అతని మిత్రమూక పరస్పరం మాట్లాడుకుంటూ వారిలో ఒకడు ఇలా అన్నాడు - "ఫలానా తెగ వాడలో ఒంటె ప్రేగులు పడి ఉన్నాయి. వాటిని తెచ్చి ముహమ్మద్ (సల్లం) సజ్దా (సాష్టాంగ ప్రణామం) చేస్తున్నప్పుడు ఆయన వీపు మీద పెట్టాలి. ఈ పని చేసే వారు మీలోఎవరైనా ఉన్నారా?" అప్పుడు వారందరిలో ఉఖ్బా బిన్ అబీ ముయీత్ అనే పరమ దౌర్భాగ్యుడు లేచాడు. అతను వెళ్ళి ఆ ప్రేగుల్ని తెచ్చి సమయం కోసం ఎదురు చూడసాగాడు. చివరికి దైవప్రవక్త (సల్లం) సజ్దా స్థితిలోకి పోగానే ఆ దుర్మార్గుడు ఆ ప్రేగుల్ని ఆయన భుజాల మధ్య వీపు మీద పెట్టాడు.

నేనప్పుడు ఇదంతా కళ్ళప్పగించి చూస్తూ ఉండటం తప్ప ఏమీ చేయలేకపోయాను. నాకే గనక శక్తి ఉంటే నేనా దుర్మార్గుడ్ని అడ్డుకునేవాడ్ని.★ వారీ పైశాచిక చర్యకు పాల్పడటమే గాకుండా వెకిలి నవ్వులు కూడా నవ్వడం మొదలెట్టారు. సంతోషం పట్టలేక ఒకళ్ళ మీద ఒకళ్ళు పడుతూ నవ్వుకోసాగారు. దైవప్రవక్త (సల్లం) (వీపు మీదున్న ఒంటె ప్రేగుల బరువు వల్ల) సజ్దా స్థితిలోనే పడి ఉన్నారు. తల పైకెత్తలేక పోయారు. చివరికి హజ్రత్ ఫాతిమా (రజి) వచ్చి చూసి, ఈ భారాన్ని ఆయన వీపుపై నుంచి తొలగించి వేశారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) సజ్దా నుండి తలపైకెత్తి "దేవా! ఖురైషీయులకు తగిన శిక్ష విధించు" అని శపించారు.

దైవప్రవక్త (సల్లం) పెట్టిన శాపం విని వారు బెంబేలెత్తిపోయారు. 'ఈ నగరంలో (మక్కాలో) ఏ ప్రార్థన చేసినా అది తప్పక అంగీకరించబడుతుంది అని వాళ్ళు నమ్మేవారు' అని హజ్రత్ అబ్దుల్లా (రజి) చెప్పారు. ఆ తరువాత ఆయన (సల్లం) వారిలో ఒక్కొక్కరి పేరు ప్రస్తావిస్తూ "దేవా! అబూజహల్‌ని శిక్షించు. ఉత్బాబిన్ రబియా, షైబాబిన్ రబియా, వలీద్ బిన్ ఉత్బా, ఉమయ్యా బిన్ ఖల్ఫ్, ఉఖ్బాబిన్ అబీముయీత్‌లను కూడా శిక్షించు" అని ప్రార్థించారు.

హజ్రత్ అబ్దుల్లాబిన్ మస్వూద్ (రజి) ఏడవ వ్యక్తి పేరును కూడా ప్రస్తావించారు. కాని హదీసు ఉల్లేఖకునికి ఏడవ పేరు గుర్తులేదు. హజ్రత్ అబ్దుల్లాబిన్ మస్వూద్ ఇలా అన్నారు: నా ప్రాణం ఎవరి

★ హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) హుజైల్ తెగకు చెందిన వ్యక్తి. అప్పుడు హుజైల్ తెగవాళ్ళు మక్కాలో లేరు. అందువల్ల ఆయన తన అశక్తతను వెలిబుచ్చుకోవలసి వచ్చింది. అదీగాక (మక్కాలో ఉన్న) తన మిత్ర పక్షం వాళ్లంతా బహుదైవారాధకులు. వాళ్ళను ఎదిరించే శక్తి తనలో లేదని భావించారు ఆయన. (సంకలన కర్త).

అధీనంలో ఉందో ఆ శక్తిమంతుని సాక్షి! దైవప్రవక్త (సల్లం) పేర్లెత్తి శపించిన వీరంతా బద్ర్ (యుద్ధంలో వధించబడి) గుంటలో బొక్క బోర్లా పడి ఉండటాన్ని నేను స్వయంగా చూశాను.

(సహీహ్ బుఖారీ:- 4వ ప్రకరణం - వుజూ, 69వ అధ్యాయం - ఇజా ఉల్ఖియ అలా జహ్రిల్ ముసల్లి ఖజరున్ అవ్ జీఫా...)

1173. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ "ఉహుద్ యుద్ధం కంటే కఠినమైన దినం మీకెప్పుడైనా ఎదురయిందా?" అని అడిగాను. దానికి దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు: "నేను నీ జాతి ప్రజల చేతిలో అనేక కష్టాలు అనుభవించాను. ఉఖ్బాదినం నా పాలిట అన్నిటికంటే ఎంతో కఠినమైన దినం. ఆ రోజు నేను (తాయిఫ్ నాయకుడయిన) ఇబ్నె అబ్ద్ యాలైల్ బిన్ అబ్ద్ కలాల్[1] దగ్గరకు వెళ్ళి మాట్లాడాను. అతను నా మాటలు ఒప్పుకోవడానికి నిరాకరించాడు. దాంతో నేను తీవ్రంగా బాధపడుతూ దారీ తెన్నూ లేకుండా నడిచాను. ఖర్న్‌సాలిబ్ (ప్రాంతం)[2]లో ప్రవేశించిన తరువాతగాని నేనెక్కడున్నానో నాకు అర్థం కాలేదు.

అప్పుడు నేను తలపైకెత్తి చూస్తే ఒక మబ్బు తునక నా మీద నీడ పట్టి ఉంది. కాస్త జాగ్రత్తగా పరికించి చూస్తే ఆ మబ్బు తునక మధ్య హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) కన్పించారు. ఆయన నన్ను సంబోధిస్తూ 'నిస్సందేహంగా దేవుడు మీ జాతి ప్రజలు పలికిన మాటలు, వారు మీకిచ్చిన సమాధానం విన్నాడు. దేవుడు మీ దగ్గరకు పర్వత నిర్వహణ దూతను పంపాడు. మీ జాతి ప్రజల విషయంలో మీరు ఏం చేయదలచుకున్నారో ఈ దైవదూతను ఆజ్ఞాపించండి' అని అన్నారు. ఆ తరువాత నాకు పర్వత నిర్వహణ దూత పలుకులు విన్పించాయి. అతను నాకు సలాం చేసి "ముహమ్మద్! ఇప్పుడు వ్యవహారం మీ ఇష్టాయిష్టాలపై ఆధారపడి ఉంది. మీరు ఆజ్ఞాపిస్తే, నేను మక్కాకు రెండువైపులా ఉన్న (అబూఖబీస్, ఖయీఖాన్) కొండలను కలిపేసి వారిని నలిపేస్తాను" అని అన్నాడు. అందుకు నేను నిరాకరిస్తూ "వద్దు. వీరి సంతానంలోనయినా అల్లాహ్‌కు ఎవరినీ సాటి కల్పించకుండా ఆ ఒక్క దేవుడ్ని మాత్రమే ఆరాధించేవారు పుట్టవచ్చని నేను ఆశిస్తున్నాను అని అన్నాను."

(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం- బదియిల్ ఖల్ఖ్, 7వ అధ్యాయం- ఇజాఖాల అహదుకుమ్ ఆమీన్ వల్ మలాయికతు ఫిస్సమా)

1174. హజ్రత్ జున్దుబ్ బిన్ సుఫ్యాన్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఒక యుద్ధంలో పాల్గొన్నారు. ఆ యుద్ధంలో ఆయన వ్రేలుకు గాయమయి అందులో నుంచి రక్తం కారసాగింది. అప్పుడు ఆయన (దాన్ని సంబోధిస్తూ) "నువ్వొక వ్రేలివి మాత్రమే. దైవమార్గంలో గాయపడి రక్తసిక్తమయిన వ్రేలివి. నీకు కలిగిన ఇదంతా (బాధంతా) దైవమార్గంలోనే సుమా!" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 9వ అధ్యాయం - మఁయ్యున్కబు ఫీసబీలిల్లాహ్)

---

(1) దైవ ప్రవక్త (సల్లం) తాయఫ్ ప్రజల నాయకుల్లో ఒకడైన ఇబ్నె అబ్ద్ యాలైల్ బిన్ అబ్ద్ కలాల్‌కు దైవ సందేశం అందజేసినప్పుడు అతను దాన్ని స్వీకరించడానికి నిరాకరించాడు. ఆ తరువాత దైవ ప్రవక్త (సల్లం) తనకు మద్దతు నిచ్చి రక్షణ కల్పించమని అడిగితే దాన్ని కూడా అతను త్రోసి పుచ్చాడు. వివరాలు సీరత్ గ్రంథాల్లో ఉన్నాయి. (అనువాదకుడు)

(2) ఈ ప్రాంతాన్ని ఖర్నిల్ మనాజిల్ అని కూడా అంటారు. నజద్ (ప్రాంతం) ప్రజలు ఇక్కడ్నుంచే హజ్ దీక్ష పూని మక్కా వెళ్తారు. మక్కా నుండి ఈ ప్రాంతం ఒక రాత్రంతా ఒంటె మీద ప్రయాణం చేసినంత దూరం ఉంటుంది. (అనువాదకుడు)

1175. హజ్రత్ జున్దుబ్ బిన్ సుఫ్యాన్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) వ్యాధిగ్రస్తులయి రెండు మూడు రాత్రులు (తహజ్జుద్ నమాజు కోసం) లేవలేకపోయారు. అప్పుడు ఒక స్త్రీ (అబూసుఫ్యాన్ సోదరి, అబూలహబ్ భార్య ఔరాబిన్తె హరబ్) వచ్చి "ముహమ్మద్! నీకు పట్టిన దయ్యం నిన్ను వదలి పెట్టిందనుకుంటా. అందుకే అది రెండు మూడు రోజుల నుండి నీ దగ్గరకు రావడం లేదు" అని అన్నది. ఆ సందర్భంలో దేవుడు ఈ సూక్తుల్ని అవతరింపజేశాడు -

"ప్రకాశవంతమైన పగటి సాక్షి! చీకటి ఆవరించే రాత్రి సాక్షి! (ప్రవక్తా!) నీ ప్రభువు నిన్ను వదలి పెట్టలేదు, నీ మీద కినుక కూడా వహించలేదు". (93:1-3)

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 93వ సూర-వజ్జుహా, 1వ అధ్యాయం - హద్దసనా అహ్మద్ బిన్ యూనుస్)**

## 40వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) ధర్మ ప్రచారం - కపట విశ్వాసుల ఆగడాలు

1176. హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఒక గాడిద మీద ఎక్కారు. ఆ గాడిద మీద జీను ఉంది. దాని క్రింద ఫిదక్‌లో తయారయిన ఒక దుప్పటి పరచబడి ఉంది. ఆ గాడిదపై దైవప్రవక్త (సల్లం) వెనుక నేను కూర్చున్నాను. దైవప్రవక్త(సల్లం) సాద్ బిన్ ఉబాదా (రజి)ను పరామర్శించడానికి బనీ హారిస్ బిన్ ఖజ్రజ్ - వాడకు బయలుదేరారు - ఇది బద్ర్ యుద్ధానికి పూర్వం జరిగిన సంఘటన - దారిలో ఆయనకు ఒక సమూహం ఎదురయింది. ఆ సమూహంలో ముస్లింలు, కపట విశ్వాసులు, యూదులు కలసి కూర్చొని ఉన్నారు. అక్కడ కపటాగ్రేసరుడు అబ్దుల్లాబిన్ ఉబై బిన్ సలూల్ కూడా ఉన్నాడు. అబ్దుల్లా బిన్ రవాహ (రజి) కూడా ఉన్నారు. గాడిద కాళ్ళ క్రింది నుండి లేచిన దుమ్ము వారి మీద పడగానే అబ్దుల్లా బిన్ ఉబై తన ముక్కు మీద బట్ట కప్పుకుంటూ "మా పైకి దుమ్ము లేపకండి" అని అన్నాడు.

దైవప్రవక్త (సల్లం) సభికులకు సలాం చేశారు. ఆయన ఆగి గాడిద మీద నుండి క్రిందికి దిగి వారిని ఇస్లాం వైపుకు పిలిచారు. దివ్య ఖుర్‌ఆన్ పఠించి విన్పించారు. అప్పుడు అబ్దుల్లా బిన్ ఉబై (ముఖం చిట్లించుకుంటూ) ఇలా అన్నాడు - "మీ మాటలు చాలా బాగున్నాయి. కాని అందులో సత్యం ఉన్నప్పటికీ మీరు మా సభలకు వచ్చి మమ్మల్ని బాధపెట్టకండి. (దయచేసి) మీరు మీ ఇంటికి వెళ్ళిపోండి. మాలో ఎవరైనా మీ దగ్గరికి వస్తే అప్పుడతనికి మీ మాటలు విన్పించండి".

హజ్రత్ ఇబ్నె రవాహ (రజి) (అతని వాగుడు విని) "దైవప్రవక్తా! మీరు తప్పకుండా మా సమావేశాలకు వచ్చి మాకీ హితోక్తులు విన్పిస్తూ ఉండండి. ఇవంటే మాకెంతో ఇష్టం" అని అన్నారు. దీనిపై ముస్లింలు, కపటులు, యూదుల మధ్య మాటామాటా పెరిగింది. పరస్పరం దూషణలకు పాల్పడ్డారు. చివరికి ఒకర్నొకరు కొట్టుకోవడానిక్కూడా సిద్ధమయ్యారు. దైవప్రవక్త (సల్లం) జోక్యం చేసుకొని వారిని శాంత పరచడానికి కృషి చేశారు. ఆ తరువాత ఆయన గాడిద నెక్కి సాద్ బిన్ ఉబాదా (రజి) ఇంటికి వెళ్ళారు. ఆయనతో "సాద్! ఈ రోజు అబూ హుబాద్ (అంటే అబ్దుల్లా బిన్ ఉబై) ఏమన్నాడో విన్నావా? అతను ఈ ఈ మాటలు అన్నాడు" అని అన్నారు దైవప్రవక్త (సల్లం). దానికి హజ్రత్ సాద్ (రజి) ఇలా అన్నారు:

"దైవప్రవక్తా! అతడ్ని క్షమించి వదలి పెట్టండి. దైవసాక్షి! దేవుడు మీకు ప్రసాదించిన భాగ్యమే భాగ్యం. అంతటి అదృష్టం మరెవరికి లభిస్తుంది. అసలు విషయమేమిటంటే ఈ పట్టణ ప్రజలు అతడ్ని సర్దారుగా చేసికొని అతనికి కిరీటం ధరింపజేయాలని నిర్ణయించుకున్నారు. కాని దేవుడు ఈ నిర్ణయాన్ని మీకివ్వబడిన సత్యం ద్వారా రద్దు చేశాడు. దాంతో అతను మీ మీద కక్ష, ద్వేషం పెంచుకున్నాడు. ఈ రోజు మీ ముందల అతను వాగిన వాగుడంతా ఆ కసి, ద్వేషాల ఫలితమే. అందుచేత మీరతడ్ని క్షమించండి".

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం- ఇస్తి అజాన్, 20వ అధ్యాయం - అత్తస్లీమి ఫీమజ్లిసిన్ ఫీహి అఖ్లాతున్ మినల్ ముస్లిమీన్ వల్ ముష్రికీన్)

1177. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- కొందరు దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ "మీరు అబ్దుల్లా బిన్ ఉబై దగ్గరికెళ్ళి అతనికి ఇస్లాం సందేశం అందజేస్తే బాగుంటుంది" అని సలహా ఇచ్చారు. వారి సలహా ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఓ రోజు అతని దగ్గరికి వెళ్ళడానికి బయలుదేరారు. ఆయన వెంట ఆయన అనుచరులు కూడా ఉన్నారు. దైవప్రవక్త (సల్లం) గాడిద మీద బయలుదేరారు. ఆయన అనుచరులు కాలినడకన ఆయన్ని అనుసరించారు. వారు నడుస్తున్న దారి బంజరు నేల (దుమ్ము ధూళితో నిండి ఉన్న మార్గం). దైవప్రవక్త (సల్లం) (ఆ దుమ్ము నేలపై నడచి) అబ్దుల్లా బిన్ ఉబై దగ్గరకు చేరుకున్నారు. కాని ఆ దౌర్భాగ్యుడు (లోలోన మండిపోతూ) "కాస్త దూరంగా ఉండండి. మీ గాడిద నుండి వెలువడుతున్న దుర్వాసనను నేను భరించలేకపోతున్నాను" అని అన్నాడు. అన్సార్ వర్గానికి చెందిన ఒక ముస్లిం ఈ మాటలు విని "దైవసాక్షి! దైవప్రవక్త గాడిద నుండి వెలువడుతున్న వాసన నీ (వంటి) కంపు కంటే ఎంతో ఇంపయినది" అని అన్నాడు. దానిపై అబ్దుల్లా బిన్ ఉబై అనుచరుల్లో ఒకతనికి కోపం ముంచుకొచ్చింది. వారిద్దరూ పరస్పరం దూషించుకోవడం ప్రారంభించారు. ఆ తరువాత వారిద్దరిలో ప్రతి ఒక్కరి తరఫున వారి వారి స్నేహితులు పరస్పరం కొట్లాటకు దిగారు. కర్ర దెబ్బలు, ముష్టిఘాతాలు, చెప్పు దెబ్బలతో వాతావరణం రణరంగంగా మారిపోయింది.

హజ్రత్ అనస్ (రజి) కథనం:- ఆ తరువాత మాకు ఈ సూక్తి అవతరించినట్లు తెలిసింది - "విశ్వాసులలో రెండు వర్గాలు పరస్పరం పోట్లాడుకుంటే వారి మధ్య రాజీ కుదర్చండి" (అల్‌హుజరాత్:9). ఈ సూక్తి వీరి విషయంలోనే అవతరించింది.

(సహీహ్ బుఖారీ:- 53వ ప్రకరణం - సులహ్, 1వ అధ్యాయం - మాజాఅ ఫిల్ ఇస్లాహి బైనన్నాస్)

## 41వ అధ్యాయం - అబూ జహల్ వధ

1178. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) బదర్ (యుద్ధ) దినాన "అబూజహల్ పర్యవసానం ఏమయిందో ఎవరు చూసి వస్తారు" అని అడిగారు. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) ఈ మాట విని వెళ్ళారు. వెళ్ళి చూస్తే, అబూజహల్‌ని అఫ్రా కొడుకులు వధించారు. అతను కొన ఊపిరితో కొట్టుమిట్టాడుతున్నాడు. హజ్రత్ అబ్దుల్లా (రజి) అతని గడ్డం పట్టుకొని "అబూజహల్ నువ్వేనా?" అని అడిగారు. దానికతను (ఇంకా నీల్గుతూ) "ఇతను గాక ఇంకెవరైనా ఉన్నారా, ఇతని

జాతి వాళ్ళే ఇతడ్ని హతమార్చగల సమర్థులు" అని అన్నాడు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం- మగాజీ, 8వ అధ్యాయం - ఖతలి అబీజహల్)

## 42వ అధ్యాయం - యూద నాయకుడు కాబ్ బిన్ అష్రఫ్ వధ

1179. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) తమ అనుచరుల్ని ఉద్దేశించి "కాబ్ బిన్ అష్రఫ్ దేవుడ్ని, ఆయన ప్రవక్తను చాలా వేధించాడు. అలాంటి కాబ్‌ను తుదముట్టించే వారెవరైనా ఉన్నారా?" అని అన్నారు. ముహమ్మద్ బిన్ ముస్లమా (రజి) లేచి "దైవప్రవక్తా! మీరు ఒప్పుకుంటే నేనతడ్ని హతమార్చుతాను" అని అన్నారు. "సరే అలాగే చెయ్యి" అన్నారు దైవప్రవక్త (సల్లం). "అయితే అవకాశాన్ని బట్టి ఏదైనా అతనితో మాట్లాడటానికి కూడా నాకు అనుమతి ఇవ్వండి" అన్నారు ముహమ్మద్ బిన్ ముస్లమా (రజి). "అలాగే అనుమతినిస్తున్నాను. నీవు అవసరమనుకున్న విధంగా అతనితో మాట్లాడవచ్చు" అన్నారు దైవప్రవక్త (సల్లం).

ఆ తరువాత ముహమ్మద్ బిన్ ముస్లమా (రజి), కాబ్ బిన్ అష్రఫ్ దగ్గరకు వెళ్ళి ఇలా అన్నారు: "నిజం చెప్పాలంటే అతను (అంటే దైవప్రవక్త) మా నుండి జకాత్, వగైరా ధనం అడుగుతున్నారు. ఈ విధంగా అతను (నిధుల కోసం) మమ్మ్మ వేధిస్తున్నాడు. నేను (అతని పోరు పడలేకనే ఇప్పుడు) నీ దగ్గరకు అప్పు అడగటానికి వచ్చాను". కాబ్ ఈ మాట విని "అప్పుడే ఏమయింది! మున్ముందు ఇతను మిమ్మల్ని మరిన్ని కష్టాలలో పడవేస్తాడు" అని అన్నాడు. "మేము అతనికి విధేయత చూపడానికి ఒప్పుకున్నాం. అందువల్ల అతనికి జరిగే పర్యవసానం చూడక ముందే మేము అతడ్ని వదలివేయడం బాగుండదు. అందుచేత ప్రస్తుతం నీవు ఒకటి రెండు వసఖ్‌ల (బరువు) ఖర్జూరం మాకు అప్పుగా ఇచ్చెయ్యి" అన్నారు ముహమ్మద్ బిన్ ముస్లమా (రజి). "సరే అలాగే ఇస్తాను. దాని కోసం నా దగ్గర ఏదైనా వస్తువు తాకట్టు పెట్టు" అన్నాడు కాబ్. " ఏం తాకట్టు పెట్టాలి?" అడిగారు హజ్రత్ ఇబ్నె ముస్లమా (రజి). "మీ భార్యలను కుదువబెట్టండి" అన్నాడు కాబ్. "మేము మా భార్యలను నీ వద్ద ఎలా కుదువబెట్టగలం? నువ్వు చూస్తే యావత్తు అరబ్బుల్లోనే చాలా అందగాడివి" అన్నారు ఇబ్నె ముస్లమా (రజి). "అయితే మీ కొడుకుల్ని కుదువబెట్టండి" అన్నాడు కాబ్. "మా కొడుకుల్ని అయినా నీ దగ్గర ఎలా తాకట్టు పెట్టగలం? ఒకటి రెండు వసఖ్‌లకు బదులుగా వీరు కుదువ బెట్టబడిన వారని రేపు జనం మా కొడుకుల్ని ఎత్తి పొడవరా?! ఇది మా జాతికే ఎంతో సిగ్గుచేటయిన విషయం. వీరికి బదులు మేము మా ఆయుధాలను కుదువబెడ్తాము" అన్నారు ఇబ్నె ముస్లమా. (చివరికి ఇలా ఒప్పందం కుదిరింది).

ఈ సంభాషణ జరిగిన తరువాత హజ్రత్ ఇబ్నె ముస్లమా (రజి) త్వరలోనే మళ్ళీ వస్తానని చెప్పి వెళ్ళిపోయారు. ఆయన తిరిగి అదే రోజు రాత్రి కాబ్ దగ్గరికి వచ్చారు. ఆయనతో పాటు కాబ్‌కు క్షీర సంబంధ సోదరుడయిన హజ్రత్ అబూ నాయిలా (రజి) కూడా ఉన్నారు. కాబ్ కోటలోపల నుండే వాళ్ళిద్దర్ని చూసి లోపలికి పిలిచాడు. స్వయంగా అతనే వారిద్దర్ని తీసుకోవడానికి మేడ దిగబోతుంటే అతని భార్య వచ్చి "ఈ (చీకటి) వేళ మీరెక్కడికి వెళ్తున్నారు?" అని అడిగింది. "కంగారుపడకు, వీరిలో

ఒకరు నా స్నేహితుడు ఇబ్నె ముస్లమా, మరొకరు నా క్షీర సంబంధ సోదరుడు అబూ నాయిలే కదా! పరాయివారు కారు" అన్నాడు కాబ్. "కాని నాకతని కంఠస్వరం నుండి నెత్తురు ఓడుతున్నట్లు అన్పిస్తుంది" అన్నది అతని భార్య. "ఏమీ కాదు (అనవసరంగా ఆందోళన పడకు) (నా స్నేహితుడు) ముహమ్మద్ బిన్ ముస్లమా, నా క్షీర సంబంధ సోదరుడు అబూనాయిలాలే కదా! అదీగాక గౌరవ నీయుడయిన వ్యక్తిని ఎవరైనా బరిసె యుద్ధం కోసం రాత్రివేళ పిలిచినా అతని పిలుపును అందుకుంటాడు" అన్నాడు కాబ్.

హదీసు ఉల్లేఖకుని కథనం ప్రకారం హజ్రత్ ముహమ్మద్ బిన్ ముస్లమా (రజి) తన వెంట ఇద్దరు వ్యక్తుల్ని పిలుచుకు వచ్చారు. ఆయన తన స్నేహితులతో ఇలా అన్నారు. "కాబ్ మన దగ్గరకు వచ్చినప్పుడు నేనతని శిరోజాల వాసన చూస్తాను. ఈ విధంగా నేను అతని శిరస్సును అదుపులోకి తీసుకుంటాను. దీన్ని గమనించగానే మీరు ముందుకు వచ్చి అతడ్ని వధించాలి" ముహమ్మద్ బిన్ ముస్లమా (రజి) మరొకసారి ఇలా అన్నారు వారిద్దరితో: "(ఆ సమయంలో) నేను, మీరు కూడా ఇతని శిరోజాల వాసన చూడండని అంటాను (అప్పుడు మీరు ముందుకు వచ్చి అతడ్ని అంత మొందించాలి)".

కాబ్ బిన్ అష్రఫ్ శాలువా కప్పుకొని మేడ దిగి వారి దగ్గరకు వచ్చాడు. అతను దగ్గరికి వస్తుంటే అతని శరీరం నుండి సుగంధ పరిమళం ఘాటుగా గుబాళించసాగింది. ముహమ్మద్ బిన్ ముస్లమా (రజి) అది చూసి "నేనింతవరకు ఇంత మంచి సువాసన ఆస్వాదించలేదు" అని అన్నారు. "నా దగ్గర యావత్తు అరేబియా స్త్రీలలో కెల్లా అందమైన స్త్రీ ఉంది. ఆమె ఎల్లప్పుడూ సుగంధ పరిమళంలోనే మునిగి ఉంటుంది" అన్నాడు కాబ్. "సరే! నేను కాస్త నీ శిరోజాల వాసన చూడనా?" అని అడిగారు హజ్రత్ ఇబ్నె ముస్లమా (రజి). "దాందేముంది చూడు" అన్నాడు కాబ్.

ముహమ్మద్ బిన్ ముస్లమా (రజి) మొదట తాను స్వయంగా అతని శిరోజాల వాసన చూశారు. తరువాత తన మిత్రులక్కూడా వాసన చూపించారు. ఆ తరువాత "మరోసారి వాసన చూడవచ్చా?" అని అన్నారు. "చూడండి" అన్నాడు కాబ్. ఈసారి ముహమ్మద్ బిన్ ముస్లమా (రజి) అతని (శిరోజాలు పట్టుకొని) శిరస్సును గట్టిగా తన అదుపులోకి తీసుకున్నారు. తరువాత తన మిత్రులతో "ఇక కానివ్వండి మీ పని" అన్నారు. వెంటనే వారిద్దరు (ముందుకు లంఘించి) అతడ్ని హతమార్చారు. ఆ తరువాత వీరు ముగ్గురూ దైవప్రవక్త (సల్లం) సన్నిధికి తిరిగి వచ్చి ఆయనకు ఈ విషయం తెలియజేశారు. ★

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం, మగాజి, 15వ అధ్యాయం - ఖత్లి కాబిబ్నిల్ అష్రఫ్)**

---

★ ఇమామ్ నవవీ (రహ్మాలై) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) కాబ్ బిన్ అష్రఫ్‌ని వధించమని ముహమ్మద్ బిన్ ముస్లమా (రజి)ను ఆదేశించారు. దానిక్కారణం కాబ్ బిన్ అష్రఫ్ ఒప్పందాన్ని ఉల్లంఘించడమే. మొదట్లో అతను దైవప్రవక్త (సల్లం) శత్రువులతో సహకరించనని వాగ్దానం చేశాడు. కాని ఆ తరువాత అతను మక్కా వెళ్ళి దైవప్రవక్త (సల్లం)కు, ముస్లింలకు వ్యతిరేకంగా అక్కడి బహుదైవారాధకుల్ని యుద్ధానికి పురిగొల్పాడు. వారి హతుల్ని గురించి శోకగేయాలు రచించి ప్రచారం చేశాడు. అక్కడ్నుంచి మదీనా వచ్చి ముస్లిం మహిళల్ని గురించి అశ్లీల పద్యాలు పాడటం మొదలెట్టాడు. పైగా దైవప్రవక్త (సల్లం)ను కించపరుస్తూ కవితలు వ్రాశాడు. కనుక ఈ హత్య ఒప్పందానికి వ్యతిరేకమైనదికాదు.

హజ్రత్ అలీ (రజి) సభలో ఒక వ్యక్తి 'కాబ్ బిన్ అష్రఫ్‌ని వధించడం విశ్వాస ఘాతుక చర్య' అని అన్నాడు. కాని అభయం ఇచ్చిన తరువాత చంపిస్తే అది విశ్వాస ఘాతుక చర్య అవుతుంది. విశ్వాస ఘాతుక చర్యకు స్వయంగా కాబ్ బిన్ అష్రఫే పాల్పడ్డాడు. దానికతను మరణశిక్ష అనుభవించాడు. అప్పటి పరిస్థితుల్ని బట్టి అతడ్ని ఆ విధంగా వధించవలసి వచ్చింది. ఈ హదీసుని బట్టి ఒక వ్యక్తికి ఓసారి ఇస్లాం సందేశం అందజేసిన తరువాత ఇక అతనికి మాటి మాటికీ ఇస్లాం సందేశం అందజేయనవసరం లేదని, ఒకవేళ ఆ వ్యక్తి విద్రోహ చర్యలకు పాల్పడితే అతడ్ని మోసం, పన్నాగాలతో వధించ వచ్చని కూడా తెలుస్తోంది.

## 43వ అధ్యాయం - ఖైబర్ యుద్ధం

1180. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఖైబర్‌పై దాడి చేయడానికి వెళ్ళినప్పుడు మేము (ఆయన వెంట వెళ్ళి) ఖైబర్ సమీపంలో ఒక చోట తెల్లవారు జామున ఫజ్ర్ నమాజు చేశాము. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) ఒంటెనెక్కి బయలుదేరారు. హజ్రత్ అబూ తల్హా (రజి) కూడా ఒంటెనెక్కారు. నేను ఆయన వెనుక (ఒంటెపై) కూర్చున్నాను. దైవప్రవక్త (సల్లం) ఖైబర్ వీధులగుండా నడుస్తుంటే నా మోకాలు ఆయన తొడకు తాకింది. ఆయన లుంగీ (గాలికి) తొడమీది నుంచి కాస్త పక్కకు తొలగింది. అప్పుడు ఆయన తొడ తెలుపుదనం నాకు కనపడసాగింది.

దైవప్రవక్త (సల్లం) ఖైబర్ పట్నంలో ప్రవేశించగానే "అల్లాహ్ అందరికంటే గొప్పవాడు. ఖైబర్ (ప్రజల)కు వినాశం దాపురించింది. (దైవప్రవక్తలుగా) మేమేదయినా జాతి ముంగిటకు వెళ్ళి దిగితే ఇక ఆ జాతి ప్రజలకు మూడినట్లే" అని అన్నారు. ఈ విధంగా ఆయన మూడుసార్లు అన్నారు. ఆ సమయంలో (యూద) ప్రజలు తమ దైనందిన కార్యకలాపాల్లో లీనమయి ఉన్నారు. వారు దైవప్రవక్తను, ఆయన సైన్యాన్ని హఠాత్తుగా చూసి "ముహమ్మద్ (సల్లం) వచ్చేశారు. ఆయన వెనుక సైన్యం ఉంది" అని అన్నారు (భయంతో గుండెలు బాదుకుంటూ). ఆ తరువాత మేము ఖడ్గశక్తితో ఖైబర్‌ని జయించాము.

**(సహీహ్ బుఖారీ:- 8వ ప్రకరణం- సలాత్, 12వ అధ్యాయం - మా యుజ్కరు ఫిల్ ఫఖిజి)**

1181. హజ్రత్ సలమా బిన్ అక్వాయి (రజి) కథనం:- మేము దైవ ప్రవక్త (సల్లం) వెంట ఖైబర్ మీద దాడి చేయడానికి రాత్రి వేళ బయలుదేరాము. దారిలో ఒకతను ఆమిర్ (రజి)తో మాట్లాడుతూ "ఆమిర్! నీవు మాకు నీ కవితలు విన్పించవా?" అని అడిగాడు - ఆమిర్ బిన్ అక్వాయి (హజ్రత్ సలమా సోదరుడు) గొప్ప కవి - హజ్రత్ ఆమిర్ (రజి) ఈ మాట విని క్రిందికి దిగి ఈ కవితలు విన్పించారు:

ఓ మా ప్రభూ! నీ కటాక్షమే గనక లేకుంటే మేము సన్మార్గం పొందగలిగేవాళ్ళము కాము. నమాజు, దానధర్మాలు కూడా చేసేవాళ్ళము కాము. మా ప్రాణాలు నీకే సమర్పితం. జీవితంలో మా వల్ల జరిగిన పొరపాట్లను క్షమించు. శత్రువులతో పోరాడుతున్నప్పుడు మాకు స్థయిర్యం, స్థిరత్వాలు ప్రసాదించు. మాకు శాంతి, సంతృప్తుల భాగ్యం అనుగ్రహించు. అధర్మకార్యాల కోసం మమ్మల్ని పిలిచినప్పుడు మేము తిరస్కరించాము. సత్య తిరస్కారులు అరుపులు కేకలు పెడ్తూ మాకు వ్యతిరేకంగా ముఠా కట్టారు.

దైవప్రవక్త (సల్లం) ఈ కవితలు విని "ఎవరీ కవి?" అని అడిగారు. "ఈ కవి ఆమిర్ బిన్ అక్వాయి" అన్నారు ప్రజలు. "దేవుడు అతనిపై తన అనుగ్రహ వర్షం కురిపించుగాక!" అన్నారు దైవప్రవక్త (సల్లం). అప్పుడు ఒకతను ఈ మాటలు విని "దైవప్రవక్తా! ఇతనిప్పుడు అమరగతి, స్వర్గ భాగ్యాలకు అర్హుడయిపోయాడు. మేము ఆయన వల్ల ప్రయోజనం పొందే అవకాశం లభిస్తే ఎంత బాగుండు!" అని అన్నాడు.

ఆ తరువాత మేము ఖైబర్ చేరుకొని వారి కోటలను ముట్టడించాము. ముట్టడి సుదీర్ఘకాలం కొనసాగడం వల్ల మేము ఆకలి బాధలు సహించవలసి వచ్చింది. చివరికి దేవుడు ముస్లింలకు ఖైబర్‌పై విజయాధిక్యతలు ప్రసాదించాడు. ఖైబర్ జయించబడిన రోజు సాయంత్రం (చీకటి పడిన తరువాత) ముస్లింలు పెద్ద ఎత్తున అగ్ని రాజేశారు. దైవప్రవక్త (సల్లం) అది చూసి "ఏమిటీ అగ్ని మంటలు, ఏం వండుతున్నారు మీరు?" అని అడిగారు. "మాంసం వండుతున్నాం" అన్నారు అనుచరులు. "ఏం మాంసమది?" అడిగారు ఆయన మళ్ళీ. "పెంపుడు గాడిదల మాంసం" చెప్పారు వారు. "అయితే దాన్ని పారవేయండి. అది ఉపయోగించబడిన కుండలను పగలగొట్టండి" అన్నారు దైవప్రవక్త (సల్లం). అప్పుడు ఒకతను "దైవప్రవక్తా! మాంసం పారేసి కుండల్ని కడిగేస్తే సరిపోదా?" అని అడిగాడు. "సరే అలాగే చేయండి" అన్నారు దైవప్రవక్త (సల్లం) - ఈ యుద్ధంలో హజ్రత్ ఆమిర్ బిన్ అక్వయి (రజి) ఒక యూదుడి కాళ్ళపై ఖడ్గంతో వ్రేటు వేశారు. కాని ఆ ఖడ్గం చిన్నదయినందున అది వెనక్కి వచ్చి ఆయన మోకాలి చిప్పకు తగిలింది. చివరికి ఈ గాయమే ఆయన అమరగతికి కారణమయింది. ఆయన ప్రాణం అనంత వాయువుల్లో కలసిపోయింది.

మేము ఖైబర్ నుండి తిరుగుముఖం పట్టినప్పుడు దైవప్రవక్త (సల్లం) నా చేయి పట్టుకొని నన్ను చూస్తూ "ఏమయింది ఇలా (విచారంగా) ఉన్నావు?" అని అడిగారు. "నా తల్లిదండ్రులు మీ కోసం సమర్పితం. జనం ఆమిర్ (రజి) సత్కర్మలు వృథా అయ్యాయని అంటున్నారు" అని అన్నాను నేను. దానికి దైవప్రవక్త (సల్లం) "ఎవరైనా ఇలా అన్నాడంటే అతను అబద్ధమాడాడన్న మాట". ఆ తరువాత ఆయన తన రెండు వ్రేళ్ళను చూపిస్తూ "అతనికి రెట్టింపు పుణ్యఫలం లభిస్తుంది. అతను దైవమార్గంలో ప్రాణాలకు తెగించి తీవ్రంగా పోరాడిన గొప్ప యోధుడు. ఈ యుద్ధంలో అతను ప్రదర్శించిన ప్రతిభా పరాక్రమాల వంటివి అరబ్బుల్లో బహు కొద్దిమంది మాత్రమే చూపగలరు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 38వ అధ్యాయం - గజ్వతి ఖైబర్)

## 44వ అధ్యాయం - అహ్జాబ్ యుద్ధం (కందకపు యుద్ధం)

1182. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం:- అహ్జాబ్ యుద్ధంలో నేను దైవప్రవక్త (సల్లం)ను మట్టి మోస్తుంటే చూశాను. మట్టి ఆయన ఎరుపు ఉదరాన్ని దాచి వేసింది. అప్పుడు ఆయన ఈ కవితలు పఠించారు :

"దేవా! నీవు మాకు సన్మార్గావలంబన బుద్ధిని ప్రసాదించి ఉండకపోతే మేము సన్మార్గగాములమయ్యే వారముకాదు. జకాత్ చెల్లించే, నమాజ్ చేసే వారము కూడా కాదు. కనుక మాపై శాంతీ సంతృప్తులను అవతరింపజెయ్యి. మేము శత్రువులతో తలపడటం జరిగితే మాకు ధైర్యాన్ని, స్థిరత్వాన్ని ప్రసాదించు. వారు (అంటే మక్కా వాసులు) నీ ధర్మాన్ని తిరస్కరించి మమ్మల్ని తమ వైపుకు తిప్పుకోవడానికి ప్రయత్నించినపుడు మేము వారి మాటలను నిరాకరించాము. అందువల్ల వారు మా మీద దండెత్తి వస్తున్నారు".

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం- జిహాద్, 34వ అధ్యాయం-హఫ్రిల్ ఖందఖ్)

1183. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం:- (కందకం యుద్ధం నాడు) మేము కందకం త్రవ్వి మట్టి మోస్తుంటే దైవప్రవక్త(సల్లం) మా దగ్గరికి వచ్చి ఈ కవిత పఠించారు - "దేవా! జీవితమంటే అసలు పరలోక జీవితమే. అందువల్ల నీవు ముహాజిర్, అన్సార్ ముస్లింలను క్షమించు."

**(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 9వ అధ్యాయం - దుఆ యిన్నబియ్యి అస్లిహిల్ అన్సార వల్ ముహాజిరహ్)**

1184. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) (నకనకలాడుతున్న కడుపులతో కందకం తవ్వుతున్న అనుచరులను చూసి) ఈ కవిత పఠించారు - "జీవితమంటే పరలోక జీవితం మాత్రమే. దేవా! అన్సార్, ముహాజిర్ ముస్లింల పరిస్థితిని చక్కదిద్దు".

**(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం- మనాఖిబిల్ అన్సార్, 9వ అధ్యాయం- దుఆయిన్నబియ్యి అస్లిహిల్ అన్సార వల్ ముహాజిరహ్)**

1185. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- కందకం యుద్ధం నాడు అన్సార్ ముస్లింలు ఈ కవిత పఠించారు - "జీవితాంతం దైవమార్గంలో నిరంతరం పోరాడుతూ ఉంటామని దైవప్రవక్త ముహమ్మద్ (సల్లం) చేతిలో చేయి వేసి ప్రమాణం చేసిన వాళ్ళము మేమే".

దైవప్రవక్త (సల్లం) ఈ కవిత విని ఇలా అన్నారు - "దేవా! అసలు జీవితం పరలోక జీవితమే. అందువల్ల నీవు అన్సార్, ముహాజిర్ ముస్లింలను కటాక్షించు."

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం- జిహాద్, 110వ అధ్యాయం - అల్‌బైతి ఫిల్ హర్బి అన్‌లా యఫిర్రూ)**

## 45వ అధ్యాయం - జీఖరద్, తదితర యుద్ధాలను గురించి

1186. హజ్రత్ సలమా బిన్ అక్వాయి (రజి) కథనం:- నేను ఫజర్ వేళ అజాన్‌కు ముందే (ఇంటి నుంచి) బయలుదేరాను - జీఖరద్ ప్రాంతంలో దైవప్రవక్త (సల్లం)కు చెందిన పాలిచ్చే ఒంటెలు మేత మేస్తూ ఉన్నాయి. దారిలో నాకు అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి)గారి సేవకుడు కన్పించి "దైవప్రవక్త (సల్లం) గారి ఒంటెల్ని పట్టుకుపోయారు" అని అన్నాడు. ఎవరు పట్టుకుపోయారని నేను అడిగాను. "గత్ఫాన్ తెగవాళ్ళు పట్టుకుపోయార"న్నాడతను. ఈ సంగతి వినగానే నేను 'యా సబా!' అని మూడుసార్లు బిగ్గరగా కేక వేశాను. ఈ కేక మదీనా పౌరులందరికీ విన్పించింది. ఆ తరువాత తక్షణమే నేను ఆ దోపిడీ దొంగల దిశగా పరుగెత్తాను. అక్కడకు చేరుకొని చూస్తే వారు అప్పుడే తమ పశువులకు నీరు త్రాగించడానికి సిద్ధమవుతున్నారు. అంతలో నేను విల్లు ఎక్కుబెట్టి బాణాలు వదలడం మొదలుపెట్టాను. నేను ప్రతిభావంతుడైన విలుకాడిని. ఆ సమయంలో నా నోట ఈ కవిత వెలువడింది - "నేను అక్వాయి పుత్రుడ్ని. (మనలో) ఎవరు గౌరవనీయులో, మరెవరు నీచులో ఈ రోజు తేలిపోతుంది."

నేనీ కవిత పఠిస్తూ వారి దగ్గర నుండి ఆ ఒంటెలను విడిపించుకున్నాను. అదీగాక ముప్ఫై దుప్పట్లను కూడా వారి దగ్గర్నుండి లాక్కున్నాను. కాస్సేపటికి దైవప్రవక్త (సల్లం), కొందరు అనుచరుల్ని వెంట బెట్టుకొని వచ్చారు. నేను ఆయనతో మాట్లాడుతూ "దైవప్రవక్తా! నేను వారిపై నిరాఘాటంగా బాణాలు వదులుతూ వారిని నీళ్ళు త్రాగకుండా చేశాను. వారింకా దప్పికతోనే ఉండి ఉండవచ్చు.

అంచేత వారిని వెంటాడటానికి మీరు వెంటనే ఒక సైనిక దళాన్ని పంపండి" అని అన్నాను. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "నీవు వాళ్ళను ఓడించి నీ వస్తువులు తిరిగి తీసుకున్నావు కదా! ఇక వారిని వెంబడించడం మానెయ్యి" అని అన్నారు.

ఆ తరువాత మేము అక్కడ్నుంచి వెనక్కి బయలుదేరాము. దైవప్రవక్త (సల్లం) నన్ను తమ ఒంటె మీద తమ వెనుక కూర్చోబెట్టుకున్నారు. అలా మేము మదీనా చేరుకున్నాము.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజీ, 37వ అధ్యాయం - గజ్వతి జాతిల్ ఖరద్)

## 47వ అధ్యాయం - యుద్ధంలో పురుషులతో పాటు స్త్రీలు పాల్గొనడం గురించి

1187. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- ఉహుద్ యుద్ధం జరిగిన రోజు ముస్లింలు దైవప్రవక్త (సల్లం)ను వదలి పారిపోయినప్పుడు, హజ్రత్ అబూ తల్హా (రజి) దైవప్రవక్త(సల్లం) ముందు నిలబడి ఒక డాలును ఆయనకు అడ్డు (రక్షణ)గా పట్టుకున్నారు. హజ్రత్ అబూ తల్హా (రజి) ఎంతో ప్రతిభావంతుడైన విలుకాడు. విల్లును చాలా గట్టిగా లాగేవారు. ఆ రోజు ఆయన రెండు మూడు విల్లులను విరగ్గొట్టారు. విల్లంబులు ధరించిన ముస్లిం ఎవరైనా సమీపం నుండి పోతుంటే దైవప్రవక్త (సల్లం) అతడ్ని పిలిచి "ఈ విల్లంబులు అబూ తల్హా (రజి) ముందు పడవేసి వెళ్ళు" అని చెప్పేవారు.

దైవప్రవక్త (సల్లం) యుద్ధ పరిస్థితిని తెలుసుకోవడానికి అవిశ్వాసుల వైపు తొంగి చూసినప్పుడల్లా హజ్రత్ అబూ తల్హా (రజి) (ఆందోళన వ్యక్తపరుస్తూ) "దైవప్రవక్తా! నా తల్లిదండ్రులు మీ కోసం సమర్పితం! మీరిలా తొంగి చూస్తుంటే వారు విడిచే బాణమేదయినా మీకు తగలవచ్చు. మీ వక్ష స్థలానికి నా వక్షస్థలం కవచంగా పెట్టి ఉంచాను" అని అన్నారు.

నేను (యుద్ధ రంగంలో) విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి)ను, హజ్రత్ ఉమ్మె సలీం (రజి)నూ చూశాను. వారిద్దరూ తమ ఉడుపులను చీలమండల పైకెత్తి పట్టుకొని తమ వీపులపై నీటితిత్తులు మోస్తూ దప్పికగొన్న క్షతగాత్రుల నోటిలో మంచి నీళ్ళు పోస్తుండేవారు. నీటి తిత్తులు ఖాళీ అయిపోతే తిరిగి వెళ్ళి వాటిని నింపుకొని తెచ్చి క్షతగాత్రుల నోటిలో పోసేవారు. ఆ రోజు హజ్రత్ అబూ తల్హా (రజి) చేతి నుండి రెండు లేక మూడుసార్లు ఖడ్గం జారి క్రింద పడిపోయింది.

(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 18వ అధ్యాయం - మనాఖిబి అబీ తల్హా)

## 49వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) పాల్గొన్న యుద్ధాల సంఖ్య

1188. హజ్రత్ అబ్దుల్లా బిన్ యజీద్ అన్సారీ (రజి) కథనం:- నేను బరా బిన్ ఆజిబ్, జైద్ బిన్ అర్ఖమ్ (రజి)లతో కలసి (వర్షం వేడుకోలు కోసం) బయలుదేరాను. వారిద్దరూ వర్షం నిమిత్తం నమాజు చేశారు. వారు వేదిక లేకుండా కాళ్ళ మీద నిలబడి పాప మన్నింపు ప్రార్థన చేశారు. తరువాత రెండు రకాతులు నమాజు చేశారు. ఆ నమాజులో వారు బిగ్గరగా ఖుర్ఆన్ పఠించారు. అయితే (నమాజుకు) ముందు అజాన్‌గాని, ఇఖామత్‌గాని చెప్పలేదు.

(సహీహ్ బుఖారీ:- 15వ ప్రకరణం - ఇస్తిస్ఖా, 15వ అధ్యాయం - అద్దుఆయి ఫిల్ ఇస్తిస్ఖాయి ఖాయిమా)

1189. హజ్రత్ అబూ ఇస్‌హాఖ్ (రహ్మాలై) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఎన్ని యుద్ధాలు చేశారని హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి)ని ఒకరు (అంటే అబూ ఇస్‌హాఖ్) అడిగారు. దానికి ఆయన పంధొమ్మిది అని సమాధానమిచ్చారు. "మీరు దైవప్రవక్త (సల్లం)తో పాటు ఎన్ని యుద్ధాలలో పాల్గొన్నార"ని తిరిగి అడిగారు. పదిహేడు అని హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి) చెప్పారు. "వాటిలో మొట్టమొదటి యుద్ధం ఏది?" అని మళ్ళీ అడిగారు. దానికి ఆయన 'ఉసైరా' యుద్ధం అన్నారు. (లేదా ఉషైర్ యుద్ధం అన్నారు).

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 1వ అధ్యాయం-గజ్వతిల్ ఉషైరతి అవిల్ ఉసైరా)

1190. హజ్రత్ బురేదా బిన్ హసీబ్ (రజి) కథనం:- నేను దైవ ప్రవక్త (సల్లం)తో కలసి పదహారు యుద్ధాలలో పాల్గొన్నాను.★

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 89వ అధ్యాయం-కమ్ గజ్వన్నబియ్యు (సల్లం))

1191. హజ్రత్ సలమా బిన్ అక్వయి (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం)తో కలసి ఏడు యుద్ధాలలో పాల్గొన్నాను. ఆయన పంపిన సైనిక దళాలలో నేను తొమ్మిది దళాలలో పాల్గొన్నాను. ఒకసారి హజ్రత్ అబూ బకర్ (రజి) సేనాపతిగా, మరొకసారి హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) సేనాపతిగా నియమితులయ్యారు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం- మగాజి, 45వ అధ్యాయం - బాసిన్నబియ్యి (సల్లం) ఉసామ తబ్నె జైదిన్ ఇలల్ హరఖాతి మిన్ జుహైనహ్)

## 50వ అధ్యాయం - జాతిర్రిఖా యుద్ధం

1192. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి)కథనం:- మేము దైవప్రవక్త (సల్లం) వెంట యుద్ధానికి బయలుదేరాము. అప్పుడు మా ఆర్గురి దగ్గర ఒకే ఒక ఒంటె ఉంది. దాని మీద మేము వంతులవారీగా ప్రయాణం సాగించాము. ఈ కారణంగానే మా కాళ్ళు పగిలిపోయాయి. నా రెండు కాళ్ళు కూడా పగిలి గోళ్ళు ఊడిపోయాయి. (ఈ బాధ భరించలేక) మేము మా కాళ్ళకు గుడ్డ పేలికలు చుట్టుకున్నాము. మేము మా కాళ్ళకు గుడ్డపేలికలు కట్టుకున్న కారణంగానే ఈ యుద్ధానికి జాతిర్రిఖా (గుడ్డపేలికల) యుద్ధం అని పేరు పడింది.

హజ్రత్ అబూ మూసా (రజి) ఈ హదీసును ఉల్లేఖించిన తరువాత, దాన్నసలు ఉల్లేఖించకుండా ఉంటే బాగుండేదన్న భావం ఏర్పడింది. ఆయన ఇలా అన్నారు: "నేనసలు ఈ హదీసును ప్రస్తావించకూడదనుకున్నాను. మేము దైవమార్గంలో శ్రమపడింది దాన్ని గురించి ఇతరులకు చెప్పుకోడానికి కాదు". అంటే చేసిన సత్కార్యాలను బయటపెట్టుకోవడం ఆయనకు ఇష్టం లేదన్నమాట.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 31వ అధ్యాయం - గజ్వతి జాతిర్రిఖా)

---

★ ఇమామ్ నవవీ (రహ్మాలై) ప్రకారం దైవప్రవక్త (సల్లం) చేసిన దండ యాత్రల సంఖ్య విషయంలో సమర శాస్త్రవేత్తల (అహ్లెమగాజి) మధ్య భేదాభిప్రాయాలున్నాయి. హజ్రత్ ఇబ్నె సాద్ (రహ్మాలై) 'తబఖాత్' గ్రంథంలో ఇచ్చిన వివరాల ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇరవై ఏడు దండయాత్రలలో పాల్గొన్నారు. దైవప్రవక్త (సల్లం) స్వయంగా పాల్గొనకుండా తమ అనుచరుల నేతృత్వంలో సైనికుల్ని పంపి చేయించిన దండయాత్రల సంఖ్య యాభై ఆరుకు చేరాయి. అయితే తొమ్మిది మాత్రమే క్రియాత్మకంగా యుద్ధాలు జరిగాయి. వాటి పేర్లు ఇలా ఉన్నాయి. (1) బద్ర్, (2) ఉహుద్, (3) హరీస (బనూముస్తలిఖ్), (4) ఖన్దఖ్ (కందకం), (5) బనూ ఖురైజా, (6) ఖైబర్, (7) మక్కా విజయం, (8) హునైన్, (9) తాయిఫ్. హజ్రత్ బురేదా (రజి) ఎనిమిది యుద్ధాలని అన్నారు. బహుశా ఆయన మక్కా విజయాన్ని ప్రస్తావించడం వదిలేసి ఉంటారు. మక్కా ఒప్పందం ద్వారా జయించబడటం వల్ల దాన్ని ఆయన యుద్ధాల సంఖ్య నుండి తీసివేసి ఉంటారు. ఇమామ్ షాఫయి (రహ్మాలై) అభిప్రాయం కూడా అదే. అయితే ఇతర ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం మక్కా ఖడ్గ బలంతో జయించబడింది. ఇదే సరయిన అభిప్రాయం. (అనువాదకుడు).

# పదవుల ప్రకరణం
# (పరిపాలనా విధానం)

## 1వ అధ్యాయం - పరిపాలనలో ప్రజలు ఖురైషీయులకు విధేయులు

1193. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- నాయకత్వం, పాలనాధికార వ్యవహారాల్లో సామాన్య ప్రజానీకం ఖురైషీయులకు విధేయులయి ఉండాలి. ముస్లిం ప్రజానీకం ముస్లిం ఖురైషీయులకు అవిశ్వాస ప్రజానీకం అవిశ్వాస ఖురైషీయులకు విధేయులయి ఉన్నారు.(1)

**(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 1వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా యాఅయ్యు హన్నాసు ఇన్నా ఖలఖ్నాకుమ్మిన్ జకరిన్ వ ఉన్సా........)**

1194. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఉద్బోధించారు:- ఈ (ఖిలాఫత్) వ్యవహారం ఎల్లప్పుడూ ఖురైషీయులలో ఉంటుంది. ప్రపంచంలో ఇద్దరు ఖురైషీయులు బ్రతికి ఉన్నాసరే ఇది వారి దగ్గరే ఉంటుంది.(2)

**(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 2వ అధ్యాయం - మనాఖిబ్ ఖురైష్)**

1195. హజ్రత్ జాబిర్ బిన్ సమురా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) తన తదనంతరం పన్నెండు మంది నాయకులవుతారని అన్నారు. ఆ తరువాత ఆయన మరోమాట కూడా చెప్పారు. నేను దాన్ని వినలేకపోయాను. ఆ మాట మా తండ్రిగారు ఇలా తెలియజేశారు : "వారంతా (ఆ నాయకులంతా)

---

(1) అంటే , ఖురైష్ తెగవాళ్ళు పరిపాలనాధికారంలో ఇతరుల కన్నా శ్రేష్ఠులు కనక సామాన్య ప్రజలు వారికి విధేయులయి ఉంటారని అర్థం. అయితే కొందరు ధర్మవేత్తలు ఈ ప్రవచనాన్ని ఆజ్ఞగా భావించి నాయకత్వం, పరిపాలనా వ్యవహారాలలో ప్రజలు ఖురైషీయులకు తప్పకుండా విధేయులై ఉండాలని అభిప్రాయపడ్డారు. అంటే ఖురైష్ వ్యక్తి గనక ఖలీఫా అయితే ప్రజలు అతనిపై తిరుగుబాటు చేయడం ధర్మసమ్మతం కాదన్న మాట. హజ్రత్ కిర్మానీ (రహ్మలై) అభిప్రాయం ప్రకారం ఈ హదీసులో ఖురైషీయులకు అన్నికాలాల్లో లభిస్తున్న హోదా, అంతస్తుల్ని గురించి ప్రస్తావించడం జరిగింది. అజ్ఞాన కాలంలో కూడా ప్రజలు ఖురైషీయులకు విధేయులయి ఉండేవారు. కారణం వారు కాబా ధర్మకర్తలు. కాబా యాత్ర ఏర్పాట్లు, సౌకర్యాలు-ఇత్యాది విషయాలు వారి చేతుల్లోనే ఉండేవి. ఇస్లాం వచ్చిన తరువాత కూడా ఈ పరిస్థితే కొనసాగింది. అరబ్ ప్రజల్లో అధిక సంఖ్యాకులు ఖురైషీయుల వైపే దృష్టి సారిస్తారు. మక్కా జయించబడినప్పుడు ఖురైషీయులు ఇస్లాం స్వీకరించడం చూసి యావత్తు అరబ్బులు వారిని అనుసరించారు. ఆ తరువాత కొన్నేళ్ళ వరకూ ఖిలాఫత్ పాలనాధికారం ఖురైషీయుల చేతుల్లోనే ఉండింది. (సంకలనకర్త).

(2) అంటే ప్రపంచంలో ఖురైషీయులు జీవించి ఉన్నంత వరకూ ఖిలాఫత్ పాలనాధికారానికి వారే అర్హులని అర్థం. ఇమామ్ నవవీ (రహ్మలై) అభిప్రాయం ప్రకారం ఖిలాఫత్ (రాజ్యాధికారం) ఖురైషీయులకు ప్రత్యేకించబడిందని ఈ హదీసు ద్వారా స్పష్టమవుతోంది. ఖురైష్ వ్యక్తిని తప్ప మరెవరినీ ఖలీఫాగా చేయడం ధర్మసమ్మతం కాదు. ప్రవక్త అనుచరుల కాలంలో, ఆ తరువాత కాలంలో కూడా ఈ విషయంపై ధర్మవేత్తలు ఏకాభిప్రాయంతో నిర్ణయం తీసుకున్నారు. దీన్ని వ్యతిరేకించినవాడు 'బిద్అతి' (ధర్మంలో కొత్త పోకడలు సృష్టించినవాడు) అవుతాడు. దైవప్రవక్త (సల్లం) ఈ హదీసులో ప్రపంచంలో ఇద్దరు ఖురైషీయులు బ్రతికి ఉన్నాసరే ఈ (ఖిలాఫత్) వ్యవహారం వారిలోనే ఉంటుందని అన్నారు. ఆయన ప్రవచించిన ఈ సూక్తి ప్రతి యుగంలోనూ నిజమని రుజువవుతూ వస్తోంది. వివిధ కాలాల్లో ఖురైష్ కాని వ్యక్తులు బలవంతంగా ప్రభుత్వాన్ని చేజిక్కించుకొని ప్రజలపై బలవంతపు పెత్తనం చెలాయించినప్పటికీ, ఖలీఫా పదవికి ఖురైషీయులే అర్హులని ప్రజలు విశ్వసించేవారు. అంటే ప్రభుత్వాన్ని ఎవరు స్వాధీనం చేసుకున్నా ఖలీఫా అనబడేందుకు ఖురైష్ వ్యక్తి మాత్రమే అర్హుడని ఈ హదీసు మనకు పరోక్షంగా తెలియజేస్తోందన్న మాట. (సంకలనకర్త).

ఖురైష్ వంశానికి చెందినవారయి ఉంటారని దైవప్రవక్త (సల్లం) అన్నారు."[1]

(సహీహ్ బుఖారీ:- 93వ ప్రకరణం - అహ్కాం, 51వ అధ్యాయం - ఇస్తిఖ్లాఫ్)

## 2వ అధ్యాయం - ఖలీఫా నియామకం గురించి....

1196. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- హజ్రత్ ఉమర్ (రజి)ని "మీరు ఖలీఫా వారసుడిగా ఎవరి పేరునయినా ఎందుకు ప్రతిపాదించరు?" అని అడిగిన ప్రశ్నకు ఆయన ఇలా సమాధానమిచ్చారు- "తదుపరి ఖలీఫాగా నేను ఎవరి పేరునైనా ప్రతిపాదిస్తే అదీ సమంజసమే. ఎందుకంటే నా కన్నా శ్రేష్ఠుడయిన వ్యక్తి అంటే, హజ్రత్ అబూ బకర్ (రజి) తన వారసుడి పేరు ప్రతిపాదించారు. ఒకవేళ నేను ఎవరి పేరునూ ప్రతిపాదించకపోతే (అదీ సరైన పద్ధతే). నాకన్నా అత్యంత శ్రేష్ఠులయిన దైవప్రవక్త (సల్లం) ఖలీఫాగా ఎవరి పేరునూ ప్రతిపాదించలేదు (అన్న విషయం గమనార్హం). ప్రజలు ఈ మాట విని ఆయన్ని ప్రశంసించారు. ఆ తరువాత హజ్రత్ ఉమర్ (రజి) ఇలా అన్నారు - "ప్రజలలో రెండు కోవలకు చెందినవారు ఉన్నారు. కొందరు ఖలీఫా పదవి పట్ల మక్కువ గల వారున్నారు. మరికొందరు అదంటే భయపడేవారున్నారు. నేనీ బాధ్యతాభారం నుండి (దేవుని దగ్గర) పూర్తిగా విముక్తి పొందాలనుకుంటున్నాను. దీనివల్ల నాకు పుణ్యఫలం లభించకపోయినా నష్టం (దైవశిక్ష) మాత్రం కలగకూడదని నేను కోరుకుంటున్నాను. నేను జీవించి ఉన్నంత కాలం ఖిలాఫత్ భారం మోస్తూ వచ్చాను. ఇప్పుడు నేను మరణించిన తరువాత కూడా ఆ భారం నా మీద ఉండకూడదని భావిస్తున్నాను.[2] అందువల్ల ఖలీఫా వారసుడి కోసం నేనెవరి పేరునూ ప్రతిపాదించదలచుకోలేదు."

(సహీహ్ బుఖారీ:- 93వ ప్రకరణం - అహ్కాం, 51వ అధ్యాయం - ఇస్తిఖ్లాఫ్)

---

(1) ఖురైష్ వంశానికి చెందిన ఈ పన్నెండు మంది నాయకులు (అంటే ఖలీఫాలు) హజ్రత్ అబూ బకర్(రజి) నుండి హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రజి) వరకు అయిన పన్నెండు మంది ఖలీఫాలని భావించవచ్చు. వీరు తొలి కాలం ఖలీఫాలు. వీరు ఆ తరువాత వచ్చిన బనూ ఉమయ్యా ఖలీఫాలు, బనూ అబ్బాసీ ఖలీఫాల కన్నా శ్రేష్ఠులు. బనీ ఉమయ్యా, బనూ అబ్బాసీ ఖలీఫాలు ఖలీఫాలని బిరుదు పెట్టుకున్నప్పటికీ వారి ఖిలాఫత్ విధానం నామ మాత్రంగానే సాగింది.

పన్నెండు ఖలీపాల పేర్లు ఇవి:- (1) హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి) , (2) హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి), (3)హజ్రత్ ఉస్మాన్ (రజి), (4) హజ్రత్ అలీ (రజి), (5) హజ్రత్ హసన్ (రజి) , (6) హజ్రత్ ముఆవియా (రజి), (7) యజీద్ బిన్ ముఆవియా (రజి), (8) మర్వాన్, (9) అబ్దుల్ మాలిక్ (రహ్మలై), (10) హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి), (11) వలీద్ బిన్ అబ్దుల్ మలిక్ (రహ్మలై), (12) హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రహ్మలై). వీరంతా ఖురైష్ వంశానికి చెందినవారే. వీరిలో కొందరు వివాదాస్పదమైన వారుగా ఉన్నప్పటికీ తొలి కాలపు పన్నెండు ఖలీఫాలు, నాయకులు వీరే కాగలరు. (సంకలనకర్త).

(2) రాజ్యాధికారం, ఖిలాఫత్ పదవి చాలా సున్నితమైన వ్యవహారం. దాని బరువు బాధ్యతల నుండి క్షేమంగా బయట పడటమంటే ఎంతో గొప్ప విషయం. అందువల్ల హజ్రత్ ఉమర్ (రజి) ఈ బరువు బాధ్యతల వల్ల పుణ్యం, ప్రయోజనాలు లభించకపోయినా కనీసం పాపం కలగకుండా ఉంటే అదే పదివేలని భావించేవారు. ప్రజల అంతరంగాల స్థితి దేవునికి మాత్రమే తెలుసు. కొందరు రాజ్యకాంక్ష కలిగినవారు ఉంటే మరికొందరు అదంటే భయపడేవారున్నారు. ఇలాంటి స్థితిలో తానొకవేళ పొరపాటున రాజ్యకాంక్షగల వ్యక్తిని గనక తన వారసుడిగా చేస్తే తన మరణానంతరం అతని కర్మలకు తాను బాధ్యత వహించవలసి ఉంటుందని హజ్రత్ ఉమర్ (రజి) తన భయాందోళనలను వ్యక్తపరిచారు. బ్రతికి ఉండగా తాను ఎలాగూ ఖిలాఫత్ బాధ్యత, ప్రజల బాధ్యత వహిస్తూనే ఉన్నాను. మరణించిన తరువాత కూడా ఈ బాధ్యత తనపై ఉంటుంది. దీనికి తోడు మరొకరి బాధ్యతను కూడా తన నెత్తి మీద వేసుకోవడం ఎందుకు అన్నది ఆయన ఉద్దేశం. ఒకవేళ తన వారసుని పేరు ప్రతిపాదించినా అందులో ఎలాంటి తప్పులేదు. కారణం తన కంటే శ్రేష్ఠుడైన హజ్రత్ అబూ బకర్ (రజి) వారసుని పేరు ప్రతిపాదించి ఒక సంప్రదాయాన్ని నెలకొల్పారు. వారసుని పేరు ప్రతిపాదించకపోతే అదీ సమంజసమైన వైఖరే. ఎందువల్లనంటే దైవప్రవక్త (సల్లం) సయితం తన వారసుడిగా ఎవరి పేరూ ప్రతిపాదించకుండా ఖలీఫా ఎన్నిక బాధ్యతను ముస్లిం సమాజానికి వదలిపెట్టారు.

ఖిలాపత్ వ్యవహారంలో ఈ రెండు పద్ధతులు సరయినవేనన్న ఏకాభిప్రాయం ముస్లిం సమాజంలో ఉంది. ప్రస్తుత ఖలీఫా తన వారసుడి పేరు ప్రతిపాదించినా, ప్రతిపాదించకుండా కొత్త ఖలీఫా ఎంపిక బాధ్యతను ప్రజలకు వదలిపెట్టినా రెండు విధానాలూ సమంజసమైనవే. ఈ కారణంగానే హజ్రత్ ఉమర్ (రజి) తన వారసుడి పేరును ప్రతిపాదించకుండా కొత్త ఖలీఫా ఎంపిక కోసం ఆర్గురు సభ్యులతో కూడిన ఒక ఎన్నిక సంఘాన్ని నియమించారు.

## 3వ అధ్యాయం - పదవీ బాధ్యతలను కాంక్షించడం నిషిద్ధం

1197. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ సమురా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) నాతో ఇలా అన్నారు - "అబ్దుర్రహ్మాన్ బిన్ సమురా! నీవు ఎన్నడూ పదవిని, నాయకత్వాన్ని కోరకు. నీ కోరిక ప్రకారం పదవీ పాలనాధికారాలు గనక నీకు ఇవ్వడం జరిగితే ఆ బాధ్యతాభారం పూర్తిగా నీ మీదనే పడుతుంది. (దైవ సహాయం పొందే అర్హతను కోల్పోతావు). ఒకవేళ నీవు కోరకుండానే ఆ బాధ్యతా భారం నీపై మోపబడితే మాత్రం ఆ బాధ్యతా నిర్వహణలో నీకు దైవ సహాయం లభిస్తుంది."

(సహీహ్ బుఖారీ:- 83వ ప్రకరణం - ఐమాన్ వన్నుజూర్, 1వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా లాయు ఆఖిజు కుముల్లాహు బిల్లగ్వి ఫీ ఐమానికుమ్)

1198. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం) దగ్గర ఉన్నాను. అప్పుడు నాతో పాటు అష్అరీయులలో మరో ఇద్దరు వ్యక్తులు కూడా ఉన్నారు. ఒకతను నా ఎడమవైపు, మరొకతను నా కుడివైపు ఉన్నారు. దైవప్రవక్త (సల్లం) మిస్వాక్ పుల్లతో పలు దోముకుంటున్నారు. వారిద్దరూ ఆయన్ని (పదవులు) అర్థించారు. అప్పుడు ఆయన నన్ను ఉద్దేశించి - "అబూ మూసా! (లేక అబ్దుల్లా బిన్ ఖైస్!) నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగారు. నేను సమాధానమిస్తూ "మిమ్మల్ని సత్యం ఇచ్చి పంపిన శక్తిమంతుని సాక్షి! వీరిద్దరూ తమ మనస్సుల్లో ఏముందో నాకు చెప్పలేదు. వీరిద్దరూ ఇలా పదవులివ్వమని అడుగుతారని నాకు ఏ మాత్రం తెలియదు".

దైవప్రవక్త (సల్లం) తమ నోట్లో పలుదోము పుల్ల పెట్టుకొని ఉన్న దృశ్యం ఇప్పటికీ నా మనోనేత్రంలో మెదలుతోంది. ఆయన (నా మాటలు విని) ఇలా అన్నారు : "మేము పదవీ కాంక్షాపరుడికి ఎలాంటి పదవీ బాధ్యతను అప్పగించము. అబూ మూసా! (లేక అబ్దుల్లా బిన్ ఖైస్!) నీవు యమన్ (పాలకుడిగా) వెళ్ళు".

హజ్రత్ అబూ మూసా (రజి) యమన్‌కు వెళ్ళిపోయిన తరువాత దైవప్రవక్త (సల్లం) హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ (రజి)ని కూడా ఆయన దగ్గరకు పంపించారు. హజ్రత్ ముఆజ్ (రజి) యమన్ దేశంలో హజ్రత్ అబూ మూసా (రజి) దగ్గరికి చేరుకున్నారు. అప్పుడు హజ్రత్ అబూ మూసా (రజి) ఆయన కోసం ఒక పరుపును పరిచి, దిగండి అన్నారు. ఆ సమయంలో హజ్రత్ అబూ మూసా ముందు ఒక వ్యక్తి బంధింపబడి ఉన్నాడు. హజ్రత్ ముఆజ్ (రజి) అతడ్ని చూసి "ఏమిటీ ఇతని వ్యవహారం?" అని అడిగారు. హజ్రత్ అబూ మూసా (రజి) సమాధానమిస్తూ "ఇతను ఇది వరకు యూద మతస్థుడిగా ఉండేవాడు. తరువాత ముస్లింగా మారాడు. ఆ తరువాత మళ్ళీ మతభ్రష్టుడయి యూదుడిగా మారిపోయాడు, సరే కూర్చోండి" అని అన్నారు.

హజ్రత్ ముఆజ్ (రజి) కూర్చోవడానికి నిరాకరిస్తూ "దేవుడు, ఆయన ప్రవక్త (సల్లం) నిర్దేశించిన చట్టం ప్రకారం ఇతడ్ని హతమార్చనంత వరకు నేను కూర్చోలేను" అని అన్నారు. ఈ మాట ఆయన మూడుసార్లు అన్నారు. అప్పుడు హజ్రత్ అబూ మూసా (రజి) ఆజ్ఞ జారీ చేశారు; ఆ వ్యక్తి వధించబడ్డాడు. ఆ తరువాత వారిద్దరూ పరస్పరం తహజ్జుద్ (అర్ధరాత్రి) నమాజును గురించి

మాట్లాడుకోనారంభించారు. వారిలో ఒకరు ఇలా అన్నారు: "నేను రాత్రి వేళ తహజ్జుద్ నమాజు కూడా చేస్తాను, కాస్సేపు నిద్ర కూడా పోతాను. రాత్రి జాగరణ చేసి తహజ్జుద్ నమాజు చేస్తే ఎలా పుణ్యం ప్రాప్తమవుతుందో నిద్ర విషయంలో కూడా అలాగే నాకు పుణ్యం ప్రాప్తమవుతుందని ఆశిస్తున్నాను."

(సహీహ్ బుఖారీ:- 88వ ప్రకరణం-ఇస్తితా బతిల్ ముర్తదీన్, 2వ అధ్యాయం - హుక్మిల్ ముర్తది వల్ ముర్తద్ధ)

## 5వ అధ్యాయం - న్యాయపాలకుడి ఔన్నత్యం, క్రూరపాలకుడికి శిక్ష, ప్రజల పట్ల మృదువైఖరి

1199. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- మీలో ప్రతి వ్యక్తీ బాధ్యతాయుతుడయిన సంరక్షకుడే. తత్కారణంగా అతని సంరక్షణలో ఉన్నవారి (మంచీ చెడ్డలను) గురించి అతడ్ని (పరలోకంలో) ప్రశ్నించడం జరుగుతుంది. పాలకుడు తన పాలిత ప్రజల భద్రతకు, సంరక్షణకు బాధ్యుడు. అందుచేత ఆ ప్రజలను, వారి వ్యవహారాలను గురించి అతడ్ని ప్రశ్నించడం జరుగుతుంది. ఒక సాధారణ వ్యక్తి కూడా తన భార్యాపిల్లల భద్రతకు, సంరక్షణకు బాధ్యుడవుతాడు. వారిని గురించి అతడ్ని ప్రశ్నించడం జరుగుతుంది. అదే విధంగా స్త్రీ కూడా తన భర్త ఇంటికి, అతని పిల్లలకు సంరక్షకురాలు. ఆమెను వారిని గురించి ప్రశ్నించడం జరుగుతుంది. సేవకుడు తన యజమాని ఆస్తిపాస్తులకు సంరక్షకుడు. వాటిని గురించి అతడ్ని విచారించడం జరుగుతుంది. కనుక గుర్తుంచుకోండి! మీలో ప్రతి ఒక్కడూ బాధ్యతాయుతుడయిన సంరక్షకుడే. అతని అధీనంలో ఉన్నవారి (వాటి) ని గురించి అతడు ప్రశ్నించబడతాడు.

(సహీహ్ బుఖారీ:- 49వ ప్రకరణం-ఇత్క్, 17వ అధ్యాయం - కరాహియతిత్తతావులి అలర్రఖీఖ్)

1200. ఇమామ్ హసన్ బస్రి (రహ్మలై) కథనం:- హజ్రత్ మాఖిల్ బిన్ యసార్ (రజి) ప్రాణాంతక వ్యాధికి గురయినప్పుడు ఉబైదుల్లా బిన్ జియాద్ ఆయన్ని పరామర్శించడానికి వచ్చాడు. అప్పుడు హజ్రత్ మాఖిల్ (రజి) అతనితో ఇలా అన్నారు; "నేను దైవప్రవక్త (సల్లం) నోట విన్న ఒక హదీసును నీకు విన్పిస్తాను. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు- దేవుడు ఒక వ్యక్తిని ప్రజలకు పాలకుడిగా, సంరక్షకునిగా చేసినప్పుడు , అతను గనక తన ప్రజల పట్ల శ్రేయోభిలాషతో వారి భద్రత, సంరక్షణా బాధ్యతలను నెరవేర్చకపోతే అతను స్వర్గ సువాసనను సయితం ఆస్వాదించలేడు".

(సహీహ్ బుఖారీ:- 93వ ప్రకరణం - అహ్కాం, 8వ అధ్యాయం - మనిస్తర్అరయియ్యతన్ ఫలమ్ యన్సాహ్)

## 6వ అధ్యాయం - విజయప్రాప్తిని దొంగిలించడం అధర్మం

1201. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఓసారి నిలబడి ప్రసంగిస్తూ విజయప్రాప్తిలో దొంగతనం గురించి ప్రస్తావించారు. దాన్ని ఘోర పాపకార్యంగా పరిగణించారు. దానికి కఠినాతి కఠినమైన శిక్ష పడుతుందని చెప్పారు. ఆయన ఈ విధంగా అన్నారు - "గుర్తుంచుకోండి. ప్రళయదినాన మీలో ఏ వ్యక్తీ తన మెడ మీద ఒక మేక ఎక్కి 'మేమే' అంటున్న స్థితిలో గాని, లేదా

తన మెడ మీద ఒక గుర్రం ఎక్కి సకిలిస్తున్న స్థితిలోగాని నా దగ్గరకు వచ్చి 'దైవప్రవక్తా! నన్ను ఆదుకోండ'ని అనకూడదు సుమా! అప్పుడు 'నేను మీకెలాంటి సహాయం చేయలేను. (దేవుని) ఆజ్ఞలన్నింటినీ నేను నీకు అందజేశాను' అని సమాధానమిస్తాను. అలాగే మీలో ఏ ఒక్కరూ తన మెడ మీద ఒంటె ఎక్కి అరుస్తున్న స్థితిలో నా దగ్గరకు వచ్చి 'దైవప్రవక్తా నన్ను కాపాడండ'ని అనకూడదు. అప్పుడు 'నేను మీ కోసం ఏమీ చేయజాలను. నేను (పాప పుణ్యాలను గురించిన) ప్రతి విషయం నీకు తెలియజేశాను' అని సమాధానమిస్తాను. అదే విధంగా మీలో ఏ ఒక్కడూ తన మెడ మీద వెండి బంగారాలు పెట్టబడిన స్థితిలో వచ్చి 'దైవప్రవక్తా! నన్ను ఆదుకోండ'ని అనకూడదు. అప్పుడు 'నేను నిన్నే విధంగానూ ఆదుకోలేను. నేను చెప్పవలసినదంతా నీకు చెప్పేశాను!' అని సమాధానమిస్తాను. అలాగే మీలో ఏ ఒక్కడూ తన మెడ మీద తాను భరించలేనంత బరువయిన బట్టల మూట పెట్టబడి ఉన్న స్థితిలో వచ్చి'దైవప్రవక్తా! నాకు సహాయం చేయండ'ని అనకూడదు. అప్పుడు 'నేను నీ కెలాంటి సహాయం చేయలేను. నేను నీకు దేవుని ఆజ్ఞలన్నీ చేరవేశాను' అని చెబుతాను. (అలాంటి దుస్థితి మీకెవరికీ దాపురించకూడదు సుమా!)".

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 189 వ అధ్యాయం - అల్ గులూల్)

## 7వ అధ్యాయం - ప్రభుత్వోద్యోగులు పారితోషికాలు, కానుకలు స్వీకరించడం నిషిద్ధం

1202. హజ్రత్ అబూ హమీద్ సాయిదీ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) జకాత్, సదఖాలు (రెవెన్యూ) వసూలు చేయడానికి ఒక వ్యక్తిని (తహసీల్‌దారుగా) నియమించారు. అతను తన కప్పగించబడిన పని పూర్తి చేసుకుని తిరిగొచ్చి "దైవప్రవక్తా! ఈ ధనం మీది, ఇది నాకు పారితోషికంగా లభించింది" అని అన్నాడు. దైవప్రవక్త (సల్లం) ఈ మాటలు విని "నీవు నీ తల్లిదండ్రుల ఇంట్లోనే ఎందుకు కూర్చోలేదు? అప్పుడు నీకెవరైనా పారితోషికం తెచ్చిస్తారో లేదో తెలుస్తుంది కదా!" అని అన్నారు.

ఆ తరువాత ఆయన ఇషా నమాజ్ చేసి (ఉపన్యాసమివ్వడానికి) నిలబడ్డారు. ముందుగా ఆయన షహాదత్ కలిమా (సత్యసాక్ష్య వచనం) పఠించి దైవస్తోత్రం చేశారు. దానికి దేవుడే యోగ్యుడు. ఆ తరువాత ఆయన ఇలా అన్నారు: "ఈ కార్య నిర్వాహకులకు ఏమయింది? మేమొక వ్యక్తిని కార్య నిర్వాహకునిగా (అంటే రెవెన్యూ వసూలు చేసే ఉద్యోగిగా) నియమించి పంపితే అతను తిరిగొచ్చి 'ఇది నన్ను వసూలు చేయడానికి పంపిన ధనం, ఇది నాకు పారితోషికంగా లభించిన ధనం' అని అంటున్నాడు. అతను తన తల్లిదండ్రుల ఇంట్లోనే ఎందుకు కూర్చోలేదు. అప్పుడు తెలుస్తుందిగా అతనికి పారితోషికం ఎవరు తెచ్చిస్తారో! ఎవరి అధీనంలో ముహమ్మద్ ప్రాణం ఉందో ఆ శక్తిమంతుని సాక్షి! ఈ (ప్రభుత్వ) రాబడిలో ఎవరు నమ్మకద్రోహానికి పాల్పడతాడో ప్రళయదినాన దొంగిలించబడిన ఆ ధనం అతని మెడ మీద పెనుభారంగా పరిణమిస్తుంది. అతను ఒంటెను దొంగిలించి ఉంటే ఆ ఒంటె అతని మెడ మీద ఎక్కి అరుస్తూ అతనికి దుర్భరంగా మారవచ్చు. ఒకవేళ అతను ఆవును దొంగిలించి ఉంటే ఆ ఆవు అతని మెడ మీద అంబా అంటూ ఉండవచ్చు, మేకయితే 'మేమే' అంటూ ఉండవచ్చు. గుర్తుంచుకోండి! నేను దేవుని ఆజ్ఞలన్నీ మీకు అందజేశాను (నా బాధ్యత తీరిపోయింది,

ఇక ఎవరి కర్మలకు వారే బాధ్యులు)".

దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచిస్తూ తమ హస్తాన్ని బాగా పైకెత్తారు. అప్పుడు మాకు ఆయన చంకలోని తెలుపుదనం కన్పించింది".[1]

**(సహీహ్ బుఖారీ:- 83వ ప్రకరణం - అల్ ఐమాన్ వన్నుజూర్, 3వ అధ్యాయం - కైఫ కాన యమీనున్నబియ్యి (సల్లం))**

## 8వ అధ్యాయం - దైవాదేశాలకు విరుద్ధంగా లేనంత వరకూ పాలకుల ఆజ్ఞలను శిరసావహించడం (ప్రజల) విధి

1203. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- "విశ్వాసులారా! దేవునికి విధేయత చూపండి, దైవప్రవక్తకు విధేయత చూపండి. మీలోని అధికారికి (నాయకునికి) కూడా". (4:59) అన్న దైవసూక్తి అబ్దుల్లా బిన్ హుజైఫా బిన్ ఖైస్ బిన్ అదీ విషయంలో అవతరించింది. దానికి ముందు దైవప్రవక్త (సల్లం) ఆయన్ని ఒక సైనిక దళానికి నాయకునిగా నియమించి పంపారు.[2]

**(సహీహ్ బుఖారీ:- 93వ ప్రకరణం - అహ్కామ్, 1వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా అతీవుల్లాహ వ అతీ వుర్రసూల వఉలిల్ అమ్రి మిన్‌కుమ్)**

**(65వ ప్రకరణం - తఫ్సీర్, 4-నిసా సూరా, 10వ అధ్యాయం - ఖౌలిహీ (ఉలిల్ అమ్రి మిన్‌కుమ్)**

1204. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ఎవరు నాకు విధేయుడయ్యాడో అతను వాస్తవానికి దేవునికి విధేయుడయ్యాడు - మరెవరు నాకు అవిధేయుడయ్యాడో అతను నిజానికి దేవునికే అవిధేయుడయిపోయాడు. అలాగే ఎవరు నేను నియమించిన నాయకునికి విధేయత చూపాడో అతను నాకు విధేయత చూపినట్లే; మరెవరు నేను

---

(1) ఈ హదీసుని బట్టి ప్రభుత్వ ఉద్యోగులు (ప్రజల నుండి) కానుకలు, పారితోషికాలు స్వీకరించకూడదని, అది ప్రభుత్వ ధనం లేక విజయప్రాప్తి నుండి దొంగిలించి నమ్మకద్రోహానికి పాల్పడినట్లవుతుందని తెలుస్తోంది. ప్రభుత్వోద్యోగి కానుకలు (లంచం) స్వీకరించడమంటే తన హోదా, అధికారాల ద్వారా అక్రమ ప్రయోజనాలను పొందడమే; తన బాధ్యతలను దుర్వినియోగం చేయడమే. అందువల్లనే దైవప్రవక్త (సల్లం) విజయప్రాప్తిని కాజేసే వ్యక్తికి ప్రళయదినాన ఏ శిక్ష పడుతుందో, కానుక (లంచం) తీసుకునే ప్రభుత్వోద్యోగికి కూడా అదే శిక్ష పడుతుందని హెచ్చరించారు.

(2) 'ఫత్‌హుల్ బారి' గ్రంథంలో ఇలా ఉంది: "దేవునికి విధేయత చూపండి అంటే దేవుడు దివ్య ఖుర్‌ఆన్‌లో అవతరింపజేసిన ఆజ్ఞలను పాటించడమని అర్థం. దైవప్రవక్త (సల్లం) కు విధేయత చూపండి అంటే దైవప్రవక్త (సల్లం) దివ్య ఖుర్‌ఆన్‌కు భాష్యం చెబుతూ తన సంప్రదాయాలుగా ప్రసాదించిన ప్రవచనాలను ఆచరించండని అర్థం." ఈ సూక్తిలో విధేయత చూపండి అనే క్రియను దైవప్రవక్త (సల్లం) కు కూడా చేర్చబడిందంటే దేవునికి విధేయత చూపడం ఎలా విధియో అలాగే దైవప్రవక్త (సల్లం) కు కూడా విధేయత చూపడం విధి అని భావం. కాని అధికారి (నాయకుడి) విషయంలో ఈ విధంగా లేదు. అధికారి విధేయత దేవుని విధేయత, దైవప్రవక్త (సల్లం) విధేయతలకు లోబడి ఉంటుంది. అంటే అధికారి ఇచ్చే ఆజ్ఞ దేవుని ఆజ్ఞకు లేదా దైవప్రవక్త (సల్లం) ఆజ్ఞకు అనుగుణంగా ఉన్నప్పుడే అతనికి విధేయత చూపవలసి ఉంటుంది. ఈ కారణంగానే విధేయత చూపండనే క్రియను అధికారి అనే పదానికి చేర్చబడలేదు.

(సంకలనకర్త).

నియమించిన నాయకునికి అవిధేయుడయ్యాడో అతను స్వయంగా నాకు అవిధేయుడయి పోయాడన్నమాట.*

(సహీహ్ బుఖారీ:- 93వ ప్రకరణం - అహ్కామ్, 1వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (అతీవుల్లాహ వ అతీవుర్రసూల వ ఉలిల్ అమ్రి మిన్‌కుమ్)

1205. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ప్రతి ముస్లిం తప్పనిసరిగా (తమ నాయకుడు చెప్పే) మాటను వినాలి, (అతని ఆజ్ఞను) శిరసావహించాలి. (ఆ మాట, ఆ ఆజ్ఞ) తనకు ఇష్టమున్నా లేకపోయినా సరే. పాప కార్యానికి సంబంధించిన ఆజ్ఞ ఇవ్వబడనంతవరకు విధిగా (అతని మాటను) వినాలి, (అతని ఆజ్ఞను) శిరసావహించాలి. ఒకవేళ ఆ నాయకుడు లేక అధికారి పాపానికి, అధర్మానికి సంబంధించిన ఆజ్ఞ ఇస్తే అతని ఆజ్ఞను శిరసావహించకూడదు. (శిరసావహిస్తే పాప కార్యానికి పాల్పడిన వాడవుతాడు).

(సహీహ్ బుఖారీ:- 93వ ప్రకరణం - అహ్కామ్, 4వ అధ్యాయం - అస్సమ్‌యి వత్తాఅతి లిల్ ఇమామి మాలమ్ తకున్ మాసియ)

1206. హజ్రత్ అలీ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఒక సైనిక దళానికి ఒక అన్సారీ ముస్లింని సేనాపతిగా నియమించి పంపారు. ఆ సందర్భంలో ఆయన ఆ సేనాపతికి విధేయులయి ఉండాలని సైనికులను ఆజ్ఞాపించారు. అయితే ఆ సేనాపతి (ఒక సందర్భంలో) వారి మీద ఆగ్రహం వెలిబుచ్చుతూ "మీరంతా నాకు విధేయులయి ఉండాలని దైవప్రవక్త (సల్లం) మిమ్మల్ని ఆదేశించ లేదా?" అని అడిగాడు. దానికి వారంతా "నిజమే, ఆదేశించారు" అన్నారు. "అయితే నేనొక నిర్ణయం తీసుకున్నాను. దాని ప్రకారం మీరు కట్టెలు తెచ్చి ఒక చోట పేర్చండి. ఆ తరువాత దానికి నిప్పు పెట్టి అందులోకి ప్రవేశించండి" అని అన్నాడు ఆ సేనాపతి. సైనికులు (అతని ఆజ్ఞను శిరసావహిస్తూ) కట్టెలు తెచ్చి పేర్చారు. వాటికి నిప్పు కూడా పెట్టారు. కాని అందులో ప్రవేశించాలని అనుకున్నప్పుడు వారు ఒకరి ముఖాలు మరొకరు (అయోమయంగా) చూసుకోసాగారు. వారిలో కొందరు మాట్లాడుతూ "మనం (నరక) అగ్ని నుండి తప్పించుకోవడానికే కదా దైవప్రవక్త (సల్లం)కు విధేయులయిపోయాము! అలాంటిది ఇప్పుడు మనం అగ్నిలో దూకడమేమిటీ?" అని అన్నారు. వారు ఈ విధంగా ఆలోచిస్తూ మాట్లాడుకుంటుండగా ఆ నిప్పు కాస్తా ఆరిపోయింది. అటు ఆ సేనాపతి కోపం కూడా చల్లారిపోయింది.

ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) ముందు ఈ సంఘటన గురించి ప్రస్తావించడం జరిగింది. దైవప్రవక్త (సల్లం) అది విని "వారు గనక అప్పుడు అగ్నిలో దూకి ఉంటే ఇక ఎన్నటికీ అగ్ని నుంచి

---

★ ఈ ప్రవచనంలో దైవప్రవక్త (సల్లం) అధికారి విధేయతను తన విధేయతతో పోల్చి అధికారుల వ్యవహారానికి ఎంతో ప్రాముఖ్యం ఇచ్చారు. దీనిక్కారణం ఖురైషీయులకు వారి దగ్గర ఉండే అరబ్బులకు నాయకత్వపు హోదా గురించి అంతగా తెలియక పోవడమే. వారు తమ తెగ నాయకులకు తప్ప మరెవరికీ తలవొగ్గరు. ఇస్లామీ యుగం ప్రారంభ రోజుల్లో ఆ అరబ్బులకు తమపై నాయకుడ్ని నియమించడం నచ్చలేదు. దాంతో కొందరు నాయకునికి విధేయత చూపడానికి నిరాకరించారు. అందువల్ల దైవప్రవక్త (సల్లం) నాయకునికి విధేయత చూపడమంటే తనకు విధేయత చూపడమేనని చెప్పి అధికారి (నాయకుని) విధేయతకు అత్యంత ప్రాముఖ్యమిచ్చారు. ప్రజలు అధికారులకు విధేయత చూపడం నేర్చుకొని, సమాజంలో సంక్షోభం, అనైక్యతలు సృష్టించకూడదన్నదే దైవప్రవక్త (సల్లం) ప్రవచనంలోని ఆంతర్యం. (సంకలనకర్త).

బయటపడే వారే కాదు. ఎల్లప్పుడూ నరకాగ్నిలోనే కాలిపోతూ ఉండేవారు. ధర్మసమ్మతమైన వ్యవహారాల్లో మాత్రమే విధేయత చూపాలి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 93వ ప్రకరణం - అహ్కామ్, 4వ అధ్యాయం - అస్సమ్‌యి వత్తా అతిలిల్ ఇమామి మాలమ్ తకున్ మాసియ)

1207. హజ్రత్ జునాదా బిన్ అబీ ఉమయ్యా (రహ్మలై) కథనం:- మేము ఓసారి హజ్రత్ ఉబాదా బిన్ సామిత్ (రజి) దగ్గరకు వెళ్ళాము. అప్పుడు ఆయన వ్యాధిగ్రస్తులయి ఉన్నారు. మేము ఆయనతో మాట్లాడుతూ "దేవుడు మీకు ఆరోగ్యం చేకూర్చుగాక! మీరు దైవప్రవక్త (సల్లం) దగ్గర విన్న హదీసు ఏదైనా మాకు విన్పించండి. దీనివల్ల దేవుడు మీక్కూడా ప్రయోజనం (పుణ్యం) కలిగించవచ్చు" అని అన్నాము. దానికి ఆయన ఈ విధంగా సమాధానమిచ్చారు:

"దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని ప్రమాణం చేయడానికి పిలిచినప్పుడు మేము ఆయన చేతిపై ప్రమాణం చేశాము. ఈ ప్రమాణంలో ఆయన మాచేత వాగ్దానం చేయించుకున్న విషయాలలో, ఆజ్ఞలు విని వాటిని పాటిస్తామని, అవి మాకు నచ్చినా నచ్చకపోయినా, కలిమిలోనూ లేమిలోనూ, మా హక్కులు కాలరాయబడినా, ఎట్టి పరిస్థితిలోనయినా సరే మేము వాటిని శిరసావహిస్తామన్న వాగ్దానం కూడా ఉంది. ఇంకా ప్రభుత్వ వ్యవహారాలను గురించి ప్రభుత్వాధికారులతో తగవుపడరాదన్న వాగ్దానం కూడా ఉంది. అయితే (పాలకులు) బహిరంగంగా సత్య వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడినప్పుడు మీ దగ్గర దేవునికి సంబంధించిన స్పష్ట ప్రమాణం, తగిన నిదర్శనాలు ఉంటే మటుకు (మీరు వారికి తల ఒగ్గరాదు)"★

(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్, 2వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) సతరౌనబాది ఉమూరన్ తున్‌కిరూనహా)

## 10వ అధ్యాయం - ఖలీఫాతో చేసిన ప్రమాణాన్ని పాటించడం అవశ్యం

1208. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఓసారి ఇలా ప్రవచించారు:- "ఇస్రాయీల్ సంతతి వారి ప్రభుత్వం దైవప్రవక్తల చేతుల్లో ఉండేది. ఒక ప్రవక్త చనిపోగానే ఆయన

★ ఇమామ్ నవవీ (రహ్మలై) ఇలా రాస్తున్నారు: అధికారి (పాలకుడు) బహిరంగంగా షరీఅత్ ఆజ్ఞలను ఉల్లంఘిస్తుంటే మీరు చూస్తూ మౌనంగా ఉండకూడదు. అతని ముందు యదార్థం మాట్లాడటం చాలా అవసరం. అయితే ముస్లిం పాలకునిపై తిరుగుబాటు చేయడం మటుకు నిషిద్ధం. అతను దుర్మార్గుడైనా, దౌర్జన్యపరుడైనా సరే తిరుగుబాటు చేయకూడదు. ఇది యావత్తు ధర్మవేత్తల ఏకాభిప్రాయం. దీనికి ప్రమాణంగా అనేక హదీసులు ఉన్నాయి. అదీగాక దుర్మార్గుడన్న కారణంతో నాయకుడ్ని పదవి నుండి తొలగించకూడదని ధర్మవేత్తలు తీర్మానించారు. పదవి నుండి తొలగిస్తే కల్లోలం, రక్తపాతం జరిగే ప్రమాదం ఉంది."

ఖాజి అయాజ్ (రహ్మలై) ఇలా రాస్తున్నారు : "అవిశ్వాసిని నాయకుడిగా చేయడం సరికాదన్న విషయంలో ధర్మవేత్తల మధ్య ఏకాభిప్రాయం ఉంది. అవిశ్వాసి నాయకుడైతే అతడ్ని పదవి నుండి తొలగించవచ్చు. అలాగే ముస్లిం నాయకుడు నమాజు చేయడం మానేస్తే లేదా ధర్మంలో లేని కొత్త విషయాలు (బిద్అత్) ప్రవేశపెడ్తే అతడ్ని పదవి నుండి తొలగించవచ్చు. అవిశ్వాస వైఖరి అవలంబిస్తే అతనికి విధేయత చూపకూడదు. అంతేగాక అలాంటి నాయకుడ్ని ముస్లింలు తక్షణమే పదవి నుండి తొలగించి అతని స్థానంలో న్యాయశీలుడైన నాయకుడ్ని నియమించాలి. ఇది వారి విద్యుక్త ధర్మం. ధర్మంలో లేని కొత్త విషయాలు ప్రవేశపెడ్తే మాత్రం అతడ్ని పదవి నుండి తొలగించడం అనివార్యం కాదు. అతడ్ని తొలగించే శక్తి లేనప్పుడు ముస్లింలు అతని రాజ్యం నుండి వేరే ప్రాంతానికి వలస (హిజ్రత్ ) పోవాలి. దేవుడే అన్నీ తెలిసినవాడు. (అనువాదకుడు).

స్థానంలో మరొక ప్రవక్త ఆయనకు వారసుడు (ఖలీఫా) అవుతారు. అయితే నా తరువాత మరే దైవప్రవక్తా ప్రభవించడు. కాకపోతే ఖలీఫాలు ఉంటారు, చాలామంది ఉంటారు". అనుచరులు ఈ మాటలు విని "ఈ విషయంలో మాకు మీ ఆజ్ఞ ఏమిటి?" అని అడిగారు. దానికి ఆయన వారితో చేసిన ప్రమాణాన్ని మీరు తప్పకుండా పాటించాలి. మొదట ఎవరితో ప్రమాణం చేయడం జరుగుతుందో అతనికే విధేయులయి ఉండాలి. (ఒకవేళ వారు తమ విధులు, బాధ్యతలు సక్రమంగా నెరవేర్చకపోతే) ఏ ఏ వ్యవహారాలకు వారు బాధ్యులో ఆయా వ్యవహారాలను గురించి స్వయంగా దేవుడే వారి నుండి లెక్క తీసుకుంటాడు. (మీరు మాత్రం మీ బాధ్యతలను నెరవేరుస్తూ ఉండండి.)

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 50వ అధ్యాయం - మా జుకిర అన్ బనీ ఇస్రాయీల్)

1209. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఉద్బోధిస్తూ "మీ హక్కులు కాలరాయబడే కాలం సమీపంలోనే ఉంది. అప్పుడు మీకు నచ్చని విషయాలు కూడా ఉంటాయి" అని అన్నారు. అనుచరులు ఈ మాట విని "దైవప్రవక్తా! అలాంటి పరిస్థితుల్లో మాకు మీ ఆజ్ఞ ఏమిటి?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "మీపై ఇతరులకున్న హక్కులను మీరు నెరవేర్చండి, మీ హక్కులను (ఆనాటి పాలకులు నెరవేర్చకపోతే వాటిని) గురించి మీరు దైవాన్ని అర్థించండి. (దేవుడు ఆ పాలకునికి సద్బుద్ధి ప్రసాదించవచ్చు, లేదా అతడ్ని పదవీచ్యుతుడ్ని చేసి మీ హక్కులు నెరవేర్చే న్యాయశీలుడైన పాలకుణ్ణెవరినయినా మీ కోసం తీసుకు రావచ్చు).

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలా మాతిన్నుబువ్వతి ఫిల్ ఇస్లాం)

## 11వ అధ్యాయం - పాలకుల దౌర్జన్యాల పట్ల సహనం వహించాలి

1210. హజ్రత్ ఉసైద్ బిన్ హుజైర్ (రజి) కథనం:- అన్సార్ వర్గానికి చెందిన ఒక వ్యక్తి వచ్చి "దైవప్రవక్తా! మీరు ఫలానా వ్యక్తికి ప్రభుత్వాధికారం ప్రసాదించారు కదా, అదే విధంగా నాక్కూడా (ఏదైనా ప్రాంతంలో) ప్రభుత్వాధికారం ప్రసాదించండి" అని అడిగాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) నా తదనంతరం సమీపకాలంలోనే మీరు హక్కుల ఉల్లంఘన చూస్తారు. అలాంటి పరిస్థితిలో మీరు కౌసర్ సరస్సు దగ్గర నన్ను కలుసుకునే వరకూ సహనం వహిస్తూ ఉండండి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 8వ అధ్యాయం- ఖౌలిన్నబియ్యి (సల్లం) లిల్ అన్సారి ఇస్‌బిరూ హత్తా తల్‌ఖౌనీ అలల్ హౌజ్)

## 13వ అధ్యాయం - కల్లోల సమయంలో సంఘానికి అంటి పెట్టుకొని ఉండాలి

1211. హజ్రత్ అబూ ఇద్రీస్ ఖౌలాని (రహ్మాలై) కథనం ప్రకారం హజ్రత్ హుజైఫా బిన్ యమాన్ (రజి) ఇలా తెలియజేశారు:- సాధారణంగా ప్రజలు మేలును గురించి దైవప్రవక్త (సల్లం)ను అడుగుతుండేవారు. నేను కీడుకు లోనవుతానేమోనన్న భయంతో దైవప్రవక్త (సల్లం)ను కీడును గురించి కూడా అడుగుతుండేవాడ్ని. ఒకసారి నేను దైవప్రవక్త (సల్లం)ను ఈ విధంగా అడిగాను: "దైవప్రవక్తా! మేము కీడు, అజ్ఞానాంధకారంలో తచ్చాడుతున్నప్పుడు దేవుడు మాకు (ఇస్లాం స్వీకార భాగ్యం ప్రసాదించి) మేలు చేశాడు. ఇలాంటి మేలు తరువాత కీడు రావడం కూడా సంభవమేనా?" దీనికి దైవప్రవక్త

(సల్లం) 'సంభవమే' అన్నారు: "మరి ఆ కీడు తరువాత మేలు కూడా వస్తుందా?" అని అడిగాను మళ్ళీ. "వస్తుంది, అయితే అందులో లోపం ఉంటుంది (అంటే స్వచ్ఛమైన మేలుండదు. అందులో కొంత కీడు కూడా ఉంటుంది)" అన్నారు దైవప్రవక్త (సల్లం). "అది ఎలాంటి లోపం"? అని అడిగాను తిరిగి. "ఆనాడు నా విధానం, సంప్రదాయాలకు బదులు ఇతర విధానాల, సంప్రదాయాల వైపుకు జనాన్ని నడిపించేవారు ఉంటారు. మీకు వారి మాటలు కొన్ని బాగుంటాయి, మరి కొన్ని చెడుగా ఉంటాయి" అన్నారు దైవప్రవక్త (సల్లం). "అయితే ఆ మేలు తరువాత మరేదైనా కీడు జనిస్తుందా?" అని అడిగాను నేను. "ఆఁ, ప్రజలు నరక ద్వారం దగ్గర నిలబడి జనాన్ని పిలుస్తున్నట్లు దుర్మార్గాన్ని వ్యాపింపజేస్తారు. వారు తమ పిలుపును అందుకున్న ప్రతి వ్యక్తినీ నరకంలో పడవేస్తారు' ' అన్నారు దైవప్రవక్త (సల్లం). "అయితే దైవప్రవక్తా! వారు ఎలాంటి లక్షణాలు కలిగి ఉంటారో తెలియ జేయండి" అని అడిగాను నేను. "వారూ మనలాంటి మనుషులే (అంటే ముస్లిములే), మన భాషలోనే మాట్లాడుతారు (అంటే ఇస్లాం గురించే మాట్లాడుతారు)" అన్నారు దైవప్రవక్త (సల్లం). "అలాంటి కాలం నాకు ఎదురయితే నేనేం చేయాలో సెలవియ్యండి" అన్నాను నేను. "అలాంటి పరిస్థితులు ఎదురయితే నీవు ముస్లిం సంఘానికి అంటి పెట్టుకొని ఉంటూ ముస్లింల నాయకునితో కలిసి ఉండు" అన్నారు దైవప్రవక్త (సల్లం). "ఒకవేళ అప్పుడు ముస్లిం సంఘం, ముస్లింల నాయకుడు లేకపోతే నేనేం చెయ్యాలి?" అని అడిగాను నేను. "అప్పుడు నీవు చెట్ల వేళ్ళు తినవలసి వచ్చినా సరే అలాంటి (కుత్సిత) వర్గాలన్నిటికీ దూరంగా ఉండు. నీవు చనిపోయే వరకూ వాటిలో ఏ వర్గంతోనూ చేతులు కలపకు" అన్నారు దైవప్రవక్త (సల్లం).

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలా మాతిన్నుబువ్వతి ఫిల్ ఇస్లాం)

1212. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ఎవరికైనా ధర్మాధర్మాల దృష్ట్యా తమ పాలకునిలో ఏదైనా విషయం నచ్చకపోతే అతను సహనం వహించాలి. నాయకుని విధేయతా పరిధి నుండి ఎవరైనా జానెడు దూరం బయటికి పోయినా సరే, అతను అజ్ఞానపు చావును కొని తెచ్చుకున్నట్లే.

(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్, 2వ అధ్యాయం - ఖౌలిన్న బియ్యి (సల్లం) సతరౌన బాది ఉమూరన్ తున్కిరూనహా)

## 18వ అధ్యాయం - యుద్ధ సమయంలో యోధుల చేత ప్రతిజ్ఞ చేయించటం వాంఛనీయమే

1213. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- హుదైబియా ఒప్పందం జరిగిన రోజు దైవప్రవక్త (సల్లం) మాతో "ఈ రోజు మీరు ప్రపంచ ప్రజలలో కెల్లా ఎంతో శ్రేష్ఠులు" అని అన్నారు. ఆ రోజు మేము పధ్నాలుగు వందల మందిమి ఉన్నాము. నా దృష్టి గనక సరిగా ఉంటే నేను మీకు (రిజ్వాన్ ప్రమాణం జరిగిన) ఆ చెట్టుండిన ప్రదేశాన్ని చూపేవాడ్ని.★

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 35వ అధ్యాయం - గజ్వతిల్ హుదైబియా)

★ "చెట్టుండిన ప్రదేశాన్ని చూపేవాడ్ని" అని అంటే ప్రస్తుతం అక్కడ ఆ చెట్టు లేదన్న మాట. ప్రజలు భక్తి భావంతో ఆ చెట్టు చుట్టూ చేరుతున్నారని తెలిసి రెండవ ఖలీఫా హజ్రత్ ఉమర్ (రజి) దాన్ని నరికి వేయించారు. (అనువాదకుడు).

1214. హజ్రత్ ముసయ్యిబ్ బిన్ హజ్న్ (రజి) కథనం:- నేనా వృక్షాన్ని (ఈ చెట్టు క్రిందే రిజ్వాన్ ప్రమాణం జరిగింది) చూశాను. కాని ఆ తరువాత పోయి చూస్తే నేను దాన్ని కనుగొనలేకపోయాను.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 35వ అధ్యాయం - గజ్వతిల్ హుదైబియా)

1215. హజ్రత్ యజీద్ బిన్ అబీ ఉబైద్ (రహ్మాలై) కథనం:- నేను హజ్రత్ సలమా బిన్ అక్వాయి (రజి)తో మాట్లాడుతూ "హుదైబియా ఒప్పందం సందర్భంలో మీరంతా ఏ విషయం గురించి దైవప్రవక్త (సల్లం) చేతిలో చేయి వేసి ప్రమాణం చేశారు?" అని అడిగాను. దాని కాయన మరణం గురించని అన్నారు. (అంటే యుద్ధరంగం నుండి పారిపోము అనీ, అమరగతి నొందడానికైనా సిద్ధపడతామని ప్రమాణం చేశారన్న మాట).

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 35వ అధ్యాయం - గజ్వతిల్ హుదైబియా)

1216. హజ్రత్ అబ్దుల్లా బిన్ జైద్ (రజి) కథనం:- హుర్రా సంఘటన★ జరిగిన రోజుల్లో ఒక వ్యక్తి నా దగ్గరకు వచ్చి "ఇబ్నె హన్జలా (రహ్మాలై) గారు మరణం గురించి ప్రజల చేత ప్రమాణం చేయిస్తున్నారు" అని అన్నారు. దానికి నేను సమాధానమిస్తూ "(నేను మరణం గురించి ఇది వరకే దైవప్రవక్త (సల్లం) చేతిలో ప్రమాణం చేసి ఉన్నాను). దైవప్రవక్త (సల్లం) తరువాత ఇక నేను ఎవరి చేతిలోనూ ప్రమాణం చేయదలచుకోలేదు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 110వ అధ్యాయం - అల్ బైఅతి ఫిల్ హర్బి అఁల్లాయఫిర్రూ)

## 19వ అధ్యాయం - హిజ్రత్ చేసిన తరువాత స్వస్థలానికి తిరిగొచ్చి నివసించడం నిషిద్ధం

1217. హజ్రత్ యజీద్ బిన్ అబీ ఉబైద్ (రహ్మాలై) కథనం:- హజ్రత్ సలమా బిన్ అక్వాయి (రజి) ఓసారి హజ్జాజ్ బిన్ యూసుఫ్ (క్రూర పాలకుడు) దగ్గరకు వెళ్ళారు. అప్పుడు హజ్జాజ్ ఆయనతో మాట్లాడుతూ "ఇబ్నె అక్వాయి! మీరు (మదీనా వదలి) వెనక్కి మరలిపోయి మళ్ళీ గ్రామీణ జీవితాన్ని అవలంబించారా?" అని అడిగాడు. దానికి ఆయన సమాధానమిస్తూ" లేదు, నాకు స్వయంగా దైవప్రవక్తే (సల్లం) గ్రామంలో నివసించడానికి అనుమతినిచ్చారు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్, 14 వ అధ్యాయం - అత్త అర్రుబి ఫిల్ ఫిత్నహ్)

★ హుర్రా సంఘటన-హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) వారసత్వంలో అధికారం చేజిక్కించుకున్న యజీద్‌ని ఖలీఫాగా గుర్తిస్తూ ప్రమాణం చేయడానికి నిరాకరించి, తనను ఖలీఫాగా ప్రకటించుకున్నారు. అప్పుడు వారిరువురి పక్షాల మధ్య యుద్ధం జరిగి అనేక మంది అమాయక ముస్లింలు అమరగతి నొందారు. చివరికి హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) ని కూడా మదీనా గవర్నర్ హజాజ్ బిన్ యూసుఫ్ హతమార్చాడు. (అనువాదకుడు)

## 20వ అధ్యాయం - మక్కా జయించబడిన తరువాత ఇస్లాం, జిహాద్‌ల గురించి ప్రమాణం

1218. హజ్రత్ అబూ ఉస్మాన్ నహ్ది (రహ్మలై) కథనం :- హజ్రత్ ముజాషు బిన్ మస్వూద్ (రజి) ఇలా అన్నారు - "అబూ మాబుద్ (రజి) చేత హిజ్రత్‌ని గురించి ప్రమాణం చేయించడానికి, నేను ఆయన్ని దైవప్రవక్త (సల్లం) దగ్గరకు పిలుచుకు వెళ్ళాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు - హిజ్రత్ చేసే వారి కోసం హిజ్రత్ కాలం ముగిసిపోయింది. ఇప్పుడు నేను అలాంటి వారి చేత ఇస్లాం, జిహాద్‌లను గురించి ప్రమాణం చేయిస్తాను అని అన్నారు".

ఆ తరువాత నేను అబూ మాబుద్ (రజి) దగ్గరి కెళ్ళి ఈ విషయం గురించి ఆయన్ని అడిగాను. అది విని ఆయన "హజ్రత్ ముజాషు (రజి) నిజమే చెప్పారు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ :- 64వ ప్రకరణం -మగాజి, 53వ అధ్యాయం - వఖాలల్లైస్)**

1219. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) మక్కా జయించబడిన రోజు ఇలా ప్రవచించారు:- ఇక నుండి హిజ్రత్ (వలస) ఉండదు. అయితే జిహాద్, (సత్కార్యాల) సంకల్పం మాత్రం యధాతథంగా ఉంటాయి. (కనుక) మిమ్మల్ని జిహాద్ (ధర్మపోరాటం) కోసం పిలుపునిస్తే వెంటనే బయలుదేరండి.(1)

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 194వ అధ్యాయం - లా హిజ్రత బాదల్ ఫత్‌హి)**

1220. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- ఒక పల్లెవాసి హిజ్రత్ (వలస)(2) చేయడానికి తనకు అనుమతినివ్వమని దైవప్రవక్త (సల్లం)ను అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) "పిచ్చివాడా! హిజ్రత్ (అంటే అంత తేలికయిన విషయం కాదు అది) చాలా కష్టంతో కూడిన పని" అని అన్నారు. ఆ తరువాత కాస్సేపటికి "సరే, నీ దగ్గర ఒంటెలు ఉన్నాయా? ఉంటే వాటి నుండి జకాత్ తీసి చెల్లిస్తున్నావా?" అని ప్రశ్నించారు. దానికా పల్లెవాసి 'ఆఁ' అన్నాడు. "అయితే ఆ పనే చేస్తూ ఉండు. నీవు సముద్రం అవల ఉండి సత్కార్యం చేసినా దేవుడు దాన్ని వృధా చేయడు. దాని ప్రతిఫలం నీకు తప్పకుండా లభిస్తుంది" అని ఉపదేశించారు దైవప్రవక్త (సల్లం).

**(సహీహ్ బుఖారీ:- 24వ ప్రకరణం - జకాత్, 36వ అధ్యాయం - జకాతిల్ ఇబిల్)**

---

(1) దారుల్ హరబ్ (శత్రు రాజ్యం) నుండి దారుల్ ఇస్లాం (ఇస్లామీయ రాజ్యం) కు మాత్రం హిజ్రత్ (వలస) ఎల్లప్పుడూ ఉంటుందని హదీసు వేత్తలు అన్నారు. మక్కా ఇస్లామీయ రాజ్యంగా మారింది గనక ఇక ముందు మక్కా నుండి వేరే ప్రాంతానికి హిజ్రత్ (వలస) ఉండదని ఈ హదీసు తెలియజేస్తోంది. అంటే మక్కా జయించబడటానికి పూర్వం మక్కా నుండి హిజ్రత్ చేస్తే లభించే అంతటి పుణ్యం ఇప్పుడు లభించదనీ, ఆ కాలంలో హిజ్రత్ చేసిన వారికి లభించిన స్థానం ఇక ముందు ఎవరికీ లభించదని కూడా మరో అర్థం స్ఫురిస్తుంది. (ఇమామ్ నవవీ-రహ్మలై)

(2) ఈ పల్లెవాసి తన గ్రామం నుండి మదీనాకు హిజ్రత్ (వలస) చేయడానికి అనుమతి అడిగాడు.

## 21వ అధ్యాయం - స్త్రీల చేత ప్రమాణం చేయించే పద్ధతి

1221. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- "విశ్వాసులారా! విశ్వసించిన స్త్రీలు హిజ్రత్ చేసి మీ దగ్గరకు వస్తే వారి (విశ్వాసస్థితి)ని పరీక్షించండి." (ఖుర్ఆన్ - ముమ్తహిన: 10-12) అన్న దైవసూక్తి ప్రకారం దైవప్రవక్త (సల్లం) మక్కా నుండి మదీనాకు వలస వచ్చిన స్త్రీలను పరీక్షించారు.

విశ్వసించిన స్త్రీలు (ముమ్తహిన సూరాలోని) ఈ షరతుల్ని అంగీకరిస్తే వారు ప్రమాణం చేసినట్లే. అందుచేత దైవప్రవక్త (సల్లం), వీటిని నోటిపూర్వకంగా అంగీకరించిన ప్రతి మహిళతో "నేను నీ చేత ప్రమాణం చేయించాను, వెళ్ళు" అని అనేవారు. దైవసాక్షిగా చెబుతున్నాను. దైవప్రవక్త (సల్లం) హస్తం ఎన్నడూ ఏ (పర) స్త్రీ చేతినీ లేశమయినా తాకలేదు. ఆయన వారి చేత నోటితో మాత్రమే ప్రమాణం చేయించారు. అదే విధంగా దైవసాక్షిగా చెబుతున్నాను - దేవుడు ఆజ్ఞాపించిన విషయాలను గురించి తప్ప మరే విషయాలను గురించి కూడా ఆయన ఎన్నడూ ఏ స్త్రీ చేతా ప్రమాణం చేయించలేదు. ప్రమాణం చేయించిన తరువాత, 'నేను నీ చేత ప్రమాణం చేయించాను' అని మాత్రమే పలికేవారు".

**(సహీహ్ బుఖారీ:- 68వ ప్రకరణం - తలాఖ్, 20వ అధ్యాయం - ఇజా అస్లమతిల్ ముష్రికతు అవిన్నస్రానియ్యత్ తహ్తజ్జిమ్మీ అవిల్ హర్బియ్యి)**

## 22వ అధ్యాయం - ప్రమాణం చేసేటప్పుడు 'శక్తి మేరకు విధేయత చూపుతాన'ని చెప్పాలి

1222. హజ్రత్ అబ్దుల్లాబిన్ ఉమర్ (రజి) కథనం:- మేము 'వింటాము, శిరసావహిస్తాము' అన్న వాగ్దానంతో పాటు దైవప్రవక్త (సల్లం) చేతిపై ప్రమాణం చేసేప్పుడు 'శక్తి మేరకు అని పలకండి' అని ఆయన మమ్మల్ని ఉపదేశించేవారు.

**(సహీహ్ బుఖారీ:- 93వ ప్రకరణం - అహ్కామ్, 43 వ అధ్యాయం - కైఫ యుబాయివుల్ ఇమామున్నాస్)**

## 23వ అధ్యాయం - వయోజనుడి కనీస వయస్సు

1223. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- ఉహుద్ యుద్ధం రోజున నేను (సైన్యంలో భర్తీ కావడానికి) దైవప్రవక్త (సల్లం) ముందు నిల్చున్నాను. అప్పుడు నా వయస్సు పధ్నాలుగు సంవత్సరాలు. అందువల్ల దైవప్రవక్త (సల్లం) నన్ను సైన్యంలో భర్తీ కావడానికి అనుమతించలేదు. తిరిగి నేను కందకం యుద్ధ సమయంలో దైవప్రవక్త (సల్లం) ముందు నిల్చున్నాను. అప్పుడు నా వయస్సు పదిహేను సంవత్సరాలు. (ఈసారి) దైవప్రవక్త (సల్లం) నన్ను సైన్యంలో భర్తీ కావడానికి అనుమతించారు.★

**(సహీహ్ బుఖారీ:- 52వ ప్రకరణం - షహాదాత్, 18వ అధ్యాయం - బులూగిస్సిబియాన్ వ షహాదతిహిమ్)**

---

★ చాంద్రమానం ప్రకారం పదిహేను సంవత్సరాలు నిండిన బాలుడు యువజనుడుగా పరిగణించబడతాడని; ఆ వయస్సులో అతనికి వీర్య స్ఖలనం అయినా, కాకపోయినా యువజనులకు మాదిరిగా అతనికి షరీఅత్ ఆజ్ఞలన్నీ వర్తిస్తాయని, విజయప్రాప్తి (మాలె గనీమత్) నుండి అతనికి పూర్తి వాటా లభిస్తుందని చెప్పడానికి ఈ హదీసుని ప్రామాణికంగా తీసుకోవడం జరిగింది.

## 24వ అధ్యాయం - అపచార భయముంటే ఖుర్‌ఆన్‌ని శత్రు దేశానికి తీసుకుపోరాదు

1224. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దివ్య ఖుర్‌ఆన్‌ని తీసుకొని శత్రు భూభాగంలో ప్రవేశించడాన్ని దైవప్రవక్త (సల్లం) వారించారు.*

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం -జిహాద్, 129వ అధ్యాయం - అస్సఫరి బిల్ మసాహిఫి ఇలా అర్జిల్ అదువ్వి)

## 25వ అధ్యాయం - గుర్రాల తర్ఫీదు

1225. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) పందెం కోసం శిక్షణ ఇవ్వబడిన గుర్రాల పరుగు కొరకు హఫ్యా నుండి సనియ్యతిల్ విదా వరకు గల దూరాన్ని నిర్ణయించారు. పందెం కోసం శిక్షణ ఇవ్వబడని గుర్రాల పరుగు కొరకు సనియ్యతిల్ విదా నుండి బనీ జురైఖ్ మస్జిద్ వరకు గల దూరాన్ని నిర్ణయించారు - హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కూడా ఆ గుర్రపు పందాలలో పాల్గొన్నారు.

(సహీహ్ బుఖారీ:- 8వ ప్రకరణం - సలాత్, 41వ అధ్యాయం - హల్ యుఖాలు మస్జిదు బనీ ఫలాన్)

## 26వ అధ్యాయం - గుర్రాల నుదుట శ్రేయోశుభాలు

1226. హజ్రత్ అబ్దుల్లా బిన్‌ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- గుర్రాల నుదుటిపై శ్రేయోశుభాలు ఉన్నాయి. అవి ప్రళయం దాకా ఉంటాయి.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 43వ అధ్యాయం - అల్‌ఖైలు మాఖూదున్ ఫీ నవాసీహల్‌ఖైరు ఇలా యౌమిల్ ఖియామ)

1227. హజ్రత్ ఉర్వతుల్ బారిఖి (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- గుర్రాల నొసళ్ళతో శ్రేయోశుభాలు ప్రళయం వరకు పెనవేసుకుని ఉన్నాయి. (వాటి ద్వారా మానవులకు పరలోకంలో) పుణ్యం, (ఇహలోకంలో) విజయప్రాప్తి లభిస్తుంటాయి.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 44వ అధ్యాయం - అల్ జిహాదు మాజిన్ మఅల్ బర్రి వల్ ఫాజిరి)

1228. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- "గుర్రాల నుదుట శ్రేయోశుభాలు ఉన్నాయి".

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 43వ అధ్యాయం - అల్‌ఖైలు మా ఖూదున్ ఫీనవాసీహ ఇలా యౌమిల్ ఖియామ)

## 28వ అధ్యాయం - ధర్మ యుద్ధం - దాని పుణ్యఫలం

1229. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఉపదేశించారు:-

---

★ దివ్య ఖుర్‌ఆన్‌ని శత్రు భూభాగంలోకి తీసికెళ్తే దాని పవిత్రతకు భంగం వాటిల్లే ప్రమాదం ఉంటుంది గనక ఈ నిషేధం విధించబడిందని, అలాంటి ప్రమాదం లేని పక్షంలో తీసికెళ్ళవచ్చని ఇమామ్ నవవీ (రహ్మాలై) అభిప్రాయపడ్డారు. కాని ఇమామ్ మాలిక్ (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం ఎట్టి పరిస్థితిలోనూ శత్రు భూభాగంలోకి దివ్య ఖుర్‌ఆన్‌ని తీసికెళ్ళకూడదు. అంతేకాదు, దేవుని పేరుండే నాణాలను కూడా అవిశ్వాసులకు ఇవ్వడం నిషిద్ధమని ఆయన అంటారు. (అనువాదకుడు)

దేవుడు తన మార్గంలో యుద్ధం చేయడానికి బయలుదేరే వ్యక్తికి పుణ్యం ప్రసాదించడంతో పాటు, అతను పొందిన విజయప్రాప్తితో అతడ్ని (క్షేమంగా) ఇంటికి మరలింపజేస్తానని, లేదా అమరగతి నొందే భాగ్యం ప్రసాదించి అతడ్ని స్వర్గంలో ప్రవేశింపజేస్తానని హామీనిస్తున్నాడు. అయితే అతను తనను విశ్వసించాలని, తన ప్రవక్తల దౌత్యాన్ని ధృవపరచాలని అది తప్ప అతనికి మరే ఉద్దేశ్యం ఉండకూడదని దేవుడు అన్నాడు. నా అనుచర సమాజం గనక కష్టాల్లో పడుతుందన్న భయం లేకపోతే నేను జిహాద్‌కు వెళ్ళే ప్రతి సైనిక దళం వెంట జిహాద్ చేయడానికి వెళ్తాను. ఏ దండయాత్రలోనూ నేను వెనకుండిపోను. నేను దైవమార్గంలో వీరమరణం (అమరగతి) పొందాలని, తిరిగి బ్రతికించబడి మళ్ళీ (యుద్ధం చేసి) వీరమరణం పొందాలని, ఇలా మాటి మాటికీ (ధర్మయుద్ధం చేసి) వీరమరణం పొందాలని కోరుకుంటాను.

(సహీహ్ బుఖారీ - 2వ ప్రకరణం - ఈమాన్, 26వ అధ్యాయం - అల్ జిహాదు మినల్ ఈమాన్)

1230. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- దేవుడు తన మార్గంలో (అంటే ధర్మ సంస్థాపనకై) పోరాటం సలిపే వ్యక్తికి స్వర్గ ప్రవేశ భాగ్యమయినా ప్రసాదిస్తాను లేదా పుణ్యం, విజయప్రాప్తిని అనుగ్రహించి అతడ్ని ఇంటికైనా మరలింప జేస్తాను అని హామీనిస్తున్నాడు. అయితే ఆ వ్యక్తి కేవలం దైవప్రసన్నత కోసమే పోరాడాలి, ఆయన (ఖుర్ఆన్) సూక్తుల్ని సమర్థించాలి. (అంతేగాని అతనికి పేరు ప్రఖ్యాతులు, ప్రాపంచిక ప్రయోజనాలు వంటి దురుద్దేశ్యాలు ఉండకూడదు).

(సహీహ్ బుఖారీ:- 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖుమ్స్, 8వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) ఉహిల్లత్ లకుముల్ గనాయిమ్)

1231. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- ప్రతి ముస్లింకు దైవమార్గంలో (అంటే ధర్మయుద్ధంలో) అయ్యే గాయం, దెబ్బతగిలినప్పుడు రక్తం కారిపోతూ ఎర్రగా ఎలా ఉండేదో ప్రళయ దినాన (తిరిగి బ్రతికించబడేరోజు) కూడా అదేవిధంగా (రక్తం కారుతూ) ఉంటుంది. అయితే ఆ గాయం నుండి కస్తూరి సువాసన వెలువడుతూ ఉంటుంది.

(సహీహ్ బుఖారీ:- 4వ ప్రకరణం - వుజూ, 67వ అధ్యాయం - మాయఖవు మినన్నజాసాతి ఫిస్సమ్ని వల్మాయి)

## 29వ అధ్యాయం - దైవమార్గంలో అమరగతి - దాని ఔన్నత్యం.

1232. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు:- అమరగతుడయిన ఒక్క వీర యోధుడు (షహీద్) తప్ప స్వర్గంలో ప్రవేశించిన ఏ వ్యక్తి కూడా ప్రపంచ సంపదలన్నీ ఇవ్వబడతాయన్నా సరే, తిరిగి ఇహలోకానికి పోవడానికి ససేమిరా ఇష్టపడడు. అమరగతుడయిన వీర యోధుడు అమరగతి (షహాదత్) కి సంబంధించిన గౌరవ ఔన్నత్యాలు చూసి ఉంటాడు గనక, అతను మళ్ళీ ఇహలోకానికి వెళ్ళి (దైవమార్గంలో) పదిసార్లు (అయినా) వీరమరణం పొందాలని కోరుకుంటాడు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్ , 21 వ అధ్యాయం - తమన్నిల్ ముజాహిది అఁయర్జిఅ ఇలద్దున్యా)

1233. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి 'ధర్మయుద్ధానికి (జిహాద్‌కు) ప్రత్యామ్నాయం కాగల సత్కార్యం ఏదైనా ఉంటే నాకు తెలియజేయండి' అని అన్నాడు. దానికి దైవప్రవక్త (సల్లం) "ధర్మ యుద్ధానికి సమానమైన సత్కార్యం ఏదీ ఉన్నట్లు నాకు కన్పించడం లేదు" అని అన్నారు. ఆ తరువాత కాస్సేపటికి ఇలా అన్నారు. "అయితే నువ్వొక పని చెయ్యి. ముజాహిద్ (యోధు)లు ధర్మయుద్ధానికి వెళ్ళిపోయినప్పుడు నీవు మస్జిద్‌కు వెళ్ళి నిరంతరాయంగా నమాజులు చేస్తూ ఉండు. అలాగే మధ్యలో ఒక్కసారి కూడా విరమించకుండా నిరంతరాయంగా ఉపవాసవ్రతాలు కూడా పాటిస్తూ ఉండు. మరి నువ్విలా చేయగలవా?" దానికావ్యక్తి "ఇలా ఎవరు చేయగలరండీ!" అని అన్నాడు.

(సహీహ్ బుఖారీ :- 56వ ప్రకరణం - జిహాద్, 1వ అధ్యాయం - ఫజ్లిల్ జిహాది వస్సియర్)

## 30వ అధ్యాయం - దైవమార్గంలో ఒక ఉదయమో, ఒక సాయంత్రమో గడిపిన దాని పుణ్యం

1234. హజ్రత్ అనస్‌బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- దైవమార్గంలో ఒక ఉదయమో, ఒక సాయంత్రమో గడపడం (గడిపినందువల్ల లభించే పుణ్యఫలం) యావత్ప్రపంచం, ప్రపంచ సంపదలన్నిటి కంటే ఎంతో శ్రేష్ఠమయినది.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 5వ అధ్యాయం - అల్ గద్వతి వర్రౌహతి ఫీసబీలిల్లాహ్)

1235. హజ్రత్ సహల్ బిన్ సాద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు:- దైవమార్గంలో ఒక ఉదయమో, ఒక సాయంత్రమో గడపడం (గడిపినందువల్ల లభించే పుణ్యఫలం) యావత్ప్రపంచం, ప్రపంచ సంపదలన్నింటి కంటే ఎంతో శ్రేష్ఠమయినది.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 5వ అధ్యాయం - అల్ గద్వతి వర్రౌహతి ఫీసబీలిల్లాహ్)

1236. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు:- దైవమార్గంలో నడవడం (అంటే అలా నడవడం వల్ల చేకూరే పుణ్యఫలం) సూర్యుడు ఏఏ వస్తువులపై ఉదయిస్తాడో, అస్తమిస్తాడో ఆయా వస్తు సంపదలన్నింటి కంటే ఎంతో శ్రేష్టమయినది.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - అల్ జిహాద్, వస్సైర్, 5వ అధ్యాయం - అల్‌గద్వతి వర్రౌహతి ఫీసబీలిల్లాహ్)

## 34వ అధ్యాయం - దైవమార్గంలో పోరాడటానికి, శత్రువును ఎదుర్కోవడానికి సంసిద్ధత

1237. హజ్రత్ అబూసయీద్ ఖుదరీ (రజి) కథనం:- "అందరి కంటే శ్రేష్ఠమైన వాడెవడు?" అన్న ప్రశ్నకు దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చారు; "దైవమార్గంలో తన ధన ప్రాణాలు త్యజించి పోరాడే విశ్వాసి( అందరిలో కెల్లా శ్రేష్ఠమైనవాడు)". "ఆ తరువాత ఎవరు శ్రేష్ఠమైన వ్యక్తి?" అన్న మరో ప్రశ్నకు "ఏదైనా పర్వత లోయలో కెళ్ళి కూర్చొని, దేవునికి భయపడుతూ ప్రజలను తన కీడు నుండి

కాపాడే విశ్వాసి" అని సమాధానమిచ్చారు ఆయన. ★

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం-జిహాద్, 2వ అధ్యాయం - అఫ్జలిన్నాసి మూమినున్ యుజాహిద్ బి నఫ్సిహీ వ మాలిహీ ఫీ సబీలిల్లాహ్)

## 35వ అధ్యాయం - హతుడు, హంతకుడు ఇద్దరికీ స్వర్గప్రవేశ భాగ్యం!

1238. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు. దేవుడు (ప్రళయదినాన) ఇద్దర్ని చూసి (సంతోషంతో) నవ్వుతాడు. వారిలో ఒకడు మరొకడ్ని వధిస్తాడు. అయినప్పటికీ ఇద్దరూ స్వర్గానికి వెళ్తారు. (ఎలాగంటే) ఒకడు దైవమార్గంలో పోరాడుతూ వీరమరణం (షహాదత్) పొందుతాడు. ఆ తరువాత దేవుడు అతడ్ని చంపిన హంతకునికి పశ్చాత్తాప భాగ్యం ప్రసాదిస్తాడు. అతను కూడా (ముస్లింగా మారి దైవమార్గంలో) వీరమరణం పొందుతాడు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 28వ అధ్యాయం - అల్ కాఫిరు యఖ్తులుల్ ముస్లిమ్ సుమ్మ ముస్లిము)

## 38వ అధ్యాయం - దైవమార్గంలో పోరాడే వారికి సహాయ సహకారాలు

1239. హజ్రత్ జైద్ బిన్ ఖాలిద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా బోధించారు:- దైవమార్గంలో పోరాడే యోధునికి కావలసిన వస్తు సామగ్రి తదితర అవసరాలను ఎవరు తీరుస్తాడో అతను కూడా ధర్మపోరాటం సలిపిన వాడిగా పరిగణించబడతాడు. అలాగే దైవమార్గంలో పోరాడే యోధుడి ఇంటిని, అతని కుటుంబాన్ని కనిపెట్టుకొని ఉండే వ్యక్తి కూడా ధర్మపోరాటం చేసేవానిగానే లెక్కించబడతాడు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - అల్‌జిహాద్, వస్సైర్, 38వ అధ్యాయం - ఫజ్లిమన్ జహ్హజగాజియన్ ఔ ఖల్లఫహూ బిఖైర్)

## 40వ అధ్యాయం - వికలాంగులపై జిహాద్ విధి కాదు

1240. హజ్రత్ బర్రాబిన్ ఆజిబ్ (రజి) కథనం:- "లాయస్తవిల్ ఖాయిదూన మినల్ మోమినీన్" (అన్నిసా సూరా) అనే దైవసూక్తి అవతరించినప్పుడు దైవప్రవక్త (సల్లం), హజ్రత్ జైద్ బిన్ సాబిత్ (రజి)ని పిలిపించారు. ఆయన వచ్చి ఓ భుజపు ఎముక మీద ఈ సూక్తిని రాశారు. ఆ తరువాత హజ్రత్ ఇబ్నె ఉమ్మె మక్తూమ్ (రజి) దైవప్రవక్త (సల్లం)ను విన్నవించుకుంటూ "నేను అంధుడ్ని (యుద్ధంలో పాల్గొనలేని వాడ్ని. వీరయోధులు పొందగలుగుతున్న పుణ్యాన్ని పొందలేని నిర్భాగ్యుడ్ని)" అన్నారు. అప్పుడు దైవసూక్తి చివరిభాగం అవతరించింది ("ముస్లిములలో ఎలాంటి శారీరక బలహీనత

---

★ ఇమామ్ నవవీ (రహ్మలై) అభిప్రాయం ప్రకారం ఈ హదీసులో ఇద్దరు వ్యక్తులు అందరికంటే శ్రేష్ఠులుగా పరిగణించబడ్డారు. ఒకతను దైవమార్గంలో పోరాడే వాడు, రెండవతను ఏకాంతకుహరాన్ని ఆశ్రయించిన దైవభక్తుడు. ముజాహిద్ (దైవమార్గంలో పోరాడే యోధుడు) శ్రేష్ఠుడనే విషయం తెలుస్తూనే ఉంది. అయితే ఏకాంత కుహరం ఆశ్రయించిన దైవభక్తుడు. ఇమామ్ షాఫయి వగైరా ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం కల్లోలం, కలహాలు జరుగుతున్నప్పుడు సామూహిక జీవితం గడపటం కంటే ఏకాంతవాసం అవలంబించడమే శ్రేష్ఠమైనది. ఈ విధంగా మనిషి ఏకాంత కుహరాన్ని ఆశ్రయించడం ద్వారా కలహాల కీడు నుండి సురక్షితంగా ఉండగలడు. కలహాలు లేకపోతే ధార్మిక ప్రయోజనముండే పద్ధతిని మాత్రమే అవలంబించడం మంచిది.

లేకపోయినా ఇంట్లోనే కూర్చుండి పోయేవారు, దైవమార్గంలో ధనప్రాణాలు త్యజించి పోరాడేవారు సమానులు కారు (వారి హోదా అంతస్థులు వేర్వేరుగా ఉంటాయి)". (4:95)

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - అల్ జిహాద్, వస్సైర్, 31వ అధ్యాయం - ఖౌలిల్లాహితఆలా (లాయస్తవిల్ ఖాయిదూన్) మినల్ మోమినీన గైరు ఉలిజ్జరరి)

## 41వ అధ్యాయం - అమరవీరుని (షహీద్)కి స్వర్గం ఖాయం

1241. హజ్రత్ జాబిర్‌బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- ఉహుద్ యుద్ధం రోజు ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరకు వచ్చి "దైవప్రవక్తా! నేను (ఈ యుద్ధంలో) వధించబడితే ఎక్కడుంటాను?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) స్వర్గంలో ఉంటావని సమాధానమిచ్చారు. ఆ వ్యక్తి ఈ మాట వినగానే చేతిలో ఉన్న ఖర్జూర పండ్లను విసిరి పారేసి యుద్ధరంగంలోకి దూకాడు, (యుద్ధం చేస్తూ) చివరికి అమరగతి నొందాడు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం-మగాజి, 17వ అధ్యాయం-గజ్వతి ఉహుద్)

1242. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) బనీ ఆమిర్ తెగ (ప్రాంతం) వైపుకు పంపిన డెబ్భైమంది ఖుర్‌ఆన్ స్మర్తల్లో★బనీ సలీం తెగకు చెందిన వారు కూడా కొందరున్నారు. వీరంతా అక్కడికి చేరుకున్న తరువాత మా మామయ్య వారితో "నేను మీ కంటే ముందు వెళ్తాను. నేను వారికి దైవప్రవక్త (సల్లం) సందేశం అందజేయడానికి వీలుగా వారు గనక నాకు రక్షణ నిస్తే సరే; లేకపోతే మీరు నాకు సమీపంలోనే ఉంటారు. అవసరమయితే వెంటనే మీరొచ్చి నాకు సహాయ పడగలరు" అని అన్నారు. ఆ తరువాత ఆయన ముందుకు వెళ్ళారు. అవిశ్వాసులు ఆయనకు రక్షణ నిచ్చారు. దాంతో ఆయన వారితో (నిశ్చింతగా) మాట్లాడారు. తరువాత దైవప్రవక్త (సల్లం) సందేశం విన్పించనారంభించారు. అప్పుడు అకస్మాత్తుగా వారు తమ మనిషి ఒకడ్ని సైగ చేశారు. అతను వెంటనే మా మామయ్య గుండెలోకి ఈటెను దిగగొట్టాడు. ఆయన 'అల్లాహు అక్బర్' అని నినదిస్తూ "కాబా ప్రభువు సాక్షి! నేను నా లక్ష్యాన్ని చేరుకున్నాను" అని అన్నారు. ఆ తరువాత వారు మిగిలిన వారిపై కూడా విరుచుకుపడి అందర్నీ వధించారు. ఒక వ్యక్తి మాత్రం మిగిలాడు. అతను కుంటివాడు. అతను ఓ కొండెక్కి తప్పించుకున్నాడు.

ఈ హదీసు ఉల్లేఖకుల్లో ఒకరైన హజ్రత్ హమ్మామ్ (రహ్మాలై) తమ అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తూ "అతనితో పాటు మరొక వ్యక్తి కూడా తప్పించుకొని ఉంటాడు" అని అన్నారు.

---

★ ఈ ఖుర్‌ఆన్ స్మర్తలు (హాఫిజ్‌లు) అస్‌హాబె సుప్ఫా (అరుగువాసుల) కు చెందినవారు. మస్జిదె నబవీలో ఉన్న ఈ అరుగు మీద దివ్యఖుర్‌ఆన్‌ని నేర్చుకునేవారు నివసించేవారు. వీరు రాత్రివేళ ఖుర్‌ఆన్ పారాయణం చేయడం, దాన్ని గురించి యోచించడంలో గడిపేవారు. పగలు మస్జిద్ కోసం నీళ్ళు తీసుకురావడం, అడవికెళ్ళి కట్టెలు తెచ్చి అమ్మడం చేస్తుంటారు. వీరీ సంపాదనను ఎలాంటి జీవనోపాధిలేని నిరుపేదల తిండి కోసం ఖర్చు చేసేవారు. ఈ విధంగా వీరు తమ జీవితాన్ని ధార్మిక సేవకోసం అంకితం చేసుకున్నారు. వారిలో నుండే డెబ్భై మంది ఖుర్‌ఆన్ స్మర్తలను దైవప్రవక్త (సల్లం) బనీ ఆమిర్ తెగవారి కోరికపై ఖుర్‌ఆన్ విద్య నేర్పేందుకు వారి దగ్గరకు (అంటే ఆ తెగ నివసించే ప్రాంతానికి ) పంపించారు. కాని ఆ దుర్మార్గులు వారిని మోసగించి హతమార్చారు. వారిలో ఒకరిద్దరు మాత్రమే ఎలాగో ప్రాణం దక్కించుకొని బయటపడ్డారు. ఇది ఇస్లాం చరిత్రలో ఓ గొప్ప సంఘటనగా నిలిచిపోయింది. (అనువాదకుడు).

ఆ తరువాత దైవదూత హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) దైవప్రవక్త (సల్లం) దగ్గరకు వచ్చి (ధర్మ ప్రచార నిమిత్తం మీరు పంపిన) వారంతా తమ ప్రభువు దగ్గరకు చేరుకున్నారని, వారి ప్రభువు వారి పట్ల ప్రసన్నుడయ్యాడని, వారు తమ ప్రభువు పట్ల సంతోషించారని తెలియజేశారు.

అందువల్ల మేము (ఖుర్ఆన్‌లోని) "అన్‌బల్లిగూ ఖౌమనా అన్ ఖద్ లఖీనా రబ్బనా ఫరజియ అన్నా వ అర్జానా" అనే సూక్తిని కొంత కాలం వరకు పఠిస్తూ ఉండేవారము. అయితే ఆ తరువాత ఈ సూక్తి పారాయణం రద్దయిపోయింది. తరువాత దైవప్రవక్త (సల్లం) రాల్, బనీజక్వాన్, బనీలహ్యాన్, బనీ అసైతా తెగలను నలభై రోజుల పాటు శపించారు. వారు (వాగ్దాన భంగం చేసి, మోసానికి పాల్పడి) దేవునికి, దైవప్రవక్త (సల్లం)కు అవిధేయులయిపోయారు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 9వ అధ్యాయం - మయ్యున్కబు ఫీసబీలిల్లాహ్)

## 42వ అధ్యాయం- దైవధర్మోన్నతి కోసం పోరాడేవాని పోరాటమే "జిహాద్ ఫీసబీలిల్లాహ్"

1243. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి ఇలా అడిగాడు: "దైవప్రవక్తా! ఒకడు యుద్ధ సొత్తు కోసం యుద్ధంలో పాల్గొంటాడు. మరొకడు పేరు ప్రఖ్యాతుల కోసం యుద్ధం చేస్తాడు. వేరొకడు తన ప్రతిభా పరాక్రమాలు ప్రదర్శించడానికి పోరాడుతాడు. ఈ ముగ్గురిలో ఎవరి యుద్ధం ధర్మయుద్ధం (జిహాద్ ఫీసబీలిల్లాహ్)గా పరిగణించబడుతుంది?" దైవప్రవక్త (సల్లం) దీనికి సమాధానమిస్తూ "కేవలం దైవధర్మోన్నతి కోసం చేసే పోరాటమే ధర్మయుద్ధంగా పరిగణించబడుతుంది" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 15వ అధ్యాయం - మన్‌ఖాతల లితకూనక లిమయల్లాహి హియల్‌ఉల్యా)

1244. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి ఇలా అడిగాడు: "దైవప్రవక్తా! ఒకడు కోపోద్రేకాల స్థితిలో (ప్రతీకారం తీర్చుకోవడానికి) యుద్ధం చేస్తాడు. మరొకడు తన (వ్యక్తిగత, జాతీయ) గౌరవం, పౌరుషాలను దృష్టిలో పెట్టుకొని యుద్ధం చేస్తాడు. వీటిలో ధర్మ యుద్ధం (జిహాద్ ఫీసబీలిల్లాహ్) క్రిందికి ఏది వస్తుంది?" దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని ముఖంపైకెత్తి ప్రశ్న అడిగిన వ్యక్తి వైపు చూశారు - ప్రశ్న అడిగిన వ్యక్తి నిలబడి ఉండటం వల్ల దైవప్రవక్త (సల్లం) తమ ముఖాన్ని పైకెత్తవలసి వచ్చిందని హదీసు ఉల్లేఖకుని ఉవాచ- ఆయన ఇలా అన్నారు. "కేవలం దైవధర్మోన్నతి కోసం చేసే పోరాటమే ధర్మయుద్ధం క్రిందికి వస్తుంది".

(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం -ఇల్మ్, 45వ అధ్యాయం - మన్‌సాల వహువ ఖాయిమున్ ఆలిమన్ జాలిసన్)

## 45వ అధ్యాయం - కర్మలన్నీ సంకల్పం మీద ఆధారపడి ఉంటాయి, జిహాద్ కూడా అంతే

1245. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా ఉద్బోధించారు:- ప్రతి కర్మఫలం సంకల్పం మీద ఆధారపడి ఉంది. ప్రతి మనిషికీ అతను సంకల్పించుకున్నదే

లభిస్తుంది. కనుక కేవలం దేవుని ప్రసన్నత కోసం, ఆయన ప్రవక్త (సల్లం) కోసం హిజ్రత్ (వలస) చేస్తే, ఆ హిజ్రత్ మాత్రమే దేవుని కోసం, ఆయన ప్రవక్త (సల్లం)కోసం చేసిన హిజ్రత్‌గా పరిగణించబడుతుంది. అలాగే ఎవరైనా ఏ స్త్రీనయినా వివాహమాడే ఉద్దేశ్యంతో హిజ్రత్ చేస్తే, అది ఆ లక్ష్యం కోసం చేయబడిన హిజ్రత్‌గా పరిగణించబడుతుంది.*

(సహీహ్ బుఖారీ:- 83వ ప్రకరణం - ఐమాన్ వన్నుజర్, 23వ అధ్యాయం - అన్నియ్యతి ఫిల్ ఐమాన్)

## 49వ అధ్యాయం - సముద్రంలో (జిహాద్ ఫీసబీలిల్లాహ్) ధర్మయుద్ధం

1246. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) అప్పుడప్పుడు హజ్రత్ ఉమ్మెహరాం బిన్తె మిల్హాన్ (రజి) ఇంటికి వెళ్తుండేవారు. హజ్రత్ ఉమ్మెహరాం (రజి) ఆయనకు భోజనం వడ్డించేవారు - హజ్రత్ ఉమ్మెహరాం (రజి), హజ్రత్ ఉబాదా బిన్ సామిత్ (రజి) గారి భార్య - ఒకసారి దైవప్రవక్త (సల్లం) హజ్రత్ ఉమ్మెహరాం (రజి) ఇంటికి వెళ్తే, ఆమె ఆయనకు భోజనం పెట్టిన తరువాత పేలు చూడటం ప్రారంభించారు.

ఆ స్థితిలో దైవప్రవక్త (సల్లం) నిద్రపోయారు. కాస్సేపటికి ఆయన చిరునవ్వుతో మేల్కొన్నారు. హజ్రత్ ఉమ్మెహరాం (రజి) ఆయన్ని చూసి "దైవప్రవక్తా! మీరు నవ్వడానికి కారణం ఏమిటి?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానం ఇచ్చారు:

"నా అనుచర సమాజానికి చెందిన కొందరు వ్యక్తులు (కలలో) నా ముందు ప్రవేశపెట్టబడ్డారు. వారు ధర్మ యుద్ధం చేసే లక్ష్యంతో సముద్రంలో ఓడలు ఎక్కారు. వారు సింహాసనంపై ఆసీనులైన రాజుల మాదిరిగా నాకు కన్పించారు". హజ్రత్ ఉమ్మెహరాం (రజి) ఈ మాట విని "అయితే దైవప్రవక్తా! నన్ను వారిలో కలిపేయమని దైవాన్ని ప్రార్థించండి" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) అలాగే ప్రార్థించారు. ఆ తరువాత ఆయన పడుకొని మళ్ళీ నిద్రపోయారు. కాస్సేపటికి మళ్ళీ నవ్వుతూ లేచారు. హజ్రత్ ఉమ్మెహరాం (రజి) ఆయన్ని చూసి "దైవప్రవక్తా! ఈసారి మీ నవ్వుకు కారణం ఏమిటి?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "నా అనుచర సమాజానికి

---

★ ఈ హదీసు పూర్వాపరాలు ఈ విధంగా ఉన్నాయి. ఒకతను ఒక స్త్రీ (ఉమ్మెఖైస్) ని వివాహమాడే ఉద్దేశ్యంతో మక్కా నుండి మదీనాకు హిజ్రత్ (వలస) చేశాడు. కొందరు ఈ విషయాన్ని దైవప్రవక్త (సల్లం) దృష్టికి తీసికెళ్తే ఆయన వివేకంతో నిండిన ఈ హదీసుని ప్రవచించారు. ఈ హదీసు ఔన్నత్యం, దాని అత్యధిక ప్రయోజనాల విషయంలో ధర్మవేత్తల మధ్య ఏకాభిప్రాయం ఉందని ఇమామ్ నవవీ (రహ్మాలై) అన్నారు. ఈ హదీసు ఇస్లాంలో మూడో వంతు భాగానికి సమానమని, ఫిఖహ్ (ధర్మావగాహన) శాస్త్రంలోని డెబ్భై అధ్యాయాలతో దీనికి ప్రమేయం ఉందని ఇమాం షాఫయి (రహ్మాలై) అన్నారు. ఈ హదీసు ఇస్లాంలో నాల్గోవంతు భాగానికి సమానమని మరి కొందరు ధర్మవేత్తలు అభిప్రాయపడ్డారు.

ఎవరైనా ఏదైనా (హదీసు) గ్రంథం వ్రాయదలిస్తే పాఠకులు దాన్ని సత్సంకల్పంతో చదివేందుకుగాను అతను తన గ్రంథంలో మొట్టమొదట ఈ హదీసును పేర్కొనాలని అబ్దుర్రహ్మాన్ బిన్ మహ్దీ (రహ్మాలై) అన్నారు. ఈ పని ఇమామ్ బుఖారీ (రహ్మాలై) చేశారు. ఆయన తన గ్రంథం సహీహ్ బుఖారీని ఈ హదీసుతోనే ప్రారంభించారు. సహీహ్ బుఖారీలో ఈ హదీసుని ఆయన ఏడు చోట్ల పేర్కొన్నారు. సంకల్పంతో కూడిన ఆచరణకు మాత్రమే గుర్తింపు ఉంటుంది. సంకల్పం లేని ఆచరణ నిరర్థకమని మరి కొందరు ధర్మవేత్తలు ఈ హదీసు ద్వారా అభిప్రాయపడ్డారు. కనుక వుజూ, గుసుల్, తయమ్ముమ్‌లు సంకల్పం లేకపోతే సరయిన ఆచరణలు కాజాలవని ఈ హదీసు ద్వారా స్పష్టమవుతోంది. అంతేకాదు, నమాజ్, రోజా, జకాత్, హజ్ మొదలైన ఆరాధనలన్నిటికీ సంకల్పం ఉండాలి. అయితే అశుద్ధతను కడిగి వేయడానికి సంకల్పం అవసరం లేదు. (సంకలనకర్త)

చెందిన కొందరు వ్యక్తులు నా ముందు ప్రవేశపెట్టబడ్డారు. వారు దైవమార్గంలో పోరాడుతారు" అని మొదట చెప్పిన విషయమే తిరిగి చెప్పారు. హజ్రత్ ఉమ్మెహరాం (రజి) అది విని"అయితే దైవప్రవక్తా! నన్నూ వారిలో కలిపేయమని దైవాన్ని ప్రార్థించండి" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) "నీవు మొదటి వర్గంలో చేరిపోయావు" అన్నారు.

హదీసు ఉల్లేఖకుని ఉవాచ:- హజ్రత్ ఉమ్మె హరాం (రజి) హజ్రత్ ముఆవియా బిన్ అబూ సుఫ్యాన్ (రజి) పరిపాలనా కాలంలో సముద్రనౌకలో ఎక్కారు. అయితే తీరం పైన దిగేటప్పుడు క్రిందపడి చనిపోయారు.[1]

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 3వ అధ్యాయం - అద్దుఆయి బిల్ జిహాది లిర్రిజాలి వన్నిసాయి)

## 51వ అధ్యాయం - అమరగతులు

1247. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: "ఒక వ్యక్తి దారిన నడుస్తుంటే ఒక చోట దారిలో ఒక ముళ్ళ కంప పడి ఉండటం కన్పించింది. అతనా ముళ్ళకంపను తీసి దారి పక్కన దూరంగా పారేశాడు. అతడు చేసిన ఈ సత్కార్యానికి ప్రతిఫలంగా దేవుడు అతని పాపాలను క్షమించాడు."

ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు: "అమరగతుల్లో (షుహదా) అయిదు రకాల వాళ్ళుంటారు. (1) ప్లేగు వ్యాధి వల్ల చనిపోయినవారు, (2) ఉదరవ్యాధితో చనిపోయినవారు, (3) నీటిలో మునిగి చనిపోయినవారు (4) ఏదైనా బరువు క్రింద నలిగి చనిపోయినవారు, (5) దైవమార్గంలో పోరాడుతూ వధించబడినవారు."[2]

(సహీహ్ బుఖారీ:- 10వ ప్రకరణం - అజాన్, 32వ అధ్యాయం - ఫజ్లిత్తహ్జీరి ఇలజ్జుహ్రి)

1248. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా తెలియజేశారు:-

---

(1) ఇమామ్ నవవీ (రహ్మలై) ప్రకారం పేలను చంపడం ధర్మసమ్మతమేనని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. ఇంకా మహ్రం (వివాహనిషిద్ధ) స్త్రీ మహ్రం (వివాహనిషిద్ధ) పురుషుని శిరస్సుతాకడం, అతను ఆమె దగ్గర కూర్చోవడం, ఆమె ఇంట్లో పడుకోవడం కూడా ధర్మసమ్మతమే. హజ్రత్ ఉమ్మెహరాం (రజి) దైవప్రవక్త (సల్లం)కు క్షీర సంబంధ పినతల్లి అవుతారు.

ఈ హదీసులో ప్రవక్త మహిమలు కొన్నిటిని గురించిన ప్రస్తావన ఉంది. ఉదాహరణకు, (1) ప్రవక్త అనుచర సమాజం ప్రగతి వికాసాలను గురించి భవిష్యత్ ప్రకటన, (2) ముస్లింలు సముద్రయానం చేసి యుద్ధానికి వెళ్ళే సమాచారం, (3) అప్పటి దాకా హజ్రత్ ఉమ్మె హరాం జీవించి ఉండటం, ఆ యోధులతో పాటు ఆమె అమరగతి నొందే విషయాలు వగైరా . ఈ ధర్మయుద్ధం హజ్రత్ ఉస్మాన్ (రజి) ఖిలాఫత్ పాలనలో హజ్రత్ ముఆవియా (రజి) నేతృత్వంలో జరిగింది. కొందరు ఈ యుద్ధం హజ్రత్ ముఆవియా (రజి) ఖిలాఫత్ పాలనలో జరిగిందని అభిప్రాయపడినప్పటికీ చారిత్రక ఆధారాల దృష్ట్యా ఇదే సరైనదని తెలుస్తోంది. ఈ హదీసుని బట్టి స్త్రీలు, పురుషులు ఉభయులు సముద్రయానం చేయవచ్చని కూడా తెలుస్తోంది. (అనువాదకుడు)

(2) ఇతర హదీసులతో అమరగతుల (వీరమరణం పొందిన యోధుల) జాబితాలో వచ్చేవారు మరికొందరు కూడా ఉన్నారు. ఉదాహరణకు: న్యుమోనియా లేక అగ్ని ప్రమాదం వల్ల చనిపోయినవాడు, కాన్పులో చనిపోయిన స్త్రీ, సొంత ఆస్తుల రక్షణకై ప్రయత్నిస్తూ చంపబడినవాడు, భార్యా పిల్లల్ని కాపాడుకునే ప్రయత్నంలో హతమార్చబడినవాడు. వీరంతా అమర గతుల జాబితా క్రిందికే వస్తారు. వీరిని అమరగతులనడం అంటే పరలోకంలో వీరికి అమరగతులకు లభించే అంత పుణ్యం లభిస్తుందన్న మాట. అయితే ఇలాంటి వారు చనిపోతే స్నానం (గుసుల్) చేయించవలసి ఉంటుంది; దైవమార్గంలో పోరాడి హతమార్చబడిన వారికి శవస్నానం ఉండదు. (ఇమామ్ నవవీ-రహ్మలై).

ప్లేగు వ్యాధితో చనిపోయే ప్రతి ముస్లిమూ అమరగతుడే (షహీదే).

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - అల్ జిహాద్ వస్సైర్, 30వ అధ్యాయం - అష్షహాదతు సబ్వున్ సెవల్ ఖత్లి)

## 53వ అధ్యాయం - " నా అనుచర సమాజంలో ఒక వర్గం ఎల్లప్పుడూ ధర్మంపై స్థిరంగా ఉంటుంది".

1249. హజ్రత్ ముగీరా బిన్ షుఅబా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- నా అనుచర సమాజం (ఉమ్మత్)లో కొందరు ధర్మం మీద ఎల్లప్పుడూ స్థిరంగా ఉంటారు; ఆధిక్యత కలిగి ఉంటారు. చివరికి ప్రళయం వచ్చినా అప్పుడు కూడా ఆధిక్యత కలిగి ఉంటారు.

(సహీహ్ బుఖారీ:- 61 వ ప్రకరణం - మనాఖిబ్ , 28వ అధ్యాయం - హద్దసనీ ముహమ్మదుబ్నుల్ ముసన్నా)

1250. హజ్రత్ ముఆవియా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- నా అనుచర సమాజం (ఉమ్మత్)లో ఒక వర్గం ఎల్లప్పుడూ దైవాజ్ఞలను పాటిస్తూ వాటిపై స్థిరంగా ఉంటుంది. ఎవరైనా వారిని అవమాన పరచదలచినా లేదా వ్యతిరేకించదలచినా వారా వర్గం (ముస్లింల) కు ఎలాంటి హాని కలిగించలేరు. ఆ విధంగా చివరికి ప్రళయం వచ్చినా అప్పుడు కూడా ఆ వర్గం వారు దైవాజ్ఞలను పాటిస్తూ వాటిపై స్థిరంగానే ఉంటారు.

(సహీహ్ బుఖారీ:- 61 వ ప్రకరణం - మనాఖిబ్ , 28వ అధ్యాయం - హద్దసనీ ముహమ్మదుబ్నుల్ ముసన్నా)

## 55వ అధ్యాయం - బాటసారి తన పని పూర్తయిన వెంటనే ఇంటి ముఖం పట్టాలి

1251. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా బోధించారు:- ప్రయాణం ఒక విధమైన శిక్ష. దానివల్ల మనిషి నిద్రాహారాలకు దూరమవుతాడు. అందువల్ల ప్రయాణీకుడు తన పని ముగిసిన వెంటనే తన భార్యాపిల్లల దగ్గరకు చేరుకోవాలి.

(సహీహ్ బుఖారీ:- 26 వ ప్రకరణం - ఉమ్రా, 19వ అధ్యాయం-అస్సఫ్రు ఖిత్అతుమ్మినల్ అజాబ్)

## 56వ అధ్యాయం - ప్రయాణీకుడు ప్రయాణం నుండి తిరిగి వచ్చి రాత్రివేళ అమాంతం తన ఇంట్లో ప్రవేశించటం అభిలషణీయం కాదు

1252. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ప్రయాణం నుండి తిరిగొచ్చి తమ భార్యాపిల్లల దగ్గరికి రాత్రివేళ (అకస్మాత్తుగా) పోరు. ఉదయం వేళగాని, సాయంత్రం వేళగాని ఆయన తమ ఇంటికి వెళ్లారు.

(సహీహ్ బుఖారీ:-26 వ ప్రకరణం - -ఉమ్రా, 15 వ అధ్యాయం-అద్దుఖూలి బిల్ అషియ్యి)

1253. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- మేము దైవప్రవక్త (సల్లం) వెంట ఒక యుద్ధం నుండి తిరిగొచ్చాము. మేము ఇంటికి వెళ్ళాలనుకున్నప్పుడు ఆయన ఇలా అన్నారు. "ఆగండి (అప్పుడే ఇంటికి వెళ్ళకండి) శిరోజాలు చిందరవందరగా పడిఉన్న స్త్రీలు తల దువ్వుకొని జడ వేసుకోవడానికి వీలుగా, భర్తలు ఇంట్లోలేని కారణంగా వారి భార్యలు నిర్లక్ష్యం చేసిన (నాభిక్రింది) వెంట్రుకల్ని శుభ్రం చేసుకోవడానికి వీలుగా తగిన వ్యవధి నిచ్చి సాయంత్రం వేళ ఇండ్లకు వెళ్ళండి".★

(సహీహ్ బుఖారీ:- 67వ ప్రకరణం -నికాహ్, 10వ అధ్యాయం - తజ్వీ జిస్సయ్యిబాత్)

---

★ ప్రయాణం నుండి తిరిగొచ్చిన తరువాత అకస్మాత్తుగా ఇంట్లో ప్రవేశించకూడదని, ఇంట్లో వారికి తమ రాకను గురించి ముందుగా తెలియజేసి ఉంటే రాత్రి వేళ కూడా ఇంట్లో ప్రవేశించడం ధర్మసమ్మతమేనని ఈహదీసు మనకు తెలియజేస్తోంది. ఈనాడు కూడా దీన్ని ఆచరించడం ద్వారానే దైవప్రవక్త (సల్లం) ప్రవచనంలోని లక్ష్యం నెరవేరుతుంది.

# జంతు వేట ప్రకరణం

## 1వ అధ్యాయం - తర్ఫీదు ఇవ్వబడిన కుక్కల ద్వారా వేట

1254. హజ్రత్ అదీబిన్ హాతిం (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం)తో "దైవప్రవక్తా! మేము శిక్షణ ఇవ్వబడిన కుక్కల ద్వారా (జంతువుల్ని) వేటాడుతుంటాము" అని అన్నాను. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "వేటాడిన తరువాత కుక్క తన యజమాని కోసం ఎదురు చూస్తూ వేట జంతువును పట్టి అలాగే ఉంచితే, దాని (మాంసం)ని మీరు తినవచ్చు" అని అన్నారు. "ఒకవేళ కుక్క వేట జంతువుని చంపితే?" అని నేను అడిగాను. దానికి ఆయన "కుక్క వేట జంతువుని చంపినా సరే" అని అన్నారు. "మరి దైవప్రవక్తా! మేము (ఉక్కు మొన గల కలప) ఈటె (JAVELIN) విసరి వేటాడుతుంటాము (దీన్ని గురించి మీ అభిప్రాయం ఏమిటి)?" అని అడిగాను మళ్ళీ. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "ఆ ఈటె సరిగ్గా తగిలి వేట జంతువు శరీరంలో దిగబడితే దాని (మాంసం)ని తినవచ్చు. అలా కాకుండా ఆ ఈటె అడ్డంగా తగిలి (జంతువు శరీరంలో దిగబడకపో)తే దాన్ని తినకూడదు" అని అన్నారు.*

**(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం - అజ్జిబాయి హివస్సైద్, 3వ అధ్యాయం - మా అసాబల్ మీరాజు బి అర్జిహీ)**

1255. హజ్రత్ అదీ బిన్ హాతిం (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం)తో "దైవప్రవక్తా! మేము కుక్కల

---

★ అవసరం రీత్యా , లేదా వృత్తిరీత్యా, లేదా మరేదైనా ప్రయోజనం పొందే ఉద్దేశ్యంతో వేటాడ వచ్చున్న విషయంతో ధర్మవేత్తలు ఏకీభవించారని ఇమామ్ నవవీ (రహ్మలై) అన్నారు. అనవసరంగా, లేక వినోదం కోసం వేటాడటం అభిలషనీయం కాదని (మక్రూహ్ అని) ఇమామ్ మాలిక్ (రహ్మలై) అభిప్రాయపడ్డారు. జిబహ్ చేసి ప్రయోజనం పొందే ఉద్దేశ్యంతో జంతువుని వేటాడటం లైస్ (రహ్మలై), ఇబ్నె అబ్దుల్ హకమ్ (రహ్మలై)ల దృష్టిలో ధర్మసమ్మతమే. ఈ ఉద్దేశ్యం లేకుండా అనవసరంగా జంతువుని బలిగొనడం వీరి దృష్టిలో కూడా నిషిద్ధమే.

కుక్క ద్వారా వేటాడే విషయమై ఇమామ్ నవవీ (రహ్మలై) అభిప్రాయం ఇది: వేట కోసం కుక్కను వదలి పెట్టేటప్పుడు , అలాగే వేటాడిన జంతువుని కోసేటప్పుడు 'బిస్మిల్లాహ్' పఠించాలి. దీనిపై ధర్మవేత్తల మధ్య ఏకాభిప్రాయం ఉంది. అయితే 'బిస్మిల్లాహ్' పఠించడం తప్పనిసరా (వాజిబ్) లేక ప్రవక్త సంప్రదాయమా (సున్నత్) అనే విషయంలో మాత్రం భేదాభిప్రాయాలున్నాయి. ఇమామ్ షాఫయి (రహ్మలై) దృష్టిలో ఇది సున్నత్. కనుక పొరపాటునగాని, లేదా ఉద్దేశపూర్వకంగా గాని, బిస్మిల్లాహ్ పఠించకపోయినా జంతువు హలాల్ అవుతుంది. కాకపోతే జిబహ్ చేసే వ్యక్తి ముస్లిం అయిఉండాలి. ఇమామ్ మాలిక్ (రహ్మలై) , ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మలై) ల అభిప్రాయం కూడా ఇదే. కాని అహ్లె జాహిర్ (బాహ్యార్థ స్వీకార) ధర్మవేత్తల దృష్టిలో పొరపాటుగానయినా, ఉద్దేశ్యపూర్వకంగానయినా బిస్మిల్లాహ్ పఠించకపోతే జంతువు హలాల్ కాజాలదు. ఇబ్నె సైరీన్(రహ్మలై) , అబూ సౌర్ (రహ్మలై) తదితర ధర్మవేత్తల అభిప్రాయం కూడా ఇదే. ఇమామ్ అబూహనీఫా (రహ్మలై), సుఫ్యాన్ సౌరీ (రహ్మలై), అధిక సంఖ్యాక ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం బిస్మిల్లాహ్ పఠించడం మరచిపోతే జంతువు హలాల్ అవుతుంది. కావాలని బిస్మిల్లాహ్ పఠించకపోతే హరాం అవుతుంది.

ఈ హదీసు ప్రకారం ప్రతి వేట కుక్క ద్వారా వేటాడిన జంతువు హలాల్ అవుతుంది. అయితే అది శిక్షణ ఇవ్వబడిన కుక్క అయి ఉండాలి. దాని రంగు ఏదైనా పరవాలేదు. ఇమామ్ మాలిక్ (రహ్మలై) , ఇమామ్ షాఫయి (రహ్మలై), ఇమామ్ అబూ హనీఫా (రహ్మలై) అధిక సంఖ్యాక ధర్మవేత్తల అభిప్రాయం ఇదే. కాని హసన్ బస్రీ (రహ్మలై), నఖయి (రహ్మలై), ఖతాదా (రహ్మలై), ఇమామ్ అహ్మద్ (రహ్మలై), ఇస్హాఖ్ (రహ్మలై) ల దృష్టిలో నల్ల కుక్క షైతాన్‌కు మారు రూపమైనందున, నల్ల కుక్క ద్వారా జంతువుల్ని వేటాడటం సమంజసం కాదు. శిక్షణ ఇవ్వబడని కుక్క ద్వారా వేటాడిన జంతువులు నిషిద్ధం అనే విషయంలో మాత్రం అందరి మధ్యా ఏకాభిప్రాయం ఉంది.

ద్వారా (జంతువుల్ని) వేటాడుతుంటాము......?" అని అన్నాను. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని ఇలా అన్నారు. "మీరు శిక్షణ ఇవ్వబడిన కుక్కను వేట కోసం వదలేటప్పుడు 'బిస్మిల్లాహ్' అని చెప్పి వదలండి. కుక్క వేట జంతువుని పట్టి మీ కోసం ఆపి ఉంచితే అలాంటి వేట జంతువు (మాంసం)ని మీరు తినవచ్చు, అది చచ్చినా సరే. అయితే దాన్ని కొంత కుక్క తినివేస్తే మాత్రం (అనుమానమే). అది తన కోసం వేటాడి ఉంటుందని నా అనుమానం (అలాంటి వేట జంతువుని తినకూడదు). అదే విధంగా మీ కుక్కతో పాటు ఇతర కుక్కలు కలసిపోతే అలాంటి వేట జంతువుని కూడా తినకూడదు."

(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం - అజ్జిబాయిహి వస్సైద్, 7వ అధ్యాయం - ఇజా అకలల్ కల్బ్)

1256. హజ్రత్ అదీబిన్ హాతిం (రజి) కథనం:- నేను ఉక్కు మొన గల కలప ఈటె (బరిసె)తో వేటాడటం గురించి విచారిస్తే దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చారు : "ఆ ఈటె మొన గనుక సూటిగా వేట జంతువునకు తగిలితే దాన్ని తినవచ్చు. ఒకవేళ ఆ ఈటె అడ్డంగా తగిలి (వేట జంతువు చచ్చిపో)తే దాన్ని తినకూడదు. అది కట్టె లేక రాయి దెబ్బతో చంపబడిన జంతువవుతుంది (అలాంటి జంతువులను తినడం నిషిద్ధమని దివ్య ఖుర్ఆన్‌లో ఉంది)". నేను మళ్ళీ ఇలా అడిగాను! "దైవప్రవక్తా! నేను 'బిస్మిల్లాహ్' అని చెప్పి నా కుక్కను వేట కోసం వదలిపెడతా (ననుకోండి). అయితే నేను వేట జంతువు దగ్గరికెళ్ళి చూస్తే అక్కడ మరో కుక్క కూడా కనిపిస్తుంది. దాన్ని వదలేటప్పుడు నేను బిస్మిల్లాహ్ అని పఠించలేదు. వేట జంతువుని ఈ రెండింటిలో అసలు ఏ కుక్క పట్టిందో కూడా నాకు తెలియదు. (అలాంటి స్థితిలో నేనేం చెయ్యాలి)?" దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "నీవు నీ కుక్కను వదలేటప్పుడు మాత్రమే బిస్మిల్లాహ్ పఠించావు. రెండవ కుక్క కోసం బిస్మిల్లాహ్ పఠించలేదు. అందుచేత నీవా వేట జంతువుని తినకూడదు" అని అన్నారు.★

(సహీహ్ బుఖారీ:- 34వ ప్రకరణం - అల్‌బుయూ, 3వ అధ్యాయం - తఫ్సీరిల్ ముషబ్బిహాత్)

1257. హజ్రత్ అదీబిన్ హాతిం (రజి) కథనం:- నేను ఉక్కు మొన గల కలప ఈటె (బరిసె)తో వేటాడటం గురించి విచారిస్తే దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చారు: "ఆ ఈటె మొన గనక వేట జంతువుకు తగిలితే దాన్ని తినవచ్చు. ఒకవేళ ఆ ఈటె అడ్డంగా తగిలి (వేట జంతువు చచ్చిపో)తే అది నిషిద్ధం (ముర్దార్)అవుతుంది". ఆ తరువాత నేను కుక్క ద్వారా వేటాడటం గురించి అడిగాను. దానికి దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చారు: "ఆ కుక్క వేటాడి పట్టిన జంతువును మీ కోసం ఆపి ఉంచితే దాన్ని తినవచ్చు. కుక్క జంతువును వేటాడటమంటే ఆ జంతువును జిబహ్ చేయడమే. అయితే మీరు శిక్షణ ఇచ్చిన కుక్కతో పాటు మరో కుక్క కూడా వచ్చి చేరితే అదే వేట జంతువును పట్టి చంపి ఉంటుందన్న అనుమానం కలుగుతుంది. కనుక అలాంటి వేట జంతువును తినకూడదు. ఎందుకంటే మీరు మీ కుక్కను వదలేటప్పుడు మాత్రమే 'బిస్మిల్లాహ్' పఠించి ఉంటారు. రెండవ కుక్క విషయంలో బిస్మిల్లాహ్ పఠించి ఉండరు."

(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం - అజ్జిబాయిహి వస్సైద్, 1వ అధ్యాయం - అత్తస్మియతి అలస్సైద్)

★ "దేవుని పేరు పఠించకుండా జిబహ్ చేయడం జరిగితే దాని మాంసాన్ని తినకండి" అన్న దేవుని ఆదేశం దివ్య ఖుర్ఆన్‌లో (6:121) ఉంది.

1258. హజ్రత్ అదీబిన్ హాతిం (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- మీరు 'బిస్మిల్లాహ్' పఠించి మీ కుక్కను వేట కోసం వదలిపెట్టినప్పుడు, అది జంతువును వేటాడి (తాను స్వయంగా తినకుండా) పట్టి మీ కోసం ఆపి ఉంచితే ఆ జంతువును మీరు తినవచ్చు. కుక్క దాన్ని చంపి వేసినా సరే మీరు తినవచ్చు. ఒకవేళ కుక్క ఆ వేట జంతువుని కొంత భాగం తింటే మాత్రం మీరిక దాన్ని తినకూడదు. (అది నిషిద్ధం). ఎందుకంటే ఈ జంతువుని కుక్క తన కోసం వేటాడింది. వేట కోసం మీ కుక్కను వదలిపెట్టేటప్పుడు 'బిస్మిల్లాహ్' పఠించబడని ఇతర కుక్కలు కూడా దాంతో చేరిపోతే అవి వేటాడి చంపిన జంతువును మీరు తినకూడదు. ఎందుకంటే ఆ కుక్కల్లో ఏ కుక్క జంతువును వేటాడి చంపిందో తెలియదు.

మీరు వేట జంతువుపైకి బాణం వదలి, అది (ఒకటి రెండు రోజుల తరువాత) చచ్చిపోయి దొరికినప్పుడు, దానిపై మీ బాణం తప్ప మరెవరి బాణం గుర్తు లేకపోతే మీరా జంతువును నిరభ్యంతరంగా తినవచ్చు. అయితే బాణం దెబ్బతగిలిన తరువాత ఆ జంతువు నీటిలోకి పోయి పడి చచ్చిపోతే దాన్ని తినకండి.

**(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం - అజ్జిబాయిహివస్సైద్, 8వ అధ్యాయం - అస్సైది ఇజా గాబ అన్హు యౌమైన్ అవ్ సలాస)**

1259. హజ్రత్ అబూ సాలబా ఖుషనీ (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం)ను ఇలా అడిగాను: "దైవప్రవక్తా! మేము గ్రంథప్రజలు ఉండే ప్రాంతంలో నివసిస్తున్నాము. మరి మేము వారి కంచాలలో భోజనం చేయవచ్చా? మా ప్రాంతంలో వేట జంతువులు చాలా ఉన్నాయి. నేను నా ధనుర్బాణాలతో కూడా వేటాడుతాను, కుక్కల ద్వారా కూడా వేటాడుతాను. కుక్కలు శిక్షణ ఇవ్వబడినవి కూడా ఉంటాయి, శిక్షణ ఇవ్వబడనివి కూడా ఉంటాయి. వీటిలో ఏ వేట మంచిది (ధర్మసమ్మత మైనది)?".

దానికి దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చారు. "నీవు గ్రంథ ప్రజల కంచాలను గురించి అడిగావు. మీకు వేరే కంచాలు లభిస్తే, గ్రంథ ప్రజల కంచాలలో భోజనం చేయకండి. ఒకవేళ వేరే కంచాలు దొరక్కపోతే గ్రంథ ప్రజల కంచాలు (గిన్నెలు) శుభ్రంగా కడిగి వాటిలో మీరు భోజనం చేయవచ్చు* పోతే ధనుర్బాణాలతో వేటాడేటప్పుడు, బాణం వదిలేముందు 'బిస్మిల్లాహ్' పఠించి బాణం వదలాలి. అప్పుడా వేట జంతువుని మీరు తినవచ్చు. శిక్షణ ఇవ్వబడిన కుక్కను వేటకు వదిలేటప్పుడు 'బిస్మిల్లాహ్' పఠించి వదలిపెడ్తే అలాంటి వేట జంతువుని కూడా మీరు తినవచ్చు.

---

★ ఇమామ్ నవవీ (రహ్మలై) ఇలా రాస్తున్నారు:- గ్రంథ ప్రజలు తమ కుండలలో పంది మాంసం వండుతారని, వారు తమ పాత్రలలో సారాయి పోసుకొని తాగుతారని అబూ దావూద్ ఉల్లేఖించిన హదీసులో మరింత వివరంగా ఉంది. అందువల్లనే ఇతర పాత్రలు లభిస్తే వారి పాత్రలు ఉపయోగించకూడదని దైవప్రవక్త (సల్లం) అన్నారు. గత్యంతరం లేని పరిస్థితిలో మాత్రం వారి పాత్రలను కడిగి ఉపయోగించుకోవచ్చు. ఇతర పాత్రలు ఉన్నప్పటికీ బహుదైవారాధకుల పాత్రలను కడిగి వాడుకోవచ్చని ఫికహ్ వేత్తల అభిప్రాయంకాగా, ఈ హదీసులో ఇతర పాత్రలు ఉన్నప్పుడు గ్రంథ ప్రజలపాత్రలను వాడకూడదని ఉంది. వాటిని కడిగినప్పటికీ వాడకూడదు. ఈ విధంగా ఈ హదీసు పైకి ఫికహ్‌వేత్తల అభిప్రాయానికి వ్యతిరేకంగా ఉన్నట్లు కనిపిస్తోంది. నిజానికి ఇందులో ఎలాంటి వ్యతిరేక భావం లేదు. హదీసులో పంది మాంసం వండిన పాత్రలను లేదా సారాయి తాగిన పాత్రలను గురించి ప్రస్తావించబడింది. ఫికహ్‌వేత్తలు ఇలాంటి అశుద్ధతలు లేని పాత్రలను గురించి పేర్కొన్నారు. (అనువాదకుడు)

ఒకవేళ శిక్షణ ఇవ్వబడని కుక్క ద్వారా వేటాడటం జరిగితే అట్టి పరిస్థితిలో వేట జంతువు సజీవంగా మీకు దొరికితే, దాన్ని (దైవనామంతో) జిబహ్ చేసి తినండి".

(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం - అజ్జిబాయిహివస్సైద్, 4వ అధ్యాయం - సైదిల్ ఖౌస్)

## 3వ అధ్యాయం - గోళ్ళు, కోరలు గల జంతువులు, పక్షులను తినడం నిషిద్ధం

1260. హజ్రత్ అబూ సాలబా (రజి) కథనం:- కోరలు[1] గల జంతువుల్ని తినడాన్ని దైవప్రవక్త (సల్లం) (ముస్లింలను) వారించారు.

(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం - అజ్జిబాయి హి వస్సైద్, 29వ అధ్యాయం - అక్లికల్లిజీనాబిన్ మినస్సిబాఅ)

## 4వ అధ్యాయం - సముద్ర జంతువుల్ని (చచ్చినవి కూడా) తినవచ్చు

1261. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని ఖురైషీయుల (వర్తక) బిడారాలను అడ్డుకోవడానికి పంపించారు. మేము మొత్తం మూడొందల మంది రౌతులం. మా నాయకుడు హజ్రత్ అబూ ఉబైదా బిన్ జర్రాహ్. సముద్ర తీరాన మేము అర్థమాసం వరకు ఉండిపోవాల్సి వచ్చింది. దాని వల్ల మేము కూటి కోసం అలమటించవలసి వచ్చింది. చివరికి మేము (ఆహార పదార్థాలు లేక) ఆకులు సయితం తిన్నాము. ఈ కారణంగానే ఆ సైన్యానికి "ఆకుల సైన్యం" అని పేరొచ్చింది. తరువాత మా కోసం సముద్రం 'అంబర్' అనే ఓ పెద్ద చేపను ఒడ్డు మీద విసరేసింది. దాన్ని పదిహేను రోజులదాకా తిన్నాము. దాని కొవ్వును మా శరీరాలకు రుద్దుకున్నాము. దాంతో మా శరీరాలు మునుపటి శరీరాల్లా ఆరోగ్యవంతమయిపోయాయి. హజ్రత్ అబూ ఉబైదా (రజి) ఆ చేప ప్రక్క టెముక నొకదాన్ని ఒక చోట నిలబెట్టారు. తరువాత అందరికంటే పొడవైన వ్యక్తిని ఒంటె మీద కూర్చోబెట్టి ఆ ఎముక క్రింది నుంచి పోనిస్తే ఆ వ్యక్తి ఎముకకు తగలకుండా సులభంగా పోగలిగాడు.

(చేప దొరక్క ముందు తినడానికి ఏమీ దొరక్క) ఒక వ్యక్తి (ఓ రోజు) మూడు ఒంటెలు జిబహ్ చేశాడు, తరువాత (రెండవ రోజు) మరో మూడు ఒంటెలు జిబహ్ చేశాడు. తరువాత (మూడోరోజు) మరో మూడు ఒంటెలు జిబహ్ చేశాడు. ఆ తరువాత హజ్రత్ అబూ ఉబైదా (రజి) ఇక ఒంటెలను జిబహ్ చేయవద్దని అతడ్ని వారించారు. [2]

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 65వ అధ్యాయం - గజవతుసైఫిల్ బహ్ర్)

---

(1) మూల భాషలో "జీనాబ్" అనే పదం వచ్చింది. అంటే కోర పళ్ళు గల ప్రాణి అని అర్థం. ఈ కోర పళ్ళతో అది వేట జీవాలను గట్టిగా పట్టుకొని కొరుకుతుంది, రక్కుతుంది. జంతువులు అంటే ఇక్కడ పులి, సింహం, చిరుత, ఉడుము, ఏనుగు, కోతి వగైరా. అరబీ భాషలో "జీముఖ్లబ్" అనే మరో పదం ఉంది. అంటే పంజాగల ప్రాణులు అని అర్థం; అంటే వేటాడే పక్షులు అని భావం. ఉదాహరణకు:- డేగ, గ్రద్ద, దూడబోతు మొదలైనవి.(సంకలనకర్త)

(2) నది, చెరువు, సముద్రాలలోని జలచరాలు స్వయంగా చచ్చినా , లేదా వేటాడి చంపినా సరే వాటి మాంసం హలాల్ (ధర్మసమ్మతం) అవుతుందని ఈ హదీసుని బట్టి తెలుస్తోంది. అయితే కొన్ని విషయాల్లో ధర్మవేత్తల మధ్య భేదాభిప్రాయాలున్నాయి. చేపలు హలాల్ అనడంలో అందరి మధ్యా ఏకాభిప్రాయం ఉంది. అహ్లె హదీసు వర్గం దృక్పథం ప్రకారం కప్ప హరాం (నిషిద్ధం). కప్పను మినహాయించి ఇతర జలచరాల విషయంలో మూడు దృక్పథాలు ఉన్నాయి. జలచరాలన్నీ హలాల్ అనేదే సరయిన దృక్పథం. ఇమామ్ మాలిక్ (రహ్మలై) దృష్టిలో కప్ప కూడా హలాలే. ఇమామ్ అబూ హనీఫా (రహ్మలై) దృష్టిలో చేపలు తప్ప మరే జలచరాలూ హలాల్ కాదు. అలాగే చేప చచ్చిపోయి నీటి మీద తేలితే ఇమామ్ అబూ హనీఫా (రహ్మలై) దృష్టిలో అదీ హరామే. కాని అహ్లె హదీస్ వారి దృక్పథం ప్రకారం, అధిక సంఖ్యాక ధర్మవేత్తల అభిప్రాయం ప్రకారం ఈ హదీసుని బట్టి చచ్చిన చేప నీటిపై తేలినా హలాలే అవుతుంది. దీన్ని హరాంగా పరిగణించేవారు హజ్రత్ జాబిర్ (రజి) గారి హదీసుని ప్రమాణంగా తీసుకున్నారు. కాని ఈ హదీసు బలహీనమైనది; ప్రామాణిక హదీసుల జాబితాలో రాజాలదు. వాస్తవం దేవునికే తెలుసు. (ఇమామ్ నవవీ- రహ్మలై).

## 5వ అధ్యాయం - పెంపుడు గాడిద మాంసం నిషిద్ధం

1262. హజ్రత్ అలీ బిన్ అబీ తాలిబ్ (రజి) కథనం:- ఖైబర్ యుద్ధం నాడు దైవప్రవక్త (సల్లం) స్త్రీలను తాత్కాలికంగా వివాహమాడటాన్ని,★ పెంపుడు గాడిద మాంసం తినడాన్ని నిషేధించారు.

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం -మగాజి, 38వ అధ్యాయం - గజ్వతి ఖైబర్)**

1263. హజ్రత్ అబూ సాలబా (రజి) కథనం:- పెంపుడు గాడిద మాంసం తినడాన్ని దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని వారించారు.

**(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం-అజ్జిబాయిహివస్సైద్, 28వ అధ్యాయం - లుహూమిల్ హుమురిల్ ఇన్సియ్యా)**

1264. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని పెంపుడు గాడిదల మాంసం తినకూడదని తాకీదు చేశారు.

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 38వ అధ్యాయం - గజ్వతి ఖైబర్)**

1265. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబీ ఔఫా (రజి) కథనం:- ఖైబర్ ముట్టడి జరిగిన రాత్రులలో మేము ఆకలితో అలమటించవలసి వచ్చింది. ఖైబర్ జయించబడగానే ఆ రోజు మేము పెంపుడు గాడిదలపై విరుచుకుపడ్డాము. మేము వాటిని కోశాము. కాని ఆ మాంసాన్ని దేగిశాలలో వేసి ఉడకబెడ్తుంటే దైవప్రవక్త (సల్లం) తరఫున ఒక ప్రకటన కర్త వచ్చి "దేగిశాలను బోర్లించండి. పెంపుడు గాడిద మాంసం ఏ మాత్రం తినకండి" అని ప్రకటించాడు. మేమీ ప్రకటన విని, ఈ గాడిదల నుండి అయిదో భాగం (ధనాగారం కోసం) వసూలు చేయబడనందున వీటి మాంసం తినకూడదని దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని వారిస్తున్నారని భావించాము. కాని మరి కొంత మంది "(అది కాదు) పెంపుడు గాడిదల (మాంసాన్ని తినడం)ని దేవుడు పూర్తిగా నిషేధించాడు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖుమ్స్, 20వ అధ్యాయం - మాయుసీబు మినత్తఆమిఫీ అర్జిల్ హరబ్)**

1266. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి), హజ్రత్ అబ్దుల్లా బిన్ అబీ ఔఫా (రజి)ల కథనం:- మేము (ఖైబర్ యుద్ధంలో) దైవప్రవక్త (సల్లం) వెంట ఉన్నాము. (విజయప్రాప్తిగా) కొన్ని పెంపుడు గాడిదలు మా చేతికి చిక్కాయి. మేము వాటిని (కోసి, మాంసం) ఉడకబెట్టసాగాము. అంతలో దైవప్రవక్త (సల్లం) తరఫున ఒక ప్రకటనకర్త వచ్చి "దేగిశాలను బోర్లించండి (గాడిద మాంసం తినకండి)" అని ప్రకటించాడు.

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 38వ అధ్యాయం - గజ్వతి ఖైబర్)**

1267. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- గాడిదలు ప్రజల భారాన్ని మోయడానికి

---

★ ఇస్లాం ప్రారంభకాలంలో తాత్కాలిక వివాహం (ముతా) మార్గాంతరం లేని వారి కోసం (మృత జంతువుని తినడం ధర్మసమ్మతమైనట్లు) ధర్మసమ్మతం చేయబడింది. కాని ఆ తరువాత ఇది నిషేధించబడింది. తిరిగి మక్కా జయించబడిన సమయంలో లేదా వీడ్కోలు హజ్ (హజ్జతుల్ విదా) సమయంలో మరొకసారి తాత్కాలిక వివాహానికి అనుమతినివ్వడం జరిగింది. ఆ తరువాత దీన్ని శాశ్వతంగా నిషేధించారు దైవప్రవక్త (సల్లం). (సంకలనకర్త)

ఉపయోగపడతాయన్న కారణమిమ్మదే దైవప్రవక్త (సల్లం) వీటి మాంసాన్ని తినడాన్ని వారించారన్న సంగతి నాకు తెలియదు. ఈ విధంగా ఈ రవాణా సాధనాలను వృధా చేయడం ఆయనకు ఇష్టం లేదన్నది కూడా నాకు తెలియదు. లేదా ఆయన ఖైబర్ యుద్ధం నాడు వీటి మాంసాన్ని నిజంగానే నిషేధించారన్న విషయం కూడా నాకు తెలియదు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 38వ అధ్యాయం - గజ్వతి ఖైబర్)

1268. హజ్రత్ సలమా బిన్ అక్వయి (రజి) కథనం:- ఖైబర్ యుద్ధ సందర్భంలో దైవప్రవక్త (సల్లం) అనేక చోట్ల అగ్ని ప్రజ్వరిల్లుతున్న దృశ్యాలు చూసి "ఈ అగ్ని మంటలు ఏమిటి?" అని అడిగారు. "పెంపుడు గాడిదల మాంసం వండుతున్నారు" అన్నారు అనుచరులు (కొందరు). దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "ఆ కుండలను పగలగొట్టండి. మొత్తం మాంసాన్ని పారవేయండి" అని ఆదేశించారు. అప్పుడు అనుచరులు "మాంసం పారవేసి, కుండలు శుభ్రంగా కడిగివేస్తే సరిపోదా?" అని అడిగారు. "సరే అలాగే వాటిని కడుక్కోండి" అన్నారు దైవప్రవక్త (సల్లం).

(సహీహ్ బుఖారీ:- 46వ ప్రకరణం - మజాలిమ్, 32వ అధ్యాయం - హల్ తుక్సరుద్దినా నుల్లతి ఫీహల్ ఖమ్రు అవ్ తుఖ్రకుజ్జిఖాఖు)

## 6వ అధ్యాయం - గుఱ్ఱం మాంసం తినడం గురించి

1269. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- ఖైబర్ యుద్ధం నాడు దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని గాడిద మాంసం తినడాన్ని వారించారు. అయితే గుఱ్ఱం మాంసం తినడానికి అనుమతించారు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 38వ అధ్యాయం - గజ్వతి ఖైబర్)

1270. హజ్రత్ అస్మా బిన్తె అబీ బకర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) కాలంలో మేము ఒక గుఱ్ఱాన్ని కోసి దాని మాంసం తిన్నాము.

(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం - అజ్జిబాయిహి వస్సైద్, 24వ అధ్యాయం - అన్నహ్రివజ్జబ్హి)

## 7వ అధ్యాయం - ఉడుం మాంసం ధర్మసమ్మతమే

1271. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- నేను ఉడుం మాంసం తినను. అయితే దాన్ని నిషిద్ధం (హరాం)గా కూడా పరిగణించను.

(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం - అజ్జిబాయిహి వస్సైద్, 33వ అధ్యాయం - అజ్జబ్బి)

1272. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) అనుచరుల్లో కొందరు మాంసం తినడానికి ఉపక్రమించారు, వారిలో హజ్రత్ సాద్ (రజి)కూడా ఉన్నారు. అప్పుడు విశ్వాసుల మాతృమూర్తుల్లో ఒకరు బిగ్గరగా "ఆగండి, అది ఉడుం మాంసం (తినకండి)" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) అది విని, "తినండి. ఇది హలాల్ మాంసమే" అని అన్నారు. లేక "ఈ మాంసం తినడంలో తప్పులేదు. కాకపోతే నేను మాత్రం దీన్ని తినను" అని అన్నారు ఆయన.

(సహీహ్ బుఖారీ:- 95వ ప్రకరణం - అఖ్బారిల్ ఆహాద్, 6వ అధ్యాయం - ఖబ్రిల్ మర్అతిల్ వాహిదా)

1273. హజ్రత్ ఖాలిద్ బిన్ వలీద్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం) వెంట విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ మైమూనా (రజి) గారింటికి వెళ్ళాను. హజ్రత్ మైమూనా (రజి) నాకు, అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి)కు పిన్నమ్మ అవుతారు. ఆమె ఇంట్లో నాకు వేయించిన ఉడుం (మాంసం) కనిపించింది. అది ఆమెకు ఆమె సోదరి హఫీదా బిన్తె హారిస్ (రజి) నజద్ ప్రాంతం నుండి తెచ్చిచ్చారు. దాన్ని హజ్రత్ మైమూనా (రజి) దైవప్రవక్త (సల్లం)కు వడ్డించారు. దైవప్రవక్త (సల్లం) సాధారణంగా తనకు వడ్డించిన ఆహార పదార్థాలేమిటో తెలియజేయనంత వరకు అందులో చేయి పెట్టేవారు కాదు. ఆయన ఆ ఉడుం మాంసం వైపు చేయి పోనిస్తుంటే అక్కడున్న కొందరు స్త్రీలలో ఒకామె "దైవప్రవక్త (సల్లం)కు నీవు ఏం వడ్డించావో కాస్త తెలియజెయ్యి" అని అన్నది. మరి ఆమె స్వయంగానే "దైవప్రవక్తా! అది ఉడుం మాంసం" అని చెప్పింది. దైవప్రవక్త (సల్లం) ఈ మాట వినగానే తమ చేతిని వెనక్కి తీసుకున్నారు.

నేనది చూసి "దైవప్రవక్తా! ఉడుం (మాంసం) నిషిద్ధమా?" అని అడిగాను. "లేదు, నిషిద్ధం కాదు. కాని ఇది మన ప్రాంతంలో లభించదు గనక నాకు అది తినబుద్ధికాదు, అంతే" అన్నారు దైవప్రవక్త (సల్లం). అప్పుడు నేను దాన్ని (అంటే ఉడుం మాంసం ఉన్న కంచాన్ని) నా వైపుకు లాక్కొని తిన్నాను. నేను తింటుంటే దైవప్రవక్త (సల్లం) నా వైపు చూడసాగారు.

(సహీహ్ బుఖారీ:- 70వ ప్రకరణం - అత్యిమహ్, 10వ అధ్యాయం - మా కానన్నబియ్యు (సల్లం) లా యాకులు హత్తాయుసమ్మాలహూ ఫయాలము మాహువ)

1274. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- మా పిన్నమ్మ హజ్రత్ ఉమ్మె హఫీదా (రజి) దైవప్రవక్త (సల్లం) ఇంటికి కానుకగా జున్ను, నెయ్యి, ఉడుం (మాంసం) పంపించారు. దైవప్రవక్త (సల్లం) జున్ను, నెయ్యి మాత్రం తిన్నారు. కాని ఉడుం మాంసాన్ని ఏవగించుకుంటూ వదలిపెట్టారు (తినలేదు).

దైవప్రవక్త (సల్లం) ముందు ఆయన అనుచరులు ఉడుం మాంసాన్ని తిన్నారు. ఉడుం నిషిద్ధమయి ఉంటే ఆయన ముందు వారు దాన్ని తినేవారు కాదు.

(సహీహ్ బుఖారీ:- 51వ ప్రకరణం - హిబా, 7వ అధ్యాయం - ఖబూలిల్ హదియహ్)

## 8వ అధ్యాయం - మిడతల మాంసం ధర్మసమ్మతమే

1275. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబీ ఔఫా (రజి) కథనం:- మేము దైవప్రవక్త (సల్లం)తో కలసి ఆరేడు యుద్ధాలలో పాల్గొన్నాము. ఆయన వెంట ఉన్నప్పుడు మేము మిడతలను (కూడా) తినేవాళ్ళము.

(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం - అజ్జబాయిహి వస్సైద్, 13వ అధ్యాయం - అక్లిల్ జరాద్)

## 9వ అధ్యాయం - కుందేలు మాంసం తినవచ్చు

1276. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- మేము ముర్రజ్జహ్రాన్ సమీపంలో ఒక కుందేలును వెంటాడాము. జనం (దాన్ని పట్టుకోవడానికి) పరుగెత్తారు. అయితే నేను (ఒక్కడ్నే మాత్రమే) ఆ కుందేలు దాకా చేరుకొని దాన్ని పట్టుకొని హజ్రత్ అబూ తల్హా (రజి) దగ్గరికి తీసుకొచ్చాను. ఆయన

దాన్ని జిబహ్ చేసి దాని నడుం మాంసాన్ని లేక తొడలను దైవప్రవక్త (సల్లం)కు పంపారు. ఆయన దాన్ని స్వీకరించి ఆరగించారు.

(సహీహ్ బుఖారీ:- 51వ ప్రకరణం - హిబా, 5వ అధ్యాయం - ఖబూలి హద్యతిస్సైద్)

## 10వ అధ్యాయం - వేటకు, పరుగుకు పనికొచ్చే పద్ధతులన్నీ అవలంబించవచ్చు

1277. హజ్రత్ అబ్దుల్లా బిన్ మగప్ఫిల్ (రజి) కథనం:- ఒక వ్యక్తి వేట జంతువుపై కంకరాళ్ళు విసరికొడ్తుంటే హజ్రత్ అబ్దుల్లా బిన్ మగప్ఫిల్ (రజి) చూసి అతడ్ని వారించారు. "దైవప్రవక్త (సల్లం) వేట జంతువుపై కంకరాళ్ళు విసరి కొట్టడాన్ని వారించారు లేక ఆయన వేట జంతువుని కంకరాళ్ళతో కొట్టడాన్ని ఇష్టపడేవారు కాదు. కంకరాళ్ళతో వేటాడటం కుదరదు. దాని వల్ల అది చావదు. కాకపోతే ఎప్పుడైనా దాని పళ్ళు రాలిపోవచ్చు లేదా కళ్ళు పగిలిపోవచ్చు" అన్నారు ఆయన.

ఆ తరువాత కూడా ఆ వ్యక్తి కంకరాళ్ళతో కొడ్తుంటే హజ్రత్ అబ్దుల్లా బిన్ మగప్ఫిల్ (రజి) అతనితో ఇలా అన్నారు: "నేను నీకు దైవప్రవక్త (సల్లం) ప్రవచనం విన్పించాను. ఆయన కంకరాళ్ళు కొట్టకూడదని (మనల్ని) వారించారు. లేక ఆయన కంకరాళ్ళు కొట్టడాన్ని ఇష్టపడేవారు కాదు. నువ్వీ ప్రవచనం విని కూడా కంకరాళ్ళు కొడ్తున్నావు. ఇక నేను నీతో మాట్లాడను".

(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం - అజ్జిబాయిహి వస్సైద్, 5వ అధ్యాయం - అల్ఖజ్ఫివల్ బుందుఖా)

## 12వ అధ్యాయం - జంతువుల్ని కట్టివేసి గురిపెట్టడం, కొట్టడం నిషిద్ధం

1278. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- జంతువుల్ని కట్టివేసి (వాటిని గురిపెట్టి బాణం వదలి) చంపడాన్ని దైవప్రవక్త (సల్లం) (మమ్మల్ని) వారించారు.

(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం - అజ్జిబాయిహి వస్సైద్, 25వ అధ్యాయం - మాయుక్రహు మినల్ ముస్లతి వల్ ముస్బూరతిల్ ముజస్సమ్మా)

1279. హజ్రత్ సయీద్ బిన్ జుబైర్ (రహ్మాలై) కథనం:- నేను హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) వెంట ఉన్నాను. మేము కొందరు వ్యక్తుల లేక యువకుల సమీపం నుండి పోవడం తటస్థించింది. అప్పుడు వారు ఒక కోడిని గురి కోసం కట్టివేసి దాని మీదికి బాణాలు వదులుతున్నారు. అయితే వారు హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి)ని చూడగానే దాన్ని వదలి పెట్టి అటు ఇటూ పరుగెత్తారు. అప్పుడు హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) "దీన్నెవరు ఇలా కట్టివేశారు?" అని అడిగి ఆ తరువాత ఇలా అన్నారు: "ఇలా (జంతువుని లేక మరేదయినా జీవాన్ని కట్టివేసి దానిపైకి బాణాలు వదలి పెట్టే పని) చేసే వారిని దైవప్రవక్త (సల్లం) శపించారు".

(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం- అజ్జిబాయిహి వస్సైద్, 25వ అధ్యాయం - మాయుక్రహు మినల్ ముస్లతి వల్ ముస్బూరతి వల్ ముజస్సమ్మా)

# ఖుర్బానీ ప్రకరణం

## 1వ అధ్యాయం -ఖుర్బానీ సమయం

1280. హజ్రత్ జున్దుబ్ (రజి) కథనం:- ఈదుల్ అజ్హా (బక్రీద్ పండుగ) రోజు దైవప్రవక్త (సల్లం) మొదట నమాజు చేశారు. తరువాత ఖుత్బా (ఉపన్యాసం) ఇచ్చారు. ఆ తరువాత బలి (ఖుర్బానీ) పశువుని జిబహ్ చేశారు. (ఆ సందర్భంలో) ఆయన ఇలా ప్రవచించారు: "ఎవరైనా నమాజుకు పూర్వం పశువుని జిబహ్ చేసి ఉంటే అతను దానికి బదులు మళ్ళీ మరొక పశువుని జిబహ్ చేయాలి. నమాజుకు ముందు ఖుర్బానీ ఇవ్వనివాడు (నమాజు తరువాత) దేవుని పేరుతో (అంటే బిస్మిల్లాహి అల్లాహు అక్బర్ అని పఠించి) పశువుని జిబహ్ చేయాలి".

**(సహీహ్ బుఖారీ:- 13వ ప్రకరణం - ఈదైన్, 23వ అధ్యాయం - కలామిల్ ఇమామి వన్నాసి ఫీ ఖుత్బతిల్ ఈద్)**

1281. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం:- మా మామయ్య హజ్రత్ అబూ బర్దా (రజి) పండుగ నమాజుకు పూర్వం ఖుర్బానీ పశువుని జిబహ్ చేశారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఆయనతో "నీ మేక మాంసం కోసం కోయబడిన మేకయ్యింది (ఖుర్బానీ కాలేదు)" అని అన్నారు. దానికి మా మామయ్య "దైవప్రవక్తా! నా దగ్గర (ఇప్పుడు) ఒక మేక పిల్ల మాత్రమే ఉంది" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "దాన్నే జిబహ్ చేసెయ్యి (ఈ రాయితీ నీ కోసం ప్రత్యేకం). నీకు తప్ప మరెవరికీ పశుపిల్లను బలివ్వడం ధర్మసమ్మతం కాదు" అని అన్నారు. ఆ తరువాత ఆయన ఇలా ప్రవచించారు: "ఎవరైనా ఈద్ నమాజుకు ముందు పశువుని బలిస్తే అతను తన కోసం పశువుని బలిచ్చిన వాడవుతాడు. మరెవరైనా పండుగ నమాజు తరువాత పశువుని కోస్తే అతను ఖుర్బానీ చేసిన వాడవుతాడు. అదీగాక అతను ముస్లిముల సంప్రదాయాన్ని ఆచరించిన వాడిగా పరిగణించబడతాడు".★

**(సహీహ్ బుఖారీ:- 73వ ప్రకరణం - అజాహి, 8వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) లి అబీ బుర్దత జహ్హి బిల్ జజయి మినల్ మఅజీ)**

---

★ ఖుర్బానీ (పశుబలి) నిర్ణీత సంపద గల ధనికునికి వాజిబా (తప్పనిసరా) కాదా అనే విషయంలో ధర్మవేత్తల మధ్య భేదాభిప్రాయాలున్నాయి, అధిక సంఖ్యాక ధర్మవేత్తల దృక్పథం ప్రకారం ఖుర్బానీ ఇవ్వడం సున్నత్ (ప్రవక్త సంప్రదాయం) మాత్రమే, (విధి కాదు). కాబట్టి ఖుర్బానీ ఇవ్వనివాడు పాపాత్ముడు కాలేడు. దీనికి ఖజా కూడా లేదు. ఇమామ్ మాలిక్ (రహ్మలై) , ఇమామ్ అహ్మద్ (రహ్మలై) , ఇమామ్ అబూ యూసుఫ్ (రహ్మలై), ఇస్హాఖ్ (రహ్మలై) , అబూసౌర్ (రహ్మలై) , లజ్ని (రహ్మలై), దావూద్ జాహిరీ (రహ్మలై) మొదలైన వారి అభిప్రాయం ఇదే. ఇమామ్ అబూ హనీఫా (రహ్మలై) , ఔజాయి (రహ్మలై) , రబీఅ (రహ్మలై) , లైస్ (రహ్మలై )ల అభిప్రాయం ప్రకారం నిర్ణీత సంపదగల ధనికునికి ఖుర్బానీ ఇవ్వడం తప్పనిసరి. ఇమామ్ నఖయి (రహ్మలై) అభిప్రాయం ప్రకారం ధనికుడు హజ్ నియమాలు పాటిస్తూ ఖుర్బానీ రోజు (జిల్ హజ్ పదో తేదీ) న మినాలో ఉండకపోతే విధి (వాజిబ్)గా ఖుర్బానీ ఇవ్వాలి. జిల్‌హజ్ పదో తేదీన సూర్యోదయానికే ముందే ఖుర్బానీ ఇస్తే అది సరయిన పద్ధతి కాదన్న విషయంపై అందరి మధ్యా ఏకీభావం ఉంది.

పోతే సూర్యాస్తమయం తరువాత ఖుర్బానీ ఇచ్చే విషయంలో కూడా భేదాభిప్రాయాలున్నాయి. ఇమామ్ షాఫయి (రహ్మలై), అబూదావూద్ (రహ్మలై) , ఇబ్నెహన్జర్ (రహ్మలై) ల దృక్పథం ప్రకారం జిల్‌హజ్ పదో తేదీన సూర్యాస్తమయం తరువాత పండుగ నమాజు, రెండు ఖుత్బాలు (ప్రసంగాలు) జరిగినంత సమయం గడిచిపోతే ఖుర్బానీ ఇచ్చే వేళ అయినట్లే. ఆ తరువాత ఎవరైనా ఖుర్బానీ ఇస్తే అది సమంజసమే అవుతుంది. అతను ఇమామ్ వెనుక ఈద్ నమాజు చేసినా, చేయకపోయినా, అతను పట్టణవాసి అయినా, పల్లెవాసి

1282. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- "ఎవరైనా పండుగ నమాజుకు పూర్వం ఖుర్బానీ ఇచ్చి ఉంటే అతను (నమాజు తరువాత) మళ్ళీ ఖుర్బానీ ఇవ్వాల్సి ఉంటుంది" అన్నారు దైవప్రవక్త (సల్లం). ఒక వ్యక్తి ఈ మాట విని లేచి "దైవప్రవక్తా! ఈ రోజు జనం మాంసాన్ని కోరుకుంటారు కదా! (అందుచేత నేను ముందే ఖుర్బానీ ఇచ్చాను)" అని అన్నాడు. తరువాత అతను ఇరుగుపొరుగు (అవసరాలను) గురించి కూడా ప్రస్తావించాడు - దాన్ని దైవప్రవక్త (సల్లం) కూడా సమర్థించినట్లు. ఆ తరువాత అతను మళ్ళీ ఇలా అన్నాడు: " నా దగ్గర ఒక మేకపిల్ల ఉంది. అది కండగల రెండు మేకల కన్నా నాకెంతో ఇష్టమైనది. (మరి ఇప్పుడు నేను దీన్ని బలివ్వాల్నా?)" దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని (ఆ మేక పిల్లను బలివ్వడానికి)అతనికి అనుమతినిచ్చారు.

అయితే ఈ అనుమతి అతని కొక్కడికే ఉందా లేక ఇతరులక్కూడా ఉందా అన్న సంగతి నాకు తెలియదు.

(సహీహ్ బుఖారీ:- 13వ ప్రకరణం - ఈదైన్, 5వ అధ్యాయం - అల్ అక్లి యౌమన్నహ్ర్)

1283. హజ్రత్ ఉఖ్బా బిన్ ఆమిర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) తన అనుచరులకు పంచివ్వడానికి నాకు కొన్ని మేకలను అప్పగించారు. (పంచి పెట్టిన తరువాత) యేడాది వయసు గల ఒక మేక పిల్ల మిగిలిపోతే దాన్ని గురించి నేను దైవప్రవక్త (సల్లం) దగ్గర ప్రస్తావించాను. దైవప్రవక్త (సల్లం) అది విని "దాన్ని నీవు ఖుర్బానీ ఇచ్చుకో" అని చెప్పారు.

(సహీహ్ బుఖారీ:- 40వ ప్రకరణం - వికాలా, 1వ అధ్యాయం - వకాలతుష్షరీకి అష్షరీక ఫిల్ ఖిస్మ వగైరిహా)

## 3వ అధ్యాయం - ఖుర్బానీ పశువుని ఇతరుల చేత గాకుండా స్వయంగా జిబహ్ చేయడం మంచిది

1284. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) రెండు గొర్రెలను ఖుర్బానీ ఇచ్చారు. అవి తెలుపు నలుపు రంగు గలవి. వాటికి కొమ్ములు కూడా ఉన్నాయి. దైవప్రవక్త (సల్లం) వాటిని తమ స్వహస్తాలతో జిబహ్ చేశారు. జిబహ్ చేసేటప్పుడు "బిస్మిల్లాహి అల్లాహు అక్బర్" అని పఠించి గొర్రె మెడ మీద తన కాలు పెట్టారు.

(సహీహ్ బుఖారీ:- 73వ ప్రకరణం - అజాహి, 14వ అధ్యాయం - అత్తక్బీరి ఇన్దజ్జబ్హి)

---

అయినా, బాటసారి అయినా కాకపోయినా, అప్పటి దాకా ఇమామ్ ఖుర్బానీ ఇచ్చినా, ఇవ్వకపోయినా, అతను ఖుర్బానీ ఇస్తే విధి నెరవేరినట్లే. ఇమామ్ అబూహనీఫా (రహ్మలై) , అతా (రహ్మలై) ల దృక్పథం ప్రకారం గ్రామాల్లో, అడవుల్లో నివసించే వారికి జిల్ హజ్ పదో తేదీ ఉషోదయం తరువాత ఖుర్బానీ వేళ ప్రారంభమవుతుంది. పట్టణ వాసులకు ఇమామ్ నమాజు, ఖుత్బా విధులు నెరవేర్చనంత వరకు, ఖుర్బానీ వేళ కాదు. అంటే దానికి ముందు ఖుర్బానీ ఇస్తే అది సరికాదన్న మాట. ఇమామ్ మాలిక్ (రహ్మలై) అభిప్రాయం ప్రకారం ఇమామ్ నమాజు, ఖుత్బాలు ముగించనంతవరకు ఇతరులు ఖుర్బానీ ఇస్తే అది సరికాదు. ఇమామ్ అహ్మద్ (రహ్మలై) అభిప్రాయం ప్రకారం ఇమామ్ నమాజు చేయడానికి ముందు ఇతరులు ఖుర్బానీ ఇవ్వడం సరికాదు. ఇమామ్ నమాజ్ చేసిన తరువాత అతను ఖుర్బానీ ఇంకా ఇవ్వకపోయినా ఇతరులు (పట్టణవాసులు, గ్రామీణ వాసులు) మాత్రం ఖుర్బానీ ఇవ్వవచ్చు. రబియా (రహ్మలై) అభిప్రాయం ప్రకారం ఇమామ్ లేని చోట సూర్యోదయానికి పూర్వం ఖుర్బానీ ఇవ్వడం సరికాదు. సూర్యోదయం తరువాత ఇవ్వొచ్చు. ఖుర్బానీ ఇచ్చే చివరి వేళ ఇమామ్ షాఫయి (రహ్మలై) , ఇమామ్ అబూ హనీఫా (రహ్మలై) ల దృష్టిలో పదమూడవ తేదీ సాయంత్రం వరకు ఉంది. ఇమామ్ మాలిక్ (రహ్మలై) , ఇమామ్ అహ్మద్ (రహ్మలై) ల దృష్టిలో పన్నెండవ తేదీ సాయంత్రం వరకు ఉంది. ఇమామ్ మాలిక్ (రహ్మలై) దృష్టిలో రాత్రివేళ ఖుర్బానీ ఇవ్వడం సరికాదు. (ఇమామ్ నవవీ-రహ్మలై)

## 4వ అధ్యాయం - పన్ను, గోరు, ఎముకలు తప్ప రక్తం కారడానికి పనికొచ్చే ఏ వస్తువుతోనైనా జిబహ్ చేయవచ్చు

1285. హజ్రత్ రాఫె బిన్ ఖదీజ్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం)తో "దైవప్రవక్తా! రేపు ఉదయం మనం శత్రువును ఎదుర్కొనవలసి ఉంది. మరి మా దగ్గర కత్తులు లేవు" అని అన్నాను. దానికి దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చారు. "(పశువును) శీఘ్రంగా జిబహ్ చేయండి. రక్త ప్రవాహానికి కారణమయ్యే వస్తువుల్లో నీవు తలచిన వస్తువుతో జిబహ్ చేయవచ్చు. జిబహ్ చేసేటప్పుడు దేవుని పేరు పఠించాలి. ఆ తరువాత దాన్ని తిను. (మరొక విషయం) పళ్ళతో, గోళ్ళతో జిబహ్ చేయకూడదు. దానిక్కారణం చెబుతాను. పన్ను కూడా ఎముకే (ఎముకతో జిబహ్ చేయడం ధర్మసమ్మతం కాదు). గోరు నీగ్రోల కత్తి".

ఒకసారి మాకు విజయప్రాప్తిగా ఒంటెలు, మేకలు లభించాయి. వాటిలో ఒక ఒంటె పారిపోయింది. ఒక వ్యక్తి దాని మీదికి ఒక బాణం వదిలాడు. దాంతో అది ఆగిపోయింది. ఆ సందర్భంలో దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు: "ఈ ఒంటెలలో కూడా కొన్ని క్రూరమైనవి ఉంటాయి. అందువల్ల వాటిలో ఏదైనా ఒంటె తప్పించుకుపోతే దాని పట్ల ఇలాంటి పద్ధతే అవలంబించాలి".

**(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం - అజ్జిబాయిహి వస్సైద్, 23వ అధ్యాయం - మానిద్దమినల్ బహాయిమ్)**

1286. హజ్రత్ రాఫె బిన్ ఖదీజ్ (రజి) కథనం:- మేము దైవప్రవక్త (సల్లం) వెంట జిల్ హులైఫా ప్రాంతానికి చేరుకున్నాము. అప్పుడు జనానికి ఆకలి కావడం మొదలెట్టింది. వారి దగ్గర విజయప్రాప్తిగా లభించిన మేకలు, ఒంటెలు ఉన్నాయి. దైవప్రవక్త (సల్లం) వెనుక ఉండే సైనికదళంలో ఉన్నారు. (ఆయన ఇంకా ఆ ప్రాంతానికి చేరుకోలేదు). అప్పుడు ప్రజలు తొందరపడి విజయప్రాప్తి పంపిణీ చేయకముందే ఆ పశువుల్ని జిబహ్ చేసి, మాంసం కుండలు పొయ్యి మీద పెట్టారు. అందువల్ల దైవప్రవక్త (సల్లం) ఆదేశంతో ఆ కుండలు బోర్ల పడవేశారు. ఆ తరువాత విజయప్రాప్తి పంచబడింది. ఒక ఒంటె పది మేకలకు సమానంగా పరిగణించబడింది. ఆ ఒంటెలలో ఒక ఒంటె బెదిరి పారిపోయింది. అప్పుడు జనం దాన్ని పట్టుకోవడానికి ప్రయత్నించారు. కాని చాలా అలసిపోయారు. ఆ రోజుల్లో జనం దగ్గర గుర్రాలు చాలా తక్కువగా ఉండేవి - ఒక వ్యక్తి ఆ ఒంటె మీదికి బాణం వదిలాడు. దాంతో దేవుడు దాన్ని ఆపివేయించాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు: "ఈ జంతువుల్లో కూడా అడవి మృగాల్లా బెదిరిపోయే క్రూర జంతువులు ఉంటాయి. అందువల్ల అవి మీ అదుపులో లేకుండా పోతే వాటి పట్ల ఇలాంటి పద్ధతే పాటించండి". నేను దైవప్రవక్త(సల్లం)తో మాట్లాడుతూ "దైవప్రవక్తా! రేపు మనం శత్రువులతో యుద్ధం చేయవలసిన పరిస్థితి వస్తుందేమో. మా దగ్గర కత్తులు లేకపోతే వెదురు బద్దలతో పశువుల్ని జిబహ్ చేయవచ్చా?" అని అడిగాను. దానికి దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చారు: "రక్త ప్రవాహానికి కారణభూతమయ్యే ప్రతి వస్తువుతోనూ మీరు జిబహ్ చేయవచ్చు. జిబహ్ చేసేటప్పుడు దేవుని పేరు పఠించి తినాలి. అయితే పళ్ళు, గోళ్ళతో

జిబహ్ చేయకూడదు. దానిక్కారణం చెబుతాను. పన్ను ఒక విధమైన ఎముకే, గోరు నీగ్రోల కత్తి (గనక దాంతోనూ పశువుని జిబహ్ చేయకూడదు.)"

(సహీహ్ బుఖారీ:- 47వ ప్రకరణం - షిర్కత్,3వ అధ్యాయం - ఖిస్మతిల్ గనం)

## 5వ అధ్యాయం - ఖుర్బానీ మాంసం నిల్వ ఉంచుకునేందుకు అనుమతి

1287. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- "ఖుర్బానీ మాంసాన్ని మూడు రోజుల దాకా తినవచ్చని" దైవప్రవక్త (సల్లం) అన్నారు. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఖుర్బానీ మాంసం తినలేరు. అందుచేత ఆయన 'మినా' నుండి వెళ్ళిన తరువాత జైతూన్ నూనెతో రొట్టె తినేవారు.(1)

(సహీహ్ బుఖారీ:- 73వ ప్రకరణం - అజాహి, 16వ అధ్యాయం - మా యూకలు మిల్లుహూ మిల్ అజాహి వమా యుతజవ్వదూ మిన్హా)

1288. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఖుర్బానీ మాంసాన్ని మేము ఉప్పు కలిపి నిల్వ ఉంచుకునేవారము. తరువాత ఈ మాంసాన్ని మదీనాలో దైవప్రవక్త(సల్లం)కు సమర్పించేవాళ్ళము. ఆయన ఈ సందర్భంలో "ఖుర్బానీ మాంసాన్ని మూడు రోజుల దాకా మాత్రమే తినండి" అని అన్నారు. అయితే ఇది తప్పనిసరిగా పాటించవలసిన ఆదేశం కాదు. ఈ మాంసాన్ని (అంటే ఎంతో కాలం నిల్వ ఉంచకుండా) (పేద) ప్రజలకు ఇవ్వండన్నదే ఆయన ఉద్దేశ్యం. వాస్తవం దేవునికే తెలుసు.(2)

(సహీహ్ బుఖారీ:- 73వ ప్రకరణం -అజాహి, 16వ అధ్యాయం - మా యూకలు మిల్లుహూ మిల్ అజాహి వమా యుతజవ్వదూ మిన్హా)

1289. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- మేము మొదట్లో 'మినా'లో ఉన్నప్పుడు ఖుర్బానీ మాంసాన్ని మూడు రోజుల కన్నా ఎక్కువ కాలం ఉంచుకొని తినేవాళ్ళము కాదు. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) "తినండి, నిల్వ కూడా ఉంచుకోండి" అని అనుమతించారు. అందువల్ల మేము తిన్నాము, నిల్వకూడా ఉంచుకున్నాము.

(సహీహ్ బుఖారీ:- 25వ ప్రకరణం - హజ్, 124 వ అధ్యాయం - మా యూకలు మినల్ బుద్నె వమాయతసద్దఖ్)

1290. హజ్రత్ సలమా బిన్ అక్వ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఉపదేశిస్తూ "ఖుర్బానీ చేయదలచుకున్న వ్యక్తి మూడు రోజులకు మించి తనింట్లో ఆ మాంసాన్ని మిగిల్చి ఉంచకూడదు" అని అన్నారు. ఆ తరువాత సంవత్సరం "దైవప్రవక్తా! ఈ సంవత్సరం కూడా గత సంవత్సరం చేసినట్లే

(1) ధర్మవేత్తలలో కొందరు ఈ హదీసుని ఆచరించారు. వారి దృష్టిలో ఖుర్బానీ మాంసాన్ని మూడు రోజులకు మించి దగ్గర పెట్టుకోవడం నిషిద్ధం. అయితే అధిక సంఖ్యాక ధర్మవేత్తల ప్రకారం ఈ హదీసు రద్దయి పోయింది. వారి దృష్టిలో ఖుర్బానీ మాంసాన్ని మూడు రోజులకు మించి దగ్గర పెట్టుకోవడం, నిల్వ ఉంచడం ధర్మసమ్మతమే. (ఇమామ్ నవవీ-రహ్మాలై).

(2) ఈ హదీసుని బట్టి ఖుర్బానీ మాంసాన్ని మూడురోజులకు మించి దగ్గర పెట్టుకోవడం తప్పుకాదు. కాకపోతే అందులోనుంచి పేదవాళ్ళ క్కూడా దానం చేయాలి. మొత్తం మాంసాన్ని మూడు సమాన భాగాలుగా చేసి ఒక భాగం స్వయంగా తినాలి, మరొక భాగం పేదలకు దానం చేయాలి. వేరొక భాగం బంధుమిత్రలకు ఇచ్చి వేయాలి అని ధర్మవేత్తలు అన్నారు. మరికొందరి అభిప్రాయం ప్రకారం సగం స్వయంగా తిని, సగం పేదలకు దానం చేయాలి. ఖుర్బానీ మాంసం తినడం అభిలషణీయం మాత్రమే, విధికాదు.
(ఇమామ్ నవవీ-రహ్మాలై).

చేయాలా?" అని అడిగారు అనుచరులు. దానికి దైవప్రవక్త (సల్లం) "మీరు తినండి, అర్హులకు అందజేయండి, నిల్వ కూడా ఉంచుకోండి. గత సంవత్సరం ప్రజలు కష్టాలలో ఉన్నారు. అందువల్ల మీరు వారికి సహాయం చేయడానికి నేనలా అన్నాను" అని అన్నారు. (అంటే మాంసం మూడు రోజులకు మించి నిల్వ ఉంచకుండా దాన్ని కష్టాలలో ఉన్న వారికి పంచి పెట్టండని చెప్పాను.)

**(సహీహ్ బుఖారీ:- 73వ ప్రకరణం - అజాహి, 16వ అధ్యాయం - మా యూకలు మిల్లుహూ మిల్ అజాహి వమా యుతజవ్వదూ మిన్హా)**

## 6వ అధ్యాయం - ఫరా, అతీరా ఒంటె పిల్లలు

1291. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఫరా, అతీరా (ఒంటె పిల్లలు)*రెండూ అధర్మమైనవి". (హదీసు ఉల్లేఖకుని కథనం:-) ఫరా అంటే విగ్రహాల పేర బలివ్వబడే మొదటి ఒంటెపిల్ల.

**(సహీహ్ బుఖారీ:- 71 వ ప్రకరణం - అఖీఖా, 3వ అధ్యాయం - అల్‌ఫరా)**

★ రజబ్ నెల మొదటి దశకంలో జిబహ్ చేసే ఒంటె పిల్లను 'అతీరా' అంటారు. ఫరా గురించి ఒక అభిప్రాయం ప్రకారం ఎవరి దగ్గరైనా వంద ఒంటెలు పోగయితే, అతను అందులో మొదట ఈనిన ఒంటె పిల్లను విగ్రహాల పేర బలి ఇస్తాడు. ఈ రెండు రకాల ఒంటె బలులు అజ్ఞాన కాలం నాటి దురాచారాలు. దైవప్రవక్త (సల్లం) ఇలా చేయకూడదని ఉపదేశిస్తూ ఇవి దురాచారాలు మాత్రమేనని అన్నారు. అయితే ఎవరైనా (తాను వంద ఒంటెల యజమాని అయినందుకు) దేవుని పట్ల కృతజ్ఞతగా దేవుని పేర బలి ఇస్తే అది ధర్మసమ్మతమే. ఇతర హదీసుల్లో ఇలా చేయడానికి అనుమతి ఉంది. (ఇమామ్ నవవీ - రహ్మాలై).

# పానీయాల ప్రకరణం

## 1వ అధ్యాయం - మద్య నిషేధం; ఖర్జూరం, ద్రాక్ష, కిస్మిస్‌లతో తయారయ్యే మద్యం

1292. హజ్రత్ అలీ (రజి) కథనం:- నా దగ్గర బద్ర్ యుద్ధ సొత్తు నుండి లభించిన ఒక ఒంటె ఉండేది. ఖుమ్స్ (యుద్ధసొత్తు) నుండి దైవప్రవక్త (సల్లం) ప్రసాదించిన మరొక ఒంటె కూడా నా దగ్గర ఉండేది. ప్రవక్త కుమార్తె హజ్రత్ ఫాతిమా (రజి)ను (వివాహమాడిన తరువాత) నా ఇంటికి పిలుచుకురావడానికి నిర్ణయించుకున్నప్పుడు, నేను బనీ ఖైనుఖా తెగకు చెందిన ఒక స్వర్ణకారునితో, అతను నా వెంట (అడవికి) వెళ్ళి అజ్ఖర్ గడ్డి తీసుకు రావాలని మాట్లాడుకున్నాను. అజ్ఖర్ గడ్డి స్వర్ణకారులకు అమ్మి ఆ డబ్బుతో నా పెళ్ళి విందు (వలీమా) చేసుకుందామని నేననుకున్నాను. ఆ సందర్భంలో నేను నా ఒంటెలకు సంబంధించిన అంబారీ, గడ్డిచిక్కం, త్రాళ్ళు తదితర సామగ్రిని సేకరించడం మొదలెట్టాను.

నా ఒంటెలు రెండింటిని ఒక అన్సారీ ముస్లిం ఇంటి దగ్గర ఉంచాను. ఒంటెల సామగ్రి తీసుకొని వచ్చి చూస్తే నా ఒంటెల మూపురాలు కోయబడి ఉన్నాయి. వాటి పొట్టలు కోసి గుండెకాయలు తీసేసుకున్నారు. ఈ దృశ్యం చూసి నాకు ఏడ్పు వచ్చినంత పనయింది. ఈ పని ఎవరు చేశారని అడిగాను నేను. హజ్రత్ హమ్జా బిన్ అబ్దుల్ ముత్తలిబ్ (రజి) అని జనం తెలియజేశారు. అప్పుడు హజ్రత్ హమ్జా (రజి) ఆ ఇంట్లో కొందరు అన్సారులతో కలసి మద్యం సేవిస్తున్నారు. నేను అక్కడ్నుంచి నేరుగా దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళాను. ఆ సమయంలో ఆయన దగ్గర హజ్రత్ జైద్ బిన్ హారిస్ (రజి) కూర్చొని ఉన్నారు. దైవప్రవక్త (సల్లం) నా ముఖంలో కొట్టవచ్చినట్లు కన్పిస్తున్న నా మనోభావాన్ని చూసి "ఏమిటీ ఇలా తయారయ్యావు?" అని అడిగారు. "దైవప్రవక్తా! నాకీ రోజు కలిగినంత బాధ ఇదివరకెప్పుడూ కలగలేదు. హజ్రత్ హమ్జా (రజి) నా ఒంటెలపై దౌర్జన్యం చేశారు. వాటి మూపురాలు, పొట్టలు కోశారు. అక్కడ సమీపంలోనే ఒక ఇంట్లో కొందరు వ్యక్తులతో కలసి సారాయి త్రాగుతున్నారు" అని చెప్పాను నేను.

దైవప్రవక్త (సల్లం) ఈ మాట వినగానే తమ దుప్పటి తెప్పించుకొని కప్పుకొని బయలుదేరారు. జైద్ బిన్ హారిస్ (రజి) కూడా ఆయన వెంట నడిచారు. దైవప్రవక్త (సల్లం) హమ్జా (రజి) ఉన్న ఇంటికి వెళ్ళి లోపలికి రావచ్చా అని అనుమతి అడిగారు. లోపల ప్రవేశించడానికి అనుమతి లభించింది. చూస్తే వారంతా మద్య సేవనంలో మునిగి ఉన్నారు. దైవప్రవక్త (సల్లం) అది చూసి హజ్రత్ హమ్జా (రజి)కు చీవాట్లు పెట్టారు. హజ్రత్ హమ్జా (రజి) కళ్ళు ఎరుపెక్కాయి. ఆయన సారా మత్తులో తూలుతూ తలపైకెత్తి దైవప్రవక్త (సల్లం) వైపు దృష్టి సారించారు. ఆయన మొదట దైవప్రవక్త (సల్లం)కాళ్ళ వైపు చూశారు. తరువాత మెల్లగా ఆయన నాభి వైపు, ఆ తరువాత ఆయన ముఖం వైపు చూశారు. ఆ తరువాత "మీరెంత? మీ విలువెంత? మీరు మా తండ్రిగారి బానిసలేగా!" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ పరిస్థితి చూసి "హమ్జా (రజి) ఇప్పుడు పూర్తి మత్తులో మునిగి ఉన్నార"ని

భావించి అక్కడ్నుంచి వెనక్కి మరలి పోయారు. మేము కూడా ఆయన వెంట అక్కడ్నుంచి బయలు దేరాము.[1]

(సహీహ్ బుఖారీ:- 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖుమ్స్, 1వ అధ్యాయం - ఫర్జుల్ ఖుమ్స్)

1293. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- నేను హజ్రత్ అబూ తల్హా (రజి) ఇంట్లో జనానికి సారాయి పోస్తుండేవాడ్ని. ఆ రోజుల్లో ప్రజలు ఖర్జూర సారాను త్రాగేవారు - ఓ రోజు దైవప్రవక్త (సల్లం) చాటింపు వ్యక్తి ద్వారా "జనులారా! జాగ్రత్తగా వినండి, (ఈ రోజు నుండి) సారాయి నిషేధించ బడింది" అని చాటింపు వేయించారు. హజ్రత్ అబూ తల్హా (రజి) (ఈ చాటింపు విని) "వెళ్ళు, సారాయిని బయటికి తీసికెళ్ళి పారబోయి"అని అన్నారు నాతో. నేను సారా (కుండల)ను బయటికి తీసికెళ్ళి పారబోశాను. ఆ రోజు మదీనా వీధుల్లో సారాయి (ఏరులా) ప్రవహించసాగింది. ఆ సందర్భంలో కొందరు "కడుపులో సారాయి కలిగి ఉన్నవారు నాశనమయ్యారు" అని అన్నారు. అప్పుడు దేవుడు ఈ సూక్తిని అవతరింపజేశాడు:- "సత్యాన్ని విశ్వసించి, సత్కర్మలు ఆచరించనారంభించిన వారు గతంలో తిని త్రాగిన వాటిని గురించి వారిని పట్టుకోవడం జరగదు. (అంటే అందులో అప్పుడు పాపమేమీ లేదు) అయితే ఇక నుండి నిషేధిత వస్తువులకు వారు దూరంగా ఉండాలి. విశ్వాసంలో స్థిర చిత్తులయి సత్కార్యాలు చేస్తూ ఉండాలి". (5:93)

(సహీహ్ బుఖారీ:- 46వ ప్రకరణం - మజాలిమ్, 21వ అధ్యాయం - సబ్బిల్ ఖమ్రి ఫిత్తరీఖ్)

## 5వ అధ్యాయం - ద్రాక్ష, ఖర్జూరాలను కలిపి నానబెట్టడం మంచిది కాదు

1294. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- ద్రాక్ష, ఖర్జూరం, దోర ఖర్జూర కాయలను నానబెట్టడాన్ని (ఆ విధంగా మద్యం తయారు చేయడాన్ని) దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని వారించారు.[2]

(సహీహ్ బుఖారీ:- 74వ ప్రకరణం - అష్రిబా, 11వ అధ్యాయం - మన్‌రా అఁల్లాయుఖ్లతల్ బుస్రువత్తమ్ర్ ఇజా కానముస్కిరన్)

1295. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం:- పండిన ఖర్జూరాలను, దోర ఖర్జూరాలతో, ఖర్జూర పండ్లను, ద్రాక్షపండ్లతో కలిపి మద్యం తయారు చేయడానికి నానబెట్టకూడదని దైవప్రవక్త (సల్లం) మాకు తాకీదు చేశారు. "(మత్తు కలిగించని) పానకం తయారు చేయడానికి ఆ వస్తువుల్లో ప్రతి ఒక్కటీ వేర్వేరుగా నానబెట్టాల"ని ఆయన అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 74వ ప్రకరణం - అష్రిబా, 11వ అధ్యాయం - మన్‌రా అఁల్లాయుఖ్లతల్ బుస్రవత్తమ్ర్ ఇజా కాన ముస్కిరన్)

---

(1) ఇది మద్య నిషేధం రాకముందు జరిగిన సంఘటన. ఆనాడు మద్యం సేవించడం అధర్మంగా లేదు. అంచేత మద్యం మత్తులో హజ్రత్ హమ్జా (రజి) వల్ల జరిగిన చేష్టలు నిలదీయదగిన పాపకార్యాలు కావు. బహుశా ఆయన హజ్రత్ అలీ (రజి)కి ఒంటెల నష్టపరిహారాన్ని చెల్లించి ఉండవచ్చు. (ఇమామ నవవీ- రహ్మలై)

(2) ఈ వస్తువుల్ని కలిపి నాన బెట్టడంవల్ల తొందరగా మత్తు కలుగుతుంది. దాన్ని త్రాగేవాడు ఇదింకా మద్యంగా మారలేదని భావిస్తాడు. అందువల్ల అతను అందులో నిషా ఉన్నప్పటికీ పొరపాటున త్రాగేస్తాడు. (సంకలన కర్త)

## 6వ అధ్యాయం - జిడ్డు మట్టి కుండలు, పచ్చ లక్క బుంగలు, సొరకాయ బుర్రలు, చెక్క పిడతలలో పానకం తయారీ

1296. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- సొరకాయ బుర్రల్లో, జిడ్డు మట్టి కుండలలో పానకం తయారు చేయకండి.

(సహీహ్ బుఖారీ:- 74వ ప్రకరణం - అష్రిబా, 4వ అధ్యాయం - అల్ ఖమ్రి మినల్ అస్లి వహువల్‌బుతా)

1297. హజ్రత్ అలీ (రజి) కథనం:- (సారా తయారీకి) సొరకాయ బుర్రలు, జిడ్డు మట్టి కుండలను వాడటాన్ని దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని వారించారు.

(సహీహ్ బుఖారీ:- 74వ ప్రకరణం - అష్రిబా, 8వ అధ్యాయం - తర్ఖీసిన్నబియ్యి (సల్లం) ఫిల్ ఔఇయత్ వజ్జురూఫి బాదన్నహ్యి)

1298. హజ్రత్ ఇబ్రాహీం నఖయి (రహ్మాలై) కథనం:- నేను హజ్రత్ అస్వద్ (రహ్మాలై)తో మాట్లాడుతూ "ఏ పాత్రలలో మద్యం తయారు చేయకూడదో మీరు హజ్రత్ ఆయిషా (రజి)ను అడిగారా?" అని ప్రశ్నించాను. దానికాయన "విశ్వాసుల మాతృమూర్తి! మద్యం ఏఏ పాత్రలలో తయారు చేయకూడదని దైవప్రవక్త (సల్లం) చెప్పారు?" అని నేనామెను అడిగాను. ఆమె దానికి సమాధానమిస్తూ, 'సొరకాయ బుర్రల్లో, జిడ్డు మట్టికుండల్లో మద్యం తయారు చేయడాన్ని దైవప్రవక్త (సల్లం) ముఖ్యంగా మమ్మల్ని వారించారు' అని అన్నారు.

"అయితే హజ్రత్ ఆయిషా (రజి) కడవలు, లక్కపిడతల సంగతి ప్రస్తావించలేదా" అని నేను హజ్రత్ అస్వద్ (రహ్మాలై)ని మళ్ళీ అడిగాను. దానికాయన "నేను విన్నదే నీకు విన్పించాను. నేను వినని విషయాన్ని ఎలా చెప్పనూ?" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 74వ ప్రకరణం - అష్రిబా, 8వ అధ్యాయం - తర్ఖీసిన్నబియ్యి (సల్లం) ఫిల్ ఔఇయత్ వజ్జురూఫి బాదన్నహ్యి)

1299. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "సొరకాయ బుర్రలను, పచ్చలక్క పిడతలను, చెక్క పాత్రలను, జిడ్డు మట్టి కుండలను వాడటం గురించి నేను మిమ్మల్ని వారిస్తున్నాను."

(ఈ పాత్రలలో పూర్వం మద్యం తయారు చేసే వారు గనక, మద్య నిషేధం వచ్చిన తరువాత వీటిని వాడకూడదని ఆయన - సల్లం- వక్కాణించారు)

(సహీహ్ బుఖారీ:- 24వ ప్రకరణం - జకాత్, 1వ అధ్యాయం - ఉజూ బిజ్జకాత్)

1300. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) మద్యసేవనం చేసే పాత్రలను ఉపయోగించటం గురించి మమ్మల్ని వారించినప్పుడు, ఒకరు లేచి "అందరి దగ్గర పాత్రలు ఉండవు కదా? (మరెలా?)" అని అన్నారు. అలాంటి వారికి ఆయన మెరుగుపట్టని పాత్రలను వాడుకోవడానికి అనుమతినిచ్చారు.

(సహీహ్ బుఖారీ:- 74వ ప్రకరణం - అష్రిబా, 8వ అధ్యాయం - తర్ఖీసిన్నబియ్యి (సల్లం) ఫిల్ ఔఇయత్ వజ్జురూఫి బాదన్నహ్యి)

## 7వ అధ్యాయం - మత్తు కలిగించే ప్రతి వస్తువూ మద్యమే, మద్యం నిషిద్ధం

1301. హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- మత్తు కలిగించే ప్రతి పానీయమూ నిషిద్ధమే.

(సహీహ్ బుఖారీ:- 4వ ప్రకరణం - వుజూ, 71వ అధ్యాయం - లాయజూజుల్ వుజూ బిన్నబీజి వలల్ ముస్కిరి బిన్నబీజ్)

1302. హదీసె అబూ మూసా వ ముఆజ్ :- హజ్రత్ అబూమూసా అష్అరి (రజి), హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ (రజి)లను దైవప్రవక్త (సల్లం) యమన్ దేశానికి (పాలకులుగా చేసి) పంపేటప్పుడు వారికి ఇలా ఉపదేశించారు: "(ప్రజలకు) సౌలభ్యాలు కలగజేయండి. (వారిని) కాఠిన్యాలలోకి నెట్టకండి. (వారికి) శుభవార్తలు విన్పించండి, ద్వేషం కలిగించకండి, పరస్పర సహకారంతో మెలగండి, సంతోషంగా ఉండండి".

ఆ సందర్భంలో హజ్రత్ అబూమూసా (రజి) "దైవప్రవక్తా! మా ప్రాంతంలో యవలు (బార్లీ)తో 'మిర్జ్' (1) అనే ఒక విధమైన సారాయి తయారు చేస్తారు. తేనెతో 'బితా' అనే మరో విధమైన సారా తయారు చేస్తారు. (వీటిని గురించి మీ అభిప్రాయం ఏమిటి)?" అని అడిగారు. దానికి ఆయన "మత్తు కలిగించే ప్రతి వస్తువూ నిషిద్ధమే" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 61వ అధ్యాయం - బోయిస అబూమూసావ ముఆజ్ ఇలల్‌యమన్ ఖబ్ల హజ్జతిల్ విదా)

## 8వ అధ్యాయం - త్రాగుబోతు తౌబా చేయకుండా చనిపోతే స్వర్గ మధువుకు నోచుకోడు

1303. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- ఇహలోకంలో మద్యం సేవించి, ఆ తరువాతయినా పశ్చాత్తాపంతో తనను తాను సంస్కరించుకొనని వాడు పరలోకంలో పరిశుద్ధ మద్యసేవనానికి దూరమయిపోతాడు.(2)

(సహీహ్ బుఖారీ:- 74వ ప్రకరణం - అష్రిబా, 1వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా ఇన్నమల్ ఖమ్రువల్ మైసిరువల్ అన్సాబ్ వల్ అజ్లామ్....)

## 9వ అధ్యాయం - ఘాటు, మత్తులేని మద్యం ధర్మసమ్మతమే

1304. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం:- హజ్రత్ అబూ ఉసైద్ సాదీ (రజి) తన వివాహంలో దైవప్రవక్త(సల్లం)ను విందు భోజనానికి ఆహ్వానించారు - ఆ రోజు నూతన వధువయిన ఆయన భార్య ఆయన ఇంట్లో స్వయంగా పనిచేస్తూ ఉండింది. నేను అబూ ఉసైద్ సాదీ (రజి)తో ఇలా అన్నాను: "ఆమె దైవప్రవక్త (సల్లం)కు ఏం త్రాగించిందో నీకు తెలుసా? రాత్రి ఆమె ఖర్జూరపండ్లను నానబెట్టింది.

---

(1) 'మిర్జ్' అంటే బహుశా ఒక విధమైన బీరు లాంటిది. ఈ హదీసులో మత్తు కలిగించే అంతటి మద్యం మాత్రమే నిషిద్ధమని ఉంది. కాని మరొక హదీసుని బట్టి ఏ మద్యం అధిక పరిమాణం మత్తు కలిగిస్తుందో ఆ మద్యం అల్పపరిమాణం కూడా నిషిద్ధమేనని స్పష్టంగా తెలుస్తోంది.(ఇమామ్ నవవీ-రహ్మలై)

(2) పరిశుద్ధ మద్య సేవనానికి దూరమవుతాడంటే స్వర్గానికి దూరమవుతాడని అర్థం. (అనువాదకుడు)

తరువాత దైవప్రవక్త (సల్లం) వచ్చి భోజనం చేశాక ఆమె ఈ పానకాన్ని ఆయనకు త్రాగించింది."

(సహీహ్ బుఖారీ:- 67వ ప్రకరణం - నికాహ్, 71వ అధ్యాయం - హఖ్ఖి ఇజాబతిల్ వలీమా వద్దావహ్)

1305. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం:- హజ్రత్ అబూ ఉసైద్ సాదీ (రజి) పెళ్ళి చేసుకొని దైవప్రవక్త (సల్లం)కు, ఆయన అనుచరులకు (వలీమా) విందు ఏర్పాటు చేశారు. అప్పుడు స్వయంగా అబూఉసైద్ వధువు ఉమ్మె ఉసైద్ (రజి) భోజనం వండి అతిథులకు వడ్డించారు. ఆమె రాత్రి ఒక ముంతలో ఖర్జూర పండ్లను నానబెట్టారు. (మరునాడు) దైవప్రవక్త (సల్లం) భోజనం చేసిన తరువాత ఆమె ఆ ఖర్జూర పండ్లను బాగా పిండి నీటిలో కలిపి దైవప్రవక్త (సల్లం)కు తాగడానికిచ్చారు. ఈ పానకం ప్రత్యేకంగా దైవప్రవక్త (సల్లం)కే సమర్పించబడింది.

(సహీహ్ బుఖారీ:- 67వ ప్రకరణం - నికాహ్, 77వ అధ్యాయం - ఖియామిల్ మర్అతి అలర్రిజాల్ ఫిల్ ఇర్సివ ఖిద్మతిహీ బిన్నఫ్స్)

1306. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం:- ఒకసారి దైవప్రవక్త (సల్లం) ముందు ఒక అరబ్బు స్త్రీ (సుగుణాలను) గురించి ప్రస్తావన వచ్చింది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఆ స్త్రీకి తన తరఫున వివాహ సందేశం పంపండని అన్నారు. హజ్రత్ అబూ ఉసైద్ (రజి) ఈ సందేశాన్ని ఆ స్త్రీకి అందజేశారు. ఆమె మదీనా వచ్చి బనీ సాదా వారి ఇంటిలో బసచేసింది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) అక్కడికి వెళ్ళి ఆమెను చూశారు. ఆమె (సిగ్గుతో) తలవంచుకొని కూర్చున్నది. దైవప్రవక్త (సల్లం) ఆమెతో మాట్లాడారు. కాని ఆమె (తల వంచుకునే) "నేను మీ నుండి దేవుడ్ని శరణుకోరుతున్నాను" అని అన్నది. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "నిన్ను నేను నా నుండి కాపాడాను (ఇక వెళ్ళిపో)" అని అన్నారు. ఆ తరువాత కొందరు ఆమె దగ్గరికెళ్ళి "ఇప్పుడు నీతో మాట్లాడిందెవరో తెలుసా?" అని అడిగారు, దానికామె "తెలియదు, ఆయనెవరో నాకు తెలియదు" అని అన్నది. "ఆయన దైవప్రవక్త (సల్లం). నిన్ను పెళ్ళి చేసుకునే ఉద్దేశ్యంతో వచ్చారు" అని వారు అసలు విషయం తెలియజేశారు. అప్పుడామె (పశ్చాత్తాపపడుతూ) "నేనెంత దురదృష్టవంతురాలిని! దురదృష్టవంతురాలిని కాబట్టే నా నోట అలాంటి మాటలు వెలువడ్డాయి" అని అన్నది.

ఆ రోజు దైవప్రవక్త (సల్లం) అక్కడ్నుంచి తిరిగొచ్చి సఖీఫా బనీ సాయిదా వాడలో కూర్చున్నారు. వెంట ఆయన అనుచరులు కూడా ఉన్నారు. ఆయన నన్ను పిలిచి "సహెల్! మాకేదయినా త్రాగించు" అని అన్నారు. అప్పుడు నేనీ గిన్నెను తీసి (ఆయన ముందు) పెట్టాను. అందులో ఉన్న దాన్ని వారంతా త్రాగారు.

హదీసు ఉల్లేఖకుని ఉవాచ:- హజ్రత్ సహెల్ (రజి) ఆ గిన్నెను మాకు చూపించారు. మేమా గిన్నెలో నీళ్ళు పోసి (శుభం కొరకు) త్రాగాము. తరువాత హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (రహ్మాలై) ఆ గిన్నెను తన కివ్వమని అడిగితే హజ్రత్ సహెల్ దాన్ని ఆయనకు ఇచ్చివేశారు.

(సహీహ్ బుఖారీ:- 74వ ప్రకరణం - అష్రిబా, 29వ అధ్యాయం - అష్షుర్బు మిన్ ఖద్ హిన్నబియ్యి (సల్లం)వ ఆనియతిహీ)

## 10వ అధ్యాయం - పాలు (ప్రవక్తకు ప్రీతికరమైన పానీయం)

1307. హజ్రత్ అబూ ఇస్‌హాఖ్ (రహ్మాలై) కథనం ప్రకారం హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) ఇలా తెలియజేశారు:- దైవప్రవక్త (సల్లం) మదీనాకు బయలుదేరినప్పుడు సురాఖా బిన్ మాలిక్ బిన్ జాషుమ్ ఆయన్ని వెంబడించాడు. దైవప్రవక్త (సల్లం) అతడ్ని శపించారు. దాంతో అతని గుర్రం (ఇసుక) నేలలో దిగబడిపోయింది. అతను దైవప్రవక్త (సల్లం)ను అర్థిస్తూ "నేను మీకెలాంటి హాని తలపెట్టను. నా కోసం దైవాన్ని ప్రార్థించండి" అని అన్నాడు. దైవప్రవక్త (సల్లం) అతని కొరకు ప్రార్థించారు.

ఆ తరువాత హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి) (మరో విషయం తెలియజేస్తూ) "దైవప్రవక్త (సల్లం)కు దాహం వేయసాగింది. మేమొక మేకల మంద సమీపంగా నడిచాము. నేనక్కడికి వెళ్ళి ఒక గిన్నెలో పాలు తీసుకొని వచ్చి దైవప్రవక్త (సల్లం)కు ఇచ్చాను. ఆయన ఆ పాలను త్రాగారు. అప్పుడు నా హృదయం సంతోషంతో నిండిపోయింది" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 45వ అధ్యాయం - హిజ్రతిన్నబియ్యి (సల్లం)వ అస్‌హాబిహీ ఇలల్ మదీన)**

1308. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- మేరాజ్ (గగనవిహారం) రాత్రి బైతిల్ మఖ్దిస్‌లో దైవప్రవక్త (సల్లం) ముందు రెండు గిన్నెలు ఉంచబడ్డాయి. వాటిలో ఒక గిన్నెలో సారా ఉంది. రెండవ గిన్నెలో పాలున్నాయి. దైవప్రవక్త (సల్లం) ఆ రెండింటినీ చూసి పాలగిన్నెను మాత్రమే తీసుకున్నారు. అప్పుడు దైవదూత హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) ఇలా అన్నారు. "దేవుడు ఎంతో ప్రశంసనీయుడు! ఆయన మిమ్మల్ని ప్రకృతి వైపుకు మార్గదర్శనం చేశాడు. (అంటే ఆయన మీకు మానవ స్వభావానికి అనుగుణమైన విషయం వైపుకు దారి చూపాడు.) ఒకవేళ మీరు సారాయి గిన్నె తీసుకొని ఉంటే మీ అనుచర సమాజం సన్మార్గం తప్పిపోయేది".

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 17వ అధ్యాయం - బనీ ఇస్రాయీల్ సూరా: 3, హద్దసనా అబ్దాన్)**

## 11వ అధ్యాయం - పాత్రలపై మూతలుపెట్టడం గురించి

1309. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- అబూ హమీద్ (రజి) అనే ఒక అన్సారీ ముస్లిం నఖీ చోటు నుండి దైవ ప్రవక్త (సల్లం) కోసం ఒక గిన్నెడు పాలు తెచ్చాడు. దైవప్రవక్త (సల్లం)దాన్ని చూసి "నీవు దాన్ని మూతపెట్టి ఎందుకు తీసుకు రాలేదు? ఒక చెక్క ముక్కయినా సరే దాని మీద మూతపెట్టి తీసుకు రావలసింది కదా!" అని అన్నారు అతనితో.

**(సహీహ్ బుఖారీ:- 74వ ప్రకరణం - అష్రిబా, 12వ అధ్యాయం - షుర్బిల్లబన్)**

## 12వ అధ్యాయం - పాత్రలపై మూతలు పెట్టడం, సంచుల మూతి బిగించటం, తలుపులు మూసి ఉంచటం, రాత్రి నిప్పు ఆర్పడం గురించి

1310. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: రాత్రి చీకటి పడనారంభించగానే లేక సాయంత్రమవగానే పిల్లలను (బయటికి పంపకుండా) ఇండ్లలోనే ఆపి

ఉంచండి. ఆ సమయంలో షైతానులు నలువైపులా వ్యాపిస్తారు. రాత్రి ఒక జాము పొద్దుపోయిన తరువాత పిల్లలను విడిచిపెట్టండి. దేవుని పేరు (బిస్మిల్లాహ్ అని) పఠించి తలుపులు మూసేసుకోండి. మూసిన తలుపుల్ని షైతాన్ తెరవలేడు.

(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్ఉల్ ఖల్ఖ్, 15వ అధ్యాయం - ఖైరుమాలిల్ ముస్లిమి గనమ్ యత్‌బవు బిహా షాఫల్ జిబాల్)

1311. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- పడుకునేటప్పుడు మీ ఇండ్లలో అగ్నిని (ఆర్పండి) అలాగే వదలి పెట్టకండి.

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - ఇస్తియిజాన్, 49వ అధ్యాయం - లాతుత్రకున్నారు ఫిల్‌బైత్ ఇన్దన్నౌమ్)

1312. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం:- మదీనాలో ఓ రోజు రాత్రివేళ ఒక ఇంటికి నిప్పంటుకొని తగలబడిపోయింది. ఆ సంగతి దైవప్రవక్త (సల్లం) ముందు ప్రస్తావించినపుడు ఆయన ఇలా అన్నారు: "ఈ అగ్ని మీ శత్రువు, కనుక పడుకోబోయే ముందు దాన్ని ఆర్పేయండి".

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - ఇస్తియజాన్, 49వ అధ్యాయం - లాతుత్రకున్నారు ఫిల్ బైత్ ఇన్దన్నౌమ్)

## 13వ అధ్యాయం - అన్న పానీయాలు

1313. హజ్రత్ ఉమర్ బిన్ సలమా (రజి) కథనం:- నా బాల్యంలో నేను దైవప్రవక్త (సల్లం) సంరక్షణలో పెరుగుతుండేవాడ్ని. అన్నం తినేటప్పుడు నా చేయి కంచెంలో అన్ని వైపులా కదలాడేది. దైవప్రవక్త (సల్లం) ఓసారి చూసి "అబ్బాయీ! (అన్నం తినేముందు) బిస్మిల్లాహ్ అని పఠించాలి. కుడిచేత్తో తినాలి. కంచం ముందు భాగం నుండి తినాలి" అని ఉపదేశించారు. ఆ రోజు నుండి నేను తినే పద్ధతి దాని ప్రకారమే ఉంటూ వస్తోంది.

(సహీహ్ బుఖారీ:- 70వ ప్రకరణం - అత్ఇమ, 2వ అధ్యాయం - అత్తస్మియతి అలత్తఆమ్ వల్ అక్లి బిల్‌యమీన్)

1314. హజ్రత్ అబూసయీద్ ఖుదరీ (రజి) కథనం:- నీటి తిత్తి తలక్రిందులుగా వంచి దాని మూతికి నోరు తగిలించి నీళ్ళు త్రాగడాన్ని దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని వారించారు.

(సహీహ్ బుఖారీ:- 74వ ప్రకరణం - అష్రిబహ్, 23వ అధ్యాయం - ఇఖ్తినాసిల్ అస్ఖియా)

## 15వ అధ్యాయం - జమ్‌జమ్ జలాన్ని నిలబడి త్రాగాలి

1315. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం)కు జమ్‌జమ్ నీళ్ళు అందించాను, ఆయన దాన్ని నిలబడి త్రాగారు.

(సహీహ్ బుఖారీ:- 25వ ప్రకరణం - హజ్, 76వ అధ్యాయం, మాజాఅ ఫీ జమ్‌జమ్)

## 16వ అధ్యాయం - నీరు త్రాగేటప్పుడు చెంబులో శ్వాస వదలకూడదు

1316. హజ్రత్ అబూఖతాదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- నీళ్ళు త్రాగేటప్పుడు చెంబులో శ్వాస వదలకూడదు.

(సహీహ్ బుఖారీ:- 4వ ప్రకరణం -వుజూ, 18వ అధ్యాయం - అన్నహి అనిల్ ఇస్తిన్జాయి బిల్ యమీన్)

1317. హజ్రత్ సుమామా బిన్ అబ్దుల్లా (రహ్మలై) కథనం:- హజ్రత్ అనస్ (రజి) చెంబుతో నీళ్ళు

త్రాగేటప్పుడు మూడుసార్లు గాలి పీల్చుకునేవారు. దైవప్రవక్త (సల్లం) కూడా (నీళ్ళు త్రాగేటప్పుడు) మూడుసార్లు గాలి పీల్చుకునే వారని ఆయన తెలియజేశారు. (అంటే ఒకే గుక్కలో త్రాగకుండా మూడు గుక్కలలో త్రాగేవారన్నమాట).

(సహీహ్ బుఖారీ:- 74వ ప్రకరణం - అష్రిబా, 26వ అధ్యాయం - అష్షుర్బి బి నఫసైని ఔసలాసా)

## 17వ అధ్యాయం - నీరు, పాలు, తదితర పదార్థాల పంపిణీ కుడివైపు నుండి ఆరంభించాలి

1318. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఓసారి మా యింటికి వచ్చారు. అప్పుడు ఆయన మంచినీళ్ళు అడిగితే మేము ఒక మేక నుండి పాలు పితికి అందులో కొంచెం బావినీళ్ళు కలిపి ఆయనకు ఇచ్చాము. ఆ సమయంలో హజ్రత్ అబూబకర్ (రజి) ఆయనకు ఎడమ వైపున, హజ్రత్ ఉమర్ (రజి) ముందు వైపున, ఒక పల్లెవాసి కుడి వైపున కూర్చొని ఉన్నారు. దైవప్రవక్త (సల్లం) ఆ పాలలో కొంత త్రాగి వదలి పెట్టిన తరువాత "దాన్ని అబూబకర్ (రజి)కు ఇచ్చేయండి" అన్నారు హజ్రత్ ఉమర్ (రజి). కాని దైవప్రవక్త (సల్లం) ఆ పాలగిన్నెను (తన కుడివైపుకూర్చున్న) గ్రామీణవ్యక్తికి ఇచ్చారు. తరువాత ఆయన ఇలా అన్నారు: "మొదట కుడివైపున్న వాడికి, మొదట కుడివైపున్న వాడికి ఇవ్వాలి గుర్తుంచుకోండి. ఎల్లప్పుడూ కుడి వైపు నుండి ప్రారంభించాలి". మరి హజ్రత్ అనస్ (రజి) మూడుసార్లు పలికారు: "కుడివైపు నుండి ప్రారంభించడం సంప్రదాయం, కుడివైపు నుండి ప్రారంభించడం సంప్రదాయం, కుడివైపు నుండి ప్రారంభించడం సంప్రదాయం".

(సహీహ్ బుఖారీ:- 51వ ప్రకరణం -హిబా, 4వ అధ్యాయం -మనిస్ తస్ఖా)

1319. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం)కు ఎవరో (కానుకగా) పాలు పంపించారు. ఆయన అందులో కొంత త్రాగి వదలిపెట్టారు - ఆ సమయంలో ఆయనకు కుడివైపున ఒక బాలుడు ఉన్నాడు. అతను అక్కడున్న వారిలో అతి పిన్నవయస్కుడు. పెద్దవాళ్ళు అంతా దైవప్రవక్త (సల్లం)కు ఎడమవైపున కూర్చున్నారు - దైవప్రవక్త (సల్లం) ఆ పిల్లవాడితో "అబ్బాయ్!నువ్వు అనుమతిస్తే నేనీ పాలను పెద్దలకు ఇస్తాను" అని అన్నారు. దానికా అబ్బాయి (ఒప్పుకోకుండా) "దైవ ప్రవక్తా! మీరు మిగిల్చిన ప్రసాదం విషయంలో నేను ఇతరుల కోసం త్యాగం చేయలేను" అని అన్నాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) పాలగిన్నెను ఆ బాలుడికే ఇచ్చారు.

(సహీహ్ బుఖారీ:- 42వ ప్రకరణం - అష్షుర్బి వల్ ముసాఖాత్, 1వ అధ్యాయం - ఫిష్షుర్బ్)

## 18వ అధ్యాయం -అన్నం తిన్నాక వ్రేళ్ళు నాక్కోవడం, క్రిందపడిన మెతుకుల్ని శుభ్రపరచి తినడం

1320. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ఎవరైనా భోజనం చేసిన తరువాత తన వ్రేళ్ళు నాక్కోనంత వరకు లేదా నాకించనంతవరకు వాటిని

తుడుచుకోకూడదు.

(సహీహ్ బుఖారీ:- 70వ ప్రకరణం, అత్యిమ, 52వ అధ్యాయం - లాఖిల్ అసాబియి వమస్సిహా ఖబ్ల అన్ తుమ్సహ బిల్‌మిన్‌దీల్)

## 19వ అధ్యాయం - అతిథితోపాటు మరోవ్యక్తి కూడా వస్తే ఆతిథ్యకర్త నుండి అనుమతి తీసుకోవాలి

1321. హజ్రత్ అబూ మస్‌వూద్ (రజి) కథనం:- అబూ షుఐబ్ (రజి) అనే ఒక అన్సారీ (ముస్లిం) మాంసం అమ్ముతున్న తన బానిసతో "నా కోసం అయిదుగురికి సరిపడే అంత భోజనం తయారు చేసిపెట్టు. నేను దైవప్రవక్త (సల్లం)తో పాటు అయిదుగురిని భోజనానికి పిలవదలిచాను. నేను (ఈరోజు) దైవప్రవక్త (సల్లం) ముఖంలో ఆకలి చిహ్నాలు చూశాను" అని అన్నారు. దాని ప్రకారం ఆయన దైవప్రవక్త (సల్లం)ను (ఆయనతో పాటు మరో నలుగురిని) భోజనానికి ఆహ్వానించారు.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) వెంట అదనంగా మరో వ్యక్తి కూడా వచ్చాడు. అందువల్ల దైవప్రవక్త (సల్లం) ఆతిథ్యకర్త అనుమతి అడుగుతూ "ఇతను కూడా మా వెంట వచ్చాడు. నీవితనికి అనుమతి ఇవ్వదలచుకుంటే ఇవ్వు, లేకపోతే ఇతను వెళ్ళిపోతాడు" అని అన్నారు. దానికా అన్సారీ "వద్దు, అతను వెళ్ళిపోనవసరం లేదు. నేనితనికి అనుమతినిస్తున్నా" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 34వ ప్రకరణం - అల్‌బుయూ, 21వ అధ్యాయం - మాఖీల ఫిల్లిహాం వల్‌జజ్జార్)

## 20వ అధ్యాయం - ఆతిథ్య కర్త ఒప్పుకుంటాడన్న నమ్మకముంటే అతిథి తన వెంట మరొకడ్ని తీసుకెళ్ళవచ్చు

1322. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- కందకం త్రవ్వుతున్న రోజుల్లో దైవప్రవక్త (సల్లం) తీవ్రమైన ఆకలితో ఉండటం గమనించి నేను నా భార్య దగ్గరకు వెళ్ళి "దైవప్రవక్త (సల్లం) చాలా ఆకలితో ఉన్నట్లు కన్పిస్తున్నారు. నీ దగ్గర (ఆహార పదార్థాలు) ఏమైనా ఉన్నాయా?" అని అడిగాను. ఆమె ఒక సంచి బయటికి తీసింది. అందులో ఒక 'సా' ఎత్తు గోధుమలు ఉన్నాయి. మా ఇంట్లో ఒక మేక పిల్ల కూడా ఉంది. నేను దాన్ని జిబహ్ చేశాను. నా భార్య గోధుమల్ని విసరి పిండి తయారు చేసింది. మేమిద్దరం తొందర తొందరగా ఈ పనులు ముగించాము. నేను మాంసం కోసి కుండలో పెట్టి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి బయలుదేరాను. అప్పుడు నా భార్య నాతో "(ఇక్కడ మనింట్లో అన్నం చాలా తక్కువగా ఉంది. మీరు ఎక్కువమందిని పిలుచుకొచ్చి) నన్ను దైవప్రవక్త (సల్లం), ఆయన అనుచరుల ముందు అవమానపరచకండి" అని అన్నది.

నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరకు వెళ్ళి "దైవప్రవక్తా! మేమొక మేకపిల్లను కోశాము. మా దగ్గర ఒక 'సా' ఎత్తు గోధుమలుంటే వాటిని విసరి పిండి కొట్టాము. కనుక మీరు, మీతోపాటు మరికొందరు మా యింటికి రండి" అన్నాను రహస్యంగా. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని బిగ్గరగా కేకవేస్తూ "కందకం త్రవ్వుతున్న ప్రజలారా! మీ కోసం జాబిర్ (రజి) భోజనం తయారు చేశాడు. అందరూ

వచ్చేయండి. మీ అందరికీ విందు ఉంది” అని అన్నారు. ఆ తరువాత ఆయన నన్ను ఉద్దేశించి “నేను వచ్చేదాకా పొయ్యిమీద నుంచి కుండలు దించకండి. ఆ పిండితో రొట్టెలు కూడా తయారు చేయకూడదు” అని అన్నారు.

నేను ఇంటికి తిరిగొచ్చాను. కాస్సేపటికి దైవప్రవక్త (సల్లం) తమ అనుచరుల్ని వెంట పెట్టుకొని వచ్చారు. నా భార్య (అంతమందిని చూసి) “ఇప్పుడు మీరే అవమానం పాలవుతారు. మీ గురించే నలుగురూ నాలుగు మాటలు అంటారు” అని అన్నది. “నేను నువ్వు చెప్పిందే చేశాను. (కాని దైవప్రవక్త (సల్లం) అందర్నీ పిలుచుకు వచ్చారు, నేనేం చేసేది?)” అని అన్నాను నేను. ఆ తరువాత నా భార్య ఆ పిండిని దైవప్రవక్త (సల్లం) ముందు పెట్టింది. దైవప్రవక్త (సల్లం) అందులో తమ లాలాజలాన్ని కలిపి శుభం కోసం దైవాన్ని ప్రార్థించారు. తరువాత మా కుండల దగ్గరికి వచ్చి అందులో కూడా తమ లాలాజలాన్ని కలిపి శుభ ప్రార్థన చేశారు. ఆ తరువాత “రొట్టెలు చేసే ఆమెను పిలువండి” అన్నారు. ఆమెతో “రొట్టెలు తయారు చేస్తూ ఒక్కొక్కటి కంచాలలో పెడ్తూపో. దాన్ని పొయ్యిమీద నుండి దించకూడదు” అన్నారు ఆయన.

అప్పుడు మొత్తం జనం వేయి మంది దాకా ఉన్నారు. నేను దైవసాక్షిగా చెబుతున్నాను. వారంతా కడుపునిండా తిన్నారు. ఇంకా మిగిల్చారు. వారు వెళ్ళిపోయిన తరువాత చూస్తే మా కుండల్లో ఆహార పదార్థాలు ముందులాగే కుతకుత ఉడికి పోతున్నాయి. రొట్టెలు కూడా ఏ మాత్రం తరిగిపోకుండా ఎప్పటిలాగానే ఉన్నాయి.

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 29వ అధ్యాయం - గజ్వతిల్ ఖందఖి వహియల్ అహ్జాబ్)**

1323. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- హజ్రత్ అబూతల్హా (రజి) హజ్రత్ ఉమ్మె సలీం (రజి)తో మాట్లాడుతూ “దైవప్రవక్త (సల్లం) కంఠస్వరం చాలా బలహీనంగా ఉన్నట్లు అన్పించింది, బహుశా అది ఆకలి వల్ల కావచ్చు. నీ దగ్గర (తినడానికి) ఏదైనా ఉందా?” అని అడిగారు. ఆమె ‘ఉంద’ని చెప్పి కొన్ని గోధుమ రొట్టెలను బయటికి తీశారు. వాటిని ఒక దుప్పట్లో ఒక మూలన కట్టి దాన్ని నా చేతికి అందించారు. దుప్పటి మిగతా భాగాన్ని నా మీద కప్పి నన్ను దైవప్రవక్త (సల్లం) సన్నిధికి పంపారు.

నేనా రొట్టెలను తీసుకొని వెళ్ళాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) మస్జిద్‌లో కూర్చుని ఉన్నారు. ఆయన దగ్గర కొంతమంది అనుచరులు కూడా కూర్చొని ఉన్నారు. నేను వెళ్ళి వారి దగ్గర నిలబడగానే దైవప్రవక్త (సల్లం) నన్ను చూసి “నిన్ను అబూతల్హా (రజి) పంపించారా?” అని అడిగారు. నేను ఔనన్నాను. “భోజనం కోసమా?” అని ఆయన మళ్ళీ అడిగారు. నేను ‘ఔనండీ’! అన్నాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) అక్కడున్న వారందరితో ‘పదండి’ అంటూ లేచారు. నేను దైవప్రవక్త (సల్లం)కు ముందుగా నడుస్తూ అబూతల్హా (రజి) దగ్గరకు చేరుకున్నాను. ఆయనకు విషయం తెలియజేశాను.

హజ్రత్ అబూతల్హా (రజి) హజ్రత్ ఉమ్మెసలీం (రజి)తో “దైవప్రవక్త (సల్లం) (తామొక్కరే గాకుండా) జనాన్ని (కూడా) వెంటబెట్టుకొని వస్తున్నారు. మన దగ్గరేమో వాళ్ళందరికీ పెట్టగలిగినంత

ఆహారం లేదు (ఇప్పుడెలా?)" అని అన్నారు. దానికామె "అంతా దేవునికి, ఆయన ప్రవక్త (సల్లం)కే బాగా తెలుసు" అన్నారు. ఆ తరువాత అబూతల్హా (రజి) కూడా (ఇంటి నుంచి) బయలుదేరారు. దారిలో దైవప్రవక్త (సల్లం) కలిశారు. ఆయన అబూతల్హా (రజి)ను తీసుకొని ఆయన ఇంటికి వచ్చి "ఉమ్మె సలీం (రజి)! నీ దగ్గర (ఇంట్లో) ఏముందో దాన్ని తీసుకురా" అని అన్నారు. హజ్రత్ ఉమ్మె సలీం (రజి) ఆ రొట్టెల్నే తెచ్చి దైవప్రవక్త (సల్లం) ముందు సమర్పించారు.

దైవప్రవక్త (సల్లం) ఆదేశంతో రొట్టెలను ముక్కలు ముక్కలుగా చేయడం జరిగింది. హజ్రత్ ఉమ్మె సలీం (రజి) అందులో నెయ్యి పోసి కలిపారు కూరలాగా, తరువాత దైవప్రవక్త (సల్లం) దేవుడు తలచినది పఠించి "పదిమందిని భోంచేయడానికి పిలవండి" అన్నారు. పదిమంది అనుచరులు పిలువబడ్డారు. వారు కడుపునిండా తిని వెళ్ళిపోయారు. ఆ తరువాత మరో పదిమందిని పిలవండి అన్నారు దైవప్రవక్త (సల్లం). మరో పదిమందిని పిలిచారు, వారు కూడా కడుపునిండా తిని వెళ్ళి పోయారు. ఆ తరువాత మరో పదిమందిని పిలవండన్నారు ఆయన. మరో పదిమందిని పిలవడం జరిగింది. వారు కూడా కడుపునిండా తిని వెళ్ళిపోయారు. ఆ తరువాత మరో పదిమందిని పిలవండన్నారు. ఈ విధంగా చివరికి అనేకమంది కడుపునిండా తిన్నారు. వారు మొత్తం డెభ్భై ఎనభై మంది ఉన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతిన్నుబువ్వతి ఫిల్ ఇస్లాం)**

## 21వ అధ్యాయం - సొరకాయ అభిలషణీయం

1324. హజ్రత్ అనస్ (రజి) కథనం:- ఒక దర్జీ అన్నం వండి దైవప్రవక్త (సల్లం)ను ఆహ్వానించాడు. ఆ విందులో నేను కూడా దైవప్రవక్త (సల్లం) వెంట ఉన్నాను. ఆ వ్యక్తి దైవప్రవక్త (సల్లం) ముందు రొట్టెలు, సొరకాయ చారు, వేయించిన మాంసం ఉంచాడు. దైవప్రవక్త (సల్లం) కంచంలోచుట్టూ చేయి తిప్పుతూ సొరకాయ కోసం వెతుకుతూ ఉండటం గమనించాను. ఆ రోజు నుండి నేను ఎల్లప్పుడూ సొరకాయను కోరుకునేవాడ్ని.

**(సహీహ్ బుఖారీ:- 34వ ప్రకరణం - అల్‌బుయూ, 30వ అధ్యాయం - జిక్రిల్ ఖయ్యాత్)**

## 23వ అధ్యాయం - దోసకాయతో ఖర్జూర పండ్లు కలిపి తినవచ్చు

1325. హజ్రత్ అబ్దుల్లా బిన్ జాఫర్ బిన్ అబూతాలిబ్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) దోసకాయ, ఖర్జూర పండ్లు కలిపి తింటుంటే చూశాను.★

**(సహీహ్ బుఖారీ:- 70వ ప్రకరణం - అత్‌యిమ, 39వ అధ్యాయం - అర్రుతబి బిల్ ఖిస్సాయి)**

---

★ ఖర్జూరం , దోసకాయలు కలిపి తినడంలోని ఆంతర్యం ఇవి రెండూ పరస్పరం సంస్కరించుకునే పదార్థాలు కావడమే. ఇవి రెండూ కలసి సంతులనాహారంగా మారుతాయి. అప్పుడు రెండింటి దుర్లక్షణాలు దూరమవుతాయి. ఉదాహరణకు:- దోసకాయ దప్పిక తీర్చి బలాన్నిస్తుంది. ఉదరంలోని వేడిని తగ్గిస్తుంది. చర్మం పొడవదు. ఖర్జూరం ఉదరంలోని శీతలాన్ని తగ్గిస్తుంది; అయితే దప్పిక కలిగిస్తుంది; త్వరగా పులుస్తుంది; రక్తంలో వేగాన్ని కలిగిస్తుంది. తలనొప్పికి కారణమవుతుంది. ఈ విధంగా పరస్పర విరుద్ధ గుణాలు గల ఈ రెండుపదార్థాలు కలసి శరీరానికి ఆరోగ్యం చేకూర్చుతాయి. (సంకలన కర్త)

## 25వ అధ్యాయం - బంతి భోజనంలో అరుదైన వస్తువుల్ని అనుమతి లేకుండా విరివిగా తినరాదు

1326. హజ్రత్ జబలా (రహ్మాలై) కథనం:- మేము మదీనాలో కొందరు ఇరాక్ వాసులతో కలసి నివసిస్తున్న రోజుల్లో ఒకసారి కరువు వచ్చింది. అప్పుడు హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) మాకు తినడానికి ఖర్జూర పండ్లు ఇస్తుండేవారు. ఒకసారి మేము ఖర్జూర పండ్లు తింటుంటే హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) మా సమీపం నుండి పోతూ "దైవప్రవక్త (సల్లం) మాకు ఒకేసారి రెండేసి ఖర్జూర పండ్లు కలిపి తినకూడదని చెప్పారు. అయితే (కలసి తింటున్న) మిత్రుల అనుమతితో అలా తినవచ్చని చెప్పారు ఆయన" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 46వ ప్రకరణం - మజాలిమ్, 14వ అధ్యాయం - ఇజాఅజిన ఇన్సానుల్లి ఆఖర్ షయ్అన్ జాజ)

## 27వ అధ్యాయం - మదీనా ఖర్జూర పండ్ల గొప్పదనం

1327. దైవప్రవక్త (సల్లం) ప్రవచించగా తాను విన్నానని హజ్రత్ సాద్ (రజి) ఉల్లేఖించారు: "ఎవరైతే ఉదయం పూట (మదీనాలో పండే) ఏడు అజ్వా ఖర్జూర పండ్లు తింటాడో అతనికి ఆ రోజు ఎలాంటి చేతబడి (జాదు), విష పదార్థాలు హాని కలిగించలేవు.[1]

(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 52వ అధ్యాయం - అద్దవాయి బిల్ అజ్వతి లిస్సహ్ర్)

## 28వ అధ్యాయం - పుట్ట గొడుగుతో నేత్ర వైద్యం

1328. హజ్రత్ సయీద్ బిన్ జైద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- పుట్టగొడుగు "మన్న" లాంటిదే. దాని నీరు నేత్ర వ్యాధులకు మంచి చికిత్స.[2]

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 2 బఖరా సూరా (వజల్లల్నా అలైకుముల్ గమామ వ అన్జల్నా అలైకుముల్ మన్న వ స్సల్వా)

## 29వ అధ్యాయం - రేగుపండ్ల ప్రత్యేకత

1329. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- మేము ఓ రోజు దైవప్రవక్త (సల్లం)తో కలసి

(1) ఇమామ్ నవవీ (రహ్మాలై) కథనం ప్రకారం ఈ హదీసులో మదీనా ఖర్జూర పండ్లలో అజ్వాపండ్ల విశిష్టతను గురించి తెలియజేయబడింది. వీటిలో ఉదయం పూట ఏడు పండ్లను తింటే కలిగే ప్రయోజనాలు అగోచర విషయాలకు సంబంధించినవి. ఈ ప్రయోజనాలేమిటో దైవప్రవక్త (సల్లం) కు మాత్రమే తెలుసు. మన పని దీన్ని విశ్వసించడమే. నమాజులో పఠించే రకాత్‌ల సంఖ్య, జకాత్ నిర్ణీత పరిమాణం వగైరా ఎలా అగోచర విషయాలో ఇది కూడా అంతే.

(2) మన్ (లేక మన్న) అనేది, మూసా ప్రవక్త (అలైహి) కాలంలో దేవుడు బనీ ఇస్రాయీల్ సంతతి ప్రజల కోసం ఆకాశం నుండి నేలమీద పడవేస్తూ ఉండే ఒక విధమైన ఖాద్య పదార్థం. శ్రమపడకుండా లభించే ఆహార పదార్థం అది. పుట్టగొడుగును 'మన్న'తో పోల్చడానికి కారణం పుట్టగొడుగు కూడా శ్రమ పడకుండా, విత్తనం విత్తకుండా లభించే ఆహార వస్తువు కావడమే. పుట్టగొడుగు జలం గురించి ఇమామ్ నవవీ (రహ్మాలై) ఇలా రాస్తున్నారు- కొన్ని వ్యాధులకు ఇది ఔషధంలా పనిచేస్తుంది. కొన్ని కంటి వ్యాధులకు ఇతర మందులతో ఈ జలం కలిపి సేవించడం జరుగుతుంది. దీని ప్రయోజనం నేను స్వయంగా చూశాను. మా కాలంలో షేఖ్ కామిల్ (గొప్పనాయకుడు) జనాబ్ అబ్దుల్లా దమష్కీ అంధులు. ఆయన ఈ హదీసుని ప్రగాఢంగా విశ్వసిస్తూ తన కళ్ళకు స్వచ్ఛమైన పుట్ట గొడుగు జలాన్ని వాడగా దేవుడు ఆయనకు దృష్టి ప్రసాదించారు. ఆ కాలంలో ఇదొక గొప్ప సంఘటన. (సంకలన కర్త)

(అడవిలో) రేగుపండ్లు ఏరసాగాము. అప్పుడు దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని ఉద్దేశించి "నల్లరంగు పండ్లు ఏరండి, నల్లరంగుపండ్లు బాగుంటాయి" అని అన్నారు. అనుచరులు (ఆశ్చర్యం వెలిబుచ్చుతూ) దైవప్రవక్తా! మీరు గతంలో గొర్రెలను కాసేవారా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "గొర్రెలు కాయని ప్రవక్త ఉన్నాడా? దైవప్రవక్త లందరూ గొర్రెలను కాసినవారే" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 29వ అధ్యాయం - యూకుఫూన అలా అస్నా మిల్లహుమ్)

## 32వ అధ్యాయం - అతిథి మర్యాదలు చేసే, తాను కష్టంలో ఉన్నా అతిథికి భోజనం పెట్టే వ్యక్తికి లభించే పుణ్యం

1330. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- ఓసారి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి ఒకవ్యక్తి (అతిథిగా) వచ్చాడు. దైవప్రవక్త (సల్లం) అతనికి భోజనం ఏర్పాటు చేయమని తన భార్యలతో అన్నారు. దానికి వారు "మా దగ్గర మంచి నీరు తప్ప మరేమీ లేద"న్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) తమ అనుచరుల్ని ఉద్దేశ్యించి "ఈ వ్యక్తికి మీలో ఆతిథ్యమిచ్చే వారెవరైనా ఉన్నారా?" అని అడిగారు. ఒక అన్సారీ లేచి "నేనితనికి ఆతిథ్యమిస్తాను" అని అన్నారు. అన్సారీ సహాబీ (రజి) ఆ వ్యక్తిని తన ఇంటికి పిలుచుకెళ్ళి "ఇతను దైవప్రవక్త (సల్లం) గారి అతిథి. ఇతనికి (మనం) ఆతిథ్యమివ్వాలి" అని అన్నారు తన భార్యతో. ఆమె "మన దగ్గర పిల్లల కోసం మాత్రమే కొంత ఉంది" అని అన్నది. "ముందు నువ్వు భోజనం ఏర్పాటు చెయ్యి. ఈ రాత్రి పిల్లలు అన్నం అడిగితే ఏదో ఒకటి చెప్పి వాళ్ళను నిద్రపుచ్చు" అని అన్నారు ఆ సహాబీ. దాని ప్రకారం ఆయన భార్య భోజనం సిద్ధం చేసింది. దీపం వెలిగించింది. పిల్లలను (ఏదో చెప్పి) పడుకోబెట్టింది. ఆ తరువాత ఆమె లేచి దీపాన్ని (వత్తిని) సరిచేస్తున్నట్లు నటించి దాన్ని ఆర్పివేసింది. ఆ చీకటిలోనే వారిద్దరు తాము కూడా అన్నం తింటున్నట్లు అతిథికి అన్పించేలా నోళ్ళు కదపసాగారు.

ఆ విధంగా వారిద్దరు ఆ రాత్రి భోజనం చేయకుండానే పస్తుండిపోయారు. మరునాడు ఉదయం ఆ సహాబీ దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళగానే "ఈ రోజు మీరు చేసిన పనిని దేవుడు చూసి సంతసించాడు, ఆపై ఈ సూక్తిని అవతరింపజేశాడు" అంటూ దైవప్రవక్త (సల్లం) ఆ సూక్తి ఇలా విన్పించారు --"వారు లేమికి గురయి ఉన్నప్పటికీ తమపై ఇతరులకే ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. నిజానికి తమను తాము పిసినారితనం నుండి కాపాడుకొని విశాలబుద్ధిని ప్రదర్శించే వారే సాఫల్యం పొందేవారు". (హష్ర్ : 9)

(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 10వ అధ్యాయం - వయూసిరూన అలా అన్ఫుసిహిమ్ వలౌకాన బిహిమ్ ఖసాసా)

1331. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ అబూబకర్ (రజి) కథనం:- ఒకసారి దైవప్రవక్త (సల్లం) వెంట మేము మొత్తం నూట ముప్ఫై మందిమి ఉన్నాము. దైవప్రవక్త (సల్లం) మాతో మాట్లాడుతూ "మీలో ఎవరి దగ్గరయినా తినడానికి ఏదైనా ఉందా?" అని అడిగారు. యాదృచ్ఛికంగా ఒకరి దగ్గర ఒక 'సా' ఎత్తు లేదా దాదాపు ఒక 'సా' ఎత్తు పిండి మాత్రం ఉంది. దాన్ని పిసికి (రొట్టెల కోసం) సిద్ధం చేశారు. తరువాత చిందర వందర జుత్తుతో పొడుగరి అయిన ఒక బహుదైవారాధకుడు మేకలను తోలుకుంటూ

(మాకుఎదురు) వచ్చాడు. దైవప్రవక్త (సల్లం) అతడ్ని పిలిచి "(ఒక మేకను) అమ్ముతావా? లేక కానుకగా గాని సమర్పణగా గాని ఇస్తావా?" అని అడిగారు. అతను అమ్ముతానన్నాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) అతని దగ్గర ఒక మేకను కొన్నారు. దాన్ని జిబహ్ చేయడం జరిగింది. దైవప్రవక్త (సల్లం) దాని కార్జాన్ని వేయించమన్నారు.

దైవసాక్షిగా చెబుతున్నాను! నూట ముప్పై మందితో కూడిన మాలో ప్రతి ఒక్కరికీ కాలేయం ముక్క దొరికింది. కాలేయం ముక్క దొరకని వారంటూ ఎవరూ లేరు. ఆ సమయంలో అక్కడున్న వారందరికీ ఒక్కొక్క ముక్క చొప్పున లభించింది. అక్కడ లేని వారి కోసం వారి వాటా ముక్కలు తీసి పెట్టడం జరిగింది. ఆ మేక మాంసం రెండు పెద్ద పాత్రల నిండా నింపి ఉంచాము. తరువాత మేమంతా కలసి కడుపునిండా భోజనం చేశాము. మరో రెండు గిన్నెల అన్నం మిగిలిపోతే దాన్ని తీసి ఒంటెల మీద మోపాము.

**(సహీహ్ బుఖారీ:- 51వ ప్రకరణం - హిబా, 28వ అధ్యాయం - ఖబూలిల్ హదియతి మినల్ ముష్రికీన్)**

1332. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ అబీబకర్ (రజి) కథనం :- అరుగు వాసులు (అస్హాబె సుఫ్ఫా) చాలా పేదవాళ్ళు. ఒకసారి దైవప్రవక్త (సల్లం) తమ అనుచరులతో ఇలా అన్నారు - "ఇద్దరికి సరిపడా భోజనం కలిగి ఉన్నవారు అరుగువాసుల్లో ఒకడ్ని తమ వెంట భోజనానికి పిలుచుకు వెళ్ళాలి. నలుగురికి సరిపడా భోజనం కలిగి ఉన్నవారు అయిదో వ్యక్తిని, అయిదుగురికి సరిపడా భోజనం కలిగి ఉన్నవారు ఆరవ వ్యక్తిని (అరుగువాసుల్లో నుండి) భోజనానికి పిలుచుకు వెళ్ళాలి". దాని ప్రకారం హజ్రత్ అబూబకర్ (రజి) తన వెంట ముగ్గురిని పిలుచుకు వెళ్ళారు. దైవప్రవక్త (సల్లం) తమ వెంట పదిమందిని పిలుచుకు వెళ్ళారు.

(మా కుటుంబంలో) నేను, నా తల్లిదండ్రులు, నా భార్య, ఒక సేవకుడు ఉండేవాళ్ళము. సేవకుడు మా ఇంట్లో, హజ్రత్ అబూబకర్ (రజి) ఇంట్లో పని చేస్తుంటాడు. ఆ రోజు మధ్యాహ్నం హజ్రత్ అబూబకర్ (రజి) దైవప్రవక్త (సల్లం) ఇంట్లో భోజనం చేసి అక్కడే ఉండిపోయారు. ఇషా నమాజు చేసిన తరువాత కూడా ఆయన అక్కడే ఉన్నారు. చివరికి దైవప్రవక్త (సల్లం) ఇంట రాత్రి పూట భోజనం కూడా చేశారు. ఆ తరువాత హజ్రత్ అబూబకర్ (రజి) ఇంటికి తిరిగొచ్చారు. అప్పటికి రాత్రి చాలా గడచిపోయింది. హజ్రత్ అబూబకర్ (రజి) భార్య ఆయన్ని చూడగానే "మీరు మీ అతిథుల్ని వదలి ఎక్కడికి వెళ్ళారు?" అని అడిగారు. దానికి హజ్రత్ అబూబకర్ (రజి) "వీరికి నువ్వింకా భోజనం పెట్టలేదా?" అని అన్నారు. "మీరు రానంతవరకు వారు భోజనం చేయమని చెప్పి అలాగే కూర్చున్నారు. మేము అన్నం వడ్డించినా వారు తినడానికి నిరాకరించారు" అన్నారు ఆయన శ్రీమతి. (మానాన్న) హజ్రత్ అబూబకర్ (రజి) నా మీద విరుచుకు పడతారేమోనన్న భయంతో నేనక్కడ్నుంచి మెల్లిగా జారుకున్నాను. కాని ఆయన నన్ను కేకవేస్తూ "ఎక్కడున్నావురా? చవట, పనికిమాలిన మొద్దు!" అని చీవాట్లు పెట్టారు. ఆ తరువాత ఆయన అతిథుల వైపుకు తిరిగి "రాత్రి చాలా పొద్దుపోయింది. మీరు భోజనం చేయండి. దైవసాక్షి! నేను మాత్రం ఇప్పుడు ఎట్టి పరిస్థితిలోనూ తినలేను" అని అన్నారు.

దైవసాక్షిగా చెబుతున్నాను. మేమా భోజనంలో నుండి ఒక్క ముద్ద తీసుకుంటే ఆ అన్నం

పూర్వం కంటే కూడా ఎక్కువయిపోసాగింది. మేమంతా కడుపునిండా తిన్నాం. కాని మొదట ఎంత ఉండేదో అంతకంటే ఎక్కువే మిగిలిపోయింది అన్నం. హజ్రత్ అబూబకర్ (రజి) ఆ అన్నం వండింది వండినట్లుగా, లేదా అంతకంటే ఎక్కువే మిగిలిపోవడం చూసి (ఆశ్చర్యపోతూ) తమ భార్య ఉమ్మె రూమాన్‌తో "బనీ ఫిరాస్ వంశం సోదరీ! ఏమిటీ విచిత్రం!!" అని అన్నారు. దానికి ఆమె "నా కంటి చలువ (దైవప్రవక్త) సాక్షి! ఇదిప్పుడు పూర్వం ఉన్న దానికంటే మూడు రెట్లు ఎక్కువ ఉంది" అని అన్నారు. చివరికి హజ్రత్ అబూబకర్ (రజి) కూడా ఆ అన్నం తిన్నారు. కాని ఆయన (పొరపాటును గుర్తుకు తెచ్చుకుంటూ) "నేను (తినని) దేవుని పేర ప్రమాణం చేశానంటే దానికి షైతాన్ ప్రేరణే కారణం" అని అన్నారు ఆయన. ఆ భోజనంలో నుండి ఆయన మరొక ముద్ద తిన్నారు. ఆ తరువాత దాన్ని తీసుకొని దైవప్రవక్త (సల్లం) సన్నిధికెళ్ళారు. తెల్లవారే దాకా దాన్ని ఆయన దగ్గరే పెట్టారు.

మాకు, (అవిశ్వాసులకు చెందిన) మరొక తెగకు మధ్య ఒక ఒప్పందం జరిగింది. దాని గడువుతీరిపోయింది. (వారు మదీనా వచ్చారు.) దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని పన్నెండు మంది నాయకత్వంలో పన్నెండు సమూహాలుగా విభజించారు. ప్రతి సమూహంలోనూ చాలా మంది ఉన్నారు. నిన్న ఎంతమంది ఉన్నారో నేను చెప్పలేను. ప్రతి సమూహంలో ఎంతెంత మంది ఉన్నారో దేవునికే తెలుసు. వారంతా ఆ భోజనం తిన్నారు.

(సహీహ్ బుఖారీ:- 9వ ప్రకరణం - మవాఖీతిస్సలాత్, 41వ అధ్యాయం - అస్సమరి మ అజ్జైఫి వల్ అహ్లి)

## 33వ అధ్యాయం - అన్నం కొంచెమున్నా మరొకర్ని తమతో కలుపుకోవటం వల్ల కలిగే శుభం

1333. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "(కలసి తింటే) ఇద్దరు మనుషుల భోజనం ముగ్గురికి సరిపోతుంది; ముగ్గురు మనుషుల భోజనం నలుగురికి సరిపోతుంది".

(సహీహ్ బుఖారీ:- 70వ ప్రకరణం - అత్‌యిమ, 11వ అధ్యాయం - తాముల్ వాహిది యక్ఫిల్ ఇస్నైన్)

## 34వ అధ్యాయం - విశ్వాసి ఒక ప్రేగులో, అవిశ్వాసి ఏడుప్రేగుల్లో అన్నం తింటాడు

1334. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- విశ్వాసి ఒక ప్రేగులో అన్నం తింటాడు. అవిశ్వాసి - లేక ఆయన కపట విశ్వాసి అన్నారు - ఏడు ప్రేగులలో తింటాడు.★

(సహీహ్ బుఖారీ:- 70వ ప్రకరణం - అత్‌యిమ, 12 అధ్యాయం - అల్‌మూమిను యాకులు ఫీమియన్ వాహిదిన్)

★ ఈ హదీసులో విశ్వాసి తక్కువ ఆహారం తిని తృప్తిచెందడం. అవిశ్వాసి అత్యాశతో అధికంగా తినడం గురించి తెలియజేయబడింది. జమ్ ఖష్రీ (రహ్మాలై) కథనం ప్రకారం ఈ హదీసులో 'విశ్వాసికి మితంగా భుజించమని ఉపదేశించడం జరిగింది. అతిగా తినడం వల్ల మనిషి కఠిన హృదయుడయి పోవడమే కాకుండా, హృదయంపై చీకటి పొర ఏర్పడి మనిషి పశువాంఛల వెంట పడతాడు. అంచేత విశ్వాసి మిక్కుటంగా మెక్కడానికి ఎన్నడూ ప్రయత్నించకూడదు. ఖస్తలానీ (రహ్మాలై) దీనిపై ఇలా వ్యాఖ్యానిస్తున్నారు- కడుపునిండా మెక్కడం అవిశ్వాసి లక్షణం అనే విషయం దివ్యఖుర్‌ఆన్‌లోని ఈ సూక్తిని సమర్థిస్తోంది. "సత్యాన్ని తిరస్కరిస్తున్నవారు మూన్నాళ్ళ ఈ ప్రాపంచిక జీవితంలో సుఖాలు జుర్రుకుంటున్నారు; పశువుల్లా తింటూ త్రాగుతున్నారు. అయితే వారి అంతిమ నివాసం నరకమవుతుంది" (47:12). కనుక విశ్వాసి అత్యాశకుపోడని, పోకూడదనీ, తక్కువ ఆహారంతో తృప్తి చెందుతాడనీ, దీనికి భిన్నంగా అవిశ్వాసి అత్యాశకుపోయి పశువులా అత్యధికంగా తింటూ భోగలాలసుడవుతాడని ఈ హదీసు ద్వారా మనకు తెలుస్తోంది. ఇమామ్ నవవీ (రహ్మాలై) ఇలా రాస్తున్నారు. ఈ హదీసు పూర్వాపరాలు ఇలా వున్నాయి-దైవప్రవక్త (సల్లం) ఒక అవిశ్వాసిని విందుకు పిలిచారు. అప్పుడా అవిశ్వాసి ఏడు మేకల పాలు త్రాగాడు. కాని ఆ తర్వాత కొన్నాళ్ళకు అతను ఇస్లాం స్వీకరించగానే ఒక్క మేకపాలు మాత్రమే త్రాగాడు. రెండో మేకపాలు త్రాగలేకపోయాడు. (సంకలనకర్త)

1335. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- ఒకవ్యక్తి అన్నం చాలా ఎక్కువగా తినేవాడు. అయితే అతను ముస్లిం అయిన దగ్గర్నుంచీ చాలా తక్కువగా తినసాగాడు. ఈ సంగతి దైవప్రవక్త (సల్లం) దృష్టికి తీసుకొచ్చినప్పుడు ఆయన ఇలా అన్నారు: "విశ్వాసి ఒక ప్రేగులో తింటాడు; అవిశ్వాసి ఏడు ప్రేగులలో తింటాడు".

(సహీహ్ బుఖారీ:- 70వ ప్రకరణం - అత్‌యిమ, 12వ అధ్యాయం - అల్‌మూమిను యాకులు ఫీ మియన్ వాహిదిన్)

## 35వ అధ్యాయం - అన్నంలో లోపం ఎత్తి చూపకూడదు

1336. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఎన్నడూ ఏ ఆహారంలో కూడా లోపం ఎత్తి చూపలేదు. ఆయనకు ఇష్టమయితే తినేవారు, ఇష్టం లేకపోతే మానేసేవారు. (అంతేగాని అందులో అది బాగా లేదు, ఇది బాగా లేదని లోపం ఎత్తి చూపేవారు కాదు).

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 23వ అధ్యాయం - సిఫతిన్నబియ్యి (సల్లం))

# వస్త్రధారణ, అలంకరణల ప్రకరణం

## 1వ అధ్యాయం - వెండి బంగారు పాత్రలలో తినడం, త్రాగడం నిషిద్ధం

1337. హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా బోధించారు:- ఎవరైతే వెండి చెంబుతో మంచి నీళ్ళు త్రాగుతాడో అతను నిజానికి ఒక్కో గుక్కతోపాటు తన పొట్టలో అగ్ని పోసుకున్నట్లే.

(సహీహ్ బుఖారీ:- 74వ ప్రకరణం - అష్రిబా, 28వ అధ్యాయం - ఆనియతిల్ ఫిజ్జా)

## 2వ అధ్యాయం - వెండి బంగారు పాత్రలు, బంగారపు ఉంగరం, పట్టు వస్త్రాలు, జల్తారు బట్టలు

1338. హజ్రత్ బరా బిన్ అజిబ్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) మాకు ఏడు రకాల పనులు చేయాలని ఆదేశించారు, అలాగే ఏడు రకాల పనులు చేయకూడదని మమ్మల్ని వారించారు.

చేయమని ఆదేశించిన ఏడు పనులు ఇవి:-

(1) వ్యాధిగ్రస్తుడ్ని పరామర్శించడం, (2) శవం వెంట (ఖనన వాటికకు) వెళ్ళడం, (3) తుమ్మి ఎవరైనా 'అల్‌హమ్దులిల్లాహ్' అంటే, దానికి సమాధానంగా 'యర్‌హముకల్లాహ్' అనాలి, (4) విందు ఆహ్వానాన్ని స్వీకరించడం, (5) సలాంను సర్వ సామాన్యం చేయడం, (6) పీడితుడ్ని ఆదుకోవడం, (7) వాగ్దాన పాలన చేయడం.

చేయవద్దని వారించిన ఏడు పనులు ఇవి:-

(1) బంగారపు ఉంగరం పెట్టుకోవడం, (2) వెండి పాత్రలలో నీరుత్రాగడం, (3) పట్టు జీనును వాడటం, (4) ఖిస్ (ప్రాంతం)లో తయారైన బట్టలు వాడటం, (5)పట్టు వస్త్రాలను ధరించడం, (6) ముతక పట్టు వస్త్రాలు ధరించడం, (7) పల్చటి పట్టు వస్త్రాలు ధరించడం.

(సహీహ్ బుఖారీ:- 74వ ప్రకరణం - అష్రిబా - 28వ అధ్యాయం - ఆనియతిల్ ఫిజ్జా)

1339. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ అబీ లైలా (రహ్మలై) కథనం:- మేము హజ్రత్ హుజైఫా బిన్ యమాన్ (రజి) దగ్గర కూర్చున్నాం. ఆయన మంచి నీళ్ళు అడిగితే ఒక అగ్ని పూజారి గ్లాసులో నీళ్ళు తెచ్చి ఆయన చేతికి అందించాడు. ఆయన దాన్ని నేల మీద గిరవాటు వేసి "నేనితనికి (ఈ గ్లాసులో మంచినీళ్ళు ఇవ్వద్దని) ఒకటి రెండు సార్లు కాదు, అనేక సార్లు చెప్పిఉండకపోతే ఇలా ఈ గ్లాసు విసరి కొట్టేవాడ్ని కాదు" అని అన్నారు. ఆ తరువాత ఆయన ఇలా అన్నారు: "నేను దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచిస్తుంటే విన్నాను - సాధారణ పట్టు వస్త్రాలు, ముతక పట్టు వస్త్రాలు ధరించకండి. వెండి, బంగారు పాత్రలలో నీళ్ళు త్రాగకండి. వాటిలో ఆహార పదార్థాలు కూడా తినకండి. ఈ వస్తువులు ఇహలోకంలో

అవిశ్వాసుల కోసం కేటాయించబడ్డాయి. మన కోసం పరలోకం ఉంది."

(సహీహ్ బుఖారీ:- 70వ ప్రకరణం - అతియిమ, 29వ అధ్యాయం - అల్అక్లి ఫీ ఇనాయిమ్ము ఫజ్జజ్)

1340. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) మస్జిద్ ద్వారం దగ్గర స్వచ్ఛమైన పట్టు వస్త్రాల జతను చూసి "దైవప్రవక్తా! ఈ జత బట్టల్ని మీరు కొని, శుక్రవారం రోజున, బయటి నుండి మిమ్మల్ని కలుసుకోవడానికి ప్రతినిధి వర్గాలు వచ్చినప్పుడు వాటిని ధరిస్తే ఎంత బాగుండు!" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "పరలోకం (స్వర్గం)లో ఎలాంటి (ప్రతిఫలం) వాటాకు నోచుకోని వాడే దీన్ని ధరిస్తాడు" అని అన్నారు.

ఆ తరువాత కొన్నాళ్ళకు ఎక్కడ్నుంచో (కానుకలుగా) దైవప్రవక్త (సల్లం) దగ్గరకు ఇలాంటి పట్టు వస్త్రాలు వచ్చాయి. దైవప్రవక్త (సల్లం) వాటిలో ఒక జత బట్టల్ని హజ్రత్ ఉమర్ (రజి)కు కూడా ఇచ్చారు. హజ్రత్ ఉమర్ (రజి) (ఆశ్చర్యం వెలిబుచ్చుతూ) "దైవప్రవక్తా! వీటిని నాకిస్తున్నారా ధరించడానికి! తమీమ్‌తెగకు చెందిన ఉతారిద్ ఇలాంటి బట్టలే తెచ్చినప్పుడు వాటిని గురించి మీరు ఆ రోజు అలా అన్నారు కదా!" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) "నేనీ బట్టల్ని నీవు ధరించమని నీకివ్వలేదు" అని అన్నారు. అప్పుడు హజ్రత్ ఉమర్(రజి) ఆ పట్టు జతను మక్కాలో ఉన్న ఒక బహుదైవారాధక సోదరునికి ఇచ్చివేశారు.

(సహీహ్ బుఖారీ:- 11వ ప్రకరణం - జుమఅ, 7వ అధ్యాయం - యల్బసు అహ్సన మాయజిద్)

1341. హజ్రత్ అబూఉస్మాన్ నహ్దీ (రహ్మాలై) కథనం:- మేము ఆజర్ బైజాన్‌లో హజ్రత్ ఉత్బా బిన్ ఫర్ఖద్‌తో పాటు ఉన్నాము. అప్పుడు (ఖలీఫా) హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) దగ్గర్నుంచి ఒక ఉత్తరం వచ్చింది. అందులో ఇలా ఉంది - "దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని పట్టువస్త్రాలు ధరించకూడదని వారించారు. అయితే ఈ మాత్రం ధరించవచ్చని దైవప్రవక్త (సల్లం) తన చూపుడు, బొటన వ్రేళ్ళను చూపారు. దాన్ని బట్టి రెండు వ్రేళ్ళంత (పట్టు) ఎంబ్రాడరీ గల బట్టలు ధరించడానికి దైవప్రవక్త (సల్లం) అనుమతించారని మేము భావిస్తున్నాము".

(సహీహ్ బుఖారీ:- 70వ ప్రకరణం - హిబా, 27వ అధ్యాయం - హద్యతు మా యుక్రహు లుబ్సహు)

1342. హజ్రత్ అలీ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం)కు ఓసారి స్వచ్ఛమైన పట్టు వస్త్రాల జత ఒకటి కానుకగా లభించింది. దాన్ని మా ఇంటికి పంపిస్తే నేను ధరించాను. కాని అది చూడగానే దైవప్రవక్త (సల్లం) ముఖారవిందం ఆగ్రహోదగ్రమయింది. దాంతో నేనా పట్టు వస్త్రాలను చించి మా కుటుంబంలోని స్త్రీలకు ఇచ్చివేశాను.

(సహీహ్ బుఖారీ:- 51వ ప్రకరణం - హిబా, 27వ అధ్యాయం - హదియతి మాయుక్రహు లుబ్సహు)

1343. హజ్రత్ అనస్ (రజి) ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ఇహలోకంలో పట్టువస్త్రాలు ధరించినవాడు పరలోకంలో వాటిని ధరించలేడు.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 25వ అధ్యాయం - లుబ్సల్ హరీరి వఫ్తిరాషిహీ లిర్రిజాల్)

1344. హజ్రత్ ఉఖ్బా బిన్ ఆమిర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం)కు కానుకగా ఒక సిల్కు కోటు పంపబడింది. దైవప్రవక్త (సల్లం) దాన్ని ధరించి (మస్జిద్‌లో) నమాజు చేశారు. అయితే (ఇంటికి) తిరిగొచ్చి దాన్ని తీసి పారేశారు తనకది ఇష్టం లేనట్లుగా. తరువాత (పట్టుబట్టలను గురించి మాట్లాడుతూ) "దైవభీతి పరులకు ఇలాంటి (పట్టు) బట్టలు శోభించవు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 8వ ప్రకరణం - సలాత్, 16వ అధ్యాయం - మన్‌సల్లా ఫీ ఫురూజి హరీరిన్ సుమ్మనజ ఆహు)

## 3వ అధ్యాయం - గజ్జి, దురద ఉన్నవారు పట్టుబట్టలు ధరించవచ్చు

1345. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి), హజ్రత్ జుబైర్ (రజి) లకు గజ్జి ఉండటం వల్ల దైవప్రవక్త (సల్లం) వారికి పట్టుబట్టలు ధరించడానికి అనుమతినిచ్చారు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 91వ అధ్యాయం - అల్ హరీరి ఫిల్ హర్బ్)

## 5వ అధ్యాయం - యమన్ దుప్పట్ల విశిష్టత

1346. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం)కు ఎలాంటి బట్టలంటే ఎక్కువ ఇష్టమని అడిగిన ప్రశ్నకు హజ్రత్ అనస్ (రజి) ఇలా సమాధానమిచ్చారు: "యమన్‌లో తయారైన చారల దూది దుప్పటి అంటే ఆయనకు ఎక్కువ ఇష్టం".

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 18వ అధ్యాయం - అల్‌బురూది వల్ హిబరతి వష్షమ్లా)

## 6వ అధ్యాయం - వినయ వినమ్రతలు ఉట్టిపడే ముతక బట్టలు ధరించడం

1347. హజ్రత్ అబూ బుర్దా (రజి) కథనం:- హజ్రత్ ఆయిషా (రజి) ఒక కంబళీ, ఒక ముతక లుంగీ తీసి చూపిస్తూ "దైవప్రవక్త (సల్లం) ఇహలోకం వీడిపోయేటప్పుడు ఈ రెండు బట్టలు ధరించారు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 19వ అధ్యాయం - అల్ అక్సియతి వల్ ఖమాయిస్)

## 7వ అధ్యాయం - తివాచీలు, దుప్పట్ల వాడకం

1348. హజ్రత్ జాబిర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) నన్ను "నీ దగ్గర ఏదైనా తివాచీగాని దుప్పటిగానీ ఉందా?" అని అడిగారు. దానికి నేను "మా దగ్గర తివాచీలు ఎక్కడ్నుంచి వస్తాయి" అని అన్నాను. "అయితే అనతి కాలంలోనే మీకు తివాచీలు లభిస్తాయి" అన్నారు దైవప్రవక్త (సల్లం).

ఆ తరువాత (ఎప్పుడైనా) నేను నా భార్యతో "నీ తివాచీ నువ్వు తీసేసుకో" అని అంటే, "అనతి కాలంలోనే మీకు తివాచీలు లభిస్తాయని దైవప్రవక్త (సల్లం) చెప్పలేదా?" అని అంటుంది మా ఆవిడ. దాంతో నేను మౌనంగా ఉండిపోతాను.★

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతిన్నుబువ్వతి ఫిలిస్లామ్)

★ హదీసు మూలభాషలో వచ్చిన 'ఇన్మాత్' అనే పదానికి రంగు ఉన్ని బట్టలన్న అర్థం ఉంది. దాన్నుండే సాధారణంగా తివాచీలు, కంబళ్ళు, పడక మీద పరిచే ఇతర దుప్పట్లు అనే అర్థాలు కూడా జనించాయి. హాఫిజ్ ఇబ్నె హజర్ (రహ్మలై) ఇలా రాస్తున్నారు. ఈ హదీసు ద్వారా తివాచీ వాడకానికి ప్రమాణం చూపడం సరికాదు. దైవప్రవక్త (సల్లం) అనతికాలంలోనే మీకు తివాచీలు లభిస్తాయని చెప్పిన మాట దాన్ని ఉపయోగించడం కూడా ధర్మ సమ్మతమేనన్న వాదనకు ఏ మాత్రం హేతువు కాజాలదు. కాకపోతే దైవప్రవక్త (సల్లం) ఈ మాట చెప్పిన తర్వాత వాటిని ఉపయోగించకూడదని చెప్పలేదు గనక దాన్ని వాడటానికి కాస్తంత ఆధారం లభించినట్లవుతుంది. వాస్తవం దేవునికే తెలుసు. (సంకలన కర్త)

## 9వ అధ్యాయం - అహంకారంతో బట్టను నేలపై ఈడుస్తూ నడవరాదు

1349. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- అహంకారంతో తన ధోవతీ (లుంగీ, పైజామా)ని నేలమీద ఈడుస్తూ నడిచే వ్యక్తిని దేవుడు పరలోకంలో కన్నెత్తి కూడా చూడడు.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 1వ అధ్యాయం - ఖౌలిల్లాహితాలా (ఖుల్‌మన్ హర్రమ జీనతల్లాహిల్లతీ అఖ్రజ లి ఇబాదిహీ)

1350. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఉపదేశించారు:- అహంకారంతో విర్రవీగుతూ తన ధోవతీ (లుంగీ, పైజామా)ని నేలమీద ఈడుస్తూ నడిచేవాడ్ని దేవుడు పరలోకంలో కన్నెత్తి కూడా చూడడు (అంటే అతడ్ని కటాక్ష వీక్షణతో చూడడన్నమాట).

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 5వ అధ్యాయం - మన్‌జర్ర సౌబహూ మినల్ ఖుయలాయి)

## 10వ అధ్యాయం - దుస్తుల మూలంగా విర్రవీగుతూ నడవడం నిషిద్ధం

1351. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- పూర్వం ఒక వ్యక్తి ఖరీదైన బట్టలు ధరించి అహంకారంతో విర్రవీగుతూ నడుస్తున్నాడు. అతను తన శిరోజాలను కూడా బాగా అలంకరించుకున్నాడు (అతనికి తన తలకట్టు పట్ల కూడా గర్వం ఉంది). అంతలో దేవుడు అతడ్ని నేలలోకి దిగవేసాడు. ప్రళయ దినం వరకూ అతను నేలలోకి దిగబడిపోతూనే ఉంటాడు.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 5వ అధ్యాయం - మన్‌జర్ర సౌబహూ మినల్ ఖుయలాయి)

## 11వ అధ్యాయం - బంగారపు ఉంగరాన్ని పారవేయడం గురించి

1352. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని బంగారపు ఉంగరం ధరించడాన్ని వారించారు.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 45వ అధ్యాయం - ఖవాతీ ముజ్జహబ్)

1353. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) బంగారపు ఉంగరాన్ని చేయించుకొని, దాని రాయి చేతి లోపలికి ఉండేలా ధరించసాగారు. అది చూసి ఆయన అనుచరులు కూడా అదే విధంగా ధరించడం మొదలెట్టారు. ఆ తరువాత ఓ రోజు దైవప్రవక్త (సల్లం) మస్జిద్ వేదిక ఎక్కి ఉంగరాన్ని తీసేసి ఇలా అన్నారు: "నేనీ ఉంగరాన్ని ధరించేవాడ్ని, దీని రాయిని చేతికి క్రింది వైపు ఉండేలా పెట్టుకునేవాడ్ని" అని అన్నారు. ఆ తరువాత ఆయన ఆ ఉంగరాన్ని పారేసి "దైవసాక్షి! నేనిక నుంచి ఈ ఉంగరాన్ని ఎన్నటికీ పెట్టుకోను" అని అన్నారు. ఈ మాట వినగానే అనుచరులు కూడా తమ తమ ఉంగరాలను తీసి పారేశారు.

(సహీహ్ బుఖారీ:- 83వ ప్రకరణం - ఐమాన్ వన్నుజూర్, 6వ అధ్యాయం - మన్ హలఫ అలష్షైయి వ ఇన్‌లమ్ యుహల్లఫ్)

## 12వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) ధరించిన ఉంగరం

1354. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఒక వెండి ఉంగరం తయారు చేయించారు. అది ఎల్లప్పుడూ ఆయన వ్రేలికి ఉండేది. ఆయన ఇహలోక నిష్క్రమణ తరువాత ఆ ఉంగరం హజ్రత్ అబూబకర్ (రజి) చేతికి వచ్చింది. ఆయన తరువాత అది హజ్రత్ ఉమర్ (రజి) చేతిలోకి, ఆ తరువాత హజ్రత్ ఉస్మాన్ (రజి) చేతిలోకి పోయింది. అరీస్ బావిలో పడిపోయే వరకు ఆ ఉంగరం హజ్రత్ ఉస్మాన్ (రజి) వ్రేలికి ఉండేది.★ దానిపై 'ముహమ్మదుర్రసూలుల్లాహ్' అని వ్రాయబడి ఉంది.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం -లిబాస్, 50వ అధ్యాయం - నఖ్షిల్ ఖాతమ్)

1355. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఒక ఉంగరం తయారు చేయించుకొని "మేమొక ఉంగరం తయారు చేయించి దానిపై కొన్ని పదాలు వ్రాయించాము. మీలో ఎవరూ తమ ఉంగరాలపై ఇలాంటి పదాలు వ్రాయించకండి" అని అన్నారు.

ఆయన వ్రేలికి మెరిసిపోతూ ఉండిన ఆ ఉంగరం ఇప్పటికీ నా కళ్ళ ముందు మెదలుతూ ఉంది (అని హజ్రత్ అనస్ (రజి) చెప్పారు).

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 51వ అధ్యాయం - అల్ ఖాతమి ఫిల్ ఖిన్సర్)

## 13వ అధ్యాయం - ఈరాన్ రాజుకు లేఖ వ్రాయదలచినపుడు దైవప్రవక్త (సల్లం) తన కోసం రాజముద్రగల ఉంగరం తయారు చేయించారు

1356. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) అరబ్బేతర రాజు పేర ఒక లేఖ వ్రాయించారు లేక వ్రాయించడానికి నిర్ణయించుకున్నారు. అప్పుడు అనుచరులు "వారీ ఉత్తరం మీద (రాజ) ముద్ర లేకపోతే చదవరు" అని అన్నారు. అందువల్ల దైవప్రవక్త (సల్లం) ఒక వెండి ఉంగరం తయారు చేయించి, దానిమీద "ముహమ్మదుర్రసూలుల్లాహ్" అని పేరు వ్రాయించారు. ఆయన వ్రేలికున్న ఆ ఉంగరం మెరుపు ఇప్పటికీ నా మనోవీధిలో మెదలుతోంది.

(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం - ఇల్మ్, 7వ అధ్యాయం - మాయుజ్కరు ఫిల్మునావలతి వకితాబిలిల్ అహ్లి ఇల్మి బిల్ ఇల్మి ఇలల్ బుల్దాన్)

## 14వ అధ్యాయం - (బంగారపు) ఉంగరాలు తీసి పారేశారు

1357. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం) వ్రేలికి ఒక వెండి ఉంగరం చూశాను. అది చూసి అనుచరులు కూడా వెండి ఉంగరాలు చేయించుకొని పెట్టుకున్నారు. (అంతకు

---

★ అల్లామా వహీదుజ్జమా (రహ్మాలై) ఇలా రాస్తున్నారు. ఈ ఉంగరం మహీఖబ్ (రహ్మాలై) చేతి నుండి అరీస్ బావిలో జారిపడి పోయిననాటి నుంచి ఖిలాఫత్ పాలనా వ్యవహారాల్లో సంక్షోభం, కల్లోలాలు మొదలయ్యాయి. ఈ హదీసు ద్వారా ఉంగరంపై పేరు చెక్కడం ధర్మసమ్మతమని కూడా తెలుస్తోంది. (అనువాదకుడు)

పూర్వం) దైవప్రవక్త (సల్లం) బంగారపు ఉంగరాన్ని తీసిపారేస్తే అనుచరులు కూడా తమ తమ (బంగారపు) ఉంగరాలను తీసిపారేశారు.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 47వ అధ్యాయం - హద్దసనా అబ్దుల్లా హిబ్నుముస్లిమా)

## 19వ అధ్యాయం - చెప్పులు తొడిగేటప్పుడు మొదట కుడికాలికి తొడగాలి

1358. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- చెప్పులు తొడిగేటప్పుడు మొదట కుడి కాలికి తొడుక్కోవాలి. వదిలేటప్పుడు మొదట ఎడమ కాలి చెప్పు వదలాలి. ఇలా కుడికాలు తొడుక్కోవడంలో ముందు, వదలడంలో చివర ఉండాలి.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 39వ అధ్యాయం - యున్జవూనాలుల్ యుస్రా)

1359. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- ఒక చెప్పు తొడిగి నడవకండి, తొడిగితే రెండు చెప్పులు తొడుక్కోండి, వదలితే రెండు చెప్పులు వదలండి.

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - లిబాస్, 40వ అధ్యాయం - లాయమ్షి ఫీనాలిన్ వాహిద్)

## 22వ అధ్యాయం - వెల్లకిలా పడుకొని ఒక కాలిమీద మరొక కాలు పెట్టుకోవచ్చు

1360. హజ్రత్ అబ్దుల్లాబిన్ జైద్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) మస్జిద్‌లో వెల్లకిలా పడుకొని ఒక కాలిమీద మరొక కాలు పెట్టుకొని ఉండటం నేను చూశాను.

(సహీహ్ బుఖారీ:- 8వ ప్రకరణం - సలాత్, 85వ అధ్యాయం - అల్ ఇస్తిల్ఖాయి ఫిల్ మస్జిద్ వమద్దిర్రిజ్‌లి)

## 23వ అధ్యాయం - పురుషులు కాషాయరంగు వస్త్రాలు ధరించరాదు

1361. హజ్రత్ అనస్ (రజి) కథనం:- పురుషులు కాషాయరంగు వస్త్రాలు ధరించకూడదని దైవప్రవక్త (సల్లం) మాకు తాకీదు చేశారు.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం, లిబాస్, 33 వ అధ్యాయం - అత్తజాఫు రిలిర్రిజాల్)

## 25వ అధ్యాయం - జుట్టుకు రంగు వేసుకోవడం గురించి

1362. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- యూదులు, క్రైస్తవులు జుట్టుకు రంగు వేసుకోరు. మీరు (రంగు వేసుకొని) వారికి వ్యతిరేకంగా చేయండి.★

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 50వ అధ్యాయం - మాజుకిర అన్ బనీ ఇస్రాయీల్)

---

★ ప్రతిజాతికీ తన అస్తిత్వాన్ని, సంస్కృతిని కాపాడుకోవడం కోసం ఇతరజాతులను అనుకరించకుండా ఉండటం ఎంతో అవసరం. ఇలా చేయడం ఆ జాతి ఆత్మగౌరవానికి కూడా ఎంతో అవసరం. అందువల్ల ముస్లింలు దైనందిన అలవాట్లు, వేషధారణ విషయంలో వీలైనంతవరకు అవిశ్వాసుల్ని వ్యతిరేకించాలని ఈ హదీసు మనకు తెలియజేస్తోంది. అహ్లెహదీస్ దృక్పథం ప్రకారం స్త్రీ పురుషులిరువురూ వెంట్రుకలకు ఎర్రరంగు వేసుకోవచ్చు, నల్ల రంగు మాత్రం నిషిద్ధం. కొందరు ధర్మవేత్తలు నల్లరంగు వేసుకోవడం మక్రూహె తన్జీహి (దాదాపు నిషిద్ధం) అన్నారు. అసలు జుట్టు రంగు వాడవచ్చా లేదా అనే విషయంలో కూడా సనాతన వాదుల మధ్య భేదాభిప్రాయాలున్నాయి. కొందరి దృష్టిలో రంగు వేసుకోవడం మంచిది, మరికొందరి దృష్టిలో వేసుకోకపోవడమే మంచిది. హజ్రత్ అబ్దులా బిన్ ఉమర్ (రజి), హజ్రత్ అబూహురైరా (రజి) కడిమి, నీలి ఆకులతో తయారయ్యే ఎర్ర రంగును వేసుకునేవారు. కొందరు సహాబీలు (ప్రవక్త అనుచరులు) నల్లరంగు కూడా వాడారు. ఉదాహరణకు-హజ్రత్ ఉస్మాన్ (రజి), హసన్, (రజి), హుసైన్ (రజి) , ఉఖ్బాబిన్ ఆమిర్ (రజి), ఇబ్నెసీరీన్ (రజి), అబూబర్దా (రజి). ఇన్ని భేదాభిప్రాయాలు ఉన్నప్పటికీ సమర యోధుల విషయంలో అందరూ ఏకీభవించారు. సమరయోధులు శత్రువులపై తమ గాంభీర్యతను ప్రదర్శించడానికి నల్లరంగు వేసుకోవడం ధర్మ సమ్మతమే కాదు, ఎంతో మంచిది కూడా. (ఇమామ్ నవవీ-రహ్మలై)

## 26వ అధ్యాయం - కుక్క, (ప్రాణుల) చిత్రాలుండే ఇంట్లో దైవదూతలు ప్రవేశించరు

1363. హజ్రత్ అబూతల్హా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- కుక్క (ప్రాణుల) చిత్రాలు ఉండే ఇంట్లో దైవదూతలు ప్రవేశించరు.

(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్'యిల్‌ఖల్ఖ్, 7వ అధ్యాయం - ఇజా ఖాల అహదుకుమ్ ఆమీన్ వల్ మలాయికతు ఫిస్సమాయి)

1364. హజ్రత్ బుస్ర్ బిన్ సయీద్ (రహ్మాలై) కథనం:- జైద్ బిన్ ఖాలిద్ జహనీ (రజి) నాకొక హదీసు విన్పించారు. అప్పుడు హజ్రత్ మైమూనా (రజి) సంరక్షణలో ఉన్న ఉబైదుల్లా ఖౌలానీ (రహ్మాలై) కూడా నా వెంట ఉన్నారు. జైద్‌బిన్ ఖాలిద్ (రజి) మా ఇద్దరికీ హజ్రత్ అబూతల్హా (రజి) ఉల్లేఖించిన ఆ హదీసును ఇలా విన్పించారు, "చిత్రాలుండే ఇంట్లో దైవదూతలు ప్రవేశించరని దైవప్రవక్త (సల్లం) అన్నారు."

ఆ తరువాత (కొన్నాళ్ళకు) జైద్ బిన్ ఖాలిద్ (రజి) వ్యాధిగ్రస్తులయితే మేము ఆయన్ని పరామర్శించడానికి వెళ్ళాము. హఠాత్తుగా వారింట్లో ఒక తెర (పరదా) పై మా దృష్టి పడింది. దాని మీద చిత్రాలున్నాయి. నేను ఉబైదుల్లా ఖౌలానీ (రహ్మాలై)తో దాన్ని గురించి ప్రస్తావిస్తూ, "హజ్రత్ జైద్‌బిన్ ఖాలిద్ (రజి) మనకు చిత్రాలను గురించి హదీసు విన్పించలేదా?" అని అడిగాను. దానికి హజ్రత్ ఉబైదుల్లా ఖౌలానీ (రహ్మాలై) "వస్త్రాలపై వేసిన చిత్రాలు తప్ప అనే విషయం కూడా ఆయన మనకు విన్పించారు. మరీమాట వినలేదా?" అని అన్నారు. నేను వినలేదన్నాను. "ఆయన ఈ విషయం కూడా చెప్పారు" అన్నారు హజ్రత్ ఉబైదుల్లా ఖౌలానీ (రహ్మాలై).★

(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్'యిల్ ఖల్ఖ్, 7వ అధ్యాయం - ఇజా ఖాలా అహదుకుమ్ ఆమీన్ వల్ మలాయికతు ఫిస్సమాయి)

1365. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- నేను మా ఇంట్లో మంచెకు ఒక తెర వ్రేలాడదీసి ఉంచాను. దానిమీద బొమ్మలు వేసి ఉన్నాయి. దైవప్రవక్త (సల్లం) ప్రయాణం నుంచి తిరిగొచ్చినప్పుడు ఆయన దాన్ని చూడగానే చించివేశారు. తరువాత ఆయన నాతో "ప్రళయదినాన అందరి కంటే తీవ్రమైన శిక్ష దేవుని సృష్టిని పోలిన వాటిని సృష్టించిన వారికి విధించబడుతుంది" అని

---

★ఇమామ్ నవవీ (రహ్మాలై) ఇలా వ్రాస్తున్నారు: ప్రాణుల చిత్రాలు బట్టలపై వేసినా, నాణాలపై ముద్రించినా, పాత్రలపై వేసినా, గోడలపై గీసినా ఎట్టి పరిస్థితిలోనూ నిషిద్ధమే. ఘోరపాపమవుతుంది. చెట్లు, కొండలు మొదలైన నిర్జీవ చిత్రాలు వేయడం మాత్రం నిషిద్ధం కాదు. అదే విధంగా ప్రాణుల చిత్రాలు గోడలపై వేలాడదీసినా, దుస్తులపై ఉన్నా, అగౌరవ పరచబడని మరే చోట వేసినా నిషిద్ధమే. కాళ్ళ క్రింద నలుగుతూ అవమాన పరచబడే చోట వేయబడిన చిత్రాలు, ఉదాహరణకు, నేలపై, దిండులపై వేయబడిన చిత్రాలు నిషిద్ధం కావు. అయితే ఇందులోనూ భేదాభిప్రాయాలున్నాయి. అలాంటి చిత్రాలు ఉండే ఇంట్లో దైవ దూతలు ప్రవేశిస్తారా లేదా అనే విషయంలో భేదాభిప్రాయాలున్నాయి. నీడపడే చిత్రాలు మాత్రమే నిషిద్ధమని కొందరు అభిప్రాయపడ్డారు. కాని అధిక సంఖ్యాక ధర్మవేత్తలు, సహాబీలు, తాబయీలు, తబేతాబయీలు, ఉదాహరణకు - ఇమామ్ సుఫ్యాన్ సౌరీ (రహ్మాలై) , ఇమామ్ మాలిక్ (రహ్మాలై) , ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై) వగైరా పెద్దల దృష్టిలో నీడపడే చిత్రాలయినా, నీడపడని చిత్రాలయినా సరే అధర్మమే. అందులో ఎలాంటి తేడా లేదు. (అనువాదకుడు)

అన్నారు. ఆ తరువాత నేనా తెరను ఒకటి లేక రెండు దిండు గలేబులుగా చేశాను.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 19వ అధ్యాయం - మా ఉతియ మినత్తసావీర్)

1366. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- నేనొక దిండు (లేక తలగడ) కొన్నాను. దాని మీద బొమ్మలు వేసి ఉన్నాయి. దైవప్రవక్త (సల్లం) బయటి నుంచి వచ్చి దాన్ని చూడగానే తలుపు దగ్గరే ఆగిపోయారు. ఇంట్లోకి ప్రవేశించలేదు. నేనాయన ముఖంలో ఆగ్రహ చిహ్నాలు చూసి 'దైవప్రవక్తా! నేను దేవుని ముందు, ఆయన ప్రవక్త ముందు పశ్చాత్తాపపడుతున్నాను (క్షమాపణ కోరుకుంటున్నాను). నేను చేసిన తప్పేమిటో సెలవియ్యండి'' అని అన్నాను. దానికి ఆయన "ఈ దిండేమిటి?" అని అడిగారు. "ఈ దిండుని మీరు ఆనుకొని కూర్చుంటారన్న ఉద్దేశ్యంతో కొన్నాను" అని చెప్పాను నేను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "బొమ్మలను వేసే (తయారు చేసే) వాడ్ని దేవుడు ప్రళయదినాన శిక్షిస్తాడు. 'నీవు సృష్టించిన దీనికి ప్రాణం పొయ్యి అంటాడు దేవుడు అతనితో (అతనా పని చేయలేడు)'' అని అన్నారు. ఆ తరువాత "బొమ్మలు ఉండే ఇంట్లో దైవదూతలు ప్రవేశించరు" అని చెప్పారు ఆయన.

(సహీహ్ బుఖారీ:- 34వ ప్రకరణం - అల్‌బుయూ, 40వ అధ్యాయం - అత్తిజారతి ఫీమా యుక్రహు లుబ్సుహూ లిర్రిజాలి వన్నిసా)

1367. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ప్రళయదినాన బొమ్మలు వేసే (తయారుచేసే) వారు తీవ్రాతి తీవ్రమైన శిక్షకు గురవుతారు. మీరు సృష్టించిన ఈ బొమ్మలకు ప్రాణం పోయండని వారిని నిలదీయడం జరుగుతుంది. కాని వారు ఆ బొమ్మలకు ప్రాణం పోయలేరు.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 89వ అధ్యాయం - అజాబిల్ ముసవ్విరీన యౌమల్ ఖియామ)

1368. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు:- ప్రళయదినాన తీవ్రాతి తీవ్రమైన శిక్షకు బొమ్మలు వేసే (తయారుచేసే) వారే అర్హులవుతారు.

(సహీహ్‌బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 89వ అధ్యాయం - అజాబిల్ ముసవ్విరీన యౌమల్ ఖియామ)

1369. హజ్రత్ సయీద్ బిన్ అబుల్‌హసన్ (రహ్మాలై) కథనం:- నేను హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) దగ్గర కూర్చొని ఉన్నాను. అప్పుడు ఒక వ్యక్తి వచ్చి "అబుల్ అబ్బాస్! నా ఉపాధి నా చేతి వృత్తిపై ఆధారపడి ఉంది. నేను బొమ్మలు వేస్తుంటాను" అని అన్నాడు. దానికి హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) సమాధానమిస్తూ, "నేను దైవప్రవక్త (సల్లం) నోట విన్న హదీసు మాత్రమే నీకు విన్పిస్తాను. ఆయన ఇలా అన్నారు - బొమ్మలు గీసేవాడ్ని దేవుడు (ప్రళయదినాన) నిలదీసి ఈ బొమ్మలకు ప్రాణం పొయ్యి అని శిక్షిస్తాడు. కాని అతను ఆ బొమ్మలకు ప్రాణం పొయ్యలేడు."

ఈ మాటలు విని ఆ వ్యక్తి భయంతో వణికిపోయాడు. శ్వాస ఆగినంత పనయింది. ముఖం ఎర్రగా మారిపోయింది. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) అతని పరిస్థితి చూసి "ఓరీ దౌర్భాగ్యుడా! నువ్వీ

వృత్తి మానుకోలేకపోతే, చెట్లు మొదలైన ప్రాణం లేని వస్తువుల బొమ్మలు వేసుకో" అని అన్నారు.(1)

**(సహీహ్ బుఖారీ:- 34వ ప్రకరణం - అల్‌బుయూ, 104వ అధ్యాయం - బైయిత్తసావీరిల్లతి లైసఫీహారూహ్)**

1370. హజ్రత్ అబూజుర్‌ఆ (రహ్మలై) కథనం:- నేను మదీనాలో హజ్రత్ అబూ హురైరా (రజి)తో కలసి ఒక ఇంట్లో ప్రవేశించాను. చూస్తే ఆ ఇంటిపై ఒక వ్యక్తి బొమ్మలు తయారు చేస్తున్నాడు. అప్పుడు హజ్రత్ అబూ హురైరా (రజి) అతడ్ని ఉద్దేశించి ఇలా అన్నారు: "దైవప్రవక్త (సల్లం) దేవుని మాటలను ఇలా చెబుతుంటే నేను విన్నాను - నేను సృష్టించిన సృష్టితాలను పోలిన వాటిని సృష్టించదలచుకున్న వ్యక్తి కంటే పరమ దుర్మార్గుడు మరెవరుంటారు? (సృష్టికి ప్రతిసృష్టి చేయాలని అంత ఉబలాటపడుతుంటే) అతను ఒక గోధుమ గింజనో లేదా ఒక చీమనో సృష్టించి చూపాలి".

**(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 90వ అధ్యాయం - నఖ్‌జిస్సువర్)**

## 28వ అధ్యాయం - ఒంటె మెడలో నరంతో చేసిన పట్టా వేయరాదు

1371. హజ్రత్ అబూ బషీర్ అన్సారీ (రజి) కథనం:- నేనొక ప్రయాణంలో దైవప్రవక్త (సల్లం) వెంట ఉన్నాను. ఒకరోజు జనం ఇంకా నిద్ర నుండి లేవకముందే దైవప్రవక్త (సల్లం) ఒక వ్యక్తి ద్వారా ఈ ఆదేశం పంపారు - 'ఏ ఒంటె మెడలో కూడా నరంతో చేసిన పట్టా ఉండకూడదు' - లేక ఆయన ఇలా అన్నారు. 'ఒంటెల మెడలలో నరంతో చేసిన పట్టాలు కన్పిస్తే వాటిని కోసెయ్యాలి'.(2)

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 139వ అధ్యాయం - మాఖీల ఫిల్ జరసి వ నహ్‌విహీ ఫీ ఆనాఖిల్ ఇబిల్)**

## 30వ అధ్యాయం - పశువుల దేహాలపై వాత పెట్టవచ్చు, ముఖాలపై కాదు

1372. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- హజ్రత్ ఉమ్మె సలీం (రజి)కు ఒక బాబు పుట్టాడు. అప్పుడు ఆమె నాతో "అనస్! రేపుదయం ఈ పిల్లవాడ్ని దైవప్రవక్త (సల్లం) దగ్గరికి తీసికెళ్ళి ఆయన చేత ఉగ్గు పోయించేదాకా నువ్వీబాబు నోట్లో ఏమీ పోకుండా జాగ్రత్తగా కనిపెట్టుకొని ఉండాలి" అని అన్నారు. మరునాడు ఉదయం నేనా పిల్లవాడ్ని దైవప్రవక్త (సల్లం) సన్నిధికి తీసికెళ్ళాను.ఆ సమయంలో ఆయన ఒక తోటలో ఉన్నారు. పచ్చరంగు ఉన్ని శాలువా కప్పుకొని (మక్కా) విజయానంతరం తన దగ్గరకు వచ్చిన ఒంటెలకు వాతలు పెడుతున్నారు.

**(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 22వ అధ్యాయం - అల్ ఖమీసతిస్సాదాయి)**

---

(1) ప్రాణంలేని వస్తువుల చిత్రాలు, చిత్రలేఖనం, పెయింటింగులు డిజైన్లు ధర్మ సమ్మతమే. కొందరు ధర్మవేత్తల దృష్టిలో వస్త్రంపై వేయబడిన చిత్రాలు ప్రాణుల చిత్రాలయినా సరే ధర్మ సమ్మతమే. కాని అధిక సంఖ్యాక ధర్మవేత్తల అభిప్రాయం దీనికి వ్యతిరేకంగా ఉంది. చిన్నపిల్లల బొమ్మలు, ఆటవస్తువులు మాత్రం ధర్మసమ్మతమేనని ఖాజీ అయాజ్ (రహ్మలై) తన గ్రంథంలో రాశారు. ఇమామ్ మాలిక్ (రహ్మలై) దృక్పథం కూడా ఇదే. అయితే ఆయన దాన్ని మక్రూహ్‌గా భావిస్తున్నారు. (సంకలన కర్త)

(2) బహుదైవారాధకులు ఒంటెలకు దిష్టి తగలకుండా ఉండేందుకు వాటి మెడలలో నరంతో చేసిన పట్టాలు వేసేవారు. నిజానికి దానివల్ల అవి దిష్టి తగలకుండా క్షేమంగా ఉండవు. మరే విధమైన ప్రయోజనం కూడా చేకూరదు. ఇదొక మూఢనమ్మకం మాత్రమే. అందువల్ల దైవప్రవక్త ఈ దురాచారాన్ని మాన్పించారు. అయితే అలంకరణ కోసం మరేదైనా దండలు పశువుల మెడలలో, పిల్లల మెడలలో వేయడం ధర్మసమ్మతమే. (ఇమామ్ నవవీ-రహ్మలై)

## 31వ అధ్యాయం - పిలకలు వదలి తల గొరిగించుకోరాదు

1373. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- పిలకలు వదలి తల (నున్నగా) గొరిగించుకోకూడదని దైవప్రవక్త (సల్లం) తన అనుచరులకు చెబుతుండగా నేను విన్నాను.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 72వ అధ్యాయం-అల్‌ఖజా)

## 32వ అధ్యాయం - దారిలో (అడ్డంగా) కూర్చోరాదు

1374. హజ్రత్ అబూసయీద్ ఖుదరీ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) దారిలో కూర్చోవద్దని చెప్పారు. అనుచరులు ఆ మాట విని "అలా చేయకుండా మాకు గడవదే! మేము కూర్చొని పరస్పరం మాట్లాడుకోవడానికి ఈ ప్రదేశాలే మాకు (రచ్చబండలుగా) ఉపయోగపడుతున్నాయి" అని అన్నారు. "మీకీ ప్రదేశాలలో కూర్చోకుండా గడవకపోతే దారికి దారి హక్కు ఇచ్చేయండి" అన్నారు దైవప్రవక్త (సల్లం). అనుచరులు "దారి హక్కు అంటే ఏమిటి" అని అడిగారు మళ్ళీ. దానికి దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చారు: "చూపులు క్రిందికి దించుకోవాలి. ఎవరికీ బాధ కలిగించకూడదు. సలాం చేస్తే దానికి ప్రతి సలాం చేయాలి. సత్కార్యాలను గురించి బోధించాలి. చెడు పనుల నుండి (ప్రజలను) వారించాలి."

(సహీహ్ బుఖారీ:- 46వ ప్రకరణం - మజాలిమ్, 22వ అధ్యాయం - అఫ్నియతిద్దూరి వల్ జులూసి ఫీహా)

## 33వ అధ్యాయం - సవరాలు, పచ్చబొట్లు వగైరా కృత్రిమ అలంకరణలు

1375. హజ్రత్ అస్మా బిన్తె అబూబకర్ (రజి) కథనం:- ఒక స్త్రీ దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! నా కూతురికి స్ఫోటకం అయి తలవెంట్రుకలు రాలిపోయాయి. నేనామెకు ఇప్పుడు పెళ్ళి చేశాను. మరి ఆమె తలలో సవరం పెట్టవచ్చా?" అని అడిగింది. దానికి దైవప్రవక్త (సల్లం) "సవరం పెట్టుకునే స్త్రీకి, పెట్టుకోమని ప్రేరేపించే స్త్రీకి దైవశాపం తగులుతుంది" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 85వ అధ్యాయం - అల్ మౌసూలా)

1376. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఒక అన్సారీ మహిళ తన కూతురికి పెళ్ళి చేసింది. ఆ అమ్మాయి తల వెంట్రుకలు రాలిపోయాయి. అప్పుడా మహిళ దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి విషయం వివరంగా తెలియజేసి "ఆ అమ్మాయి తలలో సవరం పెట్టమని మా శ్రీవారు చెబుతున్నారు. (దీనిపై మీ అభిప్రాయం ఏమిటి)?" అని అడిగింది. దానికి దైవప్రవక్త (సల్లం) "అలా చేయకూడదు. శిరోజాలలో సవరం పెట్టుకునే స్త్రీలు శపించబడ్డారు" అని చెప్పారు.

(సహీహ్ బుఖారీ:- 67వ ప్రకరణం - నికాహ్, 95వ అధ్యాయం - లాతుతీవుల్‌మర్అతు జౌజహా ఫీ మాసియతిన్)

1377. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) కథనం:- అందం కోసం పచ్చబొట్లు పొడిపించుకునే, పొడిపించుకోమని ప్రోత్సహించే స్త్రీలు, (ముఖం మీది) వెంట్రుకలు పీకి పారేసే, పీకి పారెయ్యమని ప్రోత్సహించే స్త్రీలు, పళ్ళ మధ్య సందు చేసే స్త్రీలు శపించబడ్డారు. వారీ విధంగా దేవుని సృష్టిని మార్చివేస్తున్నారు.

హజ్రత్ అబ్దుల్లా (రజి) పలికిన ఈ మాటలు ఒక స్త్రీ విని ఆయన దగ్గరకు వచ్చి "మీరిలాంటి స్త్రీలను శపించినట్లు నాకు తెలిసింది" అని అన్నది. దానికి ఆయన సమాధానమిస్తూ "దైవప్రవక్త (సల్లం) శపించిన స్త్రీలను నేనెందుకు శపించకూడదు? దివ్యఖుర్ఆన్‌లో కూడా అలాంటి స్త్రీల వైఖరిని గర్హించడం జరిగింది" అని అన్నారు.

"నేను మొత్తం ఖుర్ఆన్ చదివాను. కాని నాకెక్కడా మీరన్న ఈ విషయం కన్పించలేదే!" అన్నది ఆ స్త్రీ. నీవు నిజంగా ఖుర్ఆన్ చదివి ఉంటే ఈ మాట నీకు తప్పకుండా కన్పించేది. "నీవు ఖుర్ఆన్‌లో 'వమా ఆతాకుముర్రసూలు ఫఖుజూహు. వమా నహాకుమ్ అన్హు ఫన్తహూ'★ (59:7) అనే సూక్తిని పఠించలేదా?" అని అడిగారు హజ్రత్ అబ్దుల్లా (రజి). ఆమె "ఎందుకు పఠించలేదు?" అని అన్నది. "దైవప్రవక్త (సల్లం) అలా చేయడాన్ని వారించారు మరి" అన్నారు ఆయన. "కాని మీ శ్రీమతి అలా చేస్తుంటే చూశాను" అన్నది ఆ స్త్రీ. "వెళ్ళు, వెళ్ళి మరోసారి చూడు (ఆమె అలా చేయదు)" అన్నారు హజ్రత్ అబ్దుల్లా (రజి). ఆ స్త్రీ వెళ్ళి చూస్తే అక్కడ ఆమెకు అలాంటిదేమీ కన్పించలేదు.

దీనిపై హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) వ్యాఖ్యానిస్తూ "ఈ స్త్రీ అన్నట్లు నిజంగా అలా జరుగుతుంటే నేను నా భార్యతో కలసి ఉండను" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, హష్రసూరా-59, 4వ అధ్యాయం - మా ఆతాకుముర్రసూలు ఫఖుజూహు....)

1378. హజ్రత్ హమీద్ బిన్ అబ్దుర్రహ్మాన్ (రహ్మాలై) కథనం:- నేను హజ్ యాత్ర జరిపిన యేడు హజ్రత్ ముఆవియా (రజి) మస్జిద్‌లో వేదిక ఎక్కి ఉపన్యాసమిస్తూ ఒక మాట అనడం విన్నాను. ఆయన తన అంగరక్షకుడి దగ్గరున్న ఒక సవరం తన చేతిలోకి తీసుకొని ఇలా అన్నారు: "మదీనా పౌరులారా! మీ ధర్మవేత్తలు ఎక్కడున్నారు? ఇలాంటి వస్తువులు ఉపయోగించకూడదని దైవప్రవక్త (సల్లం) వారిస్తుంటే నేను విన్నాను. 'బనీ ఇస్రాయీల్ స్త్రీలు (అలంకరణ కోసం) ఇలాంటి పద్ధతులు అవలంబించినప్పుడే ఆ జాతి ప్రజలు నాశనమయ్యారు' అన్నారు దైవప్రవక్త (సల్లం)".

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 54వ అధ్యాయం - హద్దసనా అబుల్ యమాన్)

## 35వ అధ్యాయం - దుస్తుల ద్వారా మోసగించడం, లేనివి ఉన్నట్లుగా బడాయి చెప్పుకోవడం

1379. హజ్రత్ అస్మా (రజి) కథనం:- ఒక స్త్రీ దైవప్రవక్త సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! నాకొక సవతి ఉంది. నేనామె ముందు నా భర్త నాకు ఇవ్వని వస్తువులు ఇచ్చినట్లు బడాయి చెప్పుకుంటే అందులో ఏమైనా తప్పుందా?" అని అడిగింది. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "తనకు లభించని వస్తువులు లభించినట్లు బడాయి చెప్పుకునేవారు ఇతరులు చూసి మోసపోవడానికి దారితీయగల దుస్తులు ధరించే వ్యక్తి లాంటివాడు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 67వ ప్రకరణం - నికాహ్, 106వ అధ్యాయం - అల్‌ముతషబ్బియి బిమాలమ్ యనల్ వమా యున్‌హా మిన్ ఇఫ్తిఖారి జ్జర్రతి)

---

★ "దైవ ప్రవక్త (సల్లం) మీకేదయితే ఇస్తాడో దాన్ని తీసుకోండి. ఆయన మిమ్మల్ని దేన్నుంచయితే వారిస్తాడో దాని జోలికి పోకండి". (హష్ర్ సూరా :7)

# సంస్కార ప్రకరణం

## జీవనశైలి

### 1వ అధ్యాయం - అబుల్ ఖాసిం అనే మారు పేరును పెట్టుకోకూడదు

1380. హజ్రత్ అనస్ (రజి) కథనం:- బఖీ అనే చోట ఒక వ్యక్తి ఎవరినో అబుల్ ఖాసిం! అని పిలిస్తే, దైవప్రవక్త (సల్లం) అతని వైపు తిరిగి చూశారు. అతను "మిమ్మల్ని కాదండి"! అన్నాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "మీరు కావాలంటే (మీ పిల్లలకు) నా పేరు పెట్టుకోండి. అంతేగాని నా మారుపేరు (కునియత్) పెట్టుకోకండి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 34వ ప్రకరణం - అల్ బుయూ, 49వ అధ్యాయం - మాజుకిర ఫిల్ అస్వాఖ్)

1381. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- మా (తెగ అన్సార్)లో ఒక వ్యక్తికి పిల్లవాడు పుడితే అతనా పిల్లవాడికి ఖాసిం అని పేరు పెట్టుకున్నాడు. అప్పుడు అన్సారులు అతనితో "మేము నీ మారు పేరును అబుల్ ఖాసిం అని పడనీయము. (ఆ మారు పేరు కారణంగా) నీ కళ్ళకు చలువ చేకూర్చము" అని అన్నారు. ఈ మాటలు విని ఆ వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికెళ్ళి "దైవప్రవక్తా! నాకొక పిల్లవాడు పుడితే నేనతనికి ఖాసిం అని పేరు పెట్టాను. కాని అన్సారులు నా మారు పేరును 'అబుల్ ఖాసిం' అని పడనివ్వమని, (తద్వారా) నా కళ్ళకు చలువ చేకూర్చమని అంటున్నారు" అని అన్నాడు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "అన్సారులు బాగానే చెప్పారు. మీరు నా పేరు పెట్టుకోవచ్చుగాని నా మారు పేరును పెట్టుకోకండి. ఖాసిం (దైవానుగ్రహాన్ని పంచిపెట్టేవాడు)ని నేను మాత్రమే" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 57వ ప్రకరణం-ఫర్జుల్ ఖుమ్స్, 7వ అధ్యాయం - ఖౌలిల్లాహితఆలా( ఫ అన్నలిల్లాహి ఖుముసహూ)

1382. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- మాలో ఒకతనికి పిల్లవాడు పుడితే అతనా పిల్లవాడికి ఖాసిం అని పేరు పెట్టుకున్నాడు. అప్పుడు మేమతనితో "మేము నీకు అబుల్ ఖాసిం అని మారు పేరు పెట్టుకోనివ్వము. ( ఆ మారు పేరుతో) నిన్ను గౌరవించము" అని అన్నాము. అతనీ సంగతి దైవప్రవక్త (సల్లం) ముందు ప్రస్తావిస్తే "నీ కొడుక్కి అబ్దుర్రహ్మాన్ అని పేరు పెట్టుకో" అని చెప్పారు దైవప్రవక్త (సల్లం).

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 105వ అధ్యాయం - అహబ్బిల్ అస్మాయి ఇలల్లాహి అజ్జవజల్ల)

1383. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- మీరు నా పేరు పెట్టుకోవచ్చు. కాని నా మారు పేరుని పెట్టుకోకండి.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 20వ అధ్యాయం -కునియతిన్నబియ్యి (సల్లం))

## 3వ అధ్యాయం - అసమంజసమైన పేరుంటే తీసి మంచిపేరు పెట్టుకోవాలి

1384. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ జైనబ్ బిన్తె జహష్ (రజి) గారి పేరు మొదట్లో బర్రా అని ఉండేది. దానిపై ప్రజలు "ఈమె తనను తాను పవిత్రురాలని, పుణ్యవతి అని భావిస్తుంది" అని చెప్పుకునేవారు. అందువల్ల దైవప్రవక్త (సల్లం) ఆమెకు జైనబ్ అని పేరు పెట్టారు.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం-అదబ్, 108వ అధ్యాయం - తహ్వీలిల్ ఇస్మి ఇలా ఇస్మిన్ అహ్సనమిన్హు)

## 4వ అధ్యాయం - రాజాధిరాజు, సార్వభౌముడు అనే పేర్లు పెట్టుకోరాదు

1385. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ఎవరైనా రాజాధిరాజు అని పేరు పెట్టుకుంటే అది దేవుని దృష్టిలో అతి నీచమైన పేరుగా పరిగణించబడుతుంది.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 114వ అధ్యాయం - అబ్గజిల్ అస్మాయి ఇన్దల్లాహ్)

## 5వ అధ్యాయం - పిల్లవాడు పుట్టగానే సత్పురుషుని చేత ఉగ్గు పోయించడం, పుట్టినరోజే పేరు పెట్టడం

1386. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- హజ్రత్ అబూతల్హా (రజి) గారి పిల్లవాడు జబ్బుపడ్డాడు. కాని అప్పుడు అబూతల్హా (రజి) ఏదో ఊరు వెళ్ళి ఉన్నారు. ఆయన తిరిగి వచ్చేలోగా పిల్లవాడు చనిపోయాడు. ఆయన రాగానే బాబు ఎలా ఉన్నాడని అడిగారు. దానికి (ఆయన భార్య) హజ్రత్ ఉమ్మె సలీమ్ (రజి) "బాబు పూర్వం కంటే చాలా ప్రశాంతంగా నిక్షేపంగా ఉన్నాడు" అని అన్నారు. తరువాత ఆమె హజ్రత్ అబూతల్హా (రజి)కు అన్నం వడ్డించారు. ఆయన భోజనం చేశారు. ఆ రాత్రి ఆయన హజ్రత్ ఉమ్మె సలీం (రజి)తో సమాగమం కూడా జరిపారు. అది ముగిసిన తరువాత ఆమె ఆయనతో మాట్లాడుతూ "ఇక వెళ్ళి పిల్లవాడ్ని ఖననం చేసి రండి" అని అన్నారు.

మరునాడు ఉదయం హజ్రత్ అబూతల్హా (రజి) దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి ఆయనకు జరిగిన వృత్తాంతమంతా వివరించారు. దైవప్రవక్త (సల్లం) ఈ సంఘటన విని "రాత్రి నీవు నీ భార్యను కలుసుకున్నావా?" అని అడిగారు. అబూతల్హా (రజి) ఔనన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "దేవా! వీరిద్దరిపై శుభానుగ్రహాలు వర్షింపజెయ్యి" అని ప్రార్థించారు.

ఆ తరువాత కొన్నాళ్ళకు హజ్రత్ ఉమ్మె సలీం (రజి)కు మరో పిల్లవాడు పుట్టాడు. అప్పుడు హజ్రత్ అబూతల్హా (రజి) నాతో (హజ్రత్ అనస్‌తో) "నువ్వీ పిల్లవాడ్ని దైవప్రవక్త (సల్లం) దగ్గరికి తీసికెళ్ళే వరకు కాస్త జాగ్రత్తగా కనిపెట్టుకొని ఉండాలి" అని అన్నారు. తరువాత నేనా పిల్లవాడ్ని దైవప్రవక్త (సల్లం) సన్నిధికి తీసికెళ్ళాను. ఉమ్మె సలీం (రజి) పిల్లవాడి కోసం కొన్ని ఖర్జూర పండ్లు కూడా ఇచ్చి పంపారు. దైవప్రవక్త (సల్లం) పిల్లవాడ్ని వడిలోకి తీసుకొని "ఈ పిల్లవాడి కోసం ఏదైనా తెచ్చావా?" అని అడిగారు. నేను "తెచ్చాను. కొన్ని ఖర్జూర పండ్లున్నాయి" అన్నాను. అప్పుడు దైవప్రవక్త

(సల్లం) ఒక ఖర్జూర పండు తీసుకొని నమిలి దాన్ని పిల్లవాడి నోట్లో పెట్టారు. ఈ విధంగా ఆయన పిల్లవాడికి ఉగ్గుపోసి 'అబ్దుల్లా' అని పేరు పెట్టారు.

**(సహీహ్ బుఖారీ:- 71వ ప్రకరణం - అఖీఖా, 1వ అధ్యాయం - తస్మియతిల్ మౌలూది గదాత యూలద్ లిమన్ లమ్ యవుఖ్ వ తహ్నీకిహీ)**

1387. హజ్రత్ అబూమూసా అష్అరీ (రజి) కథనం:- నాకొక పిల్లవాడు పుడితే నేనతడ్ని తీసుకొని దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళాను. ఆ పిల్లవాడికి ఆయన ఇబ్రాహీం అని పేరు పెట్టారు. ఖర్జూర పండు నమిలి అతని నోట్లో పెట్టారు. పిల్లవాడికి శ్రేయోశుభాలు కలగాలని ప్రార్థన చేసి అతడ్ని తిరిగి నాకిచ్చివేశారు.

ఈ పిల్లవాడే హజ్రత్ అబూ మూసా (రజి) గారి పెద్ద కొడుకు.

**(సహీహ్ బుఖారీ:- 71వ ప్రకరణం - అఖీఖా, 1వ అధ్యాయం - తస్మియతిల్ మౌలూదిగదాత యూలద్ లిమన్ లమ్ యవుఖ్వ తహ్నీకిహీ)**

1388. హజ్రత్ అస్మా (రజి) కథనం:- అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) నా కడుపులో ఉన్నప్పటి సంఘటన. నేను (మదీనాకు వలసపోవడానికి మక్కా నుండి) బయలుదేరినప్పుడు నిండు గర్భవతిగా ఉన్నాను. మదీనా వెళ్తూ ఖుబాలో ఆగినప్పుడు అబ్దుల్లాబిన్ జుబైర్ (రజి) పుట్టాడు. నేను పిల్లవాడ్ని తీసుకొని దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళాను. పిల్లవాడ్ని ఆయన వడిలో పెట్టాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఒక ఖర్జూర పండు తెప్పించి నమిలి అబ్దుల్లా నోట్లో ఉంచారు. ఈ విధంగా అబ్దుల్లా కడుపులో అన్నిటికంటే ముందు పోయిన వస్తువు దైవప్రవక్త (సల్లం) లాలాజలమే. దైవప్రవక్త (సల్లం) మా బాబుకు ఖర్జూరంతో ఉగ్గుపోసి "దేవా! ఈ పిల్లవాడిపై శ్రేయోశుభాలు వర్షింపజెయ్యి" అని ప్రార్థించారు. హిజ్రత్ (వలస) తరువాత మదీనాలో ముస్లింల ఇంట పుట్టిన పిల్లల్లో ఈ అబ్బాయే మొట్టమొదటి అబ్బాయి.

**(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబుల్ అన్సార్, 45వ అధ్యాయం - హిజ్రతిన్నబియ్యి (సల్లం) వ అస్హాబిహీ ఇలల్ మదీనతి)**

1389. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం:- అబూ ఉసైద్ (రజి) కొడుకు మున్జిర్ (రజి) పుట్టినపుడు అతడ్ని దైవప్రవక్త (సల్లం) సన్నిధికి తీసుకు రావడం జరిగింది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఆ పిల్లవాడ్ని తొడమీద కూర్చోబెట్టుకున్నారు. అప్పుడు అబూఉసైద్ (రజి) (ఆయన దగ్గరే) కూర్చుని ఉన్నారు. దైవప్రవక్త (సల్లం) తన ముందు పెట్టబడిన వస్తువును అందుకోవడానికి అటువైపు దృష్టి కేంద్రీకరించారు. అబూఉసైద్ (రజి) అది గమనించి "పిల్లవాడ్ని దైవప్రవక్త (సల్లం) దగ్గర్నుంచి ఎత్తుకోండి" అని అన్నారు. (అక్కడున్న వారు పిల్లవాడ్ని ఎత్తుకున్నారు) తరువాత దైవప్రవక్త (సల్లం) ఆ పని ముగిసిన తరువాత "పిల్లవాడు ఎక్కడున్నాడు?" అని అడిగారు. "దైవప్రవక్తా! పిల్లవాడ్ని ఇంటికి పంపివేశాము" అన్నారు అబూ ఉసైద్ (రజి). "సరే, పిల్లవాడికి పేరేం పెట్టారు?" అడిగారు దైవప్రవక్త (సల్లం). దానికి ఆయన ఫలానా పేరు పెట్టామన్నారు. కాదు, ఆ పిల్లవాడి పేరు మున్జిర్

(అని పెట్టండి)" అన్నారు దైవప్రవక్త (సల్లం). ఆ రోజు నుండి అతనికి మున్‌జిర్ అని పేరు పెట్టబడింది.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 108 వ అధ్యాయం - తహ్‌వీలిల్ ఇస్మి ఇలా ఇస్మిన్ అహ్సన్ మిన్హు)

1390. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ప్రజలందరిలో కెల్లా గొప్ప సుగుణవంతులు. నాకు అబూ ఉమైర్ అనే ఒక తమ్ముడున్నాడు. (చిన్నతనంలో) ఈ పిల్లవాడు దైవప్రవక్త (సల్లం) దగ్గరికి (తరచుగా) పోతుండేవాడు. దైవప్రవక్త (సల్లం) ఆ బాలుడితో "ఏం బాబూ ఉమైర్! నీ బుర్రు పిట్ట ఎలా ఉంది?" అని అడిగేవారు. అబూఉమైర్ (రజి) దగ్గర ఒక ఎర్ర పక్షి ఉండేది. దాంతో అతను ఆడుకునేవాడు.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 112వ అధ్యాయం - అల్‌కున్యతి లిస్సబీ ఖబ్ల అఁయ్యూలద్ లిర్రజులి)

## 7వ అధ్యాయం- ఇంట్లో ప్రవేశించడానికి అనుమతి అడగాలి

1391. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- నేను అన్సారుల సమావేశంలో కూర్చొని ఉండగా అక్కడికి హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) వచ్చారు. చూస్తే ఆయన చాలా విచారం, ఆందోళన పడుతున్నట్లు అన్పించింది. (ఏమిటీ సంగతి అని మేము అడిగాము) (దానికి) ఆయన ఇలా అన్నారు: "నేను హజ్రత్ ఉమర్ (రజి) ఇంట్లో ప్రవేశించడానికి ఆయన్ని మూడుసార్లు అనుమతి అడిగాను. కాని నాకు అనుమతి లభించలేదు. దాంతో నేను (విచారంతో) వెనక్కి తిరిగొచ్చాను. తరువాత ఆయన నన్ను లోపలికి ఎందుకు రాలేదు?" అని అడిగారు. దానికి నేను ఇలా సమాధానమిచ్చాను: "నేను మూడు సార్లు అనుమతి కోసం అడిగాను. కాని నాకు అనుమతి లభించలేదు. అందువల్ల నేను వెళ్ళిపోయాను. ఎవరైనా మూడు సార్లు అనుమతి కోరినప్పుడు అనుమతి లభించకపోతే అతను వెళ్ళిపోవాలని దైవప్రవక్త (సల్లం) సెలవిచ్చార"ని అన్నాను నేను. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) 'అయితే దైవసాక్షి! ఈ హదీసు వాస్తవికతను గురించి నీవు సాక్ష్యమివ్వాలి' అని అన్నారు. దానికి నేను 'మీలో ఎవరైనా దైవప్రవక్త (సల్లం) నోట ఈ ప్రవచనం విన్న వారున్నారా?' అని అడిగాను. అప్పుడు హజ్రత్ ఉబై బిన్ కాబ్ (రజి) (ముందుకు వచ్చి) 'దైవసాక్షి! ఈ సాక్ష్యం కోసం మాలో అతి పిన్న వయస్కుడు కూడా మీ తరపున ఉంటాడు' అని అన్నారు.

వారిలో అందరికంటే అతి పిన్న వయస్కుడ్ని నేనే (అబూ సయీద్). కనుక నేను లేచి వారి వెంట బయలుదేరాను. హజ్రత్ ఉమర్ (రజి) దగ్గరికి వెళ్ళి, దైవప్రవక్త (సల్లం) ఈ మాట చెప్పారని అన్నాను ఆయనతో.

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - ఇస్తియిజాన్, 13వ అధ్యాయం - అత్తస్లీమి వల్ ఇస్తియిజాని సలాసన్)

## 8వ అధ్యాయం - అనుమతి కోరినప్పుడు ఎవరని అడిగితే 'నేను' అనరాదు

1392. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- మా నాన్న చెల్లించవలసిన అప్పు విషయమై (మాట్లాడటానికి) నేను దైవప్రవక్త (సల్లం) ఇంటికి వెళ్ళి తలుపు తట్టాను. దైవప్రవక్త (సల్లం) లోపలి నుంచే 'ఎవరూ?' అని అడిగారు. నేను 'నేనండీ!' అన్నాను. "నేను నేనేంటి?" అన్నారు, నేనలా (పేరు

చెప్పకుండా) అనడం ఆయనకు నచ్చలేదన్నట్లుగా.

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - ఇస్తియిజాన్, 17వ అధ్యాయం - ఇజా ఖాల మన్‌జా? ఫఖాల అనా)

## 9వ అధ్యాయం - ఇతరుల ఇండ్లలో తొంగి చూడరాదు

1393. హజ్రత్ సహెల్ బిన్ సాద్ సాది (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) ఇంటికెళ్ళి తలుపు కన్నంలో నుంచి లోపలికి తొంగి చూడసాగాడు. ఆ సమయంలో దైవప్రవక్త (సల్లం) చేతిలో మొనలు గల ఒక ఇనుప దువ్వెన ఉంది. దాంతో ఆయన తల గోక్కుంటున్నారు. ఆయన తలుపు సందు నుండి తొంగి చూస్తున్న ఆ వ్యక్తిని చూసి "నీవు నన్ను ఇలా తొంగి చూస్తున్నావని తెలిస్తే నేనీ దువ్వెనతోనే కంట్లో పొడిచేస్తాను" అని అన్నారు. ఆ తరువాత అతనితో "ఇలా తొంగి చూడరాదన్న ఉద్దేశ్యంతోనే అనుమతి తీసుకోవాలని ఆదేశించడం జరిగింది" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 89వ ప్రకరణం - అద్దియాత్, 23వ అధ్యాయం - మనిత్తలఅ ఫీబైతి ఖౌమ్ ఫఫఖవూ అయినహూ ఫలాదియత లహూ)

1394. హజ్రత్ అనస్ (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) ఇంట్లోకి (తలుపు సందు నుంచి) తొంగి చూశాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఒక బాణం తీసుకొని ఎలాగైనా అతని కంట్లో పొడవబోతున్నారా అన్నట్లు (దిగ్గున) లేచారు. ఆ దృశ్యం నా మనో వీధిలో ఇప్పటికీ మెదలుతోంది.

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - ఇస్తియిజాన్, 11వ అధ్యాయం - అల్ ఇస్తియిజాను మిన్ అజలిల్ బసర్)

1395. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు:- నీ అనుమతి లేకుండా ఎవరైనా నీ ఇంట్లోకి తొంగి చూస్తే నీవతడ్ని కంకర్రాయి విసరికొట్టు. దానివల్ల అతని కన్ను పోయినా నీ మీద ఎలాంటి నిందరాదు.

(సహీహ్ బుఖారీ:- 87వ ప్రకరణం - అద్దియాత్, 15వ అధ్యాయం - మన్ అఖజ హఖ్ఖహూ అవిఖ్తస్స దూనస్సుల్తాన్)

# సలాం ప్రకరణం

## 1వ అధ్యాయం - వాహనారోహకుడు కాలినడక నడిచే వానికి, తక్కువ మంది ఎక్కువ మందికి సలాం చేయాలి

1396. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- వాహనారోహకుడు కాలినడక నడిచేవానికి, నడిచేవాడు కూర్చున్నవాడికి, తక్కువ మంది ఎక్కువ మందికి సలాం చేయాలి.

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - ఇస్తియిజాన్, 5వ అధ్యాయం - తస్లీముర్రాకిబ అలల్ మాషి)

## 3వ అధ్యాయం - ముస్లింల పరస్పర హక్కులో ఒక ముస్లిం సలాంకు తోటి ముస్లిం ప్రతి సలాం చేయడం కూడా ఉంది

1397. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- ఒక ముస్లింకు మరొక ముస్లింపై అయిదు హక్కులు ఉన్నాయి: (1) సలాంకు ప్రతి సలాం చెప్పడం, (2) జబ్బు పడితే పరామర్శించడం, (3) శవాన్ని సాగనంపడం (శవం వెంట వెళ్ళడం), (4) విందు ఆహ్వానాన్ని అంగీకరించడం, (5) తుమ్ముకు సమాధానమివ్వడం.★

(సహీహ్ బుఖారీ:- 23వ ప్రకరణం - జనాయిజ్, 2వ అధ్యాయం - అల్ అమ్రి బియిత్తిబాయిల్ జనాయిజ్)

## 4వ అధ్యాయం - గ్రంథం కల ప్రజలు చేసే సలాంకు సమాధానం

1398. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు:- గ్రంథం కల ప్రజలు మీకు సలాం చెబితే, మీరు వారికి 'వఅలైకుం' (మీపై కూడా) అని చెప్పండి.

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - ఇస్తియిజాన్, 22వ అధ్యాయం - కైఫయరుద్దు అలా అహ్లిజ్జిమ్మతిస్సలాం)

1399. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- యూదులు మీకెప్పుడైనా సలాం చేస్తే వారిలో ఎవరో ఒకడు 'అస్సాము అలైక్' (నీకు చావు మూడుగాక) అని తప్పకుండా అంటాడు. అప్పుడు మీరు 'వఅలైక్' (నీకు కూడా) అని సమాధానమివ్వండి.

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - ఇస్తియిజాన్, 22వ అధ్యాయం - కైఫయరుద్దు అలా అహ్లిజ్జిమ్మతిస్సలాం)

1400. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- ఓ సారి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి కొందరు యూదులు వచ్చారు. వారు రాగానే "అస్సాము అలైక్" (మీకు చావు మూడుగాక) అన్నారు. నేను వారి ఆగడాలను

---

★ అంటే ఎవరైనా తుమ్మి "అల్‌హమ్దులిల్లాహ్" అంటే దానికి సమాధానంగా "యర్‌హముకల్లాహ్" అని చెప్పాలి.

గ్రహించి 'అలైకుముస్సామ్ వల్లానత్' (మీకేచావు మూడు గాక, మీపై దైవశాపం విరుచుకుపడుగాక!) అని అన్నాను. దైవప్రవక్త (సల్లం) నా మాటలు విని "ఆయిషా! కాస్త ఆగు (అలా అనకు) సమస్త వ్యవహారాల్లో (మనం) మృదు వైఖరి అవలంబించడమంటేనే దేవునికి ఇష్టం" అని అన్నారు. నేనాయనతో "దైవప్రవక్తా! వారేం కూశారో మీరు వినలేదా?" అని అన్నాను. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "నేను కూడా వారికి 'వఅలైకుమ్' అని జవాబిచ్చాను (వినలేదా నువ్వు?)" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - ఇస్తియిజాన్, 22వ అధ్యాయం - కైఫయరుద్దు అలా అహ్లిజ్జిమ్మతిస్సలాం)

## 5వ అధ్యాయం - పిల్లలక్కూడా సలాం చేయడం మంచిది

1401. హజ్రత్ సాబిత్ బనానీ (రహ్మాలై) కథనం:- హజ్రత్ అనస్ (రజి) ఓ సారి పిల్లల దగ్గర్నుంచి పోవడం జరిగింది. అప్పుడాయన పిల్లలకు సలాం చేశారు. ఆ తరువాత వారితో "దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా చేసేవారు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - ఇస్తియిజాన్, 15వ అధ్యాయం - అత్తస్లీమి అలస్సిబ్యాన్)

## 7వ అధ్యాయం - స్త్రీలు బహిర్భూమికి వెళ్ళడం ధర్మసమ్మతమే

1402. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- పరదా ఆజ్ఞ అవతరించిన తరువాత హజ్రత్ సౌదా (రజి) కాలకృత్యాలు తీర్చుకోవడం కోసం ఇంటి నుండి బహిర్భూమికి బయలుదేరారు. ఆమె కొంచెం లావుగా, బొద్దుగా ఉంటారు. అందువల్ల ఆమెను ఎవరు చూసినా (బురఖా ధరించి ఉన్నప్పటికీ) ఇట్టే గుర్తించగలరు. దారిలో ఆమెను హజ్రత్ ఉమర్ (రజి) చూసి "సౌదా! దైవసాక్షిగా చెబుతున్నాను. మీరు మా కళ్ళు గప్పలేరు. ఆలోచించండి. (పరదా ఆజ్ఞ వచ్చిన తరువాత కూడా) మీరు బయటికి ఎలా వెళ్తారు?" అని అన్నారు. హజ్రత్ సౌదా (రజి) ఈ మాట విని ఇంటికి తిరిగెళ్ళారు.

ఆ సమయంలో దైవప్రవక్త (సల్లం) నా ఇంట్లో రాత్రి భోజనం చేస్తున్నారు. ఆయన చేతిలో ఒక ఎముక ఉంది. దాని మీద మాంసం కూడా ఉంది. సరిగ్గా అదే సమయంలో హజ్రత్ సౌదా (రజి) లోపలికి వచ్చి "దైవప్రవక్తా! నేను అవసరంబడి బయటికి వెళ్ళాను. కాని ఉమర్ (రజి) నన్ను చూసి ఈ విధంగా మాట్లాడారు" అని అన్నారు. ఆ వెనువెంటనే దైవప్రవక్త (సల్లం)పై దివ్య సందేశం (వహీ) అవతరించింది. ఆ తరువాత ఆయన తలపైకెత్తి "వినండి! స్త్రీలు తమ అవసరాల కోసం ఇంటి నుంచి బయటకు వెళ్ళవచ్చని అనుమతి వచ్చింది" అని తెలియజేశారు. ఆ సమయంలో కూడా ఆ ఎముక ఆయన చేతిలో అలాగే ఉంది. దాన్ని కంచంలో పెట్టలేదు.★

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - అత్తఫ్సీర్, అహ్జాబ్ సూరా, 8వ అధ్యాయం - ఖౌలిహీ (లా తద్ఖులూ బుయూతన్నబియ్యి))

---

★ ఈ హదీసుని బట్టి స్త్రీలు కాలకృత్యాలు తీర్చుకోవడానికి భర్త అనుమతి లేకుండా మామూలు ప్రదేశాలకు వెళ్ళవచ్చని తెలుస్తోంది అని ఇమామ్ నవవీ (రహ్మాలై) అన్నారు. అరచేతులు, ముఖం కనపడకుండా, చివరికి వస్త్రంలో నుంచి కూడా శరీరం కనబడకుండా ఉండే ఇలాంటి పరదా ప్రవక్త భార్యలకు మాత్రమే పరిమితమని, అయితే వారికి కూడా కాలకృత్యాలు తీర్చుకోవడానికి బయటకి వెళ్ళేందుకు అనుమతి లభించిందని ఖాజీ అయాజ్ (రహ్మాలై) వ్రాస్తున్నారు. అందువల్లనే విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ జైనబ్ (రజి) చనిపోయినప్పుడు ఆమె దేహదారుఢ్యం బహిర్గతం కాకుండా ఉండేందుకు ఆమె మృతదేహంపై ఒక డోమ్ లాంటి వస్తువును ఏర్పాటు చేశారు. (ఇమామ్ నవవీ -రహ్మాలై)

## 8వ అధ్యాయం - అపరిచిత స్త్రీ దగ్గర కూర్చోవడం, ఆమె ఒంటరిగా ఉన్నప్పుడు ఆమె ఇంట్లో ప్రవేశించడం నిషిద్ధం

1403. హజ్రత్ ఉఖ్బా బిన్ ఆమిర్ (రజి) కథనం:- "స్త్రీలు (తమ ఇండ్లలో ఒంటరిగా ఉన్నప్పుడు వారి) దగ్గరికి మీరు వెళ్ళకండి" అన్నారు దైవప్రవక్త (సల్లం). అప్పుడు ఒక అన్సారీ "దైవ ప్రవక్తా! మరి మరిది విషయంలో మీ ఆజ్ఞ ఏమిటి?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) "మరిది మృత్యువు (లాంటివాడు)" అని చెప్పారు.★

(సహీహ్ బుఖారీ:- 67వ ప్రకరణం - నికాహ్, 111వ అధ్యాయం - లా యఖ్లువన్న రజులన్ బిఇమ్రాతిన్ ఇల్లా జూమహ్రమ్ వద్దుఖూల్ అలల్ ముగీబా)

## 9వ అధ్యాయం - పురుషుడు తన భార్య లేక ముహ్రమ్ స్త్రీ దగ్గర ఒంటరిగా ఉన్నప్పుడు ఈమె ఫలానా స్త్రీ అని ఇతరులకు చెప్పాలి

1404. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ సఫియా (రజి) కథనం:- రమజాన్ నెల చివరి దశకంలో దైవప్రవక్త (సల్లం) మస్జిద్‌లో ఏతెకాఫ్ వ్రతం పాటిస్తున్నప్పుడు నేనొకసారి ఆయన్ని చూడటానికి వెళ్ళాను. కాస్సేపు నేను ఆయనతో మాట్లాడుతూ కూర్చున్నాను. తరువాత వెళ్ళిపోవడానికి లేచి నిలబడ్డాను. నన్ను ఇంటి దాకా దిగబెట్టడానికి ఆయన కూడా లేచారు. మేము మస్జిద్ ముఖద్వారం దగ్గరికి, ఉమ్మె సల్మా (రజి) ఇంటి సమీపానికి చేరుకున్నాం. అంతలో ఇద్దరు అన్సారులు మా ముందు నుంచి పోతూ దైవప్రవక్త (సల్లం)కు సలాం చేశారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "కాస్త ఆగండి. ఈమె (నా భార్య) సఫియా బిన్తె హుయ్యి (రజి)" అని అన్నారు. వారిద్దరు (ఆశ్చర్యపోతూ) "సుబ్‌హానల్లాహ్ దైవప్రవక్తా!" అన్నారు తమతో దైవప్రవక్త (సల్లం) అలా అనడం బాగా లేదన్నట్లు. దానికి దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు: షైతాన్ మానవుని శరీరంలో రక్తంలా తిరుగుతుంటాడు. వాడు మీ మనస్సుల్లో లేనిపోని అనుమానమేదైనా కలిగిస్తాడేమోనని భయపడ్డాను. (అందుకే నేను మీతో అలా అన్నాను)."

(సహీహ్ బుఖారీ:- 33వ ప్రకరణం - ఏతెకాఫ్, 8వ అధ్యాయం - హల్ యఖ్రుజుల్ మోతకిఫు లిహవాయి జిహీ ఇలా బాబిల్ మస్జిద్)

## 10వ అధ్యాయం - సమావేశాల్లో చోటుంటే మధ్యలో, లేకుంటే వెనుక కూర్చోవాలి

1405. హజ్రత్ అబూ వాఖిద్ లైసీ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) మస్జిద్‌లో కూర్చొని ఉన్నారు. ప్రజలు కూడా ఆయన దగ్గర (కూర్చొని) ఉన్నారు. అంతలో ముగ్గురు వ్యక్తులు వచ్చారు. ఇద్దరు దైవప్రవక్త (సల్లం) వైపుకు వచ్చారు. ఒకతను వెళ్ళిపోయాడు. వారిద్దరూ దైవప్రవక్త (సల్లం) దగ్గరికొచ్చి

★ మరిది మృత్యువులాంటి వాడంటే, మరిదితో ఒంటరిగా కూర్చోవడం, చనువుగా మాట్లాడటం ఎంతో ప్రమాదకరమైన విషయమని అర్థం. అతని దగ్గర ఒంటరిగా కూర్చోవడం వల్ల అతనితో విచ్చలవిడిగా మాట్లాడటం వల్ల ధర్మపరాయణత ప్రమాదంలో పడే అవకాశముంటుంది. ఈ విధంగా చివరికి వ్యభిచార కూపంలో జారిపడే ప్రమాదం ఉంటుంది. ఆ విధంగా అది శిలాశిక్షకు, మృత్యువుకు కారణ భూతమవుతుంది. లేదా లాన్ (ప్రమాణం చేయడం) ద్వారా ఆమె భర్తనుండి విడిపోయే దుస్థితి వస్తుంది. ఇది కూడా ఆమె పాలిట ఒక విధమైన మృత్యువే. హదీసులో మరిది అంటే భర్త తండ్రీ, కొడుకులు తప్ప ఆ స్త్రీతో వివాహం ధర్మసమ్మతమయ్యే దగ్గరి బంధువులంతా అని భావం. అంటే ఇక్కడ సందర్భాన్ని బట్టి ఈ బంధువులంతా మరిది పరిధిలోకి వస్తారన్నమాట. ఉదాహరణకు, భర్త సోదరులు, ఆ సోదరుల కొడుకులు, భర్త సోదరీల కొడుకులు వగైరా బయటి పర పురుషులకంటే ఈ బంధువుల పట్ల ఆమె చాలా జాగ్రత్తగా మసలు కోవలసిన అవసరముందని ఈ హదీసు సారాంశం. వారి దగ్గర పరదా లేకుండా ఒంటరిగా కూర్చోవడం, వారితో చనువుగా మాట్లాడటం ప్రమాదానికి కారణభూతమవుతాయి. (సంకలన కర్త)

నిల్చున్నారు. వారిలో ఒకతనికి సమావేశం మధ్యలో ఖాళీ స్థలం కన్పించింది. వెంటనే అతనా స్థలంలో కూర్చున్నాడు. రెండవ వ్యక్తి సమావేశం చివరికెళ్ళి కూర్చున్నాడు. కాని మూడో వ్యక్తి తిరిగి వెళ్ళిపోయాడు. దైవప్రవక్త (సల్లం) సమావేశం ముగిసిన తరువాత ఇలా అన్నారు: "నేను మీకు ముగ్గురు మనుషులను గురించి చెప్పనా? వారిలో ఒకడు దేవుని శరణు కోరాడు. దేవుడు అతనికి శరణు (రక్షణ) ప్రసాదించాడు. మరొకడు సిగ్గుపడ్డాడు. దేవుడు కూడా అతని వల్ల సిగ్గుపడ్డాడు. మూడో వ్యక్తి ముఖం చాటేసి వెళ్ళిపోయాడు. దేవుడు కూడా అతని వైపు నుండి ముఖం తిప్పుకున్నాడు. (అంటే అతని వైఖరి పట్ల ఆగ్రహం చెందాడు)."

(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం - ఇల్మ్, 8వ అధ్యాయం - మన్‌ఖాద హైసు యన్తహి బిహిల్ మజ్లిస్)

## 12వ అధ్యాయం - సభలో ఇతరుల్ని లేపి ఆ చోట కూర్చోరాదు

1406. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- మీలో ఎవరూ (సభలో) ఇతరుల్ని లేపి వారి చోటులో కూర్చోకూడదు.[1]

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - ఇస్తియిజాన్, 31వ అధ్యాయం - లా యుఖీముర్రజుల మిమ్మజ్లిసిహీ)

## 13వ అధ్యాయం - నపుంసకుడు అపరిచిత స్త్రీల దగ్గరకు వెళ్ళరాదు

1407. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఓసారి నా దగ్గరకు వచ్చినప్పుడు ఒక నపుంసకుడు మా ఇంట కూర్చొని ఉన్నాడు. అతను అబ్దుల్లా బిన్ ఉమయ్యాతో ఇలా అన్నాడు, "అబ్దుల్లా! రేపు మీకు దేవుడు తాయిఫ్ పట్టణం మీద విజయం ప్రసాదిస్తే గైలాన్ కూతురిని తప్పకుండా చేజిక్కించుకో. (ఆమె ఎంత బొద్దుగా అందంగా ఉంటుందంటే) ఆమె ఎదురుగా వస్తుంటే ఆమె పొట్టమీద నాలుగు ముడతలు కన్పిస్తాయి. వెనక్కి తిరిగి వెళ్తుంటే ఎనిమిది ముడుతలు కన్పిస్తాయి"[2] దైవప్రవక్త (సల్లం) ఈ మాటలు విని "ఇక ముందు ఎన్నడూ నపుంసకుడ్ని నీ దగ్గరకు రానివ్వకు" అన్నారు (నాతో).

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 56వ అధ్యాయం - గజ్వతిత్తాయిఫి ఫీ షవ్వాల్ సనత సమాన్)

## 14వ అధ్యాయం - పర స్త్రీ దారిలో నడుస్తూ అలసిపోతే పురుషుడు తన వాహనమ్మీద వెనుక కూర్చోబెట్టుకోవచ్చు

1408. హజ్రత్ అస్మా బిన్తె అబీ బకర్ (రజి) కథనం:- హజ్రత్ జుబైర్ (రజి)తో నా వివాహం జరిగినప్పుడు ఆయన దగ్గర నీళ్ళు మోసే ఒక ఒంటె, ఒక గుర్రం తప్ప మరెలాంటి ఆస్తులు లేవు. అంటే ఆయన దగ్గర భూములు, డబ్బు, సేవకులు వగైరా ఏమీ లేవు. అందువల్ల గుర్రానికి మేత కూడా నేనే వేసేదాన్ని, నీళ్ళు కూడా నేనే త్రాగించేదాన్ని. బొక్కెనకు మరమ్మత్తు చేయడం, దాంతో నీళ్ళు చేదడం

(1) మస్జిదుల్లో, సభలు సమావేశాల్లో ఒక వ్యక్తి ముందుగా వచ్చి ఒక చోట కూర్చుంటే, ఆ చోటులో కూర్చోవడానికి అతనే అర్హుడు. అందువల్ల ఆ తరువాత వచ్చిన వారు అతడ్ని లేపి ఆ చోటులో కూర్చోవడం నిషిద్ధం అని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. అయితే ఫత్వా జారీ చేయడానికి, ఖుర్ఆన్ పఠించడానికి, చదువు చెప్పడానికి లేదా మరేదైనా పనికోసం ప్రత్యేకించబడిన స్థానాలలో ఇతరులు ఎవరైనా ముందుగా వచ్చి కూర్చుంటే సంబంధిత వ్యక్తులు వారిని లేపి కూర్చోవచ్చని కొందరు ధర్మవేత్తలు అన్నారు.

(ఇమామ్ నవవీ-రహ్మాలై)

(2) ఈ వర్ణన అరబ్బుల స్వభావానికి, అందం ప్రమాణానికి అనుగుణంగా ఉంది. అరబ్బులకు లావుపాటి స్త్రీలంటే ఇష్టం.

కూడా నేనే చేసేదాన్ని. పిండి కూడా నేనే పిసికేదాన్ని. కాని రొట్టెలు తయారు చేయడం నాకు అంతగా రాదు గనక మా పొరుగింటి అన్సారీ స్త్రీలు వచ్చి రొట్టెలు తయారు చేసేవారు. ఆ స్త్రీలు ఎంతో మంచివాళ్ళు. జుబైర్ (రజి) గారికి దైవప్రవక్త (సల్లం) ప్రదానం చేసిన ఒక పంట భూమి నుండి నేను టెంకాయలు (విత్తనాలు) ఏరి తలమీద పెట్టుకొని మోసుకొచ్చేదాన్ని. ఆ పంట భూమి మా ఇంటి నుంచి రెండు మైళ్ళ దూరంలో ఉంది. ఒక రోజు నేను టెంకాయలు మోసుకొస్తుంటే దారిలో దైవప్రవక్త (సల్లం) ఎదురయ్యారు. ఆయన వెంట కొంతమంది అన్సారులు కూడా ఉన్నారు. ఆయన నన్ను పిలిచి హైహై అంటూ తమ ఒంటెను కూర్చోబెట్టారు నన్ను దాని మీద తమ వెనుక కూర్చోబెట్టేందుకు. కాని పురుషుల వెంట వెళ్ళాలంటే నాకు సిగ్గేసింది. అదీగాక నాకు జుబైర్ (రజి)గారు, ఆయన ఆత్మాభిమానం కూడా గుర్తొచ్చాయి. ఆయన చాలా ఆత్మాభిమానం గల మనిషి. దైవప్రవక్త (సల్లం) నేను సిగ్గుపడుతున్నానని గ్రహించి ముందుకు సాగారు.

ఆ తరువాత నేనీ సంఘటన గురించి జుబైర్ (రజి) గారి ముందు ప్రస్తావిస్తూ ఇలా అన్నాను: "నేను తలమీద టెంకాయలు మోసుకొస్తుంటే దారిలో దైవప్రవక్త (సల్లం) తారసపడ్డారు. ఆయన వెంట కొందరు అనుచరులు కూడా ఉన్నారు. ఆయన నన్ను ఒంటె మీద ఎక్కించుకోవడానికి తమ ఒంటెను కూర్చోబెట్టారు. కాని నేను సిగ్గుతో అలా చేయలేకపోయాను. మీ ఆత్మాభిమానం కూడా గుర్తొచ్చింది."

దీనికి హజ్రత్ జుబైర్ (రజి) స్పందిస్తూ "నువ్వు ఒంటె మీద దైవ ప్రవక్త (సల్లం) వెనుక కూర్చొని రావడం కంటే టెంకాయలు మోసుకొని (ఒంటరిగా నడచి) రావడమే నాకు బాధాకరంగా ఉంది" అని అన్నారు. ఆ తరువాత కొంత కాలానికి (మా నాన్న) అబూబకర్ (రజి) గారు నాకొక సేవకుడ్ని ఇచ్చారు. ఆ సేవకుడు మా గుర్రం అవసరాలన్నీ తీర్చుతూ నాకాశ్రమ నుండి విముక్తి కలిగించాడు.

**(సహీహ్ బుఖారీ:- 67వ ప్రకరణం - నికాహ్; 107వ అధ్యాయం - అల్‌గైరా)**

## 15వ అధ్యాయం - ముగ్గురు ఉన్నప్పుడు ఇద్దరు ఒకడ్ని వదలి పరస్పరం రహస్య మంతనాలు జరుపుకోవడం నిషిద్ధం

1409. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ముగ్గురు ఉన్నప్పుడు వారిలో ఇద్దరు వ్యక్తులు మూడోవాడ్ని విస్మరించి పరస్పరం రహస్య మంతనాలు జరుపుకోకూడదు.

**(సహీహ్ బుఖారీ:- 79 వ ప్రకరణం - ఇస్తియిజాన్, 45 వ అధ్యాయం-లా యతనాజ ఇస్నాని దూనస్సాలిస్)**

1410:- హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- మీరు ముగ్గురు ఉన్నప్పుడు వారిలో ఇద్దరు మూడోవాడ్ని విస్మరించి పరస్పరం రహస్య మంతనాలు జరుపుకోకూడదు. ఈ వైఖరి వల్ల అతనికి బాధ కలుగుతుంది. అయితే మరి కొందరు వచ్చి మీతో చేరిపోతే ఫరవాలేదు.

**(సహీహ్ బుఖారీ:- 79 వ ప్రకరణం - ఇస్తియిజాన్, 47 వ అధ్యాయం-ఇజా కానూ అక్సర మిన్ సలాసతిన్ ఫలా బాస బిల్ ముసారతి వల్ మునాజాత్)**

# వ్యాధులు-వైద్యం

## 16వ అధ్యాయం - వ్యాధులు, వాటి వైద్యం, మంత్రించడం

1411. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- "దిష్టి తగలడం వాస్తవమే".

**(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 36వ అధ్యాయం-అల్ఐను హఖ్)**

## 17వ అధ్యాయం - చేతబడి (జాదు), బాణామతి

1412. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం)కు చేతబడి చేయబడింది. దాని ప్రభావం వల్ల ఆయన తన భార్యలను కలుసుకోకపోయినా కలుసుకున్నానేమోనని అనుమానించేవారు - ఈ హదీసు ఉల్లేఖకుల్లో హజ్రత్ సుఫ్యాన్ (రహ్మాలై) దీనిపై వ్యాఖ్యానిస్తూ, "ఎవరికైనా ఇలాంటి పరిస్థితి వస్తే అది చాలా తీవ్రమైన చేతబడి అని భావించాలి" అని అన్నారు - తరువాత దైవప్రవక్త (సల్లం) నాతో (అంటే హజ్రత్ ఆయిషా (రజి)తో) ఇలా అన్నారు: ఆయిషా! నీకు తెలుసా? నేను దేవుణ్ణి ఈ బాధ నుండి విముక్తి కలిగించమని వేడుకుంటే ఆయన దీనికి పరిష్కార మార్గం చూపించాడు. (కలలో) నా దగ్గరికి ఇద్దరు వ్యక్తులు వచ్చారు. వారిలో ఒకడు నా తలవైపు, మరొకడు నా కాళ్ళవైపు కూర్చున్నాడు. తలవైపు కూర్చున్నవాడు "ఇతనికి ఏమయింది?" అని అడిగాడు రెండవ వ్యక్తిని. "ఇతనికి చేతబడి చేశారు" అన్నాడు రెండవ వ్యక్తి. "ఎవరు చేశారు?" అడిగాడు మొదటి వ్యక్తి. "లుబైద్ బిన్ ఆసిమ్ చేశాడు" అన్నాడు రెండవ వ్యక్తి. (లుబైద్, బనీ జరఖ్ తెగకు చెందిన వాడు, కపట విశ్వాసి, యూదుల పక్షపాతి). "ఈ చేతబడి ఎందులో చేశాడు?" మొదటి వ్యక్తి ప్రశ్నించాడు. "దువ్వెన, దువ్వెనతో రాలిన వెంట్రుకలలో" సమాధానమిచ్చాడు రెండవ వ్యక్తి. "ఎక్కడ చేశాడు?" అడిగాడు మొదటి వ్యక్తి. "పోతు ఖర్జూరపు గుత్తి పొరలో పెట్టి జర్వాన్ బావిలో ఒక రాతి క్రింద అదిమి పెట్టాడు" అన్నాడు రెండవ వ్యక్తి.

ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) చేతబడిని (వస్తువుల్ని) తీసి వేయించడానికి (అనుచరుల్ని వెంట బెట్టుకొని) ఆ బావి దగ్గరకు వెళ్ళారు. "నాకు (కలలో) చూపించబడిన బావి ఇదే" అన్నారు ఆయన. ఆ బావిలోని నీరు గోరింటాకు రంగులా (ఎర్రగా) మారిపోయింది. అక్కడి ఖర్జూర చెట్లు కూడా పిశాచ తలలు మాదిరిగా తయారయిపోయాయి. దైవప్రవక్త (సల్లం) ఆజ్ఞతో ఆ బావిలోని చేతబడి (వస్తువుల)ని తీసివేయడం జరిగింది. ఆ తరువాత నేను దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ "మీరు చేతబడికి విరుగుడు ఎందుకు చేయలేదు?" అని అడిగాను. దానికి ఆయన సమాధానమిస్తూ, "దైవసాక్షి! దేవుడు నాకు స్వస్థత చేకూర్చినప్పుడు, నేను అనవసరంగా ఇతరుల మీద లంఘించి జనంలో అలజడి సృష్టించడం బాగుండదు. అలా చేయడం నాకిష్టం లేదు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 49వ అధ్యాయం - హల్ యుస్తఖ్ రజుస్సిహ్ర్)**

## 18వ అధ్యాయం - విష ప్రయోగం

1413. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- ఒక యూద స్త్రీ విషం కలిపిన మేక మాంసం తీసుకొని దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చింది. దైవప్రవక్త (సల్లం) (విషం సంగతి తెలియక) ఆ మాంసాన్ని కొద్దిగా తిన్నారు. తరువాత ఆ స్త్రీని (బంధించి) దైవప్రవక్త (సల్లం) దగ్గరకు తీసుకు వచ్చారు. అప్పుడు ఒక వ్యక్తి "ఈమెను మీరు చంపి వేయించరా?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) "చంపి వేయించను" అన్నారు.

ఆ విషం ప్రభావం దైవప్రవక్త (సల్లం) అంతర్గళంలో ఎల్లప్పుడూ ఉండటం నేను గమనించాను.

(సహీహ్ బుఖారీ:- 51వ ప్రకరణం - హిబా, 28వ అధ్యాయం - ఖుబూలిల్ హదియ్యతి మినల్ ముష్రికీన్)

## 19వ అధ్యాయం - రోగి స్వస్థత కోసం మంత్రించడం

1414. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఏ రోగి దగ్గరకైనా వెళ్తే లేదా రోగే తన దగ్గరకు రావడం జరిగితే (ఆ రోగి స్వస్థత కోసం) ఆయన దేవుడ్ని ఇలా ప్రార్థిస్తారు: "మానవుల ప్రభూ! (ఇతని) బాధను దూరం చెయ్యి. (ఇతనికి) స్వస్థత చేకూర్చు. స్వస్థత చేకూర్చే వాడవు నీవే. నీవు తప్ప మరెవ్వరూ స్వస్థత చేకూర్చే వారు లేరు. వ్యాధి ఏ మాత్రం మిగలకుండా పూర్తి స్వస్థత చేకూర్చు."

(సహీహ్ బుఖారీ:- 75వ ప్రకరణం - అల్‌మర్జా, 20వ అధ్యాయం - దుఆయిల్ ఆయిదిలిల్ మరీజ్)

## 20వ అధ్యాయం - రోగి మీద 'ముఅవ్విజాత్' పఠించి ఊదడం

1415. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఎప్పుడైనా జబ్బుపడితే ముఅవ్విజాత్ (ఖుల్‌హు వల్లాహు అహద్; ఖుల్ అవూజు బిరబ్బిల్ ఫలఖ్; ఖుల్ అవూజు బిరబ్బిన్నాస్) సూరాలు పఠించి తమపై ఊదుకునేవారు. (కొన్నాళ్ళకు) ఆయన (ప్రాణ సంకట వ్యాధికి గురయ్యారు) వ్యాధి తీవ్రరూపం దాల్చినప్పుడు, నేనే ముఅవ్విజాత్ సూరాలు పఠించి, ఆయన చేతిలో ఊది ఆ చేత్తోనే శ్రేయోశుభాల కోసం ఆయన శరీరాన్ని స్పృశింప జేస్తుండేదాన్ని.

(సహీహ్ బుఖారీ:- 66వ ప్రకరణం - ఫజాయిలె ఖుర్ఆన్, 14వ అధ్యాయం - అల్ ముఅవ్విజాత్)

## 21వ అధ్యాయం - దిష్టి తగిలితే, విష పురుగులు కుట్టితే మంత్రించడం అభిలషనీయం

1416. హజ్రత్ అస్వద్ బిన్ యజీద్ (రహ్మలై) కథనం:- నేనొక సారి విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి)ను విష పురుగులు కుట్టినప్పుడు మంత్రించడం గురించి అడిగాను. దానికి ఆమె సమాధానమిస్తూ "విష పురుగుల కాటుకు మంత్రించవచ్చని దైవప్రవక్త (సల్లం) అనుమతి ఇచ్చారు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 37వ అధ్యాయం - రుఖ్యతిల్ హయ్యతి వల్ అఖ్రబ్)

1417. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రార్థించి రోగిపై ఊదేవారు - "బిస్మిల్లాహి తుర్బతు అర్జినా బిరీఖతి బాజినా, యష్ఫీ సఖీమినా, బియిజ్ని రబ్బినా"

(దేవుని పేరుతో, మా నేల మట్టి మాలో ఒకరి లాలాజలంతో కలసి తద్వారా మా ప్రభువు ఆజ్ఞతో మా రోగికి స్వస్థత చేకూరుతుంది.)

(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 38వ అధ్యాయం - రుఖ్యతిన్నబియ్యి (సల్లం))

1418. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఆదేశించారు - లేక నన్నీవిధంగా ఆదేశించారు - "దిష్టి తగిలితే దానికి మంత్రించి ఊదాలి".

(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం, తిబ్, 35వ అధ్యాయం - రుఖ్యతిల్ ఐన్)

1419. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) నా ఇంట్లో ఒక అమ్మాయిని చూశారు. ఆమె ముఖంపై నల్లని మచ్చలు ఏర్పడి ఉన్నాయి. దైవప్రవక్త (సల్లం) అది చూసి "ఈ పాపకు దిష్టి తగిలింది, మంత్రించి ఊదండి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 35వ అధ్యాయం - రుఖ్యతిల్ ఐన్)

## 23వ అధ్యాయం - ఖుర్ఆన్ సూక్తుల పఠనంతో వైద్యం చేసి ప్రతిఫలం తీసుకోవడం ధర్మసమ్మతమే

1420. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) అనుచరులు కొందరు ప్రయాణమయి, ఒక అరబ్ తెగ ఉండే ప్రాంతానికి వెళ్ళి విడిది చేశారు. వారు ఆ తెగవాళ్ళను (అరబ్ సంప్రదాయం ప్రకారం) తమకు ఆతిథ్యం ఇవ్వవలసిందిగా అడిగారు. కాని ఆ తెగ ప్రజలు వారికి ఆతిథ్యమివ్వడానికి నిరాకరించారు.

ఆ తరువాత ఆ తెగ నాయకునికి తేలు కుట్టడమో, పాము కరవడమో జరిగింది. వారు చికిత్స కోసం ఉరుకులు పరుగులు పెట్టి ఎన్ని ప్రయత్నాలు చేసినా ప్రయోజనం లేకపోయింది. చివరికి వారిలో కొందరు మాట్లాడుతూ "ఇక్కడి కొచ్చి బస చేసిన వారిని అడగండి. వారిలో ఎవరి దగ్గరయినా మంత్రమో తంత్రమో ఉండవచ్చు" అని అన్నారు. వెంటనే ఆ తెగవాళ్ళు కొందరు ప్రవక్త అనుచరుల దగ్గరికి వచ్చి "మిత్రులారా! మా నాయకునికి పాము కరిచింది (లేక తేలుకుట్టింది). మేము ఎన్ని రకాల వైద్యం చేసినా ప్రయోజనం కలుగలేదు. (దాని కోసం) మీలో ఎవరి దగ్గరైనా ఏదైనా ఉందా?" అని అడిగారు. దానికి ప్రవక్త అనుచరుల్లో ఒకడు "దైవసాక్షి! నా దగ్గర ఉంది. నేనతడ్ని మంత్రిస్తాను. కాని మేము మిమ్మల్ని ఆతిథ్యం అడిగితే మీరు మాకు ఆతిథ్యం ఇవ్వలేదు. అందువల్ల మీరేదయినా ప్రతిఫలం నిర్ణయిస్తే తప్ప నేను మీ నాయకునికి వైద్యం చేయలేను" అని అన్నాడు. చివరికి కొన్ని మేకలను ప్రతిఫలంగా ఇవ్వడానికి నిర్ణయం జరిగింది. అప్పుడా వ్యక్తి వారి వెంట వెళ్ళి ఫాతిహా సూరా పఠించి అతనిపై మంత్రించాడు. దాంతో అతను ఒక్కసారిగా బంధ విముక్తుడయి పోయినట్లు లేచి నడవసాగాడు. బాధ ఏ మాత్రం కూడా లేకుండా పోయింది.

ఆ తెగవాళ్ళు నిర్ణీత ప్రతిఫలం పూర్తిగా వారికి చెల్లించారు. ప్రవక్త అనుచరుల్లో కొందరు "మనమీ ప్రతిఫలాన్ని పంచుకుందాం" అన్నారు. కాని మంత్రంపెట్టిన వ్యక్తి (ఆ మాటకు

అంగీకరించకుండా) "మనం దైవప్రవక్త (సల్లం) దగ్గరి కెళ్ళి, జరిగిన వృత్తాంతమంతా వివరించి దానిపై ఆయన ఏం నిర్ణయిస్తారో చూడనంత వరకు ఈ ప్రతిఫలాన్ని మనం పంచుకోకూడదు" అని అన్నాడు. చివరికి వారు దైవప్రవక్త (సల్లం) సన్నిధికి తిరిగొచ్చి ఆయనకు జరిగిన వృత్తాంతమంతా తెలియజేశారు. దైవప్రవక్త (సల్లం) ఈ సంఘటన విని "ఫాతిహా సూరా మంత్రించడానిక్కూడా పనికొస్తుందని మీకెలా తెలిసింది? సరే మీరు చేసింది బాగానే ఉంది. ఆ మేకలను మీరు పంచుకోండి. దాంతో పాటు నా వాటా కూడా తీయండి" అని అన్నారు. ఈ మాట అంటూ ఆయన మనసారా నవ్వారు.

(సహీహ్ బుఖారీ:- 37వ ప్రకరణం - ఇజారా, 16వ అధ్యాయం - మాయూతాఫిర్రుఖ్యతి అలా అహ్యాయిల్ అరబి బిఫాతిహతిల్ కితాబ్)

## 26వ అధ్యాయం - ప్రతి వ్యాధికీ మందుంది. వైద్యం చేయడం మంచి పని

1421. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు:- మీ మందులలో, రోగ చికిత్సా ప్రయత్నాలలో ఏదైనా ప్రయోజనం ఉందంటే అది ఈ మందుల్లో, ప్రయత్నాల్లో ఉంది, (1) శస్త్ర చికిత్స ద్వారా చెడు రక్తం తొలగించడం, (2) తేనెను సేవించడం, (3) వాతలు పెట్టడం, కాని వాతలు పెట్టే ప్రక్రియ అంటే నాకిష్టం లేదు.★

(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 4వ అధ్యాయం - అద్దవాయి బిల్ అస్ల్)

1422. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) శస్త్ర చికిత్స ద్వారా చెడు రక్తాన్ని తొలగించుకున్నారు. అలాంటి చికిత్స చేసిన వారికి దాని ప్రతిఫలం ముట్టజెప్పారు.

(సహీహ్ బుఖారీ:- 37వ ప్రకరణం, -ఇజారా, 18వ అధ్యాయం - ఖరాజిల్ హజ్జామ్)

1423. హజ్రత్ అనస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) శస్త్ర చికిత్స ద్వారా చెడు రక్తం తొలగించుకునే వారు (దానికి ప్రతిఫలం చెల్లించేవారు). ఆయన ఎవరి ప్రతిఫలం కూడా తమ దగ్గర ఉంచుకునేవారు కాదు.

(సహీహ్ బుఖారీ:- 37వ ప్రకరణం - ఇజారా, 18వ అధ్యాయం - ఖరాజిల్ హజ్జామ్)

1424. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు:- జ్వరం నరకాగ్ని ప్రజ్వలన ప్రభావం. కనుక దాన్ని నీటితో చల్లార్చండి.

(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్యిల్ ఖల్ఖ్, 10వ అధ్యాయం - సిఫతిన్నారి వ అన్నహామఖ్లూఖా)

1425. హజ్రత్ ఫాతిమా బిన్తె ముంజిర్ (రజి) కథనం:- హజ్రత్ అస్మా (రజి) దగ్గరికి వైద్యం కోసం జ్వరంతో ఉన్న స్త్రీ నెవరినైనా తీసుకురావడం జరిగితే, ఆమె నీళ్ళు తీసుకొని ఆ స్త్రీ ఎదబట్టపై

★ ఇమామ్ నవవీ (రహ్మలై) వ్యాఖ్యానం ప్రకారం ఈ హదీసులో వైద్యుల దృష్టితో ఒక విచిత్రమైన వైద్య దృక్పథాన్ని గురించి చెప్పడం జరిగింది. సాధారణంగా వ్యాధులు అజీర్తి, శరీరస్రావాల మార్పు వల్ల వస్తాయి. ఉదాహరణకు, రక్తాధిక్యత, పైత్యోద్రేకం, వాతం, కఫం, తదితర కారణాల వల్ల మనిషి వ్యాధిగ్రస్తుడవుతాడు. శ్వాసకోశ వ్యాధి వల్ల అనారోగ్యం పాలయితే శస్త్ర చికిత్స ద్వారా లేదా మరేదైనా పద్ధతి ద్వారా చెడురక్తం తొలగించవలసి ఉంటుంది. ఇతర స్రావాల మార్పువల్ల జబ్బు పడితే భేది వైద్యం చేయాలి. దానికోసం నీటిలో తేనె కలిపి ఒక పద్ధతి ప్రకారం మందు తయారు చేసి వాడాలి. ఈ రెండు విధానాల వల్ల కూడా వ్యాధి నయం కాకపోతే చివరి ప్రయత్నంగా వాత పెట్టవలసి ఉంటుంది. కాని ఈ పద్ధతి దైవప్రవక్త (సల్లం) కు ఇష్టంలేదు. (అనువాదకుడు)

చిలికించేవారు. ఆ తరువాత "జ్వరాన్ని నీళ్ళతో చల్లార్చాలని దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని ఆదేశించే వారు" అని చెప్పేవారు.

(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 28వ అధ్యాయం - అల్ హుమ్మామిన్ ఫైహి జహన్నమ్)

1426. హజ్రత్ రాఫె బిన్ ఖదీజ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఉపదేశించారు:- జ్వరం నరకాగ్ని ప్రజ్వలన ప్రభావం. కనుక దాన్ని నీటితో చల్లబరచండి.

(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 28వ అధ్యాయం - అల్‌హుమ్మామిన్ ఫైహి జహన్నమ్)

## 27వ అధ్యాయం - రోగి నోట్లో మందు బలవంతంగా పోయరాదు

1427. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) జబ్బుపడినప్పుడు మేము ఆయన నోటిలో మందు పోశాము. కాని ఆయన ఈ విధంగా మందు పోయకండని సైగ చేస్తూ మమ్మల్ని వారించారు. సాధారణంగా ప్రతి రోగికి మందు తినడం ఇష్టముండదు. అలాగే దైవప్రవక్త (సల్లం) కూడా తమకు మందు తీసుకోవడం ఇష్టం లేకనే మమ్మల్ని వారించారని మేము భావించాము. అయితే ఆయన ఆరోగ్యం కుదుటబడిన తరువాత "ఈ విధంగా మందు త్రాగించవద్దని నేను మిమ్మల్ని వారించ లేదా?" అని అన్నారు. "ప్రతి రోగి మందు తీసుకోవడానికి ఇష్టంలేక వారించినట్లే మీరు కూడా వారించారని మేము అనుకున్నాం" అన్నాము మేము. అప్పుడు దైవప్రవక్త (సల్లం), అయితే ఇంట్లో ఎంతమంది ఉన్నారో అందరి నోళ్ళలో మందు పోయండి అబ్బాస్ (రజి) తప్ప" అని అన్నారు. హజ్రత్ అబ్బాస్ (రజి) ఆ సమయంలో ఇంట్లో లేరు గనక (ఆయన్ని మినహాయించారు).

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 83వ అధ్యాయం - మరజిన్నబియ్యి (సల్లం) వ వఫాతిహీ)

## 28వ అధ్యాయం - ముసాంబరంతో వైద్యం

1428. హజ్రత్ ఉమ్మె ఖైస్ బిన్తె ముహ్సిన్ (రజి) కథనం:- నేనొకసారి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి ఇంకా (ధాన్యపు) అన్నం తిననటువంటి ఒక పసిపిల్లవాడ్ని తీసుకొని వెళ్ళాను. దైవప్రవక్త (సల్లం) ఆ పిల్లవాడ్ని తీసుకొని వడిలో కూర్చోబెట్టుకున్నారు. అంతలో ఆ పసివాడు ఆయన బట్టలపై మూత్రం పోశాడు. అప్పుడు ఆయన నీళ్ళు తెప్పించి బట్టలు జాడించి కడిగివేశారు.*

(సహీహ్ బుఖారీ:- 4వ ప్రకరణం -వుజూ, 59వ అధ్యాయం - బౌలిస్సిబ్యాన్)

1429. హజ్రత్ ఉమ్మె ఖైస్ బిన్తె ముహ్సిన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- మీరు తప్పకుండా ముసాంబరం వాడండి. అందులో ఏడు రోగాలకు చికిత్స ఉంది.

---

★ ఈ హదీసు పై శీర్షికకు అనుగుణంగా లేకపోయినప్పటికీ దాని క్రింద చేర్చడానికి కారణం ఈ హదీసు, దీని తరువాత ఉన్న హదీసు (నెం. 1429) రెండు ఒకే హదీసులోని రెండు అంశాలు కావడమే. 1429వ హదీసు శీర్షికకు అనుగుణమయినది. అయితే ఇమామ్ బుఖారీ (రహ్మాలై) ఈ రెండింటిని వేర్వేరు ప్రకరణాలలో పేర్కొన్నారు. అంటే 1428 వ హదీసుని ఉజూ ప్రకరణంలో, 1429 వ హదీసుని వైద్య ప్రకరణంలో పేర్కొన్నారు. ఈ గ్రంథం సంకలన కర్త తన గ్రంథంలో హదీసు మూలం (Text) ను బుఖారీ గ్రంథంనుంచి, విషయ సూచికను ముస్లిం గ్రంథం నుంచి తీసుకున్నారు. ఇమామ్ బుఖారీ (రహ్మాలై) హదీసులోని రెండు అంశాలను, వేర్వేరు ప్రకరణాల్లో పేర్కొంటే, ఇమామ్ ముస్లిం (రహ్మాలై) ఆ రెండు అంశాలను కలిపి ఒక హదీసుగా ఒకేచోట సలామ్ ప్రకరణంలో పేర్కొన్నారు.

గొంతు వాపు వ్యాధికి దాన్ని ముక్కులోకి పీల్చాలి, న్యుమోనియా వ్యాధికి దాన్ని త్రాగించాలి.

(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 10వ అధ్యాయం - అస్సువూతి బిల్ ఖుస్తిల్ హిందీ అల్ బహ్రి వహువల్ కస్తు)

## 29వ అధ్యాయం - నల్ల జీలకర్రను మందుగా వాడటం గురించి

1430. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- నల్ల జీలకర్రలో మరణానికి తప్ప ప్రతి వ్యాధికీ చికిత్స ఉంది.

(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 7వ అధ్యాయం - అల్‌హబ్బతిస్సౌదా)

## 30వ అధ్యాయం - తల్బీన రోగి మనస్సుకు సుఖాన్నిస్తుంది

1431. హజ్రత్ ఉర్వా బిన్ జుబైర్ (రజి) కథనం:- హజ్రత్ ఆయిషా (రజి) బంధువుల్లో ఎవరైనా చనిపోయినప్పుడు స్త్రీలు గుమికూడుతారు. తరువాత వారంతా వెళ్ళిపోయి ముఖ్యమైన మహిళలు, కుటుంబసభ్యులు మాత్రమే ఉండిపోయినప్పుడు హజ్రత్ ఆయిషా(రజి) ఒక కుండలో 'తల్బీనా' (1) తయారు చెయ్యమని చెప్పేవారు. దాని ప్రకారం తల్బీనా వంట తయారవుతుంది. ఆ తరువాత 'సరీద్' తయారు చేసి తల్బీనాలో కలుపుతారు. అప్పుడు హజ్రత్ ఆయిషా (రజి) ఆ సమయంలో ఉన్న స్త్రీలను "ఇక తినండి, తల్బీనా రోగి మనస్సుకు సుఖాన్నిచ్చి అతని బాధ, విచారం దూరం చేస్తుందని దైవప్రవక్త (సల్లం) చెప్పగా నేను విన్నాను" అని చెప్పేవారు.

(సహీహ్ బుఖారీ:- 70వ ప్రకరణం, అత్‌యిమ, 24వ అధ్యాయం - అత్తల్బీనా)

## 31వ అధ్యాయం - తేనెతో వైద్యం

1432. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరకు వచ్చి "నా సోదరుడు కడుపునొప్పితో బాధపడుతున్నాడు" అని అన్నాడు. దానికి దైవప్రవక్త (సల్లం) "అయితే అతనికి తేనె త్రాగించు" అని చెప్పారు. ఆ వ్యక్తి మళ్ళీ వచ్చాడు (కడుపు నొప్పి తగ్గలేదంటూ). దైవప్రవక్త (సల్లం) తిరిగి "అతనికి తేనె త్రాగించు" అని చెప్పారు. ఆ వ్యక్తి మూడోసారి వచ్చాడు (నొప్పి తగ్గలేదంటూ). దైవప్రవక్త (సల్లం) మళ్ళీ అతనికి తేనె త్రాగించమనే చెప్పారు. అతను నాల్గవసారి వచ్చి "నేనతనికి తేనె త్రాగించాను (కాని నొప్పి తగ్గలేదు)" అని అన్నాడు. "దేవుడు నిజమే చెప్పాడు. నీ సోదరుని కడుపే అబద్ధమాడుతోంది (వెళ్ళు) అతనికి తేనె త్రాగించు" అన్నారు దైవప్రవక్త (సల్లం). ఆ వ్యక్తి తేనె త్రాగించాడు మళ్ళీ. దాంతో అతని సోదరునికి స్వస్థత చేకూరింది.(2)

(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 4వ అధ్యాయం - అద్దవాయి బిల్ అస్లి)

---

(1) తల్బీనా అంటే ఒక విధమైన అంబలి అని అర్థం. ఇది గోధుమపిండి, లేకా గోధుమ పొట్టుకు మైదాపిండి చేర్చితయారు చేస్తారు. ఒకోసారి అందులో తేనె కూడా కలుపుతారు. ఇలా తయారయిన వంటకం పాలవలె ఉంటుంది గనుక దీన్ని తల్బీనా అంటారు. సరీద్ అంటే షేర్వాలో రొట్టె ముక్కలు కలపగా తయారయ్యే ఖాద్య పదార్థం. ఇందులో మాంసం, పప్పు కూరగాయలు కూడా కలుపుతారు. (సంకలన కర్త)

(2) తేనెలో స్వస్థత ఉంది. దివ్యఖుర్‌ఆన్ ఇది 'మానవులకు స్వస్థత' అని పేర్కొన్నది. తేనె విరేచనకారి అయినప్పటికీ విరేచనం విరేచనకారి ద్వారానే అరికట్టబడుతుంది. ఈ పని తేనె బాగా చేస్తుంది. అందువల్ల తేనె తినడం వల్ల మొదట విరేచనాలు ఎక్కువయి చివరికి మలమంతా పోయి విరేచనాలు పూర్తిగా తగ్గిపోతాయి. ఈ చికిత్స వైద్య విధానానికి అనుగుణమైనది. ఈ పద్ధతి గురించి కువిమర్శ చేసేవాడు అజ్ఞాని మాత్రమేగాక నాస్తికుడు కూడా అనబడతాడు. (ఇమామ్ నవవీ-రహ్మాలై)

## 32వ అధ్యాయం - ప్లేగు, దుశ్శకునం, జాతకం చెప్పించుకోవడం గురించి

1433. హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు:- "ప్లేగు వ్యాధి బనీ ఇస్రాయీల్ ప్రజలపై లేక మీ పూర్వీకులపై విరుచుకుపడిన శిక్ష. కనుక వినండి, ప్లేగు వ్యాధి ప్రబలి ఉన్న ప్రాంతానికి వెళ్ళకండి. ఒకవేళ మీరు నివసిస్తున్న ప్రాంతంలోనే ప్లేగు వ్యాధి ప్రబలితే దాన్నుండి పారిపోవడానికి ఆ ప్రాంతం వదలి వెళ్ళకండి. (మరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది): మీరు ప్లేగు వ్యాధి నుండి పారిపోయే ఉద్దేశ్యంతో అక్కడ్నుంచి వెళ్ళిపోకండి".

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం, అంబియా, 54వ అధ్యాయం - హద్దసనా అబుల్ యమాన్)

1434. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- ఖలీఫా హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) సిరియా పర్యటన కోసం బయలుదేరి 'సర్గ్' ప్రాంతానికి చేరుకున్నారు. అక్కడ సైన్యాధ్యక్షుడు హజ్రత్ అబూ ఉబైదా బిన్ జిరాహ్, తన సహచరులతో పాటు వచ్చి ఆయన్ని కలుసు కున్నారు. "సిరియా ప్రాంతంలో అంటువ్యాధి ప్రబలి ఉంద"ని ఆయన హజ్రత్ ఉమర్ (రజి)కు తెలియజేశారు. హజ్రత్ ఉమర్ (రజి) (ఈ మాట విని) "తొలి ముహాజిర్‌లను నా దగ్గరకు పిలుచుకురండి" అన్నారు. ముహాజిర్‌లను పిలుచుకువచ్చారు. హజ్రత్ ఉమర్ (రజి) వారికి , సిరియాలో అంటువ్యాధి వ్యాపించిందని తెలియజేశారు. (పరిస్థితిని సమీక్షించడానికి) ఆయన వారిని సంప్రదించారు.

అప్పుడు భిన్నాభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. కొందరు తమ అభిప్రాయం వెలిబుచ్చుతూ "మీరు ఒక పని నిమిత్తం బయలు దేరి వచ్చారు. కనుక ఆ పని పూర్తికాకుండా ఇక్కడ్నుంచి వెళ్లిపోవడం బాగుండదని మా అభిప్రాయం" అని అన్నారు. మరి కొందరు మాట్లాడుతూ "మీతో పాటు ప్రముఖ సహాబీలు ప్రవక్త అనుచరులు ఇంకా (సజీవంగా) మిగిలి ఉన్నారు. అంచేత వీరందర్నీ ప్లేగు వ్యాపించిన ప్రాంతానికి తీసుకువెళ్ళడం సరికాదు" అని అన్నారు. హజ్రత్ ఉమర్(రజి) ఈ బేదాభి ప్రాయాలు విని "ఇక మీరు వెళ్ళిపోండి" అని అన్నారు.

తరువాత ఆయన అన్సార్‌లను పిలవండని అన్నారు. అన్సారులు పిలువబడ్డారు. హజ్రత్ ఉమర్ (రజి) వారి సలహా అడిగితే వారు కూడా భిన్నాభిప్రాయాలు వ్యక్తపరిచారు. ముహాజిర్‌లు వెలిబుచ్చిన అభిప్రాయాలే వీరూ వెలిబుచ్చారు. హజ్రత్ ఉమర్ (రజి) వారితో కూడా "ఇక వెళ్ళండ"ని అన్నారు. తరువాత (మక్కా) విజయం తరువాత (మదీనా) వలస వచ్చిన ఖురైష్ తెగ పెద్దలను పిలవండని అన్నారు ఆయన. వారిని పిలుచుకువచ్చిన తరువాత వారిలో ఇద్దరు కూడా భిన్నాభిప్రాయాలు వ్యక్తపరచలేదు. "ప్రజలను అంటు వ్యాధి వ్యాపించిన ఆ ప్రాంతానికి తీసికెళ్ళడం మంచిది కాదు. కనుక మీరు వారందర్నీ తీసుకొని (మదీనా) వెళ్ళిపోవడమే మంచిదని మా అభిప్రాయం" అన్నారు వారంతా. చివరికి హజ్రత్ ఉమర్ (రజి) "నేను రేపు ఉదయం (మదీనా) వెళ్ళిపోతున్నాను. (నాతో పాటు రాదలిచిన వారు రావచ్చు) " అని ప్రకటన గావించారు. ఆ ప్రకటన విని అందరూ మరునాడు ఉదయం బయలుదేరడానికి సిద్ధమయ్యారు.

అప్పుడు హజ్రత్ అబూ ఉబైదా బిన్ జిరాహ్ (రజి) మాట్లాడుతూ "మీరు దేవుడు నిర్ణయించిన అదృష్టం నుండి పారిపోతున్నారా?" అని అడిగారు. హజ్రత్ ఉమర్ (రజి) ఈ మాట విని ఇలా అన్నారు:

"అబూ ఉబైదా! ఈ మాట మరొకరి నోట వెలువడి ఉంటే (నేను విచారించను). సరే, మేము దేవుని నిర్ణీత అదృష్టం నుండి పారిపోయి దేవుని నిర్ణీత అదృష్టం వైపుకే వెళ్ళి పోతున్నాము. మీ దగ్గర కొన్ని ఒంటెలు ఉండి, వాటిని తీసుకొని మీరు ఒక లోయలో ప్రవేశించారనుకోండి. ఆ లోయకు ఒక వైపు పచ్చటి చెట్లు చేమలు, మరొకవైపు బంజరు నేల కూడా ఉందనుకోండి. అప్పుడు మీరు మీ ఒంటెలను (పచ్చిక ఉన్న ప్రదేశం వదలి) బీడు ప్రదేశంలో మేపితే, లేక బీడు వదలి పచ్చిక ప్రదేశంలో మేపితే అది దేవుడు నిర్ణయించిన అదృష్టం నుండి పారిపోవడం అవుతుందా? మీ ఆలోచనా వైఖరి సరైనదేనా?"

ఆ తరువాత హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి) వచ్చారు. ఆయన ఆ సమయంలో ఎక్కడికో వెళ్ళి తిరిగొచ్చారు. ఆయన మాట్లాడుతూ "నా దగ్గర ఈ సమస్యకు సంబంధించిన (హదీసు) జ్ఞానం ఉంది. దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు - "ఎక్కడైనా అంటువ్యాధి ప్రబలిందని మీకు తెలిస్తే అక్కడకు వెళ్ళకండి. ఒకవేళ మీరున్న ప్రాంతంలోనే ప్లేగు వ్యాపిస్తే మటుకు ఆ అంటువ్యాధి బారినుండి తప్పించుకునే ఉద్దేశ్యంతో అక్కడ్నుంచి (వేరే చోటికి) వెళ్ళకండి."

హజ్రత్ ఉమర్ (రజి) ఈ హదీసు విని దేవునికి కృతజ్ఞతలు చెప్పారు. తరువాత ఆయన అక్కడ్నుంచి (మదీనాకు) తిరుగు ముఖం పట్టారు.

(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 30వ అధ్యాయం - మాయుజ్కరు ఫిత్తావూన్)

## 33వ అధ్యాయం - అస్పృశ్యత, దుశ్శకునం, తారాబలం, దయ్యాల నమ్మకం - ఇదంతా మిథ్య

1435. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- "అస్పృశ్యతా పాటింపు సరైనది కాదు, 'సఫర్', 'హామా' లలో నిజం లేదు" అన్నారు దైవప్రవక్త (సల్లం). ఒక అరబ్బు గ్రామీణుడు ఈ మాట విని "దైవప్రవక్తా! నా ఒంటెలు జింకల మాదిరిగా ఎడారిలో శుభ్రంగా (ఆరోగ్యంగా) ఉంటాయి కాని చిడుముతో ఉన్న ఒక ఒంటె వచ్చి వాటిలో కలసిపోగానే ఒంటెలన్నిటికీ ఆ గజ్జి తగులుతుంది. ఇలా ఎందుకు జరుగుతుంది?" అని అడిగాడు. "ఇది (నువ్వనుకుంటున్నట్లు) అంటు వల్లనే వచ్చి ఉంటే ఆ మొదటి ఒంటెకు దేని అంటు తగిలింది?" అన్నారు దైవప్రవక్త (సల్లం). ★

(సహీహ్ బుఖారీ: 76వ ప్రకరణం - తిబ్, 25వ అధ్యాయం - లా సఫర వహామ దావున్ యాఖుజుల్ బత్న్)

★ అజ్ఞానులు ఒకరి అంటు మరొకరికి తగులుతుందని భావిస్తారు. కాని అంటు ప్రభావానికి మూలకారకుడు దేవుడని భావించరు. హదీసులో ఇది మూఢనమ్మకంగా పరిగణించబడింది. పైత్యం అనేది ఒక విధమైన ఉదరవ్యాధి . కాని అరబ్ బహుదైవారాధకుల నమ్మకం ప్రకారం రోగి కడుపులోకి ఒక జంతువు దూరి ఆకలిగా ఉన్నప్పుడు తీవ్రమైన క్షోభకలిగిస్తుంది. దీనివల్ల ఒక్కోసారి రోగి మృత్యువాతన కూడా పడతాడు. వారీ వ్యాధిని చిడుముకన్నా కూడా ప్రమాదకరమైన అంటువ్యాధి అని నమ్మేవారు. ఈ నమ్మకాన్ని 'సఫర్' అంటారు. హామా గురించి కూడా పూర్వం అరబ్ బహుదైవారాధకుల్లో ఒక మూఢనమ్మకం ఉండేది. చనిపోయిన వ్యక్తి ఆత్మ గుడ్లగూబ శరీరంలో ప్రవేశిస్తుందని వారు నమ్మేవారు. అందువల్ల గుడ్లగూబను వారు దుశ్శకునంగా భావించేవారు. అది ఎవరి ఇంటిపైనయినా వాలితే ఆ యింటి యజమాని చనిపోతాడని వారు నమ్మేవారు. దైవప్రవక్త (సల్లం) ఈ రెండు మూఢనమ్మకాలను ఈ హదీసులో ఖండించారు. (సంకలన కర్త)

1436. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు:- రోగగ్రస్త ఒంటెలను ఆరోగ్యవంతమైన ఒంటెల దగ్గరికి తెచ్చి పెట్టకండి.

**(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 53వ అధ్యాయం - లా హామా)**

## 34వ అధ్యాయం - దుశ్శకునం, సత్ శకునం, చెడు విషయాలు

1437. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- అస్పృశ్యతా పాటింపు లేదు. దుశ్శకునం పాటించడం ధర్మ సమ్మతం కాదు. అయితే మంచి శకునం [(1)] పాటించడమంటే నాకిష్టమే. అప్పుడు అనుచరులు "మంచి శకునం అంటే ఏమిటీ?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) "(మంచి శకునం అంటే) మంచి మాట (సద్వచనం)" అని సమాధానమిచ్చారు.

**(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 54వ అధ్యాయం - లా అద్వా)**

1438. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- "దుశ్శకునం పాటించకూడదు, మంచి శకునం పాటించవచ్చు" అని దైవప్రవక్త (సల్లం) చెబుతుంటే నేను విన్నాను. అప్పుడు కొందరు అనుచరులు "మంచి శకునం అంటే ఏమిటీ?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) "(మంచి శకునం అంటే) ఎవరైనా చెప్పే మంచి మాట" అని సమాధానమిచ్చారు.

**(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 43వ అధ్యాయం - అత్తియరతి)**

1439. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు:- "అంటుని, దుశ్శకునాన్ని పాటించడం మంచిది కాదు. దౌర్భాగ్యం అనేది ఉంటే మూడింటిలో మాత్రం ఉండవచ్చు - స్త్రీ, ఇల్లు, చతుష్పాదం."[(2)]

**(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 43వ అధ్యాయం - అత్తియరతి)**

---

(1) అకస్మాత్తుగా ఏదైనా మంచి మాట విని లేదా సందర్భోచితమైన మాట విని దాన్నుండి సకారాత్మక ఫలితం తీయడమే మంచి శకునం (ఫాల్). ఇది ధర్మసమ్మతమే. (అనువాదకుడు)

(2) కుష్ఠు, బొల్లి, మసూచి, స్ఫోటకం, తట్టు, నోటి దుర్వాసన, కళ్ళ కలక, ఇతర అంటువ్యాధులు అంటువల్ల ఒకరినుంచి మరొకరికి సంక్రమిస్తాయని వైద్యులు భావిస్తారు. ఈ హదీసులో వైద్యుల ఈ అనుమానం నిజం కాదని తెలియజేయబడింది. ధర్మవేత్తలు కూడా ఈ హదీసు నుండి ఈ భావాన్నే గ్రహించారు. దుశ్శకునాలను గురించిన విషయాలు హిందువుల నుంచి ముస్లింలలో వ్యాపించిన మూఢనమ్మకాలు మాత్రమే. ఉదాహరణకు: దారిలో పిల్లి ఎదురయితే పని నెరవేరదని, ఎవరైనా తుమ్మితే కూడా బయలు దేరే వ్యక్తి పని నెరవేరదని భావిస్తారు. ఇవన్నీ మూఢ నమ్మకాలు. వీటిని నమ్మడం ముస్లింలకు ఏమాత్రం శోభించదు.

ఇక్కడ దుశ్శకునం లేక దౌర్భాగ్యం అంటే -సంతానం లేని స్త్రీ లేక నోటి దురుసుగల స్త్రీ దుశ్శకునం అవుతుందని అర్థం. అలాగే ఇల్లు ఇరుకుగా ఉంటే లేదా ఇరుగు పొరుగు మంచివాళ్ళు కాకపోతే ఆ ఇల్లు దుశ్శకునం అవుతుంది. గుర్రం, ఏనుగు వగైరా జంతువులు యుద్ధమైదానంలో ఉపయోగపడకపోతే అవి దుశ్శకునాలవుతాయి. (సంకలన కర్త)

1440. హజ్రత్ సహెల్ బిన్‌సాద్ సాదీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- దౌర్భాగ్యం అనేది ఉంటే అది మూడింటిలో మాత్రమే ఉంటుంది - స్త్రీ, గుర్రం, ఇల్లు.★

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 47వ అధ్యాయం - మా యుజ్కరు మిన్ షూమిల్ ఫరస్)

## 37వ అధ్యాయం - పామును చంపడం

1441. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) మస్జిద్ వేదికపై ఉపన్యాసమిస్తూ "పాములను చంపివేయండి, ముఖ్యంగా రెండు (తెల్ల) చారలు ఉండి తోక తెగిన పాములను చంపివేయండి. ఇవి (మన) కళ్ళను పోగొడ్తాయి; వాటి (భయం) వల్ల స్త్రీలకు గర్భం పోవచ్చు" అని అన్నారు.

ఒకసారి నేను ఒక పామును చంపడానికి దాన్ని వెతుకుతుంటే హజ్రత్ అబూ లుబాబా నన్ను కేకవేస్తూ 'దాన్ని చంపకండి' అన్నారు. "దైవప్రవక్త (సల్లం) పాములను చంపమన్నారు కదా!" అన్నాను నేను. "కాని ఆ తరువాత ఆయన ఇండ్లలో తిరిగే పాములను చంపవద్దని, అవి జిన్నులకు సంబంధించిన పాములయి ఉండవచ్చని అన్నారు" అని చెప్పారు అబూ లుబాబా (రజి).

ఒక ఉల్లేఖనంలో ఇలా ఉంది - "అబూ లుబాబా (రజి) లేక జైద్ బిన్ ఖత్తాబ్ (రజి) నన్ను చూసి చంపవద్దని అన్నారు."

(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్‌యిల్‌ఖల్ఖ్, 14వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (వబస్సఫీహామిన్ కుల్లి దాబ్బా)

1442. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) కథనం:- మేము దైవప్రవక్త (సల్లం)తో కలసి ఒక గుహలో కూర్చొని ఉన్నాము. 'ఆయనపై వల్ ముర్సలాత్' సూరా అవతరించింది. మేమీ సూరాను ఆయన నోట విని నేర్చుకున్నాము. దైవప్రవక్త (సల్లం) ఈ సూరా పఠిస్తున్నప్పుడు ఒక పాము (కన్నంలో నుంచి) బయటికి వచ్చింది. ఆయన దాన్ని చంపమన్నారు. మేము దాన్ని చంపడానికి లంఘించాము. కాని అది వేగంగా తప్పించుకుపోయింది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "అది మీ బారి నుండి తప్పించుకున్నది. మీరు దాని బారి నుండి తప్పించుకున్నారు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, ముర్సలాత్ సూరా: 1వ అధ్యాయం - హద్దసనీ మహమూద్)

## 38వ అధ్యాయం :- తొండను చంపడం అభిలషణీయం

1443. హజ్రత్ ఉమ్మె షరీక్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) నన్ను తొండలను చంపమని ఆదేశించారు.

(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్‌యిల్‌ఖల్ఖ్, 15వ అధ్యాయం - ఖైరుల్ మాలిల్ ముస్లిమి గనమ్ యత్బవూ బిహా షఅ ఫుల్ జిబాల్)

---

★ దేన్నయినా సరే దౌర్భాగ్యంగా భావించడం మంచి విషయం కాదన్నదే ఈ హదీసు అంతరార్థం. దౌర్భాగ్యం ఉంటే ఈ మూడింటిలో ఉంటుంది. కాగా ఈ మూడు దౌర్భాగ్యానికి ఆనవాళ్లు కావు. అందువల్ల ఏదీ దౌర్భాగ్యం కాజాలదన్నమాట. (సంకలనకర్త)

1444. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) తొండను దుష్ట పురుగని అన్న మాట నిజమే. కాని ఆయన దాన్ని చంపమని ఆదేశించినట్లు నేను వినలేదు.

(సహీహ్ బుఖారీ:- 28వ ప్రకరణం - జజావుస్సైద్, 7వ అధ్యాయం - మాయఖ్తులుల్ ముహ్రిము మినద్దవాబ్బ్)

## 39వ అధ్యాయం - చీమలను చంపడం నిషిద్ధం

1445. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు:- ఒక చీమ (పూర్వం) ఒక దైవప్రవక్తను కుట్టింది. అందువల్ల ప్రవక్త ఆజ్ఞతో మొత్తం చీమల పుట్టను కాల్చివేయడం జరిగింది. అప్పుడు దేవుడు వహీ ద్వారా ఆ ప్రవక్తతో ఇలా అన్నాడు: "ఒక చీమ (మాత్రమే) నిన్ను కుట్టింది. కాని నీవు దైవాన్ని స్మరించే చీమల సమాజం మొత్తాన్నే కాల్చివేశావు".

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 153వ అధ్యాయం - హద్దసనా యహ్యా)

## 40వ అధ్యాయం - పిల్లిని చంపడం నిషిద్ధం

1446. హజ్రత్ అబ్దుల్లా బిన్‌ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ఒక స్త్రీ పిల్లి మూలంగా దైవశిక్షకు గురయిపోయింది. ఆ స్త్రీ పిల్లి చనిపోయే వరకూ దాన్ని కట్టి పడేసింది. ఈ నేరం కారణంగానే ఆ స్త్రీ నరకానికి పోయింది. ఆమె ఆ పిల్లిని కట్టివేసి దానికి ఎలాంటి ఆహార పానీయాలు పెట్టనూ లేదు. క్రిమి కీటకాలు తినేందుకు దాన్ని ఆమె స్వేచ్ఛగా వదలి పెట్టనూ లేదు.

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 54 వ అధ్యాయం - హద్దసనా అబుల్ యమాన్)

## 41వ అధ్యాయం - సాధు జంతువులకు మేత పెట్టడం, నీరు త్రాపడం పుణ్యకార్యం

1447. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు:- ఒక వ్యక్తి ఎక్కడికో పోతున్నాడు. దారిలో అతనికి దాహం వేసింది. ఒక చోట అతను ఓ బావిలోకి దిగి నీళ్ళు త్రాగి బయటికి వచ్చాడు. అంతలో అతని దృష్టి ఒక రొప్పుతున్న కుక్కపై పడింది. ఆ కుక్క నాలుక బయటికి వచ్చింది. అది తీవ్రమైన దప్పికతో బురద మట్టి నాకసాగింది. అప్పుడా వ్యక్తి తనలాగే ఈ కుక్క కూడా దప్పికతో అల్లాడిపోతోందని భావించాడు. వెంటనే అతను (బావిలోకి దిగి) తన కాలిజోడులో నీళ్ళు నింపి దాన్ని నోటితో పట్టుకొని బయటికి వచ్చాడు. ఆ నీటిని కుక్కకు త్రాగించాడు. అతను చేసిన ఈ సత్కార్యాన్ని దేవుడు స్వీకరించి అతడ్ని క్షమించాడు.

ప్రవక్త అనుచరులు ఈ మాటలు విని "దైవప్రవక్తా! జంతువులకు ఆహారం, నీళ్ళు పెట్టినా మాకు పుణ్యం వస్తుందా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) "ఎందుకు రాదూ? ప్రాణం గల ప్రతి జీవికి ఆహారం, నీళ్ళు పెడ్తే పుణ్యం వస్తుంది" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 42వ ప్రకరణం - ముసాఖాత్, 9వ అధ్యాయం - ఫజ్లి సఖియిల్ మాయి)

1448. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- (పూర్వం ఒక కుక్క తీవ్రమైన దప్పికతో చచ్చిపోయే స్థితికి వచ్చింది. అది (దాహంతో అలమటిస్తూ) ఒక బావి చుట్టూ తిరగసాగింది. అప్పుడు బనీ ఇస్రాయీల్ సంతతికి చెందిన ఒక వ్యభిచారిణి తన కాలి జోడుతో నీళ్ళు తోడి దానికి త్రాగించింది. ఆమె చేసిన ఈ సత్కార్యానికి ఫలంగా దేవుడు ఆమె పాపాలను మన్నించాడు.

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 54వ అధ్యాయం - హద్దసనా అబుల్ యమాన్)

# పద ప్రయోగ ప్రకరణం

## 1వ అధ్యాయం -కాలాన్ని నిందించరాదు

1449. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు:- దేవుడు ఈ విధంగా చెబుతున్నాడు - "ఆదం సంతానం (మానవులు) కాలాన్ని దూషిస్తూ నాకు బాధ కలిగిస్తున్నారు. నిజానికి కాలం కూడా నేనే. సమస్త వ్యవహారాలకు సంబంధించిన అధికారాలు నా చేతిలోనే ఉన్నాయి. నేనే రాత్రిని, పగటిని ఒకదాని వెనుక మరొకటి వచ్చేలా తిప్పుతున్నాను."(1)

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 45వ సూరా అల్‌జాసియా, 1వ అధ్యాయం (వమా యుహ్లికునా ఇల్లద్దహ్ర్)**

## 2వ అధ్యాయం - ద్రాక్షను 'కరమ్' అని అనకూడదు

1450. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు:- ప్రజలు ద్రాక్ష తీగను "కరమ్" అంటున్నారు. నిజానికి విశ్వాసి (ముస్లిం) హృదయమే కరమ్.(2)

**(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 102వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) ఇన్నమల్ కరమ ఖల్బుల్ మోమిన్)**

## 3వ అధ్యాయం - అబ్ద్, అమత, వకాలా, సయ్యిద్ వగైరా పద ప్రయోగాలు

1451. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా బోధించారు:- ఏ ఒక్కరూ (తన సేవకుడితో) "నీ ప్రభువుకు అన్నం వడ్డించు, నీ ప్రభువుకు వుజూ చేయించు లేక నీ ప్రభువుకు నీళ్ళు త్రాగించు" అని చెప్పకూడదు. దానికి బదులు "మీ నాయకునికి లేక మీ యజమానికి వడ్డించు, వుజూ చేయించు, నీరు త్రాగించు" అని చెప్పాలి. అలాగే ఏ ఒక్కరూ తమ (సేవకునితో లేక సేవకురాలితో) నా దాసుడా! నా దాసీ! అని సంబోధించరాదు. దానికి బదులు నా బాలుడా లేక నా బాలికా లేక నా సేవకుడా అని సంబోధించాలి.

**(సహీహ్ బుఖారీ:- 49వ ప్రకరణం - ఇత్క్, 17వ అధ్యాయం - కరాహియతి తతావ్వులి అలర్రఖీఖ్)**

---

(1) ఏ విషయాల కారణంగా మానవుడు కాలాన్ని దూషిస్తున్నాడో ఆ విషయాలు సంభవించడానికి మూల కారకుడు దేవుడు మాత్రమే. అందువల్ల మానవుడు కాలం పేరుతో వాస్తవానికి దేవుడ్నే దూషిస్తున్నాడని ఈ హదీసు భావం. (అనువాదకుడు)

(2) పూర్వం అరబ్బులు ద్రాక్ష పండ్లను, ద్రాక్ష తీగను, ద్రాక్ష సారాయిని 'కరమ్' అనేవారు. 'కరమ్' అంటే పెద్దరికం, గౌరవం, దయ అని అర్థాలున్నాయి. ద్రాక్ష సారా సేవించడం వల్ల మనిషికి ఈ గుణాలు అబ్బుతాయని వారు భావించేవారు. కాని ఇదొక మూఢనమ్మకం. మద్య నిషేధం గురించిన దైవాజ్ఞ అవతరించిన తరువాత ద్రాక్షను 'కరమ్' అని పిలువ కూడదని దైవ ప్రవక్త (సల్లం) అన్నారు. (అనువాదకుడు)

## 4వ అధ్యాయం - నా మనస్సు దుర్గంధ మనస్సయి పోయిందని చెప్పరాదు

1452. హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ఏ ఒక్కరూ 'నా మనస్సు దుర్గంధ భూయిష్టమయిపోయింద'ని చెప్పకూడదు. దానికి బదులు ఆ భావాన్ని స్ఫురింపజేసే మరో పదం 'నా మనస్సు పాడయి పోయింద'ని చెప్పాలి.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 100వ అధ్యాయం - లా యఖుల్ ఖబుసత్ నఫ్సీ)

1453. హజ్రత్ సహెల్ బిన్ హనీఫ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- మీలో ఎవరూ 'నా మనస్సు దుర్గంధ భూయిష్టమయిపోయింద'ని చెప్పకూడదు. దానికి బదులు 'నా మనస్సు పాడయిపోయింద'ని చెప్పాలి.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 100వ అధ్యాయం - లా యఖుల్ ఖబుసత్ నఫ్సీ)

# కవితా ప్రకరణం

1454. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు:- కవులు చెప్పిన కవితలన్నిటిలో అతి శ్రేష్ఠమైన కవిత ఇది - "ప్రతీదీ నశించిపోయేదే పరాత్పరుడు తప్ప".

కవి ఉమీత బిన్ అబూ సల్త్ ఇస్లాం స్వీకరణకు దగ్గరగా వచ్చాడు. (కాని అతను దేవుని ఏకత్వంతో కూడిన కవితలు చెప్పినప్పటికీ అతనికి ఇస్లాం స్వీకార భాగ్యం లభించలేదు).

**(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 90వ అధ్యాయం - మాయజౌజు మినష్షిఅరి...)**

1455. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు:- (అసభ్య) కవితలతో కడుపు నింపుకోవడం కన్నా చీముతో కడుపు నింపుకోవడం ఎంతో శ్రేష్ఠమైనది.

**(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 92వ అధ్యాయం - మా యుక్రహు అయ్యఃకూనల్ గాలిబ్ అలల్ ఇన్సాన్ అష్షియర్....)**

# స్వప్న ప్రకరణం

1456. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు:- మంచి కలలు దేవుని తరపున వస్తాయి, చెడ్డ కలలు షైతాన్ తరపున వస్తాయి. కనుక ఎవరికైనా కలలో ఏదైనా చెడు విషయం కన్పిస్తే మేల్కొన్న వెంటనే అతను థూథూ అని చెప్పి షైతాన్ బారి నుండి దేవుడ్ని శరణు వేడుకోవాలి. అలా చేస్తే ఆ కల వల్ల అతనికి ఎలాంటి నష్టం వాటిల్లదు.

**(సహీహ్ బుఖారీ:- 76వ ప్రకరణం - తిబ్, 39వ అధ్యాయం - అన్నఫ్సి ఫిర్రుఖ్యా)**

1457. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- కాలం మధ్యస్థం అయినప్పుడు (అంటే రాత్రి, పగలు సరి సమానమయినప్పుడు) విశ్వాసికి వచ్చే కలలు సాధారణంగా అసత్యమైనవి కాజాలవు.★ ప్రవక్తృత్వపు (నబువ్వత్) నలభై ఆరు భాగాలలో విశ్వాసికి వచ్చే కల కూడా ఒక భాగమే.

**(సహీహ్ బుఖారీ:- 91వ ప్రకరణం - తాబీర్, 26వ అధ్యాయం - అల్ ఖైదు ఫిల్ మనామ్)**

1458. హజ్రత్ ఉబాదా బిన్ సామిత్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు:- ప్రవక్తృత్వపు (నబువ్వత్) నలభై ఆరు భాగాలలో ఒక భాగం విశ్వాసికి వచ్చే కల.

**(సహీహ్ బుఖారీ:- 91వ ప్రకరణం - తాబీర్, 4వ అధ్యాయం - అర్రుయాయస్సాలిహతు జుజ్వుమ్మిన్ సిత్తతివ్వ అర్బయీన జుజ్ అమ్మినన్నుబువ్వతి)**

1459. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- విశ్వాసికి వచ్చే కల ప్రవక్తృత్వపు నలభై ఆరు భాగాలలో ఒక భాగం.

**(సహీహ్ బుఖారీ:- 91వ ప్రకరణం - తాబీర్, 10వ అధ్యాయం - మన్‌రఅన్న బియ్య (సల్లం) ఫిల్ మనామ్)**

1460. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు:- విశ్వాసికి వచ్చే కల నబువ్వత్‌కు చెందిన నలభై ఆరు భాగాలలో ఒక భాగం అవుతుంది.

**(సహీహ్ బుఖారీ:- 91వ ప్రకరణం - తాబీర్, 4వ అధ్యాయం - అర్రుయాయస్సాలిహతు జుజ్వుమ్మిన్ సిత్తతివ్వ అర్బయీన జుజ్ అమ్మినన్నుబువ్వతి)**

## 1వ అధ్యాయం - కలలో దైవప్రవక్త (సల్లం)ను చూడటం

1461. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు:- నన్ను కలలో చూసినవాడు త్వరలోనే (ప్రళయదినాన) జాగ్రుదావస్థలో కూడా నన్ను చూస్తాడు. (అంటే నన్ను గుర్తుపడతాడు) షైతాన్ నా రూపంలో (కలలోకి) రాలేడు.

**(సహీహ్ బుఖారీ:- 91వ ప్రకరణం - తాబీర్, 10వ అధ్యాయం - మన్‌రఅన్నబియ్య (సల్లం) ఫిల్ మనామ్)**

---

★ దీనికి మరొక అర్థం-ప్రళయకాల సమీపంలో విశ్వాసి కనే కలలు సాధారణంగా అసత్యం కాజాలవు. (సంకలనకర్త)

## 3వ అధ్యాయం - కలల గూఢార్థం (స్వప్న భావం)

1462. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి ఇలా విన్నవించుకున్నాడు. - "దైవప్రవక్తా! రాత్రి నేను ఒక కల గన్నాను. ఆ కలలో ఒక మబ్బు తునక కన్పించింది. అందులో నుంచి నెయ్యి, తేనె బొట్లు బొట్లుగా కారుతున్నాయి. ప్రజలు వాటిని తమ దోసిళ్ళలో పడ్తున్నారు. కొందరు ఎక్కువ తీసుకున్నారు, మరికొందరు తక్కువ తీసుకున్నారు. ఆ తరువాత నేను నింగి నుండి నేల దాకా ఒక పెద్ద త్రాడు వ్రేలాడుతూ ఉండటం చూశాను. మీరా త్రాటిని పట్టుకొని ఆకాశంలోకి వెళ్ళిపోయారు, ఆ తరువాత మరొక వ్యక్తి ఆ త్రాటిని పట్టుకున్నాడు. అతను కూడా దాని సహాయంతో ఆకాశంలోకి పోయాడు. ఆ తరువాత మరొక వ్యక్తి ఆ త్రాటిని పట్టుకున్నాడు. అతను కూడా ఆ త్రాటి మీదుగా ఆకాశంలోకి వెళ్ళిపోయాడు. ఆ తరువాత మరొక వ్యక్తి వచ్చి పట్టుకున్నాడు. అప్పుడు ఆ త్రాడు కాస్తా తెగిపోయింది. అయితే అంతలోనే అది మళ్ళీ కలిసిపోయింది".

హజ్రత్ అబూబకర్ (రజి) ఈ కల విని "దైవప్రవక్తా! నా తల్లిదండ్రులు మీ కోసం సమర్పితం! నేనీ కల గూఢార్థం చెబుతాను, అనుమతివ్వండి" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) "అలాగే చెప్పు" అన్నారు. అప్పుడు హజ్రత్ అబూబకర్ (రజి) ఇలా చెప్పారు - "ఇతను కలలో చూసిన మబ్బు తునక 'ఇస్లాం ధర్మం'. ఆ మబ్బు తునక నుండి కారుతుండిన నెయ్యి, తేనెలు దివ్య ఖుర్ఆన్. అంటే ఖుర్ఆన్ నుండి అమృత వాక్కులు వెలువడుతున్నాయన్న మాట. కొందరు ఖుర్ఆన్‌ని ఎక్కువగా నేర్చుకున్నారు. మరికొందరు తక్కువగా నేర్చుకున్నారు. నింగి నుండి నేల దాకా వ్రేలాడుతున్న త్రాడు సత్య సంధత. దానిపై మీరు స్థిరంగా ఉన్నారు. ఈ సత్యాన్ని దృఢంగా పట్టుకోవడం వల్ల దేవుడు మిమ్మల్ని ఉన్నత శిఖరాలకు చేర్చాడు. మీ తరువాత మరొక వ్యక్తి ఆ త్రాటిని పట్టుకుంటాడు. అతను కూడా దాని సహాయంతో ఉన్నత శిఖరాలకు చేరుతాడు. ఆ తరువాత మరొకడు ఆ త్రాటిని పట్టుకుంటాడు. అతను కూడా ఉన్నత శిఖరాలకు చేరుతాడు. ఆ తరువాత మరొకడు కూడా ఆ త్రాటిని పట్టుకొని ఉన్నత శిఖరాలకు చేరుతాడు. ఆ తరువాత మరొకడు పట్టుకోగానే ఆ త్రాడు తెగిపోతుంది. అయితే అది మళ్ళీ కలసిపోతుంది. అతను కూడా ఉన్నత శిఖరాలకు చేరుకుంటాడు. దైవప్రవక్తా! నా తల్లిదండ్రులు మీ కోసం సమర్పితం! నేను చెప్పిన ఈ గూఢార్థం సరైనదో కాదో కాస్త చెప్పండి."

దానికి దైవప్రవక్త సమాధానమిస్తూ "కొంత భాగం సరైనదే. కాని కొంత భాగం తప్పయి పోయింది" అని అన్నారు. "అయితే దైవసాక్షిగా చెప్పండి. నేను ఈ కల గూఢార్థం చెప్పడంలో ఏమేమి పొరపాట్లు చేశానో చెప్పండి" అని అడిగారు హజ్రత్ అబూబకర్ (రజి). దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "ప్రమాణం విషయాన్ని ప్రస్తావించకు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 91వ ప్రకరణం - తాబీర్, 47వ అధ్యాయం - మఁల్లమ్ యరఁరుయాలి అవ్వలి ఆబిర్ ఇజాలమ్ యసుబ్)

## 4వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) కలలు

1463. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు:- నేను మిస్వాక్ (బ్రష్) చేస్తున్నట్లు కలగన్నాను. అప్పుడు నా దగ్గరకు ఇద్దరు వ్యక్తులు వచ్చారు. వారిలో ఒకడు పెద్దవాడు. నేనా మిస్వాక్‌ని చిన్న వాడికిచ్చాను. అయితే పెద్దవాడికిచ్చేయమని నాకు చెప్పబడింది. అందుచేత నేను మిస్వాక్‌ని పెద్దవాడికి ఇచ్చివేశాను.

**(సహీహ్ బుఖారీ:- 4వ ప్రకరణం - వుజూ, 74వ అధ్యాయం - దఫ్‌యిస్సివాకి ఇలల్ అక్బర్)**

1464. హజ్రత్ అబూ మూసా అష్‌అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియ జేశారు:- నేనొక కలగన్నాను. అందులో నేను మక్కా నుండి ఖర్జూరపు తోటలున్న ప్రాంతానికి వలసపోతున్నాను. నేనప్పుడు అది యమామా లేక హజర్ అయి ఉంటుందని భావించాను. కాని అది మదీనా (యస్రిబ్) అయ్యింది. ఆ కలలోనే నేనొక ఖడ్గం తిప్పాను. అయితే అది మధ్యగా విరిగిపోయింది. ఇది ఉహుద్ యుద్ధంలో ముస్లింపై వచ్చిపడిన ఆపద. తరువాత నేను ఆ ఖడ్గాన్నే తిప్పితే అది పూర్వం కంటే కూడా ఎంతో మెరుగైపోయింది. ఇది దేవుడు మనకు ప్రసాదించిన (అంతిమ) విజయం. అప్పుడు ముస్లింలు సమైక్యమయి సంఘటితమయ్యారు. నేను కలలో ఆవుల్ని కూడా చూశాను. దేవుడు చేసే ప్రతి పనీ మంచిదే. ఈ ఆవులు ఉహుద్ యుద్ధంలో అమరవీరులయి పోయిన ముస్లింలు అన్నమాట. దేవుడు చేసే ప్రతి పనీ మంచిదే. ఇది బద్ర్ యుద్ధం తరువాత ఇప్పటి వరకు దేవుడు మనకు ప్రసాదించిన సత్యతా ప్రతిఫలం.

**(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతిన్నుబువ్వతి ఫిల్ ఇస్లాం)**

1465. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) కాలంలో (బూటకపు ప్రవక్త) ముసైలిమా కిజ్జాబ్ మదీనా వచ్చి "ముహమ్మద్ (సల్లం) గనక తన తదనంతరం నన్ను తన ప్రతినిధి (వారసుడి)గా నిర్ణయిస్తే నేనాయనకు విధేయుణ్ణయిపోవడానికి సిద్ధంగా ఉన్నాను" అని చెప్పసాగాడు. ముసైలిమా తన వెంట తన జాతికి చెందిన అనేకమంది జనాన్ని తెచ్చుకున్నాడు. దైవప్రవక్త (సల్లం) అతని దగ్గరికి వెళ్ళారు (మాట్లాడటానికి). ఆయన వెంట సాబిత్ బిన్ ఖైస్ బిన్ షమ్మాస్ (రజి) కూడా ఉన్నారు. దైవప్రవక్త (సల్లం) చేతిలో ఓ కర్ర ముక్క ఉంది. ఆయన ముసైలిమా, అతని అనుచరుల దగ్గరికి వచ్చి "ముసైలిమా నీవు నన్ను (ఇలాంటి) ఓ కర్ర ముక్క అడిగినా నేను నీకు ఇవ్వను. దేవుడు నీ కోసం నిర్ణయించిన దాన్నుండి నీవు ఏ మాత్రం తప్పించుకోలేవు. నీవు నా నుండి ముఖం తిప్పుకున్నావు. అందుచేత దేవుడు నిన్ను (త్వరలోనే) అంతమొందిస్తాడు. నీవు నా కలలో ఎలా కన్పించావో ఇప్పుడు నేను నిన్ను అదేవిధంగా చూస్తున్నాను. (ఇంకేమైనా ఉంటే) ఈయన సాబిత్ బిన్ ఖైస్ (రజి) నా తరపున నీకు జవాబిస్తారు" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఇలా మాట్లాడిన తరువాత అక్కడ్నుంచి వెళ్ళిపోయారు.

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 70వ అధ్యాయం - వఫ్టి బనీ హనీఫా)**

1466. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- హజ్రత్ అబూ హురైరా (రజి) నాకీ విధంగా

తెలియజేశారు - "నేను కలలో నా రెండు చేతులకు రెండు బంగారు మురుగులు ధరించి ఉన్నట్లు చూశాను. వాటిని చూసి నాకెంతో బాధ కలిగింది. తరువాత వాటిపై ఊదేయమని దేవుడు నాకు దివ్య సంకేతం (వహీ) ద్వారా తెలియజేశాడు. నేనలాగే ఊదాను. దాంతో ఆ బంగారు మురుగులు రెండూ ఎగిరిపోయాయి. ఈ కల ద్వారా నేను గ్రహించిందేమిటంటే నా తరువాత ఇద్దరు అసత్య వాదులు (బూటకపు ప్రవక్తలు) తిరుగుబాటు చేస్తారు. వారిలో ఒకడు అబుల్ అస్వద్ అనసి; రెండోవాడు ముసైలిమా కిజ్జాబ్".★

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 70వ అధ్యాయం - వఫ్ది బనీ హనీఫా)

1467. హజ్రత్ సమురా బిన్ జున్దుబ్ (రజి) కథనం:- సాధారణంగా దైవప్రవక్త (సల్లం) తమ అనుచరుల్ని "మీలోఎవరైనా ఏదైనా కలగన్నారా?" అని అడుగుతారు. దేవుడు తలచిన వ్యక్తి తాను కన్న కలను గురించి దైవప్రవక్త (సల్లం)కు తెలియజేస్తాడు. ఓ రోజు ఉదయం దైవప్రవక్త (సల్లం) ఇలా చెప్పారు - "రాత్రి కలలో నా దగ్గరకు ఇద్దరు దైవదూతలు వచ్చారు. వారు నన్ను లేపి నిలబెట్టి 'పదండి' అన్నారు. నేను వారి వెంట బయలుదేరాను. మేము ఒక వ్యక్తి దగ్గరకు చేరుకున్నాము. అతను పడుకొని ఉన్నాడు. అతని దగ్గర మరొక వ్యక్తి ఒక రాయి ఎత్తుకొని నిలబడ్డాడు. చూస్తే అంతలో ఆ వ్యక్తి ఆ రాతితో పడుకున్న వ్యక్తి తలమీద విసరి కొట్టాడు. దాంతో అతని తల పగిలిపోతుంది. ఆ రాయి అతనికి తగిలి దొర్లుకుంటూ దూరాన పడిపోతుంది. ఆ వ్యక్తి మళ్ళీ ఆ రాతి వెంటబడి దాన్ని ఎత్తుకుంటాడు. దాన్ని తీసుకొని అతను తిరిగొచ్చేలోగా పడుకున్న వాడి తల తిరిగి అతుక్కుపోయి యధాతథంగా ఉంటుంది. ఆ వ్యక్తి మళ్ళీ ఆ రాతిని అతనిపై విసరి కొడ్తాడు. నేనీ దృశ్యం చూసి ఆశ్చర్యపోతూ "సుబ్హానల్లాహ్! వీరిద్దరు ఎవరు? వీళ్ళ వ్యవహారం ఏమిటీ?" అని అడిగాను. ఆ దైవదూతలిద్దరు "(తరువాత చెప్తాం) ముందుకు నడవండి" అన్నారు.

మేము (ముగ్గురం) ముందుకు నడిచాము. కొంతదూరం వెళ్ళి ఒక వ్యక్తి దగ్గరకు చేరుకున్నాము. అతను వెల్లకిలా పడుకొని ఉన్నాడు. మరొక వ్యక్తి ఒక ఇనుప కొక్కెం తీసుకొని అతని తలవైపు నిల్చున్నాడు. అతనా కొక్కెన్ని ఆ వ్యక్తి ముఖంలో ఒకవైపున గుచ్చి ఒక చెంప, ఒక ముక్కు రంధ్రం, ఒక కన్ను చీరిపోయేలా ముచ్చలిగుంత దాకా లాగేస్తాడు. ఆ తరువాత అతను ఆ వ్యక్తి ముఖం రెండో వైపుకు వెళ్తాడు. అటువైపు ముఖ భాగాన్ని కూడా అతను అదే విధంగా చీరేస్తాడు. ఆ పని ముగుస్తుందో లేదో ఇటు వైపు ముఖ భాగం పూర్వంలా యధాతథంగా మారిపోయి ఉంటుంది. ఆ వ్యక్తి మళ్ళీ అతని ముఖాన్ని ఇది వరకటి లాగే చీరేస్తాడు.

ఇది చూసి నేను ఆశ్చర్యపోతూ "సుబ్హానల్లాహ్! వీరిద్దరు ఎవరు? వీరి వ్యవహారం

★ అబుల్ అస్వద్ అనసి అనేవాడు సనా (ప్రాంతం)లో దైవప్రవక్త (సల్లం) జీవిత కాలంలోనే తనను తాను దైవప్రవక్తనని ప్రకటించుకున్నాడు. ఆ కాలంలోనే అతను హతమార్చబడ్డాడు. ముసైలిమా కిజ్జాబ్ అనేవాడు యమామా (ప్రాంతం) లో తనను తాను దైవప్రవక్తనని ప్రకటించుకున్నాడు. ఇతను ముహమ్మద్ మహనీయుని దైవదౌత్యంలో భాగస్తుణ్ణని చెప్పుకునేవాడు. ఈ విధంగా అతను పైకి ముహమ్మద్ (సల్లం) సందేశాన్ని వ్యతిరేకించేవాడు కాదు. చివరికితను కూడా హజ్రత్ అబూబకర్ (రజి) ఖిలాఫత్ పాలనా కాలంలో ముస్లింల చేత హతమార్చబడ్డాడు. (ఇమామ్ నవవీ-రహ్మాలై)

ఏమిటి?" అని అడిగాను. దానికి దైవదూత లిద్దరు "(తరువాత చెప్తాం) పదండి ముందుకు" అన్నారు. మేము (ముగ్గురం) అక్కడ్నుంచి ముందుకు సాగాము. కాస్సేపటికి కుంపటి లాంటి ఓ పెద్ద గొయ్యి దగ్గరకు చేరుకున్నాము. అక్కడ మాకు రకరకాల అరుపులు, పెడబొబ్బలు విన్పించసాగాయి. మేమా గొయ్యిలోకి తొంగి చూస్తే కొందరు స్త్రీలు, పురుషులు నగ్నంగా కన్పించారు. వారి కాళ్ళ క్రింద నుంచి ఒక అగ్ని జ్వాల పైకి వస్తుంటుంది. ఆ అగ్నిజ్వాలపైకి వచ్చినప్పుడల్లా వారు ఏడ్పులు, పెడబొబ్బలు పెట్టేవారు. అది చూసి నేను "వీరెవరూ, వీరి వ్యవహారం ఏమిటి?" అని అడిగాను. దానికి దైవదూతలు "(తరువాత చెప్తాం) పదండి ముందుకు" అన్నారు.

ఆ తరువాత మేము ముందుకు నడచి ఒక నది దగ్గరకు చేరుకున్నాము. అది రక్తం మాదిరిగా నిగనిగలాడుతూ ఎర్రగా ఉంది. ఆ నెత్తుటి నదిలో ఒక వ్యక్తి ఈదుతున్నాడు. నది ఒడ్డు మీద మరొక వ్యక్తి నిలబడి ఉన్నాడు. అతని దగ్గర ఎన్నో రాళ్ళు గుట్టగా పడి ఉన్నాయి. ఈదుతున్న వ్యక్తి ఈదుకుంటూ ఒడ్డు మీద నిలబడిన వ్యక్తి దగ్గరికి వచ్చి నోరు తెరుస్తాడు. ఒడ్డు మీది వ్యక్తి అతని నోట్లోకి ఒక రాయి విసురుతాడు. అతను ఈదుకుంటూ వెళ్ళిపోతాడు. కాస్సేపటికి మళ్ళీ వచ్చి నోరు తెరుస్తాడు. ఒడ్డు మీదున్న వ్యక్తి అతని నోట్లోకి రాయి విసరగానే తిరిగి వెళ్ళిపోతాడు. నేనీ విచిత్రం చూసి "వీరిద్దరు ఎవరు? వీరి వ్యవహారం ఏమిటి?" అని అడిగాను దైవదూతల్ని. దానికి వారు "(తరువాత చెప్తాం) ముందుకు నడవండి" అన్నారు.

అక్కడ్నుంచి మేము మళ్ళీ ముందుకు సాగి అత్యంత భయంకరాకారుడయిన ఒక కురూపి దగ్గరకు చేరుకున్నాము. అంతటి భయంకర కురూపిని మీరెప్పుడూ చూసి ఉండరు. అతని ముందు ఓ అగ్ని గుండం ఉంది. అతనా అగ్నిని ప్రజ్వలింపజేస్తూ దాని చుట్టూ తిరుగుతున్నాడు. నేను దైవదూతల్ని అడిగాను "ఇతనెవరు, ఏమిటీ విశేషం?" అని. దానికి వారు "(తరువాత చెప్తాం) ముందుకు నడవండి" అన్నారు.

మేము ముందుకు సాగి ఒక తోటలోకి ప్రవేశించాము. అందులో పచ్చటి వృక్షాలు దట్టంగా ఉన్నాయి. వాటికి రకరకాల పూలు పూసి ఉన్నాయి. ఆ తోట మధ్యలో ఒక పొడవైన వ్యక్తి ఉన్నాడు. అతను ఎంత పొడుగ్గా ఉన్నాడంటే నేనెంత ప్రయత్నించినా అతని తలను చూడలేకపోయాను. అతని చుట్టూ ఎంతోమంది పిల్లలు ఉన్నారు. అంతమందిని నేనెన్నడూ చూడలేదు. నేను నా సహచరుల్ని "ఈ వ్యక్తి ఎవరు? ఈ పిల్లల సంగతేమిటి?" అని అడిగాను. దానికి వారు "(తరువాత చెప్తాం) ముందుకు పదండి" అన్నారు. అక్కడ్నుంచి మేము ముందుకు నడచి మరొక తోటలోకి చేరుకున్నాము. అది ఎంతో అందమైన తోట. అంతటి అందమైన తోటను నేనెప్పుడూ చూడలేదు. వారిద్దరు నాతో "పైకి వెళ్ళండి" అన్నారు. మేమా తోటలో పైకి ఎక్కిపోయాము. చివరికి ఒక పట్టణం దగ్గరికి చేరుకున్నాము. అది వెండి బంగారు ఇటుకలతో నిర్మించబడిన పట్టణం. మేమా పట్టణ ముఖద్వారం దగ్గరికి వెళ్ళి తలుపు తెరవండని అడిగాము. తలుపు తెరవబడింది. మేము లోపలికి ప్రవేశించాము. అక్కడ మాకు కొందరు విచిత్రమైన మనుషులు కన్పించారు. వారి దేహాలు సగం వీలైనంత మహా అందంగా, సగం పరమ అందవికారంగా ఉన్నాయి. నాతో పాటున్న దైవదూతలు అక్కడి జనంతో "ఆ నదిలోకి

వెళ్ళండి'' అని అన్నారు. మాకు సమీపంలో ఒక నది ప్రవహిస్తూ ఉంది. దాని నీరు స్వచ్ఛమైన పాలవలె తెల్లగా ఉంది. ఆ వ్యక్తులు వెళ్ళి నదిలోకి దిగారు. కాస్సేపటికి వారు నది నుండి బయటపడి మా దగ్గరకు తిరిగొచ్చారు. చూస్తే వారి శరీరాల అందవిహీనత పోయి వారు పూర్తిగా పరమ సౌందర్యవంతులుగా మారిపోయారు.

నన్ను పిలుచుకు వచ్చిన దైవదూతలు నాతో మాట్లాడుతూ "ఇది శాశ్వత స్వర్గోద్యాన వనం. ఇదే మీ నిలయం (స్వగృహం)'' అని చెప్పారు. నేను అటువైపు తలపైకెత్తి చూస్తే మేఘమాలికలా మెరసిపోతున్న ఒక శ్వేత భవనం కన్పించింది. "ఇది మీ భవనం'' అన్నారు దైవదూతలు. నేను వారితో "దేవుడు మీకు శుభం చేకూర్చుగాక! నాకా భవనంలోకి ప్రవేశించడానికి అనుమతి ఇవ్వండి'' అని అన్నాను. దానికి వారు "అప్పుడే కాదు (ఇంకా దాని సమయం రాలేదు). మొత్తానికి మీరు అందులో తప్పకుండా ప్రవేశిస్తారు'' అని అన్నారు. "సరే, నేనీ రాత్రి చిత్ర విచిత్ర విశేషాలు చూశాను. ఇక వాటిని గురించి వివరించండి'' అని అడిగాను నేను. అప్పుడు వారు వినండి అంటూ ఇలా చెప్పారు -

"మొట్టమొదట మీరు తల పగల గొట్టబడుతున్న వ్యక్తిని చూశారు. అతను ఖుర్ఆన్ విద్య నేర్చుకున్నాడు గాని, దాన్ని ఆచరణలో పెట్టలేదు. ఫర్జ్ నమాజు పట్లఅశ్రద్ధ వహించేవాడు. ఆ తరువాత మీరు చూసిన రెండవ వ్యక్తి, అంటే ముచ్చలిగుంత దాకా చెంప, ముక్కు, కళ్ళు, చీల్చబడుతున్న వాడు ఉదయాన్నే ఇంటి నుంచి బయలుదేరి, లేనిపోని పుకార్లు లేవనెత్తి లోకమంతా వ్యాపింప జేస్తుండేవాడు. ఆ తరువాత మీరు కుంపటిలో కాలిపోతున్న నగ్న స్త్రీ పురుషుల్ని చూశారు. వీరు వ్యభిచారానికి పాల్పడినవారు. (నెత్తుటి) నదిలో ఈదుతూ రాళ్ళు తింటున్న వాడు (ప్రపంచంలో ఉండగా) వడ్డీ తిన్నవాడు. అగ్నిని రాజేస్తూ దాని చుట్టు తిరుగుతూ మీకు కనిపించిన భయంకర కురూపి నరక పాలకుడైన మాలిక్. మీరు ఒక తోటలో ఎంతో పొడవైన వ్యక్తిని చూశారు. ఆయన హజ్రత్ ఇబ్రాహీం (అలైహి). ఆయన చుట్టూ గుమిగూడి ఉన్న పిల్లలు, ప్రకృతి ధర్మం (ఇస్లాం)పై చనిపోయిన వారు....''

హదీసు ఉల్లేఖకుని కథనం - కొందరు ప్రవక్త అనుచరులు "దైవప్రవక్తా! బహుదైవారాధకుల పిల్లలు ఎక్కడుంటారు?'' అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) "బహుదైవారాధకుల పిల్లలు కూడా అక్కడే ఉంటారు'' అని అన్నారు.

పోతే, అర్ధ దేహం అందంగా, అర్ధదేహం అంద వికారంగా ఉన్నవారు - వీరు కొన్ని సత్కర్మలు ఆచరించారు. వాటితో పాటు కొన్ని దుష్కర్మలకు పాల్పడి వాటిని కలుషితం చేశారు. అయితే దేవుడు వారిని క్షమించి వేశాడు.''

(సహీహ్ బుఖారీ:- 91వ ప్రకరణం - తాబీర్, 48వ అధ్యాయం- తాబిరిర్రూయాబాద సలాతిస్సుబ్హి)

# ఘనతా విశిష్ఠతల ప్రకరణం

## 3వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) మహత్యాలు

1468. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం :- నేను ఒకసారి దైవప్రవక్త (సల్లం)ను అసర్ నమాజ్ వేళ చూశాను. ప్రజలు వుజూ చేయడానికి నీళ్ళ కోసం అన్వేషిస్తున్నారు. కాని వారికి ఎక్కడా నీళ్ళు లభించడం లేదు. దైవప్రవక్త (సల్లం) కోసం మటుకు (కొంచెం) నీళ్ళు తీసుకురావడం జరిగింది. ఆయన ఆ నీళ్ళ పాత్రలో తమ చేతిని ముంచి, ఇక వుజూ చేయండని అన్నారు అనుచరులతో. అప్పుడు ఆయన చేతి వ్రేళ్ళ నుండి ధారాపాతంగా నీళ్ళు వెలువడసాగాయి. మొదటి వ్యక్తి నుంచి చివరి వ్యక్తి దాకా అందరూ వుజూ చేసుకునే వరకు ఆ నీటి ధారలు వెలువడుతూనే ఉండటం నేను కళ్ళారా చూశాను.

**(సహీహ్ బుఖారీ:- 4వ ప్రకరణం - వుజూ, 32వ అధ్యాయం - ఇల్తి మాసిన్నాసి అల్ వజూఅ ఇజా హానతిస్సలాహ్)**

1469. హజ్రత్ అబూ హమీద్ సాది (రజి) కథనం:- మేము తబూక్ పోరాటంలో దైవప్రవక్త (సల్లం) వెంట ఉన్నాము. దైవ ప్రవక్త (సల్లం) ఖురా లోయలోకి చేరుకున్నారు. అక్కడ తోటలో ఒక స్త్రీ కన్పించింది. "ఆమె తోటలో ఎన్ని పండ్లు అవుతాయో అంచనా వేయండి" అన్నారు దైవప్రవక్త (సల్లం) తమ అనుచరులతో. ఆయన స్వయంగా పది 'వసఖ్‌ల' పండ్లు ఉండవచ్చని అంచనా వేసుకున్నారు. దైవప్రవక్త (సల్లం) ఆ స్త్రీతో "ఈ తోటలో (ఈ యేడు) ఎన్ని పండ్లు కాస్తాయో లెక్క గట్టి ఉంచు" అని అన్నారు.

ఆ తరువాత మేము తబూక్ చేరుకున్నాం. దైవప్రవక్త (సల్లం) మాతో మాట్లాడుతూ "ఈ రోజు రాత్రి తీవ్రమైన తుఫాను గాలి వీస్తుంది. కనుక మీలో ఎవరూ ఆ సమయంలో లేచి నిలబడకూడదు. ఒంటెలు ఉన్నవారు తమ ఒంటెలను కట్టివేయాలి" అని అన్నారు. మేము మా ఒంటెలను కట్టివేశాము. ఆ రాత్రి భయంకరమైన తుఫాను గాలి వీచింది. ఒక వ్యక్తి (ఎందుకో) లేచి నిలబడ్డాడు. మరుక్షణమే అతడ్ని తుఫాను గాలి అమాంతం పైకెత్తి 'తై' కొండ మీద విసరివేసింది. ఆ సమయంలోనే ఐలా ప్రాంతపు రాజు, దైవప్రవక్త (సల్లం)కు ఒక తెల్ల కంచర గాడిదను, ఒక దుప్పటిని కానుకగా పంపాడు. దైవ ప్రవక్త (సల్లం) అతనికి అతని రాజ్యాధికారం అతని క్రిందే ఉన్నట్లు ఒక ఫర్మానా వ్రాసిచ్చారు.

ఆ తరువాత మేము ఖురా లోయకు తిరిగొచ్చాము. దైవప్రవక్త (సల్లం) ఆ స్త్రీని "నీ తోటలో ఎన్ని పండ్లు కాశాయి?" అని అడిగారు. దానికామె పది వసఖ్‌లు కాశాయి అన్నది. అంటే దైవప్రవక్త అంచనా ప్రకారమే ఉత్పత్తి జరిగింది. తరువాత దైవప్రవక్త (సల్లం) మాతో "నేను తొందరగా మదీనా వెళ్ళిపోదామనుకుంటున్నాను. నాతో పాటు వచ్చే వాళ్ళెవరైనా ఉంటే వెంటనే బయలుదేరండి" అని అన్నారు.

ఆ తరువాత మాకు మదీనా పట్టణం కన్పించసాగింది. దైవప్రవక్త (సల్లం) దాన్ని చూసి "ఇది తాబా" అన్నారు. తరువాత ఆయన ఉహుద్ పర్వతాన్ని చూసి "ఈ పర్వతం మనల్ని అభిమానిస్తోంది. మనం దీన్ని అభిమానిస్తున్నాం" అని అన్నారు. ఆ తరువాత "నేను మీకు అన్సార్‌ల ఇండ్లలో శ్రేష్ఠమైన ఇండ్లను గురించి చెప్పనా?" అని అన్నారు. దానికి అనుచరులు "తప్పకుండా చెప్పండి దైవప్రవక్తా!" అన్నారు. "అన్నిటికంటే బనీ నజ్జార్ తెగవారి ఇండ్లు శ్రేష్ఠమైనవి. తరువాత బనీ అబ్దుల్ అష్‌హల్ తెగవారి ఇండ్లు, ఆ తరువాత బనీ సాదా తెగవారి ఇండ్లు వస్తాయి" అన్నారు దైవప్రవక్త (సల్లం). తిరిగి ఆయన "బనీ హారిస్ బిన్ ఖజ్రజ్ తెగవారి ఇండ్లతో బాటు అన్సార్ ముస్లింల ఇండ్లన్నిటిలోనూ శ్రేయోశుభాలు ఉన్నాయి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 24వ ప్రకరణం - జకాత్, 54వ అధ్యాయం - ఖర్సిత్త్రమ్)

(హదీసు ఉల్లేఖకుని కథనం) - ఆ తరువాత హజ్రత్ సాద్ బిన్ ఉబాదా (రజి) మమ్మల్ని కలుసుకోవడానికి వచ్చారు. అప్పుడు హజ్రత్ అబూ ఉసైద్ (రజి) ఆయనతో "మీరు విన్నారా? దైవప్రవక్త (సల్లం) అన్సారుల ఇండ్ల శ్రేష్ఠతను గురించి మాట్లాడుతూ మనల్ని అందరికంటే చివర్లో ఉంచారు" అని అన్నారు. హజ్రత్ సాద్ (రజి) ఈ మాటలు విని దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి "దైవప్రవక్తా! మీరు అన్సారుల ఇండ్ల ఘనతను గురించి చెబుతూ మమ్మల్ని చివర్లో ఉంచారు" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "మీరు కూడా శ్రేష్ఠమైన వారిలో ఉన్నారన్న మాట మీకు చాలదా?" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబుల్ అన్సార్, 7వ అధ్యాయం - ఫజ్లి దూరిల్ అన్సార్)

## 4వ అధ్యాయం - దైవసహాయంపై ప్రవక్త (సల్లం) నమ్మకం, ఆయనకు దైవరక్షణ

1470. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం :- మేము దైవప్రవక్త (సల్లం)తో కలసి నజద్ యుద్ధంలో పాల్గొన్నాం. ఎండ తీవ్రమయిపోయినప్పుడు దైవప్రవక్త (సల్లం) ఒక లోయలోకి చేరుకున్నారు. ఆ లోయలో ఒక విధమైన ముండ్లచెట్లు అనేకం ఉన్నాయి. దైవప్రవక్త (సల్లం) ఒక చెట్టు క్రిందికి చేరి, ఖడ్గాన్ని చెట్టుకు వ్రేలాడదీసి చెట్టు నీడలో విశ్రాంతి కోసం పడుకున్నారు. మిగిలిన వాళ్ళు కూడా నలువైపులా వ్యాపించి ఉన్న చెట్ల నీడన విశ్రాంతి తీసుకోసాగారు. కాస్సేపటికి దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని కేకవేసి పిలిచారు. మేము వెంటనే లేచి ఆయన దగ్గరకు వెళ్ళాము. చూస్తే, అక్కడ దైవప్రవక్త (సల్లం) ఎదురుగా ఒక పల్లెవాసి కూర్చొని ఉన్నాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) మాకిలా తెలియజేశారు :- "నేను పడుకొని ఉంటే ఒక వ్యక్తి వచ్చి నా ఖడ్గం చేతిలోకి తీసుకున్నాడు. నేను మేల్కొని చూస్తే అతను వరలేని ఆ కత్తి పట్టుకొని నా తలవైపు నిల్చున్నాడు. అతనలా కత్తి పట్టుకొని 'నా బారి నుండి నిన్నెవరు కాపాడుతారు?' అని అన్నాడు. నేను 'దేవుడు కాపాడుతాడ'న్నాను. ఈ మాట విని అతను ఖడ్గాన్ని వరలోకి నెట్టి కూర్చున్నాడు. ఆ వ్యక్తి ఇతనే."

దైవప్రవక్త (సల్లం) ఆ వ్యక్తికి ఎలాంటి శిక్ష విధించలేదు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 32వ అధ్యాయం - గజ్వతి బనీ ముస్తలిఖ్ మన్ ఖుజఅ)

## 5వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) తెచ్చిన దివ్యజ్ఞానం - దాని విశిష్ఠత

1471. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- దేవుడు నాకిచ్చి పంపిన జ్ఞానోపదేశాలు నేలపై కురిసే కుండపోత వర్షం లాంటివి. ఆ వర్షం ద్వారా నీటిని బాగా పీల్చుకునే సారవంతమైన నేలలో పచ్చిక, చెట్లు చేమలు మొలుస్తాయి. గట్టి నేల ఆ వర్షపు నీటిని నిరోధించి నిల్వ చేస్తుంది. దేవుడు ఆ నీటితో మానవులకు ప్రయోజనం చేకూర్చుతాడు. వారు దాన్ని త్రాగుతారు, పంట భూముల కోసం వినియోగించుకుంటారు. ఈ వర్షమే మెట్టపల్లాలు లేని చదునైన నేలపై కూడా కురుస్తుంది. కాని ఆ నేల నీటిని (పీల్చుకోవడం గాని) నిరోధించడం గాని, పచ్చికను, చెట్లను మొలకెత్తించడం గాని చేయజాలదు. ఈ (పై రెండు) ఉదాహరణలు దైవధర్మాన్ని అర్థం చేసుకున్న వ్యక్తికి వర్తిస్తాయి. దేవుడు నాకిచ్చి పంపిన జ్ఞానం ఆ వ్యక్తికి ప్రయోజనం చేకూర్చుతుంది. అతనా జ్ఞానాన్ని ఆర్జించి ఇతరులక్కూడా నేర్పుతాడు. ఈ (మూడవ) ఉదాహరణ అహంకారం, దురభిమానం గల వ్యక్తికి వర్తిస్తుంది. అతను తన అహంకారం కారణంగా ధర్మం వైపు దృష్టి సారించడు, దేవుడు నాకిచ్చి పంపిన హితోపదేశాలను స్వీకరించడు.★

(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం - ఇల్మ్, 20వ అధ్యాయం - ఫజ్లిమన్ అలిమ వ అల్లమ్)

## 6వ అధ్యాయం - ముస్లిం అనుచర సమాజంపై దైవప్రవక్త (సల్లం) వాత్సల్యం

1472. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- నన్ను, (నా అనుచర సమాజం) ప్రజలను ఈ విధంగా పోల్చవచ్చు. ఒక వ్యక్తి అగ్నిని రాజేయగా దాని వెలుగు నలువైపులా వ్యాపిస్తుంది. అప్పుడు ఉసుళ్ళు, కీటకాలు వచ్చి అందులో పడుతుంటాయి. ఆ వ్యక్తి వాటిని నిరోధిస్తాడు, (అగ్నిలో పడకుండా) ఆపడానికి ప్రయత్నిస్తాడు. కాని అవి ఆగవు, అగ్నిలోకి పోయి పడుతూనే ఉంటాయి. అదే విధంగా నేను కూడా మిమ్మల్ని మీ నడుము పట్టి నరకాగ్నిలో పడిపోకుండా నిరోధిస్తున్నాను. కాని ఈ జనం నరకంలోకే పోయి పడుతున్నారు.

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 26వ అధ్యాయం - అల్ ఇన్తిహా అనిల్ మఆసి)

★ ఇమామ్ నవవీ (రహ్మాలై) ఇలా రాస్తున్నారు: నేల మూడు రకాలుగా ఉంది. అలాగే మానవుల్లో కూడా మూడు రకాల వారున్నారు. మొదటి రకం సారవంతమైన నేల వర్షం పడగానే పచ్చిక, పండ్లు ఉత్పత్తి చేసి సస్యశ్యామలమవుతుంది. ప్రజలు దాని వల్ల ప్రయోజనం పొందుతారు. ధర్మవిద్య నేర్చుకొని, దాన్ని స్వయంగా ఆచరించడమే గాక, ఇతరులక్కూడా నేర్పుతూ వారికి ప్రయోజనం చేకూర్చే వ్యక్తి ఈ సారవంతమైన నేల వంటివాడు.

రెండవ రకం నేల పచ్చిక, పండ్లు వగైరా ఉత్పత్తి చేయకపోయినా వర్షపు నీటిని అపుకొని నిలువ చేస్తుంది. దానివల్ల మానవులు, జంతువులు ప్రయోజనం పొందుతారు. ధర్మవిద్య నేర్చుకున్నప్పటికీ దాని ద్వారా సమకాలీన సమస్యలకు పరిష్కారం చూపగలిగే అంత దక్షత లేని వ్యక్తి ఈ నేల వంటివాడు. అయినప్పటికిన్నీ ప్రజలు అతను చెప్పే ధార్మిక విషయాలు విని ప్రయోజనం పొందుతారు.

మూడవ రకం నేల చదునైన మెరక నేల. ఇది పచ్చిక, పండ్లు వగైరా ఏదీ ఉత్పత్తి చేయజాలదు. వర్షపు నీటిని కూడా నిల్వచేయజాలదు. ధర్మం పట్ల నిర్లక్ష్య వైఖరి అవలంబించిన వాడ్ని ఇలాంటి నేలతో పోల్చవచ్చు. ఇతను ధర్మజ్ఞానాన్ని జ్ఞాపకం పెట్టుకోడు. అతని దగ్గర ఎవరూ ఎలాంటి ధార్మిక విషయమూ నేర్చుకోలేరు. (సంకలనకర్త).

## 7వ అధ్యాయం - ఈయనే అంతిమ దైవప్రవక్త (సల్లం)

1473. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు :- నన్ను, నాకు పూర్వం వచ్చిపోయిన ప్రవక్తలను ఈ విధంగా పోల్చవచ్చు - ఒక వ్యక్తి ఒక ఇల్లు కట్టించాడు. దాన్ని అన్ని విధాలా తీర్చిదిద్దాడు. కాని ఓ మూలలో ఒక ఇటుక పెట్టేంత ఖాళీ వదలిపెట్టాడు. ప్రజలు ఆ ఇంటిని నలువైపులా తిరిగి చూసి "(ఇంత అందమైన ఈ ఇంటికి) ఇక్కడ ఇటుక ఎందుకు పెట్టలేదు!" అని ఆశ్చర్యపోయారు - కనుక ఆ ఇటుకను నేనే. ఆ విధంగా నేను (అందరి కన్నా చివర్లో వచ్చిన) అంతిమ దైవప్రవక్తను★.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 18వ అధ్యాయం - ఖాతిమున్నబియ్యీన్)

1474. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- నన్ను, నాకు పూర్వం వచ్చిపోయిన దైవప్రవక్తలను ఈ విధంగా పోల్చవచ్చు - ఒక వ్యక్తి ఒక ఇల్లు నిర్మించాడు. నిర్మాణం పూర్తయింది. దాన్ని అన్ని విధాలా తీర్చిదిద్దాడు. కాని (ఓ మూలన) ఒక ఇటుక పట్టేంత ఖాళీ వదలిపెట్టాడు. ప్రజలు ఆ ఇంట్లో ప్రవేశించి (తిరిగి చూసి) "ఇక్కడ ఒక ఇటుక ఉండవలసిన ఖాళీ చోటును గనక వదలి పెట్టకుండా ఉంటే ఈ ఇల్లు పరిపూర్ణతను సంతరించుకునేది" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 18వ అధ్యాయం - ఖాతిమున్నబియ్యీన్)

## 9వ అధ్యాయం - కౌసర్ సరస్సు - దాని వైశిష్ట్యం

1475. హజ్రత్ జుందుబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు:- (కౌసర్) కోనేటి దగ్గరకు నేను మీ అందరికంటే ముందు చేరుకుంటాను (అక్కడ నేను మీ కోసం నిరీక్షిస్తూ ఉంటాను).

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 53వ అధ్యాయం - ఫిల్ హౌజి వ ఖౌలిల్లాహి తాలా ఇన్నా ఆతయ్‌నా కల్ కౌసర్)

1476. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు:- (కౌసర్) సరస్సు దగ్గరకు నేను మీ అందరికంటే ముందుగా చేరుకొని మిమ్మల్ని స్వాగతించడానికి నిరీక్షిస్తూ ఉంటాను. నా దగ్గరకు వచ్చిన ప్రతి వ్యక్తీ ఈ సరస్సు నీరు త్రాగుతాడు. ఈ నీరు (ఓసారి) త్రాగిన వాడికి ఇక ఎన్నటికీ దాహమవదు. మరికొందరు నా దగ్గరికి రావడానికి ప్రయత్నిస్తారు. నేను వారిని

---

★ ఈ హదీసులో దైవప్రవక్తలను, వారు తెచ్చిన బోధనలు, హితోపదేశాలను ఒక భవనంతో పోల్చడం జరిగింది. దీనికి పటిష్ఠమైన పునాదులు వేయబడ్డాయి. దాని కట్టడం ఎంతో అందంగా, అద్భుతంగా నిర్మించబడింది. కాని అందులో ఒక చోట ఒక ఇటుక పట్టేంత ఖాళీ వదిలి వేయబడింది. అత్యున్నత నైతిక విలువల సంస్థాపనకై పంపబడిన అంతిమ దైవప్రవక్త ముహమ్మద్ (సల్లం) ని ఇక్కడ ఈ ఖాళీ స్థలాన్ని పూరించే ఇటుకతో పోల్చడం జరిగింది. ఆయన ప్రభవించి అద్భుతమైన ఈ దైవ దౌత్యసౌధానికి చివరి ఇటుకను అమర్చి దానికి పరిపూర్ణత్వాన్ని చేకూర్చారు. ఆ తరువాత ఈ సౌధానికి మరే ఇటుకా అవసరం లేదు. అదే విధంగా మహాప్రవక్త ముహమ్మద్ (సల్లం) తరువాత మానవాళి మార్గదర్శనానికి మరే దైవప్రవక్తా ప్రభవించడు. (సంకలనకర్త)

గుర్తుపడ్తాను. వారు కూడా నన్ను గుర్తు పట్టవచ్చు. అయినప్పటికీ వారిని నా దగ్గరకు రాకుండా నిరోధించడం జరుగుతుంది.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 53వ అధ్యాయం - ఫిల్ హౌజి వ ఖౌలిల్లాహి తాలా ఇన్నా ఆతయ్‌నా కల్ కౌసర్)**

1477. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- పై హదీసును హజ్రత్ అబూ సయీద్ (రజి) కూడా ఉల్లేఖించారు. అయితే ఆ హదీసులో ఈ విషయం అదనంగా ఉంది -

నేను (అంటే దైవప్రవక్త) వారిని చూసి "వీరు నా వారు (నా అనుచర సమాజం ప్రజలు)" అని అంటాను. కాని "మీరు (ఇహలోకం వీడి) పోయిన తరువాత వీరు ఏమేమి చేశారో (ధర్మంలో ఎలాంటి కొత్త పోకడలు సృష్టించారో, ధర్మ వ్యతిరేక వైఖరి అవలంబించారో) మీకు తెలియదు" అని నాకు సమాధానం ఇవ్వబడుతుంది. అప్పుడు నేను వారితో "దూరంగా ఉండండి, నా తరువాత దైవధర్మాన్ని మార్చేసిన వారు దూరంగా ఉండాలి" అని అంటాను.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 53వ అధ్యాయం - ఫిల్ హౌజి వ ఖౌలిల్లాహి తాలా ఇన్నా ఆతయ్‌నా కల్ కౌసర్)**

1478. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఉద్బోధించారు:- నా సరస్సు ఒక నెల ప్రయాణం చేసిన దూరమంత పొడవుగా ఉంటుంది. అందులోని నీళ్ళు పాలకంటే తెల్లగా, దాని పరిమళం కస్తూరి కంటే ఎక్కువ సువాసనగా ఉంటాయి. అక్కడ ఉండే అసంఖ్యాకమైన చెంబులు ఆకాశంలోని నక్షత్రాల దృశ్యాన్ని తలపింపజేస్తాయి. అందులో ఎవరైనా ఒక్కసారి నీరు త్రాగితే ఇక ఎన్నటికీ అతనికి దాహం వేయదు.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 53వ అధ్యాయం - ఫిల్ హౌజి వ ఖౌలిల్లాహి తాలా ఇన్నా ఆతయ్‌నా కల్ కౌసర్)**

1479. హజ్రత్ అస్మా బిన్తె అబూబకర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలిపారు:- నేను (కౌసర్) సరస్సు దగ్గర ఉండి మీలో నుండి వచ్చే ప్రతి వ్యక్తినీ చూస్తుంటాను. కొంత మందిని నా దగ్గరకు రాకుండా నిరోధించడం జరుగుతుంది. నేనప్పుడు "దేవా! వీరు నా వారు. నా అనుచర సమాజం సభ్యులు కదా!" అని అంటాను. కాని "మీ తరువాత వీరు ఏమేమి చేశారో మీకేమయినా తెలుసా? దైవసాక్షి! మీరు (ఇహలోకం వీడి) పోయిన తరువాత వీరు ఎప్పుడూ అజ్ఞానం, అనాగరిక చేష్టల వైపుకే మరలిపోవడానికి ప్రయత్నిస్తూ ఉండేవారు" అని నాకు సమాధానం ఇవ్వబడుతుంది (అంటే వీరు అజ్ఞాన కాలంలో ఉండిన మూఢ సంప్రదాయాలను, దైవ ధర్మంలో లేని కొత్త పోకడలను ఇస్లాంలో ప్రవేశపెట్టడానికి ప్రయత్నిస్తూ ఉండేవారని అర్థం).

(హజ్రత్ అస్మా (రజి) నుండి హదీసు గ్రహించిన) హజ్రత్ అబూ ములైక (రహ్మాలై) ఈ హదీసు విన్పించిన తరువాత "దేవా! మేము మళ్ళీ అజ్ఞానం, మూఢత్వాల వైపుకు మరలిపోకుండా, నీ ధర్మం

విషయంలో మేము పరీక్షకు గురి కాకుండా మమ్మల్ని కాపాడు అని ప్రార్థించారు.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 53వ అధ్యాయం - ఫిల్ హౌజి వ ఖౌలిల్లాహి తాలా ఇన్నా ఆతయ్‌నా కల్ కౌసర్)**

1480. హజ్రత్ ఉఖ్బా బిన్ ఆమిర్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఉహుద్ అమరగతుల కోసం ఎనిమిది సంవత్సరాల తరువాత (జనాజా) నమాజ్ చేశారు. చనిపోయిన వారికి, బ్రతికున్న వారికి అందరికీ వీడ్కోలు చెబుతున్న విధంగా ఈ నమాజు చేశారు. ఆ తరువాత మస్జిద్‌లో వేదిక ఎక్కి ఇలా ఉద్బోధించారు - "నేను సారథిగా, జట్టు నాయకుడిగా మీకు ముందుగా వెళ్తున్నాను. నేను మీకు సాక్షిని, పర్యవేక్షకుడిని. ఇక మీరు నన్ను కౌసర్ సరస్సు దగ్గర కలుసుకుంటారు. నేనిక్కడ నిలబడి కూడా దాన్ని (కౌసర్ సరస్సుని) చూడగలుగుతున్నాను. నేను వెళ్ళిన తరువాత మీరు మళ్ళీ బహుదైవారాధకులయి పోతారేమోనన్న భయమిప్పుడు నాకు ఏమాత్రం లేదు. కాని నా భయమల్లా మీరు ప్రాపంచిక వ్యామోహంలో చిక్కుకుపోతారేమోనన్నదే."

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 17వ అధ్యాయం - గజ్వతి ఉహుద్)**

1481. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు:- నేను మీకు ముందుగా కౌసర్ సరస్సు దగ్గరికెళ్ళి మీ కోసం నిరీక్షిస్తుంటాను - మిమ్మల్ని స్వాగతించడానికి. మీలో కొందరు నా దగ్గరకు వస్తారు. అయితే వారిని నా దగ్గరకు రాకుండా ఆపడం జరుగుతుంది. నేనప్పుడు "దేవా! వీరు నా సహచరులు" అని అంటాను. "మీరు చనిపోయిన తరువాత వీరు దైవధర్మంలో ఏఏ కొత్త విషయాలు, వినూత్న పోకడలు సృష్టించారో మీకు తెలియదు" అని నాకు సమాధానం ఇవ్వబడుతుంది.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 53వ అధ్యాయం - ఫిల్ హౌజి వ ఖౌలిల్లాహి తాలా ఇన్నా ఆతయ్‌నా కల్ కౌసర్)**

1482. హజ్రత్ హారిసా బిన్ వహబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- కౌసర్ సరస్సు మదీనా నుండి (యమన్‌లోని) సనా వరకు ఎంత దూరం ఉంటుందో అంత పొడవుగా ఉంటుంది.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 53వ అధ్యాయం - ఫిల్ హౌజి వ ఖౌలిల్లాహి తాలా ఇన్నా ఆతయ్‌నా కల్ కౌసర్)**

1483. హజ్రత్ హారిసా (రజి)తో హజ్రత్ ముస్తూరిద్ (రజి) మాట్లాడుతూ "మీరు దైవప్రవక్త (సల్లం) నోట (కౌసర్ సరస్సు దగ్గరుండే) చెంబులను గురించి వినలేదా?" అని అడిగారు. హజ్రత్ హారిసా (రజి) వినలేదన్నారు. అప్పుడు హజ్రత్ ముస్తూరిద్ (రజి) "మీకు ఆ సరస్సు దగ్గర చెంబులు నక్షత్రాల్లా (మెరసిపోతూ, అసంఖ్యాకంగా) కన్పిస్తాయి - (అని దైవప్రవక్త (సల్లం) తెలియజేశారు)" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 53వ అధ్యాయం - ఫిల్ హౌజి వ ఖౌలిల్లాహి తాలా ఇన్నా ఆతయ్‌నా కల్ కౌసర్)**

1484. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- మీ ముందు ఒక సరస్సు ఉంటుంది. అది 'జర్బా' నుండి 'అజ్రుహ్' వరకు ఎంత దూరం ఉంటుందో అంత పొడవుగా ఉంటుంది.[1]

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 53వ అధ్యాయం - ఫిల్ హౌజి వ ఖౌలిల్లాహి తాలా ఇన్నా ఆతయ్‌నా కల్ కౌసర్)

1485. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- ఎవరి అధీనంలో నా ప్రాణం ఉందో ఆ శక్తిమంతుని సాక్షి! మన సరస్సు దగ్గర్నుండి ఇతరుల ఒంటెలను దూరంగా ఎలా తోలేస్తామో, అలాగే నేను నా (కౌసర్) సరస్సు దగ్గర్నుండి కొందరు మనుషుల్ని దూరంగా తొలగిస్తాను.

(సహీహ్ బుఖారీ:- 42వ ప్రకరణం - ముసాఖాత్, 10వ అధ్యాయం - మన్రఆ అన్న సాహిబల్ హౌజ్ వల్ ఖుర్బతి అహఖ్ఖు బిమాయిహీ)

1486. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- నా సరస్సు 'ఐలా' నుండి 'సనా'[2] వరకు ఎంత దూరం ఉంటుందో అంత పొడవుగా ఉంటుంది. అక్కడ, ఆకాశంలో ఎన్ని నక్షత్రాలుంటాయో అన్ని చెంబులుంటాయి.

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 53వ అధ్యాయం - ఫిల్‌హౌజి వ ఖౌలిల్లాహి తాలా ఇన్నా ఆతయ్‌నా కల్ కౌసర్)

1487. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- నా అనుచరుల్లో కొందరు నా సరస్సు దగ్గరకి వస్తారు. నేను వారిని గుర్తుపడ్తాను కూడా. కాని వారిని నా దగ్గర్నుండి లాగి దూరంగా నెట్టివేయడం జరుగుతుంది. అప్పుడు నేను "వీరు నా అనుచరులు" అంటాను. కాని "మీరు (ఇహలోకం వీడి) పోయిన తరువాత వీరు ఎలాంటి కొత్త పోకడలు సృష్టించారో మీకు తెలియదు" అని నాకు సమాధానం ఇవ్వబడుతుంది.

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 53వ అధ్యాయం - ఫిల్ హౌజి వ ఖౌలిల్లాహి తాలా ఇన్నా ఆతయ్‌నా కల్ కౌసర్)

## 10వ అధ్యాయం - ఉహుద్ యుద్ధంలో జిబ్రయీల్, మీకాయీల్‌లు ప్రవక్త తరపున పోరాడటం

1488. హజ్రత్ సాద్ బిన్ అబీ వఖాస్ (రజి) కథనం:- ఉహుద్ యుద్ధంలో నేను దైవప్రవక్త (సల్లం) ముందు ఇద్దరు వ్యక్తులు ఆయనకు రక్షణగా అవిశ్వాసులతో పోరాడుతుంటే చూశాను. వారిద్దరు తెల్లబట్టలు ధరించి ఉన్నారు. యుద్ధం చేయడంలో పూర్తిగా లీనమైపోయారు. వారిద్దర్ని నేను ఇది

1. హజ్రత్ ఖస్తలాని (రహ్మాలై) ప్రకారం 'జర్బా' , 'అజ్రుహ్' అనేవి సిరియా దేశంలోని రెండు పట్టణాల పేర్లు. ఈ రెండు పట్టణాల మధ్య మూడు రాత్రుల ప్రయాణమంత దూరం ఉంటుంది. (సంకలనకర్త)

2. 'ఐలా' అనేది సిరియా దేశంలోని ఒక ప్రముఖ పట్టణం పేరు. కాని ఈ నాడది నిర్జన ప్రదేశంగా మారిపోయింది. 'సనా' అనేది యమన్ దేశంలోని ముఖ్య పట్టణం పేరు. (సంకలనకర్త)

వరకు గాని ఆ తరువాత గాని చూడలేదు.

(సహీహ్ బుఖారీ:- 6 వ ప్రకరణం - మగాజి, 18వ అధ్యాయం - ఇజ్‌హమ్మత్తాయిఫతాన్ మిన్‌కుమ్ అన్తఫ్‌షలా)

## 11వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) శౌర్యం

1489. హజ్రత్ అనస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) అందరికన్నా ఎంతో అందమైనవారు. అందరికన్నా ఎక్కువ పరాక్రమశాలి. ఓ రోజు రాత్రి మదీనా ప్రజలు శత్రు భయంతో బిక్కుబిక్కు మంటున్నారు. ఏవో ధ్వనులు వినబడుతుంటే ఏమిటో చూద్దామని భయపడుతూనే బయలుదేరారు. చూస్తే వారికి ఎదురుగా దైవప్రవక్త (సల్లం) తిరిగొస్తున్నారు. అప్పటికే ఆయన (ఆ ధ్వనుల గురించిన) వివరాలన్నీ తెలుసుకున్నారు. ఆయన అబూ తల్హా (రజి) గారి గుర్రం ఎక్కారు. దాని మీద ఎలాంటి జీను కూడా లేదు. ఆయన భుజానికి ఖడ్గం వ్రేలాడదీయబడి ఉంది. ఆయన వారిని చూసి "భయపడకండి, భయపడాల్సిన పనిలేదు" అని అన్నారు. ఆ తరువాత "ఈ గుర్రం సముద్రంలా ఎంతో వేగంతో పరుగెత్తడం గమనించాను" అని అన్నారు ఆయన.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 82వ అధ్యాయం - అల్ హమాయిల్ వతాలీఖిస్సైఫ్ బిల్ ఉనుఖ్)

## 12వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) అసామాన్య దాతృత్వం

1490. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) అందరికన్నా ఎక్కువ దానశీలురు. ఆయన దానధర్మాలు రమజాన్ నెలలో అత్యధికంగా కన్పిస్తాయి. రమజాన్ నెలలో హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) ఆయన దగ్గరకు ప్రతి రాత్రీ వస్తుండేవారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఆయనతో కలసి ఖుర్‌ఆన్ పారాయణం చేసేవారు. వాస్తవానికి దానధర్మాలు చేయడంలో ఆయన (సల్లం) ప్రభంజనం కన్నా చురుకుగా ఉండేవారు.

(సహీహ్ బుఖారీ:- 1వ ప్రకరణం - వహీ, 5వ అధ్యాయం - హద్దసనా అబ్దాన్)

## 13వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) మానవులందరి కన్నా సుగుణవంతులు

1491. హజ్రత్ అనస్ (రజి) కథనం:- నేను దైవప్రవక్త (సల్లం) దగ్గర పదేండ్లు సేవ చేశాను. కాని ఆయన నన్ను ఏనాడూ కోపగించుకోలేదు; పరుషంగా మాట్లాడలేదు. కనీసం "నువ్విలా ఎందుకు చేశావ"ని కూడా ఆయన నన్నడగలేదు.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 39వ అధ్యాయం - హుస్నుల్ ఖులుఖి వస్సఖా వమా యుక్రహు మినల్ బుఖ్లి)

1492. హజ్రత్ అనస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) మదీనాకు (వలస) వచ్చిన తరువాత హజ్రత్ అబూ తల్హా (రజి) (హజ్రత్ ఉమ్మె సులైమ్ (రజి) భర్త, హజ్రత్ అనస్ (రజి) గారి సవతి తండ్రి) నా చేయి పట్టుకొని దైవప్రవక్త (సల్లం) సన్నిధికి తీసికెళ్ళారు. ఆయనతో "దైవప్రవక్తా! అనస్ (రజి) చాలా బుద్ధిమంతుడు. ఇతడ్ని మీ సేవకోసం పెట్టుకోండి" అని అన్నారు. నేను దైవప్రవక్త (సల్లం) ఇంటా బయటా సేవ చేశాను. కాని దైవసాక్షి! నేను చేసిన ఏ పని విషయంలో కూడా నువ్వెందుకు ఇలా చేశావు అని ఆయన నన్నెప్పుడూ అనలేదు. అలాగే నేను చేయని పని విషయంలో నువ్వెందుకు ఇలా

చేయలేదు అని కూడా ఆయన నన్నెప్పుడూ మందలించలేదు.

(సహీహ్ బుఖారీ:- 87వ ప్రకరణం - దియాత్, 27వ అధ్యాయం - మనిస్తఆన అబ్దన్ ఔ సబియ్యా)

## 14వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం)ను ఏదైనా అడిగినప్పుడు ఆయన ఏనాడు 'లేద'ని అనలేదు

1493. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం)ను ఏదైనా వస్తువు అడిగినప్పుడు ఆయన ఏనాడు లేదని అనలేదు.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 39వ అధ్యాయం - హుస్నుల్ ఖులుఖి వస్సఖా వమా యుక్రహు మినల్ బుఖ్లి)

1494. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) చేత్తో చూపిస్తూ "బహ్రైన్ నుండి (రెవెన్యూ) రాబడి గనక వస్తే నేను మీకు ఇంతింత ఇస్తాను" అని అన్నారు. కాని దైవప్రవక్త (సల్లం) ఇహలోకం వీడిపోయే వరకూ బహ్రైన్ నుండి రాబడి రాలేదు. ఆ తరువాత బహ్రైన్ నుండి రాబడి వచ్చింది. అప్పుడు (ఖలీఫా) హజ్రత్ అబూ బకర్ (రజి) ఒక ప్రకటన గావిస్తూ "దైవప్రవక్త (సల్లం) ఎవరికైనా ఏదైనా ఇస్తానని వాగ్దానం చేసి ఉంటే, లేదా ఆయన ఎవరికైనా అప్పుపడి ఉంటే వారంతా నా దగ్గరకు వచ్చి అడగవచ్చు, నేను వారికి (ఆ డబ్బు లేక వస్తు సంపద ఏదైనా సరే) చెల్లిస్తాను" అని అన్నారు. నేనప్పుడు హజ్రత్ అబూ బకర్ (రజి) దగ్గరకెళ్ళి "దైవప్రవక్త (సల్లం) నాతో ఈ ఈ మాటలు చెప్పారు" అని అన్నాను. అప్పుడు ఆయన నాకు రెండు చేతుల నిండా నాణాలు తీసి ఇచ్చారు. నేను వాటిని లెక్కిస్తే అవి అయిదొందలు తేలాయి. హజ్రత్ అబూబకర్ (రజి) నాతో "ఇంకా కావాలంటే వాటికి రెట్టింపు తీసుకో" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 39వ ప్రకరణం - కిఫాలత్, 3వ అధ్యాయం - మన్ త కప్ఫల అమ్మయ్యితిన్‌దైనా)

## 15వ అధ్యాయం - ప్రవక్త భార్యా పిల్లలపై వాత్సల్యం చూపడం పుణ్యకార్యం

1495. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం :- ఓసారి మేము దైవప్రవక్త (సల్లం)తో కలసి అబూ యూసుఫ్ అనే ఒక కమ్మరి ఇంటికి వెళ్ళాము. ఆ వ్యక్తి (దైవప్రవక్త కుమారుడు) హజ్రత్ ఇబ్రాహీం (రజి)కు పాలుపట్టిన దాయీ భర్త. (అక్కడకు వెళ్ళిన తరువాత) దైవప్రవక్త (సల్లం) (కొడుకు) ఇబ్రాహీం (రజి)ని వడిలోకి తీసుకొని ఆయన్ని ముద్దాడారు, చుంబించారు.

ఆ తరువాత మేము మరొకసారి అబూ యూసుఫ్ ఇంటికి వెళ్ళాము. ఆ సమయంలో హజ్రత్ ఇబ్రాహీం (రజి) కొన ఊపిరితో సతమతమవుతున్నారు. పిల్లవాడి పరిస్థితి చూసి దైవప్రవక్త (సల్లం) కళ్ళు అప్రయత్నంగా చెమ్మగిల్లాయి. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి) ఆయన్ని చూసి (ఆశ్చర్యపోతూ) "దైవ ప్రవక్తా! మీరు కూడా దుఃఖిస్తున్నారా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) "ఇబ్నె ఔఫ్! ఇవి కారుణ్యం, వాత్సల్యాల కన్నీళ్ళు" అని అన్నారు. ఆ తరువాత ఆయన ఆ విషయాన్ని మరింత వివరిస్తూ "కళ్ళు తప్పకుండా అశ్రుపూరితాలవుతాయి, మనసు కూడా

బాధపడుతోంది. అయితే మా ప్రభువుకు ప్రీతికరమైన మాటలే నా నోట వెలువడుతాయి - ఇబ్రాహీమా! నీ ఎడబాటు మమ్మల్ని శోకసముద్రంలో ముంచివేసింది" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 23వ ప్రకరణం - జనాయిజ్, 44వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) ఇన్నాబిక లమహ్జూనూన్)

1496. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) సన్నిధికి ఒక పల్లెవాసి వచ్చి "తమరు కూడా పిల్లలను ముద్దాడుతున్నారా! మేము మాత్రం ముద్దు పెట్టుకోము" అని అన్నాడు. దైవప్రవక్త ఈ మాట విని "దేవుడు మీ హృదయాల నుండి మమతానురాగాలను తీసివేస్తే (నేనేమి చేయగలను?) నేను వాటిని పుట్టించలేను కదా?" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 18వ అధ్యాయం - రహ్మతిల్ వలది వ తఖ్బీలిహీ వ ముఆనఖతిహీ)

1497. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఓ సారి హజ్రత్ హసన్ బిన్ అలీ (రజి)ని ముద్దాడారు. ఆ సమయంలో అక్కడే కూర్చున్న అఖ్రా బిన్ హాబిస్ తమీమి (రజి) అది చూసి "నాకు పది మంది పిల్లలున్నారు. కాని వారిలో ఏ పిల్లవాడ్నీ ఎన్నడూ నేను ముద్దాడలేదు" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ మాటలు విని (ఆశ్చర్యంతో) ఆయన వైపు చూస్తూ "కనికరించని వాడు కనికరించబడడు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 18వ అధ్యాయం - రహ్మతిల్ వలది వ తఖ్బీలిహీ వ ముఆనఖతిహీ)

1498. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- "కనికరించని వాడు కనికారానికి నోచుకోడు."

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 27వ అధ్యాయం - రహ్మతిన్నాసి వల్ బహాయిమ్)

## 16వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) బిడియం

1499. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) పరదాలో ఉండే కన్నెపిల్ల కంటే కూడా ఎక్కువ బిడియపడేవారు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 23వ అధ్యాయం - సిఫతిన్నబియ్యి (సల్లం))

1500. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) స్వభావంలో అశ్లీల ఛాయలు కూడా లేవు. ఆయన అశ్లీల మాటల జోలికే పోయేవారు కాదు. ఆయన (మమ్మల్ని ఉపదేశిస్తూ) "గుణగణాల రీత్యా మీలో ఉత్తముడైన వాడే అందరికంటే శ్రేష్ఠుడు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 23వ అధ్యాయం - సిఫతిన్నబియ్యి (సల్లం))

## 18వ అధ్యాయం - స్త్రీల పట్ల దైవప్రవక్త (సల్లం) దయా దాక్షిణ్యాలు

1501. హజ్రత్ అనస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఓసారి ప్రయాణంలో ఉన్నప్పుడు ఆయన వెంట అన్జషా అనే ఓ నీగ్రో బానిస ఉన్నాడు. అతను కవితా గానం చేస్తూ ఒంటెను వేగంగా తోలుతుంటే

"నీ పాడు గాను అన్జషా! కాస్త నిదానంగా తోలు. కోమలాంగులను దృష్టిలో పెట్టుకో" అని అన్నారు.★

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 95వ అధ్యాయం - మాజాఅ ఫీఖౌలిర్రజుల్ వైలక)

## 20వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) సొంత వ్యవహారంలో ప్రతీకారం తీర్చుకోరు

1502. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- రెండు విషయాల్లో ఒక దాన్ని అవలంబించే స్వేచ్ఛ ఇవ్వబడినప్పుడు దైవప్రవక్త (సల్లం) ఆ రెండింటిలో సులభమైన విషయాన్నే ఎంచుకునేవారు. అయితే ఆ విషయం పాపకార్యమయి ఉండరాదు. ఒకవేళ ఆ సులభమైన విషయం పాపకార్యమయితే అందరికంటే ఆయనే దానికి దూరంగా ఉంటారు. దైవప్రవక్త (సల్లం) ఏనాడూ తన స్వవిషయంలో ఎవరిపైనా ప్రతీకారం తీర్చుకోలేదు. కాని దైవాజ్ఞల పట్ల అపచారం జరిగితే మాత్రం ఆయన తప్పకుండా ప్రతీకారం తీర్చుకునేవారు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 23వ అధ్యాయం - సిఫతిన్నబియ్యి (సల్లం))

## 21వ అధ్యాయం - ప్రవక్త (సల్లం) దేహం పరిమళమయం, మృదువైనది

1503. హజ్రత్ అనస్ (రజి) కథనం :- నేనెన్నడూ దైవప్రవక్త (సల్లం) హస్తం కంటే మృదువైన పట్టు వస్త్రం కూడా చూడలేదు. అలాగే ఆయన దేహం నుండి వెలువడే సుగంధ పరిమళాన్ని మించిన సువాసనను కూడా నేను ఎప్పుడూ ఆస్వాదించలేదు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 23వ అధ్యాయం - సిఫతిన్నబియ్యి (సల్లం))

## 22వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) చెమటలో సువాసన

1504. హజ్రత్ అనస్ (రజి) కథనం :- హజ్రత్ ఉమ్మె సులైమ్ (రజి) దైవప్రవక్త (సల్లం) కోసం చర్మాన్ని పడకగా పరచేవారు. దాని మీదే దైవప్రవక్త (సల్లం) మధ్యాహ్నం వేళ విశ్రాంతి తీసుకునేవారు. దైవప్రవక్త (సల్లం) ఆ విధంగా పడుకున్న తరువాత హజ్రత్ ఉమ్మె సులైమ్ (రజి) ఆయన శరీరం నుండి వెలువడే చెమటను, వెంట్రుకల్ని ఒక సీసాలో పట్టుకునేవారు. ఆ తరువాత వాటిలో ఓ ప్రత్యేక సువాసన "సుక్"ని కలిపి దాచుకునేవారు.

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - ఇస్తియిజాన్, 41వ అధ్యాయం - మన్జారఖౌమన్ ఫఖాలి ఇన్దహుమ్)

## 23వ అధ్యాయం - 'వహీ' సందర్భంలో చలి రోజుల్లో కూడా ప్రవక్త (సల్లం)కు చెమట

1505. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- హజ్రత్ హారిస్ బిన్ హెషామ్ (రజి) దైవప్రవక్త (సల్లం)ను

---

★ ఈ బానిస మధుర కంఠ స్వరం గలవాడు. అతని కవితాగానం విని ఒంటె హుషారుగా, వేగంగా నడిచేది. అందువల్ల దైవప్రవక్త (సల్లం) "కోమలాంగుల్ని దృష్టిలో పెట్టుకొని ఒంటెను నిదానంగా తోలు" అని అన్నారు. అయితే కొందరు హదీసు వేత్తలు ఈ హదీసుకు వేరే అర్థాన్ని తీసుకున్నారు. దాని ప్రకారం మధుర కంఠ స్వరంగల ఈ బానిస ప్రేమ కవితలు పఠిస్తుంటే, దైవప్రవక్త (సల్లం) ఆకవితల ప్రభావం స్త్రీల హృదయాలపై పడి గాజులాంటి వారి సున్నిత హృదయాలు పగిలి పోవచ్చని, లేదా అనుచిత ప్రభావం పడవచ్చని భావించి అలా చేయవద్దని అతడ్ని వారించారు. ఇమామ్ నవవీ (రహ్మలై) దీనిపై వ్యాఖ్యానిస్తూ "పాట వ్యభిచారానికి మంత్రం వంటిది"ని అన్నారు.

(అనువాదకుడు)

"దైవప్రవక్తా! మీపై దివ్యావిష్కృతి (వహీ) ఎలా అవతరిస్తుంది?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చారు : "దివ్యావిష్కృతి (వహీ) అవతరించినప్పుడు ఒక్కోసారి అది నాకు గంటమోతలా విన్పిస్తుంది. ఈ పరిస్థితి నాకు చాలా బాధాకరంగా ఉంటుంది. ఆ పరిస్థితి తొలగిపోగానే నాకు చెప్పబడిన విషయాలు నా మేధలో నిక్షిప్తమయిపోతాయి. ఒక్కొక్కసారి (దివ్యావిష్కృతి (వహీ) తెచ్చే) దైవదూత నా దగ్గరికి మానవాకారంలో వచ్చి నాతో సంభాషిస్తారు. ఆయన చెప్పినది నేను గుర్తుంచుకుంటాను."

నేనొకసారి తీవ్రమైన చలి ఉన్న రోజు ఆయనపై దివ్యావిష్కృతి (వహీ) అవతరిస్తుండగా చూశాను. దివ్యావిష్కృతి (వహీ) స్థితి అంతమైపోగానే ఆయన నుదుటి నుండి స్వేద బిందువులు రాలసాగాయి.

(సహీహ్ బుఖారీ:- 1వ ప్రకరణం - వహీ, 2వ అధ్యాయం - హద్దసనా అబ్దుల్లా బిన్ యూసుఫ్)

## 25వ అధ్యాయం - ప్రవక్త (సల్లం) ముఖారవిందం, శరీరాకృతులు అందరికంటే అందమైనవి

1506. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) మరీ అంత పొడవరి కాదు, మరీ అంత పొట్టివారూ కాదు, మధ్యస్థంగా ఉంటారు. విశాలమైన వక్షస్థలం (తో నిండుగా ఉంటారు). శిరోజాలు చెవి తమ్మె దాకా వ్రేలాడుతూ ఉంటాయి. నేనొకసారి ఆయన్ని అరుణ వస్త్రాలు ధరించి ఉండగా చూస్తే ఆయన ఎంతో అందంగా కన్పించారు. అంతటి సౌందర్యాన్ని నేను మరే వస్తువులోనూ చూడలేదు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 23వ అధ్యాయం - సిఫతిన్నబియ్యి (సల్లం))

1507. హజ్రత్ బరాబిన్ ఆజిబ్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ముఖారవిందం అందరి కంటే ఎంతో అందమైనది. సద్గుణ సంపత్తిలోనూ ఆయన యావత్తు మానవుల కంటే గొప్ప సద్గుణశాలి. ఆయన మరీ అంత పొడవరీ కాదు, మరీ అంత పొట్టీ కాదు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 23వ అధ్యాయం - సిఫతిన్నబియ్యి (సల్లం))

## 26వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) శిరోజాలు

1508. హజ్రత్ అనస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) శిరోజాలు వంకీలు తిరిగిన జుత్తులా ఉండవు. పూర్తి సరిగా కూడా ఉండవు. మధ్యస్థంగా ఉంటాయి. అవి ఆయన రెండు చెవుల మధ్య భుజాలపై వ్రేలాడుతుంటాయి.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 68వ అధ్యాయం - అల్ జాద్)

1509. హజ్రత్ అనస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) తల వెంట్రుకలు ఆయన భుజాలను తాకుతుంటాయి.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 68వ అధ్యాయం - అల్ జాద్)

## 29వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) వృద్ధాప్య దశ

1510. హజ్రత్ ముహమ్మద్ బిన్ సీరీన్ (రహ్మాలై) కథనం :- నేనొకసారి హజ్రత్ అనస్ (రజి)ను "దైవప్రవక్త (సల్లం) తమ తల వెంఢ్రుకలకు రంగు పూసుకునేవారా?" అని అడిగాను. దానికి హజ్రత్ అనస్ (రజి) సమాధానమిస్తూ "ఆయనలో వృద్ధాప్య సూచనలు బహు తక్కువగా ద్యోతక మయ్యాయి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 77వ ప్రకరణం - లిబాస్, 66వ అధ్యాయం - మాయుజ్కురు ఫిష్షైబ్)

1511. హజ్రత్ అబూ హుజైఫా సవాయి (రజి) కథనం :- నేను దైవప్రవక్త (సల్లం)ను చూశాను. ఆయన గడ్డం వెంఢ్రుకల్లో క్రింది పెదవి క్రింది భాగంలో కాస్తంత తెలుపుదనం చూశాను.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 23వ అధ్యాయం - సిఫతిన్నబియ్యి (సల్లం))

1512. హజ్రత్ అబూ హుజైఫా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) రూపురేఖల్లో హజ్రత్ హసన్ (రజి)ని పోలి ఉండేవారు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 23వ అధ్యాయం - సిఫతిన్నబియ్యి (సల్లం))

## 30వ అధ్యాయం - ప్రవక్త (సల్లం) దేహంపై దైవదౌత్య ముద్ర

1513. హజ్రత్ సాయిబ్ బిన్ యజీద్ (రజి) కథనం :- మా పిన్నమ్మ నన్ను దైవప్రవక్త (సల్లం) సన్నిధికి తీసికెళ్ళి "దైవప్రవక్తా! నా ఈ సోదరి కుమారుడు జబ్బుపడ్డాడు" అని అన్నది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) నా తలను నిమురుతూ నా శ్రేయోశుభాల కోసం దైవాన్ని ప్రార్థించారు. ఆ తరువాత ఆయన వుజూ చేశారు. ఆయన వుజూ చేయగా మిగిలిపోయిన నీళ్ళను నేను త్రాగాను. తరువాత ఆయన వెనుక నిలబడ్డాను. ఆయన భుజాల మధ్య నేను దైవ దౌత్య ముద్రను చూశాను. అది పందిరి మంచానికుండే దారపు కుచ్చులా ఉంది.

(సహీహ్ బుఖారీ:- 4వ ప్రకరణం - వుజూ, 40వ అధ్యాయం - ఇస్తిమాలిఫజ్లి వుజూయిన్నాస్)

## 31వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) రూపురేఖలు, ఆయన వయస్సు

1514. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) దైవప్రవక్త (సల్లం) రూపురేఖలు (వగైరా) వర్ణిస్తూ ఇలా తెలియజేశారు :- ఆయన మరీ అంత పొడగరీ కాదు, మరీ అంత పొట్టీ కాదు. మధ్యస్థంగా ఉంటారు. దేహచ్ఛాయ ఎరుపు కలసిన తెలుపు రంగులో ఉంటుంది. మరీ అంత తెలుపూ కాదు, మరీ అంత ఎరుపూ కాదు. తల వెంట్రుకలు మరీ అంత వంకీలు తిరిగి ఉండవు. పూర్తి సరిగా కూడా ఉండవు. నలభై ఏళ్ళ వయస్సులో ఆయనపై దివ్యావిష్కృతి (వహీ) ప్రారంభమైంది. మక్కాలో పది సంవత్సరాల దాకా ఆయనపై దివ్య ఖుర్‌ఆన్ అవతరిస్తూ ఉండింది.★ మదీనాలో కూడా పదేండ్లపాటు ఖుర్‌ఆన్ అవతరించింది. ఆయన తలలో, గడ్డంలో ఇరవై కూడా నెరసిన వెంఢ్రుకలు లేవు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 23వ అధ్యాయం - సిఫతిన్నబియ్యి (సల్లం))

---

★ దివ్యావిష్కృతివహీ ప్రారంభమయిన తరువాత దైవ ప్రవక్త (సల్లం) మక్కాలో పదమూడు సంవత్సరాలు ఉన్నారు. అయితే మూడేండ్లు దివ్యావిష్కృతి (వహీ) అవతరించనందున, దివ్యావిష్కృతి అవతరణ కాలం పదేండ్లు మాత్రమేనన్న విషయం గమనార్హం.

## 32వ అధ్యాయం - మరణ సమయం నాటికి దైవప్రవక్త (సల్లం) వయస్సు

1515. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- "దైవప్రవక్త (సల్లం) ఇహలోకం వీడిపోయే నాటికి ఆయన వయస్సు అరవై మూడు సంవత్సరాలు."

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 19వ అధ్యాయం - వఫాతిన్నబియ్యి (సల్లం))

## 33వ అధ్యాయం - మక్కా, మదీనాలలో దైవప్రవక్త (సల్లం) గడిపిన కాలం

1516. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) మక్కాలో పదమూడేండ్లు ఉన్నారు. ఇహలోకం వీడిపోయే నాటికి ఆయన వయస్సు అరవై మూడు సంవత్సరాలు.

(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 14వ అధ్యాయం - హిజ్రతిన్నబియ్యి (సల్లం) వ అస్హాబిహీ ఇలల్ మదీనా)

## 34వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) పేర్లు

1517. హజ్రత్ జుబైర్ బిన్ ముత్అమ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- నాకు ఐదు పేర్లున్నాయి. నా పేరు ముహమ్మద్ కూడా, అహ్మద్ కూడా, మాహీ కూడా. (మాహీ) అంటే దేవుడు నా ద్వారా అవిశ్వాసా (అధర్మా)న్ని అంతమొందించాడు. నాకు హాషిర్ అనే పేరు కూడా ఉంది. హాషిర్ అంటే హష్ర్ (పునరుత్థాన) దినాన ప్రజలు నా అడుగుజాడల (ఇస్లాం ధర్మం) పై లేపబడతారు. నాకు ఆఖిబ్ అనే పేరు కూడా ఉంది (అంటే అందరికంటే చివర్లో వచ్చేవాడని అర్థం).

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 17వ అధ్యాయం - మాజాఅ ఫీ అస్మాయి రసూలుల్లాహ్ (సల్లం))

## 35వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) జ్ఞానం, ఆయన దైవభీతి పరాయణత

1518. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఒక పని చేసి (తమ అనుచరులకు) ఆ పని చేయమనో లేక చేయరాదనో సెలవిచ్చారు. అప్పుడు కొందరు ఆ విషయానికి సంబంధించి ఇవ్వబడిన సౌకర్యాన్ని ఉపయోగించుకోలేదు. ఈ సంగతి తెలిసి దైవప్రవక్త (సల్లం) ఒక ఉపన్యాసం ఇచ్చారు. అందులో మొదట దేవుని ఔన్నత్యాన్ని స్తుతించి, తరువాత ఇలా అన్నారు - "జనానికి ఏమయింది, నేను స్వయంగా చేస్తున్న పనులను మానేస్తున్నారే? దైవ సాక్షిగా చెబుతున్నాను. దేవుణ్ణి గురించి నాకు మీ అందరికంటే బాగా తెలుసు. మీ అందరిలోకీ దేవునికి ఎక్కువగా భయపడేది కూడా నేనే."

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 72వ అధ్యాయం - మఁల్లమ్ యువాజిహిన్నాస బిల్ యితాబ్)

## 36వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం)ను అనుసరించడం అవశ్యం

1519. హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) కాలంలో ఖర్జూర చెట్లకు నీరు సరఫరా అయ్యే 'హర్రా' కాలువ విషయమయి హజ్రత్ జుబైర్ (రజి)కు, ఒక అన్సారీకి మధ్య తగాదా వచ్చింది. నీటిని (అడ్డుకోకుండా) ప్రవహించనీయమని అన్సారీ వ్యక్తి అంటే, అందుకు హజ్రత్ జుబైర్

(రజి) అంగీకరించలేదు. అప్పుడు వారిద్దరు దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి ఫిర్యాదు చేశారు. దైవప్రవక్త (సల్లం) ఈ ఫిర్యాదు విని "జుబైర్! మొదట నీవు నీ చెట్లకు నీరు పెట్టుకో, తరువాత నీ పొరుగువాని కోసం వదలెయ్యి" అని అన్నారు. అన్సారీ ఈ తీర్పు విని ముఖం చిట్లించుకుంటూ "జుబైర్ (రజి) మీ మేనత్త కొడుకు గనక మీరిలా తీర్పిచ్చారు" అని అన్నాడు దైవప్రవక్త (సల్లం)తో. ఈ మాటలు దైవప్రవక్త (సల్లం)కు కోపాన్ని తెప్పించాయి. ఆయన జుబైర్ (రజి)తో "జుబైర్! నీవు నీ చెట్లకు నీరు పెట్టుకో. ఆ తరువాత తోట (మడి) గట్ల దాకా చేరుకోనంతవరకు నీటిని వదలకు" అని అన్నారు.

1520. హజ్రత్ జుబైర్ (రజి) పై సంఘటనను గురించి ఇలా అన్నారు :- దైవసాక్షిగా చెబుతున్నాను! ఈ సూక్తి ఆ సంఘటన పైనే అవతరించిందని నేను భావిస్తున్నాను - "కాదు. వీరు తమ పరస్పర విభేదాల విషయంలో (ఓ ముహమ్మద్!) నిన్ను మధ్యవర్తిగా ఒప్పుకొని, దానిపై నీవిచ్చే తీర్పును ఏ మాత్రం సంకోచించకుండా నిండు హృదయంతో శిరసావహించనంతవరకూ వీరు నిజమైన విశ్వాసులు కాలేరు." (దివ్య ఖుర్ఆన్ - 4:65)

**(సహీహ్ బుఖారీ :- 42వ ప్రకరణం - ముసాఖాత్, 6వ అధ్యాయం - సక్రిల్ అన్హార్)**

## 37వ అధ్యాయం - పనికి మాలిన ప్రశ్నలు అడిగి ప్రవక్త (సల్లం) ప్రతిష్ఠను కించపరచరాదు

1521. హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- నిషిద్ధం (హరాం) కాని విషయం గురించి (అనవసరంగా) ప్రశ్నించి, ఆ ప్రశ్న మూలంగా అది నిషిద్ధం అయ్యేలా దోహదపడే వ్యక్తే ముస్లిములందరిలోకెల్లా పెద్ద నేరస్థుడు.

**(సహీహ్ బుఖారీ:- 96వ ప్రకరణం - ఏతిసామ్, 3వ అధ్యాయం - మా యుక్రహుమిన్ కస్రతిస్సువాల్ వ తకల్లుఫి మాలాయానీహ్)**

1522. హజ్రత్ అనస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఓసారి ఒక ఉపన్యాసం ఇచ్చారు. అలాంటి ఉపన్యాస తీరును నేనిదివరకెన్నడూ వినలేదు. ఆయన ప్రసంగిస్తూ ఇలా అన్నారు : "నాకు తెలిసిన విషయాలు మీకు గనక తెలిస్తే మీరు చాలా తక్కువగా నవ్వుతారు, చాలా ఎక్కువగా ఏడుస్తారు" అని అన్నారు. అనుచరులు ఈ మాట వినగానే ముఖాలు దాచుకొని ఎక్కి ఎక్కి ఏడ్వనారంభించారు.

ఆ తరువాత ఒక వ్యక్తి "నా తండ్రి ఎవరు?" అని అడిగాడు. 'ఫలానా వ్యక్తి నీ తండ్రి' అన్నారు దైవప్రవక్త (సల్లం). అప్పుడు ఈ సూక్తి అవతరించింది - "విశ్వాసులారా! కొన్ని ప్రశ్నలకు వచ్చే సమాధానాలు మీకు వెగటు కలిగించవచ్చు. అలాంటి (పనికి మాలిన) ప్రశ్నలు అడగకండి."

(ఖుర్ఆన్ - 5:101)

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, ఐదో సూరా - అల్ మాయిదా, 12వ అధ్యాయం - లాతస్ అలూ అన్ అష్యా అఇన్ తుబ్దలకుమ్ తసూకుమ్)**

1523. హజ్రత్ అనస్ (రజి) కథనం :- ఒకసారి ప్రజలు దైవప్రవక్త (సల్లం)ను పదే పదే ప్రశ్నలు అడిగి ఆయన్ని విసిగెత్తించారు. దాంతో ఆయన ఆగ్రహోదగ్రులయ్యారు. (మస్జిద్) వేదిక ఎక్కి "(అడగండి)

ఈ రోజు మీరు ఏ ప్రశ్న అడిగినా సమాధానమిస్తాను అడగండి" అని అన్నారు ఆయన.

నేను దైవప్రవక్త (సల్లం) నోట ఈ మాటలు విన్న తరువాత అటూ ఇటూ చూశాను. చూస్తే జనం నోట్లో గుడ్డ కుక్కుకొని ఏడ్వనారంభించారు. అప్పుడు ఒక వ్యక్తి లేచి నిలబడ్డాడు - ఇతను జనంతో ఏదైనా జగడానికి దిగితే "నువ్వు ఎవరి కొడుకువు? (అక్రమ సంతానమా?)" అని వారతడ్ని ఎత్తి పొడిచేవారు - అతను లేచి "దైవప్రవక్తా! నా తండ్రి ఎవరూ?"అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) "హుజాఫా" అని చెప్పారు.

ఆ తరువాత హజ్రత్ ఉమర్ (రజి) లేచి "దైవప్రవక్తా! దేవుడు (మా) ప్రభువు, యజమాని అని, ఇస్లాం (నిజమైన) ధర్మం అని, ముహమ్మద్ (సల్లం) దేవుని ప్రవక్త అని మేము విశ్వసిస్తున్నాము, దానికి పూర్తిగా కట్టుబడి ఉన్నాం" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ మాటలు విని "నేను మంచీ చెడులను ఈ రోజు చూసిన విధంగా మరెన్నడూ చూడలేదు. నా ముందు స్వర్గ నరకాలు ప్రవేశపెట్టబడ్డాయి. నేను వాటిని ఈ గోడ అవల వైపున చూశాను" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - దావాత్, 35వ అధ్యాయం - అత్తఅవ్వుజి మినల్ ఫితన్)

1524. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం :- ప్రజలు కొన్ని విషయాలను గురించి దైవప్రవక్త (సల్లం)ను ప్రశ్నించారు. అవి దైవప్రవక్త (సల్లం)కు నచ్చలేదు. ప్రశ్నలు మితిమీరిపోవడంతో ఆయన ఆగ్రహం వ్యక్తపరుస్తూ "అడగండి, ఏమడగదలచుకున్నారో" అని అన్నారు. అప్పుడు ఒక వ్యక్తి "నా తండ్రి ఎవరూ" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) "నీ తండ్రి హుజాఫా" అని అన్నారు. తరువాత మరొక వ్యక్తి లేచి అతను కూడా "నా తండ్రి ఎవరు?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) "నీ తండ్రి షీబా బానిసయిన సాలమ్" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ముఖారవిందంపై ఆగ్రహ సూచనలు ఉండటం గమనించిన హజ్రత్ ఉమర్ (రజి) లేచి "దైవప్రవక్తా! మేము దేవుడ్ని క్షమాపణ వేడుకుంటున్నాం" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం - ఇల్మ్, 28వ అధ్యాయం - అల్ గజబిఫిల్ మౌఇజతి వత్తాలీమి ఇజా రఅ మాయక్రహు)

1525. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా అన్నారు :- మీపై ఒక కాలం తప్పకుండా వస్తుంది. అప్పుడు మీరు, మీ భార్యా పిల్లలు, సిరి సంపదలకన్నా నన్నే ఎక్కువగా అభిమానిస్తారు (నా దర్శనం కోసమే తహతహలాడుతారు).

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతిన్నుబువ్వతి ఫిల్ ఇస్లామ్)

## 40వ అధ్యాయం - హజ్రత్ ఈసా (అలైహి) విశిష్టత

1526. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- నేను హజ్రత్ మసీహ్ బిన్ మర్యం (అలైహి)కు అందరికంటే అతి సమీపంగా ఉన్నాను. దైవప్రవక్తలంతా ఒకే తండ్రి సంతానం లాంటి వాళ్ళు. నాకు, హజ్రత్ ఈసా (అలైహి)కు మధ్య మరే ప్రవక్తా లేడు.

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 48వ అధ్యాయం - వజ్కుర్ ఫిల్‌కితాబి మర్యం)

1527. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు:- "ప్రతి పిల్లవాడ్నీ పుట్టుక సమయంలో షైతాన్ తాకుతాడు. షైతాన్ తాకని పిల్లలెవరూ ఆదం సంతానంలో లేరు. షైతాన్ తాకడం వల్లనే పిల్లవాడు పుట్టగానే ఏడుస్తాడు". అయితే హజ్రత్ మర్యమ్ మరియు ఆమె కుమారుడగు హజ్రత్ మసీహ్ (ఏసుక్రీస్తు - అలైహిస్సలాం)ల విషయంలో మాత్రం అలా జరగలేదు".

హజ్రత్ అబూహురైరా (రజి)పై హదీసు ఉల్లేఖించిన తరువాత ఈ క్రింది దైవసూక్తిని పఠించారు - "నేనీమెను, ఈమె భావి సంతతిని శాపగ్రస్తుడైన షైతాన్ బారి నుండి, వాడి ఆగడాల నుండి నీ రక్షణలోకి ఇస్తున్నాను." (ఖుర్ఆన్-3:36)

**(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 44వ అధ్యాయం - ఖౌలిల్లాహితఆలా (వజ్కుర్ ఫిల్ కితాబి మర్యం)**

1528. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- హజ్రత్ ఈసా ప్రవక్త (అలైహి) ఒక వ్యక్తిని దొంగతనం చేస్తుండగా చూసి "నీవు దొంగతనం చేశావా?" అని అడిగారు. దానికా వ్యక్తి "లేదండీ! తాను తప్ప మరో ఆరాధ్యుడు లేని దేవుని సాక్షిగా చెబుతున్నాను. నేను దొంగతనం చేయనే లేదు" అని అన్నాడు. హజ్రత్ ఈసా (అలైహి) ఈ మాటలు విని "నేను దేవుడ్ని విశ్వసిస్తున్నాను (నీవు దేవుడ్ని సాక్షిగా పెట్టి చెబుతున్నందువల్ల నేను నీ మాటలను నమ్ముతున్నాను) నా కళ్ళే అబద్ధమాడాయి" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 48వ అధ్యాయం - వజ్కుర్ ఫిల్ కితాబి మర్యం)**

## 41వ అధ్యాయం - హజ్రత్ ఇబ్రాహీం ఖలీలుల్లాహ్ (అలైహి) మహిమోన్నతలు

1529. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) ఎనభై ఏండ్ల వయస్సులో ఖత్నా (వడుగులు) చేసుకున్నారు. ఆయన బాడిసతో ఖత్నా చేసుకున్నారు.★

**(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 8వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (వత్తఖజల్లాహు ఇబ్రాహీమ ఖలీలా)**

1530. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు:- హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) "ప్రభూ! నీవు మృతులను ఎలా బ్రతికిస్తావో కాస్త నాకు చూపించు" అని వేడుకున్నప్పుడు "నీకు (మా మీద) నమ్మకం లేదా?" అని అంటాడు దేవుడు. "ఎందుకు నమ్మకం లేదు? నమ్మకం ఉంది. కాకపోతే నా మనోతృప్తి కోసం అడుగుతున్నా" అని చెబుతారు హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) - (ఖుర్ఆన్-2:260)

ఇది 'అనుమానించడమైతే' దానికి హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) కన్నా మేము ఎక్కువ

---

★ ఇక్కడ మూల భాషలో ఖద్దూమ్ అనే పదానికి బాడిస అని శాబ్దిక అర్థం వస్తుంది. ఖద్దూమ్ అనేది సిరియా దేశంలోని ఒక గ్రామం పేరు కూడా. అంచేత హదీసు వేత్తలలో కొందరు మొదటి అర్థాన్ని, మరికొందరు రెండవ అర్థాన్ని తీసుకున్నారు.

(ఇమామ్ నవవీ-రహ్మలై)

హక్కుదారులం (అంటే ఇబ్రాహీం (అలైహి) అనుమానం వల్ల అలా అడగలేదు). దేవుడు హజ్రత్ లూత్ (అలైహి)పై కారుణ్య వర్షం కురిపించుగాక! ఆయన గట్టి ఆధారాన్ని (అంటే దేవుడ్ని) రక్షణగా పొందదలిచారు. హజ్రత్ యూసుఫ్ (అలైహి) ఉన్నంత కాలం నేను కారాగారంలో ఉండవలసిన పరిస్థితి వస్తే, అందులో నుంచి విడుదల కావడానికి వచ్చే పిలుపును నేను వెంటనే స్వీకరిస్తాను.

**(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 11వ అధ్యాయం - ఖౌలుహూ అజ్జవజల్ల (వనబ్బిహుమ్ అన్‌జైఫి అన్ సిఫ్లి ఇబ్రాహీం))**

1531. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) మూడుసార్లు తప్ప ఎన్నడూ అబద్ధమాడలేదు. రెండుసార్లు దేవుని కోసం, ఉదాహరణకు - "ఒకసారి నా ఆరోగ్యం సరిగా లేదన్నా"రు ఆయన (సాఫ్ఫాత్:89), మరొకసారి "కాదు, ఈ పని వారి పెద్దాయన చేశాడు" అని అన్నారు (అంబియా:63). (మూడో సంఘటన) హజ్రత్ ఇబ్రాహీం (అలైహి), (ఆయన భార్య) హజ్రత్ సారాలు కలిసి (ప్రయాణం చేస్తూ) ఓ రోజు ఒక రాజు దేశంలో ప్రవేశించారు. ఆ రాజుకు "ఇక్కడ (మన దేశాని)కి ఒక (కొత్త) వ్యక్తి వచ్చాడు. అతని వెంట అందరికంటే అతి అందమైన ఒక స్త్రీ ఉంది" అని సమాచారం అందజేయబడింది. అప్పుడు ఆ దుర్మార్గుడు ఒక మనిషిని పంపి 'ఈ స్త్రీ ఎవర'ని అడిగించాడు. హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) "ఈమె నా చెల్లెలు" అని సమాధానం ఇచ్చారు. తరువాత ఆయన హజ్రత్ సారా దగ్గరికి వచ్చి "సారా! ప్రస్తుతం యావత్తు భూమండలంలో నేను, నువ్వు తప్ప మరొక విశ్వాసి లేడు. అతను (నీ గురించి) నన్ను అడిగితే నేను 'నువ్వు నా చెల్లెల'ని చెప్పాను. కనుక నువ్వు నా మాటను ఖండించకు" అని అన్నారు.

ఆ తరువాత హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) హజ్రత్ సారాను ఆ రాజు దగ్గరకు పంపారు. హజ్రత్ సారా అక్కడికి చేరుకున్న తరువాత ఆ రాజు ఆమె చేతిని పట్టుకోబోయాడు. కాని వెంటనే అతని చేయి కట్టుబడిపోయింది. దాంతో ఆ రాజు హజ్రత్ సారాతో "నేను నీకు ఏ హానీ తలపెట్టను. నా కోసం దైవాన్ని ప్రార్థించు" అని అన్నాడు. హజ్రత్ సారా దైవాన్ని ప్రార్థించారు. వెంటనే అతని చేయి విడిపోయింది. అయితే ఆ దుర్మార్గుడు మళ్ళీ హజ్రత్ సారాని పట్టుకోబోయాడు. వెంటనే అతని చేయి ఈసారి ఇంతకు ముందు కంటే కూడా గట్టిగా కట్టుబడిపోయింది. దాంతో అతను (గత్యంతరం లేక) సారాతో "నేను మీకిక ఎలాంటి కీడు తలపెట్టను, నా కోసం దైవాన్ని ప్రార్థించండి". అని వేడుకున్నాడు. హజ్రత్ సారా మళ్ళీ దైవాన్ని ప్రార్థించారు. అతనికి ఆ ఆపద తొలగిపోయింది. ఆ తరువాత అతడు రాజ భటుడ్ని పిలిచి "నీవు నా దగ్గరికి మనిషిని కాదు, దయ్యాన్ని తెచ్చావు" అని మండిపడ్డాడు. ఆ తరువాత ఆ రాజు హజ్రత్ సారా సేవ కోసం హాజిరాను పంపాడు. హజ్రత్ సారా హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) దగ్గరకు తిరిగొచ్చారు. అప్పుడు హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) ప్రార్థన చేస్తూ "ఏమయింది?" అని అడిగారు చేత్తో సైగ చేస్తూ. దానికి ఆమె సమాధానమిస్తూ "దేవుడు ఆ అవిశ్వాసి లేక ఆ దుర్మార్గుడి దుష్ట పన్నాగాలను అతని మీదికే తిప్పికొట్టాడు, మనకు సేవ చేయడానికి హాజిరాను ఇప్పించాడు" అని అన్నారు.

హజ్రత్ అబూహురైరా (రజి)పై హదీసును ఉల్లేఖించిన తరువాత "ఓ గగన జలపుత్రులారా!

ఈమే మీ మాతృమూర్తి (హజ్రత్ హాజిరా)" అని అన్నారు (ప్రజలతో).

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 8వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (వత్తఖజల్లాహు ఇబ్రాహీమ ఖలీలా)

## 42వ అధ్యాయం - హజ్రత్ మూసా (అలైహి) ఔన్నత్యం

1532. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- ఇస్రాయీల్ సంతతి ప్రజలు నగ్నంగా (సామూహిక) స్నానం చేసేవారు. ఆ స్థితిలో పరస్పరం చూసుకునేవారు. అయితే హజ్రత్ మూసా (అలైహి) ఒంటరిగా (వేరేచోట) స్నానం చేస్తుంటే ఇస్రాయీల్ సంతతి ప్రజలు (ఆయన్ని అనుమానిస్తూ) "మూసా (అలైహి) మాతో కలసి (సామూహికంగా) స్నానం చేయకపోవడానికి కారణం ఆయనకు వరిబీజం ఉండటమే" అని చెప్పుకునేవారు. ఒక రోజు హజ్రత్ మూసా (అలైహి) బట్టలు ఊడదీసి ఒకరాయి మీద పెట్టి స్నానం చేయసాగారు. అంతలో ఆ రాయి ఆయన బట్టల్ని తీసుకొని ఎగిరిపోయింది. వెంటనే హజ్రత్ మూసా (అలైహి) నీళ్ళ నుండి బయటికి వచ్చి "ఓ రాయీ! నా బట్టలు నాకిచ్చెయ్యి" అని అంటూ దాని వెంటపడ్డారు. ఆ స్థితిలో ఇస్రాయీల్ సంతతి ప్రజలు ఆయన్ని చూసి "దైవసాక్షి! మూసా (అలైహి)కు ఎలాంటి వ్యాధి లేదే!" అని చెప్పుకున్నారు. ఆ తరువాత మూసా (అలైహి) ఆ రాయి దగ్గర్నుండి తన బట్టలను తీసుకొని దాన్ని కొట్టడం మొదలెట్టారు.

హజ్రత్ అబూహురైరా (రజి) ఈ హదీసు ఉల్లేఖించిన తరువాత "దైవసాక్షిగా చెబుతున్నాను. ఆ రాతి మీద మూసా (అలైహి) దెబ్బలకు సంబంధించిన ఆరేడు గుర్తులు పడ్డాయి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 5వ ప్రకరణం - గుసుల్, 20వ అధ్యాయం - మనిగ్తసల ఉర్యానన్ వహ్‌దహూ ఫిల్‌ఖల్వతి)

1533:- హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- హజ్రత్ మూసా (అలైహి) దగ్గరకు (దేవుడు) మృత్యుదూతను పంపాడు (ఆయన ప్రాణం తీసుకురావడానికి). అయితే హజ్రత్ మూసా (అలైహి) మృత్యుదూత కంటిపై లాగి కొట్టారు (ఆ దెబ్బతో దైవదూత కనుగ్రుడ్డు బయటికి వచ్చింది). ఆయన దేవుని దగ్గరకు తిరిగెళ్ళి "దేవా! నీవు నన్ను చావడానికి ఇష్టపడని దాసుని దగ్గరకు పంపించావు ప్రాణం తీసుకు రావడానికి" అని అన్నాడు. దేవుడు ఆ మృత్యుదూతకు తిరిగి దృష్టి ప్రసాదించి "సరే, ఈసారి అతని దగ్గరకు వెళ్ళి ఎద్దు వీపు మీద చేయి పెట్టమని చెప్పు. అలా అతని చేతి క్రిందికి ఎన్ని వెంట్రుకలు వస్తే అన్ని సంవత్సరాలు ఆయువు లభిస్తుందని తెలియజెయ్యి" అని అన్నాడు. (మృత్యుదూత దైవాజ్ఞను శిరసావహించాడు) అప్పుడు హజ్రత్ మూసా (అలైహి) "ప్రభూ! ఆ తరువాత తిరిగి ఏమవుతుంది?" అని అడిగారు. "ఆ తరువాత మృత్యువు వస్తుంది" అన్నాడు దేవుడు. "అలాగయితే ఆ మృత్యువు ఏదో ఇప్పుడే రప్పించు" అన్నారు హజ్రత్ మూసా (అలైహి). ఆ సందర్భంలోనే ఆయన ఇలా వేడుకున్నారు, "దేవా! బైతిల్ మఖ్దిస్ నుండి ఒక రాయి విసరినంత దూరంలో నాకు మరణం కలిగించు".

హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: "నేనక్కడ ఉండి ఉంటే మీకు మూసా (అలైహి) సమాధిని చూపించేవాడ్ని. అది దారి ప్రక్కన ఒక

ఎరుపు ఇసుక గుట్ట దగ్గర ఉంది".

**(సహీహ్ బుఖారీ:- 23వ ప్రకరణం - జనాయిజ్, 69వ అధ్యాయం - మన్ అహబ్బద్దఫ్న ఫిల్ అర్జిల్ ముఖద్దసా)**

1534:- హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- ఇద్దరు వ్యక్తులు - ఒక ముస్లిం, ఒక యూదుడు - తగాదా పడ్డారు. ముస్లిం (ప్రమాణం చేయడానికి) "యావత్తు ప్రపంచంలో (ప్రవక్త పదవి కోసం) ముహమ్మద్ (సల్లం)ను ఎంచుకున్న శక్తి స్వరూపుని సాక్షి!" అని అన్నాడు. దానికి సమాధానంగా యూదుడు "యావత్తు ప్రపంచంలో (ప్రవక్త పదవి కోసం) మూసా (అలైహి)ను ఎంచుకున్న శక్తి స్వరూపుని సాక్షి!" అని అన్నాడు. ముస్లిం ఈ మాట వినగానే చెయ్యెత్తి యూదుడికి ఓ చెంప దెబ్బకొట్టాడు. యూదుడు దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి జరిగిన వృత్తాంతం అంతా ఆయనకు వివరించాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:

"(ముస్లింలారా!) మీరు మూసా (అలైహి)పై నాకు ప్రాముఖ్యం ఇవ్వకండి. ప్రళయ దినాన మానవులంతా స్పృహ తప్పుతారు. నేను కూడా స్పృహ తప్పుతాను. ఆ తరువాత అందరికన్నా ముందుగా నేను స్పృహలోకి వస్తాను. అప్పుడు చూస్తే మూసా (అలైహి) దేవుని సింహాసనం ఒక మూలను పట్టుకొని నిలబడి ఉంటారు. ఆయనసలు స్పృహ తప్పిన వారిలో ఉన్నారా లేక స్పృహ తప్పి ఉంటే నా కంటే ముందే స్పృహలోకి వచ్చారా లేక దేవుడు ఆయన్ని స్పృహ తప్పడం నుండి మినహాయించాడా అనే సంగతి మటుకు నాకు తెలియదు"★.

**(సహీహ్ బుఖారీ:- 44వ ప్రకరణం -ఖుసూమాత్, 1వ అధ్యాయం - మాయుజ్కరు ఫిల్ అష్ఖాసి వల్ ఖుసూమాబైనల్ ముస్లిం వల్‌యహూద్)**

1535. హజ్రత్ అబూసయీద్ ఖుదరీ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) (మస్జిద్‌లో) కూర్చొని ఉన్నారు. హఠాత్తుగా ఒక యూదుడు వచ్చి "అబుల్ ఖాసిం (సల్లం)! మీ అనుచరుల్లో ఒకతను నా ముఖం మీద చెంప దెబ్బ కొట్టాడు" అని అన్నాడు. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "ఎవరతను?" అని అడిగారు. "అతనొక అన్సారీ" చెప్పాడు యూదుడు. "అయితే అతడ్ని పిలువు" అన్నారు దైవప్రవక్త (సల్లం). (ఆ అన్సారీ వచ్చాడు) "నువ్వితడ్ని చెంప దెబ్బ కొట్టావా?" అడిగారు దైవప్రవక్త (సల్లం). "ఇతను ప్రమాణం చేస్తూ యావత్తు మానవులపై మూసా (అలైహి)కు ప్రాధాన్యతనిచ్చి ఆయన్ని ఎన్నుకున్న శక్తి స్వరూపుని సాక్షి అన్నాడు. నేనామాటలు విని, 'హజ్రత్ ముహమ్మద్ (సల్లం)పై కూడానా? అని చెప్పి కోపం పట్టలేక అతనికి చెంప దెబ్బ కొట్టాను" అని అన్నాడు ఆ అన్సారీ.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- "మీరు దైవప్రవక్తలలో ఒకరిపైనొకరికి ప్రాధాన్యత నివ్వకండి. ప్రళయదినాన (మొదటిసారి శంఖం పూరించబడినప్పుడు) అందరూ స్పృహ తప్పి పడిపోతారు. ఆ తరువాత అందరి కంటే ముందుగా నేను నేల పగిలి బయటికి వస్తాను. అప్పుడు చూస్తే నా ఎదురుగా హజ్రత్ మూసా (అలైహి) దైవ సింహాసనం కాలు పట్టుకొని నిలబడి ఉంటారు.

---

★ దివ్య ఖుర్‌ఆన్‌లో "దేవుడు సురక్షితంగా ఉంచేవారు తప్ప భూమ్యాకాశాల్లో నివసించే వారంతా స్పృహ తప్పి పడిపోతారు" అని ఉంది. ఇది ప్రళయ దినాన మొదటి శంఖారావం విన్పించినప్పుడు సంభవిస్తుంది. అందువల్ల ఈ హదీసులోని మూసాప్రవక్త (అలైహి) స్పృహ తప్పే ప్రస్తావన కూడా మొదటి శంఖారావం సందర్భానికి సంబంధించిన విషయమేనని గ్రహించాలి. (సంకలనకర్త)

ఆయనసలు స్పృహ తప్పి పడిపోయినారా? (తరువాత నా కంటే ముందే స్పృహలోకి వచ్చారా?) లేక (గతంలో) తూర్ పర్వతంపై స్పృహతప్పి పడిపోయిన దానికి బదులు ఇప్పుడు ఆయనకు ఆ స్థితికి గురికాకుండా చేయడం జరిగిందా అనే విషయం నాకు తెలియదు".

(సహీహ్ బుఖారీ:- 44వ ప్రకరణం - ఖుసూమాత్, 1వ అధ్యాయం - మాయుజ్కారు ఫిల్ అష్ఖాసివల్ ఖుసుమా బైనల్ ముస్లిం వల్ యహూద్)

## 43వ అధ్యాయం - హజ్రత్ యూనుస్ ప్రవక్త (అలైహి) ప్రస్తావన

1536. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు:- " ఏ దైవ దాసుడూ తాను హజ్రత్ యూనుస్ బిన్ మత్తై (అలైహి) కంటే శ్రేష్ఠుడ్ని అని చెప్పకూడదు".

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 35వ అధ్యాయం - ఖౌలిల్లాహి త ఆలా (వ ఇన్న యూనుసల మినల్ ముర్సలీన్))

1537. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఏ దైవ దాసుడూ తాను హజ్రత్ యూనుస్ బిన్ మత్తై (అలైహి) కంటే శ్రేష్ఠుడ్ని అని చెప్పకూడదు". మత్తై హజ్రత్ యూనుస్ (అలైహి) తండ్రి పేరు.

(సహీహ్ బుఖారీ:- 60వ అధ్యాయం - అంబియా, 24వ అధ్యాయం - ఖౌలిల్లాహి త ఆలా (హల్ అతాక హదీసు మూసా))

## 44వ అధ్యాయం - హజ్రత్ యూసుఫ్ ప్రవక్త (అలైహి) మహిమోన్నతలు

1538. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- ఒక వ్యక్తి మాట్లాడుతూ "దైవప్రవక్తా! మానవులందరిలో కెల్లా ఎక్కువ గౌరవనీయుడు ఎవరు?" అని ప్రశ్నించాడు. "అందరి కంటే ఎక్కువగా దేవునికి భయపడుతూ ఆయన ఆజ్ఞలను పాటించేవాడు" అన్నారు దైవప్రవక్త (సల్లం). ప్రశ్నించే వ్యక్తి "మేమీ దృష్టితో అడగలేదు" అని అన్నాడు ".అయితే యూసుఫ్ (అలైహి) ఆయన స్వయంగా దైవప్రవక్తే గాక, ఆయన తండ్రి (హజ్రత్ యాఖూబ్) తాత (హజ్రత్ ఇబ్రాహీం) ఖలీలుల్లాహ్‌లు కూడా దైవప్రవక్తలే" అన్నారు దైవప్రవక్త (సల్లం). ప్రశ్నించే వ్యక్తి "మేమా దృష్టితో కూడా అడగలేద"ని అన్నాడు. "మరేమిటి? అరబ్బు తెగలు, వాటి ఉప తెగలను గురించి అడుగుతున్నావా? వారిలో అజ్ఞాన కాలంలో సజ్జనులు, సద్వర్తనులుగా ఉండినవారే ముస్లింలైన తరువాత కూడా సజ్జనులు, సద్వర్తనులుగా ఉన్నవారు ఎంతోశ్రేష్ఠులు. కాకపోతే వారు ధర్మంలో మంచి అవగాహన కలిగిన వారయి ఉండాలి" అన్నారు దైవప్రవక్త (సల్లం).

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 8వ అధ్యాయం - ఖౌలిల్లాహి త ఆలా (వత్తఖజల్లాహు ఇబ్రాహీమ ఖలీలా)

## 26వ అధ్యాయం - హజ్రత్ ఖిజర్ (అలైహి) ఘనతా ఔన్నత్యాలు

1539. హజ్రత్ ఉబీ బిన్ కాబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఉద్బోధించారు:- హజ్రత్ మూసా (అలైహి) ఇస్రాయీల్ సంతతి వారి ముందు ఉపన్యాసమిస్తున్నారు. అప్పుడు ఒక వ్యక్తి లేచి "అందరి కంటే గొప్ప పండితుడు ఎవరు?" అని ప్రశ్నించాడు. "నేనే" అన్నారు హజ్రత్ మూసా

(అలైహి). ఈ మాటలు దేవుని ఆగ్రహానికి కారణమయ్యాయి. "దేవుడు అందరికంటే గొప్ప జ్ఞాని అని అతను ఎందుకు అనలేదు?" అంటూ ఆగ్రహం వెలిబుచ్చాడు. తరువాత దివ్యావిష్కృతి (వహీ) ద్వారా "మజ్మయిల్ - బహ్రైన్ (రెండు నదుల సంగమం) వద్ద నా దాసుడొకడున్నాడు. అతను నీ కంటే గొప్ప జ్ఞానసంపన్నుడు" అని తెలియజేశాడు. "అయితే ప్రభూ! నేనాయన దగ్గరికి ఎలా చేరుకోవాలి?" అని అడిగారు హజ్రత్ మూసా (అలైహి). "నీ వెంట ఒక చేపను తోలుతిత్తిలో పెట్టుకొని తీసికెళ్ళు. ఎక్కడయితే నీకా చేప కన్పించదో ఆ ప్రదేశంలోనే నీవా మనిషిని కలుసుకోగలవు" అని తెలియజేశాడు దేవుడు.

హజ్రత్ మూసా (అలైహి) యూషెబిన్ నూన్ అనే సేవకుడ్ని వెంటబెట్టుకొని బయలుదేరారు. ఆ సేవకుని దగ్గర తోలు తిత్తిలో చేప ఉంది. ఈ విధంగా వీరిద్దరు చివరికి ఒక చట్టు బండ దగ్గరకు చేరుకున్నారు. దాని మీద మేను వాల్చి కాస్సేపు పడుకున్నారు (ప్రయాణ బడలికతో). అంతలో తోలు తిత్తిలో ఉన్న చేప కాస్తా ఎగిరి బయటికి వెళ్ళిపోయింది. ఆ చేప సముద్రంలోకి సొరంగం లాంటి దారి చేసుకొని చక్కా వెళ్ళిపోయింది. హజ్రత్ మూసా (అలైహి)కు ఆయన సేవకునికి ఇది ఆశ్చర్యం కలిగించింది. (సరే, వారా సంగతి గమనించకుండా అక్కడ్నుంచి బయలుదేరారు. ఆ రాత్రి మిగిలిన భాగం, మరునాడు పగలంతా వారలా నడుస్తూనే పోయారు. తెల్లవారిన తరువాత మూసా (అలైహి) తన సేవకునితో "ఇక తీసుకురా మా పలహారం. మేమీ ప్రయాణంలో చాలా అలసిపోయాము" అని అన్నారు.

కాని మూసా (అలైహి) తనకు దేవుడు సూచించిన ప్రదేశం దాటి చాలా దూరం ముందుకు పోయేసరికి బాగా అలసిపోయారు - అప్పుడు సేవకుడు (చేప సంగతి గుర్తొచ్చి) "చూశారా! మనం చట్టుబండ మీద విశ్రాంతి తీసుకున్నప్పుడు చేప భలే విచిత్రంగా ఎగిరి సముద్రంలోకి పారిపోయింది. తరువాత మీకు చెబుదామంటే ఆ సంగతి నాకు ఏమాత్రం గుర్తుకు రాలేదు" అని అన్నాడు. హజ్రత్ మూసా (అలైహి) అప్పుడు "మనం దాని కోసమే గదా వెతుకుతున్నాం" అని అన్నారు. కనుక వారిద్దరు వెనక్కి మరలి తమ అడుగు జాడల్లో నడుచుకుంటూ తిరిగి ఆ చట్టుబండ దగ్గరకు చేరుకున్నారు. వారికక్కడ వస్త్రంలో పూర్తిగా చుట్టబడి ఉన్న ఒక వ్యక్తి కన్పించాడు. హజ్రత్ మూసా (అలైహి) ఆ వ్యక్తికి సలాం చేశారు. దానికి ఆ వ్యక్తి (హజ్రత్ ఖిజర్) "మీ దేశంలో సలాం ఎక్కడుంది?" అని అడిగాడు. హజ్రత్ మూసా (అలైహి) ఈ మాట విని "నేను మూసాను" అని అన్నారు. "ఏ మూసా? ఇస్రాయీలీయుల మూసావా?" అడిగాడతను. "ఔనండీ! మీరు పొందిన జ్ఞానం నేను కూడా నేర్చుకోవడానికి నన్ను మీ వెంట ఉండనిస్తారా?" అడిగారు హజ్రత్ మూసా (అలైహి). "నీవు నా వెంట ఉండి (నా వ్యవహారాలు చూస్తూ) సహనం వహించలేవు. నీ దగ్గర లేనటువంటి ప్రత్యేక దైవిక జ్ఞానం నా దగ్గర ఉంది. దాన్ని దేవుడు స్వయంగా నాకు ప్రసాదించాడు. అలాగే నా దగ్గర లేనటువంటి ప్రత్యేక దివ్య జ్ఞానం నీ దగ్గర ఉంది. దాన్ని నీకు దేవుడు ప్రసాదించాడు" అన్నారు హజ్రత్ ఖిజర్ (అలైహి). "దేవుడు తలిస్తే మీరు నన్ను సహనశీలిగా చూడగలరు. నేను మీరిచ్చే ఏ ఆజ్ఞనూ జవదాటను" అన్నారు హజ్రత్ మూసా (అలైహి).

ఈ సంభాషణ తరువాత వారిద్దరూ తమ దగ్గర పడవ లేనందున నది ఒడ్డున నడవసాగారు. కాస్సేపటికి వారికొక పడవ కన్పించింది. వారు పడవ నడిపే వారితో "మమ్మల్ని కూడా పడవలో ఎక్కించుకోండి" అని అన్నారు. వారు హజ్రత్ ఖిజర్ (అలైహి)ను గుర్తుపట్టి ఎలాంటి అద్దె తీసుకోకుండానే వారిద్దర్నీ పడవలోకి ఎక్కించుకున్నారు. కాస్సేపటికి ఒక పిట్ట వచ్చి పడవ అంచు మీద కూర్చున్నది. అది నదిలోని నీటిని ఒకటి లేక రెండు బొట్లు ముక్కుతో పీల్చుకున్నది. హజ్రత్ ఖిజర్ (అలైహి) (ఆ పిట్టవైపు చూపిస్తూ) "నీకు, నాకు లభించిన జ్ఞానాన్ని దేవుని జ్ఞానంతో పోల్చితే అది ఈ పిట్ట నదిలో నుంచి నీటిని తన ముక్కుతో పీల్చుకున్నంత కూడా లేదు" అని అన్నారు.

ఆ తరువాత కాస్సేపటికి హజ్రత్ ఖిజర్ (అలైహి) పడవకు సంబంధించిన ఒక చెక్కను పీకి వేశారు. హజ్రత్ మూసా (అలైహి) అది చూసి "ఇదేమిటి? వీరు మనను అద్దె తీసుకోకుండా పడవలోకి ఎక్కించుకుంటే మీరు వీరి పడవనే విరగ్గొడ్తారా! పడవ, పడవలోని ప్రయాణీకులు అంతా నదిలో మునిగిపోవాలనా మీ ఉద్దేశం?" అని అన్నారు. దానికి హజ్రత్ ఖిజర్ (అలైహి) "నేను ముందే చెప్పలేదా నీవు నా వెంట ఉండి సహనం వహించలేవని?" అని అన్నారు. హజ్రత్ మూసా (అలైహి) "తప్పయిపోయింది. క్షమించండి (నన్ను ఇబ్బందిలో పడవేయకండి)" అని అన్నారు. ఇది మూసా (అలైహి) గారి మొదటి మరుపు.

ఆ తరువాత వారు ముందుకు సాగారు. వారొక చోట తోటి పిల్లలతో ఆడుకుంటున్న ఒక పిల్లవాడ్ని చూశారు. హజ్రత్ ఖిజర్ (అలైహి) ఆ పిల్లవాడి మెడ పట్టుకొని అతని తలను త్రుంచి మెడ నుండి వేరు చేశారు. మూసా (అలైహి) అది చూసి "మీరు ఏ పాపమెరుగని ఓ పసి బాలుడ్ని అన్యాయంగా చంపేశారే! అని అన్నారు. దానికి హజ్రత్ ఖిజర్ (అలైహి) ప్రతిస్పందిస్తూ "నేను ముందే చెప్పానుగా నీవు నా వెంట ఉండి సహనం వహించలేవని?" అని అన్నారు (హజ్రత్ మూసా (అలైహి) మళ్ళీ తప్పయిపోయింది, క్షమించండి అంటారు).

అక్కడ్నుంచి వారిద్దరూ ముందుకు సాగారు. చివరికి వారొక పట్నానికి చేరుకొని పట్నవాసులతో తమకు అన్నం పెట్టండని కోరారు. కాని పట్నవాసులు వారికి ఆతిథ్యమివ్వడానికి నిరాకరించారు. తరువాత (ఆ పట్నంలోనే) వారికొక ఓ ప్రక్కకు వొరిగిపోయిన ఒక గోడ కన్పిస్తుంది. అది పడిపోయే స్థితిలో ఉంది. హజ్రత్ ఖిజర్ (అలైహి) దాన్ని చేత్తో సైగ చేసి నిటారుగా నిలబెట్టారు. మూసా (అలైహి) అది చూసి "మీరు కోరుకుంటే ఈ గోడ మరమ్మత్తుకు ప్రతిఫలం తీసుకోగలరు కదా!" అని అన్నారు. అప్పుడు హజ్రత్ ఖిజర్ (అలైహి) మాట్లాడుతూ "ఇది చివరి అవకాశం. ఇక నీవు నా నుండి విడిపోక తప్పదు" అని అన్నారు.

దేవుడు మూసా (అలైహి)ను కరుణించుగాక! ఆయన గనక సహనం వహించి ఉంటే ఎంత బాగుండేది. మనకా సంఘటనలను గురించిన పూర్తి వివరాలు తెలిసి ఉండేవి.

(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం - ఇల్మ్, 44వ అధ్యాయం - మాయుస్తహబ్బులిల్ ఆలిమి ఇజాసుయిల అయ్యున్నాసి ఆలమ్ ఫయకిలుల్ ఇల్మ ఇలల్లాహ్)

# ప్రవక్త సహచరుల (ర.అ) మహిమోన్నతల ప్రకరణం

## 1వ అధ్యాయం - హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి) విశిష్టత

1540. హజ్రత్ అబూబకర్ (రజి) కథనం:- మేము సూర్ (గుహ)లో ఉన్నప్పుడు నేను దైవప్రవక్త (సల్లం)తో "వారిలో (అంటే అవిశ్వాసుల్లో) ఎవరైనా ఒకడు వంగి క్రింది వైపు నుండి చూస్తే మాత్రం మనం వాళ్ళకు కనపడతాం" అని అన్నాను. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "అబూ బకర్! తమకు తోడు మూడవవాడిగా దేవుడు ఉన్న ఇద్దరు వ్యక్తులను గురించి నీ అభిప్రాయం ఏమిటి?" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హా బిన్నబియ్యి (సల్లం), 2వ అధ్యాయం - మనాఖిబిల్ ముహాజిరీన్ వ ఫజ్లిహిమ్)

1541. హజ్రత్ అబూసయీద్ ఖుదరీ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) వేదిక ఎక్కి ఇలా అన్నారు: "దేవుడు తన దాసులలోఒకరికి రెండు విషయాలలోఒకదాన్ని కోరుకునే అధికారం ఇచ్చాడు. ఇహలోకంలో కోరుకున్నన్ని సిరిసంపదలు, భోగభాగ్యాలు ఇవ్వబడతాయని, లేదా (పరలోకంలో) దేవుని దగ్గర ఉన్న వాటిని కోరుకోవచ్చని అతనికి అధికారం ఇవ్వబడింది. అప్పుడా దాసుడు దేవుని దగ్గర ఉన్న వాటినే కోరుకున్నాడు". హజ్రత్ అబూబకర్ (రజి) ఈ మాటలు విని కంట తడి పెట్టుకున్నారు. ఆయన దైవప్రవక్త (సల్లం) నుద్దేశించి "మేము, మా తల్లిదండ్రులు మీ కోసం సమర్పితం"! అని అన్నారు.

హజ్రత్ అబూబకర్ (రజి) ధోరణి చూసి మేమంతా ఆశ్చర్యపోయాము. కొందరు తమలో తాము మాట్లాడుకుంటూ "దైవప్రవక్త (సల్లం) ఒక దాసుడ్ని గురించి చెబుతూ, ఆ దాసుడు కోరుకుంటే ప్రపంచంలోనే కావలసినన్ని సిరిసంపదలు, భోగభాగ్యాలు ఇవ్వబడతాయని, లేదా దేవుని దగ్గర ఉన్నవాటినైనా కోరుకోవచ్చని అతనికి దేవుడు అధికార మిచ్చాడని అన్నారు. కాని ఈ పెద్ద మనిషి తాము తమ తల్లిదండ్రులు దైవప్రవక్త (సల్లం)కు సమర్పితం అంటున్నాడేమిటి?" అని అన్నారు. అయితే అసలు విషయం అది కాదు. దేవుడు ఈ అధికారం ఏ దాసునికి ఇచ్చాడో ఆ దాసుడు స్వయంగా దైవప్రవక్తే (సల్లం). ఈ విషయాన్ని మాలో హజ్రత్ అబూబకర్ (రజి) మాత్రమే అర్థం చేసుకున్నారు.

దైవప్రవక్త (సల్లం), హజ్రత్ అబూబకర్ (రజి) సుగుణాన్ని ప్రస్తావిస్తూ ఇలా అన్నారు:- "ప్రజలందరిలో కెల్లా మైత్రి, సిరిసంపదలతో అత్యధికంగా నాతో సహకరించి, నాకు సేవ చేసిన వ్యక్తి ఎవరైనా ఉన్నారంటే ఆయన అబూబకర్ (రజి) మాత్రమే. నా అనుచర సమాజంలో నేనెవరినైనా ప్రాణ

స్నేహితుడి (ఖలీల్)గా చేసుకోదలచుకుంటే అబూబకర్ (రజి)ని ప్రాణ స్నేహితుడిగా చేసుకుంటాను. కాని ఇప్పుడు మా మధ్య ఇస్లామీయ మైత్రి నెలకొన్నది. (ఒక విషయం గుర్తుంచుకోండి) మస్జిద్ (మస్జిదెనబవీ) వైపు ఎవరి (ఇంటి) కిటికీ తెరచి ఉండరాదు, అబూబకర్ (రజి) ఇంటి కిటికీ తప్ప".

**(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 45వ అధ్యాయం - హిజ్రతున్నబియ్యి (సల్లం) వ అస్హాబిహీ ఇలల్ మదీనా)**

1542. హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) నన్ను "జాతిస్సలాసిల్ (మదీనా నుండి సిరియా దిశగా వెళ్ళే దారిలో ఉన్న బనీ జజామ్ తెగవాళ్ళ నీటి బుగ్గ పేరు)కు వెళ్ళే సైన్యానికి సేనాపతిగా నియమించారు. అప్పుడు నేను దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి "అందరికంటే మీకు ప్రియమైన వ్యక్తి ఎవరు?" అని అడిగాను. దానికి ఆయన "ఆయిషా (రజి)" అని చెప్పారు. "మరి పురుషుల్లో ఎవరు?" అని నేను మళ్ళీ అడిగాను. "ఆయిషా (రజి) తండ్రి" అని ఆయన సమాధానమిచ్చారు. "ఆయన తరువాత ఎవరు?" నేను మళ్ళీ అడిగాను. "ఆయన తరువాత ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి)" అన్నారు ఆయన. ఉమర్ (రజి) తరువాత కూడా ఆయన అనేకమంది పేర్లను ప్రస్తావించారు.

**(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హాబిన్నబియ్యి (సల్లం), 5వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) లౌకున్తుముత్తఖిజన్ ఖలీలా)**

1543. హజ్రత్ జుబైర్ బిన్ ముత్అమ్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) దగ్గరకు ఒక స్త్రీ వచ్చింది (ఏదో అడగటానికి). దైవప్రవక్త (సల్లం) ఆమెను మరోసారి రమ్మని ఆదేశించారు. అప్పుడామె "నేను మళ్ళీ వచ్చినప్పుడు మీరు లేకపోతే నేనేం జేయను?" అని అడిగింది - అంటే ఒకవేళ మీరు ఇహలోకం వీడిపోతేనూ? అని అర్థం - దానికి దైవప్రవక్త (సల్లం) "నేను లేకపోతే అబూబకర్ (రజి) దగ్గరకు వెళ్ళు" అని సమాధానమిచ్చారు.

**(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హాబిన్నబియ్యి (సల్లం), 5వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) లౌకున్తు ముత్తఖిజన్ ఖలీలా)**

1544. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఓ రోజు ఫజ్ర్ నమాజ్ చేయించిన తరువాత ప్రజల వైపుకు తిరిగి ఇలా ఉద్బోధించారు - ఒక వ్యక్తి ఒక ఎద్దును తోలుకెళ్తున్నాడు. కాస్సేపటి తరువాత అతనా ఎద్దుపైకెక్కి కొట్టసాగాడు. అప్పుడా ఎద్దు "మేము స్వారీ కోసం సృష్టించబడలేదు. మేమసలు వ్యవసాయ పనుల కోసం సృష్టించబడ్డాము" అని అన్నది.

ప్రజలు ఈ మాట విని "సుబ్హానల్లాహ్! (ఆశ్చర్యంగా ఉందే!) ఎద్దు కూడా మాట్లాడు తుందా?" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "నేనీ విషయాన్ని విశ్వసిస్తున్నాను. నేనేకాదు, అబూబకర్ (రజి), ఉమర్ (రజి)లు కూడా" అని అన్నారు (దైవప్రవక్త (సల్లం). ఈ మాట చెబుతున్నప్పుడు వారిద్దరూ అక్కడ లేరు).

మరొక వ్యక్తి మేకలు కాస్తుంటే, ఒక తోడేలు లంఘించి ఆ మేకలలో ఒక దాన్ని తీసుకెళ్ళింది.

మేకల కాపరి ఆ తోడేలును వెంబడించి ఎలాగో తన మేకను దాన్నుంచి విడిపించుకున్నాడు. అప్పుడా తోడేలు అతనితో "ఓ మనిషీ! నువ్వీ మేకను నా నుండి లాక్కున్నావు. కాని అడవి మృగాలు నిన్ను తరిమేసే రోజు ఈ మేకలను ఎవరు రక్షిస్తారు? అప్పుడు నేనే కదా వాటికి కాపలా ఉండేదాన్ని" అని అన్నది.

ప్రజలు ఈ మాట విని "సుబ్‌హానల్లాహ్ (ఆశ్చర్యంగా ఉందే)! తోడేలు కూడా మాట్లాడు తుందా?" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "నేనీ విషయాన్ని నమ్ముతున్నాను. నేనే కాదు, అబూబకర్ (రజి), ఉమర్ (రజి)లు కూడా" అని అన్నారు (దైవప్రవక్త (సల్లం) ఈ మాట చెప్పినప్పుడు వారిద్దరూ అక్కడ లేరు).

**(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 54వ అధ్యాయం - హద్దసనా అబుల్ యమాన్)**

## 2వ అధ్యాయం - హజ్రత్ ఉమర్ (రజి) వైశిష్ట్యం

1545. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- హజ్రత్ ఉమర్ (రజి) భౌతిక కాయాన్ని శవపేటికలో ఉంచారు. ప్రజలు ఆ శవపేటికకు నలువైపులా గుమికూడి హజ్రత్ ఉమర్ (రజి) కోసం మన్నింపు వేడుకోలు చేస్తున్నారు. వారంతా జనాజా నమాజు కోసం వచ్చారు. నేను కూడా వారిలో చేరి ఉన్నాను. అంతలో ఒక వ్యక్తి హఠాత్తుగా నా భుజమ్మీద చేయి వేశాడు. నేను కంగారుపడుతూ వెనక్కి తిరిగి చూశాను. చూస్తే హజ్రత్ అలీ (రజి) నిలబడి ఉన్నారు. ఆయన ముందుకు వచ్చి ఇలా అన్నారు - "ఉమర్! దేవుడు మిమ్మల్ని కరుణించుగాక! మీరు మీ వెనుక ఆదర్శప్రాయుడైన ఒక వ్యక్తిని కూడా నాకు వదలిపెట్టలేదు. అలాంటి వ్యక్తి చేసే కర్మలు లాంటి కర్మలు ఆచరించి, వాటిని తీసుకొని నేను దేవుని సన్నిధికి వెళ్ళాలన్న నా కోరిక కోరికగానే మిగిలిపోయింది. దైవసాక్షిగా చెబుతున్నాను. దేవుడు మిమ్మల్ని మీ మిత్రులిద్దరితో పాటు ఉంచుతాడని నాకు నమ్మకం ఉంది. నేనీ అభిప్రాయం వెలిబుచ్చడానికి కారణం - దైవప్రవక్త (సల్లం) తరచుగా 'నేనూ, అబూబకర్, ఉమర్ (రజి)లు వెళ్ళాము; నేనూ, అబూబకర్, ఉమర్ (రజి)లు ప్రవేశించాము; నేనూ అబూబకర్, ఉమర్ (రజి)లు బయటకి వచ్చాము' అని అంటుంటే నేను వినేవాడ్ని".

**(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్‌హాబిన్నబియ్యి (సల్లం), 6వ అధ్యాయం-మనాఖిబి ఉమర్ బిన్ ఖత్తాబ్ అబీ హఫ్సా)**

1546. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఓ సారి ఇలా అన్నారు - "నేను పడుకున్నాను. (కలలో) నేను కొందరిని నా దగ్గరకు తీసుకు రావడం చూశాను. వారంతా (రకరకాల సైజుల్లో) చొక్కాలు ధరించి ఉన్నారు. కొందరి చొక్కాలు రొమ్ము దాకా ఉన్నాయి. మరి కొందరి చొక్కాలు అంతకంటే చిన్నవిగా ఉన్నాయి. తరువాత నా ముందుకు ఉమర్ (రజి)ని తీసుకురావడం జరిగింది. ఆయన నేలమీద జీరాడే అంత పొడుగైన చొక్కా ధరించి ఉన్నారు."

ప్రవక్త అనుచరులు (రజి) ఈ మాట విని "దైవప్రవక్తా! దీని గూఢార్థం ఏమిటో సెలవియ్యండి" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) "దీన్ (ధర్మం)" అని చెప్పారు. (పొడుగాటి చొక్కా అంటే ఇక్కడ గొప్ప ధర్మ పరాయణత అని అర్థం).

**(సహీహ్ బుఖారీ:- 2వ ప్రకరణం - ఈమాన్, 15వ అధ్యాయం - తఫాజులి అహ్లిల్ ఈమాన్ ఫిల్ ఆమాల్)**

1547. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఓసారి ఈ విధంగా తెలియజేశారు - "నేను పడుకున్నాను. (కలలో) నేను నా దగ్గరికి ఒక పాల గిన్నె తీసుకురావడం చూశాను. నేనా పాలను కడుపు నిండా త్రాగాను. చివరికి ఆ పాలు నా కడుపు నిండిపోయి నా (చేతి) గోళ్ళ నుండి ధారలయి వెలువడుతుందా అన్పించింది నాకు. ఆ తరువాత నేను మిగిలిపోయిన పాలను ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి)కు ఇచ్చాను."

ప్రవక్త అనుచరులు (రజి) ఈ మాటలు విని "దైవప్రవక్తా! దీని గూడార్థం ఏమిటో సెలవియ్యండి" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) "ఇల్మ్ (జ్ఞానం)" అని సమాధానమిచ్చారు.[1]

(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం - ఇల్మ్, 22వ అధ్యాయం - ఫజ్లిల్ ఇల్మ్)

1548. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- నేను నిద్రలో ఓ కల గన్నాను. ఆ కలలో నేను ఒక బావి దగ్గర నిల్చున్నాను. అక్కడ ఒక బొక్కెన పడి ఉంది. నేనా బొక్కెన తీసుకొని ఆ బావిలో నుంచి దేవుడు తలచినన్ని నీళ్ళు తోడాను. తరువాత ఆ బొక్కెనను అబూబకర్ (రజి) తీసుకున్నారు. దాంతో ఆయన ఒకటి రెండు బొక్కెనల నీళ్ళు తోడి తీశారు. కాని ఆయన తోడే తీరులో కాస్త బలహీనత తొంగి చూసింది. దేవుడు ఆయన బలహీనతను క్షమించుగాక! ఆ తరువాత ఆ బొక్కెన మామూలు సైజు కన్నా పెరిగి పెద్ద బొక్కెనయిపోయింది. దాన్ని ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) తీసుకున్నారు. ఏ మల్లయోధుడు కూడా ఆ విధంగా నీరు చేదుతున్నట్లు నేను చూడలేదు. ఆయన చేదిన నీళ్ళతో ప్రజలు తృప్తిగా దాహం తీర్చుకున్నారు. అంతేగాకుండా, వారు తమ పశువులక్కూడా ఆ నీళ్ళు కడుపారా త్రాగించి, వాటిని వాటి విశ్రాంతి స్థలాలకు తోలుకెళ్ళి పండబెట్టారు[2].

(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్ హాబిన్నబియ్యి (సల్లం), 5వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) లౌకున్తు ముత్తఖిజన్ ఖలీలా)

1549. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- నేను కలలో ఒక బావి నుండి బొక్కెనతో ఒక ఒంటె త్రాగగలిగే అంత నీరు తోడుతున్నట్లు చూశాను. తరువాత అబూబకర్ (రజి) వచ్చి ఒకటి రెండు బొక్కెనలు నీళ్ళు తోడి తీశారు. అయితే కాస్త బలహీనంగా నీళ్ళు తోడారు. దేవుడు ఆయన్ని మన్నించు గాక! ఆ తరువాత ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) వచ్చారు. అప్పుడా బొక్కెన పెద్ద బొక్కెనగా మారిపోయింది. ఆయన పని తీరు చూస్తుంటే, పెద్ద పెద్ద మొనగాళ్ళు కూడా అంతటి పని చేసినట్లు నేను చూడలేదు. చివరికి ఆయన తోడిన నీళ్ళతో

---

1. ఇక్కడ పాలను జ్ఞానంతో సూచనా ప్రాయంగా పోల్చడం జరిగింది. దాని ప్రకారం నేను జ్ఞాన క్షీరాన్ని కడుపారా సేవించానని, మిగిలిన దాన్ని హజ్రత్ ఉమర్ (రజి) సేవించారని దైవప్రవక్త (సల్లం) అన్నారు. పాలు చంటి పిల్లలకు ఆహారంగా ఉపయోగపడుతూ వారికి బలాన్నిస్తుంది. అలాగే జ్ఞానం మానవుని ఆత్మవికాసానికి ఆహారంగా, బలవర్ధక పదార్థంగా ఉపయోగపడుతుంది. (సంకలనకర్త)

2. హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి), హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి)ల ఖిలాఫత్ పాలనల్లో జరిగిన సమస్త సంఘటనలకు, యదార్థాలకు ఈ స్వప్నం ఓ మంచి తార్కాణమని వారిద్దరి సచ్ఛీలం, గుణగణాలు, నీతి నిజాయితీలకు దర్పణమని హదీసువేత్తలు వ్యాఖ్యానించారు. అదంతా దైవప్రవక్త (సల్లం) శిక్షణా ప్రభావం. హజ్రత్ సిద్దీఖ్ (రజి) తరువాత హజ్రత్ ఫారూఖ్ (రజి) పాలనలో ప్రజలు ఏ చీకూ చింతా లేకుండా శాంతి సుఖాలతో జీవించారు. దీన్ని గురించిన భవిష్యత్ ప్రకటన కూడా ఈ హదీసులో ఉంది. (సంకలనకర్త)

ప్రజలంతా తృప్తిగా దాహం తీర్చుకున్నారు. పైగా వారు ఒంటెలక్కూడా నీళ్ళు త్రాగించి వాటిని వాటి విశ్రాంతి స్థలాలకు తోలుకెళ్ళారు.

**(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హాబిన్నబియ్యి (సల్లం) 6వ అధ్యాయం - మనాఖిబి ఉమరబ్నిల్ ఖత్తాబి అబీహఫ్సా)**

1550. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) మాతో ముచ్చటిస్తూ ఇలా అన్నారు - "నేను స్వర్గంలో ప్రవేశించి (అద్భుతమైన) ఒక మహల్ (మేడ)ని చూశాను. ఈ మహల్ ఎవరిదని అడిగాను. ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి)ది అని సమాధానం వచ్చింది. నేనందులో ప్రవేశించి చూద్దామనుకున్నాను. కాని ఉమర్! నాకు నీలో ఉన్న ఆత్మాభిమానం గుర్తొచ్చి ఆగిపోయాను." హజ్రత్ ఉమర్ (రజి) ఈ మాట విని, "దైవప్రవక్తా! నా తల్లిదండ్రులు మీ కోసం సమర్పితం!! మీ విషయంలో కూడా నాకు ఆత్మాభిమానమా?" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 67వ ప్రకరణం - నికాహ్, 107వ అధ్యాయం - అల్‌గైరా)**

1551. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం :- మేము దైవప్రవక్త (సల్లం) సన్నిధిలో కూర్చున్నాము. దైవప్రవక్త (సల్లం) మాతో ముచ్చటిస్తూ ఇలా అన్నారు - "నేను కలలో స్వర్గంలో ప్రవేశించినట్లు చూశాను. అక్కడ ఒక మేడలో ఓ మూలన ఒక స్త్రీ వుజూ చేయసాగింది. నేనీ మేడ ఎవరిదని అడిగాను. ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి)ది అని నాకు సమాధానం వచ్చింది. అప్పుడు నాకు ఉమర్ (రజి) ఆత్మాభిమానం గుర్తుకు వచ్చి నేను వెనుతిరిగి వచ్చాను." హజ్రత్ ఉమర్ (రజి) ఈ మాట విని "దైవప్రవక్తా! మీ విషయంలో కూడా నాకు ఆత్మాభిమానమా?" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్‌యిల్ ఖల్ఖ్, 8వ అధ్యాయం - మాజాఅ ఫీసిఫతిల్ జన్న వ అన్నహామఖ్లూఖ)**

1552. హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి) కథనం :- హజ్రత్ ఉమర్ (రజి) దైవప్రవక్త (సల్లం) ఇంటికి వెళ్ళి లోపలికి రావడానికి అనుమతి అడిగారు. ఆ సమయంలో కొందరు స్త్రీలు దైవప్రవక్త (సల్లం)తో పెద్దపెద్దగా మాట్లాడుతున్నారు. వారి కంఠస్వరాలు బిగ్గరగా వినవస్తున్నాయి. అయితే హజ్రత్ ఉమర్ (రజి) బయట నిలబడి లోపల ప్రవేశించడానికి అనుమతి అడగ్గానే వారు గబగబా లేచి తెర వెనక్కి వెళ్ళిపోయారు. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) హజ్రత్ ఉమర్ (రజి)ను లోపలికి రావడానికి అనుమతించారు. హజ్రత్ ఉమర్ (రజి) లోపలికి వచ్చి చూస్తే దైవప్రవక్త (సల్లం) పకపకా నవ్వుతూ కనిపించారు. అప్పుడాయన "దైవప్రవక్తా! దేవుడు మిమ్మల్ని ఎల్లప్పుడూ నవ్వుతూ ఉంచుగాక" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) "నేనా స్త్రీల ధోరణి చూసి ఆశ్చర్యపోయి నవ్వుతున్నాను. వారు ఇంతకుముందు ఇక్కడే కూర్చున్నారు. బయట నుంచి మీ కంఠస్వరం వినగానే తుర్రున తెరవెనక్కి పరుగెత్తారు" అన్నారు దైవప్రవక్త (సల్లం).

హజ్రత్ ఉమర్ (రజి) ఈ మాట విని "దైవప్రవక్తా! నిజానికి ఆ స్త్రీలు మిమ్మల్ని చూసి భయపడాలి. అందుకు మీరే యోగ్యులు" అని అన్నారు. ఆ తరువాత ఆయన తెర వెనకున్న స్త్రీలను సంబోధిస్తూ "ఆత్మ విరోధులారా! మీరు దైవప్రవక్త (సల్లం)కు భయపడవలసింది నాకు

భయపడుతున్నారా?" అని అన్నారు. దానికా స్త్రీలు సమాధానమిస్తూ "మీరు చాలా కోపిష్ఠి; కఠిన స్వభావులు. దైవప్రవక్త (సల్లం) అలాంటి వారు కారు. ఆయన మృదు స్వభావులు (కలుపుగోలుతనం కలవారు)" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) హజ్రత్ ఉమర్ (రజి)తో "నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ దేవుని సాక్షి! ఒకవేళ షైతాన్ నిన్ను ఏ దారినైనా నడుస్తూ రావడం చూస్తే, వెంటనే వాడు ఆ దారి వదలిపెట్టి మరో దారిన వెళ్ళిపోతాడు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్'యిల్ ఖల్క్, 11వ అధ్యాయం - సిఫతి ఇబ్లీస వ జునూదిహి)**

1553. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- (కపట విశ్వాసుల నాయకుడు) అబ్దుల్లా బిన్ ఉబై చనిపోయినప్పుడు అతని కుమారుడు హజ్రత్ అబ్దుల్లా (రజి) దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి, తన తండ్రి భౌతిక కాయానికి వస్త్ర సంస్కారం (కఫన్) జరపడానికి ఆయన (సల్లం) చొక్కా ఇవ్వవలసిందిగా అర్థించారు. దైవప్రవక్త (సల్లం) తమ చొక్కా తీసి ఆయనకు ఇచ్చివేశారు. ఆ తరువాత హజ్రత్ అబ్దుల్లా (రజి) తన తండ్రి కోసం శవప్రార్థన (జనాజా నమాజ్) చేయవలసిందిగా కూడా దైవప్రవక్త (సల్లం)ను విన్నవించుకున్నారు. దైవప్రవక్త (సల్లం) ఆ శవప్రార్థన చేయడానికి వెళ్ళేందుకు లేచి నిలబడ్డారు.

అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) లేచి దైవప్రవక్త (సల్లం) అంగవస్త్రం పట్టుకొని "దైవప్రవక్తా! ఏమిటీ, మీరు ఆ వ్యక్తి కోసం శవప్రార్థన చేస్తారా?! అతని జనాజా నమాజ్ చేయించరాదని దేవుడు మిమ్మల్ని వారించాడు కదా! అలాంటప్పుడు మీరు అతని కోసం శవప్రార్థన ఎలా చేస్తారు?" అని అడిగారు. దానికి దైవప్రవక్త సమాధానమిస్తూ "నేను కోరితే అతని కోసం మన్నింపు వేడుకోలు చేయవచ్చని, లేదా మానెయ్యవచ్చని దేవుడు నాకు అధికారమిచ్చాడు. అదీగాక ఆయన 'నువ్వు అతని కోసం డెబ్భై సార్లు మన్నింపు ప్రార్థన చేసినా దేవుడు అతడ్ని మన్నించడ'ని (ఖుర్ఆన్‌లో -9:80) ఉంది. అంచేత నేను డెబ్భై కంటే ఎక్కువసార్లు మన్నింపు ప్రార్థన చేయడానికి నిర్ణయించుకున్నాను" అని అన్నారు. హజ్రత్ ఉమర్ (రజి) ఈ మాట విని "దైవప్రవక్తా! అతను (కరడుగట్టిన) కపటవిశ్వాసి. అందులో ఏమాత్రం సందేహం లేదు మరి" అని అన్నారు.

అయినప్పటికీ దైవప్రవక్త (సల్లం) వెళ్ళి ఆ కపట విశ్వాసి కోసం శవప్రార్థన చేశారు. అప్పుడు దేవుడు ఈ సూక్తిని అవతరింపజేశాడు - "ఇక ముందు అలాంటి వారిలో ఎవరైనా చనిపోతే వారి కోసం నీవు శవ ప్రార్థన చేయకూడదు సుమా! వారి గోరీల దగ్గర కూడా నిలబడకూడదు." (9:82)

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 9వ సూరా-బరాత్ (తౌబా), 12వ అధ్యాయం - అస్తగ్ఫిర్‌లహుమ్ ఔలా తస్తగ్ ఫిర్ లహుమ్)**

## 3వ అధ్యాయం - హజ్రత్ ఉస్మాన్ బిన్ అప్ఫాన్ (రజి) మహిమోన్నతలు

1554. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం :- నేను మదీనాలో దైవప్రవక్త (సల్లం)తో కలసి ఓ తోటలో కూర్చొని ఉంటే ఒక వ్యక్తి వచ్చి తలుపు తెరవమని అడిగారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) నాతో, "తలుపు తెరు, అతనికి స్వర్గ శుభవార్త తెలియజెయ్యి" అని అన్నారు. నేను లేచి తలుపు తెరిస్తే

హజ్రత్ అబూబకర్ (రజి) నిలబడి ఉన్నారు. నేనాయనకు దైవప్రవక్త (సల్లం) ఆదేశం ప్రకారం స్వర్గ శుభవార్త తెలియజేశాను. అందుకు ఆయన దేవునికి కృతజ్ఞతలు తెలుపుకున్నారు.

ఆ తరువాత కాస్సేపటికి మరొక వ్యక్తి వచ్చి తలుపు తెరవండన్నారు. దైవప్రవక్త (సల్లం) నాతో "తలుపు తెరచి, అతనికి స్వర్గ శుభవార్త అందజెయ్యి" అని అన్నారు. నేను లేచి తలుపు తెరిస్తే హజ్రత్ ఉమర్ (రజి) కన్పించారు. నేనాయనకు దైవప్రవక్త (సల్లం) ప్రవచనం తెలియజేశాను (అంటే ఆయనకు స్వర్గ శుభవార్త తెలియజేశాను). ఆయన కూడా దేవునికి కృతజ్ఞతలు సమర్పించుకున్నారు.

ఆ తరువాత కాస్సేపటికి వేరొక వ్యక్తి వచ్చి తలుపు తెరవండన్నారు. దైవప్రవక్త (సల్లం) నన్ను ఆదేశిస్తూ "తలుపు తెరచి, అతనొక ఆపదలో చిక్కుకుంటాడని తెలియజెయ్యి. తరువాత అతను స్వర్గానికి వెళ్తాడని శుభవార్త విన్పించు" అని అన్నారు. నేను లేచి తలుపు తెరిస్తే హజ్రత్ ఉస్మాన్ (రజి) కన్పించారు. ఆయనక్కూడా నేను దైవప్రవక్త (సల్లం) చెప్పిన విషయాలు విన్పించాను. దానికి ఆయన కూడా దైవానికి కృతజ్ఞతలు సమర్పించుకున్నారు. తరువాత "దేవుడే సహాయం చేసేవాడు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హా బిన్నబియ్యి (సల్లం), 6వ అధ్యాయం - మనాఖిబి ఉమరబ్నిల్ ఖత్తాబి అబీ హఫ్సా)**

1555. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం :- నేనొక రోజు ఇంట్లో వుజూ చేసుకొని, ఈ రోజు నేను దైవప్రవక్త (సల్లం) దగ్గర ఉండి, పగలంతా ఆయన సేవలో గడపాలని అనుకున్నాను. మనసులో ఇలా ఆలోచించి నేను మస్జిద్‌కు వెళ్ళాను. అక్కడ దైవప్రవక్త (సల్లం)ను గురించి విచారిస్తే ఆయన బయటికెళ్ళారని, అటువైపు వెళ్ళారని చెప్పారు కొందరు. అక్కడ్నుంచి నేను ఆయన అడుగుజాడల్లో నడుచుకుంటూ ప్రజలను విచారిస్తూ ఆ దిశగా వెళ్ళాను. చివరికి అరీస్ తోట దగ్గరకు చేరుకొని, దాని తలుపు దగ్గర కూర్చున్నాను. అది చెక్కతో చేసిన తలుపు. దైవప్రవక్త (సల్లం) తమ అవసరాలు ముగించుకొని వుజూ చేసిన తరువాత నేనాయన దగ్గరికి వెళ్ళాను. ఆ సమయంలో ఆయన అరీస్ బావి ఒడ్డు మీద కూర్చొని, కాళ్ళు నూతిలో జారవిడిచి ఉన్నారు. నేనాయనకు సలాం చేసి తిరిగి తలుపు దగ్గరికెళ్ళి కూర్చున్నాను. నేనా రోజంతా దైవప్రవక్త (సల్లం) దగ్గర ద్వారపాలకుడిగా ఉండాలనుకున్నాను మనసులో.

కాస్సేపటికి హజ్రత్ అబూ బకర్ (రజి) వచ్చి తలుపు తట్టారు. నేను 'ఎవరండీ' అన్నాను. "అబూ బకర్" అన్నారు ఆయన. 'కాస్త ఆగండి' అంటూ నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికెళ్ళి "దైవప్రవక్తా! అబూ బకర్ వచ్చారు. లోపలికి రావడానికి మీ అనుమతి కోరుతున్నారు" అని చెప్పాను. దానికి దైవప్రవక్త (సల్లం) "అయితే రమ్మను. ఆయనకు స్వర్గ శుభవార్త విన్పించు" అని అన్నారు. నేను వెళ్ళి "రండి, దైవప్రవక్త (సల్లం) మీకు స్వర్గ శుభవార్త తెలుపుతున్నారు" అని అన్నాను. హజ్రత్ అబూ బకర్ (రజి) లోపలికి వచ్చి దైవప్రవక్త (సల్లం)కు కుడివైపు బావి ఒడ్డు మీద కూర్చున్నారు. ఆయన కూడా దైవప్రవక్త (సల్లం) లాగే బావిలో కాళ్ళు జారవిడిచి కూర్చున్నారు. నేను వెళ్ళి తిరిగి తలుపు దగ్గర కూర్చున్నాను.

నేను (ఇంటి నుండి బయలుదేరుతూ) నా సోదరుడ్ని అక్కడే వదలి వచ్చాను. వుజూ చేసుకొని అతను కూడా నా దగ్గరకు వస్తాడని భావించాను. దేవునికి అతని శ్రేయస్సు ఇష్టమైతే ఆయన అతడ్ని ఈ రోజు నా దగ్గరికి (ఇక్కడికి) పంపిస్తాడని మనస్సులో తలపోశాను.

అంతలో మరొక వ్యక్తి వచ్చి తలుపుతట్టాడు: నేను 'ఎవరండీ!' అన్నాను. "ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి)" అని అన్నారు ఆయన. "అయితే ఆగండి కాస్త" అంటూ నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికెళ్ళి సలాం చేసి "ఉమర్ (రజి) వచ్చారు. లోపలికి రావడానికి మీ అనుమతి కోరుతున్నారు" అని అన్నాను. "సరే రమ్మను. ఆయనక్కూడా స్వర్గ శుభవార్త అందజేయి" అన్నారు దైవప్రవక్త (సల్లం). నేను వెళ్ళి (తలుపు తెరచి)" రండి. దైవప్రవక్త (సల్లం) మీకు స్వర్గ శుభవార్త తెలియజేస్తున్నారు" అని చెప్పాను. హజ్రత్ ఉమర్ (రజి) లోపలికి వచ్చి దైవప్రవక్త (సల్లం)కు ఎడమ వైపు బావి ఒడ్డు మీద కూర్చున్నారు. ఆయన కూడా కాళ్ళను బావిలో జారవిడిచారు. నేను మళ్ళీ తలుపు దగ్గరికెళ్ళి కూర్చున్నాను.

నేను మనసులో 'దేవునికి అతని (అంటే నా సోదరుని) శ్రేయస్సు ఇష్టమైతే అతడ్ని ఈ రోజు ఇక్కడికి పంపిస్తాడు' అని తలపోశాను. అంతలో వేరొక వ్యక్తి వచ్చి తలుపు తట్టాడు. నేను 'ఎవరండీ' అన్నాను. "ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్" అని సమాధానమిచ్చారు ఆయన. "అయితే కాస్త ఆగండి" అంటూ నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికెళ్ళి ఈ సంగతి తెలియజేశాను. "సరే రమ్మను. ఆయనపై ఒక ఆపద వచ్చి పడుతుందని, తత్ఫలితంగా అతను స్వర్గానికి వెళ్తాడని శుభవార్త అందజేయి" అని చెప్పారు దైవప్రవక్త (సల్లం). నేను వెళ్ళి "రండి. మీరొక ఆపదకు గురయి స్వర్గానికి వెళ్తారని దైవప్రవక్త (సల్లం) మీకు శుభవార్త తెలుపమన్నారు" అని చెప్పాను. హజ్రత్ ఉస్మాన్ (రజి) కూడా లోపలికి వచ్చారు. చూస్తే బావి ఒడ్డు మీద (ప్రవక్త పక్కన) కూర్చోవడానికి స్థలం లేకుండా పోయింది. అందువల్ల ఆయన దైవప్రవక్త (సల్లం)కు ఎదురుగా అవలి ఉన్న ఒడ్డు మీద కూర్చున్నారు. ఈ హదీసును హజ్రత్ అబూ మూసా (రజి) నుండి గ్రహించి ఉల్లేఖించిన హజ్రత్ సయీద్ బిన్ ముసైబ్ (రహ్మాలై) దీనిపై వ్యాఖ్యానిస్తూ "దీని గూఢార్థం వారి సమాధులు కూడా అలాగే ఏర్పాటయ్యాయని నా అభిప్రాయం" అని అన్నారు.★

**(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హాబిన్నబియ్యి (సల్లం), 5వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) లౌకున్తు ముత్తఖిజన్ ఖలీలా)**

## 4వ అధ్యాయం - హజ్రత్ అలీ (రజి) మహిమోన్నతలు

1556. హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) తబూక్ పోరాటానికి బయలుదేరుతూ హజ్రత్ అలీ (రజి)ని (మదీనాలో) తమ ప్రతినిధిగా నియమించారు. ఆ సందర్భంలో హజ్రత్ అలీ (రజి) దైవప్రవక్త (సల్లం)తో "నన్ను స్త్రీలు పిల్లల మధ్య వదలిపెట్టి వెళ్తున్నారా?" అని

★ దైవప్రవక్త (సల్లం) గృహం (సమాధి)కి కుడివైపు హజ్రత్ సిద్దీఖ్ (రజి) సమాధి, ఎడమవైపు హజ్రత్ ఫారూఖ్ (రజి) సమాధి ఉన్నాయి. హజ్రత్ ఉస్మాన్ (రజి)కు అక్కడ చోటులేకపోవడం వల్ల ఆయన్ని జన్నతుల్‌బఖీ శ్మశానవాటికలో సమాధి చేయడం జరిగింది.

అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చారు: "నాతో నీ సంబంధం మూసా (అలైహి)తో హారూన్ (అలైహి)కున్న సంబంధం లాంటిదే. ఈ విషయం నీకు సంతోషం కలిగించదా? కాకపోతే (వారికీ మనకు) ఒక తేడా ఉంది. (వారిద్దరూ దైవప్రవక్తలు) నా తరువాత మరే దైవప్రవక్తా ఉండడు."

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 78వ అధ్యాయం - గజ్వతి తబూక వహియ గజవతుల్ ఉస్రా)**

1557. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం :- నేను ఖైబర్ యుద్ధం నాడు దైవప్రవక్త (సల్లం) ఇలా చెబుతుండగా విన్నాను. - "నేనిప్పుడు యుద్ధ పతాకం ఎలాంటి వ్యక్తికి ఇస్తానంటే దేవుడు అతని ద్వారా (ఖైబర్) విజయం చేకూరుస్తాడు." ప్రజలు ఈ మాట విని (రేపు యుద్ధ పతాకం) ఎవరికి లభిస్తుందో చూడాలి" అని అనుకున్నారు. మరునాడు తెల్లవారగానే వారిలో ప్రతి ఒక్కడూ యుద్ధ పతాకాన్ని దైవప్రవక్త (సల్లం) తనకే ఇస్తారని ఆశలు పెట్టుకొని ఎదురు చూడసాగారు. కాని దైవప్రవక్త (సల్లం) (వారి ఆశలకు భిన్నంగా) "అలీ (రజి) ఏడి, ఎక్కడున్నాడు" అని అడిగారు. "ఆయన కళ్ళలో ఏదో బాధగా ఉందట" అని సమాధానమిచ్చారు ప్రజలు. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) ఆదేశంతో హజ్రత్ అలీ (రజి)ని పిలిపించారు. దైవప్రవక్త (సల్లం), హజ్రత్ అలీ (రజి) కళ్ళకు తమ లాలాజలం పూశారు. తక్షణమే హజ్రత్ అలీ(రజి) తనకసలు ఎలాంటి బాధే లేదన్నట్లు పూర్తిగా ఆరోగ్య వంతులైపోయారు.

(ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) యుద్ధ పతాకాన్ని హజ్రత్ అలీ (రజి) చేతికిచ్చారు.) అప్పుడు హజ్రత్ అలీ (రజి) దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ "వారు మనలా (ముస్లింలుగా) మారే వరకు మనం వారితో యుద్ధం సాగిద్దామా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చారు: "నీవు నెమ్మదిగా, హుందాగా వెళ్ళి వారి మైదానంలో దిగు. ఆ తరువాత వారికి ముందుగా ఇస్లాం సందేశాన్ని అందజెయ్యి. వారు నిర్వహించవలసిన బాధ్యతలేమిటో వివరించి వారికి నచ్చజెప్పు. దైవసాక్షి! నీ ద్వారా ఒక్కడు ముస్లిం అయిపోయినా అది నీ కోసం ఎరుపు ఒంటెల ప్రాప్తం కంటే కూడా ఎంతో విలువైనది, శ్రేష్ఠమైనది."★

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 12వ అధ్యాయం - దుఆయిన్నబియ్యి (సల్లం) ఇలల్ ఇస్లాం వన్నుబువ్వతి)**

1558. హజ్రత్ సలమా బిన్ అక్వాయి (రజి) కథనం :- ఖైబర్ యుద్ధం కోసం దైవప్రవక్త (సల్లం) వెడలిపోయినప్పటికీ హజ్రత్ అలీ (రజి) కంటి బాధ కారణంగా వెనుకుండిపోయారు. కాని (కేవలం కంటి బాధ వల్ల) తాను దైవప్రవక్త (సల్లం)ను వదలి వెనకుండిపోవడం భావ్యమేనా? అని మనసులో భావించారు. ఈ ఆలోచన రాగానే హజ్రత్ అలీ (రజి) బయలుదేరి దైవప్రవక్త (సల్లం)ను కలుసుకున్నారు. రేపు ఖైబర్ జయించబడుతుందనగా దానికి ఒక రోజు ముందు రాత్రివేళ దైవప్రవక్త (సల్లం) అనుచరులతో మాట్లాడుతూ, "నేను (రేపు) యుద్ధపతాకాన్ని దేవుడు, ఆయన ప్రవక్త ఏ వ్యక్తిని అభిమానిస్తున్నారో అతనికి ఇస్తాను" అని అన్నారు లేక "యుద్ధ పతాకం ఆ వ్యక్తి తీసుకుంటాడు" అని

---

★ అరబ్బుల దృష్టిలో ఎర్ర ఒంటెలు ఎంతో విలువైన సంపద. వారి దగ్గర అంతకంటే విలువైన వస్తువు మరేదీ లేదు. అందువల్ల ఏదైనా వస్తువు అత్యంత విలువైనదని చెప్పడానికి దాన్ని వారు ఎర్ర ఒంటెతో పోల్చుతారు. (సంకలనకర్త)

అన్నారు లేక "ఎవరి చేతులతో (ఖైబర్) జయించబడుతుందో, ఎవరు దేవుడ్ని, ఆయన ప్రవక్తను ప్రేమిస్తాడో (ఆ వ్యక్తికి పతాకాన్ని ఇస్తాను)" అని అన్నారు ఆయన. మరునాడు ఉదయం అనుకోని విధంగా హజ్రత్ అలీ (రజి) కన్పించగానే "అదిగో అలీ (రజి) వచ్చేశారు" అన్నారు జనం. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఆయన చేతికి యుద్ధ పతాకం ఇచ్చారు. దేవుడు ఆయన ద్వారా ఖైబర్‌పై విజయం ప్రసాదించాడు.

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 121వ అధ్యాయం - మాఖీల ఫీలివాయిన్నబియ్యి (సల్లం))**

1559. హజ్రత్ సహెల్ బిన్‌సాద్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) తమ కుమార్తె హజ్రత్ ఫాతిమా (రజి) ఇంటికి వెళ్ళారు. అక్కడ హజ్రత్ అలీ (రజి) కన్పించకపోవడంతో "(అమ్మాయ్!) మీ పెదనాన్న కొడుకు ఎక్కడికెళ్ళాడు?" అని అడిగారు. దానికి హజ్రత్ ఫాతిమా (రజి) సమాధానమిస్తూ "మా ఇద్దరి మధ్య చిన్న తగాదా వస్తే ఆయన గారు నా మీద అలిగి ఇంట్లో నుండి వెళ్ళిపోయారు. మధ్యాహ్నం వేళ ఇక్కడ ఇంట్లో విశ్రాంతి కూడా తీసుకోలేదు" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) తమ వెంట వచ్చిన ఒకతనితో "అలీ (రజి) ఎక్కడున్నాడో కాస్త చూసిరా" అని అన్నారు. ఆయన వెళ్ళి వచ్చి "దైవప్రవక్తా! ఆయన మస్జిద్‌లో పడుకొని ఉన్నారు" అని అన్నాడు. దైవప్రవక్త (సల్లం) అక్కడ్నుంచి మస్జిద్‌కు వెళ్ళారు. హజ్రత్ అలీ (రజి) పడుకొని ఉన్నారు. ఆయన మీద నుండి దుప్పటి తొలగిపోయింది. ఆయన శరీరానికి మట్టి అంటుకొని ఉంది. అది చూసి దైవప్రవక్త (సల్లం) అలీ (రజి) శరీరానికి అంటుకున్న మట్టిని తుడిచేస్తూ "అబూతురాబ్ (మట్టివాడా)లే. అబూతురాబ్! లే" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 8వ ప్రకరణం - సలాత్, 58వ అధ్యాయం - నౌమిర్రిజాలి ఫిల్ మస్జిద్)**

## 5వ అధ్యాయం - హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి) మహిమోన్నతలు

1560. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) (ఒక ప్రయాణంలో ఉన్నప్పుడు) నిద్రపోకుండా మేల్కొన్నారు. (అందుచేత) ఆయన మదీనా చేరుకోగానే "ఈ రోజు నా అనుచరుల్లో ఎవరైనా సజ్జనుడు నా ఇంటి దగ్గర కాపలా కాస్తే బాగుండు" అని అన్నారు. అంతలో మాకు ఆయుధాల చప్పుడు విన్పించింది. "ఎవరది?" అన్నారు దైవప్రవక్త (సల్లం). "నేను సాద్ బిన్ అబీ వఖ్ఖాస్‌ని. తమరింటికి కాపలా కాయడానికి వచ్చాను" అని సమాధానం వచ్చింది. ఈ మాట విన్న తరువాత దైవప్రవక్త (సల్లం) నిద్రకు ఉపక్రమించారు.

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 70వ అధ్యాయం - అల్ హిరాసతు ఫిల్ గజ్వి ఫీసబీలిల్లాహ్)**

1561. హజ్రత్ అలీ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి) పని పట్ల తప్ప మరే వ్యక్తి పని పట్లా అమిత సంతోషం వెలిబుచ్చినట్లు నేను చూడలేదు. దైవప్రవక్త హజ్రత్ సాద్ (రజి)ని మరింత ప్రోత్సహిస్తూ "బాణాలు (నిర్విరామంగా) విడువు; నా తల్లిదండ్రులు నీ కోసం సమర్పితం" అని చెబుతుంటే నేను విన్నాను.

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 80వ అధ్యాయం - అల్ మిజన్ని వ మయ్యుతతర్రసు బితుర్సీ సాహిబిహీ)**

1562. హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి) కథనం :- ఉహుద్ యుద్ధ సమయంలో దైవప్రవక్త (సల్లం) (నన్ను మరింత ప్రోత్సహించడానికి) నా కోసం తమ తల్లిదండ్రులిరువురిని ఒక చోట కలిపి ప్రస్తావించారు.

(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హాబిన్నబియ్యి, 15వ అధ్యాయం - మనాఖిబ్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్)

## 6వ అధ్యాయం - హజ్రత్ తల్హా, జుబైర్ (రజి)ల మహిమోన్నతలు

1563. హజ్రత్ అబూ ఉస్మాన్ (రహ్మలై) కథనం :- దైవప్రవక్త (సల్లం) అవిశ్వాసులతో ఒక యుద్ధం (ఉహుద్) చేస్తున్నప్పుడు ఆయనతో పాటు హజ్రత్ సాద్, హజ్రత్ తల్హా తప్ప మరెవరూ లేరు (మిగిలిన వారంతా పారిపోయారు). హజ్రత్ సాద్ (రజి), హజ్రత్ తల్హా (రజి)లు స్వయంగా నాకీ విషయం తెలియజేశారు.

(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హా బిన్నబియ్యి (సల్లం), 14వ అధ్యాయం - జిక్రి తల్హా బిన్ ఉబైదుల్లా)

1564. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం :- అహ్జాబ్ యుద్ధ సమయంలో దైవప్రవక్త (సల్లం) (తమ అనుచరులతో) "శత్రువుల స్థితిగతులు తెలుసుకొని వచ్చి నాకు సమాచారం అందజేసే వారెవరైనా ఉన్నారా?" అని అన్నారు. హజ్రత్ జుబైర్ (రజి) ముందుకువచ్చి "నేనున్నాను" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) మళ్ళీ "శత్రువుల స్థితిగతులు తెలుసుకొని వచ్చి నాకు సమాచారం అందజేసే వారెవరైనా ఉన్నారా" అని అడిగారు. హజ్రత్ జుబైర్ (రజి) "నేను వెళ్ళొస్తాను" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "ప్రతి దైవప్రవక్తకు హవారీలు (ప్రత్యేక సహాయకులు) ఉంటారు. నా హవారీ జుబైర్ (రజి)" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 40వ అధ్యాయం - ఫజ్లిత్తలీఅ)

1565. హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) కథనం :- నేను అహ్జాబ్ యుద్ధ సమయంలో ఉన్నాను. కాని (పిన్న వయస్సులో ఉన్నందున) నన్ను, ఉమర్ బిన్ అబీ సల్మా (రజి)ను స్త్రీల దగ్గర వదిలారు. అక్కడ్నుంచి నేను హజ్రత్ జుబైర్ (రజి) గుర్రమెక్కి బనీ ఖురైజా (యూద తెగ) ప్రాంతం వైపు రెండు మార్లు వెళ్ళి రావడం చూశాను. మేము అక్కడ్నుంచి ఇంటికి తిరిగొచ్చిన తరువాత "నాన్నా! మీరు (ఎక్కడికో) వెళ్తూ వస్తూ ఉండటం చూశాను" అని అన్నాను. దానికి ఆయన "నీవు నన్ను చూశావా బాబూ!" అని అడిగారు. "ఔను నాన్నా!" అన్నాను నేను. దైవప్రవక్త (సల్లం) 'బనీ ఖురైజా ప్రాంతానికి వెళ్ళి అక్కడ్నుంచి సమాచారం తెచ్చే వారెవరైనా ఉన్నారా?' అని అన్నారు. అందువల్ల నేను వెళ్ళాను. అక్కడ్నుంచి నేను తిరిగొచ్చిన తరువాత దైవప్రవక్త (సల్లం) తమ తల్లిదండ్రులిరువురిని కలిపి ప్రస్తావిస్తూ "నా తల్లిదండ్రులు నీ కోసం సమర్పితం అన్నారు" అని తెలియజేశారు.

(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హాబిన్నబియ్యి (సల్లం), 13వ అధ్యాయం - మనాఖిబ్ జుబైర్ బిన్ అవ్వామ్)

## 7వ అధ్యాయం - హజ్రత్ అబూ ఉబైదా బిన్ జర్రాహ్ (రజి) మహిమోన్నతలు

1566. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- ప్రతి సమాజానికి ఒక అమీన్ (నిజాయితీపరుడు) ఉంటాడు. మన సమాజానికి అమీన్ (నిజాయితీపరుడు) అబూ ఉబైదా బిన్ జర్రాహ్ (రజి)★

(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హాబిన్నబియ్యి (సల్లం), 21వ అధ్యాయం - మనాఖిబ్ అబూఉబైదా బిన్ జర్రాహ్)

1567. హజ్రత్ హుజైఫా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) నజ్రాన్ వాసులతో మాట్లాడుతూ "నేను మీ దగ్గరకు సిసలైన అమీన్ (నిజాయితీపరుడి)ని పంపుతాను" అని అన్నారు. అనుచరులు ఈ మాట విని (ఆశతో) దైవప్రవక్త (సల్లం) సన్నిధికి రావడం మొదలెట్టారు. కాని దైవప్రవక్త (సల్లం) (వారందర్నీ వదలి) నజ్రాన్‌వాసుల దగ్గరికి అబూ ఉబైదా బిన్ జర్రాహ్ (రజి)ను పంపించారు.

(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హాబిన్నబియ్యి (సల్లం), 21వ అధ్యాయం - మనాఖిబ్ అబూఉబైదా బిన్ జర్రాహ్)

## 8వ అధ్యాయం - హజ్రత్ హసన్, హుసైన్ (రజి)ల మహిమోన్నతలు

1568. హజ్రత్ అబూ హురైరా దౌసీ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఓ రోజు పగటి వేళ యింటి నుండి బయలుదేరారు. నేనూ ఆయన వెంట బయలుదేరాను. (దారిలో) మేమిద్దరం మౌనంగా ఉన్నాము. నాతో దైవప్రవక్త (సల్లం) మాట్లాడలేదు. నేను కూడా దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడటానికి సాహసించలేదు. చివరికి బనీ ఖైనుఖా బజారు దాకా నడిచి హజ్రత్ ఫాతిమా (రజి) ఇంటికి చేరుకున్నాము. ఆయన ఇంటి ప్రాంగణంలో కూర్చొని "బాబు ఏడమ్మా! బాబు ఏడి?" అని అన్నారు. హజ్రత్ ఫాతిమా (రజి) లోపల నుండి కాస్సేపటి దాకా బయటికి రాలేదు. ఆమె బహుశా బాబుకు సువాసన హారం వేయడమో లేక స్నానం చేయించడమో చేస్తున్నారని భావించాను నేను. ఆ తరువాత కాస్సేపటికి హజ్రత్ హసన్ (రజి) లోపలి నుండి సుడిగాలిలా దూసుకువచ్చి దైవప్రవక్త (సల్లం) మెడను చుట్టేసుకున్నారు. దైవప్రవక్త (సల్లం) ఆయన్ని ముద్దాడి "దేవా! ఇతడ్ని ప్రజలకు అభిమానిగా జెయ్యి. ఇతడ్ని అభిమానించే వాళ్ళను నీవూ అభిమానించు" అని ప్రార్థించారు.

(సహీహ్ బుఖారీ:- 4వ ప్రకరణం - అల్‌బుయూ, 49వ అధ్యాయం - మా జుకిర ఫిల్ అస్వాఖ్)

1569. హజ్రత్ బరాబిన్ ఆజిబ్ (రజి) కథనం :- నేను హజ్రత్ హసన్ (రజి)ని దైవప్రవక్త (సల్లం) భుజమ్మీద కూర్చొని ఉండగా చూశాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "దేవా! నేనితడ్ని ప్రేమిస్తున్నాను. కనుక నీవు కూడా ఇతడ్ని ప్రేమించు" అని ప్రార్థించారు.

(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హాబిన్నబియ్యి (సల్లం) - 22వ అధ్యాయం - మనాఖిబిల్ హసన్ వల్ హుసైన్ (ర. అన్‌హుమా)

★ నమ్మకం, నిజాయితీలు హజ్రత్ అబూ ఉబైదా (రజి)తో పాటు ఇతర సహాబీల (ప్రవక్త అనుచరుల)లో ఓ సమిష్టి సుగుణంగా ఉండేవి. అయితే దైవప్రవక్త (సల్లం) కొందరు సహచరుల్లోని విశిష్ట సుగుణాన్ని ప్రత్యక్షంగా ప్రస్తావించి వారిని ప్రశంసిస్తారు. ఆ తరువాత అది వారి విశిష్ట లక్షణమయిపోయేది. -ఇమామ్ నవవీ (రహ్మలై).

## 10వ అధ్యాయం - హజ్రత్ జైద్ బిన్ హారిస్, హజ్రత్ ఉసామా బిన్ జైద్(రజి)ల విశిష్ఠతలు

1570. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) తన స్వేచ్ఛాయుత బానిస హజ్రత్ జైద్ బిన్ హారిస్ (రజి)ను 'జైద్ బిన్ ముహమ్మద్' అని పిలిచేవారు. చివరికి దివ్య ఖుర్ఆన్‌లోని ఈ సూక్తి అవతరించింది. "మీరు ఎవరినైతే పెంపుడు కొడుకులుగా చేసుకున్నారో వారిని వారి అసలు తండ్రుల సంబంధంతో పిలువండి. దేవుని దృష్టిలో ఇదే న్యాయమైన పద్ధతి." (అహ్‌జాబ్ : 5)

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 33వ సూరా అహ్‌జాబ్, 2వ అధ్యాయం - ఉద్‌వూహుమ్ లిఆబాయిహిమ్)

1571. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఒక సైనిక దళాన్ని సిద్ధం చేసి దానికి హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి)ని సేనాపతిగా నియమించారు. అప్పుడు కొందరు ఆయన నాయకత్వంపై అభ్యంతరం లేవనెత్తారు. దైవప్రవక్త (సల్లం) వారి మాటలు విని ఇలా అన్నారు : "ఇతని నాయకత్వంపై మీరు అభ్యంతరం చెబుతుంటే ఇది ఈనాడు కొత్తేమీ కాదు. మీరు (అజ్ఞానం, అనాగరిక మనస్తత్వంతో) ఇదివరకు ఇతని తండ్రి (జైద్ బిన్ హారిస్ - రజి) నాయకత్వం పట్ల కూడా అభ్యంతరం లేవదీశారు. దైవసాక్షిగా చెబుతున్నాను. అతనిలో నాయకత్వానికి కావలసిన యోగ్యతార్హతలు ఉండటమే గాకుండా అతను అందరికంటే నాకెక్కువ అభిమానవంతుడు. అతని తరువాత అతని కుమారుడు నాకందరికంటే ఎక్కువ అభిమానవంతుడు."

(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్‌హా బిన్నబియ్యి (సల్లం) 17వ అధ్యాయం - మనాఖిబ్ జైద్ బిన్ హారిస్)

## 11వ అధ్యాయం - హజ్రత్ అబ్దుల్లా బిన్ జాఫర్ (రజి) ఔన్నత్యం

1572. హజ్రత్ ఇబ్నె అబీ మలికా తెలిపారు:- హజ్రత్ అబ్దుల్లాబిన్ జుబైర్ (రజి) హజ్రత్ అబ్దుల్లా బిన్ జాఫర్ (రజి)తో "మీకు గుర్తుందా, ఓసారి నేను, మీరు, ఇబ్నె అబ్బాస్ (రజి) దారిలో దైవప్రవక్త (సల్లం)ను కలుసుకున్నాం" అని అన్నారు. దానికి హజ్రత్ అబ్దుల్లా బిన్ జాఫర్ (రజి) సమాధానమిస్తూ "ఆ.... గుర్తుంది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) మా ఇద్దర్ని (అంటే నన్ను, అబ్దుల్లా బిన్ అబ్బాస్‌ని) ఒంటె మీద ఎక్కించుకున్నారు. మిమ్మల్ని వదిలేశారు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 52వ ప్రకరణం - జిహాద్, 196వ అధ్యాయం - ఇస్తిఖ్బాలిల్ గుజాతీ)

## 12వ అధ్యాయం - విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఖదీజా (రజి) మహిమోన్నతలు

1573. హజ్రత్ అలీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- యావత్తు ప్రపంచ మహిళల్లో (ఆనాడు) హజ్రత్ మర్యం బిన్తె ఇమ్రాన్ అత్యంత శ్రేష్ఠమైన మహిళామణి. (అలాగే) యావత్తు ప్రపంచ మహిళల్లో (ఈనాడు) హజ్రత్ ఖదీజా (రజి) అత్యంత శ్రేష్ఠమైన మహిళామణి.

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 45వ అధ్యాయం - వఇజ్‌ఖాలతిల్ మలాయికతు యా మర్యం ఇన్నల్లాహస్తఫాకి)

1574. హజ్రత్ అబూ మూసా అష్‌అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు :- పురుషుల్లో శ్రేష్ఠులు, పరిపూర్ణులు చాలా మంది ఉన్నారు. కాని స్త్రీలలో ఫిరౌన్ భార్య హజ్రత్ ఆసియా, ఇమ్రాన్ కుమార్తె హజ్రత్ మర్యంలు మాత్రమే శ్రేష్ఠులు, పరిపూర్ణులు. ఇక హజ్రత్ ఆయిషా (రజి) శ్రేష్ఠత, ఔన్నత్యాల విషయానికి వస్తే, ఆమె యావత్తు భోజనాలలో "సరీద్" లాంటిది[1] [2]

**(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 32వ అధ్యాయం - ఖౌలిల్లాహితఆలా (జరబల్లాహు మసలల్లజీన ఆమనూ))**

1575. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- (దైవదూత) హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి "దైవప్రవక్తా! హజ్రత్ ఖదీజా (రజి) వస్తున్నారు. ఆమె దగ్గర పాత్రలో షేర్వా, లేక అన్నం, లేక నీళ్ళు ఉన్నాయి (ఈ మూడింటిలో ఏదో ఉల్లేఖకునికి గుర్తు లేదు). ఆమె మీ దగ్గరకు వస్తే ఆమె ప్రభువు తరపున, నా తరపున (కూడా) ఆమెకు సలాం చెప్పండి; స్వర్గంలో ఆమెకు ప్రత్యేక మణులతో నిర్మించబడిన గృహం ఉందని శుభవార్త తెలియజేయండి. ఆ నిలయంలో ఎలాంటి అల్లర్లు, అలజడులు గానీ, ఇక్కట్లు గానీ ఉండవు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 20వ అధ్యాయం - తజ్వీజిన్నబియ్యి (సల్లం) ఖదీజత వ ఫజ్లిహా)**

1577. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) భార్యలలో నేను హజ్రత్ ఖదీజా (రజి) పట్ల చెందినంత అసూయ మరెవరి పట్లా చెందలేదు. నిజానికి ఆమెను నేను చూడనైనా చూడలేదు. కాని దైవప్రవక్త (సల్లం) ఎక్కువగా ఆమెను గురించే ప్రస్తావిస్తుంటారు. ఒక్కోసారి ఆయన మేకను కోసి, ముక్కలుగా చేసి వాటిని హజ్రత్ ఖదీజా (రజి) స్నేహితురాండ్రకు పంపిస్తుంటారు. నేనొకసారి (అసూయతో) "మీ దృష్టిలో మొత్తం ప్రపంచంలోనే ఖదీజా (రజి) లాంటి మహిళామణి లేదు కాబోలు" అని అన్నాను. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "ఆమెలో ఈ సుగుణాలు ఉన్నాయి. ఆమె ద్వారానే నాకు సంతానం కలిగింది" అని అన్నారు.[3]

**(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 20వ అధ్యాయం - తజ్వీజిన్నబియ్యి (సల్లం) ఖదీజత వ ఫజ్లిహా)**

---

(1) మాంసం కూరలో లేదా షేర్వాలో రొట్టె ముక్కలు కలిపి తయారుచేసే పదార్థాన్ని 'సరీద్' అంటారు. అరబ్బుల దృష్టిలో 'సరీద్' కంటే రుచికరమైన, సులభంగా జీర్ణమయ్యే పదార్థం మరేది లేదు. (అనువాదకుడు)

(2) ఈ హదీసు శీర్షిక ప్రకారం హజ్రత్ ఖదీజా (రజి) మహిమోన్నతల అధ్యాయానికి సంబంధించినది కాదు. పైగా ఇందులో హజ్రత్ ఆయిషా (రజి) ఔన్నత్యం గురించి ప్రస్తావించడం జరిగింది. సంకలన కర్త ఈ హదీసుని ఈ అధ్యాయం క్రింద పేర్కొనడానికి కారణం ఇమాం ముస్లిం (రహ్మలై) కూడా ఈ అధ్యాయం క్రిందే పేర్కొన్నారు. సంకలన కర్త తన గ్రంథాన్ని ఇమామ్ ముస్లిం విషయ సూచిక ప్రకారం సంకలనం చేశారు.

ఈ హదీసు వల్ల కొందరు హజ్రత్ ఆసియా, హజ్రత్ మర్యంలు దైవప్రవక్తలని తలపోశారు. కాని వాస్తవానికి ఏ స్త్రీ కూడా దైవప్రవక్త కాలేదు. కాకపోతే వీరిద్దరికి భక్తి పరాయణత, సుగుణ సంపదల్లో ఎవరికీ లేని కొన్ని విశిష్టతలు ఉన్నాయి. పోతే ఈ హదీసు ద్వారా హజ్రత్ ఆయిషా (రజి)కు యావత్తు స్త్రీలలో ప్రత్యేక ఔన్నత్యం ఉందని తెలుస్తుంది. (అనువాదకుడు)

3. ఫతహుల్ బారీ గ్రంథంలో ఇలా ఉంది. దైవప్రవక్త (సల్లం)కు కలిగిన పిల్లలంతా హజ్రత్ ఖదీజా (రజి) ద్వారానే జన్మించారు ఒక్క హజ్రత్ ఇబ్రాహీం (రజి) తప్ప. హజ్రత్ ఇబ్రాహీం (రజి) హజ్రత్ మారియా (రజి) ద్వారా జన్మించారు. ఆమె దైవప్రవక్త (సల్లం) సేవకురాలు. సర్వామోద ఉల్లేఖనం ప్రకారం హజ్రత్ ఖదీజా (రజి) ద్వారా దైవప్రవక్త (సల్లం)కు కలిగిన సంతానంలో హజ్రత్ ఖాసిం (రజి) కూడా ఉన్నారు. ఆయన పేరు మీదనే దైవప్రవక్త (సల్లం)కు అబుల్‌ఖాసిం (ఖాసిం తండ్రి) అని మారు పేరు (కునియత్) వచ్చింది. హజ్రత్ ఖాసిం (రజి) దైవ దౌత్యానికి పూర్వం పసితనంలోనే చనిపోయారు. పోతే దైవప్రవక్త (సల్లం)కు కలిగిన నలుగురు ఆడపిల్లలు జైనబ్ (రజి), రుఖియా (రజి), ఉమ్మెకుల్సూమ్ (రజి), ఫాతిమా (రజి)లు కూడా హజ్రత్ ఖదీజా (రజి) ద్వారానే జన్మించారు. మరో బాలుడగు హజ్రత్ అబ్దుల్లా (రజి) కూడా ఆమె ద్వారానే దైవదౌత్యం తరువాత జన్మించి పసితనంలోనే చనిపోయారు. ఆయనకు తాహిర్, తయ్యిబ్ అనే పేర్లు కూడా ఉన్నాయి. (సంకలన కర్త)

1578. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- హజ్రత్ ఖదీజా (రజి) గారి సోదరి హజ్రత్ హాలా బిన్తె ఖువైలిద్ (రజి) ఓసారి (మా ఇంటికి వచ్చి) లోపలికి రావడానికి దైవప్రవక్త(సల్లం)ను అనుమతి అడిగారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం)కు హజ్రత్ ఖదీజా(రజి) అనుమతి అడిగే తీరు గుర్తుకువచ్చి బాధపడిపోయారు. నేనాయన ధోరణి చూసి అసూయపడుతూ "ఖురైష్ తెగ వృద్ధ మహిళల్లో ఒక వృద్ధురాలిని ఏం గుర్తు చేసుకుంటారు మాటి మాటికి! చనిపోయిన ఆ ముసలమ్మ నోట్లో ఒక పన్ను కూడా లేకుండా అన్నీ ఊడిపోయి నోరంతా (చిగుళ్ళతో) ఎర్రంగా ఉండేదేమో. దేవుడు మీకు ఆమె కంటే మంచి భార్యను ప్రసాదించాడు" అని అన్నాను.

**(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 20వ అధ్యాయం - తజ్వీజిన్నబియ్యి (సల్లం) ఖదీజత వఫజ్లిహా)**

## 13వ అధ్యాయం - విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) మహిమోన్నతలు

1579. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఓసారి నాతో ఇలా అన్నారు : "నీవు నాకు రెండు సార్లు కలలో కన్పించావు. ఆ కలల్లో నీవు ఒక తెల్లని పట్టువస్త్రంలో చుట్టబడి ఉంటే చూశాను. ఎవరో నాకు 'ఈమె నీ భార్య' అని చెప్పారు. నేనా వస్త్రం విప్పి చూస్తే అందులో నీవున్నావు." నేనీ మాటలు విని "ఈ కల దేవుని తరపున అయి ఉంటే నిజమై తీరుతుంది" అని అన్నాను.

**(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 44వ అధ్యాయం - తజ్వీజిన్నబియ్యి (సల్లం) ఆయిషత వఖుదూమిహల్ మదీనత)**

1580. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) నాతో మాట్లాడుతూ "నీవు ఎప్పుడు నా పట్ల సంతోషంగా ఉంటావో, ఎప్పుడు నా మీద అలుగుతావో నాకు తెలిసిపోతుంది" అని అన్నారు. "మీకెలా తెలుసు?" అడిగాను నేను. "నీవు సంతోషంగా ఉన్నప్పుడు 'కాదు, ముహమ్మద్ (సల్లం) ప్రభువు సాక్షి!' అని అంటావు. అలిగి ఉన్నప్పుడు 'కాదు, ఇబ్రాహీం (అలైహి) ప్రభువు సాక్షి!' అని అంటావు" అని అన్నారు దైవప్రవక్త (సల్లం). నేనీ మాట విని "దైవసాక్షి! ఈ మాట నిజమే. నేను (అలిగినప్పుడు) మీ పేరు మాత్రం ప్రస్తావించడం వదిలేస్తుంటాను" అని అన్నాను.

**(సహీహ్ బుఖారీ:- 67వ ప్రకరణం - నికాహ్, 108వ అధ్యాయం - గైరతిన్నిసా వవజ్దిహిన్న)**

1581. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- "నేను దైవప్రవక్త (సల్లం) ఎదుట నా స్నేహితురాండ్రతో కలసి (బొమ్మల) ఆట ఆడుకునేదాన్ని. దైవప్రవక్త (సల్లం) (ఇంట్లోకి) రాగానే ఆ బాలికలు భయపడి దాక్కునేవారు. అయితే ఆయన (నచ్చజెప్పి) వారిని నా దగ్గరకు పంపేవారు. నేను వారితో మళ్ళీ ఆడుకునేదాన్ని."

**(సహీహ్ బుఖారీ:- 78వ ప్రవకరణం - అదబ్, 81వ అధ్యాయం - అల్ ఇంబిసాతి ఇలన్నాస్)**

1582. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- ప్రజలు (దైవప్రవక్తకు) కానుకలు పంపడానికి దైవప్రవక్త (సల్లం) నా ఇంట ఉన్న రోజుకు ఎక్కువ ప్రాముఖ్యమిచ్చేవారు. వారు నా ద్వారా లేదా తమ కానుకల ద్వారా దైవప్రవక్త (సల్లం) ప్రసన్నతను పొందదలచుకునేవారు.

**(సహీహ్ బుఖారీ:- 51వ ప్రకరణం - హిబా, 7వ అధ్యాయం - ఖబూలిల్ హదియతి)**

1583. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) తమ నిర్యాణానికి కారణమైన వ్యాధికి గురై ఉన్నప్పుడు "రేపు నేను ఎవరి (అంటే ఏ భార్య) ఇంట్లో ఉంటాను!" అని మాటి మాటికి అడుగుతుండేవారు - అలా ఆయన ఆయిషా (రజి) వంతు ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తుండేవారు. ఈ పరిస్థితి గమనించి ఆయన భార్యలంతా ఆయన ఎక్కడ ఉండదలచుకుంటే అక్కడ ఉండవచ్చని అనుమతినిచ్చారు. అందువల్ల దైవప్రవక్త ఇహలోకం వీడిపోయేవరకు హజ్రత్ ఆయిషా (రజి) ఇంట్లోనే గడిపారు - దైవప్రవక్త (సల్లం) సరిగ్గా నా ఇంట గడిపే వంతు వచ్చిన రోజే నిర్యాణం చెందారు. ఆయన శిరస్సు నా ఎదకు - నా మెడ భాగానికి మధ్య ఉన్న స్థితిలో ఆయన కన్ను మూశారు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 83వ అధ్యాయం - మరజిన్నబియ్యి (సల్లం) వ వఫాతిహీ)

1584. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) నిర్యాణ సమయంలో - తనువు చాలించక ముందు ఆయన నా దేహానికి వీపు ఆనించి కూర్చున్నారు. అప్పుడు నేను ఆయన నోటి దగ్గరగా చెవి పెట్టి వింటే ఆయన నోట నాకీ మాటలు విన్పించాయి : "దేవా! నన్ను క్షమించు. నా మీద దయజూపు. నన్ను నా సర్వోన్నత మిత్రునితో కలుపు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 83వ అధ్యాయం - మరజిన్నబియ్యి (సల్లం) వ వఫాతిహీ)

1585. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- ఏ దైవప్రవక్త కూడా ఇహపరాలలో ఒకదాన్ని ఎంచుకునే అధికారం ఇవ్వబడనంతవరకు ఇహలోకం వీడిపోడని నేను వింటుండేదాన్ని. అందువల్ల దైవప్రవక్త (సల్లం) ప్రాణాంతక వ్యాధికి గురయి కంఠస్వరం కూడా బలహీనమయిపోయిన రోజుల్లో ఆయన ఇలా పఠించేవారు. "మఅల్లజీన అన్ అమల్లాహు అలైహిం (దేవుడు అనుగ్రహించిన వారితో పాటు)" అప్పుడు నేను దైవప్రవక్త (సల్లం) కు ఆ అధికారం ఇవ్వబడిందని గ్రహించాను.*

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 83వ అధ్యాయం - మరజిన్నబియ్యి (సల్లం) వ వఫాతిహీ)

1586. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఆరోగ్యంగా ఉన్నప్పుడు ఇలా చెబుతుండేవారు : "ఏ దైవప్రవక్త కూడా స్వర్గంలో అతని నివాసస్థలం చూపి, (ఇహపరలోకాలలో ఏదో ఒకదాన్ని ఎంచుకునే) అధికారం ఇవ్వబడనంతవరకు అతని ప్రాణం తీయడం జరగదు." ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) వ్యాధిగ్రస్తులయి మరణ సమయం ఆసన్నమయినప్పుడు నా ఒడిలో తల పెట్టుకొని పడుకున్నారు. కాస్సేపటికి ఆయన స్పృహ కోల్పోయారు. స్పృహ వచ్చిన తరువాత ఇంటి కప్పుకేసి చూస్తూ "దేవా! నన్ను నా సర్వోన్నత మిత్రుడి దగ్గరకు చేర్చు" అని అన్నారు. అప్పుడు నేను గ్రహించాను - ఇక ఈయన మా దగ్గర ఎంతోకాలం ఉండరని. నిజానికి ఇది ఆయన (ఆరోగ్యంగా ఉన్నప్పుడు) తరచుగా చెబుతుండే మాటకు తాత్పర్యమని, ఇప్పుడది బహిర్గతమవుతోందని నాకు అర్థమయిపోయింది.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 83వ అధ్యాయం - మరజిన్నబియ్యి (సల్లం) వ వఫాతిహీ)

---

★ అంటే వారికి ఇహలోకంలో శాశ్వతంగా ఉండటానికి లేదా ఇహలోకం వీడి పరలోకంలో ఉండటానికి అధికారం ఇవ్వబడింది. మహాప్రవక్త ముహమ్మద్ (సల్లం)కు కూడా ఇలాంటి అధికారమే ఇవ్వబడింది అని భావం. (సంకలన కర్త)

1587. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఎక్కడికైనా ప్రయాణమయితే తమ భార్యల(లో తమ వెంట ఎవరిని తీసికెళ్ళాలనే) విషయమయి చీటీ వేసేవారు. ఒకసారి నా పేరున, హజ్రత్ హఫ్సా (రజి) పేరున చీటీ వచ్చింది. రాత్రిపూట ప్రయాణం చేస్తే ఆయన నాతో మాట్లాడుతూ నడిచేవారు. అయితే ఈసారి హజ్రత్ హఫ్సా (రజి) నాతో "నువ్వు నా ఒంటె మీద కూర్చో, నేను నీ ఒంటె మీద కూర్చుంటాను. ఆ తరువాత ఏం జరుగుతుందో నువ్వూ చూడు, నేనూ చూస్తాను" అని అన్నారు. నేను సరే అన్నాను. దాని ప్రకారం ఆమె నా ఒంటె మీదెక్కారు. దైవప్రవక్త (సల్లం) నా ఒంటె దగ్గరికి వచ్చి చూస్తే దానిమీద హజ్రత్ హఫ్సా (రజి) కూర్చొని ఉన్నారు. దాంతో ఆయన ఆమెకు సలాం చేసి ప్రయాణమయ్యారు. చివరికి ఒక చోట అందరూ దిగారు. అప్పుడు నాకు దైవప్రవక్త (స) నా వెంట లేని లోటు తెలిసి వచ్చింది. ఆ తరువాత నేను నా కాళ్ళను గడ్డీగాదంలో పెట్టి "దేవా! ఏదైనా తేలునో పామునో పంపి నాకు కాటు వేయించు - నేనిక దైవప్రవక్త (సల్లం)తో ఏమీ మాట్లాడలేను" అని అన్నాను.

**(సహీహ్ బుఖారీ:- 67వ ప్రకరణం - నికాహ్; 97వ అధ్యాయం - అల్ ఖుర్అతి బైనన్నిసా ఇన్ అరాద సఫరన్)**

1588. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- సమస్త వంటకాలలో 'సరీద్'కు ఎంత శ్రేష్ఠత ఉందో యావత్తు స్త్రీలలో ఆయిషా (రజి)కు అంతే శ్రేష్ఠత ఉంది.

**(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హాబిన్నబియ్యి (సల్లం), 30వ అధ్యాయం - ఫజ్లి ఆయిషత)**

1589. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) నాతో "ఆయిషా! హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) వచ్చారు. నీకు సలాం చెబుతున్నారు" అని అన్నారు. నేనీ మాట విని, "ఆయనక్కూడా సలాం! దేవుడు ఆయనపై శుభానుగ్రహాలు వర్షింప జేయుగాక (దైవప్రవక్తా!) మీరు చూస్తున్నది నేను చూడలేకపోతున్నాను" అని అన్నాను.

**(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్యిల్ ఖల్ఖ్, 6వ అధ్యాయం - జిక్రిల్ మలాయికా)**

## 14వ అధ్యాయం - ఉమ్మె జరా చెప్పిన కథ

1590. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- పదకొండు మంది స్త్రీలు కూర్చొని, తమ తమ భర్తలను గురించి ఏమీ దాయకుండా చెప్తామని పరస్పరం ప్రమాణం చేసి చెప్పుకున్నారు.

ఒక స్త్రీ ఇలా చెప్పింది - "నా భర్త ఉపమానం బక్కచిక్కిన ఒంటె మాంసం లాంటిది. ఆ మాంసం ఓ కొండ శిఖరం మీద ఉంచబడింది. దాని దగ్గరకు చేరుకోవాలంటే దారి బాగాలేదు. పోనీ అక్కడ్నుంచి ఎవరైనా దాన్ని తీసుకురావాలనుకుంటే అదేమంత శ్రేష్ఠంగా కూడా లేదు."

రెండవ స్త్రీ ఇలా అన్నది - "నేను నా భర్త గురించి ఏదైనా చెప్పాలంటే భయమేస్తోంది. ఒకవేళ చెప్పినా పూర్తిగా చెప్పలేనేమోనని భయపడుతున్నాను. (అతని లోపాలు కొన్నిటిని వదలివేయవలసి వస్తుంది) అతడ్ని గురించి ఏదైనా చెబితే అది అతని అంతర్బాహ్యాలోపాలే (అంతకు మించి మరేమీ లేవు)"

మూడవ స్త్రీ ఇలా అన్నది - "నా మొగుడు పొడుగరి అయి ఉండి కూడా పనికిరాని వాడు, పరమశుంఠ. అతని విషయంలో నేనేదయినా మాట్లాడితే నాకు విడాకులిస్తాడేమోనని భయం. ఏమీ అనకుండా మౌనంగా ఉండిపోతే నన్ను అటూ ఇటూ గాకుండా చేసి ఉంచుతాడు" (అంటే అటు భార్యగానూ ఉంచడు, ఇటు విడాకులూ ఇవ్వడు).

నాల్గవ స్త్రీ ఇలా చెప్పింది - "నా భర్త చలి వేడిమీ లేని తిహామా (హిజాజ్ మరియు మక్కా) రాత్రి లాంటి వాడు, అతనికి భయమూ లేదూ, దుఃఖమూ లేదు" (అంటే గుణసంపన్నుడు, సంతులన స్వభావి).

అయిదవ అతివ ఇలా అన్నది - "మా ఆయన ఇంట్లో ఉంటే పిల్లిలాగా, బయటికెళ్తే పులిలాగా ఉంటాడు. ఇంట్లో వదలి వెళ్ళిన ధనధాన్యాలను గురించి అసలు అడగనే అడగడు. (ఇంట్లో ఉన్నప్పుడల్లా నిద్రపోతుంటాడు. ఎవర్నీ వేధించడు, విసిగించడు, బయటికెళ్తే మాత్రం పులిలా ధైర్యసాహసాలు ప్రదర్శిస్తాడు. విశాల హృదయుడు, దాతృ స్వభావం కలవాడు).

ఆరవ స్త్రీ ఇలా చెప్పుకున్నది - "(నా మొగుడు మహా తిండిపోతు) భోజనానికి కూర్చుంటే ఆసాంతం తినిగాని లేవడు (ఒక్క మెతుకూ మిగల్చడు). అలాగే త్రాగడం మొదలెడితే అడుగున ఉండే మడ్డి కూడా వదిలిపెట్టడు. ఇక పడుకుంటే మాత్రం ముడుచుకొని (మొద్దు) నిద్రపోతాడు. నా సుఖదుఃఖాలు తెలుసుకునే ఉద్దేశంతో నన్ను తాకనైనా తాకడు, అసలు నా గోడు పట్టించుకోడు" (ఎద్దులా తిని పడుకోవటం తప్ప అతను భార్య క్షేమాన్ని గురించి అడగడు).

ఏడవ మహిళ ఈ విధంగా అన్నది - "నా మొగుడు పరమ శుంఠ, చవట. ఎవరితో ఎలా మాట్లాడాలో కూడా తెలీదు. లోకంలో ఉండే జబ్బులన్నీ అతని స్వంతం. (ఏదైనా అంటే) ఆ దుర్మార్గుడు తలయినా పగలగొడ్తాడు లేదా చెయ్యి అయినా విరగ్గొడ్తాడు. లేదా రెండింటినీ మెలిబెట్టి తిప్పుతాడు."

ఎనిమిదవ స్త్రీ ఇలా చెప్పింది - "నా భర్త కుందేలును ముట్టుకుంటే ఎంత మృదువుగా ఉంటుందో అలాంటి మృదువైన మనిషి, అతని నుండి వెలువడే వాసన 'జర్నబ్' పచ్చిక[1] సువాసనలా ఉంటుంది"[2]

తొమ్మిదో స్త్రీ ఇలా చెప్పింది - "మా ఆయన ఎత్తయిన స్తంభాల (మేడలు కలిగిన) వాడు. పెద్ద నడుం కట్టువాడు (మహా పరాక్రమశాలి), పెద్ద బూడిద కుప్పల వాడు (పెద్ద దానశీలుడు - అతని వంటగది ఎల్లప్పుడూ వంటకాలతో వెచ్చగా ఉంటుంది). అతని ఇల్లు చావిడి, రచ్చబండలకు దగ్గరగా ఉంటుంది. (జనం తండోపతండాలుగా సలహా సంప్రదింపుల కోసం అతని దగ్గరకు వస్తుంటారు).

---

(1) 'జర్నబ్' అనేది సువాసన గల ఒక రకమైన పచ్చిక పేరు. (సంకలనకర్త)
(2) ఈమె ఇక్కడ తన భర్తను పొగుడుతోంది. అతను ఎంతో గుణవంతుడని, మానవత్వం పరిమళించే మంచి మనిషి అనీ కొనియాడుతోంది. (సంకలనకర్త)

పదవ మహిళ ఇలా చెప్పింది - "మా ఆయన పేరు మాలిక్ (యజమాని). ఎలాంటి మాలిక్ అనుకున్నారు! నేను కీర్తించిన దానికంటే ఎంతో గొప్పవారు. ఆయనకు అనేక పశువుల దొడ్లున్నాయి. అనేక పశువులు అతని ఇంటి దగ్గరే ఉంటాయి. మేత మేయడానికి బీళ్ళకు చాలా తక్కువ పశువులు వెళ్తాయి. అతని ఒంటెలు తప్పెట మోత వింటే చాలు ఇక తమకు చావు మూడిందని భావిస్తాయి."★

పదకొండవ పడతి ఇలా చెప్పుకొచ్చింది:- "మా వారి పేరు అబూ జిరా. ఆయన్ని గురించి చెప్పాలంటే చాలా ఉంది. ఆయన నా రెండు చెవులను చాలినన్ని ఆభరణాలతో అలంకరించారు. (నాకు బాగా తిండి పెడుతూ) నా రెండు ప్రక్కలూ బలిసి క్రొవ్వెక్కేలా చేశారు. నాకు ఏ లోటూ రానీకుండా ఎల్లప్పుడూ అమితంగా సంతోషపరుస్తుంటారు. వివాహానికి పూర్వం నేను పశువుల కాపరి కుటుంబంలో దారిద్ర్యం అనుభవిస్తూ ఉండేదాన్ని. ఆయన నన్ను పెండ్లాడి (గొప్ప ధనికురాలిని చేశారు). అనేక ఒంటెలు, గుర్రాలు, పొలాలు, ధాన్యాగారాలకు యజమానురాలిగా చేశారు. నేనాయన ముందు ఏం మాట్లాడినా ఆయన కోపగించుకోరు. నేను పడుకుంటే తెల్లారే దాకా పడుకుంటాను, త్రాగితే కడుపునిండా త్రాగుతాను. (అయినా) ఆయన నన్ను పల్లెత్తి మాట అనరు. అబూజిరా తల్లి (మా అత్త) కూడా ఎంతో మంచిది. పెద్ద పెద్ద మూటలు, విశాలమైన ఇల్లు - అబూజిరా కొడుకు సన్నగా ఎంతో నాజూగ్గా ఉంటాడు. మేక మాంసం ముక్కలు రెండు మూడు తిని (ఇక చాలన్నట్లు) లేస్తాడు. అబూ జిరా కూతురు తన తల్లిదండ్రుల పట్ల ఎంతో వినయంగా ఉంటుంది. ఎంతో అందంగా, కుందనపు బొమ్మలా ఉంటుంది. సవతి కూడా ఈర్ష్యపడే అంత అందమైనది. అబూ జిరా పరిచారిక కూడా మంచిదే. మా మాటలు మోసుకెళ్ళి వారికీ వీరికీ చేరవేయదు. మా ఆహార నిల్వలను హరించివేయడం గాని, మా ఇంటిని శుభ్రపరచకుండా కసువు దిబ్బలా ఉంచడం గాని చేయదు.

అయితే ఓ రోజు మా ఆయన జనం మజ్జిగ చిలుకుతున్న సందెవేళ ఇంటి నుంచి బయలుదేరారు. (దారిలో) ఆయన ఒక స్త్రీని చూశారు. ఆమె వడిలో చిరుతల్లాంటి ఇద్దరు పసిబిడ్డలు కూర్చొని దానిమ్మ పండ్లలాంటి ఆమె చన్మొనలతో ఆడుకుంటున్నారు. మా ఆయన ఆ స్త్రీ (అందచందాల)ని చూసి ముగ్ధుడై నాకు విడాకులిచ్చి ఆమెను పెళ్ళి చేసుకున్నాడు. ఆ తరువాత నేను కూడా ప్రముఖ రౌతు, విలుకాడైన ఒక వ్యక్తిని చేసుకున్నాను. ఆయన నాకు అనేక పశువులు, ఒంటెలను ఇచ్చాడు. ప్రతి జాతికి చెందిన ఒక్కొక్క జతను ఇచ్చాడు. ఇలా నాకు ఆస్తిపాస్తులు ఇచ్చి "ఉమ్మె జిరా! స్వయంగా నీవూ తిను, నీ బంధువులకూ, సన్నిహితులక్కూడా పెట్టు" అని అన్నాడు. ఆయన నాకు అంత ఐశ్వర్యం ఇచ్చినప్పటికీ అబూజిరా ఇచ్చిన దానితో పోల్చితే అదంతా ఒక చిన్నపాత్రతో కూడా సమానం కాజాలదు.

దైవప్రవక్త (సల్లం) హజ్రత్ ఆయిషా (రజి) (చెప్పిన ఈ కథ విని ఆమె)తో "అబూ జిరా, ఉమ్మె

---

★అంటే అతని ఇల్లు కోయడానికి సిద్ధపరచి ఉన్న పశువులతో, అతిథులతో ఎల్లప్పుడు సందడిగా, కళకళలాడుతూ ఉంటుందని అర్థం. ప్రతి రోజూ అతిథుల కోసం ఒంటెలను కోయడం జరుగుతుంటుంది. (సంకలన కర్త)

జిరాకు ఎలాంటి వాడో నేనూ నీకు అలాంటి వాణ్ణే" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 67వ ప్రకరణం - నికాహ్, 82వ అధ్యాయం - హుస్నిల్ ముఆషిరతి మఅల్ అహ్లె)

## 15వ అధ్యాయం - ప్రవక్త పుత్రిక హజ్రత్ ఫాతిమతుజ్జహరా (రజి) మహిమోన్నతలు

1591. హజ్రత్ ఇబ్నె షిహాబ్ (రహ్మాలై) కథనం:- హజ్రత్ అలీ బిన్ హుసైన్ - రహ్మాలై (అంటే హజ్రత్ జైనుల్ ఆబిదీన్ - రహ్మాలై) హజ్రత్ ఇమామ్ హుసైన్ (రజి) అమరగతినొందిన తరువాత హజ్రత్ ముఆవియా (రజి) కొడుకు యజీద్ దగ్గర్నుంచి మదీనా వచ్చారు. అప్పుడు హజ్రత్ ముసవ్విర్ బిన్ మఖ్రమా (రజి) ఆయన్ని కలుసుకొని "నేను మీకేదయినా సేవ చేయగలనేమో చెప్పండి. నేనందుకు సిద్ధంగా ఉన్నాను" అని అన్నారు. దానికి హజ్రత్ అలీ బిన్ హుసైన్ (రహ్మాలై) 'ఏమీ లేదన్నా'రు. హజ్రత్ ముసవ్విర్ (రజి) మాట్లాడుతూ, "మీ దగ్గరున్న దైవప్రవక్త (సల్లం) కరవాలం నా దగ్గర ఉంచగలరా? మీ దగ్గర ఉంటే ఈ దుర్మార్గులు మీ నుండి దాన్ని బలవంతంగా లాక్కుంటారేమోనని నాకు భయంగా ఉంది. దైవసాక్షిగా చెబుతున్నాను. మీరు గనక ఆ ఖడ్గాన్ని నాకు అప్పగిస్తే నా బొందిలో ప్రాణం ఉన్నంత కాలం అది వారి కబంద హస్తాల్లోకి పోజాలదు" అని అన్నారు.

(హజ్రత్ ముసవ్విర్ బిన్ మఖ్రమా (రజి) ఇంకా ఇలా అన్నారు :) హజ్రత్ అలీ బిన్ అబీ తాలిబ్ (రజి) భార్య హజ్రత్ ఫాతిమా (రజి) ఉన్నప్పటికీ ఆయన అబూజహల్ కూతుర్ని చేసుకోవడానికి ఆమెకు కబురు పంపారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఈ వేదిక పైనే నిల్చొని ప్రసంగించడం నేను చూశాను - ఆ రోజుల్లో నేను యుక్త వయస్సుకు చేరిన యువకుడ్ని - ఆయన ఇలా అన్నారు : "ఫాతిమా (రజి) నా శరీర భాగం (నా ముద్దుల కుమార్తె). ఒకవేళ ఆమెకు సవతి వస్తే, ఆమె తన ధర్మ పరాయణత విషయంలో పరీక్షకు లోనవుతుందేమోనని నేను భయపడుతున్నాను" అని అన్నారు. ఆ తరువాత ఆయన బనీ అబ్దుషమ్స్ వంశానికి చెందిన తమ అల్లుడొకరి[1] పేరును ప్రస్తావిస్తూ, అతను తనకు నిజం చెప్పాడని, అల్లుడిగా తనకు చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకున్నాడని అతడ్ని ప్రశంసించారు. ఇంకా ఆయన ఇలా అన్నారు, "నేను హలాల్ (ధర్మసమ్మతమైన దాని)ని హరాం (నిషిద్ధమైనది)గా, హరాంని హలాల్‌గా చేయడం లేదు. కాని దైవసాక్షిగా వాస్తవం చెబుతున్నాను. దైవప్రవక్త (సల్లం) కుమార్తె, దైవవిరోధి (అబూ జహల్) కూతురు - ఇద్దరూ ఒక ఇంట్లో (అంటే ఒకని దాంపత్యంలో) కలసి ఉండటం ఎన్నటికీ సాధ్యపడదు."[(2)]

(సహీహ్ బుఖారీ:- 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖుమ్స్, 5వ అధ్యాయం - మా జుకిర మిన్ దిర్‌యిన్నబియ్యి (సల్లం) వ అసాహు వసైఫిహీ)

---

(1) ఈ అల్లుడి పేరు ఆస్ బిన్ రబీ బిన్ అబ్దుల్ ఉజ్జా బిన్ అబ్దెషమ్స్. ఈయన హజ్రత్ జైనబ్ (రజి) భర్త. ఆయన వివాహం దైవదౌత్యానికి పూర్వం జరిగింది. హజ్రత్ జైనబ్ (రజి)ని మక్కా నుండి మదీనాకు పంపుతానని వాగ్దానం చేసి దాన్ని అతను నిలబెట్టుకున్నాడు. (సంకలనకర్త)

(2) ఇమామ్ నవవీ (రహ్మాలై) ఇలా రాస్తున్నారు: దైవప్రవక్త (సల్లం) మనస్సును ఏ రూపంలోనయినా నొప్పించడం నిషిద్ధమని ఈ హదీసు వల్ల తెలుస్తోంది. ధర్మసమ్మతమైన రూపంలోనైనా సరే ఆయన మనస్సును నొప్పించడం నిషిద్ధం. ఈ హదీసులో ఆయన హరాంని హలాల్‌గా, హలాల్‌ని హరాంగా చేయడం లేదని స్పష్టం చేశారు. అయితే ఫాతిమా (రజి) ఉండగా హజ్రత్ అలీ (రజి) వివాహం అబూజహల్ కూతురితో జరగడం రెండు కారణాల వల్ల ఆమోద యోగ్యంగా లేదు. ఒకటి: ఇలా చేయడం వల్ల హజ్రత్ ఫాతిమా (రజి)కు బాధ కలుగుతుంది. ఆమెకు బాధ కలిగితే దైవప్రవక్త (సల్లం)కు బాధ కలిగినట్లే. రెండు: అబూ జహల్ ఇస్లాంకు బద్ధ శత్రువు, దైవవిరోధి. అలాంటి దైవ విరోధి కూతురు, దైవప్రవక్త (స) కుమార్తె ఒకే ఇంట్లో (ఒక భర్తతో) సంసారం చేయడమనేది సహించరాని విషయం. (సంకలనకర్త)

1592. హజ్రత్ ముసవ్విర్ బిన్ మఖ్రమా (రజి) కథనం:- హజ్రత్ అలీ (రజి) అబూ జహల్ కూతుర్ని చేసుకోవడానికి ఆమెకు వివాహ సందేశం పంపారు. ఈ సంగతి తెలిసి హజ్రత్ ఫాతిమా (రజి) దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి "ఎవరైనా మీ కుమార్తెలకు కష్టం కలిగించినప్పటికీ మీకు కోపం రాదని జనం చెప్పుకుంటున్నారు. ఈ కారణంగానే అలీ (రజి) అబూ జహల్ కూతుర్ని వివాహమాడటానికి సిద్ధమయ్యారు" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ సంగతి తెలియగానే లేచి నిలబడ్డారు. ఆయన (మస్జిద్‌లో) ప్రసంగిస్తూ ముందుగా దేవుడ్ని స్తుతించి ఆ తరువాత ఇలా అన్నారు : "నేను అబుల్ ఆస్ బిన్ రబీకు (నా కుమార్తె జైనబ్ నిచ్చి) వివాహం చేశాను. అతను నాతో అన్న మాటను నిలబెట్టుకున్నాడు. ఫాతిమా (రజి) నా గారాల బిడ్డ. ఆమెకు బాధ కలిగించే ప్రతి విషయమూ నాకు మనస్తాపం కలిగిస్తుంది. దైవసాక్షి! దైవప్రవక్త కుమార్తె, దైవవిరోధి కూతురు ఇద్దరూ ఏకకాలంలో ఒకే వ్యక్తి వివాహ బంధంలో ఎన్నటికీ ఇమడలేరు." హజ్రత్ అలీ (రజి) దైవప్రవక్త (సల్లం) పలికిన ఈ పలుకులు విని అబూ జహల్ కూతుర్ని వివాహమాడే యోచనను విరమించుకున్నారు.

**(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్‌హాబిన్నబియ్యి (సల్లం), 16వ అధ్యాయం - జిక్రి అస్‌హాబిన్నబియ్యి (సల్లం))**

1593. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- మేము - ప్రవక్త భార్యలందరమూ ఓ రోజు దైవప్రవక్త (సల్లం) దగ్గర గుమికూడాము. ఏ ఒక్కరూ గైర్‌హాజరు కాలేదు. అప్పుడు హజ్రత్ ఫాతిమా (రజి) వచ్చారు. దైవసాక్షిగా చెబుతున్నాను. ఫాతిమా నడచిన తీరు అచ్చం (ఆమె తండ్రి) దైవప్రవక్త (సల్లం) నడిచే తీరులాగే ఉంది. దైవప్రవక్త (సల్లం) ఆమెను చూడగానే (సంతోషంతో) స్వాగతం పలికి, తమ ఎడమ లేక కుడి పక్కన కూర్చోబెట్టుకున్నారు. ఆ తరువాత ఆయన ఆమె చెవిలో ఏదో గుసగుసలాడారు. హజ్రత్ ఫాతిమా (రజి) అది విని అప్రయత్నంగా కంట తడి పెట్టుకున్నారు. దైవప్రవక్త (సల్లం) ఆమె విచార వదనం చూసి మళ్ళీ ఏదో ఆమె చెవిలో రహస్యంగా చెప్పారు. ఆ మాట ఏమిటో వినగానే ఆమె ముఖారవిందం చిరునవ్వుతో ఒక్కసారిగా వికసించింది. అప్పుడు ప్రవక్త భార్యలందరిలో నేను మాత్రమే హజ్రత్ ఫాతిమా (రజి)ను సంబోధిస్తూ "దైవప్రవక్త (సల్లం) మమ్మల్నందర్నీ వదలి నీకొక్క దానికే రహస్య విషయం వినే అదృష్టం కల్పించారు. అయినా నీవు ఎందుకో కంట తడి పెట్టావు" అని అన్నాను.

దైవప్రవక్త (సల్లం) అక్కడ్నుంచి వెళ్ళిపోయిన తరువాత నేను హజ్రత్ ఫాతిమా (రజి)తో మాట్లాడుతూ "దైవప్రవక్త (సల్లం) నీకు రహస్యంగా ఏదో చెప్పారు కదా, అదేమిటో కాస్త చెప్పవూ?" అని అడిగాను. కాని హజ్రత్ ఫాతిమా (రజి) అందుకు నిరాకరిస్తూ "దైవప్రవక్త (సల్లం) నాకు చెప్పిన రహస్యాన్ని నేను ఎంతమాత్రం బయటపెట్టను" అని అన్నారు. చివరికి దైవప్రవక్త (సల్లం) ఇహలోకం వీడిపోయిన తరువాత నేను తిరిగి హజ్రత్ ఫాతిమా (రజి)ను కదిలించి "నీ మీద నాకున్న హక్కుసాక్షి! నాకా రహస్య విషయం తప్పకుండా చెప్పాలి" అని అన్నాను. అప్పుడు హజ్రత్ ఫాతిమా (రజి) 'ఇప్పుడు చెబుతాలే' అంటూ ఇలా తెలియజేశారు :

"మొదటిసారి దైవప్రవక్త (సల్లం) నాకు ఈ సంగతి చెప్పారు : 'ప్రతి సంవత్సరం హజ్రత్

జిబ్రయీల్ (అలైహి) నా దగ్గర ఒకసారి ఖుర్‌ఆన్ (మొత్తం) పారాయణం చేసేవారు. ఈ సంవత్సరం అయన వచ్చి రెండు సార్లు ఖుర్‌ఆన్ పఠించారు. దాన్నిబట్టి నాకు (మరణ) కాలం సమీపించిందని భావిస్తున్నాను. కనుక నీవు దేవునికి భయపడుతూ సహనంతో మెలగాలి. (పరలోకంలో) ముందుగా పోయి నీకు స్వాగత సన్నాహాలు చేసేవాడ్ని నేనే.' నేనీ మాట విని ఏడ్చాను, అది మీరు చూశారు. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) నా కంట తడి చూసి మళ్ళీ చెవిలో గుసగుసలాడుతూ 'ఫాతిమా! నీవు ముస్లిం మహిళలందరికీ నాయకురాలివి, లేక ముస్లిం అనుచర సమాజంలోని స్త్రీలందరికీ నాయకురాలివి. ఈ విషయం నీకు సంతోషం కలిగించదా?' అని అన్నారు."

**(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - ఇస్తిఇజాన్, 43వ అధ్యాయం - మన్ నాజా బైన యదిన్నాసి వలం యుఖ్బిర్ బిసిర్రి సాహిబిహీ)**

## 16వ అధ్యాయం - విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) మహిమోన్నతలు

1594. హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) దగ్గరకు హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) వచ్చారు. ఆ సమయంలో హజ్రత్ ఉమ్మె సల్మా (రజి) దైవప్రవక్త (సల్లం) దగ్గర కూర్చొని ఉన్నారు. హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) దైవప్రవక్త (సల్లం)తో కొద్దిసేపు మాట్లాడి వెళ్ళిపోయారు. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) హజ్రత్ ఉమ్మెసల్మా (రజి)ని "ఈయన ఎవరో తెలుసా నీకు?" అని అడిగారు. "అయన వహీయా (రజి)"* అన్నారు ఉమ్మె సల్మా (రజి). ఆ తరువాత ఆమె మాట్లాడుతూ "అయన జిబ్రయీల్ (అలైహి) అని దైవప్రవక్త (సల్లం) చెప్పేవరకూ నేనాయన్ని వహీయా (రజి) అనే భావిస్తూ ఉండేదాన్ని" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతిన్నుబువ్వతి ఫిల్ ఇస్లాం)**

## 17వ అధ్యాయం - విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ జైనబ్ (రజి) మహిమోన్నతలు

1595. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) భార్యలలో కొందరు ఆయనతో మాట్లాడుతూ "మాలో అందరికంటే ముందుగా మిమ్మల్ని (పరలోకంలో) ఎవరు కలుసుకుంటారు?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) "ఎవరి చేతులు పొడుగ్గా ఉంటాయో ఆమె" అని చెప్పారు. ఈ మాటవిని ప్రవక్త భార్యలందరు ఒక కర్రముక్క తీసుకొని తమ తమ చేతుల పొడువుని కొలుచుకోవడం ప్రారంభించారు. అప్పుడు వారందరిలో హజ్రత్ సౌదా (రజి) చేతులు పొడవైనవని తేలింది. కాని ఆ తరువాత పొడుగు చేతులు అంటే అత్యధికంగా దానధర్మాలు చేయడమని తెలిసింది. మా అందరికంటే ముందుగా (హజ్రత్ జైనబ్ (రజి)) ఇహలోకం వీడి

---

★ హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) తరచుగా హజ్రత్ వహియ కల్బీ (రజి) రూపంలో దైవప్రవక్త (సల్లం) దగ్గరకు వస్తుంటారు. ఈ హదీసు ద్వారా విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె సల్మా (రజి)గారి ఔన్నత్యం రూఢీ అవుతోంది. ఆమె హజ్రత్ జిబ్రయీల్ (అలైహి)ను మానవాకారంలో చూశారు. కాకపోతే ఆమె ఆయన్ని గుర్తు పట్టలేదు. దైవప్రవక్త (సల్లం) తెలియజేసిన మీదటనే ఆయన జిబ్రయీల్ (అలైహి) అని ఆమెకు తెలిసింది. (అనువాదకుడు)

(దైవప్రవక్త (సల్లం) సన్నిధికి) పోయారు. దానధర్మాలు చేయడమంటే ఆమెకు ఎంతో ఇష్టం★.

(సహీహ్ బుఖారీ:- 24వ ప్రకరణం - జకాత్, 11వ అధ్యాయం - అయ్యుస్సదఖతి అఫ్జలు)

## 19వ అధ్యాయం - హజ్రత్ అనస్ తల్లి హజ్రత్ ఉమ్మె సులైం (ర.అ) మహిమోన్నతలు

1596. హజ్రత్ అనస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) సాధారణంగా తమ భార్యల ఇండ్లకు తప్ప మదీనాలో మరెవరి ఇండ్లకూ వెళ్ళేవారు కాదు. అయితే హజ్రత్ ఉమ్మె సులైమ్ (రజి) ఇంటికి మాత్రం వెళ్ళేవారు. ఆమె ఇంటికి వెళ్ళడానికి కారణమేమిటని అడిగితే, "ఆమెను చూస్తే నాకెంతో జాలివేస్తుంది. ఆమె సోదరుడు నాకు మద్దతునిచ్చి (యుద్ధంలో పోరాడుతూ) అమరగతి నొందాడు" అని అన్నారు ఆయన.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 38వ అధ్యాయం - ఫజ్లిమన్ జహ్హ జగాజియన్ అవ్ ఖల్లఫహు బిఖైరిన్)

## 22వ అధ్యాయం - హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి), ఆయన తల్లి మహిమోన్నతలు

1597. హజ్రత్ అబూమూసా అష్అరీ (రజి) కథనం :- నేను, నా సోదరుడు యమన్ నుండి (మదీనా) వచ్చాము. హజ్రత్ అబ్దుల్లాబిన్ మస్వూద్ (రజి), ఆయన తల్లి తరచుగా దైవప్రవక్త (సల్లం) ఇంటికి వస్తుండేవారు. అందుచేత మేము చాలా కాలం వరకు అబ్దుల్లా బిన్ మస్వూద్(రజి) దైవప్రవక్త (సల్లం) కుటుంబ సభ్యుల్లోని వారని భావిస్తూ ఉండేవాళ్ళము.

(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హాబిన్నబియ్యి (సల్లం), 27వ అధ్యాయం - మనాఖిబి అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి))

1598. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) ఒక ఉపన్యాసమిస్తూ ఇలా అన్నారు :- "దైవసాక్షి! నేను దైవప్రవక్త (సల్లం) నోట డెబ్బై కంటే ఎక్కువ సూరాలు విని నేర్చుకున్నాను. దైవసాక్షి! దైవగ్రంథాన్ని అందరికంటే ఎక్కువగా ఎరిగిన ప్రవక్త అనుచరుల్లో నేనూ ఒకడ్ని. ఈ సంగతి ప్రవక్త అనుచరులందరికీ తెలుసు. అయినా నేను వారికంటే గొప్పవాడ్ని కాను."

ఈ హదీసు ఉల్లేఖించిన ఒక ఉల్లేఖకులు హజ్రత్ షఖీఖ్ (రహ్మాలై) ఇలా వ్యాఖ్యానిస్తు న్నారు :- (హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) పలికిన ఈ మాటలు విన్న తరువాత) ఈ విషయంలో ప్రజలు ఏమనుకుంటున్నారో విందామని నేను వివిధ ప్రజా సమూహాలను కలుసుకున్నాను. కాని ఏ ఒక్కరూ ఆయన చెప్పిన మాటలకు వ్యతిరేకంగా ఒక్క మాటా వ్యక్తపరచలేదు.

(సహీహ్ బుఖారీ:- 66వ ప్రకరణం - ఫజాయిలిల్ ఖుర్అన్, 8వ అధ్యాయం - అల్ ఖుర్రాయి మిన్ అస్హాబిన్నబియ్యి (సల్లం))

★ ఈ ఉల్లేఖనానికి సంబంధించిన బుఖారీ (గ్రంథం)లోని మూలం అస్పష్టంగా ఉంది. బుఖారీ ఉల్లేఖనంలో హజ్రత్ జైనబ్ (రజి) పేరు ఏదో ఒక దశలో అచ్చు పొరపాటు వల్ల మిస్ అయిపోయింది. అందువల్ల ఇక్కడ చెప్పబడుతున్న మాట హజ్రత్ ఉమ్మె సల్మా (రజి)కు సంబంధించినదా లేక హజ్రత్ జైనబ్ (రజి)కు సంబంధించినదా అనే విషయం తెలియడం లేదు. అయితే 'ముస్లిం' ఉల్లేఖనంలో హజ్రత్ జైనబ్ (రజి) పేరు స్పష్టంగా ఉంది. అందుచేత అనువాదంలో హజ్రత్ జైనబ్ (రజి) పేరును బ్రాకెట్‌లో ఉంచవలసి వచ్చింది. (అనువాదకుడు)

1599. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్(రజి) కథనం :- తాను తప్ప మరే ఆరాధ్యుడు లేని ఆ దేవుని సాక్షి! దైవగ్రంథంలో ఏ సూరా ఎప్పుడు అవతరించిందనే విషయం గురించి నాకు తెలియని సూరా లేదు. అలాగే దివ్య ఖుర్‌ఆన్‌లో ఏ సూక్తి ఎవరి విషయంలో అవతరించిందో అది కూడా నాకు తెలుసు. ఒకవేళ ఎవరికైనా నా కంటే ఎక్కువగా తెలిసి ఉంటే, అక్కడి దాకా ఒంటె నన్ను చేర్చగలిగితే నేను తప్పకుండా అతని దగ్గరికి వెళ్తాను.

**(సహీహ్ బుఖారీ:- 66వ ప్రకరణం - ఫజాయిలిల్ ఖుర్‌ఆన్, 8వ అధ్యాయం - అల్ ఖుర్రాయి మిన్ అస్‌హాబిన్నబియ్యి (సల్లం))**

1600. హజ్రత్ మస్రూఖ్ (రహ్మాలై) కథనం :- హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ముందు హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి)ని గురించి ప్రస్తావించడం జరిగింది. అప్పుడాయన ఇలా అన్నారు; "దైవప్రవక్త (సల్లం) నలుగురు వ్యక్తుల దగ్గర ఖుర్‌ఆన్ నేర్చుకోమని అన్నారు. ఆయన మొట్టమొదట (1) అబ్దుల్లాబిన్ మస్వూద్ (రజి) పేరు తీసుకున్నారు. తరువాత (2) హజ్రత్ సాలం మౌలా అబీహుజైఫా(రజి), (3) హజ్రత్ ఉబై బిన్ కాబ్(రజి), (4) హజ్రత్ ముఆజ్ బిన్ జబల్(రజి)ల పేర్లు ప్రస్తావించారు. అంతే, అప్పటినుంచి నేను అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి)ని అభిమానిస్తున్నాను."★

**(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్‌హాబిన్నబియ్యి (సల్లం), 26వ అధ్యాయం - మనాఖిబ్ సాలిమ్ మౌలా అబీ హుజైఫా (రజి))**

## 23వ అధ్యాయం - హజ్రత్ ఉబై బిన్ కాబ్ (రజి) మరికొందరి మహిమోన్నతలు

1601. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) కాలంలో ఖుర్‌ఆన్ కంఠస్థం చేసినవారు నలుగురున్నారు. (1) హజ్రత్ ఉబైబిన్ కాబ్ (రజి), (2) హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ (రజి), (3) హజ్రత్ అబూజర్ (రజి), (4) హజ్రత్ జైద్ బిన్ సాబిత్ (రజి). వీరంతా అన్సారులే.

**(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 17వ అధ్యాయం - మనాఖిబ్ జైద్ బిన్ సాబిత్)**

1602. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) హజ్రత్ ఉబై బిన్‌కాబ్ (రజి)తో "దేవుడు నాకు 'లమ్‌యకునిల్లజీన కఫరూ' (బయ్యినా) సూరా పఠించి నీకు విన్పించమని ఆజ్ఞాపించాడు" అని అన్నారు. దానికి హజ్రత్ ఉబైబిన్ కాబ్ (రజి) "దేవుడు నా పేరు ప్రస్తావించి మరీ ఈ మాట అన్నాడా?" అని అడిగారు. దైవప్రవక్త (సల్లం) 'ఔన'న్నారు. హజ్రత్ ఉబైబిన్ కాబ్ (రజి)

---

★ ఖుర్‌ఆన్‌ని కంఠస్థం చేయడంలో ఈ నలుగురు మహనీయులు అందరినీ మించిపోయారు. వీరు అవగాహన విషయంలో ఇతర సహాబీల కంటే కొంచెం తక్కువ అయినప్పటికీ ఖుర్‌ఆన్ కంఠస్థం విషయంలో వీరు ఇతరుల కంటే మిన్నగా ఉండటం వల్ల దైవప్రవక్త (సల్లం) ఈ నలుగురి పేర్లను ప్రత్యేకించి ప్రస్తావించారు. అదీగాక వీరు దివ్యఖుర్‌ఆన్‌ని నేరుగా దైవప్రవక్త (సల్లం) నోట విని కంఠస్థం చేసుకోవడానికి తమను తాము అంకితం చేసుకున్నారు. మిగిలిన అనుచరులు ఇతరుల ద్వారా నేర్చుకోవడంతో తృప్తి చెందారు. అంత మాత్రాన ఈ నల్గురు తప్ప మరెవరూ ఖుర్‌ఆన్‌ని కంఠస్థం చేయలేదని అర్థం కాదు. (సంకలనకర్త)

అది విని రోదించసాగారు.★

(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 16వ అధ్యాయం - మనాఖిబ్ ఉబై బిన్ కాబ్ (రజి))

## 24వ అధ్యాయం - హజ్రత్ సాద్ బిన్ ముఆజ్ (రజి) మహిమోన్నతలు

1603. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- "సాద్ బిన్ ముఆజ్ మరణంతో దైవసింహాసనం కంపించిపోయింది."

(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 12వ అధ్యాయం - మనాఖిబ్ సాద్ బిన్ ముఆజ్ (రజి))

1604. హజ్రత్ బరా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం)కు కానుకగా ఓ పట్టుబట్టల జత లభించింది. అప్పుడు ప్రవక్త అనుచరులు ఆ పట్టుబట్టను మాటిమాటికీ తాకి చూస్తూ దాని మృదుత్వం పట్ల ఆశ్చర్యపోసాగారు. దైవప్రవక్త (సల్లం) వారిని చూసి "ఏమిటీ, మీరీ బట్ట మృదుత్వాన్ని చూసి ఆశ్చర్యపోతున్నారా? (స్వర్గంలో) సాద్ బిన్ ముఆజ్ (రజి)కు లభించే రుమాళ్లు ఇంతకంటే ఎంతో మృదువుగా, మెత్తగా ఉంటాయి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 12వ అధ్యాయం - మనాఖిబ్ సాద్ బిన్ ముఆజ్ (రజి))

1605. హజ్రత్ అనస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం)కు కానుకగా ఒక పట్టు చొక్కా వచ్చింది. ఆయన పట్టువస్త్రాలు ధరించకూడదని (మమ్మల్ని) వారించేవారు. ప్రజలు ఈ పట్టుచొక్కా (మృదుత్వాన్ని)ని చూసి ఆశ్చర్యపోతుంటే, దైవప్రవక్త (సల్లం) వారిని చూసి "ఎవరి అధీనంలో ముహమ్మద్ (సల్లం) ప్రాణం ఉందో ఆ దేవుని సాక్షి! స్వర్గంలో సాద్ బిన్ ముఆజ్ (రజి)కు లభించే రుమాళ్లు ఇంతకంటే ఎంతో నాణ్యమైనవిగా ఉంటాయి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 51వ ప్రకరణం - హిబా, 28వ అధ్యాయం - ఖబూలిల్ హదియతి మినల్ ముష్రికీన్)

---

★ హజ్రత్ ఉబై బిన్‌కాబ్ (రజి) 'దేవుడు నా పేరు ప్రస్తావించి ఇలా అన్నాడా?!, అని అడగటంలో ఆయన ఉద్దేశ్యం - దేవుడు నిజంగా తన పేరు ప్రస్తావించి మరీ ఇలా చెప్పాడా? లేక సహాబీలలో ఒకరికి ఈ సూరా విన్పించమని ఆదేశించినప్పుడు దైవప్రవక్త (సల్లం) తనను ఎంచుకున్నారా? అని తెలుసుకోవాలన్నదే. ఆయన దైవప్రవక్త (సల్లం) సమాధానం విని రోదించడానికి కారణం దేవుడు అల్పుణ్ణయిన తన పేరు ప్రస్తావించినందుకు సంతోషాతిశయంతో ఆనందాశ్రువులు రాల్చడం కావచ్చు. లేదా దేవుడు తనకు అంతటి మహాభాగ్యం ప్రసాదించినప్పటికీ తానందుకు తగిన కృతజ్ఞతలు చెల్లించుకోలేక పోయానేనన్న బాధ కావచ్చు.

హజ్రత్ ఖుర్తుబీ (రహ్మలై) అభిప్రాయం ప్రకారం హజ్రత్ ఉబై బిన్ కాబ్ (రజి) ఆశ్చర్యంతో అలా అడగటానికి కారణం, దేవుడు తన పేరు ప్రస్తావించడం తన పాలిట మహాభాగ్యమని తలచి సంతోషాతిశయంతో ఆయన ఉక్కిరిబిక్కిరి అయ్యారు. తత్ఫలితంగా ఆయన కళ్ళ నుండి ఆనందభాష్పాలు రాలాయి. ప్రత్యేకించి ఈ సూరా విన్పించమని ఆదేశించడానికి కారణం, ఈ సూరా ఎంతో సంక్షిప్తంగా ఉండటమే గాకుండా ఇందులో దేవుని ఏకత్వం, దైవదౌత్యం వగైరా విషయాలను గురించిన సమగ్ర సమాచారం కూడా ఉండటమే. అదీగాక ఇందులో ఇతర దైవప్రవక్తలపై ప్రభవించిన దివ్యగ్రంథాలు, నమాజ్, జకాత్, పరలోక విశ్వాసం, నరకవాసులు, స్వర్గవాసులు మొదలయిన విషయాల ప్రస్తావన కూడా ఉంది. హజ్రత్ ఉబై బిన్ కాబ్ (రజి) ఇస్లాం స్వీకరించక పూర్వం యూద మత పండితునిగా ఈ సూరాలోని యదార్థాలన్నిటిని ఎరిగిన వారయి ఉండటం వల్ల కూడా ఈ సూరా ప్రత్యేకంగా ఆయనకు విన్పించమని ఆదేశించడం జరిగింది. (సంకలనకర్త)

## 26వ అధ్యాయం - హజ్రత్ జాబిర్ (రజి) తండ్రి హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ (రజి) ఘనత

1606. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం :- ఉహుద్ యుద్ధం రోజు మా నాన్న భౌతిక కాయాన్ని దైవప్రవక్త (సల్లం) ముందు తెచ్చిపెట్టి ఒక వస్త్రం కప్పారు - అవిశ్వాసులు ఆయన ముక్కు, చెవులు మొదలైన శరీరావయవాలను కోసి అందవికారంగా చేశారు - నేను ముందుకు వెళ్ళి ఆయన (భౌతిక కాయం) పై నుంచి బట్ట తొలగించి చూద్దామనుకున్నాను, కాని నా వంశస్థులు కొందరు నన్వాపారు. తరువాత మళ్ళీ లేచి ఆ బట్ట తొలగించి చూద్దామని ప్రయత్నించాను. కాని నా వంశస్థులు మళ్ళీ నన్ను వారించారు. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) ఆయన భౌతిక కాయాన్ని తీసికెళ్ళమని ఆజ్ఞాపించారు. అప్పుడు ఎవరో ఏడ్పు లంకించుకున్నారు. దైవప్రవక్త (సల్లం) అది విని "ఎవరూ ఏడుస్తున్నది?" అని అడిగారు. 'అమ్ర్ కూతురు' అని చెప్పారు జనం. దైవప్రవక్త (సల్లం) "ఆమె ఎందుకేడుస్తోంద"ని అడిగారు మళ్ళీ లేక "ఆమె ఏడ్వకూడదు. ఆయన భౌతికకాయాన్ని ఎత్తి తీసికెళ్ళే దాకా దైవదూతలు తమ రెక్కలతో ఆయనకు నీడపట్టారు" అని అన్నారు ఆయన (సఅసం).

(సహీహ్ బుఖారీ:- 23వ ప్రకరణం - జనాయిజ్, 35వ అధ్యాయం - హద్దసనా అలీబిన్ అబ్దుల్లా)

## 28వ అధ్యాయం - హజ్రత్ అబూజర్ గిఫారి (రజి) మహిమోన్నతలు

1607. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం:- హజ్రత్ అబూజర్ గిఫారి (రజి)కు మహనీయ ముహమ్మద్ (సల్లం) దైవప్రవక్త అయ్యారన్న సమాచారం అందడంతో ఆయన తన తమ్ముడితో ఇలా అన్నారు : "మక్కాలో ఒకతను తాను దైవప్రవక్తననీ, తనపై ఆకాశం నుండి దైవసందేశం అవతరిస్తోందని చెప్పుకుంటున్నాడట. నీవు వాహనమెక్కి అక్కడికి వెళ్ళిరా. ఆ మనిషి గురించిన సమాచారం తెలుసుకొని వచ్చి నాకు చెప్పు. అతను చెప్పే మాటలు కూడా విని వచ్చి నాకు తెలియజెయ్యి."

అప్పుడు ఆయన తమ్ముడు మక్కాకు బయలుదేరాడు. దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి ఆయన చెప్పే మాటలు విన్నాడు. తిరిగొచ్చి హజ్రత్ అబూజర్ (రజి)కు ఇలా తెలియజేశాడు : "నేను దైవప్రవక్త (సల్లం)ను కలుసుకున్నాను. మంచి గుణగణాలు అలవరచుకోవాలని, నీతి నిజాయితీలతో మెలగాలని ఆయన (ప్రజలకు) హితబోధ చేస్తున్నారు. నేనాయన నోట దైవవాణి కూడా విన్నాను. అందులో కవిత్వం ఏదీ లేదు."

హజ్రత్ అబూజర్ (రజి) అతని మాటలు విని "నీవు తెచ్చిన సమాచారంలో నాకు తృప్తి కలిగించే విషయాలు లేవు" అని అన్నారు. ఆ తరువాత ఆయన స్వయంగా అన్నం, నీళ్ళు తదితర ప్రయాణావసరాలు సమకూర్చుకొని బయలుదేరారు. మక్కా చేరుకొని కాబా గృహంలో దైవప్రవక్త (సల్లం)ను అన్వేషించడం ప్రారంభించారు. ఆయన దైవప్రవక్త (సల్లం)ను ఇది వరకెన్నడూ చూడలేదు. దైవప్రవక్త (సల్లం) గురించి ఇతరుల్ని అడిగి తెలుసుకోవాలన్న ఉద్దేశ్యం కూడా లేదు. చివరికి పొద్దుపోయి రాత్రి వేళ కూడా అయింది. అప్పుడు హజ్రత్ అలీ (రజి) చూసి, పాపం ఎవరో బాటసారి అనుకొని ఆయన్ని తన వెంట (ఇంటికి) పిలుచుకువెళ్ళారు. అయితే మరునాడు ఉదయం దాకా

ఇద్దరి మధ్యా ఎలాంటి సంభాషణ జరగలేదు. తెల్లవారిన తరువాత హజ్రత్ అబూజర్ (రజి) తన మూటాముల్లె భుజాన వేసుకొని తిరిగి కాబా గృహానికి వెళ్ళారు. ఆ రోజు కూడా ఆయన అక్కడ పగలంతా గడిపినా దైవప్రవక్త (సల్లం)ను గుర్తించలేక పోయారు. చివరికి చీకటి పడటంతో ఆయన (కాబాలో) గతరాత్రి పడుకున్న చోటికే వచ్చి మేను వాల్చారు.

ఆ రోజు కూడా హజ్రత్ అలీ (రజి) రాత్రివేళ అటుగా వచ్చి "ఇంకా ఈ బాటసారికి గమ్యం చేరుకునే సమయం రాలేదా" అని భావిస్తూ ఆయన్ని లేపారు. లేపి తన వెంట (ఇంటికి) పిలుచుకువెళ్ళారు. అయితే ఇద్దరూ ఏ విషయాలూ మాట్లాడుకోలేదు. మూడవ రోజు కూడా అలాగే జరిగింది. హజ్రత్ అలీ (రజి) ఆయన దగ్గరకు వెళ్ళి "మీరిక్కడికి వచ్చిన పనేమిటో తెలియ జేయరా!" అని అడిగారు. దానికి హజ్రత్ అబూజర్ (రజి) సమాధానమిస్తూ "నేను నా పని మీద వెళ్ళవలసిన చోటికి మీరు నన్ను చేర్చుతారని గట్టి హామీనిస్తే అన్ని విషయాలూ చెబుతాను" అని అన్నారు. అలాగే చేర్చుతానని హజ్రత్ అలీ (రజి) వాగ్దానం చేశారు. అప్పుడు హజ్రత్ అబూజర్ (రజి) తాను వచ్చిన పనేమిటో చెప్పారు. "అయితే అది (అంటే మీరు విన్నమాట) నిజమే. ఆయన దేవుని ప్రవక్త (సల్లం). రేపుదయం నా వెనకాలే నడవండి. దారిలో నేనొకవేళ మీకు ప్రమాదం సంభవించే వ్యవహారం ఏదైనా గమనిస్తే, నేను మూత్ర విసర్జన చేసే వాడిలా నిలబడిపోతాను. తిరిగి నేనక్కడ్నుంచి కదలి ముందుకు సాగగానే మీరు నా వెనకాలగా రావాలి. ఈ విధంగా నేను ముందుగా ఆ ఇంట్లోకి ప్రవేశిస్తాను. ఆ తరువాత మీరు నా వెనకాలే నడుస్తూ ఆ ఇంట్లోకి ప్రవేశించవచ్చు" అన్నారు హజ్రత్ అలీ (రజి).

అలా మాట్లాడుకున్న తరువాత మరునాడు ఇద్దరూ బయలుదేరారు. హజ్రత్ అలీ (రజి) ఆయన వెనకాలగా హజ్రత్ అబూజర్ (రజి) నడుస్తూ దైవప్రవక్త (సల్లం) సన్నిధికి చేరుకున్నారు. హజ్రత్ అబూజర్ (రజి) దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడిన తరువాత ఆయన హితోక్తులు విని (వెంటనే) అక్కడికక్కడే ఇస్లాం స్వీకరించారు. ఆ తరువాత ఆయనతో దైవప్రవక్త (సల్లం) మాట్లాడుతూ "ఇక నీవు నీ తెగవాళ్ళ దగ్గరికెళ్ళి వారికి నా గురించి తెలియజెయ్యి. నేను మళ్ళీ ఆదేశించే వరకు నీవు అక్కడే ఉండు" అని అన్నారు. అయితే హజ్రత్ అబూజర్ (రజి) (నూతన ధర్మం పట్ల అమితోత్సాహం వ్యక్తపరుస్తూ) "నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ దేవుని సాక్షి! నేను వీరికి (అంటే మక్కా బహుదైవారాధకులకు కలమయె షహాదత్‌ను) (సాక్ష్యవచనాన్ని) బిగ్గరగా పఠించి విన్పిస్తాను" అని అన్నారు.

అన్నట్లుగానే ఆయన అక్కడ్నుంచి కాబా గృహానికి వెళ్ళి కలిమయె షహాదత్‌ను (సాక్ష్యవచనాన్ని) బిగ్గరగా పలుకుతూ "అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడని, ముహమ్మద్ (సల్లం) ఆ దేవుని ప్రవక్తని నేను సాక్ష్యమిస్తున్నాను" అని బహిరంగంగా ప్రకటించారు.

ఈ మాటలు వినగానే జనం దిగ్గున లేచి ఆయనపై విరుచుకుపడ్డారు. ఆయన్ని క్రింద పడదోసి కొట్టడం మొదలెట్టారు. అంతలో హజ్రత్ అబ్బాస్ (రజి) వచ్చి ఆయన మీదకు వంగి గుంపును వారిస్తూ "మీకేమైనా పొయ్యే కాలం వచ్చిందా? ఇతను గిఫ్ఫార్ తెగ మనిషని తెలియదా మీకు? వ్యాపారం కోసం మీరు సిరియా దేశానికి ఆ తెగ వారి ప్రాంతం గుండానే పోతుంటారు గదా!

(అప్పుడు మీ గతేమవుతుందో కాస్త ఆలోచించారా?)" అని అన్నారు. ఇలా చెప్పి ఆయన హజ్రత్ అబూజర్ (రజి)ని వారి నుండి విడిపించారు. అయితే హజ్రత్ అబూజర్ (రజి) రెండో రోజు కూడా అలాగే సాక్ష్యవచనాన్ని బహిరంగంగా ప్రకటించారు. జన సమూహం మళ్ళీ ఆయనపై విరుచుకుపడి చితకబాదింది. కాకతాళీయంగా ఆ రోజు కూడా హజ్రత్ అబ్బాస్ (రజి) అక్కడికి వచ్చి ఆయన్ని విడిపించారు.

(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 33వ అధ్యాయం - ఇస్లామి అబీజర్ (రజి))

## 29వ అధ్యాయం - జరీర్ బిన్ అబ్దుల్లా (రజి) మహిమోన్నతలు

1608. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం :- నేను ఇస్లాం స్వీకరించినప్పటి నుండి దైవప్రవక్త (సల్లం) నన్ను ఏనాడూ లోపలకు రానివ్వకుండా నిరోధించలేదు. ఆయన నా వైపు ఎప్పుడు చూసినా చిరునవ్వుతో కన్పించేవారు. నేనొకసారి గుర్రం మీద కుదురుగా కూర్చోలేక పోతున్నానని చెబితే ఆయన నా రొమ్ము మీద చేత్తో చరిచి "దేవా! ఇతడ్ని కుదురుగా కూర్చోబెట్టు. ఇతడ్ని మార్గదర్శిగా, సన్మార్గగామిగా చెయ్యి" అని ప్రార్థన చేశారు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 162వ అధ్యాయం - మన్లా యస్బుతు అలల్ ఖైల్)

1609. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం :- ఓసారి దైవప్రవక్త (సల్లం) నాతో "జరీర్! నీవు 'జుల్‌ఖలసా'ను ధ్వంసం చేసి నా ఆందోళనను దూరం చేయవూ?!" అని అన్నారు. జుల్‌ఖలసా అనేది ఖసామ్ తెగవాళ్ళ విగ్రహాలయం. దీన్ని 'యమన్ కాబా' అని కూడా అంటారు. అప్పుడు నేను అహ్మస్ తెగకు చెందిన నూట యాభై మంది రౌతులను తీసుకొని బయలుదేరాను. వారంతా అశ్వారూఢులు. నేను గుర్రం మీద కుదురుగా కూర్చోలేకపోయాను. దైవప్రవక్త (సల్లం) నా అవస్థ చూసి తమ చేత్తో నా రొమ్ము మీద చరచి "దేవా! ఇతడ్ని కుదురుగా కూర్చోబెట్టు. ఇతడ్ని మార్గదర్శిగా, సన్మార్గగామిగా చెయ్యి" అని ప్రార్థించారు. దైవప్రవక్త (సల్లం) చేతివ్రేళ్ళ గుర్తులు నా రొమ్ము మీద పడటం నేను చూశాను.

హజ్రత్ జరీర్ (రజి) ఆ విగ్రహాలయం దగ్గరికెళ్ళి దాన్ని ధ్వంసం చేసి తగలబెట్టించారు. తరువాత దైవప్రవక్త (సల్లం) సన్నిధికి ఒక మనిషిని పంపి ఆ విషయం తెలియజేశారు. ఆ వ్యక్తి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి "మీకు సత్యం, ధర్మం ఇచ్చి పంపిన దేవుని సాక్షి! ఆ విగ్రహాలయం పొట్ట ఖాళీ అయిపోయిన ఒంటెలా, లేదా చిడుము ఒంటెలా మారిపోయింది. ఆ స్థితిలో నేను మీ దగ్గరికి వచ్చాను" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ వార్త విని అహ్మస్ అశ్వారూఢులు, వారి కాల్బలం శ్రేయోశుభాల కోసం అయిదు సార్లు దేవుడ్ని ప్రార్థించారు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 154వ అధ్యాయం - హర్ఖిద్దూరివన్నఖీల్)

## 30వ అధ్యాయం - హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) మహిమోన్నతలు

1610. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) మరుగుదొడ్డికి వెళ్ళారు.

నేనాయన కోసం వుజూ చేయడానికి (ఒక ముంతలో) నీళ్ళు తెచ్చి పెట్టాను. దైవప్రవక్త (సల్లం) (మరుగుదొడ్డి నుంచి బయటికి) వచ్చి "ఈ నీళ్ళు ఎవరు పెట్టారు?" అని అడిగారు. ఇబ్నె అబ్బాస్ (రజి) పెట్టాడని చెప్పారు జనం. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "దేవా! అతనికి ధర్మాన్ని గురించిన (పూర్తి) స్పృహ, అవగాహనా భాగ్యం ప్రసాదించు" అని ప్రార్థించారు.

(సహీహ్ బుఖారీ:- 4వ ప్రకరణం - వుజూ, 10వ అధ్యాయం - వజ్యిల్ మాయి ఇన్దల్ ఖలా)

## 31వ అధ్యాయం - హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) మహిమోన్నతలు

1611. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- "దైవప్రవక్త (సల్లం) జీవించి ఉన్న రోజుల్లో ఎవరైనా (అనుయాయి) కలగంటే అతను దాన్ని ఆయన ముందు వెల్లడించేవాడు. అందుచేత నేను కూడా ఏదైనా కలగంటే దైవప్రవక్త (సల్లం) ముందు వివరించి (దాని గూఢార్థం) తెలుసుకోవాలనుకున్నాను. నేను దైవప్రవక్త (సల్లం) జీవితకాలంలో నవయువకుడ్ని. నేను రాత్రిపూట మస్జిద్‌లో పడుకునేవాడ్ని. ఓ రోజు రాత్రి నేను కలలో ఇద్దరు దైవదూతలను చూశాను. వారు నన్ను పట్టుకొని నరకం వైపుకు తీసికెళ్ళారు. నేను వంగి చూస్తే ఆ నరకం బావిలా నిర్మించబడి ఉంది. దాని మీద బావిపైన ఉన్నట్లే రెండు కొయ్యలు ఉన్నాయి. బావిలో కొందరు ఉన్నారు. వారిని నేను గుర్తుపట్టగలను. అప్పుడు "నేను నరకం నుండి దేవుని శరణు కోరుతున్నాను" అనసాగాను. ఆ తరువాత మరొక దైవదూత నా దగ్గరికి వచ్చి "నీవు భయపడనవసరం లేదు" అని అన్నాడు. ఈ కలను గురించి నేను (నా సోదరి) హజ్రత్ హఫ్సా (రజి)కు తెలియజేశాను. ఆమె దాన్ని దైవప్రవక్త (సల్లం)కు విన్పించారు. దైవప్రవక్త (సల్లం) (నా కల గురించి విని) "అబ్దుల్లా చాలా మంచివాడు. కాని అతను రాత్రివేళ (తహజ్జుద్) నమాజ్ చేస్తుంటే ఎంత బాగుండు!" అని అన్నారు.

దైవప్రవక్త (సల్లం) ఈ మాట చెప్పిన రోజు నుండి హజ్రత్ అబ్దుల్లా (రజి) రాత్రిపూట (తహజ్జుద్ నమాజులో గడుపుతూ) చాలా తక్కువగా నిద్రపోయేవారు.

(సహీహ్ బుఖారీ:- 19వ ప్రకరణం - అత్తహజ్జుద్, 2వ అధ్యాయం - ఫజ్లి ఖియామిల్లైల్)

## 32వ అధ్యాయం - హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) మహిమోన్నతలు

1612. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం :- (నా తల్లి) హజ్రత్ ఉమ్మె సులైమ్ (రజి) దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి "దైవప్రవక్తా! అనస్ మీ సేవకుడు. ఇతని కోసం దుఆ (ప్రార్థన) చేయండి" అని విన్నవించుకున్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "దేవా! అనస్ (రజి) సంపదను, అతని సంతానాన్ని అధికం చెయ్యి. అతనికి నీవు ప్రసాదించిన దాంట్లో శుభం కలిగించు" అని ప్రార్థించారు.

(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 47వ అధ్యాయం - అద్దుఆయి బికస్రతిల్ మాల్ వల్ బరకతి)

1613. హజ్రత్ అనస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) నాకు ఒక రహస్యం తెలియజేశారు. దాన్ని గురించి నేను ప్రవక్త నిష్క్రమణ తరువాత కూడా ఎవరికీ చెప్పలేదు. చివరికి నా తల్లి అడిగినా చెప్పలేదు.

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - అల్‌ఇస్తియిజాన్, 46వ అధ్యాయం - హిఫ్జిస్సిర్ర్)

# 33వ అధ్యాయం - హజ్రత్ అబ్దుల్లా బిన్ సలాం (రజి) మహిమోన్నతలు

1614. హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి) కథనం :- నేల మీద నడిచేవారిలో ఒక్క హజ్రత్ అబ్దుల్లా బిన్ సలాం (రజి) విషయంలో తప్ప మరెవరి విషయంలోనూ ఇతను స్వర్గ నివాసి అని దైవప్రవక్త (సల్లం) చెప్పగా నేను వినలేదు. "ఇలాంటి వాణిని గురించి బనీ ఇస్రాయీల్‌కు చెందిన ఒక వ్యక్తి సాక్ష్యం కూడా ఇచ్చాడు" (అహ్ఖాఫ్-10) అనే ఖుర్ఆన్ సూక్తి ఆయన విషయంలోనే అవతరించిందని దైవప్రవక్త (సల్లం) తెలియజేశారు.★

(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 19వ అధ్యాయం - మనాఖిబ్ అబ్దుల్లా బిన్ సలాం)

1615. హజ్రత్ ఖైస్ బిన్ ఇబాద్ (రహ్మాలై) కథనం :- నేను మదీనా మస్జిద్‌లో కూర్చొని ఉండగా ఒక వ్యక్తి లోపలికి ప్రవేశించాడు. అతని ముఖంపై దైవభీతి చిహ్నాలు కన్పిస్తున్నాయి. ఆ వ్యక్తి స్వర్గ నివాసుల్లో ఒకడని ప్రజలు అన్నారు. అతను రెండు రకాతుల తేలిక పాటి నమాజు చేసి బయటికి వెళ్ళిపోయాడు. నేనూ అతని వెనకాల నడచి "మీరు మస్జిద్‌లో ప్రవేశించినప్పుడు మిమ్మల్ని గురించి జనం ఇతను స్వర్గ నివాసి అన్నారు" అని అన్నాను అతనితో. దానికా వ్యక్తి ఇలా సమాధానమిచ్చాడు-

"దేవదేవ! సరయిన జ్ఞానం లేకుండా ఎవరూ ఇలాంటి మాటలు పలక కూడదు. వారలా ఎందుకన్నారో నేను చెబుతాను విను. నేను దైవప్రవక్త (సల్లం) కాలంలో ఒక కలగని ఆ విషయం దైవప్రవక్త (సల్లం) ముందు ప్రస్తావించాను. ఆ కలలో నేనొక ఉద్యానవనం చూశాను. ఆ తోట విశాలత, దాని హరిత సౌందర్యం వగైరా గురించి వర్ణించడం జరిగింది. దాని మధ్యలో ఒక ఉక్కు స్తంభం ఉంది. దాని క్రింది భాగం నేలలో ఉంటే దాని ఉపరి భాగం నింగి దాకా విస్తరించి ఉంది. దానిపై భాగాన ఒక కొక్కెం ఉంది. దానిపైకెక్కమని ఎవరో అన్నారు నాతో. నేను ఎక్కలేనన్నాను. అప్పుడు ఒక సేవకుడు నా దగ్గరకు వచ్చి నా వెనుక వైపు బట్ట ఎత్తివేశాడు. దాంతో నేను ఆ ఉక్కు స్తంభాన్ని (సులభంగా) ఎక్కాను. దానిపై భాగానికి వెళ్ళి అక్కడున్న కొక్కెన్ని పట్టుకున్నాను. దాన్ని గట్టిగా పట్టుకో అన్నారు ఎవరో నాతో. నేను మేల్కొనే దాకా ఆ కొక్కెం నా చేతిలోనే ఉండింది. ఈ స్వప్నం గురించి దైవప్రవక్త (సల్లం)కు తెలియజేశాను. దైవప్రవక్త (సల్లం) అది విని "ఉద్యానవనం అంటే ఇస్లాం, స్తంభం అంటే ఇస్లాం మూలస్తంభాలు, కొక్కెం అంటే దేవుని (చేతిలోని) దృఢమైన కొక్కెం. అంటే నీవు చనిపోయే దాకా ఇస్లాంలో స్థిరంగా ఉంటావని ఈ స్వప్న గూడార్థం" అని అన్నారు.

హదీసు ఉల్లేఖకుడు ఈ వ్యక్తి హజ్రత్ అబ్దుల్లా బిన్ సలాం (రజి) అని తెలిపారు.

(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 19వ అధ్యాయం - మనాఖిబ్ అబ్దుల్లా బిన్ సలాం)

---

★ అధిక సంఖ్యాక ధర్మవేత్తల దృష్టిలో ఈ సూక్తిలో సాక్షి అంటే హజ్రత్ అబ్దుల్లా బిన్ సలాం (రజి) మాత్రమే. ఆ సూక్తి అర్థం ఇలా ఉంది- "ఈ ఖుర్ఆన్ దేవుని వాణి అయి మీరు దీన్ని తిరస్కరిస్తే (దాని పర్యవసానం గురించి) మీరెప్పుడైనా ఆలోచించారా? అలాంటి వాణిని గురించి ఇస్రాయీల్ సంతతికి చెందిన ఒక వ్యక్తి (అది దైవవాణి అని) సాక్ష్యం కూడా ఇచ్చాడు. (ఈ విధంగా) అతను (ఈ వాణిని) విశ్వసించాడు, మీరు మాత్రం గర్వాంధకారంలో పడి ఉన్నారు". (46:10)

## 34వ అధ్యాయం - హజ్రత్ హస్సాన్ బిన్ సాబిత్ (రజి) మహిమోన్నతలు

1616. హజ్రత్ సయీద్ బిన్ ముసయ్యబ్ (రహ్మాలై) కథనం :- హజ్రత్ ఉమర్ (రజి) మస్జిద్‌లో ప్రవేశించారు. ఆ సమయంలో హజ్రత్ హస్సాన్ బిన్ సాబిత్ (రజి) కవితలు పఠిస్తున్నారు. (హజ్రత్ ఉమర్ (రజి) మండిపడుతూ ఆయన్ని ఒక మాట అన్నారు.) ఆయన హజ్రత్ ఉమర్ (రజి)ని సంబోధిస్తూ "ఈ మస్జిద్‌లో మీకంటే ఎంతో శ్రేష్ఠుడైన మహనీయుడున్న రోజుల్లో కూడా నేనిక్కడ కవితలు పఠిస్తూ ఉండేవాడ్ని. (కాని ఆయన నన్ను ఏనాడూ వారించలేదు)"అని అన్నారు. ఆ తరువాత ఆయన హజ్రత్ అబూ హురైరా (రజి) వైపుకు తిరిగి "దైవసాక్షిగా అడుగుతున్నాను చెప్పండి. దైవప్రవక్త (సల్లం) నాతో '(హసాన్!) నా తరఫున వారికి (అంటే అవిశ్వాసులకు) సమాధానమివ్వు. దేవా! పరిశుద్ధాత్మ (హజ్రత్ జిబ్రయీల్ - అలైహి) ద్వారా ఇతనికి సహాయం చెయ్యి' అని చెప్పలేదా?" అని అడిగారు. దానికి హజ్రత్ అబూ హురైరా (రజి) "ఔను చెప్పారు. నేనీ మాట విన్నాను" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్'యిల్ ఖల్ఖ్, 6వ అధ్యాయం - జిక్రిల్ మలాయిక)**

1617. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) హజ్రత్ హస్సాన్ (రజి)తో "(నీ కవిత్వంతో) ఈ అవిశ్వాసుల్ని ఖండించు (చెండాడు), (ఈ పనిలో) హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) నీకు సహాయపడతారు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్'యిల్ ఖల్ఖ్, 6వ అధ్యాయం - జిక్రిల్ మలాయిక)**

1618. హజ్రత్ ఉర్వా బిన్ జుబైర్ (రజి) కథనం :- నేను విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) ముందు హజ్రత్ హస్సాన్ (రజి)కు చీవాట్లు పెట్టబోయాను. కాని హజ్రత్ ఆయిషా (రజి) నన్నా పని నుండి వారిస్తూ "ఈయన్ని ఏమీ అనకు.[1] దైవప్రవక్త (సల్లం) తరఫున ఈయన తన (కవిత్వంతో) అవిశ్వాసుల (కారుకూతల)కు సమాధానమిచ్చి ఉన్నారు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 16వ అధ్యాయం - మన్ అహబ్బ అన్‌ల్లా యసుబ్బ నసబహు)**

1619. హజ్రత్ మస్రూఖ్ (రహ్మాలై) కథనం :- మేము ఓ రోజు విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) గారి సన్నిధికి వెళ్ళాము. ఆ సమయంలో అక్కడ హజ్రత్ హస్సాన్ బిన్ సాబిత్ (రజి) కూర్చొని ఆమెకు ఒక పద్యపాదం వినిపిస్తున్నారు. అదిలా ఉంది : "మచ్చలేని పవిత్ర నారీమణి, అత్యంత బుద్ధిశాలిని, మీపై లేదెటువంటి నిందారోపణ. ప్రతి రోజూ ఉదయం పస్తే పస్తు, ఏమరపాటుతో ఉండే ఏ మహిళా మాంసం రుచించదామెకు."[2]

---

(1) హజ్రత్ ఉర్వా (రజి) హజ్రత్ అస్మా (రజి)కుమారుడు. అంటే హజ్రత్ ఆయిషా (రజి) గారి అక్క కుమారుడు. ఆయన హజ్రత్ హస్సాన్ (రజి)కు చీవాట్లు పెట్టడానికి కారణం హజ్రత్ ఆయిషా (రజి)పై వచ్చిన నిందారోపణలో హజ్రత్ హస్సాన్ (రజి) పాల్గొనడమే. అయితే హజ్రత్ ఆయిషా (రజి) పాతివ్రత్యాన్ని గురించి దైవసూక్తి అవతరించిన తరువాత ఆయన్ని శిక్షించడం జరిగింది. ఆ తరువాత హజ్రత్ ఆయిషా (రజి) కూడా ఆయన్ని క్షమించారు. (అనువాదకుడు)

(2) అంటే ఆమె ఎవరినీ పరోక్షంగానైనా నిందించరు అని అర్థం. పరోక్ష నిందకు (చాడీలకు) పాల్పడటాన్ని దివ్య ఖుర్ఆన్‌లో తన మృత సోదరుని మాంసం తినడంతో పోల్చడం జరిగింది. (సంకలనకర్త)

హజ్రత్ ఆయిషా (రజి) ఈ కవితా ఖండిక విని "మరి మీరు అలాంటి వారు కాదుగా!" అని అన్నారు (సుతిమెత్తగా ఒకటి అంటిస్తూ).

ఆ తరువాత నేను హజ్రత్ ఆయిషా (రజి)తో "మీరసలు ఈయన్ని మీ దగ్గరకు ఎందుకు చేరనిస్తున్నారు? దేవుడు (ఖుర్‌ఆన్‌లో) ఈయన్ని గురించి 'ఈ (నిందారోపణ) వ్యవహారంలో ఎక్కువ పాలుపంచుకున్న వాడికి కఠిన శిక్ష ఉంది' (24:11) అని అన్నాడు కదా!" అని అన్నాను. దానికి హజ్రత్ ఆయిషా (రజి) సమాధానమిస్తూ "అంధుడయిపోయాడు కదా, అంతకంటే కఠిన శిక్ష మరేముంది? అదీగాక ఆయన దైవప్రవక్త (సల్లం) తరపున (తన కవిత్వంతో) అవిశ్వాసుల (కారుకూతల)కు సమాధానమిస్తుండేవారు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 34వ అధ్యాయం - హదీసిల్ ఇఫ్క్)

1620. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- హజ్రత్ హస్సాన్ బిన్ సాబిత్ (రజి) దైవప్రవక్త (సల్లం)ను; (తన కవితా పటిమతో) అవిశ్వాసుల్ని ఖండించడానికి తనకు అనుమతి ఇవ్వమని అడిగారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "వాళ్ళను ఖండిస్తూ నీవు నా వంశగౌరవాన్ని ఎలా కాపాడగలవు? (వాళ్ళు కూడా ఖురైష్ వంశస్థులే కదా!)" అని అన్నారు. దానికి హజ్రత్ హస్సాన్ (రజి) సమాధానమిస్తూ నేను మిమ్మల్ని వారి నుండి పిండిలో నుంచి వెంట్రుకను తీసినట్లు (సులభంగా) తీసివేస్తాను" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 16వ అధ్యాయం - మన్ అహబ్బఅన్‌ల్లా యసుబ్బ నసబహు)

## 35వ అధ్యాయం - హజ్రత్ అబూహురైరా దౌసీ(రజి) మహిమోన్నతలు

1621. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- అబూహురైరా (రజి) ప్రవక్త ప్రవచనాలను ఎక్కువగా విన్పిస్తుంటాడని మీరు భావిస్తున్నారు. కాని దేవుని సన్నిధిలో హాజరయి (ప్రతి మనిషీ తన) కర్మలను గురించి లెక్క చెప్పవలసిన ఒక దినం నిర్ణయమై ఉంది. (నేనొకవేళ అబద్ధం చెపుతుంటే దాని శిక్ష నా మీద పడుతుంది. ఈ విషయంలో మీరు నా గురించి లేనిపోని అనుమానాలకు తావిస్తుంటే దానికి మీరు బాధ్యత వహించవలసి ఉంటుంది). అసలు విషయం ఏమిటంటే నేనొక పేదవాడ్ని. నేను కేవలం నా కడుపు నింపుకోవడంతో తృప్తి చెందుతూ మిగిలిన సమయంలో దైవప్రవక్త (సల్లం) సేవలోనే గడుపుదామని నిర్ణయించుకున్నాను. దీనికి భిన్నంగా ముహాజిర్‌లు తమ వ్యాపార కార్యకలాపాల్లో, అన్సారులు తమ ఆస్తుల పరిరక్షణలో నిమగ్నులై ఉండేవారు. నేనొక రోజు దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళాను. అప్పుడు ఆయన "నేను చెప్పే మాటలు పూర్తికాగానే వాటిని సేకరించుకోవడానికి మీలో ఎవరైనా తన దుప్పటి పరచడానికి సిద్ధంగా ఉన్నారా? అలా చేసేవాడు నా నోట విన్న మాటలను ఎన్నటికీ మరచిపోలేడు" అని అన్నారు. నేనీ మాట విని నా దుప్పటి తీసి (ఆయన ముందు) పరిచాను. దైవప్రవక్త (సల్లం)కు సత్యధర్మం ఇచ్చి పంపిన శక్తి స్వరూపుని సాక్షిగా చెబుతున్నాను. నేను దైవప్రవక్త (సల్లం) నోట విన్న ఏ మాటను కూడా ఎన్నడూ మరచిపోలేదు".

(సహీహ్ బుఖారీ:- 96వ ప్రకరణం - ఏతెసామ్, 22వ అధ్యాయం - అల్ హుజ్జతి అలామన్‌ఖాల ఇన్న అహ్కామన్నబియ్యి (సల్లం) కానత్ జాహిరతన్)

## 36వ అధ్యాయం - బద్ర్ యోధుల మహిమోన్నతలు, హజ్రత్ హాతిబ్ (రజి) ఉదంతం

1622. హజ్రత్ అలీ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) నన్ను హజ్రత్ జుబైర్ (రజి), హజ్రత్ మిఖ్దాద్ బిన్ అస్వద్‌లను ఇలా ఆదేశించారు - "వెంటనే బయలుదేరి 'రోజాఖాఖ్' ప్రాంతానికి చేరుకోండి. అక్కడ ఒక స్త్రీ ఒంటె మీద పోతూ కన్పిస్తుంది. ఆమె దగ్గర ఒక ఉత్తరం ఉంది. దాన్ని తీసుకొని రావాలి." ఈ ఆజ్ఞ వినగానే మేము గుర్రాలను పరుగెత్తించి రోజాఖాఖ్ ప్రాంతానికి చేరుకున్నాము. అక్కడ మాకు ఒంటె మీద వెళ్తున్న ఒక స్త్రీ కన్పించింది. మేమామెను సమీపించి "ఉత్తరం తీసి మాకివ్వు" అని అన్నాము. దానికామె "నా దగ్గర ఉత్తరం గిత్తరం ఏమీ లేదు" అన్నది. మేము (గట్టిగా మాట్లాడుతూ) "మర్యాదగా ఉత్తరం తీసి ఇచ్చెయ్యి. లేదంటావా మేము నిన్ను వివస్త్రను చేసి వెతకవలసి వస్తుంది" అని హెచ్చరించాము. అప్పుడు ఆమె తన కొప్పులో నుంచి ఆ ఉత్తరం తీసి మాకప్పగించింది. మేము దాన్ని తీసుకొని దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళాము.

ఆ ఉత్తరంలో "హాతిబ్ (రజి) బిన్ అబీ బల్తఆ తరఫున మక్కా బహుదైవారాధకుల పేర వ్రాయునది" అని ఉంది. అందులో దైవప్రవక్త (సల్లం) వ్యవహారాలకు సంబంధించిన (ప్రభుత్వ రహస్య) సమాచారం వారికి తెలియజేయబడింది. దైవప్రవక్త (సల్లం) ఆ ఉత్తరం చూసి "హాతిబ్! ఏమిటీ వ్యవహారం?" అని నిలదీశారు. దానికి హజ్రత్ హాతిబ్ (రజి) ఇలా మనవి చేసుకున్నారు, "దైవప్రవక్తా! నా విషయంలో తొందరపడి ఎలాంటి నిర్ణయం తీసుకోకండి. (ముందు నా మనవి వినండి) నేను ఖురైషీ తెగకు చెందిన వాడ్ని కాను. వారి అండదండలతో బ్రతుకుతున్నవాడ్ని. మీతోపాటున్న ముహాజిర్‌లకు మక్కాలో ఖురైషీయులతో బంధుత్వం ఉంది. అందువల్ల వారి ఆస్తిపాస్తులు, భార్యా పిల్లలు అక్కడ భద్రంగా, క్షేమంగా ఉన్నారు. నా బంధువులకు మాత్రం అక్కడ భద్రత లేదు. అందుచేత నేను మక్కా ఖురైషీయులకు ఏదైనా మేలు చేస్తే దానికి ప్రత్యుపకారంగా వారు నా బంధువులకు ఎలాంటి హాని కలిగించకుండా ఉంటారన్న ఉద్దేశ్యంతో నేనిలా చేయవలసి వచ్చింది. అంతేగాని నేనెలాంటి అవిశ్వాస వైఖరికి పాల్పడలేదు. ఇస్లాం ధర్మం వదిలేసి మతభ్రష్టుణ్ణయిపోలేదు. ఇస్లాం స్వీకరించాక తిరిగి అవిశ్వాసకూపంలో పడిపోవాలని కూడా నేను కోరుకోవడం లేదు."

దైవప్రవక్త (సల్లం) ఈ వివరణ విన్న తరువాత "ఇతను అన్నది నిజమే. (ఇతని చిత్తశుద్ధిని శంకించడానికి ఆస్కారమేదీ నాకు కన్పించడం లేదు)" అని అన్నారు. అయితే హజ్రత్ ఉమర్ (రజి) మాట్లాడుతూ "దైవప్రవక్తా! నాకనుమతి ఇవ్వండి. ఈ కపట విశ్వాసిని (ఒక్క దెబ్బతో) కడతేరుస్తాను" అని అన్నారు. కాని దైవప్రవక్త (సల్లం) (ఆయన్ని వారిస్తూ) "ఇతను బద్ర్ యుద్ధంలో పాల్గొని ఉన్నాడు. బద్ర్ యోధుల్ని దేవుడు (కటాక్ష వీక్షణంతో) చూశాడేమో నీకేం తెలుసు? అందువల్లనే ఆయన వారితో 'నేను మిమ్మల్ని క్షమించివేశాను, ఇక మీరు ఏది చేసినా సరే అన్నాడు' అని అన్నారు."

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 141వ అధ్యాయం - అల్‌జాసూసి వ ఖౌలిల్లాహి తఆలా లా తత్త ఖిజూ అదువ్వీ వ అదువ్వకుమ్ అవ్‌లియాఅ)**

## 38వ అధ్యాయం - హజ్రత్ అబూ మూసా అష్‌అరీ, అబూ ఆమిర్ అష్‌అరీ (రజి)ల ఔన్నత్యం

1623. హజ్రత్ అబూ మూసా అష్‌అరీ (రజి) కథనం :- నేను దైవప్రవక్త (సల్లం) దగ్గర కూర్చొని ఉన్నాను. ఆ సమయంలో ఆయన జారానా ప్రాంతంలో (బసచేసి) ఉన్నారు. ఈ ప్రాంతం మక్కా, మదీనాల మధ్యన ఉంది - ఆయనతో పాటు హజ్రత్ బిలాల్ (రజి) కూడా ఉన్నారు. అంతలో ఒక పల్లెవాసి వచ్చి "మీరు నాకు చేసిన వాగ్దానాన్ని ఎప్పుడు నెరవేరుస్తారు?" అని అడిగాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం). "సంతోషించు (ఆ సమయం అతి సమీపంలోనే ఉంది)*" అని అన్నారు. దానికా వ్యక్తి "ఇలాంటి సంతోషవార్తలు మీరు నాకు చాలా విన్పించారు" అని అన్నాడు. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని ఆగ్రహోదగ్రులయ్యారు. ఆయన హజ్రత్ బిలాల్ (రజి)ని, నన్ను ఉద్దేశించి "ఇతను శుభవార్తను తిరస్కరించాడు. మీరిద్దరు స్వీకరించండి" అని అన్నారు. మేము "స్వీకరిస్తున్నాం" అని అన్నాము. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) ఒక పాత్ర తెప్పించి అందులో తమ చేతులు, ముఖాన్ని కడుక్కున్నారు. అందులోనే పుక్కిలించారు. తరువాత ఇలా అన్నారు - "ఇందులోని నీటితో మీ ముఖాలను, రొమ్ములను తడుపుకోండి. ఆపై సంతోషించండి". అప్పుడు మేమిద్దరం ఆ పాత్ర తీసుకొని దైవప్రవక్త (సల్లం) ఆజ్ఞాపించినట్లే చేశాము. అదే సమయంలో పరదా చాటు నుండి విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మెసల్మా (రజి) మమ్మల్ని పిలుస్తూ "మీ మాతృమూర్తి కోసం కూడా కొంచెం (ఆ నీరు) మిగిల్చి ఉంచండి" అని అన్నారు. అంచేత మేమిద్దరం విశ్వాసుల మాతృమూర్తి కోసం (కొంచెం నీరు) మిగిల్చి పెట్టాము.

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 56వ అధ్యాయం - గజ్వతిత్తాయిఫి ఫీ షవ్వాల్ సనద సమానిన్)**

1624. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం :- హునైన్ యుద్ధం నుండి తీరిక దొరికిన తరువాత దైవప్రవక్త (సల్లం), హజ్రత్ అబూ ఆమిర్ (రజి) నాయకత్వంలో ఒక సైనికదళాన్ని ఔతాస్ ప్రాంతానికి పంపించారు. అక్కడ దురైద్ బిన్ సిమ్మాతో యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో దురైద్ సంహరించబడ్డాడు. దేవుడు అతని సైన్యాన్ని ఓడించాడు. దైవప్రవక్త (సల్లం) నన్ను కూడా అబూ ఆమిర్ (రజి) వెంట ఆ యుద్ధానికి పంపించారు. యుద్ధంలో అబూ ఆమిర్ (రజి) మోకాలికి ఒక బాణం వచ్చి తగిలింది. ఈ బాణాన్ని జుషమ్ (తెగకు చెందిన) ఒక వ్యక్తి వదిలాడు. అది అబూ ఆమిర్ (రజి) మోకాలిలో గుచ్చుకున్నది. నేనాయన దగ్గరకు వెళ్ళి "బాబాయి! ఈ బాణం మీ మీదికి ఎవరు వదిలారు?" అని అడిగాను. దానికి ఆయన 'అదిగో ఆ వ్యక్తి నా మీదికి బాణం వదిలాడు. అతనే నా హంతకుడు' అని ఒకతని వైపు సైగ చేస్తూ చెప్పారు. వెంటనే నేనా వ్యక్తి వైపు పరుగెత్తాను. అతను నన్ను చూడగానే పరుగు లంకించుకున్నాడు. నేనతడ్ని వెంబడిస్తూ "రోషం లేని వెధవా ఆగు. సిగ్గులేదా (పారి పోతున్నావు)?" అని అన్నాను. అతను నా మాటలు విని ఆగిపోయాడు. మేమిద్దరం ఖడ్గాలతో దాడికి దిగాము. నేనతడ్ని హతమార్చాను. హజ్రత్ అబూ ఆమిర్ (రజి) దగ్గరికి తిరిగొచ్చి "దేవుడు

★ అంటే త్వరలోనే ధనం పంచడం జరుగుతుంది, అందులో నుంచి నీకూ లభిస్తుందని అర్థం. నీవు సహనం వహించినందుకు పుణ్యఫలం లభిస్తుంది. కనుక సంతోషించు అనే అర్థం కూడా ఇందులో ఇమిడి ఉంది. (సంకలన కర్త)

మీ హంతకుడ్ని చంపివేశాడు" అని అన్నాను. దానికి ఆయన "మంచిది, కాస్త ఈ బాణం తీసెయ్యి" అని అన్నారు. నేనా బాణాన్ని లాగి వేయగానే (గాయం నుండి) నీరు బయటికి వచ్చింది. ఆ తరువాత ఆయన నాతో ఇలా అన్నారు : "అబ్బాయీ! దైవప్రవక్త (సల్లం)కు నా తరపున సలాం చెప్పు. నా పాప మన్నింపు కోసం దైవాన్ని ప్రార్థించమని చెప్పు. ఆయన నన్నీ సైన్యానికి తన ప్రతినిధిగా నియమించి పంపారు."

హజ్రత్ అబూ ఆమిర్ (రజి) ఈ మాటలు పలికిన కాస్సేపటికి కన్నుమూశారు. నేను అక్కడ్నుంచి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి తిరిగొచ్చాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) తమ ఇంట్లో ఒక నులక మంచం మీద మేను వాల్చి ఉన్నారు. దాని మీద ఎలాంటి పడక లేదు. అందుచేత ఆయన వీపు, పక్కల మీద నులక గుర్తులు ఏర్పడి ఉన్నాయి. నేను యుద్ధ విశేషాలన్నీ ఆయనకు వివరించాను. హజ్రత్ అబూ ఆమిర్ (రజి) అమరగతి నొందిన సంగతి కూడా తెలియజేశాను. ఆయన పాప మన్నింపు కోసం ప్రార్థన చేయమని కూడా అర్థించాను. అప్పుడు దైవప్రవక్త నీళ్ళు తెప్పించి వుజూ చేశారు. తరువాత మన్నింపు ప్రార్థన చేయడానికి రెండు చేతులు పైకి ఎత్తారు. అప్పుడు నేను ఆయన చంకల తెలుపుదనాన్ని చూశాను. ఆయన ఇలా ప్రార్థించారు : "దేవా! ఉబైద్ (అంటే అబూ ఆమిర్)ని మన్నించు. ప్రళయ దినాన అత్యధిక మానవులపై అతనికి ఔన్నత్యాన్ని ప్రసాదించు."

ఆ తరువాత నేను "దైవప్రవక్తా! నా పాప మన్నింపుకై కూడా ప్రార్థన చేయండి" అని మనవి చేసుకున్నాను. దానికి దైవప్రవక్త (సల్లం) "దేవా! అబ్దుల్లా బిన్ ఖైస్ (రజి) పాపాలను క్షమించు. ప్రళయదినాన ఇతనికి గౌరవస్థానం ప్రసాదించు" అని ప్రార్థించారు.★

ఈ హదీసు ఉల్లేఖకులైన హజ్రత్ అబూ బుర్దా (రహ్మలై) ఇలా తెలుపుతున్నారు :- "ఈ రెండు ప్రార్థనలలో ఒకటి హజ్రత్ అబూ ఆమిర్ (రజి) కోసం, మరొకటి హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కోసం చేశారు."

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 55వ అధ్యాయం - గజ్వతి ఔతాస్)**

## 39వ అధ్యాయం - అష్అరీ తెగవారి మహిమోన్నతలు

1625. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- అష్అరీయుల ఖుర్ఆన్ పఠన తీరును బట్టి నేను వారిని గుర్తిస్తాను. వారు (మదీనాకు) రాత్రివేళ వచ్చినప్పుడు వారు విడిది చేసే స్థలాన్ని కూడా వారి ఖుర్ఆన్ పఠన శైలిని బట్టి నేను గుర్తిస్తాను, పగటి వేళ నేను స్థలాన్ని చూడకపోయినా సరే. అష్అరీయులలో హకీం (వివేకవంతుడు) అనే ఒక వ్యక్తి ఉన్నాడు. అతను శత్రు సేనలతో తలపడుతున్నప్పుడు "నా సహచరులు మిమ్మల్ని నిరీక్షించమని

---

★ హజ్రత్ అబూ ఆమిర్ అసలు పేరు ఉబైద్ బిన్ సలీం బిన్ హిజార్ అష్అరి. ఈయన అబూ మూసా అష్అరీ (రజి) గారి పినతండ్రి. ఔతాస్ అనేది హవాజిన్ ప్రాంతంలోని ఒక లోయపేరు. ఈ హదీసు ద్వారా హజ్రత్ అబూ ఆమిర్ (రజి), హజ్రత్ అబూ మూసా (రజి)ల ఔన్నత్యం తెలుస్తోంది. (సంకలనకర్త)

(అంటే ఆగమని) ఆదేశిస్తున్నారు" అని అంటాడు.★

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 38వ అధ్యాయం - గజ్వతి ఖైబర్)

1626. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- అష్అరీ తెగవాళ్ళు యుద్ధరంగంలో ఉన్నప్పుడు ఆహార పదార్థాలు అయిపోవడం జరిగితే, లేక స్వస్థలంలో ఉన్నప్పుడు కూడా తమకు, తమ భార్యాపిల్లలకు సరిపడా ఆహార పదార్థాలు లేక కొరత ఏర్పడితే అందరూ కలసి తమ తమ దగ్గర ఉన్న ఆ కొద్దిపాటి ఆహార పదార్థాలను ఒక వస్త్రంలో పోగు చేస్తారు. తరువాత ఒక పాత్రలో దాన్ని పరస్పరం సమానంగా పంచుకుంటారు. (ఈ సుగుణం కారణంగా) వారు నాతో పాటు ఉన్నారు; నేను వారితో పాటు ఉన్నాను.

(సహీహ్ బుఖారీ:- 47వ ప్రకరణం - అష్షిర్కత్, 1వ అధ్యాయం - అష్షిర్కతి ఫిత్తామి వన్నహద్ వల్ ఉరూజి)

## 41వ అధ్యాయం - హజ్రత్ జాఫర్ బిన్ అబీ తాలిబ్ (రజి) తోటి సముద్ర ప్రయాణీకుల మహిమోన్నతలు

1627. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం :- మేము యమన్‌లో ఉండగా దైవప్రవక్త (సల్లం) (మదీనా) వలసపోవడానికి మక్కా నుండి బయలుదేరారని తెలిసింది. అప్పుడు మేము కూడా, అంటే నేనూ నా సోదరులు - వారిలో అందరికంటే నేనే చిన్నవాడ్ని కూడా - దైవప్రవక్త (సల్లం) వెళ్ళిన వైపు బయలుదేరాము. మా అన్నయ్యలలో ఒకతని పేరు అబూ బుర్దా, మరొకతని పేరు అబూ రహమ్. మాతో పాటు మా తెగకు చెందిన మరో యాభై రెండు లేక యాభై మూడు మంది మనుషులు కూడా ఉన్నారు. మేమంతా ఓడెక్కి బయలుదేరాము. అయితే మా ఓడ మమ్మల్ని నజాషీ (అబిసీనియా) భూభాగానికి తీసికెళ్ళి దింపింది. అక్కడ అనుకోకుండా హజ్రత్ జాఫర్ బిన్ అబూ తాలిబ్ (రజి) ని కలుసుకున్నాం. ఆయన దగ్గరే మేము బస చేశాము. కొన్నాళ్ళ తరువాత మేమంతా కలసి (మదీనా) చేరుకొని దైవప్రవక్త (సల్లం) ను కలుసుకున్నాం. ఆయన అప్పటికే ఖైబర్‌ని జయించి ఉన్నారు.

(ఓడలో ప్రయాణం చేసి వచ్చిన) మాతో కొందరు "హిజ్రత్ (వలస) రీత్యా మేము మీకంటే అధికులం" అని అన్నారు. మాతోపాటు (అబిసీనియా నుండి) వచ్చిన హజ్రత్ అస్మా బిన్తె అమీస్ (రజి) విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ హఫ్సా (రజి)ని కలుసుకోవడానికి ఆమె దగ్గరకు వెళ్ళారు. హజ్రత్ అస్మా (రజి) హజ్రత్ హఫ్సా (రజి) దగ్గర కూర్చొని ఉన్నప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) వచ్చారు. ఆయన హజ్రత్ అస్మా (రజి)ను చూసి 'ఎవరీమె' అని అడిగారు. "ఈమె అస్మా బిన్తె అమీస్ (రజి) " అన్నారు హజ్రత్ హఫ్సా (రజి) (తమ నాన్నగారితో). "సముద్ర మార్గాన అబిసీనియా నుండి వలస వచ్చిన అస్మా (రజి) నా?" అని అడిగారు హజ్రత్ ఉమర్ (రజి). హజ్రత్ హఫ్సా (రజి) ఔనన్నారు. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) (ఆమెతో) "మేము మీ కంటే ముందే (ఇక్కడకు) వలస వచ్చాము. కనుక మీ కంటే మేమే దైవప్రవక్త (సల్లం)కు ఎక్కువ సన్నిహితులం" అని అన్నారు. ఈ మాటలు హజ్రత్ అస్మా (రజి)కు ఆగ్రహం తెప్పించాయి.

★ హకీం అంటే వివేకవంతుడని శాబ్దిక భావం. లేదా ఇది అష్అరీ తెగకు చెందిన ఒక వ్యక్తి పేరు కూడా కావచ్చు. "నిరీక్షించండి" అంటే శత్రువులు పారిపోతుంటే వారిని పారిపోకుండా దాడి చేయడానికి పురిగొల్పి యుద్ధ రంగంలోనే వారిని ఓడిస్తాడని అర్థం. (సంకలనకర్త)

దాంతో ఆమె ఇలా అన్నారు: "దైవసాక్షి! అలా ఎన్నటికీ కాదు. మీరు దైవప్రవక్త (సల్లం)తో పాటు ఉన్నారు. మీలో ఎవరైనా ఆకలితో ఉంటే అతని ఆకలిని దైవప్రవక్త (సల్లం) తీర్చేవారు. ఎవరైనా ఏదైనా పని తెలియక చేస్తే అతనికి దైవప్రవక్త (సల్లం) హితోపదేశం చేసేవారు. కాని మా పరిస్థితి అలాకాదు. మేము మీకు చాలా దూరంగా ఇస్లాంని ద్వేషించే అబిసీనియా వంటి సుదూర ప్రాంతంలో పడి ఉన్నాము. (అక్కడ మా మంచీ చెబ్బరలు అడిగే నాథుడే లేడు) మేమీ బాధలన్నీ దేవుని కోసం, ఆయన ప్రవక్త (సల్లం) కోసం భరించాము. (వినండి) దైవసాక్షిగా చెబుతున్నాను. మీరన్న ఈ మాటలను నేను దైవ ప్రవక్త (సల్లం) దృష్టికి తీసి కెళ్ళనంత వరకు అన్నం నీళ్ళు ముట్టుకోను. అక్కడ మేము కష్టాలు అనుభవించాము. అనుక్షణం భయాందోళనలతో గడప వలసి వచ్చింది. నేనీ విషయాలన్నీ దైవప్రవక్త (సల్లం)కు చెప్పి (మీరన్న ఈ మాట ఎంతవరకు సమంజసమో) అడుగుతాను. దైవసాక్షి! నేను అబద్ధాలు చెప్పను. డొంకతిరుగుడు మాటలు చెప్పను. ఉన్నది ఉన్నట్లు చెబుతాను. అందులో మరే మాటా కలపను".

హజ్రత్ అస్మా (రజి) ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి "దైవప్రవక్తా! ఉమర్ (రజి) ఈ యీ మాటలు అన్నారు" అని చెప్పారు. దానికి దైవప్రవక్త (సల్లం) "మరి నువ్వేం సమాధాన మిచ్చావు. ?" అని అడిగారు. "నేనీ మాటలు చెప్పాను" అన్నారు హజ్రత్ అస్మా (రజి). అప్పుడు దైవప్రవక్త (సల్లం) "మీకంటే వారు నా కెక్కువ సన్నిహితులు కారు. ఉమర్ (రజి), అతని సహచరులు ఒక హిజ్రత్ చేస్తే మీ ఓడ ప్రయాణీకులు రెండు హిజ్రత్‌లు చేశారు" అని అన్నారు.

ఈ విషయం గురించి హజ్రత్ అస్మా (రజి) మాట్లాడుతూ "ఆ తరువాత అబూ మూసా (రజి), ఓడలో ప్రయాణం చేసి వచ్చిన ఇతరులు గుంపులు గుంపులుగా నా దగ్గరకు వచ్చి ఈ హదీసుని గురించి అడిగి తెలుసుకోవడం ప్రారంభించారు. వారికి దైవప్రవక్త (సల్లం) ప్రవచనం కంటే గొప్ప భాగ్యం, సంతోషకరమైన విషయం మరొకటి లేదు" అని అన్నారు.

ఈ హదీసుని ఉల్లేఖించిన అబూ బుర్దా (రహ్మాలై) కథనం:- హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) ఈ హదీసుని గురించి తనను మాటిమాటికీ అడిగి తెలుసుకునే వారని కూడా హజ్రత్ అస్మా (రజి) అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 38వ అధ్యాయం - గజ్వతి ఖైబర్)

## 43వ అధ్యాయం - అన్సారున్నబియ్యీ (రజి) మహిమోన్నతలు

1628. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం:- (దివ్య ఖుర్‌ఆన్‌లో) "మీలో రెండు వర్గాలు పిరికితనం వహించడానికి సిద్ధమయిన సంఘటనను గుర్తుకు తెచ్చుకోండి." (3:122) అనే సూక్తి మా విషయంలోనే , అంటే బనీహారిసా, బనీసల్మాల విషయంలోనే అవతరించింది. ఈ సూక్తి అవతరించి ఉండకపోతే బాగుండునని మేము భావించలేదు. ఎందుకంటే ఈ సూక్తిలోనే "దేవుడు వారికి సహాయం చేయడానికి సిద్ధంగా ఉన్నప్పటికీ" అని ఉంది.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 18వ అధ్యాయం-ఇజ్‌హమ్మత్తాయి ఫతాని మిన్కుమ్ అన్తఫ్‌షలా)

1629. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- హర్రా సంఘటనలో అమరగతులయిన వారిని తలచుకొని నేనెంతో బాధపడ్డాను. నేనిలా తీవ్రంగా ఆవేదన చెందిన సంగతి హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి)కు తెలిసింది, అప్పుడు ఆయన నాకు ఒక ఉత్తరం రాశారు. ఆ ఉత్తరంలో దైవప్రవక్త (సల్లం) "దేవా! అన్సారులను అన్సారుల సంతానాన్ని మన్నించు" అని అన్నారని ఆయన నాకు తెలియజేశారు.★

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 63వ సూరా- ఇజా జాఅకల్ మునాఫిఖూన్, 6వ అధ్యాయం - ఖౌలిల్లాహి తాలా హుముల్లజీన యఖూలూన లా తున్ఫిఖూ అలామన్ ఇన్ద రసూలిల్లాహి హత్తా యన్ ఫజ్జూ)

1630. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఒక పెళ్ళి కార్యక్రమం నుండి తిరిగి వస్తున్న స్త్రీలను పిల్లలను చూసి, లేచి వారికెదురుగా వెళ్ళి "అల్లాహ్.....అల్లాహ్! మీరు నాకు అందరికంటే ఎంతో ప్రియమైన వారు" అని అన్నారు. ఈ మాట ఆయన మూడుసార్లు అన్నారు.

(సహీహ్‌బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 55వ అధ్యాయం-ఖౌలిన్నబియ్యి (సల్లం) లిల్ అన్సార్ అన్ తుమ్ అహబ్బున్నాసి ఇలయ్య)

1631. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- ఒక అన్సార్ మహిళ దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చింది. ఆమె వెంట ఒక పసి పిల్లవాడు కూడా ఉన్నాడు. దైవప్రవక్త (సల్లం) ఆమెతో మాట్లాడుతూ "నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ శక్తి మంతుని సాక్షి! యావత్తు మానవుల్లో మీరు (అన్సారులు) నాకెంతో ప్రియమైనవారు" అని అన్నారు. ఈ మాట ఆయన రెండుసార్లు అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 5వ అధ్యాయం -ఖౌలిన్నబియ్యి (సల్లం) లిల్ అన్సార్ అన్‌తుమ్ అహబ్బున్నాసి ఇలయ్య)

1632. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా సెలవిచ్చారు:- "అన్సారులు నా సంఘం, నా నమ్మకస్తులు. అనతి కాలంలోనే ఇతరుల సంఖ్య అధికమవుతుంది. అన్సారుల సంఖ్య తగ్గిపోతుంది. కనుక వీరిలో సజ్జనులు చెప్పే మాటలు వినండి, దుర్జనులను మన్నించండి."

(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 11వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) అఖ్‌బిలూ మిన్‌ముహ్సినిహిమ్)

## 44వ అధ్యాయం - అన్సారుల్లో శ్రేష్ఠమైన కుటుంబాలు

1633. హజ్రత్ అబూ ఉసైద్ (రజి) కథనం :- "అన్సార్ ఇండ్లలో బనీ నజ్జార్ (తెగవారి) ఇండ్లు అన్నిటి కంటే మంచి ఇండ్లు, తరువాత బనీ అబ్దుల్ అష్హల్ ఇండ్లు, ఆ తరువాత బనీ హారిస్ బిన్ ఖజ్రజ్ ఇండ్లు, ఆ తరువాత బనీ సాయిదా ఇండ్లు. మొత్తం మీద అన్సార్‌లకు చెందిన ప్రతి ఇల్లూ మంచిదే" అన్నారు దైవప్రవక్త (సల్లం).

---

★ 'హర్రా' అనేది మదీనా పట్టణం వెలుపల ఉన్న ఒక ప్రదేశం పేరు. హర్రా సంఘటన అంటే - హిజ్రీ 63లో మదీనా వాసులు యజీద్ ఖిలాఫత్ పాలనను వ్యతిరేకించడంతో యజీద్ ఒక పెద్ద సైన్యాన్ని పంపి మదీనా పవిత్రతను కాల రాశాడు. మదీనాలో సామూహిక హత్యాకాండ జరిపించాడు. ఈ హత్యాకాండలో అనేకమంది అన్సారులు కూడా అమరగతులయ్యారు. ఆ రోజుల్లో హజ్రత్ అనస్ (రజి) బస్రాలో నివసిస్తూ ఉండేవారు. మదీనా దుర్ఘటనలను గురించి విని ఆయన ఎంతో బాధపడ్డారు. (అనువాదకుడు)

హజ్రత్ సాద్ (రజి)* ఈ మాట విని "దైవప్రవక్త (సల్లం) మాకంటే ఇతరులకే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చినట్లు అన్పిస్తోంది నాకు" అని అన్నారు. దానికి ఒకరు సమాధానమిస్తూ "దైవప్రవక్త (సల్లం) మీక్కూడా మరికొందరు ఇతరులకంటే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చారు కదా!" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 7వ అధ్యాయం - ఫజ్లి దూరిల్ అన్సార్)

## 45వ అధ్యాయం - అన్సారుల సత్ప్రవర్తన

1634. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం :- నేనొకసారి హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి)తో కలసి ప్రయాణం చేశాను. వయసులో ఆయన నా కంటే పెద్ద వారయినప్పటికీ ప్రయాణంలో ఆయన నాకు సేవచేశారు. దానిక్కారణం హజ్రత్ జరీర్ (రజి) ఇలా చెప్పుకొచ్చారు - "నేను అన్సారులను (మంచి) పనులు (ప్రవక్త సేవా సహాయాలు) చేస్తూ ఉండటం చూశాను. అప్పటి నుండి నేను అవ కాశం లభించినప్పుడల్లా అన్సారుల పట్ల గౌరవభావంతో వారికి (నాకు చేతనైన) సేవ చేస్తున్నాను."

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 71వ అధ్యాయం - ఫజ్లిల్ ఖిద్మతి ఫిల్‌గజ్వి)

## 46వ అధ్యాయం - గిఫార్, అస్లం తెగలకు దైవప్రవక్త (సల్లం) దీవెనలు

1635. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా అన్నారు - "అస్లం తెగ! దేవుడు దాన్ని క్షేమంగా ఉంచుగాక!! గిఫార్ తెగ! దేవుడు దాని పాపాలను క్షమించుగాక!!"

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 6వ అధ్యాయం - జిక్రి అస్లమ వ గిఫార వ ముజైనా)

1636. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు- గిఫార్ తెగను దేవుడు మన్నించు గాక! అస్లం తెగను దేవుడు క్షేమంగా ఉంచుగాక! ఉసయ్యా తెగవాళ్ళు దేవునికి, దైవప్రవక్తకు అవిధేయులయిపోయారు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 6వ అధ్యాయం - జిక్రి అస్లమ వ గిఫార వ ముజైనా వ జుహైన వ అష్జా)

## 47వ అధ్యాయం - గిఫార్, అస్లం, జుహైన, అష్జ, ముజైన, తమీం, దోస్, తై తెగల ఔన్నత్యం

1637. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- ఖురైష్, అన్సార్ మరియు జుహైన, ముజైన, అస్లం, అష్జ, గిఫార్ తెగల ప్రజలంతా నా సహచరులు, సహాయకులు. వారి యజమానులు, సంరక్షకులు దేవుడు మరియు దైవప్రవక్త (సల్లం) తప్ప మరెవరూ కాదు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 2వ అధ్యాయం - మనాఖిబ్ ఖురైష్)

1638. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- "అస్లం,

---

★ ఇక్కడ సాద్ (రజి) అంటే ఖజ్రజ్ తెగ నాయకుడయిన హజ్రత్ సాద్ బిన్ ఉబాదా అని అర్థం. (అనువాదకుడు)

గిఫార్ తెగల వాళ్ళు (అందరూ) ముజైనా, జుహైనా తెగల్లో కొందరు (లేక ఆయన - సఅసం-ఇలా అన్నారు) జుహైన మరియు ముజైనా తెగల వారిలో కొందరు దేవుని దృష్టిలో మంచివాళ్ళు." (లేక దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:-) "అసద్, తమీమ్, హవాజన్, గత్ఫాన్ తెగలలో కొందరు ప్రళయదినాన మంచి వాళ్ళయి ఉంటారు."

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 11వ అధ్యాయం - ఖిస్సతి జమ్‌జమ్)

1639. హజ్రత్ అబూ బక్రా (రజి) కథనం :- హజ్రత్ అఖ్రా బిన్ హాబిస్ (రజి) దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ "అస్లం, గిఫార్, ముజైనా, జుహైనా తెగలలో (పూర్వం) హజ్ యాత్రీకుల్ని దోచుకునే వారు (ఇప్పుడు) మీ చేతిలో ప్రమాణం చేశారు" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "అస్లం, గిఫార్, ముజైనా, జుహైనా తెగలు బనీ తమీం, బనీ ఆమిర్, బనీ అసద్, బనీ గత్ఫాన్ తెగల కంటే దిగజారిపోయాయా? వీరు ఆ (బనీ తమీం, బనీ ఆమిర్ తదితర) తెగల కంటే నయం కాదా?" అని అడిగారు. దానికి ఆయన ఔనన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ శక్తిమంతుని సాక్షి! వారు (అంటే అస్లం, గిఫార్ తదితర తెగలు) వీరి (అంటే బనీ తమీం వగైరా తెగల) కంటే నిస్సందేహంగా నయమే" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 6వ అధ్యాయం - జిక్రి అస్లమ వగిఫార వముజైనా వజుహైనా)

1640. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- తుఫైల్ బిన్ అమ్ర్ దౌసీ (రజి), ఆయన సహచరులు దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! దౌస్ తెగవాళ్ళు అవిధేయులయిపోయి ఇస్లాం స్వీకరించడానికి నిరాకరించారు. మీరు వాళ్ళను శపించండి" అని అన్నారు. అంతలో ఎవరో "దౌస్ తెగ నాశనమయిపోయింది" అని అన్నారు. అయితే దైవప్రవక్త (సల్లం) "దేవా! దౌస్ తెగ ప్రజలకు సన్మార్గావలంబన బుద్ధి ప్రసాదించు. వారిని ముస్లింలుగా మార్చు" అని ప్రార్థించారు.★

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 100వ అధ్యాయం - అద్దుఆయి లిల్ ముష్రికీన్)

1641. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) నోట ఈ మూడు విషయాలు విన్న దగ్గర్నుంచి నేను బనీ తమీం తెగవాళ్ళను అభిమానిస్తున్నాను.

(1) "దజ్జాల్ విషయంలో బనీ తమీం తెగ ప్రజలు అందరికంటే చాలా కఠినంగా వ్యవహరిస్తారు" అన్నారు దైవప్రవక్త (సల్లం).

(2) బనీ తమీం తెగవారి దగ్గర్నుంచి సదఖాలు (జకాత్ వగైరా రెవెన్యూ ఆదాయం) వచ్చినప్పుడు "ఇవి మన జాతి ప్రజలు పంపిన సదఖాలు" అని అన్నారు ఆయన (సల్లం).

(3) బనీ తమీం తెగకు చెందిన ఒక మహిళా ఖైదీ విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) వాటాలో వచ్చింది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) హజ్రత్ ఆయిషా (రజి)తో "ఈమె హజ్రత్

---

★ ఈ మాట మహాప్రవక్త (సల్లం) ఔదార్యానికి, తన అనుచర సమాజం పట్ల ఆయనకున్న ప్రేమా వాత్సల్యాలకు మచ్చుతునక అని ఇమామ్ ఖస్తలానీ (రహ్మలై) వ్యాఖ్యానించారు. (సంకలనకర్త)

ఇస్మాయీల్ (అలైహి) సంతతికి చెందిన స్త్రీ. అందుచేత ఈమెకు స్వాతంత్ర్యం ఇచ్చెయ్యి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 49వ ప్రకరణం - ఇత్ఖ్, 13వ అధ్యాయం - మమ్మలక మినల్ అరబి రఖీఖా ఫ వహబి వబాఅ)

## 48వ అధ్యాయం - అత్యంత శ్రేష్ఠులు

1642. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు:- ప్రజలు మీకు (ఖనిజ నిక్షేపాలుండే) గనుల మాదిరిగా కన్పిస్తారు. అజ్ఞాన (అనాగరిక) కాలంలో మంచి వాళ్ళుగా ఉండిన వారే ముస్లింలయిన తరువాత కూడా మంచివాళ్ళు. అయితే వారు ధార్మిక స్పృహ, ధర్మం పట్ల (సరయిన) అవగాహన కలిగి ఉండాలి.

పరిపాలన చేసే (అధికారులు, రాజ్యాధినేతలు మొదలైన) వారిలో అందరికంటే ఎక్కువ అధికార పిపాస లేని వాడినే మీరు ఉత్తముడిగా పొందగలరు. అలాగే అందరికంటే అతి చెడ్డవాడు రెండు ముఖాలవాడు (అంటే గోముఖ వ్యాఘ్రం). అతను కొంథరి దగ్గర ఒక ముఖంతో, మరి కొందరి దగ్గర మరొక ముఖంతో వ్యవహరిస్తాడు."★

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 1వ అధ్యాయం - ఖౌలిల్లాహి త ఆలా (యా అయ్యుహన్నాసు ఇన్నా ఖలఖ్నా కుమ్ మిన్ జకరిన్వ ఉన్సా)

## 49వ అధ్యాయం - ఖురైష్ మహిళల ఔన్నత్యం

1643. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- "ఒంటెల మీద స్వారీ చేసే స్త్రీలందరిలో ఖురైష్ మహిళలు చాలా మంచివాళ్ళు (అంటే అరబ్ మహిళలందరూ

---

★ ఈ హదీసులో గొప్ప యదార్థాన్ని గురించి సూచించడం జరిగింది. ప్రపంచంలోని విభిన్న వస్తువుల మూలాలు విభిన్న రకాలుగా ఉన్నట్లే విభిన్న మానవుల గుణగణాలు, లక్షణాలు కూడా సంతతి, తెగల రీత్యా విభిన్న రకాలుగా ఉంటాయి. రాగి, వెండి, బంగారం, సీసం మొదలైనవి విభిన్న ఖనిజాల నుండి ఉత్పత్తి అవుతాయి. బంగారు ఖనిజం నుండి బంగారమే వస్తుంది. వెండి ఖనిజం నుండి వెండే వస్తుంది. అలాగే మానవుల విషయం కూడా. అజ్ఞానకాలంలో సజ్జనులుగా ఉండినవారే ముస్లిములయిన తరువాత కూడా సజ్జనులుగా రాణిస్తారు. అయితే వారు ముస్లిములయిన తరువాత ఇస్లాం పట్ల పూర్తి స్పృహ, పరిపూర్ణ అవగాహన కలిగి ఉన్నప్పుడే వారి మంచితనం రాణిస్తుంది. అది లేకపోతే అజ్ఞానకాలంలో సజ్జనులుగా లేకపోయినా ఇస్లాం స్వీకరించిన తరువాత నూతన ధర్మం పట్ల స్పృహ, అవగాహన పొందినవారే, వారికంటే శ్రేష్ఠులవుతారు. ఈ విషయం రీత్యా ప్రజలను నాలుగు రకాలుగా విభజించవచ్చు.
(1) అజ్ఞాన కాలంలోనూ సజ్జనులుగా ఉండి ఇస్లాం స్వీకరించిన తరువాత దాని పట్ల సరయిన అవగాహన పెంపొందించుకున్నవారు.
(2) అజ్ఞాన కాలంలో సజ్జనులుగా ఉన్నప్పటికీ ఇస్లాం స్వీకరించిన తరువాత దాని పట్ల సరయిన అవగాహన పెంపొందించుకోనివారు.
(3) అజ్ఞాన కాలంలో సజ్జనులుగా ఉండినప్పటికీ ఇస్లాం స్వీకరించనూ లేదు, సదవగాహన పెంపొందించుకోనూ లేదు.
(4) అజ్ఞానకాలంలో సజ్జనులుగా ఉండి కూడా ఇస్లాం స్వీకరించనివారు. కాకపోతే విజ్ఞతా వివేచనలు కలవారయి ఉంటారు.

వీరందరిలో మొదటి కోవకు చెందినవారే అత్యంత శ్రేష్ఠులు. ఆ తరువాత అజ్ఞాన కాలంలో సజ్జనులుగా లేకపోయినప్పటికీ ఇస్లాం స్వీకరించి దాని పట్ల సరయిన అవగాహన పెంపొందించుకున్న వారు రెండవ శ్రేణికి చెందిన శ్రేష్ఠులవుతారు. ఆ తరువాత అజ్ఞాన కాలంలో సజ్జనులుగా ఉండినప్పటికీ ఇస్లాం స్వీకరించిన తరువాత దాని పట్ల సరయిన అవగాహన పెంపొందించుకొనని వారు మూడవశ్రేణికి చెందిన వారవుతారు. ఇక నాల్గవ శ్రేణికి చెందినవారు: వారు అజ్ఞాన కాలంలో సజ్జనులుగా లేరు. అయితే ఇస్లాం స్వీకరించారు. మరి ధర్మావగాహనను పెంపొందించుకోలేదు. మిగిలిన వారంతా ఇస్లాం స్వీకరించినవారు. వారి శ్రేష్ఠత, ఉదాత్త గుణాలను గురించి ఎలాంటి నమ్మకం ఉంచలేము.

రెండు ముఖాల వాడు అంటే మానవులంతా సమానమయినప్పటికీ ఒకరి పట్ల ఒక విధంగా, దానికి భిన్నంగా మరొకరి పట్ల మరొక విధంగా ప్రవర్తించేవాడని అర్థం. ఇలాంటి వ్యక్తిని కపటి (మునాఫిఖ్)తో పోల్చవచ్చు. ఇతను ప్రతి వ్యక్తికీ తాను అతని మనిషేనంటూ నమ్మకం కలిగిస్తాడు. నిజానికి అతను ఎవరితోనూ చిత్తశుద్ధిగా స్నేహం చేయడు. స్వార్థప్రియత్వం, స్వప్రయోజనాలే అతని లక్ష్యాలు. (సంకలనకర్త)

మంచివాళ్ళే) వీరు తమ పిల్లలపై అందరికన్నా ఎక్కువగా మమకారం కలిగి ఉంటారు. తమ భర్తల ఆస్తులను కాపాడే వారై ఉంటారు."[1]

హజ్రత్ అబూ హురైరా (రజి) ఈ హదీసు విన్పించిన తరువాత "హజ్రత్ మర్యం బిన్తె ఇమ్రాన్ ఏనాడూ ఒంటె మీద ఎక్కలేదు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 46వ అధ్యాయం - ఖౌలిల్లాహి త ఆలా (ఇజ్ ఖాలతిల్ మలాయికతు యా మర్యం))**

## 50వ అధ్యాయం - ప్రవక్త అనుచరుల మధ్య సహోదరీకరణ

1644. హజ్రత్ ఆసిమ్ అహ్వాల్ (రహ్మాలై) కథనం :- నేను హజ్రత్ అనస్ (రజి)తో మాట్లాడుతూ "అజ్ఞాన కాలం నాటి ప్రతిజ్ఞా ప్రమాణాలు ఇస్లాంలో లేవు[2] అనే దైవప్రవక్త (సల్లం) ప్రవచనం మీ వరకూ చేరిందా?" అని అడిగాను. దానికి హజ్రత్ అనస్ (రజి) సమాధానమిస్తూ "దైవప్రవక్త (సల్లం) స్వయంగా మా ఇంట్లో కూర్చొని సహోదరీకరణ ప్రమాణం చేయించారు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 39వ ప్రకరణం - అల్ కిఫాలా, 2వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (వల్లజీన ఆఖత్ర ఐమానుకుమ్...)**

## 52వ అధ్యాయం - సహాబీలు, తాబయీలు, తబె తాబయీల మహిమోన్నతలు

1645. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు :- భావిలో ఒక కాలం రానున్నది. అప్పుడు జన సమూహాలు ధర్మపోరాటానికి వెళ్ళి "మీలో దైవప్రవక్త (సల్లం) ప్రత్యక్ష అనుచరులు ఎవరైనా ఉన్నారా?" అని ఒకర్నొకరు అడుగుతారు. దానికి ఉన్నారని సమాధానం వస్తుంది. కనుక ఆ అనుచరుల (అంటే సహాబీల) శ్రేయోశుభాలతో యుద్ధంలో విజయం సిద్ధిస్తుంది. ఆ తరువాత మరో కాలం వస్తుంది. అప్పుడు (ప్రజలు) "మీలో ప్రవక్త అనుచరుని (సహాబీ) సహచర్య భాగ్యం పొందిన వ్యక్తి ఎవరైనా ఉన్నారా?" అని అడుగుతారు. దానికి ఉన్నారని సమాధానం వస్తుంది. కనుక అతని శ్రేయోశుభాలతో యుద్ధంలో విజయం ప్రాప్తమవుతుంది. ఆ తరువాత వేరొక కాలం వస్తుంది. అప్పుడు ప్రజలు "మీలో ప్రవక్త సహచరుల

---

1) ఈ హదీసు ద్వారా హజ్రత్ అబూ హురైరా (రజి) ఉద్దేశ్యం ఖురైష్ స్త్రీలు హజ్రత్ మర్యం బిన్తె ఇమ్రాన్ (అలైహి) కంటే గొప్ప అని తెలియజేయడం కాదు. హజ్రత్ మర్యం (అలైహి) ఔన్నత్యం గురించి ఖుర్ఆన్‌లో ముందే ప్రస్తావించబడింది. దానికి తిరుగులేదు. పోతే ఇతర స్త్రీలందరిలో ఖురైష్ మహిళలు గొప్ప అని చెప్పడమే ఆయన ఉద్దేశ్యం. (సంకలన కర్త)

2. ఇమామ్ తబ్రీ (రహ్మాలై) ప్రకారం సాధారణ ప్రతిజ్ఞా ప్రమాణాలు ఎల్లప్పుడూ ధర్మ సమ్మతమే. హదీసులో వారసత్వానికి సంబంధించిన ప్రమాణం ప్రస్తావించబడింది. ఈ ప్రమాణం ఈ సూక్తి అవతరణ తరువాత రద్దయి పోయింది: ("దివ్య ఖుర్ఆన్ ప్రకారం సాధారణ విశ్వాసుల, ముహాజిర్ ముస్లింల కంటే బంధువులు పరస్పరం ఎక్కువ హక్కుదారులు" (33:6). (ఇమామ్ నవవీ -రహ్మాలై).

హసన్ బస్రీ (రహ్మాలై) ప్రకారం ప్రమాణం ద్వారా వారసత్వపు ఆస్తి విభజన పద్ధతి వారసత్వపు ఆస్తి పంపిణీ ఆజ్ఞలు అవతరించిన తరువాత రద్దయిపోయింది. ఇమామ్ నవవీ (రహ్మాలై) అభిప్రాయం ప్రకారం ప్రమాణం ద్వారా వారసత్వపు ఆస్తి విభజన పద్ధతిని వ్యతిరేకించడం మంచిది. అయితే దేవుని పట్ల విధేయత, ధార్మిక సహాయం, దైవభీతి పరాయణతకు సంబంధించిన వ్యవహారాలలో సహకరించే విషయమయి ప్రమాణం చేయడం, చేయించడం రద్దు కాలేదు. అజ్ఞాన కాలం నాటి ప్రతిజ్ఞా ప్రమాణాలను ఇస్లాం మరింత పటిష్టపరుస్తుందని దైవప్రవక్త (సల్లం) అన్నారంటే అవి సత్కార్యాలకు సంబంధించిన ప్రతిజ్ఞా ప్రమాణాల విషయమని అర్థం. ఆయన ఇస్లాంలో ప్రతిజ్ఞా ప్రమాణాలు లేవన్నారంటే వారసత్వపు ఆస్తి పంపిణీ విషయంలో ప్రమాణం చేసే విధానం ఇస్లాంలో లేదని అర్థం. దీన్ని షరీఅత్ నిషేధించింది. (సంకలనకర్త)

అనుచరుల్లో ఎవరి సహచర్య భాగ్యమైనా పొందిన వ్యక్తి ఉన్నారా?" అని అడుగుతారు. దానికి ఉన్నారని సమాధానం వస్తుంది. కనుక అతని శ్రేయోశుభాలతో యుద్ధంలో విజయం లభిస్తుంది.

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 76వ అధ్యాయం - మనిస్తఆన బిజ్జు అఫాయి వస్సాలిహీన ఫిల్ హర్బ్)**

1646. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- నా జీవిత కాలంలో ఉన్నవారు అందరికంటే ఎంతో శ్రేష్ఠులు. ఆ తరువాత నా జీవిత కాలానికి అతి సమీప కాలంలో ఉండేవారు ఎక్కువ శ్రేష్ఠులు. ఆ తరువాత వారి కాలానికి సమీప కాలంలో ఉండేవారు శ్రేష్ఠులు. ఆ తరువాత వచ్చేవారు (పనికి మాలినవారు) వారి సాక్ష్యం వారి ప్రమాణాన్ని, వారి ప్రమాణం వారి సాక్ష్యాన్ని మించిపోతాయి.[1]

**(సహీహ్ బుఖారీ:- 52వ ప్రకరణం - అష్షహాదాత్, 9వ అధ్యాయం - లా యష్హదు అలా షహాదతి జవ్రిన్ ఇజా ఉష్హిద)**

1647. హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు :- "మీలో నా జీవిత కాలంలో ఉన్నవారు అందరికంటే ఎంతో శ్రేష్ఠులు. ఆ తరువాత నా జీవిత కాలానికి సమీప కాలంలో ఉండేవారు (అందరికంటే శ్రేష్ఠులు). ఆ తరువాత వారి సమీపకాలంలో ఉండేవారు". దైవప్రవక్త (సల్లం) తమ జీవిత కాలం తరువాత రెండు కాలాలను ప్రస్తావించారా లేక మూడు కాలాలను ప్రస్తావించారా అనే సంగతి నాకు తెలియదు - దైవప్రవక్త (సల్లం) ఇంకా ఇలా అన్నారు : "మీ తరువాత వచ్చే వాళ్ళు నమ్మకద్రోహులై ఉంటారు. కనుక వారిని నమ్మి ఎలాంటి వస్తువు (లేదా బాధ్యత) వారికి అప్పగించడం జరగదు. వారు తమంతట తామే (ఇతరులు అడగక పోయినా) సాక్ష్యమిస్తారు. ఏదైనా మొక్కుబడి చేసుకుంటే దాన్ని నెరవేర్చరు. వారిలో అత్యధిక మంది బలిసి లావుగా ఉంటారు."[2]

**(సహీహ్‌బుఖారీ:- 52వ ప్రకరణం - అష్షహాదాత్, 9వ అధ్యాయం - లాయష్హదు అలా షహాదతి జవ్రిన్ ఇజా ఉష్హిద)**

## 53వ అధ్యాయం - "ఈ శతాబ్దాంతానికి ఇప్పుడున్న వారెవరూ జీవించి ఉండరు"

1648. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) తమ జీవితపు చివరి రోజుల్లో ఓసారి ఇషా నమాజ్ చేయించి, సలాం చెప్పి ముగించి లేచి నిల్చొని ఇలా అన్నారు :- "మీరంతా ఈ రోజు రాత్రిని చూశారా? గుర్తుంచుకోండి. ఈ రోజు నుండి పూర్తిగా వందేండ్ల తరువాత నేడు నేలపై ఉన్న వారెవరూ జీవించి ఉండరు".

**(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం - ఇల్మ్, 40వ అధ్యాయం - అస్సమరి ఫిల్ ఇల్మ్)**

---

1) ఈ హదీసులో సాక్ష్యం చెబుతూ ప్రమాణం చేసే వారిని ఖండించడం జరిగింది. అంటే వారు సాక్ష్యాన్ని, ప్రమాణాన్ని కలిపివేస్తారన్న మాట. ఒక్కోసారి సాక్ష్యం ముందుగా చెబుతారు, మరోసారి ప్రమాణం ముందుగా చేస్తారు. ఖాజీ బైజావీ (రహ్మలై) ఇలా రాస్తున్నారు: వారు అంటే సాక్ష్యం చెప్పడానికి ఉబలాటపడేవారన్నమాట. సాక్ష్యం చెప్పడంలో వారు చాలా ఆసక్తి కనబరుస్తారు. పైగా సాక్ష్యం చెప్పేటప్పుడు ప్రమాణం కూడా చేస్తారు. వారు సాక్ష్యం చెప్పడానికి, ప్రమాణం చేయడానికి తొందరపడతారని కూడా అర్థం కావచ్చు. (సంకలనకర్త)

2) వారు భోగలాలసులయి విలాసవంతమైన జీవితానికి అలవాటు పడటం వల్ల, మితిమీరిన తిండి తింటూ లావెక్కుతారు. వారిలో దైవభీతి తగ్గిపోతుంది. ఈ హదీసులో పుట్టుకతో లావుగా ఉన్న వారిని, స్థూలకాయుల్ని ఖండించడం జరగలేదు. దైవభీతి లేకుండా నిశ్చింతగా పీకల దాకా మెక్కి లావెక్కిన వారిని మాత్రమే ఖండించడం జరిగింది. (సంకలనకర్త)

## 54వ అధ్యాయం - ప్రవక్త అనుచరుల (రజి)ను నిందించడం నిషిద్ధం

1649. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు:- నా అనుచరులను గురించి చెడుగా మాట్లాడకండి. మీలో ఏ ఒక్కడూ ఉహద్ పర్వతమంత బంగారం ఖర్చుపెట్టినా అది నా అనుచరులు ఒక ముద్ (తులం) ధాన్యం ఖర్చుపెట్టినంత పుణ్యానికి సాటిరాదు.★

**(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హాబిన్నబియ్యి (సల్లం), 5వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) లౌకున్తు ముత్తఖిజన్ ఖలీలా)**

## 59వ అధ్యాయం - ఫార్సీల ఔన్నత్యం

1650. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- మేమొక సారి దైవప్రవక్త (సల్లం) సన్నిధిలో ఉండగా ఆయనపై 'జుమా సూరా' అవతరించింది. అందులో "(ఈ ప్రవక్త దౌత్యం) ఆయన్ని ఇంకా దర్శించని వారిక్కూడా వర్తిస్తుంది" అనే సూక్తి ఉంది (జుమఆ-3). అప్పుడు నేను "దైవప్రవక్తా! వారెవరు?" అని అడిగాను. కాని దైవప్రవక్త (సల్లం) దానికి సమాధానం ఇవ్వలేదు. నేనీ ప్రశ్నను మూడు సార్లు అడిగాను. ఆ సమయంలో హజ్రత్ సల్మాన్ ఫార్సీ (రజి) కూడా మాతో పాటు ఉన్నారు. చివరికి దైవప్రవక్త (సల్లం) హజ్రత్ సల్మాన్ ఫార్సీ (రజి) భుజమ్మీద చెయ్యివేసి "ఒకవేళ విశ్వాసం ధృవ నక్షత్రంలో ఉన్నా సరే వీరి (అంటే సల్మాన్ ఫార్సీ జాతి ప్రజల)లో కొందరు దాన్ని తప్పకుండా సంపాదిస్తారు" అని అన్నారు. లేదా "వీరిలో ఒక వ్యక్తి దాన్ని తప్పకుండా సంపాదిస్తాడు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 62వ సూరా జుమఆ, 1వ అధ్యాయం - ఖౌలిహీ తఆలా వ ఆఖరీన మిన్హుమ్...)**

## 60వ అధ్యాయం - ఒంటెల మాదిరిగా మనుషుల్లో నూటికొకడు మంచివాడుంటాడు

1651. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- మనుషుల్ని ఒక విధంగా ఒంటెలతో పోల్చవచ్చు. వంద ఒంటెలలో మహా అయితే ఒక ఒంటె మాత్రమే స్వారీ చేయడానికి యోగ్యమైనదై ఉంటుంది. (అలాగే మానవుల్లో కూడా మహా అయితే నూటికి ఒక్కడే సంస్కారవంతుడు, యోగ్యుడు, సజ్జనుడు, నీతిమంతుడు, సదాచార సంపన్నుడు అయి ఉంటాడు).

**(సహీహ్‌బుఖారీ:- 81వ ప్రకరణం అర్రిఖాఖ్, 35వ అధ్యాయం - రఫ్యిల్ అమానతి)**

---

★ దైవప్రవక్త (సల్లం) విధేయతలో ఆయన ప్రత్యక్ష అనుచరులు (సహాబీలు) చేసిన త్యాగాలు అసాధారణమైనవి. దేవుని దృష్టిలో వారి స్థానం ఎంతో ఉన్నతమైనది. అదీగాక ప్రపంచంలో ముస్లింల ఉనికికి వారి ఘనకార్యాలు, త్యాగాలే కారణం. అందువల్ల ముస్లింల పుణ్యంలో ప్రళయం దాకా వారికి పుణ్యం లభిస్తూ ఉంటుంది. (సంకలనకర్త)

# సామాజిక మర్యాదల ప్రకరణం

## 1వ అధ్యాయం - తల్లిదండ్రుల సేవే అన్నిటికంటే గొప్ప సేవ

1652. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! నా సత్ప్రవర్తనకు ఎవరెక్కువ హక్కుదారులు?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) "నీ తల్లి" అని చెప్పారు. "ఆ తరువాత ఎవరు?" అంటే "నీ తల్లి" అనే చెప్పారు ఆయన. తిరిగి ఆ వ్యక్తి "ఆ తరువాత ఎవరు?" అని అడిగాడు. "నీ తల్లి" అనే చెప్పారు దైవప్రవక్త (సల్లం). అతను మళ్ళీ అడిగాడు:- "ఆ తరువాత ఎవరెక్కువ హక్కుదారులు?" అని. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "నీ తండ్రి" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 2వ అధ్యాయం - మన్ అహఖ్ఖున్నాసి బిహుస్నిస్సుహుబతి)**

1653. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం:- ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి, జిహాద్ (ధర్మపోరాటం)లో పాల్గొనడానికి తనను అనుమతించమని అర్థించాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "నీ తల్లిదండ్రులు ఉన్నారా?" అని అడిగారు. దానికా వ్యక్తి 'ఉన్నార'న్నాడు. "అయితే వారిద్దరి సేవలోనే పోరాడుతూ ఉండు (అదే నీ పాలిట ధర్మపోరాటం)" అన్నారు దైవప్రవక్త (సల్లం).

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 138వ అధ్యాయం - అల్‌జిహాది బియిజ్నిల్ అబవైన్)**

## 2వ అధ్యాయం - తల్లిదండ్రుల సేవ నఫిల్ ఆరాధనల కన్నా మిన్న

1654. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు:- ఊయలలో (చంటి పిల్లలుగా ఉన్నప్పుడు) ముగ్గురు మాత్రమే మాట్లాడారు. (1) హజ్రత్ ఈసా (అలైహి), (2) బనీ ఇస్రాయీల్‌కు చెందిన జురీహ్ అనే వ్యక్తి నమాజ్ చేస్తుండగా అతని తల్లి వచ్చి పిలిచింది. అతను తన తల్లికి సమాధానం ఇవ్వాలా లేక నమాజును కొనసాగించాలా అని ఆలోచనలో పడిపోయాడు. అతని తల్లి (తన పిలుపుకు సమాధానం ఇవ్వలేదన్న కోపంతో) "దేవా! ఇతను వ్యభిచారిణుల ముఖాలు చూడనంతవరకు ఇతని ప్రాణం తీయకు" అని శపించింది.

ఆ తరువాత జురీహ్ తన ప్రార్థనా మందిరంలో ఉండగా, ఓ రోజు ఒక స్త్రీ వచ్చి అతణ్ణి కవ్విస్తూ తన కోరిక తీర్చమని అడిగింది. అందుకు జురీహ్ నిరాకరించాడు. ఆ తరువాత ఆ స్త్రీ ఒక పశువుల కాపరి దగ్గరికెళ్ళి అతని ద్వారా తన కోరిక తీర్చుకున్నది. అతని వల్ల ఆమెకు ఒక పిల్లవాడు పుట్టాడు. అయితే ఈ పిల్లవాడు జురీహ్ వల్ల తనకు పుట్టాడని ఆమె ప్రచారం చేసింది. ప్రజలు ఈ మాట విని జురీహ్ ఆశ్రమం పై దాడి చేసి దాన్ని ధ్వంసం చేశారు. అతణ్ణి క్రిందికి ఈడ్చి చెడామడా తిట్టి పోశారు. జురీహ్ వుజూ చేసి నమాజ్ చేశారు. తరువాత అతను ఆ పిల్లవాడి దగ్గరకు వెళ్ళి "బాబూ! మీ నాన్న ఎవరూ?" అని అడిగారు. (మాటలు రాని ఆ పిల్లవాడు) "(మా నాన్న) పశువుల కాపరి" అని

సమాధానమిచ్చాడు. ఈ సంఘటనతో ప్రభావితులైన ప్రజలు "మేము నీ ఆశ్రమాన్ని బంగారంతో కట్టిస్తాం" అని అన్నారు. దానికి జురీహ్ "బంగారంతో అవసరం లేదు, మట్టితో కట్టించండి చాలు" అని అన్నాడు.

(3) ఒక స్త్రీ తన చంటి పిల్లోడికి పాలు తాగిస్తోంది. అప్పుడు ఆమె ముందు నుంచి ఒక రౌతు ఖరీదైన దుస్తులు ధరించి వెళ్తున్నాడు. ఆ స్త్రీ అతడ్ని చూసి "దేవా! నా పిల్లవాడ్ని అతనిలా చెయ్యి" అని ప్రార్థించింది. వెంటనే ఆ పిల్లవాడు పాలు తాగడం వదలి పెట్టి రౌతు వైపుకు తిరిగి "దేవా! నన్ను అతనిలా చేయకు" అని అన్నాడు. ఆ తరువాత ఆ పిల్లవాడు యధాప్రకారం తల్లి వైపుకు తిరిగి పాలు త్రాగడం ప్రారంభించాడు.

దైవప్రవక్త (సల్లం) తన నోట్లో వేలు పెట్టుకొని చప్పరిస్తూ చూపిన ఆ దృశ్యం నా మనోవీధిలో ఇప్పటికీ మెదలుతోంది (అని హజ్రత్ అబూ హురైరా - రజి - అన్నారు).

ఆ తరువాత కొందరు వ్యక్తులు ఒక మహిళా బానిసను (కొడ్తూ) ఆ స్త్రీ ముందు నుంచి వెళ్ళారు. అప్పుడా స్త్రీ "దేవా! నా పిల్లవాడ్ని ఆ బానిసలా చేయకు" అని ప్రార్థించింది. ఈ మాట వినగానే ఆ పిల్లవాడు తల్లి స్తనాన్ని వదలి "దేవా! నన్ను ఈమెలా చెయ్యి" అని అన్నాడు. పిల్లవాడి తల్లి (ఆశ్చర్యపోతూ) "నువ్విలా ఎందుకు కావాలనుకుంటున్నావు?" అని అడిగింది. దానికా పిల్లవాడు సమాధానమిస్తూ "ఆ రౌతు పరమ దుర్మార్గుడు. కాని ఈ బానిస మహిళను గురించి ఆమె దొంగతనం చేసిందని, వ్యభిచారానికి పాల్పడిందని లోకులు చెబుతారుగాని, అది నిజం కాదు. ఆమె అలా చేయలేదు" అని అన్నాడు.

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 48వ అధ్యాయం - వజ్కుర్ ఫిల్ కితాబి మర్యం)

## 6వ అధ్యాయం - బంధుప్రేమ పుణ్య కార్యం, బంధు విచ్ఛిత్తి పాప కార్యం

1655. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు:- దేవుడు సమస్త సృష్టి రాసుల్ని సృష్టించాడు. అప్పుడు 'కరుణ' లేచి నిలబడింది. అది కరుణామయుని కాళ్ళు పట్టుకున్నది. దేవుడు "ఏమిటి విషయం" అని అడిగాడు. "నేను బంధు విచ్ఛిత్తి బారి నుండి నీ శరణు కోరుతున్నాను" అన్నది కరుణ. "అయితే బంధువులతో సత్సంబంధాలు పెట్టుకొని, వారి పట్ల కనికరంతో వ్యవహరించేవాని పట్ల నేనూ మంచిగా వ్యవహరిస్తూ అతడ్ని కనికరిస్తాను. బంధువులతో సంబంధాలు త్రెంచుకునేవాడ్ని నేను కనికరించను. మరి ఈ విషయం నీకు సంతోషం కలిగించదా?" అన్నాడు దేవుడు. "ఎందుకు కలిగించదు నా ప్రభూ!" అన్నది కరుణ. "అయితే ఈ హక్కు నీకు లభించింది (తీసుకో)" అన్నాడు దేవుడు.

ఈ విషయం గురించి మీకు ప్రమాణం కావాలంటే (ఖుర్ఆన్‌లోని) ఈ సూక్తి చదువుకోండి- "ఒకవేళ మీరు విముఖులయిపోతే, మీరు ప్రపంచంలో అరాచకం, అలజడులు రేపటం, పరస్పరం

బంధుత్వాన్ని త్రెంచి వేసుకోవటం తప్ప మీ నుండి మరేం ఆశించబడుతుంది?" (ముహమ్మద్ (సల్లం) : 22)

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 47వ సూరా - ముహమ్మద్ (సల్లం) 1వ అధ్యాయం - వత ఖత్తవూ అర్హామకుం)

1656. హజ్రత్ జుబైర్ బిన్ ముత్యిమ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు:- బంధుత్వాన్ని త్రెంచి వేసేవాడు స్వర్గంలో ప్రవేశించలేడు.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 11వ అధ్యాయం - ఇస్మిల్ ఖాతి)

1657. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- తన ఉపాధి (తదితర వస్తువుల)లో వృద్ధి కలగాలని, తన ఆయుష్షు పెరగాలని ఎవరైనా కోరుకుంటే అతను తన బంధువులతో సత్సంబంధాలు కలిగి ఉండాలి (వారి పట్ల మంచిగా వ్యవహరించాలి).

(సహీహ్ బుఖారీ:- 34వ ప్రకరణం - బుయూ, 13వ అధ్యాయం - మన్అహబ్బల్ బస్త ఫిర్రిజ్ఖ్)

## 7వ అధ్యాయం - అసూయ, ద్వేషం, మాట్లాడటం మానెయ్యడం నిషిద్ధం

1658. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- మీరు పరస్పరం ద్వేషించుకోకండి. ఎవరి మీదా అసూయ చెందకండి. ఒకర్నొకరు మాట్లాడుకోవడం మానెయ్యకండి. మీరంతా దేవుని దాసులుగా పరస్పరం అన్నదమ్ములుగా జీవితం గడపండి. మూడు రోజులకు మించి తన తోటి సోదరునితో, సంబంధాలు త్రెంచి ఉండటం లేదా పరస్పరం మాట్లాడుకోకుండా ఉండటం ఏ ముస్లింకూ ధర్మ సమ్మతం కాదు.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 58వ అధ్యాయం - మాయున్హా అనిత్తహాసుదివత్తదాబుర్)

## 8వ అధ్యాయం - మూడు రోజులకు మించి మాటల్లేకుండా ఉండటం నిషిద్ధం

1659. హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- మూడు రాత్రులకు మించి తన (ముస్లిం) సోదరునితో సంబంధాలు త్రెంచి ఉంచడం ఏ వ్యక్తికీ ధర్మసమ్మతం కాదు. అంటే ఒకరికొకరు ఎదురయినప్పుడు ఒకడు ఒకవైపు మరొకడు మరో వైపు ముఖం తిప్పుకొని పోవడం - వారిద్దరిలో ముందుగా ఎవరు సలాం చేస్తాడో అతనే ఉత్తముడు.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 62వ అధ్యాయం - అల్హిజ్రతి వఖౌలిన్నబియ్యి (సల్లం)లా యహిల్లు లి రజులిన్ అఁ య్యహ్జుర అఖాహు ఫౌఖ సలాస్)

## 9వ అధ్యాయం - దురనుమానం, కూపీలు, అసూయ, మోసం - నిషిద్ధం

1660. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఉద్బోధించారు:- లేనిపోని అనుమానాలకు పోకండి. లేనిపోని అనుమానం అన్నింటికంటే పెద్ద అబద్ధం. దాక్కొని ఇతరుల మాటలు వినకండి. కూపీలు తీయకండి. (కొనుగోలుదారుని) మోసగించే ఉద్దేశ్యంతో (కొనే వస్తువు) ధరను పెంచకండి. ఒకరిపై మరొకరు అసూయ పడకండి. పరస్పరం ద్వేషించుకోకండి.

పరస్పరం మాట్లాడుకోవడం మానెయ్యకండి. మీరంతా దేవుని దాసులు, పరస్పరం అన్నదమ్ముల్లాంటివారు.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 58వ అధ్యాయం - యా అయ్యుహల్లజీన ఆమనూ ఇజ్తనిబూ కసీరమ్మినజ్జన్)

## 14వ అధ్యాయం - విశ్వాసికి ఏమాత్రం కష్టమొచ్చినా, చివరికి ముల్లు గుచ్చుకున్నా దాని పుణ్యం లభిస్తుంది

1661. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) గురయినంత తీవ్రమైన వ్యాధికి మరెవరూ గురయినట్లు నేను చూడలేదు.

(సహీహ్ బుఖారీ:- 75వ ప్రకరణం - మర్జా, 2వ అధ్యాయం - షిద్దతిల్ మర్జ్)

1662. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం :- నేను ఓ రోజు దైవప్రవక్త (సల్లం) దగ్గరికెళ్తే ఆయన జ్వరంతో బాధపడుతున్నారు. నేను "దైవప్రవక్తా! మీకు జ్వరం తీవ్రంగానే ఉన్నట్లుంది" అని అన్నాను. "ఔను. నాకు జ్వరం వస్తే అది మీలో ఇద్దరు వ్యక్తులకు వచ్చే జ్వరమంత ఉంటుంది" అన్నారు దైవప్రవక్త (సల్లం). "పుణ్య ఫలం కూడా మీకు రెట్టింపు లభిస్తుంది కదా!" అన్నాను నేను. "నిజమే. ముస్లింకు ఎలాంటి బాధ కలిగినా, చివరికి ఒక ముల్లు గుచ్చుకున్నా లేదా అంతకంటే ఎక్కువ బాధ కలిగినా సరే దాని ద్వారా దేవుడు అతని పాపాలను క్షమిస్తాడు. చెట్టు నుండి (పండుటా) ఆకులు రాలిపోయినట్లు అతని నుండి అతని పాపాలు రాలిపోతాయి" అన్నారు దైవప్రవక్త (సల్లం).

(సహీహ్ బుఖారీ:- 75వ ప్రకరణం - మర్జా, 3వ అధ్యాయం - అషద్దున్నాసి బలాఅన్ అల్ అంబియా సుమ్మల్ అవ్వల్‌ఫల్‌అవ్వల్)

1663. హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు :- ముస్లింకు ఎలాంటి కష్టం వచ్చినా, చివరికి ముల్లు గుచ్చుకున్నా సరే, ఆ కష్టాన్ని దేవుడు అతని పాప పరిహారంగా చేస్తాడు.

(సహీహ్ బుఖారీ:- 75వ ప్రకరణం - మర్జా, 1వ అధ్యాయం - మాజాఅ ఫీకఫ్ఫారతిల్ మర్జ్)

1664. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ, అబూ హురైరా (రజి)ల కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- ముస్లింకు ఏ విధమైన ఆపద వచ్చినా, బాధ కలిగినా, ఆందోళన కలిగినా, దుఃఖం కలిగినా, చివరికి అతనికి ముల్లు గుచ్చుకున్నా సరే దాన్ని దేవుడు అతనికై పాప పరిహారంగా చేస్తాడు.

(సహీహ్ బుఖారీ:- 75వ ప్రకరణం - మర్జా, 1వ అధ్యాయం - మాజాఅ ఫీ కఫ్ఫారతిల్ మర్జ్)

1665. హజ్రత్ అతా బిన్ అబీ రబాహ్ (రహ్మలై) కథనం :- హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) మాతో "నేను నీకు స్వర్గ మహిళను చూపనా?" అని అన్నారు. నేను "తప్పకుండా చూపండి" అన్నాను. దానికి ఆయన ఇలా చెప్పారు - ఒక నల్ల మహిళ దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి "నాకు మూర్ఛ వస్తూ

ఉంటుంది. అప్పుడు నా ఒంటి మీది బట్టలు కూడా తొలగిపోతుంటాయి. అందుచేత నా కోసం దైవాన్ని ప్రార్థించండి" అని మనవి చేసుకున్నది. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "నీవు తలిస్తే (ఈ బాధపట్ల) సహనం వహించవచ్చు. ఆ సహనానికి బదులుగా నీకు స్వర్గం లభిస్తుంది. ఇక నీవు కోరినట్లయితే నేను నీ కోసం దైవాన్ని ప్రార్థిస్తాను నీ బాధ దూరం కావాలని" అని అన్నారు. దానికామె 'సరే నేను సహనం వహిస్తాను' అని అన్నది. ఆ తరువాత కాస్సేపటికి "కాని నా ఒంటి మీది బట్టలు తొలగిపోతున్నాయి. ఇవి తొలగిపోకుండా ఉండేందుకు (అయినా) దైవాన్ని ప్రార్థించండి" అని అన్నది ఆమె. దైవప్రవక్త (సల్లం) ఆ ప్రకారం ఆమె కోసం ప్రార్థన చేశారు"[1].

**(సహీహ్ బుఖారీ:- 75వ ప్రకరణం - మర్జా, 6వ అధ్యాయం - ఫజ్లిమన్ య్యుస్రి మినర్రీహ్)**

## 15వ అధ్యాయం - దౌర్జన్యం నిషిద్ధం

1666. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు:- ప్రళయ దినాన దౌర్జన్యం (దౌర్జన్య పరుడి పాలిట) అంధకారంగా పరిణమిస్తుంది.[2]

**(సహీహ్ బుఖారీ:- 46వ ప్రకరణం - మజాలిమ్, 8వ అధ్యాయం - అజ్జుల్ముజులుమాతున్ యౌమల్ ఖియామా)**

1667. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఉద్బోధించారు:- ఒక ముస్లిం తోటి ముస్లింకు సోదరుడు (లాంటి వాడు). ఒక సోదరుడు తన సోదరునిపై (ఎన్నటికీ) దౌర్జన్యం చేయడు, అతడ్ని దౌర్జన్యపరునికి అప్పగించడు కూడా. ఎవరు తన సోదరుడి అవసరాలను తీర్చే పనుల్లో నిమగ్నుడవుతాడో దేవుడు అతని అవసరాలను తీర్చే బాధ్యత తీసుకుంటాడు. ఎవరు (తోటి) ముస్లింకు వచ్చిన కష్టాల్లో ఒక కష్టాన్ని దూరం చేస్తాడో ప్రళయదినాన దేవుడు అతనికి ఎదురయ్యే కష్టాలలో ఒక కష్టాన్ని దూరం చేస్తాడు. మరెవరు (తోటి) ముస్లిం (పాపాలు) పొరపాట్లను కప్పిపుచ్చుతాడో ప్రళయదినాన దేవుడు అతని పొరపాట్లను (పాపాలను) కప్పిపుచ్చుతాడు.

**(సహీహ్ బుఖారీ:- 46వ ప్రకరణం - మజాలిమ్, 3వ అధ్యాయం - లాయజ్లిముల్ ముస్లిముల్ ముస్లిం వలా యుస్లిముహు)**

1668. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) మాట్లాడుతూ, "దేవుడు దౌర్జన్యపరుడ్ని (హద్దు మీరే దాకా) విడుపు ఇస్తాడు. చివరికి దేవుడు అతడ్ని పట్టుకుంటే ఇక అతడ్ని (శిక్షించకుండా) వదలి పెట్టడు" అని అన్నారు.

దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించిన తరువాత (ఖుర్ఆన్‌లోని) ఈ సూక్తి పఠించారు:- "నీ ప్రభువు ఏదైనా పట్టణాన్ని పట్టుకోవడం జరిగితే (ఇక దానికి సర్వనాశనం మూడినట్లే). ఆయన పట్టు చాలా కఠినంగా, ఎంతో బాధాకరంగా ఉంటుంది." (హూద్ : 102)

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం -తఫ్సీర్, హూద్ సూరా, 5వ అధ్యాయం - వకజాలిక అఖ్జు రబ్బిక ఇజా అఖజల్ ఖురా)**

---

1. మరికొన్ని ఉల్లేఖనాల ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఆమె కోసం ప్రార్థన (దుఆ) చేశారు. అప్పటి నుండి ఆమె ఒంటి మీది బట్టలు మరెన్నడూ తొలగలేదు. (అనువాదకుడు)

2. అంటే దౌర్జన్యపరుడికి దేవుని జ్యోతి లభించదు. దౌర్జన్యమనే అంధకారం అతనిపై ఆవరిస్తుంది. దైవభీతి పరాయణులకు మాత్రం వారి జ్యోతి వారికి మార్గం చూపుతుంది. (అనువాదకుడు)

## 16వ అధ్యాయం - దౌర్జన్యపరుడైనా, పీడితుడైనా సరే మీ సోదరునికి సహాయపడండి

1669. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం :- మేమొక యుద్ధంలో పాల్గొన్నాం. ఆ సందర్భంలో ఒక ముహాజిర్ ముస్లిం ఒక అన్సార్ ముస్లింని పిరుదుపై తన్నాడు (కొట్టాడు). వెంటనే ఆ అన్సారీ "అన్సారులారా! రండి, ఆదుకోండి" అని కేకలేశాడు. ముహాజిర్ ముస్లిం కూడా "ముహాజిర్‌లారా! రండి, ఆదుకోండి" అని పిలిచాడు. దైవప్రవక్త (సల్లం) ఈ గలాటా విని "ఏమిటిది, అనాగరిక నినాదం?" అన్నారు. "దైవప్రవక్తా! ముహాజిర్ మనిషి ఒకతను అన్సార్ మనిషిని పిరుదుపై తన్నాడు (కొట్టాడు)" అని చెప్పారు అనుచరులు. "ఇలాంటి కేకను విడనాడండి. ఇది అత్యంత నీచమైనది, దుర్గంధభూయిష్టమైనది" అన్నారు దైవప్రవక్త (సల్లం).

ఈ సంఘటన (కపటుల నాయకుడు) అబ్దుల్లా బిన్ ఉబైకి తెలియగానే "ఏమిటీ, అంత వరకు వచ్చిందా వీరి వ్యవహారం! సరే మదీనా చేరుకున్నాక చూద్దాం. మదీనా వెళ్ళిన తరువాత గౌరవనీయులు నీచుల్ని నగరం నుండి తీసివేస్తారు. (అంటే మనమే అసలు మదీనా వాసులం, గౌరవనీయులం. బయట నుంచి వచ్చి ఇక్కడ మన పక్కలో చేరిన ఈ నీచుల్ని తరిమేద్దాం)" అని అన్నాడతను.

అతను చెప్పిన ఈ మాట దైవప్రవక్త (సల్లం)కు తెలియగానే హజ్రత్ ఉమర్ (రజి) లేచి "దైవప్రవక్తా! నాకు అనుమతివ్వండి. ఈ కపటాగ్రేసరుడ్ని (ఒక దెబ్బతో) కడతేరుస్తాను" అని అన్నారు. కాని దైవప్రవక్త (సల్లం) (ఆయన్ని శాంతపరుస్తూ) "అతని మానాన అతడ్ని వదిలెయ్యి. (అతడ్ని చంపితే) ముహమ్మద్ (సల్లం) తన అనుయాయుల్నే చంపివేస్తున్నాడని జనం అనుకుంటారు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 63వ సూరా - మునాఫిఖూన్, 5వ అధ్యాయం - ఖౌలిహీ (సవాఉన్ అలైహిమ్ అస్తగ్‌ఫర్తలహుమ్ అమ్‌లమ్ తస్తగ్ఫిర్ లహుమ్))

## 17వ అధ్యాయం - ముస్లింలు పరస్పరం దయామయులు, సహాయకారులు

1670. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) (మాకు హితోపదేశం చేస్తూ) "ఒక కట్టడంలోని ఇటుకలు ఒకదానికొకటి ఊతమిస్తూ ఆ కట్టడం పటిష్ఠతకు కారణభూతమైనట్లే విశ్వాసులు (ముస్లింలు) కూడా (ఒకరికొకరు సహాయం చేసుకుంటూ సమాజ సమైక్యతకు దోహదపడతారు)" అని అన్నారు.

దైవప్రవక్త (సల్లం) ఈ విషయాన్ని ప్రవచిస్తూ, తమ చేతుల వ్రేళ్ళను ఒక దానిలో మరొకటి జొప్పించి (ముస్లింలు కూడా ఇలా కలసిమెలసి ఐకమత్యంతో ఉంటారని) చూపించారు.

(సహీహ్ బుఖారీ:- 8వ ప్రకరణం - సలాత్, 88వ అధ్యాయం - తష్బీకిల్ అసాబియి ఫిల్ మస్జిదీ వగైరిహీ)

1671. హజ్రత్ నూమాన్ బిన్ బషీర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- విశ్వాసులు (ముస్లింలు) పరస్పరం కనికరించుకోవడంలో, అభిమానించుకోవడంలో, మైత్రీ భావంతో

మసలుకోవడంలో ఒక దేహం లాంటి వారు. దేహంలో ఒక అవయవానికి నొప్పి కలిగితే మొత్తం దేహం ఆ బాధను పంచుకొని బాధతో, ఆందోళనతో మూలుగుతుంది.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 27వ అధ్యాయం - రహ్మాతిన్నాసి వల్ బహాయిమ్)

## 22వ అధ్యాయం - దుర్భాష, తిట్లకు పాల్పడే వారి పట్ల మృదువైఖరి

1672. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- ఒక వ్యక్తి లోపలికి రావడానికి దైవప్రవక్త (సల్లం)ను అనుమతి అడిగాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "అతడ్ని లోపలికి రావడానికి అనుమతించు. అతను తన వంశంలోని అతి చెడ్డవాడు" అని అన్నారు. ఆ వ్యక్తి లోపలికి వచ్చిన తరువాత దైవప్రవక్త (సల్లం) అతనితో ఎంతో మృదువుగా (మధురంగా) మాట్లాడారు. తరువాత నేను దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ "దైవప్రవక్తా! మీరా వ్యక్తిని గురించి మొదట అలా అన్నారు. కాని ఆ తరువాత మీరతనితో చాలా మృదువుగా సంభాషించారు (ఎందువల్ల)?" అని అడిగాను. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "ఆయిషా! ఎవరి నోటి దురుసు కారణంగా ప్రజలు తనకు దూరమైపోతారో అతను పరమ దుర్మార్గుడు" అని అన్నారు.*

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 48వ అధ్యాయం - మాయజూజు మినన్నిర్రియాబి అహ్లిల్ ఫసాద్)

## 25వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) పొరపాటున ఎవరినైనా శపిస్తే అది అతనికై పాపపరిహారమవుతుంది

1673. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- "దేవా! నేనెప్పుడైనా ఏ విశ్వాసి పట్లయినా కఠినంగా ప్రవర్తిస్తే దాన్ని ప్రళయ దినాన అతని కోసం నీ సాన్నిధ్య సాధనంగా చెయ్యి."

(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 34వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) మన్ ఆజైతు హూఫజ్ అల్‌హు లహూ జకాత (వ్వరహ్మతన్)

## 27వ అధ్యాయం - అబద్ధమాడటం నిషిద్ధం

1674. హజ్రత్ ఉమ్మె కుల్సుమ్ బిన్తె ఉఖ్బా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- ప్రజల మధ్య రాజీ కుదుర్చే ఉద్దేశ్యంతో ఒకరి సద్గుణాలు మరొకరి ముందు వ్యక్తపరిచేవాడు లేదా

---

★ ఈ వ్యక్తి పేరు యమీనా బిన్ హసన్. ఇతను తనను తాను ముస్లిం అని చెప్పుకున్నప్పటికీ అతను నిజానికి ముస్లిం కాడు. ముస్లింలు మోసపోకుండా ఉండేందుకు దైవప్రవక్త (సల్లం) అతని నిజ స్వరూపాన్ని బట్టబయలు చేశారు. ఈ మాటను నిజం చేస్తూ ఆ దుర్మార్గుడు దైవప్రవక్త (సల్లం) నిర్యాణం తరువాత మతభ్రష్టుడయిపోయాడు. తరువాత అతను యుద్ధ ఖైదీగా పట్టుబడి ఖలీఫా హజ్రత్ అబూబకర్ (రజి) దగ్గరికి తీసుకు రాబడినప్పుడు హజ్రత్ అబూబకర్ (రజి) కూడా అతని పట్ల మృదువుగా ప్రవర్తించారు. ఈ హదీసుని బట్టి ఒక వ్యక్తి కీడు తలపెట్టే ప్రమాదం ఉన్నప్పుడు పైకి అతని పట్ల స్నేహభావంతో మసలు కోవడంలో ఎలాంటి తప్పు లేదని; దుర్మార్గపు పనులు చేసేవాడి దుర్మార్గం గురించి పరోక్షంగా ప్రజలకు తెలియజేయడం ధర్మ సమ్మతమేనని తెలుస్తోంది. హదీసులో దైవప్రవక్త (సల్లం) ఆ వ్యక్తిని పొగిడారని లేదు; అతని పట్ల మృదువుగా ప్రవర్తించారని మాత్రమే ఉంది. అదే ఇలాంటి దుర్మార్గుల పట్ల అనుసరించవలసిన విధానం. (ఇమామ్ నవవీ -రహ్మలై)

ఒకర్ని గురించి ఏదైనా మంచి విషయాన్ని మరొకరి ముందు వెలిబుచ్చేవాడు అబద్ధాలకోరు కాజాలడు.

(సహీహ్ బుఖారీ:- 53వ ప్రకరణం - సుల్హ్, 2వ అధ్యాయం - లైసల్ కజ్జాబిల్లజీ యుస్లిహు బైనన్నాస్)

## 29వ అధ్యాయం - అబద్ధం చెడ్డ విషయం, సత్యం మంచి విషయం

1675. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు:- నిజం మనిషిని పుణ్యకార్యాల వైపుకు తీసికెళ్తుంది. పుణ్యకార్యాలు (అతడ్ని) స్వర్గానికి గొనిపోతాయి. ఎవరైనా ఎల్లప్పుడు నిజం చెబుతుంటే అది అతడ్ని ఎప్పుడో ఓ రోజు సిద్దీఖ్ (సత్యశీలుడి)గా మార్చివేస్తుంది. అబద్ధం మనిషిని పాపకార్యాల వైపుకు తీసికెళ్తుంది. పాపకార్యాలు అతడ్ని నరకానికి చేర్చుతాయి. ఎవరైనా (ఎల్లప్పుడూ) అబద్ధమాడుతుంటే దానివల్ల అతడు ఎప్పుడో ఓ రోజు దేవుని దగ్గర అబద్ధాలరాయుడిగా వ్రాయబడతాడు.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 69వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (యాఅయ్యుహల్లజీన ఆమనుత్తఖుల్లాహ వకూనూ మఅస్సాదిఖీన్)

## 30వ అధ్యాయం - కోపాన్ని దిగమింగేవాడు, దిగమింగేందుకు ప్రయత్నించేవాడు

1676. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- ఇతరుల్ని చిత్తుచేసేవాడు పరాక్రమశాలికాదు. కోపాన్ని దిగమింగేవాడే నిజమైన పరాక్రమశాలి.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 76వ అధ్యాయం - అల్‌హజ్రి మినల్ గజబ్)

1677. హజ్రత్ సులైమాన్ బిన్ సుర్ద్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) (ఇంటి) సమీపంలో ఇద్దరు వ్యక్తులు పోట్లాడుకోసాగారు. ఆ సమయంలో నేను కూడా దైవప్రవక్త (సల్లం) దగ్గర కూర్చొని ఉన్నాను. ఆ యిద్దరు వ్యక్తుల్లో ఒకతను కోపంతో రెండవ వ్యక్తిని దూషించడం మొదలెట్టాడు. కోపంతో అతని ముఖం జేవురించింది. దైవప్రవక్త (సల్లం) అతని వైఖరి చూసి "నాకో మాట తెలుసు. ఈ మాటను గనక ఆ వ్యక్తి పలికితే అతని కోపం పటాపంచలయిపోతుంది. ఆ మాట - అవూజు బిల్లాహి మినష్షైతానిర్రజీమ్" అని అన్నారు. ప్రజలు ఈ మాట విని ఆ వ్యక్తితో "నీవు దైవప్రవక్త (సల్లం) ప్రవచనాన్ని వినలేదా?" అని అన్నారు. దానికా వ్యక్తి "నేను పిచ్చివాడ్ని కాను" అన్నాడు.*

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 76వ అధ్యాయం - అల్‌హజ్రి మినల్ గజబ్)

## 32వ అధ్యాయం - ముఖం మీద కొట్టకూడదు

1678. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- మీలో

---

★ దేవుని విషయంలో తప్ప మరేదయినా విషయంలో కోపం వస్తే అది షైతాన్ ప్రేరణ వల్ల వచ్చిందని గ్రహించాలి. అప్పుడు "అవూజు బిల్లాహి మినష్షైతాన్" అని పఠించాలి. దాంతో షైతాన్ పారిపోతాడు; కోపం కూడా తగ్గిపోతుంది. ఈ వ్యక్తి 'నేను పిచ్చివాడ్ని కాను' అన్నాడంటే అది అతని అజ్ఞానాన్ని బహిర్గతం చేస్తోందని గ్రహించాలి. ఉన్మాదం ఆవహించినప్పుడు మాత్రమే అవూజు బిల్లాహి పఠిస్తారని అతను భావించాడు. కాని కోపం కూడా ఒక విధమైన ఉన్మాదమని అతను గ్రహించలేదు. కోపం వచ్చినప్పుడు మనిషి సమతౌల్యాన్ని కోల్పోతాడు. (సంకలనకర్త)

ఎవరైనా ఎవరితోనైనా జగడానికి దిగితే అతను (తన ప్రత్యర్థి) ముఖం మీద కొట్టకూడదు.*

(సహీహ్ బుఖారీ:- 49వ ప్రకరణం - ఇత్ఖ్, 20వ అధ్యాయం - ఇజా జరబల్ అబ్ద ఫల్‌యజ్తనిబిల్ వజ్‌హ)

## 34వ అధ్యాయం - బహిరంగ స్థలాలకు ఆయుధాలు తీసికెళ్తే జాగ్రత్త వహించాలి

1679. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం :- ఒక వ్యక్తి బాణాలు తీసుకొని మస్జిద్ గుండా వెళ్తుంటే దైవప్రవక్త (సల్లం) అతనితో "వాటి మొనలను (జనానికి తగలకుండా) జాగ్రత్తగా పట్టుకో" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 8వ ప్రకరణం - సలాత్, 66వ అధ్యాయం - యాఖుజు బినుసూలిన్ నబ్లి ఇజామర్రఫిల్ మస్జిద్)

1680. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు:- ఎవరైనా మస్జిద్ గుండా లేదా బజారులో బాణాలు తీసుకొని నడుస్తుంటే అతనా బాణాల మొనలను గట్టిగా పట్టుకొని జాగ్రత్తగా తీసికెళ్ళాలి.

(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్, 7వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) మన్ హమల అలైనస్సలాహ ఫలైస మిన్నా)

## 35వ అధ్యాయం - తోటి ముస్లింకు ఆయుధం చూపి భయపెట్టకూడదు

1681. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు :- ఏ ముస్లిం కూడా తన తోటి ముస్లిం సోదరునికి ఆయుధం చూపి గదమాయించకూడదు. ఈ (పైశాచిక) చర్య వల్ల షైతాన్ (ఆయుధమున్న) అతని చేతిని చలింపజేయవచ్చు. (తత్ఫలితంగా పీడితుడు చావడమో, గాయపడటమో జరిగి దౌర్జన్యపరుడు నరకంలో పడిపోతాడు).

(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్ , 7వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) మన్ హమల అలైనస్సలాహ ఫలైసమిన్నా)

## 36వ అధ్యాయం - దారిలోని ప్రమాదకర వస్తువుని తొలగించి వేయడం పుణ్యకార్యం

1682. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- ఒక వ్యక్తి దారిన నడచిపోతుంటే దారిలో ఒక ముళ్ళ కంప పడి ఉండటం చూశాడు. అతను దాన్ని తీసి పక్కన పారేసి వెళ్ళిపోయాడు. అతను చేసిన ఈ పుణ్యకార్యాన్ని దేవుడు స్వీకరించి అతడ్ని మన్నించాడు.

(సహీహ్ బుఖారీ:- 10వ ప్రకరణం - అజాన్, 32వ అధ్యాయం - ఫజ్లిత్తహ్‌జీరి ఇలజ్జుహ్ర్)

## 37వ అధ్యాయం - ప్రమాదకారి కాని జంతువుల్ని హింసించడం నిషిద్ధం

1683. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు:- ఒక స్త్రీ పిల్లి మూలంగా దైవశిక్షకు గురయిపోయింది. ఆ స్త్రీ పిల్లి చనిపోయేవరకూ దాన్ని కట్టి పడేసింది.

★ ఈ హదీసుని బట్టి ముఖం మీద కొట్టకూడదని తెలుస్తోంది. ముఖం మీద కొడితే ఒక్కోసారి ముఖం వికృతంగా మారే ప్రమాదం ఉంది. దాని వల్ల నరాలు కూడా దెబ్బతినవచ్చు. (సంకలన కర్త)

ఆమె ఆ పిల్లిని కట్టివేసి దానికి ఎలాంటి ఆహార పానీయాలు పెట్టనూలేదు. క్రిమికీటకాలు తినేందుక్కూడా దాన్ని స్వేచ్ఛగా వదలిపెట్టనూ లేదు. ఈ పాపం కారణంగానే ఆమె నరకానికి పోయింది.

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 54వ అధ్యాయం - హద్దసనా అబుల్ యమాన్)

## 42వ అధ్యాయం - పొరుగువారి పట్ల మంచిగా మెలుగుతూ, వారి హక్కులను గౌరవించాలి

1684. హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- జిబ్రయీల్ (అలైహి) పొరుగువాని గురించి నన్ను మాటిమాటికి తాకీదు చేసేవారు. ఈ తాకీదు తీరును గమనిస్తుంటే, అతనికి (నా) ఆస్తిలో వాటా కూడా ఇప్పిస్తారేమోనని నాకు అనుమానం కలిగింది.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 28వ అధ్యాయం - అల్ వసాతి బిల్‌జార్)

1685. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు:- జిబ్రయీల్ (అలైహి) పొరుగువాని గురించి నన్ను మాటిమాటికి తాకీదు చేసేవారు. ఆ తాకీదు తీరును గమనిస్తుంటే త్వరలోనే ఆయన నా ఆస్తి నుండి పొరుగు వానికి వాటా కూడా ఇప్పిస్తారేమోనన్న తలంపు నాకు కలిగింది.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 28వ అధ్యాయం - అల్ వసాతి బిల్ జార్)

## 44వ అధ్యాయం - ధర్మసమ్మతమైన పని కోసం సిఫారసు చేయడం అభిలషణీయం

1686. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) తన దగ్గరకి ఎవరైనా సహాయార్థం లేక అవసరార్థం వచ్చినప్పుడు, (అనుచరులతో) "ఇతని కొరకు సిఫారసు చేయండి. మీకు పుణ్యం లభిస్తుంది. దేవుడు తాను తలచిన నిర్ణయాన్ని తన ప్రవక్త నోట వెలువరిస్తాడు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 24వ ప్రకరణం - జకాత్, 21వ అధ్యాయం - అత్తహ్‌రీజి అలస్సదఖతి నష్షఫాఅతి ఫీహా)

## 45వ అధ్యాయం - సజ్జనులతో సహవాసం చేయడం, దుర్జనులకు దూరంగా ఉండటం

1687. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- మంచి మిత్రుడ్ని- చెడ్డ స్నేహితుడ్ని, కస్తూరి అమ్మే వాడితో - కొలిమి ఊదే వాడితో పోల్చవచ్చు. కస్తూరీ అమ్మేవాడు నీకు కస్తూరీని కానుకగానయినా ఇస్తాడు లేదా నీవతని దగ్గర దాన్ని కొననయినా కొంటావు. లేదా కనీసం అతని దగ్గర్నుంచి నీకు సువాసనయినా వస్తుంది. కాని కొలిమి ఊదేవాడు (నిప్పు రవ్వలు ఎగరేసి) నీ బట్టలను కాలుస్తాడు లేదా అతని దగ్గర్నుంచి నీకు దుర్వాసనయినా వస్తుంది (నీ స్నేహితుల సంగతి కూడా అంతే).

(సహీహ్ బుఖారీ:- 72వ ప్రకరణం - అజ్జిబాయి వస్సైద్, 31వ అధ్యాయం - అల్‌మిస్క్)

## 46వ అధ్యాయం - కుమార్తెల పట్ల సద్వర్తనం

1688. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- నా దగ్గరికి ఒక స్త్రీ ఇద్దరు కూతుళ్ళను వెంట బెట్టుకొని వచ్చి ఏదైనా సహాయం చేయమని అడిగింది. ఆ సమయంలో నా దగ్గర ఆమెకివ్వడానికి ఒక ఖర్జూర పండు తప్ప మరేమీ లేదు. ఆ ఖర్జూరాన్నే ఆమెకిచ్చాను. ఆమె దాన్ని రెండు ముక్కలు చేసి తన కూతుళ్ళకు ఇచ్చి వేసింది. తాను మాత్రం తినలేదు. ఆ తరువాత ఆమె లేచి వెళ్ళిపోయింది. దైవప్రవక్త (సల్లం) వచ్చిన తరువాత నేనీ సంగతి ఆయనకు తెలియజేశాను. దానిపై ఆయన వ్యాఖ్యానిస్తూ "ఎవరైనా కష్టాలకు గురయితే సాధారణంగా ఆ కూతుళ్ల మూలంగానే వారికి ఆ కష్టాలు వచ్చిపడ్డాయని అనుకోవటం పరిపాటి. కాని ఆ కుమార్తెలే ప్రళయదినాన అతని పాలిట నరకాగ్నికి అడ్డు తెరగా మారుతారు.[1]

**(సహీహ్ బుఖారీ:- 24వ ప్రకరణం - జకాత్, 10వ అధ్యాయం - ఇత్తఖున్నార వ లౌబిషిఖ్ఖి తమ్రహ్)**

## 47వ అధ్యాయం - కొడుకు మృతి పట్ల సహనం వహించిన వాడికి పుణ్యం

1689. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు :- ముగ్గురు కొడుకులు కోల్పోయిన (అంటే ముగ్గురు కొడుకులు చనిపోయినప్పుడు సహనం వహించిన) ముస్లిం నరకానికి పోడు. ప్రమాణం నెరవెర్చడానికి తప్ప.[2]

**(సహీహ్ బుఖారీ:- 23వ ప్రకరణం - జనాయిజ్, 6వ అధ్యాయం - ఫజ్లి మమ్మా తలహూ వలదున్ ఫహ్తసబహూ)**

1690. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం :- ఒక స్త్రీ దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! మీ ప్రవచనాలన్నిటిని పురుషులే కైవసం (కంఠస్థం) చేసుకుంటున్నారు. అందుకని మా కోసం కూడా ఒక దినం నిర్ణయిస్తే ఆ రోజు మేము (స్త్రీలం) మీ సన్నిధికి వస్తాము. దేవుడు మీకు నేర్పిన విషయాలు మీరు మాకు బోధించవచ్చు" అని అన్నది. "అయితే మీరంతా (స్త్రీలు) ఫలానా రోజు ఫలానా ఇంట్లో సమావేశమవుతూ ఉండండి" అన్నారు దైవప్రవక్త (సల్లం). దాని ప్రకారం స్త్రీలు సమావేశమయ్యేవారు. దైవప్రవక్త (సల్లం) అక్కడికి వెళ్ళి తనకు దేవుడు నేర్పిన విషయాలను వారికి బోధించేవారు.

(అలాంటి సమావేశంలో ఓ రోజు) ఆయన మాట్లాడుతూ "ముగ్గురు పిల్లలు కోల్పోయిన (అంటే ముగ్గురు పిల్లలు చనిపోయినప్పుడు సహనం వహించిన) స్త్రీ కోసం ఈ పిల్లలు నరకానికి అడ్డుతెరగా మారుతారు" అని అన్నారు. ఒక స్త్రీ ఈ మాట విని "దైవప్రవక్తా! మరి ఇద్దరు పిల్లలయితే?" అని అడిగింది. ఆమె ఈ ప్రశ్న రెండు సార్లు అడిగింది. దానికి దైవప్రవక్త (సల్లం) "ఆ.... ఇద్దరయినా, ఇద్దరయినా, ఇద్దరయినా" అని సమాధానమిచ్చారు.

**(సహీహ్ బుఖారీ:- 96వ ప్రకరణం - అల్ ఏతెసామ్, 9వ అధ్యాయం - తాలీమిన్నబియ్యి (సల్లం) ఉమ్మతహూ మినర్రిజాలి వన్నిసా)**

---

1. ముస్లిం హదీసులో "ఆ బాలికలకు విద్యాశిక్షణలు గరిపితే వారతని కోసం నరకాగ్నికి అడ్డుతెరగా మారుతారు" అని అదనంగా ఉంది. (అనువాదకుడు)

2. దివ్యఖుర్‌ఆన్‌లో "మీలో నరకం మీదుగా పోని వారంటూ ఉండరు. ఇదొక నిర్ణీత విషయం. దాన్ని నెరవేర్చవలసిన బాధ్యత నీ ప్రభువుపై ఉంది" (19:71) అని ఉంది. ప్రమాణం నెరవేర్చడానికి అంటే ఈ నిర్ణయం నెరవేర్చడం కావచ్చు. ఈ వ్యక్తి కూడా నరకాన్ని దాటవలసి ఉంటుంది. అయితే ఈ సూక్తిలోని నిర్ణయం నెరవేరడానికన్నట్లు నామమాత్రంగా ఉంటుంది. లేదా దీని భావం, ప్రమాణం నెరవేరడానికి నరకంలో శిక్షగా కాకుండా నామమాత్రంగా ప్రవేశింపజేయటం కావచ్చు. (సంకలనకర్త)

1691. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ అస్ఫహానీ (రహ్మాలై) కథనం :- నేను అబూ హాజిం (రహ్మాలై) నోట హజ్రత్ అబూ హురైరా (రజి) చెప్పిన ఈ హదీసే విన్నాను - "యుక్త వయస్సుకు రాని ముగ్గురు పిల్లలు .... (కోల్పోయిన స్త్రీ కోసం ఈ పిల్లలు నరకానికి అడ్డు తెరగా మారుతారు)" అని ప్రవచించారు దైవప్రవక్త (సల్లం).

(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం - ఇల్మ్, 36వ అధ్యాయం - హల్ యజ్ అల్‌లిన్నిసాయి యౌమున్ అలా హిదతిన్ ఫిల్ఇల్మి)

## 48వ అధ్యాయం - దేవుడు ఎవరినైనా అభిమానిస్తే అతడ్ని తన దాసులకు అభిమాన పాత్రుడిగా చేస్తాడు

1692. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- దేవుడు ఏ దాసుణ్ణయినా అభిమానిస్తే జిబ్రయీల్ (అలైహి)ని పిలిచి "దేవుడు ఫలానా వ్యక్తిని అభిమానిస్తున్నాడు కనుక నీవు కూడా అతడ్ని అభిమానించు" అని అంటాడు. అందుచేత జిబ్రయీల్ (అలైహి) అతడ్ని అభిమానించడం ప్రారంభిస్తారు. తరువాత ఆయన ఆకాశంలో ఒక ప్రకటన గావిస్తూ "దేవుడు ఫలానా వ్యక్తిని అభిమానిస్తున్నాడు. కనుక మీరంతా అతడ్ని అభిమానించండి" అని అంటారు. దాంతో ఆకాశ వాసులంతా (అంటే దైవదూతలందరూ) అతడ్ని అభిమానించడం మొదలెడ్తారు. చివరికి భూమిపై కూడా అతనికి ప్రజాదరణ లభిస్తుంది.

(సహీహ్ బుఖారీ:- 97వ ప్రకరణం - అత్తౌహీద్, 33వ అధ్యాయం - కలామిర్రబ్బి మఅ జిబ్రయీల్)

## 50వ అధ్యాయం - మనిషి తాను అభిమానించే వాడికే స్నేహితుడవుతాడు

1693. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం :- ఒక వ్యక్తి (లేచి) "దైవప్రవక్తా! ప్రళయం ఎప్పుడొస్తుంది?" అని ప్రశ్నించాడు. "దాని కోసం నువ్వేం ఏర్పాట్లు చేసుకుంటున్నావు?" అని అడిగారు దైవప్రవక్త (సల్లం). "నేను దాని కోసం అత్యధికంగా నమాజులు చేయలేదు, అత్యధికంగా రోజాలు పాటించలేదు, అత్యధికంగా దానధర్మాలు కూడా చేయలేదు. కాకపోతే నేను దేవుడ్ని, ఆయన ప్రవక్త (సల్లం)ను అభిమానిస్తున్నాను" అన్నాడా వ్యక్తి. దానికి దైవప్రవక్త (సల్లం) "నీవు ఎవరిని అభిమానిస్తున్నావో (ప్రళయ దినాన) అతనితో పాటే ఉంటావు" అని చెప్పారు.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 96వ అధ్యాయం - అలామతి హుబ్బిల్లాహి అజ్జ వ జల్ల)

1694. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం :- ఒక వ్యక్తి కొందరిని అభిమానిస్తున్నాడు. కాని సత్కార్యాలు చేయడంలో అతను వారి స్థాయికి చేరుకోలేకపోతున్నాడు (అలాంటి వ్యక్తి గురించి మీ అభిప్రాయం ఏమిటి?)" అని దైవప్రవక్త (సల్లం)ను ఎవరో అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "మనిషి తాను ఎవరినైతే అభిమానిస్తాడో వారితో పాటే ఉంటాడు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 96వ అధ్యాయం - అలామతి హుబ్బిల్లాహి అజ్జ వ జల్ల)

# విధివ్రాత ప్రకరణం

## 1వ అధ్యాయం - మాతృగర్భంలో మానవ నిర్మాణ స్థితి, అతని ఉపాధి, వయస్సు, కర్మలు మొదలగునవి

1695. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) సత్యమూర్తి. ఇది తిరుగులేని సత్యం. ఆయన ఇలా ప్రవచించారు :-

"మీలో ప్రతి వ్యక్తీ మాతృ గర్భంలో ఈ విధంగా రూపొందుతాడు : మొదట నలభై రోజుల దాకా (వీర్యబిందువు రూపంలో) ఉంటాడు. తరువాత అన్ని రోజులే ద్రవరక్తం రూపంలో ఉంటాడు. ఆ తరువాత అన్నే రోజులు మాంసపు ముద్ద (పిండం) రూపంలో ఉంటాడు. ఆ తరువాత దేవుడు ఒక దైవదూతను నాలుగు ఆజ్ఞలు ఇచ్చి పంపుతాడు - అతని కర్మలు, ఉపాధి, ఆయుష్షును గురించి వ్రాయమని ఆదేశిస్తాడు. అతను దౌర్భాగ్యుడవుతాడా లేక సౌభాగ్యుడవుతాడా అనే విషయాన్ని కూడా వ్రాయమని ఆదేశిస్తాడు. ఆ తరువాత అతనిలో ప్రాణం పోయబడుతుంది.

పోతే మీలో ఒక వ్యక్తి (సత్) కర్మలు చేస్తూ ఉంటాడు. ఆ విధంగా చివరికి (ఆ సత్కర్మల కారణంగా) అతనికి, స్వర్గానికి మధ్య ఒక గజం మాత్రమే ఎడం ఉండిపోతుంది. ఆ తరువాత అతని జాతకం మారిపోయి అతను నరకవాసులు చేసే పనులు చేసేస్తాడు (తత్పర్యవసానంగా అతను నరకం పాలవుతాడు). అదే విధంగా మరొకడు (దుష్) కర్మలు చేస్తూ ఉంటాడు. అలా చివరికి (ఆ దుష్కర్మల కారణంగా) అతనికి, నరకానికి మధ్య ఒక గజం మాత్రమే ఎడం ఉండిపోతుంది. అంతలో అతని జాతకం మారిపోయి అతను స్వర్గవాసులు చేసే పనులు చేసేస్తాడు (తత్ఫలితంగా అతను స్వర్గానికి వెళ్తాడు)."

**(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్ఉల్ ఖల్ఖ్, 6వ అధ్యాయం - జిక్రిల్ మలాయికా)**

1696. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- దేవుడు మాతృగర్భం దగ్గర ఒక దైవదూతను నియమిస్తాడు. ఆ దైవదూత "ప్రభూ! ఇప్పుడు వీర్య బిందువు .... ప్రభూ! ఇప్పుడు ద్రవరక్తం .... ప్రభూ! ఇప్పుడు మాంసపు ముద్ద (పిండం)" అని అంటాడు. ఆ తరువాత దేవుడు ఆ పిండాన్ని (మానవుడిగా) సృష్టించడానికి పూనుకుంటాడు. అప్పుడు ఆ దైవదూత "ఇతను బాలుడా, లేక బాలికా? ఇతను దౌర్భాగ్యుడవుతాడా లేక సౌభాగ్యుడవుతాడా? ఇతని ఉపాధి ఎంత? ఇతని ఆయుష్షు ఎంత?" అని అడుగుతాడు. ఈ విషయాలన్నీ మాతృగర్భంలో ఉండగానే వ్రాయబడతాయి.

**(సహీహ్ బుఖారీ:- 6వ ప్రకరణం - అల్ హైజ్, 17వ అధ్యాయం - ముఖల్లఖతిన్ వ గైరి ముఖల్లఖతి)**

1697. హజ్రత్ అలీ (రజి) కథనం :- మేమొక జనాజా (శవం) వెంట 'బఖీ' శ్మశాన వాటికకు వెళ్ళాము.

అంతలో దైవప్రవక్త (సల్లం) కూడా వచ్చి ఓ చోట కూర్చున్నారు. మేము ఆయన చుట్టూ కూర్చున్నాము. దైవప్రవక్త (సల్లం) చేతిలో ఒక బెత్తం ఉంది. ఆయన తల వంచుకొని బెత్తంతో నేలను గీకసాగారు. కాస్సేపటికి "మీలో ప్రతి ఒక్కరి స్థానం స్వర్గం లేక నరకంలో వ్రాయబడి ఉంది. అతను సౌభాగ్యుడా లేక దౌర్భాగ్యుడా అనే విషయం ముందుగానే వ్రాయబడింది" అని అన్నారు ఆయన. ఒకతను ఈ మాట విని "దైవప్రవక్తా! అయితే మనం విధివ్రాతని భావించి కర్మలు ఆచరించకుండా ఎందుకు కూర్చోకూడదు. మనలో ఎవరైనా సౌభాగ్యుడై వుంటే అతను ఎలాగూ సత్కర్మలు ఆచరిస్తాడు, దౌర్భాగ్యుడయితే ఎలాగూ దుష్కర్మలు ఆచరిస్తాడు కదా!" అని అన్నాడు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "కాని వాస్తవం ఏమిటంటే అదృష్టవంతుడికి సత్కార్యాలు చేసే సద్బుద్ధి కలుగుతుంది, దౌర్భాగ్యుడికి దుష్కార్యాలు చేసే దుర్బుద్ధి పుడుతుంది" అని అన్నారు. ఆ తరువాత ఆయన (దివ్య ఖుర్‌ఆన్‌లోని) ఈ సూక్తులు పఠించారు : "ధనాన్ని దానం చేసి దైవ అవిధేయతకు దూరంగా ఉంటూ, మంచిని (సత్యాన్ని) సమర్థించే వాడికి మేము సన్మార్గాన నడిచేందుకు సౌలభ్యం కలగజేస్తాము. (దీనికి భిన్నంగా) పిసినారితనం వహించి (దైవం పట్ల) నిర్లక్ష్య భావం ప్రదర్శిస్తూ, మంచిని (సత్యాన్ని) ధిక్కరించే వాడికి మేము కఠిన మార్గాన నడిచేందుకు సౌలభ్యం కలగజేస్తాము" (92 : 5-10).

**(సహీహ్ బుఖారీ :- 23వ ప్రకరణం - జనాయిజ్, 83వ అధ్యాయం - మౌఇజతిల్ ముహద్దిసి ఇన్దల్ ఖబ్ర్ వఖువూది అస్‌హాబిహీ హౌలహు)**

1698. హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) కథనం :- ఒక వ్యక్తి లేచి "దైవప్రవక్తా! స్వర్గవాసులెవరో నరకవాసులెవరో (ముందుగానే) గుర్తించబడ్డారా?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) ఔనన్నారు. "అలాంటప్పుడు మానవులు కర్మలు ఆచరించడం దేనికి?" అని ప్రశ్నించాడా వ్యక్తి మళ్ళీ. దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "ప్రతి మనిషీ తాను దేని కొరకు పుట్టించబడ్డాడో ఆ పనులే చేస్తాడు" అని అన్నారు. లేక "ఎలాంటి బుద్ధి ఇవ్వబడిందో అలాంటి పనులే చేస్తాడు" అని అన్నారు.★

**(సహీహ్ బుఖారీ:- 82వ ప్రకరణం - ఖద్ర్, 2వ అధ్యాయం - జఫ్ఫల్ ఖలము అలా ఇల్మిల్లాహ్)**

1699. హజ్రత్ సహెల్ బిన్ సాద్ సాదీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- ఒక వ్యక్తి ప్రజల దృష్టిలో స్వర్గవాసులు చేసేటటువంటి పనులే చేస్తాడు. కాని అతను నరకవాసి అవుతాడు. అలాగే మరొకతను జనం దృష్టిలో నరకవాసులు చేసేటటువంటి పనులు చేస్తాడు. కాని అతను స్వర్గనివాసి అవుతాడు.

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 77వ అధ్యాయం - లా యుఖాలు ఫులానన్ షహీద్)**

---

★ఒక వ్యక్తి మంచి పనులు చేస్తుంటే అతని అదృష్టంలో స్వర్గం రాసి ఉందని భావించవచ్చు. అలాగే మరొక వ్యక్తి చెడ్డ పనులు చేస్తుంటే అతని అదృష్టంలో నరకం రాసి ఉందని అనుకోవచ్చు. ఈ హదీసు భావం ఇదే. అయితే అదృష్టం గురించిన జ్ఞానం మనకు లేదు గనక నిజంగా ఫలానా వ్యక్తి స్వర్గానికి పోతాడని, ఫలానా వ్యక్తి నరకంలో పడిపోతాడని ఖచ్చితంగా చెప్పలేము. చెప్పకూడదు కూడా. మనం ఏం చేస్తున్నామో, ఏం జరుగుతున్నదో అంతా విధి నిర్ణయమే. అయితే విధి నిర్ణయం, విధి వ్రాత ఏమిటో మనకు తెలియదు గనక మనం చేసే పనులకు మనమే బాధ్యులవుతాము. దాని ప్రకారమే మనకు పరలోక ప్రతిఫలం లభిస్తుంది. అంతేగాని, మనం కావాలని తప్పుడు పనులు చేస్తూ విధి వ్రాత అంటూ వాటి బాధ్యతను దేవునిపై నెట్టి మనం మన పాపాల దుష్పర్యవసానం నుండి బయట పడగలమని భ్రమించకూడదు. (అనువాదకుడు)

## 2వ అధ్యాయం - హజ్రత్ ఆదం, హజ్రత్ మూసా (అలైహి)ల మధ్య సంభాషణ

1700. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు :- (ఓసారి) హజ్రత్ ఆదం, హజ్రత్ మూసా (అలైహి)ల మధ్య వాదోపవాదాలు జరిగాయి. హజ్రత్ మూసా (అలైహి) మాట్లాడుతూ "ఆదం గారూ! మీరు మా పితామహులు. కాని మీరు మమ్మల్ని దౌర్భాగ్యులుగా చేశారు. మమ్మల్ని స్వర్గం నుంచి తీసివేయించారు" అని ఆరోపించారు. దానికి హజ్రత్ ఆదం (అలైహి) సమాధానమిస్తూ "మూసా! దేవుడు నీకు తనతో ప్రత్యక్ష సంభాషణా భాగ్యం కలిగించాడు. పైగా ఆయన నీకు తన స్వహస్తాలతో (తౌరాత్ పలకలను) రాసిచ్చాడు. (అంతటి హోదా పొంది కూడా) నీవు, నా పుట్టుకకు నలభై ఏళ్ళ పూర్వమే నా అదృష్టంలో రాసిన విషయాల్ని గురించి నన్ను నిందిస్తున్నావా?" అని అన్నారు.

ఈ మాట ఆధారంగా హజ్రత్ ఆదం (అలైహి) హజ్రత్ మూసా (అలైహి) పై సంవాదనలో ఆధిక్యత పొందారని దైవప్రవక్త (సల్లం) చెప్పారు. (ఈ మాట దైవప్రవక్త (సల్లం) మూడుసార్లు అన్నారు).*

(సహీహ్ బుఖారీ:- 82వ ప్రకరణం - ఖద్ర్, 11వ అధ్యాయం - తహాజ్జ ఆదము వ మూసా ఇన్దల్లాహ్)

## 5వ అధ్యాయం - ఆదం పుత్రుని నొసట వ్యభిచార భాగం కొద్దో గొప్పో లిఖించబడింది

1701. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు :- దేవుడు ఆదం పుత్రుడి అదృష్టంలో వ్యభిచార భాగం (కొద్దో గొప్పో) లిఖించాడు. అది అతనికి ఎలాగూ లభిస్తుంది. అందుచేత (పర స్త్రీని కామదృష్టితో చూడటం) కళ్ళ వ్యభిచారం, (పర స్త్రీతో అశ్లీల మాటలు పలకడం) నోటి వ్యభిచారం. మానవుని మనస్సు (అశ్లీల చేష్టలను) కోరుతుంది. (ఇది భావ పరమైన వ్యభిచారం). అయితే అతని మర్మాంగం ఆ కోరికకు కార్యరూపం ఇవ్వటమో లేక ధిక్కరించటమో చేస్తుంది.

(సహీహ్ బుఖారీ:- 79వ ప్రకరణం - ఇస్తియిజాన్, 12వ అధ్యాయం - జినల్ జవారి హిదూనల్ ఫర్జ్)

## 6వ అధ్యాయం - ప్రతి పిల్లవాడు ప్రకృతి ధర్మంపై పుడతాడు

1702. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- ప్రతి పిల్లవాడు (ఏ మతస్థుడైనా) ప్రకృతి ధర్మంపై (అంటే ఇస్లాం ధర్మంపై) పుడతాడు. కాని ఆ తరువాత అతని తల్లిదండ్రులు అతడ్ని యూదుడిగానో, క్రైస్తవుడిగానో లేదా మజూసీ (అగ్ని పూజారి)గానో మారుస్తారు, జంతువుల్ని మార్చినట్లు. జంతువులు పుట్టేటప్పుడు వాటి అవయవాలన్నీ సక్రమంగానే

---

★ ఇమామ్ నవవీ (రహ్మలై) ఇలా రాస్తున్నారు: మనలో కూడా ఎవరైనా పాపం చేసినవాడు హజ్రత్ ఆదం (అలైహి)లా సమాధానమిచ్చి నింద, శిక్షల నుండి విముక్తి పొందగలడా? అన్న ప్రశ్న ఉదయిస్తుందిక్కడ. దానికి సమాధానం ఇది - లేదు. విముక్తి పొందలేడు. ఎందుకంటే అతనింకా ఇహలోకంలోనే ఉన్నాడు. ఇహలోకం ఆచరణా స్థలం. ఇక్కడ ఆచరణకు ఎగనామం పెట్టి మాటల గారడితో మోక్షం పొందడం కుదరదు. హజ్రత్ ఆదం (అలైహి) క్రియా ప్రపంచం నుండి వెళ్ళిపోయిన తరువాత ఇలా సమాధానమిచ్చారు. అదీగాక దేవుడు ఆయన తప్పును క్షమించాడు. అందువల్ల ఆయనపై ఇక ఎలాంటి నిందను మోపలేము. (అనువాదకుడు)

ఉంటాయి. (ఆ తరువాత ఈ మానవులు వాటి చెవులనో, కొమ్ములనో కోసి పారేస్తారు) ఏ జంతు పిల్లయినా తెగిపోయిన చెవులతో పుట్టడం మీరెప్పుడైనా చూశారా?

హజ్రత్ అబూహురైరా (రజి) పై హదీసు ఉల్లేఖించిన తరువాత ఈ క్రింది (ఖుర్ఆన్) సూక్తిని పఠించేవారు.

“దేవుడు మానవులను ఏ ప్రకృతి ధర్మంపై పుట్టించాడో అది మార్చనలవి కానిది”. ఇదే సవ్యమైన, స్థిరమైన ధర్మమార్గం. (30:30)

**(సహీహ్ బుఖారీ:- 23వ ప్రకరణం - జనాయిజ్, 8వ అధ్యాయం - ఇజా అస్లమస్సబియ్యు ఫమాత హల్యుసల్లా అలైహి)**

1703. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- బహుదైవారాధకుల యుక్త వయస్సుకురాని పిల్లలను గురించి (వారు స్వర్గానికి పోతారా లేక నరకానికి పోతారా అని) దైవప్రవక్త (సల్లం)ను ప్రశ్నించటం జరిగింది. దానికి ఆయన సమాధానమిస్తూ “వారు పెరిగి పెద్ద వాళ్ళయిన తరువాత ఎలాంటి కర్మలు ఆచరిస్తారో దేవునికే తెలుసు” అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 23వ ప్రకరణం - జనాయిజ్, 93వ అధ్యాయం - మాఖీల ఫీ ఔలాదిల్ ముష్రికీన్)**

1704. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం :- బహుదైవారాధకుల యుక్త వయస్సుకు రాని పిల్లలను గురించి (వారు స్వర్గానికి పోతారా లేక నరకానికి పోతారా అని) దైవప్రవక్త (సల్లం)ను అడగటం జరిగింది. దానికి ఆయన సమాధానమిస్తూ “ఆ పిల్లలను దేవుడు పుట్టించాడు గనక వారు పెరిగి పెద్దవాళ్ళయ్యాక ఏం చేస్తారో దేవునికి మాత్రమే తెలుసు” అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 23వ ప్రకరణం - జనాయిజ్, 93వ అధ్యాయం - మాఖీల ఫీ ఔలాదిల్ ముష్రికీన్)**

# విద్యా విషయక ప్రకరణం

## 1వ అధ్యాయం - దివ్య ఖుర్‌ఆన్ లోని అస్పష్ట సూక్తుల వెంట పడకూడదు

1705. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఈ క్రింది సూక్తుల్ని పఠించారు :- "ఆయనే మీ (హృదయ ఫలకం) పై ఈ గ్రంథాన్ని అవతరింపజేసినవాడు. ఇందులో రెండు రకాల సూక్తులున్నాయి. ఒకటి ముహ్కమాత్ (స్పష్టమయినవి). ఇవి గ్రంథానికి పునాదులు వంటివి. రెండు:- ముతషాబిహాత్ (అస్పష్టమయినవి). వక్ర బుద్ధి కలవారు కలహాలు సృష్టించే ఉద్దేశ్యంతో ఎల్లప్పుడూ అస్పష్టమయిన సూక్తుల వెంటే పడతారు. వాటికి లేనిపోని అర్థాలు ఆపాదించడానికి ప్రయత్నిస్తారు. నిజానికి వాటి అసలు భావం దేవునికి తప్ప మరెవరికీ తెలియదు. దీనికి భిన్నంగా విషయ పరిజ్ఞానంలో స్థిత ప్రజ్ఞులయినవారు 'మేము వీటిని నమ్ముతున్నాము. ఇవన్నీ మా ప్రభువు నుండి వచ్చినవే' అని అంటారు. అసలు ఏ విషయం ద్వారానయినా బుద్ధిమంతులే గుణపాఠం గ్రహించగలరు" (ఆలి ఇమ్రాన్ : 7)

ఆ తరువాత ఆయన ఈ విధంగా ప్రవచించారు: "మీరెప్పుడయినా దివ్య ఖుర్‌ఆన్‌లోని ఈ అస్పష్టమయిన సూక్తుల వెంట పడి ఆరా తీయడానికి ఎవరైనా ప్రయత్నించడం చూస్తే, దేవుడు (ఖుర్‌ఆన్‌లో) వారిని గురించే ప్రస్తావించాడని తెలుసుకొని వారికి దూరంగా ఉండండి".

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 3వ సూరా - ఆలి ఇమ్రాన్, 1వ అధ్యాయం - మిన్హు ఆయాతున్ ముహ్కమాత్)**

1706. హజ్రత్ జున్దుబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు :- మీ హృదయం, నోరు పరస్పరం సమన్వయం చెందినంత సేపు మీరు దివ్య ఖుర్‌ఆన్‌ని (శ్రద్ధగా) పఠించండి. మీ హృదయం, నోరు మధ్య సమన్వయ లోపం ఏర్పడితే మాత్రం ఖుర్‌ఆన్ పఠనం ఆపేయండి."★

**(సహీహ్ బుఖారీ:- 66వ ప్రకరణం - ఫజాయిలిల్ ఖుర్‌ఆన్, 37వ అధ్యాయం - ఇఖ్రవుల్ ఖుర్‌ఆన మా అతలఫత్ అలైహి ఖులూబుకుమ్)**

## 2వ అధ్యాయం - కరడు గట్టిన జగడాల మారి

1707. హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- దేవుని

---

★ అంటే, మానసిక ఏకాగ్రత, శ్రద్ధాసక్తులు ఉన్నంత వరకూ పఠించండి. అవి ఏమీ లేకుండా పెదాలు ఆడించడం వల్ల ఎలాంటి ప్రయోజనం ఉండదు. పైగా అలా పఠించడం వల్ల తప్పులు దొర్లే ప్రమాదం కూడా ఉంటుంది. ఇక సమన్వయలోపం అంటే అనుమానాలకు, సంశయాలకు కారణభూతమయ్యే పరిస్థితి అన్నమాట. అయితే ధార్మిక సమస్యల పరిష్కారంలో ధర్మవేత్తల మధ్య వచ్చే విభేదం మాత్రం దీని క్రిందికి రాదు. అలాంటి విభేదానికి అనుమతి ఉంది. అలాంటి విభేదం వల్ల సఫలమయినా, విఫలమయినా చిత్తశుద్ధితో జరిగిన కృషి కారణంగా ప్రతిఫలం లభిస్తుంది. (సంకలనకర్త)

దృష్టిలో అందరి కంటే పరమ అసహ్యకరమైన వ్యక్తి కరడుగట్టిన జగడాల మారి. (అంటే సత్యానికి వ్యతిరేకంగా అసత్యానికి మద్దతుగా జగడం చేసేవాడు).

(సహీహ్ బుఖారీ:- 46వ ప్రకరణం - మజాలిమ్, 15వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా, వహువ అలద్దుల్ ఖిసాం)

## 3వ అధ్యాయం - యూదుల, క్రైస్తవుల విధానాలను అవలంబించేవారు

1708. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం :- "మీరు పూర్వీకుల (అంటే గత మతస్థుల) జీవన విధానాలను ఒక్క అంగుళం కూడా వదలకుండా అనుసరిస్తారు. చివరికి వారు ఉడుం కన్నంలోకి దూరితే, వారి వెంట మీరు కూడా అందులోకి దూరుతారు" అన్నారు దైవప్రవక్త (సల్లం). మేమీ మాట విని "దైవప్రవక్తా! ఏమిటీ మేము యూదుల్ని, క్రైస్తవుల్ని అనుసరిస్తామా?" అని అడిగాము (ఆశ్చర్యంతో). దానికి దైవప్రవక్త (సల్లం) "మరెవర్ని అనుకుంటున్నారు?" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 96వ ప్రకరణం - అల్ ఏతెసామ్, 14వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం)ల తత్తబిఉన్న సునున మన్‌కాన ఖబ్లకుమ్)

## 5వ అధ్యాయం - ప్రళయం సమీపంలో జ్ఞానకాంతి పోయి అజ్ఞానాంధకారం వస్తుంది

1709. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- ప్రళయ సూచనల్లో ఇవి కూడా ఉన్నాయి - జ్ఞానకాంతి పోయి అజ్ఞానాంధకారం అలుముకుంటుంది. మద్యసేవనం విపరీతంగా పెరిగిపోతుంది. వ్యభిచారం సర్వసామాన్యమవుతుంది.

(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం - ఇల్మ్, 21వ అధ్యాయం - రఫ్‌యిల్ ఇల్మి వజుహూరిల్ జహ్లి)

1710. హజ్రత్ అబూ మూసా అష్‌అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు :- ప్రళయానికి ముందు ఓ కాలం వస్తుంది. అప్పుడు జ్ఞానం పైకి పోయి అజ్ఞానం క్రిందికి దిగుతుంది. హర్జ్ అధికమవుతుంది. హర్జ్ అంటే హత్యాకాండ.

(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్, 5వ అధ్యాయం - జుహూరిల్ ఫితన్)

1711. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- "ప్రళయ కాలం సమీపించినపుడు సత్కర్మలు తరిగిపోతాయి; ప్రజల హృదయాల్లో పిసినారితనం, పేరాశలు తిష్ఠవేస్తాయి; సర్వత్రా కలహాలు, కల్లోలాలు పెద్ద ఎత్తున చెలరేగుతాయి; హర్జ్ అధికమవుతుంది."

ప్రవక్త అనుచరులు ఈ మాట విని "హర్జ్ అంటే ఏమిటి దైవప్రవక్తా?" అని అడిగారు. "హర్జ అంటే హత్యా రక్తపాతాల"న్నారు దైవప్రవక్త (సల్లం). ఈ మాట రెండు సార్లు అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్, 5వ అధ్యాయం - జుహూరిల్ ఫితన్)

1712. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు :- దేవుడు (ధర్మ జ్ఞానాన్ని) ప్రజల హృదయాల నుండి తీసివేయడం ద్వారా దాన్ని పైకెత్తుకోడు, జ్ఞానులు (అంటే ధర్మవేత్తలు) అంతరించిన కారణంగా ఆయన జ్ఞానాన్ని పైకి

లేపుకుంటాడు. ఈ విధంగా చివరికి ప్రపంచంలో ఒక్క ధర్మవేత్త కూడా మిగిలి ఉండడు. అప్పుడు ప్రజలు అజ్ఞానుల్ని (మూర్ఖుల్ని) నాయకులుగా చేసుకుంటారు. ధార్మిక విషయాలను గురించి వారినే అడుగుతారు. వారు తమకు ధర్మజ్ఞానం లేకపోయినా ఫత్వాలు (తీర్పులు) ఇస్తారు. ఈ విధంగా వారు స్వయంగా దారి తప్పడమే గాకుండా ఇతరుల్ని కూడా దారి తప్పిస్తారు.

**(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం - ఇల్మ్, 34వ అధ్యాయం - కైఫ యుఖ్బజుల్ ఇల్మ్)**

# ప్రాయశ్చిత్త ప్రకరణం

## 1వ అధ్యాయం - దైవనామ స్మరణ, దాని ప్రయోజనాలు

1713. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- దేవుడు ఈ విధంగా తెలియజేస్తున్నాడు - "నా దాసుడు నా గురించి ఎలా ఊహించుకుంటాడో నేనతని కోసం అలాగే ఉంటాను. నా దాసుడు నన్ను జ్ఞాపకం చేసుకుంటూ నా పేరు స్మరిస్తున్నప్పుడు నేనతని వెన్నంటి ఉంటాను. అతను నన్ను మనసులో జ్ఞాపకం చేస్తే నేను కూడా అతడ్ని మనసులో జ్ఞాపకం చేస్తాను. అతను గనక ఏదైనా సమావేశంలో నా గురించి ప్రస్తావిస్తే నేను అంతకంటే శ్రేష్ఠమైన (దైవదూతల) సమావేశంలో అతడ్ని గురించి ప్రస్తావిస్తాను. నా దాసుడు నా వైపుకు ఒక జానెడు జరిగితే, నేనతని వైపుకు ఒక బారెడు జరుగుతాను. అతను నా వైపుకు ఒక బారెడు వస్తే నేనతని వైపుకు రెండు బారలు వస్తాను. అతను నా వైపుకు నడచి వస్తే నేనతని వైపుకు పరుగెత్తుకొస్తాను."[1]

**(సహీహ్ బుఖారీ:- 97వ ప్రకరణం - అత్తౌహీద్, 15వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (వయుహజ్జిరుకుముల్లాహు నఫ్సహు)**

## 2వ అధ్యాయం - దేవుని పేర్లు, వాటి స్మరణ వల్ల ప్రయోజనాలు

1714. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- దేవునికి తొంభై తొమ్మిది పేర్లున్నాయి (అంటే ఒకటి తక్కువ వంద పేర్లు). ఈ పేర్లను జ్ఞాపకం చేసేవాడు (అంటే ఈ పేర్లను స్మరించేవాడు) స్వర్గానికి పోతాడు.

మరొక ఉల్లేఖనంలో "(ఏకేశ్వరుడు సాటిలేని మేటి అయిన) దేవుడు బేసి సంఖ్యలో ఉన్నాడు. కనుక ఆయనకు కర్మలు కూడా బేసి సంఖ్యలో ఉండటమంటే ఇష్టం" అని అదనంగా ఉంది.[2]

**(సహీహ్ బుఖారీ:- 54వ ప్రకరణం - అష్షురూత్, 18వ అధ్యాయం - మాయజూజుమినల్ ఇష్తిరాత్)**

**(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 68వ అధ్యాయం - లిల్లాహి మిఅతు ఇస్మిన్ గైరు వాహిద్)**

---

1. ఫతహుల్ బారీ గ్రంథం ప్రకారం ఖుర్తుబీ (రహ్మలై) ఇలా రాస్తున్నారు: ఊహించడం అంటే, దాసుడు దుఆ (వేడుకోలు) చేస్తున్నప్పుడు అది స్వీకరించబడుతుందన్న నమ్మకం ఉంచాలన్నమాట. పశ్చాత్తాపంతో క్షమాభిక్ష కోరుతున్నప్పుడు కూడా తన పశ్చాత్తాపం స్వీకరించబడుతుందని, తాను క్షమించబడతానని అతను గట్టిగా ఆశించాలి. మరొక హదీసులో "మీ వేడుకోలు స్వీకరించబడుతుందన్న పూర్తి నమ్మకంతో దేవుడ్ని వేడుకోండి" అని ఉంది. దీన్ని దృష్టిలో పెట్టుకొని ఆ విధంగానే వేడుకోవాలి. పరుగెత్తుకొని రావడం అంటే పుణ్యం వెంటనే ప్రసాదిస్తాడని కూడా అర్థం కావచ్చు. వాస్తవం దేవునికే తెలుసు. (సంకలనకర్త)

2. ఈ హదీసులో దేవుని పేర్లు తొంభై తొమ్మిది మాత్రమేనని, అవి తప్ప ఇంకేమీ పేర్లు లేవని చెప్పబడలేదు. ధర్మవేత్తల ఏకాభిప్రాయం కూడా ఇదే. ఈ తొంభై తొమ్మిది పేర్లను కంఠస్థం చేసుకున్నవాడు స్వర్గంలో ప్రవేశిస్తాడని తెలియజేయడమే ఈ హదీసు ఉద్దేశ్యం. ఖస్తలానీ (రహ్మలై) ఇలా రాస్తున్నారు: "దేవుని పేర్ల సంఖ్య షరీఅత్ ప్రకారం నిర్ణీతమయిపోయింది. దివ్యావిష్కృతి ద్వారా లేక ప్రవక్త ప్రవచనాల ద్వారా మాత్రమే ఇది తెలుస్తుంది. కనుక దేవుని పేర్ల విషయంలో మనం ఖుర్ఆన్, హదీసుల ద్వారా లభించని విషయాలను పేర్కొనడం ధర్మ సమ్మతం కాదు, అవి మన బుద్ధికి ఎంత బాగున్నా సరే.

దేవుడు బేసి సంఖ్యలో ఉన్నాడు అంటే దేవుడు ఒక్కడేనని, ఆయనకు ఎవరూ సాటిలేరని, ఆయనకు సరిసమానులెవరూ లేరని అర్థం. కర్మలు బేసి సంఖ్యలో ఉండటం ఆయనకు ఇష్టమంటే; దాసులు చేసే సత్కర్మలు బేసి సంఖ్యలో ఉండటం ఆయనకు ఇష్టమని అర్థం. ఉదాహరణకు- నమాజ్ రోజుకు ఐదు సార్లు చేయడం, వుజూ చేస్తున్నప్పుడు ఒక్కొక్క అవయవాన్ని మూడేసిసార్లు కడగడం, కాబా గృహం చుట్టూ ఏడుసార్లు ప్రదక్షిణం చేయడం, సఫా, మర్వా కొండల మధ్య ఏడుసార్లు పరుగెత్తడం, 'మినా'లో ప్రతిష్ఠించబడిన మూడు స్తంభాలపై ఏడు కంకరాళ్ళు విసరడం, హజ్ దినాలు (అయ్యామె తష్రీఖ్) మూడు, మూత్రశుద్ధికి మూడు మట్టిపెడ్డలు ఉపయోగించడం మొదలైనవి. (సంకలనకర్త)

## 3వ అధ్యాయం - వేడుకునేటప్పుడు దృఢ విశ్వాసంతో వేడుకోవాలి. 'ఒకవేళ దేవా నీవు తలిస్తే ఇలా చెయ్యి' అని వేడుకోకూడదు

1715. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు :- మీరు దేవుడ్ని వేడుకుంటున్నప్పుడు ఊగిసలాడకుండా దృఢ నమ్మకంతో, స్పష్టంగా వేడుకోండి. దీనికి భిన్నంగా "దేవా నీవు తలచుకుంటే నాకు (ప్రసాదించగలవు, గనక) ప్రసాదించు" అని వేడుకోకండి. దేవుడ్ని ఎవరూ బలవంతపెట్టలేరు.[1]

**(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 21వ అధ్యాయం - లియాజిమిల్ మస్అలత ఫయిన్నహూ లా ముక్రిహలహూ)**

1716. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- మీరు దేవుడ్ని వేడుకునేటప్పుడు "దేవా! నీవు కోరితే నన్ను క్షమించు దేవా! నీవు కోరితే నన్ను కరుణించు" అని వేడుకోకూడదు. దానికి బదులు ఊగిసలాడకుండా, దృఢ నమ్మకంతో, స్పష్టంగా అర్థించండి, దేవుడ్ని ఎవరూ బలవంత పెట్టలేరు.

**(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 21వ అధ్యాయం - లియాజి మిల్మస్ అలత ఫయిన్నహు లా ముక్రిహలహూ)**

## 4వ అధ్యాయం - ఆపదలు వచ్చిపడినప్పుడు చావును కోరుకోవడం తగదు

1717. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు :- మీలో ఎవరికైనా ఏదైనా ఆపద వచ్చిపడితే (దానికి భయపడి) చావును మాత్రం సుతరామూ కోరుకోకూడదు. ఒకవేళ చావును కోరుకోవడం తప్పనిసరి అయితే "నేను ఎంతకాలం బ్రతికి ఉంటే నాకు ప్రయోజనమో అంతకాలం వరకు నన్ను సజీవంగా ఉంచు, మరణమే నా కోసం మేలయితే నాకు మరణాన్ని కలిగించు" అని వేడుకోవాలి.[2]

**(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 30వ అధ్యాయం - అద్దుఆయి బిల్ మౌతి వల్ హయాత్)**

1718. హజ్రత్ ఖైస్ బిన్ అబీ హాజిమ్ (రజి) కథనం :- నేను హజ్రత్ ఖబ్బాబ్ (రజి) దగ్గరకు (ఇంటికి) వెళ్ళాను. ఆ సమయంలో ఆయన (ఏదో వ్యాధి చికిత్సకై) తన పొట్ట మీద ఏడు వాతలు పెట్టించుకొని ఉన్నారు. ఆ స్థితిలో ఆయన మాట్లాడుతూ "చావును కోరుకోకూడదని దైవప్రవక్త (సల్లం) మనకు

---

1. అంటే, దేవుడు, ఏ పని చేసినా తన ఇష్ట ప్రకారం సంతోషంతో చేస్తాడు. అందువల్ల 'దేవా! నీవు తలచుకుంటే ఇలా చేయగలవు గనక ఇలా చెయ్యి' అని దాసుడు వేడుకోరాదు. ఇందులో ఒక విధమైన నిర్లక్ష్య భావం ఉంది. దాసుడు తన యజమాని ముందు దీనంగా వేడుకోవాలి. దాసుడు తాను కోరుకున్నది ఇవ్వాలా ఇవ్వకూడదా అనే విషయాన్ని దేవునికి వదలిపెట్టాలి. ఆయనే అందులోని మంచీ చెడులు బాగా ఎరిగినవాడు. (ఇమామ్ నవవీ-రహ్మాలై)
2. ప్రాపంచిక కష్టాలు, ఆపదలు వచ్చి పడినప్పుడు కంగారు పడిపోయి మృత్యువుని కోరుకోకూడదని ఈ హదీసులో చెప్పబడింది. ఒకవేళ ధర్మపరమైన పరీక్షకు లోనయితే, విశ్వాసం (ఈమాన్) ప్రమాదంలో పడిపోయే పరిస్థితి ఎదురయితే మృత్యువుని కోరుకోవడం ధర్మసమ్మతమే. కొందరు సనాతన మహనీయులు ధర్మం, విశ్వాసం ప్రమాదంలో పడిపోయే పరిస్థితి ఎదురయినప్పుడు ఇలా చేశారు. అయితే సహనం వహించి దేవుడు రాసిన రాత పట్ల తృప్తి చెందడమే మంచిది. (ఇమామ్ నవవీ - రహ్మాలై)

తాకీదు చేశారు. లేకుంటే నేనిప్పుడు చావునివ్వమని దేవుడ్ని తప్పకుండా వేడుకునేవాడ్ని" అని అన్నారు.*

(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 30వ అధ్యాయం - అద్దుఆయి బిల్ మౌతి వల్ హయాత్)

## 5వ అధ్యాయం - దేవుడ్ని కలుసుకోగోరిన వ్యక్తిని దేవుడు కూడా కలుసుకోగోరుతాడు

1719. హజ్రత్ ఉబాదా బిన్ సామిత్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- ఎవరైతే దేవుడ్ని కలుసుకోవడానికి ఇష్టపడతాడో అతడ్ని కలుసుకోవడానికి దేవుడు కూడా ఇష్టపడతాడు. అలాగే ఎవరు దేవుడ్ని కలుసుకోవడానికి ఇష్టపడడో అతడ్ని కలుసుకోవడానికి దేవుడు కూడా ఇష్టపడడు.

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 41వ అధ్యాయం - మన్ అహబ్బలిఖా అల్లాహి అహబ్బల్లాహ లిఖాఅహు)

1720. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు:- ఎవరైతే దేవుడ్ని కలుసుకోవడానికి ఇష్టపడతాడో అతడ్ని కలుసుకోవడానికి దేవుడు కూడా ఇష్టపడతాడు. అలాగే ఎవరైతే దేవుడ్ని కలుసుకోవడానికి ఇష్టపడడో అతడ్ని కలుసుకోవడానికి దేవుడు కూడా ఇష్టపడడు.

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 41వ అధ్యాయం - మన్ అహబ్బలిఖా అల్లాహి అహబ్బల్లాహ లిఖాఅహు)

## 6వ అధ్యాయం - దైవనామ స్మరణ, వేడుకోలు, దైవ సాన్నిధ్య ప్రయత్నంలోని మహత్తు

1721. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు:- దేవుడు ఇలా ప్రవచిస్తున్నాడు - "నా దాసుడు నా గురించి ఎలా ఊహించుకుంటాడో నేనతని కోసం అలాగే ఉంటాను. నా దాసుడు నన్ను జ్ఞాపకం చేసుకుంటూ నా పేరును స్మరిస్తున్నప్పుడు నేనతని వెన్నంటి ఉంటాను. అతను నన్ను మనసులో జ్ఞాపకం చేస్తే, నేను కూడా అతడ్ని మనసులో జ్ఞాపకం చేస్తాను. అతను గనక ఏదైనా సమావేశంలో నా గురించి ప్రస్తావిస్తే నేను అంతకంటే శ్రేష్ఠమైన (దైవదూతల) సమావేశంలో అతడ్ని గురించి ప్రస్తావిస్తాను. నా దాసుడు నా వైపుకు ఒక జానెడు జరిగివస్తే నేనతని వైపుకు ఒక బారెడు జరిగి వస్తాను. అతను నా వైపుకు ఒక బారెడు వస్తే నేనతని వైపుకు రెండు బారలు వస్తాను. అతను నా వైపు నడచి వస్తే నేనతని వైపుకు పరుగెత్తుకొస్తాను."

(సహీహ్ బుఖారీ:- 97వ ప్రకరణం - అత్తౌహీద్, 15వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (వయుహజ్జిరుకుముల్లాహు నఫ్సహూ)

## 8వ అధ్యాయం - దైవధ్యాన సమావేశాలు -వాటి పుణ్యం

1722. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :-

---

★ ఈ హదీసులో మరణం కలిగించమని దైవాన్ని వేడుకోకూడదని చెప్పటం జరిగింది. దీనికి ముందు హదీసులో మరణాన్ని కోరుకోకూడదని చెప్పబడింది. వేడుకోవటంలోనూ, కోరిక కలిగి ఉండటంలోనూ వ్యత్యాసం ఉంది. వేడుకోలు ప్రత్యేకమైన విషయం. కోరిక సాధారణ విషయం. ప్రతి వేడుకోలు (దుఆ) కోరిక క్రిందికి వస్తుంది. కాని ప్రతి కోరికా వేడుకోలు క్రిందికి రాదు. (సంకలనకర్త)

దైవదూతలు కొందరు (వివిధ) మార్గాలలో తిరుగుతూ దైవస్మరణ చేసేవారిని అన్వేషిస్తూ ఉంటారు. వారికెక్కడయినా దైవనామస్మరణ చేసేవారు కొందరు కనిపిస్తే వారు తమ సహచరుల్ని పిలుస్తూ "మీరు అన్వేషిస్తున్న వస్తువు ఇక్కడుంది రండి" అని అంటారు. ఆ తరువాత ఆ దైవదూతలు దైవస్మరణ చేసేవారిని తమ రెక్కలతో నేల నుండి నింగి దాకా కప్పివేస్తారు.

అప్పుడు దేవుడు వారితో తనకు వారి కంటే ఎక్కువ తెలిసినప్పటికీ "నా దాసులు ఏమంటున్నారు?" అని అడుగుతాడు. దానికి వారు "నీ పవిత్రతను, నీ ఔన్నత్యాన్ని కొనియాడుతున్నారు. నిన్ను స్తుతిస్తున్నారు. నీ ఘనతను చాటుతున్నారు" అని చెబుతారు. "మరి వారు నన్ను ఎప్పుడైనా చూశారా?" అని అడుగుతాడు దేవుడు. "చూడలేదు. దైవసాక్షి! వారు నిన్ను చూడలేదు" అంటారు దైవదూతలు. "వారు గనక నన్ను చూసి ఉంటే ఎలా ఉంటుంది వారి పరిస్థితి?" అడుగుతాడు దేవుడు. "వారు గనక నిన్ను చూసి ఉంటే నిన్ను మరింత ఎక్కువగా ఆరాధిస్తారు, నీ ఘనతను మరింత ఎక్కువగా చాటుతారు. నిన్ను మరింత అధికంగా స్మరిస్తారు" అని చెబుతారు దైవదూతలు.

"సరే వారు నన్ను ఏం అర్థిస్తున్నారు?" అని అడుగుతాడు దేవుడు. "వారు నిన్ను స్వర్గాన్ని అర్థిస్తున్నారు" చెబుతారు దైవదూతలు. "మరి వారు స్వర్గాన్ని ఎప్పుడైనా చూశారా?" అడుగుతాడు దేవుడు. "లేదు ప్రభూ! దైవసాక్షి! వారు స్వర్గాన్ని చూడలేదు" అంటారు దైవదూతలు. వారు గనక స్వర్గాన్ని చూసి ఉంటే వారి పరిస్థితి ఎలా ఉంటుంది?" అడుగుతాడు దేవుడు. "వారు గనక స్వర్గాన్ని చూసి ఉంటే దాన్ని పొందాలన్న వారి కోరిక మరింత తీవ్రమవుతుంది. (దాన్ని ప్రసాదించమని) వారు నిన్ను మరింత అధికంగా అర్థిస్తుంటారు. దాని పట్ల వారి ఆకర్షణ, అభిమానాలు మరింత తీవ్రతరమవుతాయి" అని అంటారు దైవదూతలు.

"సరే, వారు దేని బారి నుండి శరణు కోరుతున్నారు?" అని అడుగుతాడు దేవుడు. "వారు నరకం బారి నుండి నీ శరణు కోరుతున్నారు" అంటారు దైవదూతలు. "మరి వారు నరకాన్ని ఎప్పుడైనా చూశారా?" అడుగుతాడు దేవుడు. "లేదు ప్రభూ! వారు నరకాన్ని చూడలేదు" అంటారు దైవదూతలు. "ఒకవేళ వారు నరకాన్ని చూసి ఉంటే వారి పరిస్థితి ఎలా ఉంటుంది?" అడుగుతాడు దేవుడు. "వారొకవేళ నరకాన్ని చూసి ఉంటే, దాని బారి నుండి వారు మరింత దూరం పరుగెత్తుతారు. దానికి మరింత ఎక్కువగా భయపడతారు" అని చెబుతారు దైవదూతలు.

"సరే, మీరంతా సాక్ష్యం ఉండండి, నేను వారిని క్షమిస్తున్నాను" అంటాడు దేవుడు. అప్పుడు ఒక దైవదూత (లేచి) "కాని వారిలో ఫలానా వ్యక్తి దైవస్మరణ చేసేవారిలో చేరలేదు, ఏదో పని మీద అక్కడికి వచ్చాడు, అంతే" అని అంటాడు. దానికి దేవుడు "వారంతా ఒకే తరగతికి చెందినవారు. వారితో పాటు ఆ సమావేశంలో కూర్చున్న ఏ ఒక్కడూ దౌర్భాగ్యుడు కాజాలడు" అని అంటాడు.

**(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 66వ అధ్యాయం - ఫజ్లి జిక్రిల్లాహి అజ్జవజల్ల)**

## 9వ అధ్యాయం - "అల్లాహుమ్మ ఆతినా ఫిద్దున్యా హసనతవ్వ ఫిల్ ఆఖిరతి ...." అనే వేడుకోలు విశిష్టత

1723. హజ్రత్ అనస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) సాధారణంగా ఈ దుఆ (వేడుకోలు) చేస్తుంటారు.

اَللّٰهُمَّ رَبَّنَآ اٰتِنَا فِی الدُّنْيَا حَسَنَةً وَّفِی الْاٰخِرَةِ حَسَنَةً وَّقِنَا عَذَابَ النَّارِ۔

(దేవా! మా ప్రభువా!! మాకు ఇహలోకంలోనూ, పరలోకంలోనూ మంచిని, మేలును ప్రసాదించు. మమ్మల్ని నరకశిక్ష నుండి కాపాడు).★

**(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 55వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) రబ్బనా ఆతినా ఫిద్దున్యా హసనహ్)**

## 11వ అధ్యాయం - లా ఇలాహ ఇల్లల్లాహ్, సుబ్హానల్లాహ్ - స్మరణ, వేడుకోలు

1724. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు :-

لَآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ لَهُ الْمُلْكُ وَلَهُ الْحَمْدُ وَهُوَ عَلٰی كُلِّ شَیْءٍ قَدِيْرٌ۔

(అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు. ఆయన ఒక్కడే, ఆయనకు ఎవరూ సాటిలేరు. ప్రభుత్వం, రాజ్యాధికారం అంతా ఆయనదే. సకల స్తుతి, స్తోత్రాలకు ఆయనే యోగ్యుడు. ఆయన ప్రతి దానిపై అధికారం కలిగి ఉన్నాడు). ఈ వచనాలను ప్రతి రోజూ పఠించే వాడికి పది మంది బానిసలకు విముక్తి కలిగించినంత పుణ్యం లభిస్తుంది. పైగా అతని కర్మల రికార్డులో వంద సత్కర్మలు అదనంగా వ్రాయబడతాయి. ఆ రికార్డులో నుంచి వంద దుష్కర్మలు తొలగించి వేయబడతాయి. అంతే గాకుండా ఆ రోజు ఉదయం నుండి సాయంత్రం వరకు ఈ వచనాలు అతడ్ని షైతాన్ బారి నుండి రక్షిస్తాయన్న హామీ కూడా ఉంది. ఈ వచనాలను వందకు పైగా పఠించేవాడి

---

★ ఫతహుల్ బారీ గ్రంథం ప్రకారం షేఖ్ ఇమాదుద్దీన్ ఇబ్నె కసీర్ (రహ్మలై) ఇలా రాస్తున్నారు - ప్రపంచ మేలు పరిధిలో ప్రాపంచిక లక్ష్యాలు, ఆకాంక్షలన్నీ వస్తాయి. ఉదాహరణకు: ఆరోగ్యం, ఆనందం, విశాలమైన మంచి ఇల్లు, అందమైన భార్య, సుగుణవంతులైన సంతానం, మంచి ఆహారం, లాభదాయకమైన విద్యా జ్ఞానాలు, సత్కార్యాలు, మంచి వాహనం మొదలైనవి. చివరికి ప్రజలు మనల్ని మంచి వాళ్ళుగా భావించడం, మంచి మాటలతో ప్రస్తావించడం వగైరా విషయాలు కూడా ప్రాపంచిక మేళ్ళ క్రిందికే వస్తాయి. పరలోక మేళ్ళలో అన్నిటికంటే అత్యంత శ్రేష్ఠమైన మేలు స్వర్గాన్ని పొందడమే. మరణానంతరం పునరుత్థాన దినాన సంభవించే ఆపదల నుండి సురక్షితంగా ఉండటం, కర్మల విచారణ సులభంగా ఉండటం మొదలైనవన్నీ స్వర్గ ప్రవేశానికి సోపానాలవుతాయి. (సంకలనకర్త)

ఆచరణ తప్ప మరెవరి ఆచరణా ఇతని ఆచరణ కంటే శ్రేష్ఠమయినది కాజాలదు.*

(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బదయిల్ ఖల్ఖ్, 11వ అధ్యాయం - సిఫతి ఇబ్లీస్ వ జునూదిహీ)

1725. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- "సుబ్హా నల్లాహి వబిహమ్దిహీ" (దేవుడు పరమ పవిత్రుడు, పరిశుద్ధుడు. నేనాయన్ని స్తుతిస్తున్నాను) అని ఎవరైతే రోజుకు వందసార్లు పఠిస్తాడో అతని పాపాలన్నీ క్షమించబడతాయి, ఆ పాపాలు సముద్రపు నురుగులా ఎంత అధికంగా ఉన్నా సరే (క్షమించబడతాయి).

(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 65వ అధ్యాయం - ఫజ్లిత్తస్బీహ్)

1726. హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారీ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు :-

لَاۤ اِلٰهَ اِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ لَهُ الْمُلْكُ وَلَهُ الْحَمْدُ وَهُوَ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ -

(అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు. ఆయన ఏకేశ్వరుడు, అద్వితీయుడు, ఆయనకు ఎవడూ (ఏ విషయంలోనూ) భాగస్వామి కాడు. రాజ్యాధికారం ఆయనదే. సకల స్తుతీ స్తోత్రాలకు ఆయనే యోగ్యుడు. ఆయన ప్రతిదానిపై అధికారం కలిగి ఉన్నాడు). ఈ వచనాలను ఎవరైతే పదిసార్లు పఠిస్తాడో అతనికి ఇస్మాయీల్ (అలైహి) సంతతిలోని ఒక బానిసను విముక్తం చేసినంత పుణ్యం లభిస్తుంది.

(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 64వ అధ్యాయం - ఫజ్లిత్తహ్లీల్)

1727. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు:- రెండు వచనాలున్నాయి. అవి నాలుక పై తేలిగ్గానే ఉంటాయి (పఠించడం చాలా తేలికే). కాని పరలోకపు త్రాసులో చాలా బరువుగా ఉంటాయి. కరుణామయుడయిన ప్రభువుకు ఈ వచనాలు ఎంతో ప్రియమైనవి. (అవేమిటంటే) "సుబ్హానల్లాహిల్ అజీం; సుబ్హానల్లాహి వబిహమ్దిహి" (పరమోన్నతుడయిన దేవుడు ఎంతో పవిత్రుడు; దేవుడు పరమ పవిత్రుడు, పరిశుద్ధుడు, నేనాయన్ని స్తుతిస్తున్నాను).

(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 65వ అధ్యాయం - ఫజ్లిత్తస్బీహ్)

★ ఇమామ్ నవవీ (రహ్మలై) ఇలా రాస్తున్నారు: ఈ వచనాలను వందసార్లు ఒకే సమయంలో నిరంతరాయంగా స్మరించినా, విభిన్న సమయాలలో స్మరించినా లేదా ఉదయం కొన్ని సార్లు, సాయంత్రం కొన్ని సార్లు స్మరించినా మొత్తం మీద రోజుకు వందసార్లు స్మరిస్తే ఈ ప్రయోజనాలన్నీ కలుగుతాయని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. అయితే రోజంతా షైతాన్ బారి నుండి సురక్షితంగా ఉండేందుకు ఈ వచనాలను ఉదయం వేళ ఏకకాలంలో వందసార్లు పఠిస్తే మరీ మంచిది. (సంకలనకర్త)

## 13వ అధ్యాయం - దైవస్మరణ మెల్లిగా చేయడం అభిలషణీయం

1728. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఖైబర్ మీద దాడి చేశారు - లేక దైవప్రవక్త (సల్లం) ఖైబర్‌కు బయలుదేరారు - అప్పుడు ప్రవక్త అనుచరులు గుట్టపై నుండి ఒక లోయను చూసి "అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్, లా ఇలాహ ఇల్లల్లాహ్" అని బిగ్గరగా పలకసాగారు. దైవప్రవక్త (సల్లం) అది విని "మీ పట్ల మీరు మృదువుగా వ్యవహరించండి (గొంతు చించుకుంటూ) అలా కేకలు పెట్టకండి. మీరు చెవిటి వాడినో, లేక ఇక్కడ లేని వాడినో పిలవడం లేదు. మీరు అనుక్షణం వినేవాడ్ని, మీకు అతి చేరువలో మీ వెంట ఉన్నవాడ్ని పిలుస్తున్నారు" అని అన్నారు.

నేనా సమయంలో దైవప్రవక్త (సల్లం) వాహనం వెనుక నిలబడి "లా హౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహ్" అన్నాను. దైవప్రవక్త (సల్లం) ఇది విని "అబ్దుల్లా బిన్ ఖైస్!"★ అని పిలిచారు నన్ను. నేను "మీ సేవకై సిద్ధంగా ఉన్నాను దైవప్రవక్తా!" అన్నాను. "నేను నీకు స్వర్గ నిక్షేపాలలో ఒక నిక్షేపం వంటి ఒక వచనాన్ని నీకు తెలుపనా?" అన్నారు ఆయన (సల్లం). నేను "తప్పకుండా తెలియజేయండి దైవప్రవక్తా! నా తల్లిదండ్రులు మీ కోసం సమర్పితం" అని అన్నాను. అప్పుడాయన "లా హౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహ్ (దైవాజ్ఞ తప్ప ఏ శక్తీ ఏ బలమూ లేదు)" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 38వ అధ్యాయం - గజ్వతి ఖైబర్)**

1729. హజ్రత్ అబూ బకర్ (రజి) దైవప్రవక్త (సల్లం)ను "నమాజులో చదువుకోవడానికి తనకేదయినా దుఆ (వేడుకోలు) నేర్పమని" అర్థించారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఈ దుఆ పఠించమన్నారు -

اَللّٰهُمَّ اِنِّىْ ظَلَمْتُ نَفْسِىْ ظُلْمًا كَثِيْرًا وَّلَا يَغْفِرُ الذُّنُوْبَ اِلَّا اَنْتَ فَاغْفِرْ لِىْ
مَغْفِرَةً مِّنْ عِنْدِكَ وَارْحَمْنِىْ، اِنَّكَ اَنْتَ الْغَفُوْرُ الرَّحِيْمُ

(దేవా! నేను నా ఆత్మకు చాలా అన్యాయం చేసుకున్నాను. పాపాలను క్షమించేవాడు నీవు తప్ప మరెవరూ లేడు. అందువల్ల నీవు నా పాపాలను క్షమించు, నన్ను కరుణించు. నీవు ఎంతో క్షమించేవాడవు, కరుణించేవాడవు).

**(సహీహ్ బుఖారీ:- 10వ ప్రకరణం - అజాన్, 149వ అధ్యాయం - అద్దుఆ ఖబ్లస్సలాం)**

1730. హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ (రజి) కథనం :- హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి) దైవప్రవక్త (సల్లం)తో "దైవప్రవక్తా! నమాజులో చదువుకోవడానికి నాకేదయినా దుఆ (వేడుకోలు) నేర్పండి" అని అన్నారు. అప్పుడాయన ఈ దుఆ పఠించమన్నారు -

---

★ హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) అసలు పేరు అబ్దుల్లా బిన్ ఖైస్. (అనువాదకుడు)

اَللّٰهُمَّ اِنِّیْ ظَلَمْتُ نَفْسِیْ ظُلْمًا كَثِیْرًا وَّلَا یَغْفِرُ الذُّنُوْبَ اِلَّا اَنْتَ فَاغْفِرْلِیْ
مِنْ عِنْدِكَ مَغْفِرَةً اِنَّكَ اَنْتَ الْغَفُوْرُ الرَّحِیْمُ

(దేవా! నేను నా ఆత్మకు చాలా అన్యాయం చేసుకున్నాను. నీవు తప్ప పాపాలను క్షమించేవాడు మరెవడూ లేడు. అందువల్ల నీవు నా పాపాలను క్షమించు. నిస్సందేహంగా నీవు ఎంతో క్షమించేవాడవు, కరుణించేవాడవు).

(సహీహ్ బుఖారీ:- 97వ ప్రకరణం - అత్తౌహీద్, 9వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా వ కానల్లాహు సమీఅంబసీరా)

## 14వ అధ్యాయం - విపత్తులు, ఉపద్రవాల నుండి రక్షణ వేడుకోవడం

1731. హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా దుఆ (వేడుకోలు) చేసేవారు:-

اِنِّیْ اَعُوْذُبِكَ مِنْ فِتْنَةِ النَّارِ وَعَذَابِ النَّارِ، وَفِتْنَةِ الْقَبْرِ، وَعَذَابِ
الْقَبْرِ وَشَرِّ فِتْنَةِ الْغِنٰی وَشَرِّ فِتْنَةِ الْفَقْرِ۔ اَللّٰهُمَّ! اِنِّیْ اَعُوْذُبِكَ مِنْ شَرِّ فِتْنَةِ الْمَسِیْحِ
الدَّجَّالِ۔ اَللّٰهُمَّ! اَغْسِلْ قَلْبِیْ بِمَاءِ الثَّلْجِ وَالْبَرْدِ وَنَقِّ قَلْبِیْ مِنَ الْخَطَایَا، كَمَا نَقَّیْتَ الثَّوْبَ
الْاَبْیَضَ مِنَ الدَّنَسِ۔ وَبَاعِدْ بَیْنِیْ وَبَیْنَ خَطَایَایَ كَمَا بَاعَدْتَّ بَیْنَ الْمَشْرِقِ وَالْمَغْرِبِ ۔
اَللّٰهُمَّ! اِنِّیْ اَعُوْذُبِكَ مِنَ الْكَسَلِ وَالْمَاْثَمِ وَالْمَغْرَمِ۔

(దేవా! నేను నరక పరీక్ష నుండి, నరక యాతన నుండి, సమాధి పరీక్ష నుండి, సమాధి శిక్ష నుండి నీ శరణు వేడుకుంటున్నాను. దేవా! నేను మసీహ్ దజ్జాల్ పరీక్ష కీడు నుండి కూడా నీ శరణు కోరుతున్నాను. దేవా! నా హృదయాన్ని మంచు, వడగండ్లతో కడిగివెయ్యి. తెల్ల వస్త్రాన్ని మురికి మలినాలు తొలగించి శుద్ధి చేసినట్లు నా హృదయం నుండి పాపాలు, పొరపాట్లు తొలగించి దాన్ని శుద్ధి చెయ్యి. నీవు తూర్పు పడమరల మధ్య ఎంత దూరం ఉంచావో నాకు, నా పాపాలకు మధ్యా అంత దూరం ఉంచు. దేవా! నేను సోమరితనం బారి నుండి, నన్ను పాపాలు, అప్పుల పాల్జేసే విషయాల బారి నుండి నీ శరణు కోరుతున్నాను).

(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 46వ అధ్యాయం - అత్తఅవ్వుజి మిన్ ఫిత్నతిల్ ఫఖ్ర్)

## 15వ అధ్యాయం - అశక్తత, సోమరితనం తదితర దురవస్థల బారి నుండి శరణు కోరటం

1732. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా దుఆ (వేడుకోలు) చేసేవారు :-

اَللّٰهُمَّ! اِنِّیْ اَعُوْذُبِكَ مِنَ الْعَجْزِ وَالْكَسَلِ وَالْجُبْنِ وَالْهَرَمِ وَاَعُوْذُبِكَ مِنْ عَذَابِ الْقَبْرِ
وَاَعُوْذُبِكَ مِنْ فِتْنَةِ الْمَحْیَا وَالْمَمَاتِ۔

(దేవా! నేను సోమరితనం, పిరికితనం, అశక్తత అసహాయతల బారి నుండి నీ శరణు కోరుతున్నాను. ప్రయోజనం లేని అతి వృద్ధాప్యం బారి నుండి, సమాధి యాతన నుండి, జీవిత పరీక్షల నుండి, మృత్యు పరీక్ష నుండి (కూడా) నేను నీ శరణు కోరుతున్నాను).

**(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం అద్దావాత్, 38వ అధ్యాయం - అత్తఅవ్వుజి మిన్ ఫిత్నతిల్ మహ్యా వల్ మమాత్)**

## 16వ అధ్యాయం - దురదృష్టం, దౌర్భాగ్యాల బారి నుండి శరణు వేడుకోవడం

1733. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) గండం తీవ్రత నుండి, దౌర్భాగ్యం నుండి, దురదృష్టం నుండి, (తమను చూచి) శత్రువు వికటాట్టహాసం చేసే దుస్థితి నుండి దేవుని శరణు వేడుకునేవారు.

**(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 28వ అధ్యాయం - అత్తఅవ్వుజు మిన్ జహ్దిల్‌బలా)**

## 17వ అధ్యాయం - నిద్రించే ముందు పడక మీద మేను వాల్చి పఠించే దుఆ

1734. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు : "మీరు నిద్ర పోదలచినప్పుడు ముందుగా నమాజు కోసం చేసేలా వుజూ చెయ్యండి, తరువాత పడకపై కుడి వైపుకు తిరిగి పడుకొని ఈ దుఆ (వేడుకోలు) పఠించండి :

اَللّٰهُمَّ! اِنِّیْ اَسْلَمْتُ وَجْهِیْ اِلَیْكَ وَفَوَّضْتُ اَمْرِیْ اِلَیْكَ،

وَاَلْجَأْتُ ظَهْرِیْ اِلَیْكَ رَغْبَةً وَّرَهْبَةً اِلَیْكَ لَا مَلْجَأَ وَلَا مَنْجَا مِنْكَ اِلَّا اِلَیْكَ.

اَللّٰهُمَّ! اٰمَنْتُ بِكِتَابِكَ الَّذِیْ اَنْزَلْتَ وَبِنَبِیِّكَ الَّذِیْ اَرْسَلْتَ.

(దేవా! నీ సమక్షంలో నన్ను నేను సమర్పించుకున్నాను. నా వ్యవహారాలన్నీ నీకు అప్పగించాను. ఇక నిన్నే నమ్ముకొని ఉన్నాను. నీ అనుగ్రహ భాగ్యం పొందే ఆరాటంతో, నీ ఆగ్రహ భయంతో నీ సన్నిధిలో హాజరయ్యాను. నీ నుండి పారిపోయి నేనెక్కడా రక్షణ పొందలేను. నీ సన్నిధిలో తప్ప నాకు మరెక్కడా ఆశ్రయం లేదు. దేవా! నీవు అవతరింపజేసిన నీ (ఖుర్ఆన్) గ్రంథాన్ని, నీవు ప్రభవింపజేసిన నీ ప్రవక్త (సల్లం)ను (మనస్ఫూర్తిగా) విశ్వసించాను).

ఈ దుఆ పఠించిన తరువాత నీవు ఒకవేళ అదే రాత్రి చనిపోవడం జరిగితే, ఇస్లాం ధర్మంలో ఉన్న స్థితిలో చనిపోతావు. ఈ దుఆ నీ తుది పలుకులు కావాలి. (అంటే ఈ దుఆ తరువాత నీ నోట ఎలాంటి ప్రాపంచిక విషయాలు వెలువడకూడదు)."

హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) ఇలా అంటున్నారు :- నేనీ దుఆను దైవప్రవక్త (సల్లం)కు

పఠించి విన్పించాను. ఈ దుఆలో నేను "అల్లాహుమ్మ ఆమన్తు బి కితాబికల్లజి అన్జల్త" తరువాత "వరసూలికల్లజి అర్సల్త" అని పఠించాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "అలా కాదు, 'వనబియ్యి కల్లజి అర్సల్త' అని పఠించాలి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 4వ ప్రకరణం - అల్ వుజూ, 75వ అధ్యాయం - ఫజ్లిమంబాత, అలల్ వుజూ)

1735. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు :- మీలో ఎవరైనా (పడుకోవడానికి పడక మీద మేను వాల్చదలచుకున్నప్పుడు, ముందుగా ఓ గుడ్డతో పడకను శుభ్రపరచుకోవాలి. ఎందుకంటే తాను లేనప్పుడు ఆ పడక మీదికి ఏమొచ్చి చేరిందో అతనికి తెలియదు. ఆ తరువాత ఈ దుఆ పఠించాలి -

بِاسْمِكَ رَبِّ! وَضَعْتُ جَنْبِيْ، وَبِكَ اَرْفَعُهُ. اِنْ اَمْسَكْتَ نَفْسِيْ فَارْحَمْهَا وَاِنْ اَرْسَلْتَهَا
فَاحْفَظْهَا بِمَا تَحْفَظُ بِهِ الصَّالِحِيْنَ.

(ప్రభూ! నేను నీ పేరు స్మరిస్తూ పడక మీద మేను వాల్చుతున్నాను. నీ పేరునే స్మరిస్తూ (తిరిగి) పడక మీద నుంచి లేస్తాను. (ఈ రోజు) గనక నీవు నా ఆత్మను స్వాధీన పరచుకుంటే దాన్ని కరుణించు. ఒకవేళ నా ఆత్మను స్వేచ్ఛగా వదలి పెడ్తే నీవు నీ పుణ్యదాసుల్ని కాపాడుతున్నట్లు దాన్ని కాపాడు).

(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 13వ అధ్యాయం - హద్దసనా అహ్మద్ బిన్ యూనుస్)

## 18వ అధ్యాయం - భూత భవిష్యత్ కర్మల కీడు నుండి శరణు వేడటం

1736. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ దుఆ పఠించేవారు:-

اَعُوْذُ بِعِزَّتِكَ الَّذِيْ لَآ اِلٰهَ اِلَّا اَنْتَ الَّذِيْ لَا يَمُوْتُ وَالْجِنُّ وَالْاِنْسُ يَمُوْتُوْنَ.

(ప్రభూ!) నీ గౌరవ ప్రతిష్ఠలతో నాకు రక్షణ కల్పించమని నిన్ను అర్థిస్తున్నాను. నీవు తప్ప మరే ఆరాధ్యుడు లేడు. నీకు మరణమే లేదు. మానవులు, జిన్నులు అంతా మరణాన్ని చవి చూడవలసిందే.)

(సహీహ్ బుఖారీ:- 97వ ప్రకరణం - తౌహీద్, 7వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (వహువల్ అజీజుల్‌హకీం)

1737. హజ్రత్ అబూ మూసా అష్ అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ దుఆ పఠించేవారు:-

رَبِّ اغْفِرْلِيْ خَطِيْئَتِيْ وَجَهْلِيْ وَاِسْرَافِيْ فِيْ اَمْرِيْ كُلِّهِ وَمَا اَنْتَ اَعْلَمُ بِهِ مِنِّيْ.

اَللّٰهُمَّ اغْفِرْلِيْ خَطَايَايَ وَعَمْدِيْ، وَجَهْلِيْ وَهَزْلِيْ وَكُلُّ ذٰلِكَ عِنْدِيْ.

اَللّٰهُمَّ اغْفِرْلِيْ مَا قَدَّمْتُ وَمَآ اَخَّرْتُ، وَمَآ اَسْرَرْتُ وَمَآ اَعْلَنْتُ اَنْتَ الْمُقَدِّمُ وَاَنْتَ الْمُؤَخِّرُ وَاَنْتَ عَلٰى كُلِّ شَیْءٍ قَدِیْرٌ۔

(ప్రభూ! నా అజ్ఞానం, మూర్ఖత్వాల వల్ల నా సమస్త వ్యవహారాల్లో దొర్లిన పొరపాట్లను క్షమించు. వాటిని గురించి (నాకంటే) నీకే బాగా తెలుసు. దేవా! నేను ఉద్దేశ్యపూర్వకంగా చేసిన తప్పుల్ని, నా అజ్ఞానం, మూర్ఖత్వాల కారణంగా జరిగిన తప్పుల్ని కూడా మన్నించు. ఇవన్నీ నాలో ఉన్నాయి. దేవా! నా వల్ల జరిగిన, జరగబోయే పాపాలను, నా అంతర్య, బాహ్య పాపాలను కూడా క్షమించు. నీవే ముందుకు జరిపే వాడివి, నీవే వెనకకు నెట్టేవాడివి. నీవు ప్రతి పనీ చేయగల సమర్థుడివి).

**(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 60వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) అల్లా హుమ్మగ్ఫిర్లీ మాఖద్దమ్‌తు వమా అఖ్ఖర్తు)**

1738. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ దుఆ పఠించేవారు :-

لَآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَحْدَهٗ اَعَزَّ جُنْدَهٗ، وَنَصَرَ عَبْدَهٗ وَغَلَبَ الْاَحْزَابَ وَحْدَهٗ فَلَا شَیْءَ بَعْدَهٗ۔

(ఏకేశ్వరుడయిన అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు. ఆయనే తన సైనికులకు గౌరవాన్ని ప్రసాదించాడు; తన దాసునికి సహాయం చేశాడు. ఆయన ఒక్కడే (శత్రు) సైన్యాలను ఓడించాడు. ఆయన తరువాత మరేదీ లేదు.)★

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజీ, 29వ అధ్యాయం - గజ్వతిల్ ఖందఖి వహియల్ అహ్జాబ్)**

## 19వ అధ్యాయం - ఉదయం, రాత్రి పడుకునేటప్పుడు దేవుని పవిత్రతను కొనియాడటం

1739. హజ్రత్ అలీ (రజి) కథనం :- హజ్రత్ ఫాతిమా (రజి) తిరగలి విసరి విసరి వ్యాధిగ్రస్తులయ్యారు. (అంటే ఆమె చేతులకు కాయలు కాశాయి). ఓ సారి దైవప్రవక్త (సల్లం) దగ్గరకు కొందరు (యుద్ధ) ఖైదీలు వచ్చారు. అది తెలిసి హజ్రత్ ఫాతిమా (రజి) దైవప్రవక్త (సల్లం) ఇంటికెళ్ళారు. కాని ఆయన లేరు. హజ్రత్ ఆయిషా (రజి) మాత్రమే ఉన్నారు. అందుచేత ఫాతిమా (రజి) ఆమెనే కలుసుకొని విషయం తెలియజేశారు. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) వచ్చారు. హజ్రత్ ఆయిషా (రజి) ఆయనకు ఫాతిమా (రజి) వచ్చిపోయిన సంగతి తెలియజేశారు.

ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) మా ఇంటికి వచ్చారు. అప్పుడు మేము మా పడకలపై పడుకొని ఉన్నాము. నేను దైవప్రవక్త (సల్లం)ను చూసి లేవడానికి ప్రయత్నించాను. కాని ఆయన నన్ను అలాగే పడుకొని ఉండమని చెప్పి మా ఇద్దరి మధ్య కూర్చున్నారు. అప్పుడు ఆయన దివ్య పాదాల చల్లదనం నా గుండెలకు తాకింది. ఆయన ఇలా అన్నారు, "(ఫాతిమా!) నీవు నన్నడిగిన

★ అంటే ప్రతి వస్తువు, ప్రతి జీవి నశించేవే. దేవుడు మాత్రమే శాశ్వతంగా ఉండేవాడు.

దానికంటే ఎంతో మేలయినది నీకు చెప్పనా? నీవు పడుకోవడానికి పడక మీదికి చేరినపుడు 34 సార్లు అల్లాహు అక్బర్ అనీ, 33 సార్లు సుబ్హానల్లాహ్ అనీ, 33 సార్లు అల్హమ్దులిల్లాహ్ అనీ పఠిస్తూ ఉండు. ఈ స్మరణ నీ కోసం సేవకుడి కంటే ఎంతో శ్రేష్ఠమయిన సంపద."

**(సహీహ్ బుఖారీ:- 62వ ప్రకరణం - ఫజాయిలి అస్హాబిన్నబియ్యి (సల్లం), 9వ అధ్యాయం - మనాఖిబ్ అలీ బిన్ అబీతాలిబ్ అల్ ఖురషీ - రజి)**

## 20వ అధ్యాయం - కోడి కూత విన్నప్పుడు పఠించే దుఆ

1740. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా బోధించారు :- మీరెప్పుడయినా కోడికూత వింటే దేవుడ్ని ఆయన దయానుగ్రహాలను అర్థించండి. కోడి దైవ దూతలను చూడగలుగుతుంది (అప్పుడది కూతపెడ్తుంది). అలాగే మీరెప్పుడైనా గాడిద ఓండ్ర వింటే "అవూజు బిల్లాహి మినష్షైతానిర్రజీమ్" (శాపగ్రస్తుడయిన షైతాన్ బారి నుండి దేవుని శరణుగోరుతున్నాను) అని పఠించండి. గాడిద షైతాన్ని చూసి ఓండ్ర పెడుతుంది.

**(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్యిల్ ఖల్ఖ్, 15వ అధ్యాయం - ఖైరు మాలిల్ ముస్లిమి గనమ్)**

## 21వ అధ్యాయం - కలత చెందినప్పుడు పఠించే దుఆ

1741. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం :- భయాందోళనలు కలిగినప్పుడు, కలత చెందినపుడు దైవప్రవక్త (సల్లం) ఈ దుఆ (వేడుకోలు) పఠించేవారు - "లా ఇలాహ ఇల్లల్లాహుల్ అజీముల్ హలీం - లా ఇలాహ ఇల్లల్లాహు రబ్బుల్ అర్షిల్ అజీం - లా ఇలాహ ఇల్లల్లాహు రబ్బు స్సమావాతి వరబ్బుల్ అర్జి వ రబ్బుల్ అర్షిల్ కరీం" (మహోన్నతుడు, మృదు మనస్కుడయిన అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు. అత్యున్నత సింహాసనాధిపతి (విశ్వసామ్రాజ్యాధినేత) అయిన అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు. భూమ్యాకాశాల ప్రభువు, ప్రతిష్ఠాత్మక సింహాసనాధిపతి అయిన అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు).

**(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 27వ అధ్యాయం - అద్దుఆ ఇన్దల్ కర్బ్)**

## 25వ అధ్యాయం - సహనం వహిస్తే ప్రతి వేడుకోలూ స్వీకరించబడుతుంది

1742. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- ప్రతి వ్యక్తి చేసే దుఆ (వేడుకోలు) స్వీకరించబడుతుంది. అయితే అసహనం, తొందరపాటుతో "నేను (ఎన్నోసార్లు) దుఆ చేశాను, కాని నా దుఆ స్వీకరించబడలేదు" అని చెప్పేవాడి దుఆ మాత్రం స్వీకరించబడదు.

**(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 22వ అధ్యాయం - యుస్తజాబు లిల్ అబ్ది మాలమ్ యుఅజ్జిల్)**

## 26వ అధ్యాయం - స్వర్గంలో అత్యధిక మంది పేదలు, నరకంలో అత్యధిక మంది స్త్రీలు

1743. హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా

తెలియజేశారు:- నేను స్వర్గ ద్వారం దగ్గర నిలబడి చూశాను. స్వర్గంలో ప్రవేశిస్తున్న వారిలో అత్యధిక మంది నిరుపేదలే ఉన్నారు. ధనికులు (విచారణ కోసం ద్వారం ముందు) నిరోధించబడ్డారు. అయితే నరకానికి పోవలసిన ధనికుల్ని నరకంలోకి పంపమని ముందే ఆజ్ఞాపించడం జరిగింది. నేను నరక ద్వారం దగ్గర కూడా నిలబడి చూశాను. నరకంలో ప్రవేశిస్తున్న వారిలో అత్యధిక మంది స్త్రీలే ఉన్నారు.

(సహీహ్ బుఖారీ:- 67వ ప్రకరణం - నికాహ్, 87వ అధ్యాయం - హద్దసనా ముసద్దద్)

1744. హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు :- నా తదనంతరం మిగిలి ఉండే ఉపద్రవాలలో పురుషులకు స్త్రీలకన్నా ఎక్కువ నష్టం కలిగించే ఉపద్రవం మరేదీ లేదు.

(సహీహ్ బుఖారీ:- 67వ ప్రకరణం - నికాహ్, 17వ అధ్యాయం - మాయుత్తఖామిన్ షూమిల్ మర్ అతి)

## 27వ అధ్యాయం - సత్కర్మలను సాధనంగా చేసి దైవాన్ని వేడుకున్న గుహవాసుల వృత్తాంతం

1745. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు :- ముగ్గురు వ్యక్తులు ఇంటి నుంచి బయలుదేరారు. దారిలో వర్షం కురిసింది. అందువల్ల వారు ఒక కొండ గుహలోకి వెళ్ళారు. వారలా గుహలో ప్రవేశించగానే పై నుండి ఒక బండరాయి గుహ మీద పడిపోయింది. (దాంతో గుహ ముఖ ద్వారం మూసుకుపోయింది). అప్పుడు వారు పరస్పరం సంప్రదించుకుని "మనం జీవితంలో చేసుకున్న సత్కర్మలలో అతి శ్రేష్ఠమైన సత్కర్మ ఆధారంగా (ఈ బండరాయిని తొలగించమని) దైవాన్ని వేడుకుందాం" అన్న నిర్ణయానికి వచ్చారు.

ఆ తరువాత వారిలో ఒకడు ఇలా అన్నాడు : "దేవా! నా తల్లిదండ్రులు ముసలి వారైపోయారు. నేను మేకలు కాస్తూ ఉండేవాడ్ని. ఇంటికి తిరిగొచ్చిన తరువాత నేను పాలు పితికి మొట్టమొదట నా తల్లిదండ్రులకు ఇస్తాను. వారు త్రాగిన తరువాత మిగిలిన పాలను నా భార్యా పిల్లలకు, ఇతర కుటుంబ సభ్యులకు ఇస్తాను. అయితే ఓ రోజు రాత్రి నేను ఇంటికి తిరిగొచ్చేటప్పటికి చాలా పొద్దు పోయింది. నేను పాలు తీసుకొని నా తల్లిదండ్రుల దగ్గరకు వచ్చేసరికి వారు నిద్రపోయారు. వారిని లేపడం భావ్యం కాదని భావించాను. అటు నా పిల్లలు నా కాళ్ళ దగ్గర ఆకలితో తల్లడిల్లిపోతూ ఏడ్వసాగారు. (అయినా నేను నా తల్లిదండ్రులకు నిద్రా భంగం కలిగించలేదు). వారు పడుకునే ఉన్నారు. నేను కూడా సూర్యోదయం అయ్యే వరకు (పాల గిన్నె చేతుల్లో పట్టుకొని) అలాగే వారి ముందు నిల్చున్నాను. దేవా! నేనీ పని కేవలం నీ ప్రసన్నత కోసం చేశాను. అది నీకూ తెలుసు. అందుచేత మా గుహలో నుంచి మేము ఆకాశాన్ని చూడగలిగే అంత సందు చెయ్యి." ఇలా అతను దేవుడ్ని ప్రార్థించగానే ఆ గుహలో (బండరాయి కొద్దిగా తొలగిపోయి) ఓ చిన్న సందు ఏర్పడింది.

ఆ తరువాత రెండవ వ్యక్తి ఇలా ప్రార్థించాడు; "దేవా! నీకు తెలుసు, నేను నా పినతండ్రి కూతుళ్ళలో ఒకామెను అమితంగా ప్రేమిస్తూ ఉండేవాడ్ని. ఒక పురుషుడు ఒక స్త్రీని ప్రేమిస్తున్నంత

ఘాటుగా ప్రేమించేవాడ్ని. అయితే ఆ అమ్మాయి నీవు నాకు వంద దీనార్లు చెల్లించనంతవరకు నన్ను పొందలేవు అని చెప్పింది. అందువల్ల నేను అతి కష్టం మీద వంద దీనార్లు సంపాదించాను. కాని (అక్రమ లైంగిక క్రీడ కోసం) నేనామె కాళ్ళ మధ్య కూర్చోగానే "కాస్త దేవునికి భయపడు, అధర్మ పద్ధతితో నా కన్నెపొర చెరపకు" అన్నది ఆమె. నేనీ మాట విని లేచి నిలబడ్డాను, ఆమెను వదలేశాను; దేవా! నీకు తెలుసు నీ ప్రసన్నత కోసం నేను నిగ్రహం పాటించాను (నీకు భయపడి ఈ అక్రమ చర్యను మానుకున్నాను) కనుక మా దారి తెరు". అప్పుడు మూడింట రెండు వంతుల సందు ఏర్పడింది.

ఆ తరువాత మూడోవాడు ఇలా వేడుకున్నాడు : "దేవా! నీకీ సంగతి తెలుసు. నేను మూడు సేర్ల[1] జొన్నల కూలిపై ఒక కూలి వాడ్ని పెట్టుకున్నాను. (పనిపూర్తయిన తరువాత) నేనతనికి కూలి యివ్వబోతే అతను తీసుకోవడానికి నిరాకరించాడు. అప్పుడు నేనా జొన్నలను పొలంలో విత్తాను (చల్లాను). (అది పుష్కలంగా పండింది) దాంతో నేను ఆవుల్ని, పశువుల కాపరిని కొన్నాను. కొంత కాలానికి ఆ కూలివాడు వచ్చి "దేవుని దాసుడా! నాకు రావలసిన కూలి నాకివ్వు" అని అన్నాడు. నేనతనితో "ఇదిగో ఈ ఆవుల్ని, పశువుల కాపరిని తీసికెళ్ళు. ఈ సంపదంతా నీదే తీసికెళ్ళు" అని అన్నాను. అతను నా మాటలు విని "నాతో పరిహాసమాడుతున్నావా?" అన్నాడు. నేనతనితో "నేను నీతో పరిహాసమాడటం లేదు (నిజంగానే చెబుతున్నాను) ఇదంతా నీదే" అని చెప్పాను. దేవా! నీకు తెలుసు. నేనీ పని నీ ప్రసన్నత కోసమే చేసి ఉంటే మాకు దారి ఏర్పరచి మా బాధను తొలగించు" అప్పుడు (బండరాయి తొలగిపోయి) పూర్తిగా దారి ఏర్పడింది. దాంతో ఆపద దూరమయిపోయింది.[2]

**(సహీహ్ బుఖారీ:- 34వ అధ్యాయం - అల్ బుయూ, 98వ అధ్యాయం - ఇజష్తరా షైఅన్ ల్లిగైరిహీ బిగైరి ఇజ్నిహీ ఫరజియ)**

---

1. ఇక్కడ మూలభాషలో 'ఫిర్ఖ్' అనే పదం వచ్చింది. ఇది ఒక విధమైన కొలమానం. ఇది మూడు 'సా'లకు సమానం. దానిని తెలుగులో సందర్భానుసారం సంకేతపదంగా మూడు సేర్లని అనువదించడం జరిగింది.

2. ఈ హదీసులో ప్రయోజనకరమైన అనేక విషయాలు ఉన్నాయి. ఉదాహరణకు: (1) ఆపద వచ్చినప్పుడు, ఆ ఆపదను దూరం చేయడానికి చేసిన ఏ ప్రయత్నమూ సఫలం కాకపోతే, కేవలం దేవుని ప్రసన్నత కోసం చేసిన ఏదైనా సత్కార్యం మనం చేసి ఉంటే దాన్ని ఒక సాధనంగా చేసి దైవాన్ని ప్రార్థించాలి. దాని వల్ల దేవుడు మన మొరను ఆలకించి ఈ ఆపదను దూరం చేస్తాడు. (2) భార్యాపిల్లల హక్కు కంటే తల్లిదండ్రుల హక్కు ముఖ్యమైనది. అంటే ఒకే సమయంలో వీరుభయుల హక్కు నెరవేర్చవలసిన పరిస్థితి వస్తే ముందుగా తల్లిదండ్రుల హక్కు నెరవేర్చాలి. ఈ హక్కును నెరవేర్చడం వల్ల లభించే పుణ్యం కూడా అత్యున్నతమైనదే. (3) ఏదైనా పాపం చేయడానికి శక్తీ సామర్థ్యాలు, అవకాశాలు పూర్తిగా ఉన్నప్పటికీ కేవలం దేవునికి భయపడి, ఆయన ప్రసన్నత కోసం ఆ పాపాన్ని విడనాడటం గొప్ప పుణ్యకార్యం అవుతుంది. ముఖ్యంగా లైంగిక కోరికను అదుపు చేసి వ్యభిచారానికి పాల్పడకుండా ఉండటం గొప్ప పుణ్య కార్యమే. ఇది దేవునికి ఎంతో ప్రీతికరమైన విషయం. (4) హక్కుదారుల హక్కులను నెరవేర్చడం కూడా దైవప్రసన్నతను బడయటంలో ఎంతగానో దోహదపడుతుంది. (5) యజమాని అనుమతి లేకుండా అతనికి లాభం చేకూరేలా అతని ఆస్తుల్ని వినియోగించడం ధర్మ సమ్మతమే. అసలు సొత్తు, దాని ద్వారా వచ్చిన లాభం అంతా యజమానిదే. (సంకలనకర్త)

# పశ్చాత్తాప ప్రకరణం

## 1వ అధ్యాయం - పశ్చాత్తాప ప్రేరణ, పశ్చాత్తాపం ద్వారా దైవ ప్రసన్నత

1746. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు :- దేవుడు ఈ విధంగా తెలియజేస్తున్నాడు - "నా దాసుడు నా గురించి ఎలా ఊహించుకుంటాడో నేనతని కోసం అలాగే ఉంటాను. నా దాసుడు నన్ను జ్ఞాపకం చేసుకుంటూ నా పేరు స్మరిస్తున్నప్పుడు నేనతని వెన్నంటి ఉంటాను. అతను నన్ను మనసులో జ్ఞాపకం చేస్తే నేను కూడా మనసులో జ్ఞాపకం చేస్తాను. అతను గనక ఏదైనా సమావేశంలో నా గురించి ప్రస్తావిస్తే నేను అంతకంటే శ్రేష్ఠమైన (దైవదూతల) సమావేశంలో అతడ్ని గురించి ప్రస్తావిస్తాను. నా దాసుడు నా వైపు ఒక జానెడు జరిగి వస్తే నేనతని వైపుకు ఒక బారెడు జరిగి వస్తాను. అతను నా వైపుకు ఒక బారెడు పురోగమిస్తే నేనతని వైపుకు రెండు బారలు పురోగమిస్తాను. అతను నా వైపుకు నడచి వస్తే నేనతని వైపుకు పరుగెత్తుకొస్తాను."

(సహీహ్ బుఖారీ:- 97వ ప్రకరణం - అత్తౌహీద్, 15వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (వయుహజ్జిరుకుముల్లాహు నఫ్సహు)

1747. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఉద్బోధించారు - "ఒక వ్యక్తి ప్రాణాపాయముండే ప్రదేశంలో దిగుతాడు. అతని ఒంటె మీద అన్న పానీయాల సామగ్రి ఉంటుంది. అతనా ప్రదేశంలో దిగి (ప్రయాణ బడలిక వల్ల) కాస్సేపు పడుకుంటాడు. కాని మేల్కొన్న తరువాత చూస్తే ఆ ఒంటె కన్పించక ఎక్కడికోపోతుంది. (అతను ఎంత వెతికినా అది కన్పించదు) చివరికి ఎండ తీవ్రమయిపోయి దప్పికతో అతను తల్లడిల్లిపోతాడు. ఇలాంటి పరిస్థితిలో ఎదురయ్యే బాధలన్నీ అతనికి ఎదురయ్యాయి. అతను (తిరిగి తిరిగి విసిగి వేసారిపోయి) ఇక లాభం లేదు, తాను తన విడిదికి చేరుకోవాలి అని భావించి ఆ ప్రదేశానికి తిరిగొస్తాడు. అలసిపోయి కాస్సేపు పడుకుంటాడు. మేల్కొన్న తరువాత తలపైకెత్తి చూస్తే అతని ఒంటె అతని ఎదురుగా నిలబడి ఉండటం కన్పిస్తుంది. దాన్ని చూసి అతను పరమానంద భరితుడవుతాడు. అయితే దేవుడు తన దాసుని పశ్చాత్తాపం (తౌబా) పట్ల చెందే ఆనందం ఈ బాటసారి చెందిన ఆనందానికి మించి ఉంటుంది."

(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 4వ అధ్యాయం - అత్తౌబా)

1748. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- ఎలాంటి అన్న పానీయాలు లభించని భయంకర ఎడారి ప్రాంతంలో తప్పిపోయిన తన ఒంటె తిరిగి లభించినపుడు ఒక బాటసారి ఎంత సంతోషిస్తాడో దేవుడు తన దాసుని పశ్చాత్తాపం పట్ల అంతకంటే ఎక్కువ సంతోషిస్తాడు.

(సహీహ్ బుఖారీ:- 80వ ప్రకరణం - అద్దావాత్, 4వ అధ్యాయం - అత్తౌబా)

## 4వ అధ్యాయం - దేవుని ఆగ్రహం కన్నా అనుగ్రహమే అధికం

1749. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు :- దేవుడు యావత్తు సృష్టిని సృష్టించిన తరువాత తన దగ్గర సింహాసనంపై ఉన్న తన గ్రంథంలో "నా ఆగ్రహం కన్నా నా అనుగ్రహానిదే పైచేయి" అని రాశాడు.

**(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్ఉల్ ఖల్ఖ్, 1వ అధ్యాయం - మాజాఅ ఫీ ఖౌలిల్లాహి త ఆలా వహువల్లజీ యబ్దవుల్ ఖల్ఖ సుమ్మ యుయీదుహూ)**

1750. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు :- దేవుడు (తన) కారుణ్యాన్ని వంద భాగాలు చేసి, అందులో తొంభై తొమ్మిది భాగాలు తన దగ్గర పెట్టుకొని ఒక్క భాగం మాత్రమే భూమిపై అవతరింపజేశాడు. ఆ ఒక్క భాగం కారుణ్యం కారణంగానే మానవులు, ఇతర జీవరాసులు ఒకరి పట్ల మరొకరు కారుణ్యం, కనికరాలతో మసలుకుంటున్నారు. చివరికి (ఈ కారుణ్యం మూలంగానే) గుర్రం తన పిల్ల(కు కాస్త కూడా నష్టం వాటిల్లకూడదని, దాని) పై నుండి తన కాలిగిట్టను ఎత్తుకుంటుంది.

**(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 19వ అధ్యాయం - జఅలల్లాహుర్రహ్మత మిఅత జుజ్యిన్)**

1751. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) దగ్గరికి కొందరు ఖైదీలు వచ్చారు. వారిలో ఒక మహిళా ఖైదీ పాలిండ్లలో పాలు పొంగుతున్నాయి. ఆమె ఏ చంటి పిల్లవాడ్ని చూసినా గుండెలకు హత్తుకొని అతనికి పాలు పట్టేది. దైవప్రవక్త (సల్లం) ఆ స్త్రీని చూసి మాతో "ఈ స్త్రీ తన పిల్లవాడ్ని అగ్నిలో విసరి వేస్తుందంటారా?" అని అడిగారు. దానికి మేము "విసరివేయదు. తనకు నిరోధక శక్తి ఉన్నంత వరకు ఆమె తన పిల్లవాడ్ని అగ్నిలో ఎంతమాత్రం విసరి వేయదు" అని అన్నాము. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "ఈ స్త్రీ తన పిల్లవాడి పట్ల ఎంత దయామయురాలో, దేవుడు తన దాసుల పాలిట అంతకంటే ఎంతో ఎక్కువ దయామయుడు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 18వ అధ్యాయం - రహ్మతిల్ వలది వ తఖ్బీలిహీ వ ముఆనఖతిహీ)**

1752. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- ఒకతను ఏనాడూ ఒక్క సత్కార్యం కూడా చేయలేదు. అతను చావు దగ్గరికొచ్చినపుడు (తన కొడుకుల్ని పిలిచి) "నేను చనిపోతే నా భౌతిక కాయాన్ని దహనం చేసి ఆ చితాభస్మాన్ని సగం నేల మీద, సగం సముద్రంలో విసరి పారెయ్యాలి. ఎందుకంటే నేను గనక దేవుని చేతికి చిక్కితే ఆయన నాకు లోకంలో ఎవరికీ విధించనంతటి కఠిన శిక్ష విధిస్తాడు" అని ఉపదేశించాడు. (అతని వారసులు అతను చెప్పినట్లే చేశారు). అయితే దేవుడు సముద్రాన్ని ఆజ్ఞాపించగానే సముద్రం అతని బూడిదను ఒక చోట సమీకరించింది. అలాగే నేలను ఆజ్ఞాపించగానే నేల కూడా తనపై వెదజల్లబడిన అతని బూడిదనంతటినీ సమీకరించింది. (ఈ విధంగా) దేవుడు (ఆ బూడిద నుండి అతడ్ని తిరిగి బ్రతికించి) నీవిలా ఎందుకు చేశావు?" అని ప్రశ్నించాడు. దానికా వ్యక్తి "నీకు భయపడి చేశాను. నీకీ సంగతి బాగా

తెలుసు" అని అన్నాడు. ఈ సమాధానం విని దేవుడు అతడ్ని క్షమించాడు.

(సహీహ్ బుఖారీ:- 35వ ప్రకరణం - అత్తౌహీద్, 35వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (యురీదూన అయ్యుబద్దిలూ కలామల్లాహి)

1753. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- మీకు పూర్వం (గత జాతులలో) ఒక వ్యక్తికి దేవుడు అత్యధిక సిరిసంపదలు ప్రసాదించాడు. అతను మరణ సమయం సమీపించినప్పుడు తన కొడుకుల్ని పిలిచి "నేను మీకు ఎలాంటి తండ్రిని?" అని అడిగాడు. దానికి వారు "ఎంతో మంచి తండ్రి" అని అన్నారు. "అయితే (వినండి) నేను జీవితంలో ఎన్నడూ ఎలాంటి సత్కార్యం చేయలేదు. అందువల్ల నేను చనిపోతే నా భౌతిక కాయాన్ని దహనం చేయాలి. ఆ తరువాత ఎముకల్ని బాగా నూరి పొడి చేసి, దాన్ని తీవ్రంగా గాలి వీస్తున్నప్పుడు ఆ గాలిలోకి విసరి పారెయ్యాలి" అని అన్నాడు. వారతను చెప్పినట్లే చేశారు. అయితే దేవుడు అతని శరీర భాగాలను (అంటే బూడిదను) సమీకరించి అతడ్ని తిరిగి (బ్రతికించి) "నువ్విలా చేయడానికి కారణం ఏమిటీ?" అని అడిగాడు. దానికా వ్యక్తి "నేను నీకు భయపడి అలా చేశాను" అని అన్నాడు. ఈ సమాధానం విని దేవుడు అతడ్ని కనికరించాడు.

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 54వ అధ్యాయం - హద్దసనా అబుల్ యమాన్)

## 5వ అధ్యాయం - దాసుడు ఎన్ని సార్లు పాపం చేసినా పశ్చాత్తాపం చెందితే దేవుడు అతడ్ని మన్నిస్తాడు

1754. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- దాసుని వల్ల ఏదైనా పాపం జరిగి లేక దాసుడు ఏదైనా పాపానికి పాల్పడి, "ప్రభూ! నేను పాపానికి పాల్పడ్డాను. లేక, ప్రభూ! నా వల్ల పాపం జరిగిపోయింది. నన్ను క్షమించు" అని వేడుకుంటే, దేవుడు (దైవ దూతలతో) "నా దాసునికి తన పాపాలను క్షమించే ఒక ప్రభువున్నాడని కూడా తెలుసా? ఆ పాపాలకు ఆయన తనను పట్టుకుంటాడని కూడా తెలుసా? సరే, నేనితడ్ని క్షమిస్తున్నాను" అని అంటాడు. ఆ తరువాత దేవుడు తలచినంత కాలం అతను పాపాలకు దూరంగా ఉంటాడు. తరువాత అతని వల్ల మళ్ళీ పాపం జరిగిపోతుంది. లేక అతను మళ్ళీ పాపానికి పాల్పడతాడు. అప్పుడతను "ప్రభూ! నేను మళ్ళీ పాపం చేశాను. లేక నా వల్ల మళ్ళీ పాపం జరిగిపోయింది. నన్ను క్షమించు" అని వేడుకుంటాడు. అది విని దేవుడు (తన దూతలతో) "నా దాసునికి తన పాపాలను క్షమించే ప్రభువు ఒకడు ఉన్నాడని కూడా తెలుసా? ఆ పాపాలకు గాను ఆయన తనను పట్టుకుంటాడని కూడా తెలుసా? సరే, నేనతడ్ని క్షమిస్తున్నాను" అని అంటాడు. ఆ తరువాత దేవుడు తలచినంత కాలం అతను పాపాలకు దూరంగా ఉంటాడు. తరువాత అతను మళ్ళీ పాపానికి పాల్పడతాడు లేక అతని వల్ల పాపం జరుగుతుంది. అందువల్ల అతను "ప్రభూ! నా వల్ల పాపం జరిగిపోయింది. లేక నేనొక పాపానికి పాల్పడ్డాను. నన్ను క్షమించు" అని వేడుకుంటాడు మళ్ళీ. దేవుడు అది విని "పాపాలను క్షమించే తన ప్రభువు కూడా ఒకడున్నాడని నా దాసునికి తెలుసా? సరే, నేను నా దాసుడ్ని

క్షమిస్తున్నాను. (దేవుడు ఈ మాటను మూడు సార్లు అంటాడు) ఇప్పుడతను ఏదైనా చేసుకోవచ్చు" అని అంటాడు.

(సహీహ్ బుఖారీ:- 97వ ప్రకరణం - అత్తౌహీద్, 35వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (యురీదూనఅయ్యుబద్దిలూ కలామల్లాహి)

## 6వ అధ్యాయం - దేవుని ఆత్మాభిమానం

1755. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు :- దేవుడ్ని మించిన ఆత్మాభిమానం కలవారు మరెవరూ లేరు. అందువల్లనే ఆయన రహస్య, బహిరంగ, అశ్లీల విషయాలన్నిటినీ నిషేధించాడు. దేవునికి స్తుతిస్తోత్రాలకంటే ప్రియమైన విషయం మరేదీ లేదు. ఈ కారణంగానే ఆయన స్వయంగా తనను స్తుతించుకున్నాడు (ఎవరూ ప్రశంసించకపోయినా ఆయన స్వతహాగానే ప్రశంసనీయుడు).

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 6వ సూరా - అన్ ఆమ్. 7వ అధ్యాయం - వలా తఖ్రబుల్ ఫవాహిష్ మా జహ్రా మిన్‌హా వమా బతన)

1756. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :-

"దేవుడు ఎంతో అభిమానధనుడు. అందువల్లనే ఆయన తాను నిషేధించిన అధర్మ కార్యాలకు ఒక ముస్లిం పాల్పడటాన్ని సహించలేడు."

(సహీహ్ బుఖారీ:- 67వ ప్రకరణం - నికాహ్, 107వ అధ్యాయం - అల్‌గైరా)

1757. హజ్రత్ అస్మా బిన్తె అబూ బకర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- దేవుడ్ని మించిన అభిమానధనులు మరెవరూ లేరు.

(సహీహ్ బుఖారీ :- 67వ ప్రకరణం - నికాహ్, 107వ అధ్యాయం - అల్‌గైరా)

## 7వ అధ్యాయం - దైవసూక్తి "ఇన్నల్ హసనాతి యుజ్‌హిబ్నస్సయ్యిఆత్" గురించి

1758. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం :- ఒకతను ఒక స్త్రీని ముద్దాడాడు. ఆ తరువాత అతను (పశ్చాత్తాపం చెందుతూ) దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి తన పొరపాటును గురించి చెప్పుకున్నాడు. అప్పుడు ఈ సూక్తి అవతరించింది. "నమాజును నెలకొల్పండి - ఉదయం, సాయంత్రం, రాత్రి కొంత గడచిన తరువాత కూడా. నిస్సందేహంగా పుణ్యకార్యాలు పాపకార్యాలను హరించివేస్తాయి" (దివ్యఖుర్ఆన్ - 11:114). ఈ సూక్తి అవతరించిన తరువాత ఆ వ్యక్తి "దైవప్రవక్తా! ఈ ఆదేశం నాకొక్కడి కోసమేనా?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) "నా అనుచర సమాజంలోని వారందరికీ" అని చెప్పారు.

(సహీహ్ బుఖారీ:- 9వ ప్రకరణం - మవాఖీతిస్సలాహ్, 4వ అధ్యాయం - సలాతు కప్పారాహ్)

1759. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం :- నేను దైవప్రవక్త (సల్లం) సన్నిధిలో ఉన్నాను. అంతలో ఒక వ్యక్తి వచ్చి "దైవప్రవక్తా! నేను శిక్షార్హమైన ఒక నేరం చేశాను. నాకు శిక్ష

విధించండి" అని అన్నాడు. దానికి దైవప్రవక్త (సల్లం) అతడ్ని ఎలాంటి వివరాలు అడగలేదు. కాస్సేపటికి నమాజు వేళ అయింది. దైవప్రవక్త (సల్లం)తో పాటు అతను కూడా నమాజు చేశాడు. నమాజు చేశాక ఆ వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరకు వచ్చి "దైవప్రవక్తా! నేను శిక్షార్హమైన ఒక నేరం చేశాను. దైవాజ్ఞ ప్రకారం నాకు శిక్ష విధించండి" అని మళ్ళీ విన్నవించుకున్నాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "నీవు మాతోపాటు నమాజు చేయలేదా?" అని అడిగారు. దానికా వ్యక్తి చేశానన్నాడు. "అయితే దేవుడు నీ పాపాన్ని క్షమించాడు" అని అన్నారు దైవప్రవక్త (సల్లం)

**(సహీహ్ బుఖారీ:- 86వ ప్రకరణం - హుదూద్, 27వ అధ్యాయం - ఇజా అఖ్రరబిల్‌హద్ది వలమ్ యుబయ్యిన్ హల్‌లిల్ ఇమామి అఁయ్యస్తుర అలైహి)**

## 8వ అధ్యాయం - అనేక హత్యలు చేసిన హంతకుడి పశ్చాత్తాపం కూడా స్వీకరించబడుతుంది

1760. హజ్రత్ అబూసయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- ఇస్రాయీల్ సంతతికి చెందిన ఒక వ్యక్తి తొంభై తొమ్మిది హత్యలు చేశాడు. ఆ తరువాత (దాని నిష్కృతి కోసం) జనాన్ని అడుగుతూ ఒక సాధువు దగ్గరికెళ్ళి "నా పాపానికి నిష్కృతి ఉందా?" అని అడిగాడు. దానికా సాధువు లేదన్నాడు. దాంతో ఆ వ్యక్తి (వళ్ళు మండిపోయి) ఆ సాధువుని కూడా హతమార్చాడు. ఆ తరువాత అతను మళ్ళీ జనాన్ని అడుగుతూ తిరగసాగాడు. ఒకతను కలసి "నీవు ఫలానా ఊరికి వెళ్ళు. అక్కడ కొందరు దైవారాధనలో నిమగ్నులయి ఉన్నారు. వారితో కలసి నీవు కూడా దైవాన్ని ఆరాధించు. దేవుడు నీ పశ్చాత్తాపాన్ని స్వీకరిస్తాడు" అని చెప్పారు.

(ఈ మాట విని ఆ వ్యక్తి బయలుదేరాడు) అయితే దారిలోనే అతను మృత్యువాతన పడ్డాడు. అతను చనిపోతూ తన రొమ్మును ఆ ఊరి దిశకు మరల్చాడు. అతని (ఆత్మను తీసికెళ్ళే) విషయంలో కారుణ్య దైవదూతలకు, యాతన దైవదూతలకు మధ్య వివాదం చెలరేగింది. అప్పుడు దేవుడు (ఆ వ్యక్తి పాప నిష్కృతి కోసం పోదలచుకున్న) ఊరిని అతనికి దగ్గరగా జరగమని ఆదేశించాడు. అలాగే (అతను బయలుదేరిన) ఊరిని అతనికి దూరంగా జరగమని ఆదేశించాడు. ఆ తరువాత అతని (భౌతిక కాయం) నుండి ఆ రెండు ఊళ్ళు ఎంతెంత దూరం ఉన్నాయో కొలచి చూడమని దైవదూతలను ఆజ్ఞాపించాడు. కొలవడం పూర్తయ్యాక చూస్తే, ఆ వ్యక్తి (మృతదేహం) నిష్కృతికై పోయే ఊరికి ఒక జానెడు దూరం దగ్గరగా ఉన్నట్లు తేలింది. అందువల్ల దేవుడు అతని పాపాలను క్షమించాడు.

**(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 54వ అధ్యాయం - హద్దసనా అబుల్ యమాన్)**

1761. హజ్రత్ సఫ్వాన్ బిన్ ముహ్రిజ్ మాజిని (రహ్మాలై) కథనం :- నేను హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) గారి చేయి పట్టుకొని ఆయన వెంట నడచి వెళ్తున్నాను. దారిలో ఒక వ్యక్తి తారసపడి "మీరు గుసగుసలాడటం గురించి దైవప్రవక్త (సల్లం) నోట ఏం విన్నారు?"* అని అడిగాడు హజ్రత్ అబ్దుల్లా

★ అంటే, ప్రళయదినాన దేవుడు తన దాసునితో చేసే గుసగుసలు అన్న మాట, దేవుడు పాపాలు చేసిన తన దాసుడ్ని తోటి మానవుల ముందు అవమానం పాలు కాకుండా కాపాడేందుకు అతనితో ఏకాంతంలో గుసగుసలాడుతాడు. దానివల్ల అతని పాపాలు ఇతరుల ముందు బహిర్గతం కాకుండా ఉంటాయి. (సంకలనకర్త)

(రజి)ని. దానికి ఆయన "నేను దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా చెబుతుంటే విన్నానని ఇలా తెలిపారు-

దేవుడు (ప్రళయ దినాన) విశ్వాసికి దగ్గరగా వచ్చి అతడ్ని తన కారుణ్య పరదాతో కప్పివేసి "నీవు ఫలానా పాపం చేశావు కదూ?" అని అడుగుతాడు. దానికా దాసుడు "చేశాను ప్రభూ!" అని అంటాడు. (ఆ తరువాత దేవుడు మరొక పాపాన్ని గురించి అదే విధంగా అడుగుతాడు) ఇలా దేవుడు అతని పాపాలన్నిటి గురించి అడిగి, అతని చేత అంగీకరింపజేస్తాడు. దాంతో దాసుడు ఇక తనకు సర్వనాశనం తప్పదని భావించి మనస్సులో భయపడతాడు. అప్పుడు దేవుడు అతనితో "నేను ప్రపంచంలో నీ పాపాలను బయటపడకుండా దాచి ఉంచాను. అలాగే ఈ రోజు ఇక్కడ కూడా నీ పాపాలను (జనం ముందు బహిర్గతం చేయకుండా) నేను క్షమిస్తున్నాను" అని అంటాడు. అందువల్ల అతని (దుష్కర్మలను తీసివేయగా మిగిలిన) సత్కర్మల పత్రాన్ని అతని చేతికి ఇవ్వడం జరుగుతుంది. అయితే అవిశ్వాసులు, కపటుల సంగతి వేరు (వారి విషయంలో సాక్షులు రప్పించబడతారు). ఆ సాక్షులు (వచ్చి) "వీరు తమ ప్రభువును గురించి అబద్ధమాడారు (దైవప్రవక్తలను నిరాకరించి తమ పైనే దౌర్జన్యం చేసుకున్నారు). కనుక దౌర్జన్యపరులపై దైవశాపం విరుచుకుపడుగాక!" అని అంటారు.

(సహీహ్ బుఖారీ:- 46వ ప్రకరణం - మజాలిమ్, 2వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (అలా లానతుల్లాహి అలజ్జాలిమీన్)

## 9వ అధ్యాయం - హజ్రత్ కాబ్ బిన్ మాలిక్ (రజి), ఆయన సహచరుల పశ్చాత్తాప వృత్తాంతం

1762. హజ్రత్ కాబ్ బిన్ మాలిక్ (రజి) కథనం :- నేను ఒక్క తబూక్ యుద్ధంలో తప్ప మరే యుద్ధంలోనూ దైవప్రవక్త (సల్లం)ను వదలి వెనకుండిపోలేదు. అయితే బద్ర్ యుద్ధంలో కూడా నేను పాల్గొనలేదు. బద్ర్ యుద్ధంలో పాల్గొనని కారణంగా దేవుడు ఏ వ్యక్తినీ ఆగ్రహించలేదు. బద్ర్ యుద్ధ సమయంలో దైవప్రవక్త (సల్లం) ఖురైషీయుల వర్తక బిడారాలపై దాడి చేయడానికి బయలుదేరారు. (అప్పుడు ఆయనకు యుద్ధం చేసే ఉద్దేశ్యం లేదు) కాని దేవుడు సమయం నిర్ణయించకుండా శత్రువుల్ని హఠాత్తుగా ముస్లింల ముందుకు తెచ్చి నిలబెట్టాడు. నేను ఉఖ్బా ప్రమాణం సందర్భంలో కూడా దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చాను. అప్పుడు మేము ఇస్లాం స్వీకరిస్తామని ప్రమాణం చేశాము. ప్రజల దృష్టిలో బద్ర్ యుద్ధం ఉఖ్బా ప్రమాణం కన్నా విలువయినదైనప్పటికీ నాకు బద్ర్ యుద్ధం కంటే ఉఖ్బా ప్రమాణమే ఎంతో ప్రియమైనది.

(తబూక్ దండయాత్రలో పాల్గొనకపోవడానికి కారణమయిన) నా గాథ ఇలా ఉంది : తబూక్ దండయాత్రలో పాల్గొనకుండా వెనకుండిపోయిన రోజుల్లో నేను ఎంతో ఆరోగ్యంగా, సిరి సంపదలతో తులతూగుతూ ఉన్నాను. అంతకు ముందెన్నడూ నా దగ్గర రెండు ఒంటెలు కూడా ఉండేవి కావు. తబూక్ రోజుల్లో నా దగ్గర (అనేక సంపదలతో పాటు రెండు ఒంటెలు కూడా ఉన్నాయి. సాధారణంగా దైవప్రవక్త (సల్లం) యుద్ధం చేయడానికి ఎక్కడికయినా వెళ్ళదలచుకుంటే ఆ ప్రాంతాన్ని గురించి ఫలానా ప్రాంతమని ఖచ్చితంగా చెప్పకుండా అస్పష్టమైన మాటల్లో* చెప్పేవారు. దాని వల్ల ప్రజలు

★ ఇక్కడ మూలభాషలో 'తౌరియా' అనే పదం వచ్చింది. తౌరియా అంటే శాబ్దిక భాష్యం ద్వంద్వార్థాన్ని కలిగించడం. పరిభాషలో తౌరియా అంటే ద్వంద్వార్థాన్నిచ్చే పదాన్ని వాడటం. ఇందులో ఒక అర్థం అత్యధికంగా ఉపయోగించబడేది. రెండో అర్థం తక్కువగా ఉపయోగించబడేది. దీన్నే తెలుగులో అస్పష్టమైన మాట అని అనువదించాము. తౌరియా పదాన్ని ఉపయోగించేటప్పుడు అది పైకి ఒక అర్థాన్నిస్తుంది. అయితే ఆ మాట చెప్పే వ్యక్తి దృష్టిలో దాని అర్థం మరొక విధంగా ఉంటుంది. (అనువాదకుడు)

ఆయన నిర్ణయించుకున్న ప్రాంతం కాకుండా మరో ప్రాంతమని భావించేవారు. అయితే తబూక్ దండయాత్ర కోసం ఆయన ప్రాంతం స్పష్టంగా నిర్ణయించారు. దాని సన్నాహాలు నడి ఎండాకాలంలో (తీవ్రమైన వేసవిలో) ప్రారంభించారు. సుదూర ప్రయాణం, జన సంచారం లేని, నీటి బొట్టు సయితం లభించని భయంకర మార్గం. శత్రు సంఖ్య కూడా అపారంగా ఉంది. అందువల్ల దైవప్రవక్త (సల్లం) ముస్లింలకు దండయాత్రను గురించి పూర్తి వివరాలు స్పష్టంగా చెప్పేశారు. యుద్ధ సన్నాహాలు పూర్తి చేసుకోవడానికి వీలుగా ప్రయాణ దిశ కూడా తెలియజేశారు.

ముస్లిం యోధులు వారి పేర్లు పుస్తకంలో నమోదు చేయడానికి వీలు లేనంత అత్యధిక సంఖ్యలో ఉన్నారు. అంచేత యుద్ధానికి ఎగనామం పెట్టదలచుకున్నవాడు, తనను గురించి దైవ సంకేతం ద్వారా దైవప్రవక్త (సల్లం)కు తెలియవస్తే తప్ప మరెవరికీ తెలియదని భావించగలిగేవాడు. కాని ముస్లిం యోధులెవరూ అలా చేయకుండా అమితోత్సాహంతో ఈ దండయాత్రకు సిద్ధమయ్యారు. ఈ యుద్ధం గురించి దైవప్రవక్త (సల్లం) నిర్ణయం తీసుకునేటప్పటికి తోటలలో కాయలు పండి కోతకు వచ్చాయి. ప్రతి వ్యక్తీ (ఆ వేసవిలో) నీడ పట్టున ఉండాలని కోరుకుంటాడు. అయితే దైవప్రవక్త (సల్లం) యుద్ధ సన్నాహాలు పూర్తి చేయడం వల్ల ఆయనతో పాటు ముస్లింలు కూడా ద్విగుణీకృత ఉత్సాహంతో యుద్ధ సన్నాహాలు పూర్తి చేసుకున్నారు. తోటి ముస్లింలతో పాటు నేను కూడా యుద్ధ సన్నాహాలు చేసుకుందామని భావించి ఉదయం (తోటకు) బయలుదేరేవాడ్ని. కాని సాయంత్రం తిరిగొచ్చిన తరువాత ఎలాంటి నిర్ణయం తీసుకోలేకపోయేవాడ్ని. 'వ్యవధి ఇంకా ఉంది కదా, సన్నాహాలు పూర్తి చేసుకోవడానికి నాకెంతో సమయం పట్టద'ని మనసులో అనుకునేవాడ్ని. ఈ విధంగా రోజులు గడచిపోసాగాయి. చివరికి ప్రజలు ప్రయాణ సన్నాహాలు పూర్తి చేసుకొని ఓ రోజు ఉదయం దైవప్రవక్త (సల్లం)తో కలసి బయలుదేరారు. నేనప్పటిదాకా ఎలాంటి సన్నాహాలూ చేసుకోలేదు. 'దైవప్రవక్త (సల్లం) బయలుదేరిన ఒకటి రెండు రోజుల తరువాతయినా సన్నాహాలు ముగించుకొని (వేగంగా వెళ్ళి) ఆయన్ని కలుసుకోగలను' అని మనసులో భావించేవాడ్ని. కాని ఆయన వెళ్ళిపోయిన తరువాత కూడా నా పరిస్థితి అలాగే ఉండిపోయింది. సన్నాహాలు చేసుకుందామని తలచి ఉదయం బయలుదేరేవాడ్ని. కాని సాయంత్రం తిరిగొచ్చి ఏమీ చేయలేకపోయేవాడ్ని. చూస్తూ చూస్తూ ఉండగానే ఈ విధంగా మరికొన్ని రోజులు గడచిపోయాయి. అటు ముస్లింలు చకచకా నడచి చాలా దూరం వెళ్ళిపోయారు. నేనెలాగయినా బయలుదేరి వారిని కలుసుకుందామని మళ్ళీ భావించాను. అప్పుడైనా అలా చేసి ఉంటే బాగుండేది. కాని నాకా అదృష్టం దక్కలేదు.

దైవప్రవక్త (సల్లం) వెళ్ళిపోయిన తరువాత నేను (మదీనా) పట్నంలో తిరిగి చూస్తే నాకు కపట విశ్వాసులు, వృద్ధులు, బలహీనులు, పిల్లలు మాత్రమే (వీధుల్లో) కన్పించేవారు. దాంతో నాకు దుఃఖం ఉబికి వచ్చేది. అటు దైవప్రవక్త (సల్లం) కూడా తబూక్ చేరుకునేదాకా నా గురించి పట్టించుకోలేదు. తరువాత ఓసారి ఆయన తమ అనుచరుల మధ్య కూర్చుని "కాబ్ బిన్ మాలిక్ (రజి) ఏడి, రాలేదా?" అని అడిగారు. బనీసల్మా తెగకు చెందిన ఒకతను లేచి "దైవప్రవక్తా! స్వస్థత మరియు సిరిసంపదల తెరలు అతన్ని రాకుండా ఆపేశాయి. ఆ తెరల అంచుల్ని చూసుకుంటూ అతను

మురిసిపోతున్నాడు" అని సమాధానమిచ్చాడు. హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ (రజి) ఈ మాట విని "నువ్వు చాలా అన్యాయంగా మాట్లాడుతున్నావు. దైవప్రవక్తా! దైవసాక్షిగా చెబుతున్నాను. కాబ్ బిన్ మాలిక్ (రజి)లో మాకు మంచితనం తప్ప మరేమీ కన్పించలేదు" అని అన్నారు. ఈ మాటలు విని దైవప్రవక్త (సల్లం) మౌనంగా ఉండిపోయారు.

ఆ తరువాత ఓరోజు నాకు దైవప్రవక్త (సల్లం) దండయాత్ర నుంచి తిరిగొస్తున్నారని తెలిసింది. దాంతో నేను కంగారు పడిపోయాను. తీవ్రమైన ఆలోచనల్లో పడిపోయాను. కుంటిసాకులు వెతకడానికి ప్రయత్నించాను. దైవప్రవక్త (సల్లం) ఆగ్రహం నుండి తప్పించుకోవడానికి ఎలాంటి సాకు చెబితే బాగుంటుందా అని పరిపరి విధాలా ఆలోచించాను. ఈ విషయంలో నేను నా సన్నిహితులు, బంధువుల్లోని మేధావుల్ని కూడా సంప్రదించాను. కాని దైవప్రవక్త (సల్లం) మదీనాకు అతి సమీపంగా వచ్చారని తెలియగానే, నా మనస్సులోని సాకులు, కల్లబొల్లి ఆలోచనలన్నీ పటాపంచలయిపోయాయి. నేను అసత్యాలు, అభూత కల్పనలతో దైవప్రవక్త (సల్లం) ఆగ్రహం నుండి తప్పించుకోవడం సాధ్యం కాదని భావించాను. ఏది ఏమయినా ఉన్నది ఉన్నట్లు నిజమే చెప్పాలని గట్టిగా నిర్ణయించుకున్నాను.

దైవప్రవక్త (సల్లం) ఓ రోజు ఉదయం వేళ పట్నంలో ప్రవేశించారు. ఆయన సాధారణంగా ప్రయాణం నుండి తిరిగొచ్చిన తరువాత ముందుగా మస్జిద్‌కు వెళ్ళి రెండు రకాతులు నమాజు చేస్తారు. ఆ తరువాత ప్రజలతో సమావేశమవుతారు. దాని ప్రకారమే ఆయన ఆ రోజు నమాజు చేసిన తరువాత ప్రజలతో సమావేశమయ్యారు. ఆయన్ని కలుసుకోవడానికి యుద్ధానికి వెళ్ళకుండా ఉండిపోయిన వారు రావడం ప్రారంభించారు. వారు ఒట్లు వేసుకొని మరీ రకరకాల సాకులు చెప్పడం మొదలెట్టారు. అలా సాకులు చెప్పిన వాళ్ళు ఎనభై మందికి పైగానే ఉన్నారు. దైవప్రవక్త (సల్లం), వారు చెప్పిన సాకుల్ని ఒప్పుకున్నారు (కుంటి సాకులని నిరాకరించలేదు). వారి చేత ప్రమాణం చేయించుకున్నారు. వారి మనో సంకల్పాల సంగతి దేవునికి వదిలేసి, వారి మన్నింపు కోసం దుఆ చేశారు.

(చివరికి నా వంతు కూడా వచ్చింది) నేను దైవప్రవక్త (సల్లం) ముందుకు వెళ్ళి ఆయనకు సలాం చేశాను. ఆయన నన్ను చూసి చిరునవ్వు చిందించారు. అందులో ఆగ్రహ చిహ్నాలు లేవు. ఆయన 'ఇటురా' అన్నారు. నేను ఇంకాస్త ముందుకు వెళ్ళి ఆయన కెదురుగా కూర్చున్నాను. ఆయన నావైపు చూస్తూ "నీవు (యుద్ధానికి రాకుండా) ఎందుకు వెనకుండి పోయావు? స్వారీ జంతువుని కూడా కొన్నావు కదా!" అని అడిగారు.

దానికి నేనిలా అన్నాను : "ఔను, అందులో ఎలాంటి సందేహం లేదు. నేను దైవసాక్షిగా చెబుతున్నాను. మీ బదులు ఏ ప్రాపంచిక నాయకుడి ముందో సమాధానం చెప్పవలసి వస్తే, నేను తప్పకుండా ఏదో ఒక సాకు చెప్పి అతని ఆగ్రహం నుండి తప్పించుకోగలిగేవాడ్ని. మాట్లాడటం, వాటికి హేతువులు చూపడం నాకూ తెలుసు. కాని ఈ రోజు నేను మీ ముందు అబద్ధం చెప్పి మీ మెప్పు కూడా పొందగలిగితే ఆ తరువాత త్వరలోనే దేవుడు మీకు వాస్తవం తెలియజేస్తాడు. అప్పుడు మీరు మళ్ళీ నా మీద ఆగ్రహం వెలిబుచ్చుతారు. దానికి బదులు నేను ఉన్నది ఉన్నట్లు నిజం చెబితే మీకు నా మీద కోపం రావచ్చు గాని, దేవుడు మాత్రం నా బలహీనతను మన్నిస్తాడని నాకు ఆశ ఉంది.

దైవసాక్షిగా చెబుతున్నాను. నాకెలాంటి ఇబ్బందులు ఆటంకాలు లేవు. పైగా నేను ఆర్థికంగా, ఆరోగ్యపరంగా ఇదివరకెన్నడూ లేనంత సుఖంగా, దృఢంగా ఉన్నాను. (అయినప్పటికీ నేను యుద్ధానికి బయలుదేరకుండా సోమరితనం వహించి పెద్ద తప్పు చేశాను)."

దైవప్రవక్త (సల్లం) నా సమాధానం విని "ఇతను చెప్పింది నిజమే" అని అన్నారు. తరువాత నా వైపుకు తిరిగి "సరే వెళ్ళు. నీ విషయంలో దేవుడు ఏదైనా ఆజ్ఞ పంపే వరకూ వేచి చూడు" అని అన్నారు. నేను లేచి అక్కడ్నుంచి వెళ్తుంటే, బనీ సల్మా తెగ వాళ్ళు కొందరు నా వెనకాల వచ్చి ఇలా అన్నారు: "నీవు ఈనాటి వరకూ ఏదైనా పాపం చేసినట్లు మేము చూడలేదు. అలాంటప్పుడు వెనకుండిపోయిన వారు చెప్పినట్లు నువ్వు కూడా దైవప్రవక్త (సల్లం)కు ఏదో ఒక సాకు ఎందుకు చెప్పలేదు? నీవు చేసిన ఈ పొరపాటుకు దైవప్రవక్త (సల్లం) చేసే మన్నింపు ప్రార్థన సరిపోదా?"

దైవసాక్షి! వాళ్ళు నన్ను ఎంతగానో నిందించారు. వారి నిందలకు తట్టుకోలేక నేనొక సందర్భంలో మళ్ళీ దైవప్రవక్త (సల్లం) దగ్గరికెళ్ళి, నేను మీకు చెప్పినదంతా అబద్ధమనీ, (ఏదైనా సాకు చూపించి) చెబుదామని కూడా భావించాను. తరువాత నేను వారితో మాట్లాడుతూ "ఇలాంటి సమస్య నాతోపాటు మరెవరికైనా వచ్చిందా?" అని అడిగాను. దానికి వారు "ఇంకా ఇద్దరున్నారు. నువ్వు చెప్పినట్లే వారూ నిజం చెప్పారు. దైవప్రవక్త (సల్లం) నుంచి నీకు లభించినటువంటి సమాధానమే వారిక్కూడా లభించింది" అని అన్నారు. "ఎవరు వారిద్దరూ?" అని నేను అడిగాను. "ఒకతను మురార బిన్ రబీయిల్ అమ్రి (రజి), రెండవతను హిలాల్ బిన్ ఉమయ్యా వాఖిఫీ (రజి)" అన్నారు వాళ్ళు. వారు ప్రస్తావించిన ఇద్దరు వ్యక్తులు బద్ర్ యుద్ధంలో పాల్గొన్నారు, చాల మంచివాళ్ళు. అందువల్ల ఈ వ్యవహారంలో నేను వారితోపాటు చేరి ఉండటం నాకు తృప్తినిచ్చింది. (అందుచేత నేను తిరిగి దైవప్రవక్త (సల్లం) దగ్గరికెళ్ళి సాకు చెబుదామనుకున్న ఉద్దేశ్యాన్ని విరమించుకున్నాను) నేను (వాళ్ళ చెర నుండి విడిపించుకొని) ముందుకు సాగాను.

వెనకుండిపోయిన వారిలో మా ముగ్గురితో (మాత్రమే) ఎవరూ మాట్లాడకూడదని దైవప్రవక్త (సల్లం) ప్రజలను ఆదేశించారు. దాంతో జనం మాతో మాట్లాడకుండా దూరదూరంగా మసలుకోసాగారు. మా ముగ్గురి విషయంలో వారు చాలా మారిపోయారు. వారి ధోరణి చూస్తుంటే "నేను (నా స్వస్థలంలో గాకుండా) మరేదయినా కొత్త ప్రదేశంలో ఉన్నానా?" అన్పించింది నాకు. ఈ విధంగా మేము యాభై రోజులు గడిపాము.

నా సహచరులిద్దరు (ఈ పరిస్థితిని భరించలేక) విసిగిపోయి బయటకి రాకుండా ఇంట్లోనే కూర్చుండిపోయారు. ఇంట్లో కూర్చొని (రేయింబవళ్ళు) కన్నీరు మున్నీరుగా దుఃఖించసాగారు. నేను వారిద్దరికన్నా యువకుడ్ని, బలవంతుడ్ని. అందువల్ల నేను సంకోచించకుండా బయటికి వెళ్ళి తోటి ముస్లింలతో కలసి నమాజు చేసేవాడ్ని, వీధుల్లో తిరిగేవాడ్ని. అయితే నాతో ఏ ఒక్కరూ మాట్లాడేవారు కాదు. దైవప్రవక్త (సల్లం) నమాజు ముగిసిన తరువాత ప్రజలతో సమావేశమయ్యేటప్పుడు నేను ఆయన సన్నిధిక్కూడా వెళ్ళేవాడిని. నేను ఆయనకు సలాం కూడా చేసేవాడ్ని. దానికి ప్రతి సలాంగా

ఆయన (సల్లం) పెదవుల్లో ఏదైనా కదలిక కన్పిస్తుందేమోనని ఎదురు చూసేవాడ్ని. ఆయనకు దగ్గరగా నిలబడి నమాజు చేస్తూ ఓర కంటితో ఆయన వైపు చూసేవాడ్ని. నేను ఎటూ చూడకుండా నమాజు పై దృష్టి కేంద్రీకరించినప్పుడు ఆయన నా వైపు చూసేవారు. నేను ఆయన వైపు చూడగానే ఆయన నా నుండి దృష్టి మరల్చి వేరే వైపుకు చూసేవారు.

ఈ విధంగా కొంత కాలం గడచిపోయింది. రాను రాను మా పట్ల ప్రజల వైఖరి కఠినమై జీవితం దుర్భరమయిపోయింది. అందువల్ల నేను ఒక రోజు అబూ ఖతాదా (రజి) ఇంటి ప్రహరీ గోడ దూకి లోపలికి వెళ్ళాను. అబూ ఖతాదా (రజి) నా పినతండ్రి కొడుకు; నా ప్రియమిత్రుడు కూడా. నేను అతనికి సలాం చేశాను. కాని దైవసాక్షి! అతను నాకు ప్రతి సలాం కూడా చేయలేదు. నేనతనితో "అబూ ఖతాదా (రజి)! దేవుని మీద ప్రమాణం చేసి అడుగుతున్నాను. నాకు దేవుని మీద, దైవప్రవక్త (సల్లం) మీద అభిమానం లేదని నీవు భావిస్తున్నావా, చెప్పు" అని అడిగాను. దానికీ అతను ఎలాంటి సమాధానం ఇవ్వలేదు. నేనతడ్ని మళ్ళీ అదే ప్రశ్న అడిగాను. అతను మళ్ళీ మౌనంగా ఉండిపోయాడు. నేను తిరిగి అదే ప్రశ్న అడిగాను. అప్పుడతను "దేవునికి, ఆయన ప్రవక్త (సల్లం)కే బాగా తెలుసు" అని అన్నాడు. ఈ మాట విని నాకు దుఃఖం పొర్లుకొచ్చింది. నేనిక చేసేది లేక తిరిగి గోడ దూకి బయటికి వచ్చాను.

ఓ రోజు నేను మదీనా వీధిలో నడచి వెళ్తుంటే సిరియా నుండి ధాన్యం అమ్ముకోవడానికి వచ్చిన ఒక రైతు కన్పించాడు. అతను నా గురించి "కాబ్ బిన్ మాలిక్ (రజి) ఇల్లెక్కడ?" అని అడుగుతుంటే ప్రజలు నా వైపు సైగ చేసి చూపించారు. అతను నా దగ్గరకు వచ్చి గస్సాన్ రాజు పంపిన ఒక లేఖ నా చేతికి అందించాడు. అందులో ఈ విధంగా ఉంది - "మీ ప్రవక్త గారు మిమ్మల్ని చాలా బాధ పెట్టినట్లు నాకు తెలిసింది. మీరిలా అవమానం పాలయి, నాశనం కావడానికి దేవుడు మిమ్మల్ని పుట్టించలేదు. కనుక మీరు మా దగ్గరికి రండి, మేము మీ స్థాయికి తగిన విధంగా మిమ్మల్ని సత్కరించి గౌరవిస్తాము."

నేనీ ఉత్తరం చదివిన తరువాత "ఇది కూడా నాకొక పరీక్ష అయింద"ని భావించి వెంటనే దాన్ని పొయ్యిలోకి విసరి కాల్చివేశాను.

యాభై రోజుల్లో నలభై రాత్రులు గడచిన తరువాత దైవప్రవక్త (సల్లం) దగ్గర్నుంచి ఒక వార్తాహరుడు వచ్చి "నీవు నీ భార్యకు కూడా దూరంగా ఉండాలని దైవప్రవక్త (సల్లం) ఆదేశించారు" అని అన్నాడు. "నేనామెకు విడాకులివ్వాల్నా? లేక మరెలా చెయ్యాలి?" అని అడిగాను నేను. అతను "విడాకులివ్వనవసరం లేదు. ఆమెకు దూరంగా ఉండు, ఆమె దగ్గరకు వెళ్ళకు" అని చెప్పాడు. ఇలాంటి ఆజ్ఞే నా సహచరులిద్దరికి కూడా జారీ చేయబడింది. నేను నా భార్యతో "నీవు నీ పుట్టింటికి వెళ్ళిపో. నా వ్యవహారంలో దేవుని ఆజ్ఞ వచ్చేవరకు నీవు అక్కడే ఉండిపో" అని అన్నాను.

అయితే హిలాల్ బిన్ ఉమయ్యా (రజి) భార్య దైవప్రవక్త (సల్లం) దగ్గరికెళ్ళి "దైవప్రవక్తా! హిలాల్ బిన్ ఉమయ్యా (రజి) పండు ముసలివాడైపోయాడు. ఆయనకు సేవకులు కూడా ఎవరూ

లేరు. నేనే ఆయనకు సేవ చేస్తున్నాను. ఈ పని కూడా చేయకూడదంటారా?" అని అడిగింది. దానికి దైవప్రవక్త (సల్లం) "అది కాదు. నీవు అతని దగ్గరకు వెళ్ళకూడదని మాత్రమే చెబుతున్నాను" అని అన్నారు. ఆ మాటకు ఆమె "దైవసాక్షి! ఆయనకు ఆ ఆలోచనే లేదు. ఈ సంఘటన జరిగిన దగ్గర్నుంచి ఆయన పుట్టెడు దుఃఖంతో చాలా బాధపడుతున్నారు" అని అన్నది.

నా వంశస్థులు కొందరు ఈ సంగతి తెలిసి "దైవప్రవక్త (సల్లం) హిలాల్ (రజి) భార్యకు సేవ చేయడానికి అనుమతి ఇచ్చారు కదా! అలాగే నువ్వు కూడా దైవప్రవక్త (సల్లం) దగ్గరికెళ్ళి నీ భార్య విషయంలో అనుమతి తీసుకుంటే బాగుంటుంది" అని సలహా ఇచ్చారు నాకు. కాని "దైవసాక్షి! నేను ఎట్టి పరిస్థితిలోనూ దైవప్రవక్త (సల్లం)ను అనుమతి అడగను. నేను యువకుడ్ని (హిలాల్ (రజి) మాదిరిగా నేను ముసలి వాడ్ని కాను). అనుమతి అడిగితే ఆయన ఏం సమాధానం ఇస్తారో తెలియదు" అని అన్నాను నేను.

ఆ తరువాత మరో పది రోజులు గడచిపోయాయి. దైవప్రవక్త (సల్లం) మా ముగ్గురితో మాట్లాడవద్దని ప్రజలను ఆదేశించినప్పటి నుండి పూర్తిగా యాభై రోజులు గడచిపోయాయి. యాభయ్యో రోజు ఉదయం నేను మా ఇంటి కప్పుపై ఫజ్ర్ నమాజు చేసి కూర్చున్నాను. అప్పుడు నా పరిస్థితి దేవుడు (ఖుర్‌ఆన్‌లో) ప్రస్తావించినట్లు, నేను నా పట్ల విసిగిపోయాను. భూమి అంత విశాలంగా ఉన్నప్పటికీ నాకది ఎంతో ఇరుకైపోయింది. అంతలో సలా కొండ మీది నుంచి ఎవరో బిగ్గరగా కేకవేస్తూ "కాబ్ బిన్ మాలిక్! ఇక ఆనందోత్సవాలు జరుపుకో" అని అన్నారు. నేను వెంటనే నా ఆపద కాలం ముగిసిందని గ్రహించి, అప్రయత్నంగా సాష్టాంగపడ్డాను.

దైవప్రవక్త (సల్లం) ఫజ్ర్ నమాజు చేసిన తరువాత "దేవుడు వారి (ముగ్గురి) పశ్చాత్తాపాన్ని స్వీకరించాడ"ని ప్రకటించారు. ఈ ప్రకటన వినగానే ప్రజలు మాకు శుభాకాంక్షలు తెలియజేయడానికి (తండోపతండాలుగా) బయలుదేరారు. కొందరు నా సహచరులిద్దరి ఇండ్లకు వెళ్ళిపోయారు. ఒకతను గుర్రాన్ని దౌడు తీయిస్తూ నా వైపు రాసాగాడు. మరొకతను అస్లం తెగకు చెందిన వ్యక్తి తొందర తొందరగా ఒక కొండెక్కాడు. అతని కంఠ ధ్వని గుర్రం కన్నా వేగంగా వెడలి (నా కర్ణపుటాలకు తాకి)ంది. ఆ తరువాత అతను నా దగ్గరకు వచ్చాడు (అందరికన్నా ముందు) నాకు శుభవార్త తెలిపినందుకు బహుమతిగా నేనతనికి నా ఒంటి మీది బట్టలు తీసిచ్చాను. దైవసాక్షి! ఆ రోజు నా దగ్గర ఆ బట్టలు తప్ప మరేమీ లేవు. అందువల్ల నేను మరో జత బట్టలు అప్పుగా తీసుకొని తొడుక్కొని దైవప్రవక్త (సల్లం) సన్నిధికి బయలుదేరాను. దారిలో జనం జట్లు జట్లుగా ఎదురయి "శుభం నీకు. దేవుడు నీ పశ్చాత్తాపాన్ని స్వీకరించి నిన్ను క్షమించాడు" అని చెబుతూ పోయారు.

నేను మస్జిద్‌కు చేరుకున్నాను. అక్కడ దైవప్రవక్త (సల్లం) ప్రజల మధ్య కూర్చొని ఉన్నారు. హజ్రత్ తల్హా బిన్ ఉబైదుల్లా (రజి) నన్ను చూడగానే పరుగెత్తుకుంటూ వచ్చి నాకు శుభాకాంక్షలు తెలిపారు. దైవసాక్షి! ముహాజిర్ ముస్లింలలో తల్హా (రజి) తప్ప మరెవరూ ఆ విధంగా లేచి నా వైపుకు రాలేదు. ఆయన ప్రవర్తనను నేనెన్నటికీ మరువలేను.

నేను వెళ్ళగానే దైవప్రవక్త (సల్లం)కు సలాం చేశాను. ఆయన వికసించిన ముఖారవిందంతో "ఈ రోజు నీకు శుభం కలుగు గాక! నీవు పుట్టిన రోజు నుంచి నేటి వరకు జరిగిపోయిన రోజుల్లో ఈ రోజు నీ కోసం ఎంతో శ్రేష్ఠమైన రోజు" అని అన్నారు సంతోషం వెలిబుచ్చుతూ. అప్పుడు నేను "దైవప్రవక్తా! ఈ క్షమాభిక్ష నాకు మీ తరపున లభించిందా లేక దేవుని తరపున లభించిందా?" అని అడిగాను. దానికి ఆయన "నా తరపున కాదు, దేవుని తరపు నుండే వచ్చింది" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) సంతోషంగా ఉన్నప్పుడు ఆయన ముఖ వర్ఛస్సు పున్నమి చంద్రునిలా మెరసిపోతూ ఉంటుంది. దాన్ని బట్టి మేము ఆయన చాలా సంతోషంగా ఉన్నారని భావించేవాళ్ళము.

నేను దైవప్రవక్త (సల్లం) ముందు కూర్చొని "దైవప్రవక్తా! నాకీ క్షమాభిక్ష లభించినందుకు కృతజ్ఞతగా నేను నా ఆస్తి నంతటినీ దేవుని కోసం దైవప్రవక్త (సల్లం) కోసం దానం చేయాలనుకుంటున్నాను" అని అన్నాను. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "అంతా వద్దు. కొంత ధనం నీ దగ్గర పెట్టుకుంటే మంచిది" అని అన్నారు. "సరే, ఖైబర్‌లో నాకు లభించిన వాటాను నేను అట్టిపెట్టుకుంటాను" అన్నాను నేను. ఆ తరువాత నేను "దైవప్రవక్తా! నేను నిజం చెప్పినందుకు దేవుడు నాకు విముక్తి కలిగించాడు. అందుచేత నేనిక జీవించి ఉన్నంత కాలం ఎల్లప్పుడు నిజమే చెబుతుంటానని ఈ శుభ తరుణంలో వాగ్దానం చేస్తున్నాను. దైవసాక్షి! కేవలం నిజం చెప్పిన కారణంగా దేవుడు నన్ను కటాక్షించినంతగా మరే ముస్లింని కటాక్షించి ఉండడని నేను భావిస్తున్నాను. ఈ వ్యవహారంలో దైవప్రవక్త (సల్లం) ముందు ఉన్నది ఉన్నట్లు నిజం చెప్పిన రోజు నుంచి ఈనాటి వరకు నేను ఎప్పుడూ కావాలని అబద్ధమాడలేదు. ఇక ముందు కూడా బ్రతికి ఉన్నంత కాలం నేను అబద్ధమాడకుండా దేవుడు నన్ను రక్షిస్తూ ఉంటాడని ఆశిస్తున్నాను.

దేవుడు (ఈ సంఘటన గురించి) దైవప్రవక్త (సల్లం) పై ఈ క్రింది సూక్తుల్ని అవతరింపజేశాడు: "దేవుడు తన ప్రవక్త (సల్లం)ను, కష్టకాలంలో ఆదుకొని అతనికి తోడుగా నిలిచిన ముహాజిర్‌లను, అన్సారులను మన్నించాడు. వారిలో కొందరి హృదయాలు అపమార్గం వైపుకు మొగ్గినప్పటికీ (అటువైపు పోకుండా ప్రవక్తకు మాత్రమే తోడుగా నిల్చున్నందున) వారిని దేవుడు క్షమించాడు. నిస్సందేహంగా దేవుడు వారి విషయంలో అపార వాత్సల్యంతో, అమితమైన దయతో వ్యవహరించాడు. ఇక వ్యవహారం వాయిదా వేయబడిన ఆ ముగ్గురిని కూడా దేవుడు క్షమించాడు. భూమి ఎంతో విశాలంగా ఉన్నప్పటికీ అది వారికి చాలా ఇరుకయిపోయింది. చివరికి వారి ప్రాణాలే వారికి భారమయిపోయాయి. దేవుని పట్టు నుండి తప్పించుకోవడానికి స్వయంగా ఆయన కారుణ్య ఒడి తప్ప ఎలాంటి ఆశ్రయం లేదని వారు తెలుసుకున్నారు. అప్పుడు దేవుడు వారు తన వైపుకు మరలి వచ్చేందుకుగాను దయతో వారివైపుకు మరలాడు. నిస్సందేహంగా దేవుడు గొప్ప క్షమాశీలి, అమిత దయామయుడు. (కనుక) విశ్వాసులారా! దేవునికి భయపడండి. సత్యవంతులకు తోడ్పడండి."

(దివ్య ఖుర్‌ఆన్ : 9:117-119)

దైవసాక్షిగా చెబుతున్నాను. ఇస్లాం స్వీకరణ భాగ్యం ప్రసాదించిన తరువాత దేవుడు నాకు

చేసిన ఉపకారాలలో దైవప్రవక్త (సల్లం) ముందు ఆయన నాకు ప్రసాదించిన 'నిజం చెప్పే సద్బుద్ధి' ఎంతో గొప్ప ఉపకారం. నా దృష్టిలో దీనికి మించిన మహోపకారం లేదు. ఆయన నాకు అబద్ధం నుండి రక్షించాడు. నేనొక వేళ అబద్ధమాడితే ఇతరుల (కపట విశ్వాసుల) మాదిరిగా నేను సర్వనాశనమయ్యేవాడ్ని. వారు అబద్ధమాడి (పరలోకం దృష్ట్యా) సర్వనాశనమయ్యారు. దేవుడు (తన గ్రంథంలో వారిని గురించి తీవ్రమైన పదాలను అవతరింపజేశాడు. అంతటి తీవ్రమైన పదాలను మరెవరి గురించీ అవతరింపజేయలేదు. ఆ దైవ సూక్తులు ఇలా ఉన్నాయి :

"నీవు (యుద్ధం నుండి) తిరిగొచ్చిన తరువాత వారు నీ దగ్గరకు వచ్చి, దేవుని మీద ప్రమాణం చేసి మరీ రకరకాల సాకులు చెబుతారు. నీవు వారిపట్ల చూచీ చూడనట్లుగా (స్థూల దృష్టితో) వ్యవహరిస్తావని. కనుక నీవు వారిని అసలు పట్టించుకోకు. ఎందుకంటే వారొక మాలిన్యం వంటి వారు. వారి అసలు స్థానం నరకం. వారి దుష్ట సంపాదనకు ప్రతిఫలంగా అదే వారికి లభించే మహాభాగ్యం! నీవు వారి పట్ల సంతృప్తి పడతావని వారు నీ దగ్గరకు వచ్చి (ఇలా) ప్రమాణాలు చేస్తారు. కాని నీవు వారి పట్ల సంతృప్తి చెందినా దేవుడు మాత్రం అలాంటి దుర్మార్గుల పట్ల ఎన్నటికీ సంతృప్తి చెందడు" (9: 95, 96).

దైవప్రవక్త (సల్లం) మా ముగ్గురి వ్యవహారాన్ని వాయిదా వేసి, అసత్య ప్రమాణాలతో సాకులు చెప్పిన వారి వ్యవహారాన్ని పరిష్కరించారు. వారి చేత ప్రమాణం చేయించి, వారి పాప మన్నింపు కోసం దైవాన్ని ప్రార్థించారు. మా వ్యవహారాన్ని మాత్రం తాత్కాలికంగా నిలిపివేశారు. చివరికి మా వ్యవహారాన్ని దేవుడు (స్వయంగా) పరిష్కరించాడు. ఆయన (తన గ్రంథంలో) ఇలా పేర్కొన్నాడు : "వ్యవహారం వాయిదా వేయబడిన ఆ ముగ్గురిని కూడా దేవుడు క్షమించాడు". ఈ సూక్తిలో "ఖుల్లిఫూ" అనే పదానికి అర్థం, వారు యుద్ధానికి బయలుదేరకుండా వెనకుండి పోయేలా చేయబడ్డారు అని కాదు. వారిని (తాత్కాలికంగా) వదలెయ్యడం జరిగిందని, వారి వ్యవహారం వాయిదా వేయబడిందని, ప్రమాణం చేసి సాకులు చెప్పిన వారి కారణాలను అంగీకరించడం జరిగిందని దీని అర్థం.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజీ, 79వ అధ్యాయం - హదీసి కాబ్ బిన్ మాలిక్ (రజి) వ ఖౌలిల్లాహి అజ్జ వజల్ల్ (వ అలస్సలాసతిల్లజీన ఖుల్లిఫూ)

## 10వ అధ్యాయం - హజ్రత్ ఆయిషా (రజి)పై నిందారోపణ

1763. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) తనపై అపవాదు వేసిన వారి మాటలను గురించి ఇలా తెలియజేశారు :- దైవప్రవక్త (సల్లం) ఎక్కడికైనా ప్రయాణం చేయడానికి నిర్ణయించుకుంటే, తమ భార్యలను గురించి చీటీ వేసి, అందులో ఎవరి పేరు వస్తే ఆమెను తమ వెంట తీసికెళ్ళేవారు.

ఒక యుద్ధ* సందర్భంగా దైవప్రవక్త (సల్లం) మాలో ఎవరిని తమ వెంట తీసికెళ్ళాలనే విషయమయి చీటీ వేశారు. ఆ చీటీలో నా పేరు వచ్చింది. అప్పుడు నేను ఆయన వెంట బయలుదేరాను. ఈ సంఘటన పరదా ఆదేశం అవతరించిన తరువాత జరిగింది. అందువల్ల నన్ను

★ ఒక యుద్ధం అంటే ఇక్కడ 'బనీ ముస్తలిఖ్ యుద్ధం' అని అర్థం. దీన్నే 'మురసీ యుద్ధం' అని కూడా అంటారు. (సంకలనకర్త)

ఒంటె మీద అంబారీలో కూర్చోబెట్టారు. ఒంటె మీది నుంచి దిగవలసి వచ్చినప్పుడు నన్ను అంబారీలో ఉంచే క్రిందికి దించేవారు. సరే మేము బయలుదేరాము. దైవప్రవక్త (సల్లం) ఆ యుద్ధం ముగిసిన తరువాత తిరుగు ప్రయాణమయ్యారు. తిరుగు ప్రయాణంలో మేము మదీనా పట్నానికి కొన్ని మైళ్ళ దూరంలో ఒక ప్రదేశానికి చేరుకునేటప్పటికి చీకటి పడింది. ఆ రాత్రికి అక్కడ విడిది చేయాలని ప్రకటించబడింది.

నేనీ ప్రకటన విని (ఒంటె మీది నుంచి నా అంబారీని దించిన తరువాత) సహజ అవసరార్థం సైన్యాలకు కాస్త దూరంగా బహిర్భూమికి వెళ్ళిపోయాను. మళ్ళీ నేను నా అంబారీ దగ్గరకు తిరిగొచ్చి కంఠం దగ్గర చేయి పెట్టి చూసుకుంటే నా ముత్యాల హారం కన్పించలేదు. అది తెగిపోయి ఎక్కడో పడిపోయి ఉంటుందని భావించి వెనక్కి వెళ్ళి వెతకడం ప్రారంభించాను. ఇలా వెతుక్కోవడంలో ఆలస్యమయిపోయింది. ఈలోగా నా అంబారీ ఎత్తే వాళ్ళు నేను అంబారీలో కూర్చొని ఉన్నాననుకొని దాన్ని ఎత్తి నా ఒంటె మీద పెట్టారు. ఆ రోజుల్లో మేము స్త్రీలము అన్నం తక్కువగా తినడం వల్ల బక్కగా ఉండేవాళ్ళము. ఎముకల మీద మాంసమే ఉండేది కాదు. అందువల్ల వారు నా అంబారీ ఎత్తి పెట్టేటప్పుడు బరువును అంచనా వేయలేకపోయారు. అదీగాక నేను నవ యౌవనంలో ఉండిన బాలికను. ఆ తరువాత వారు ఒంటెను లేపి వెళ్ళిపోయారు. నేను నా కంఠహారం వెతుక్కొని తిరిగి వచ్చేటప్పటికి సైన్యం అక్కడ్నుంచి వెళ్ళిపోయింది. అక్కడ పిలిచేవారు గాని, కేక వేస్తే జవాబిచ్చేవారు గాని ఎవరూ లేరు. నేను అంబారీలో కన్పించకపోతే వాళ్ళే నా దగ్గరకు తిరిగొస్తారని తలచి నేను సైన్యం విడిది చేసిన ప్రదేశంలోనే కూర్చున్నాను.

కాస్సేపటికి నాకు నిద్ర వచ్చి పడుకున్నాను. హజ్రత్ సఫ్వాన్ బిన్ ముఅత్తల్ సలమీ జక్వానీ (రజి) సైన్యాలకు వెనకాలగా నడచి వస్తున్నారు. ఆయన మరునాడు ఉదయం నేను నిద్రిస్తున్న ప్రదేశానికి చేరుకున్నారు. ఎవరో పడుకున్నారని తలచి ఆయన సమీపానికి వచ్చి చూశారు. ఆయన లోగడ పరదా ఆదేశం రాక పూర్వం నన్ను చూసి ఉండటం వల్ల, దగ్గరికొచ్చి చూడగానే నన్ను గుర్తుపట్టి "ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్" అన్నారు. ఈ అలికిడికి నేను కళ్ళు తెరిచాను. ఆయన్ని చూసి వెంటనే ఓణీతో నా ముఖాన్ని కప్పుకున్నాను. దైవసాక్షిగా చెబుతున్నాను. మేము ఒకరితోనొకరు ఒక్క మాట కూడా మాట్లాడుకోలేదు. నేనాయన నోట 'ఇన్నాలిల్లాహి' అనే మాట తప్ప మరేదీ వినలేదు. ఆ తరువాత ఆయన ఒంటె (దిగి దాని)ని నేల మీద కూర్చోబెట్టారు. నేను లేచి దాని మీద ఎక్కి కూర్చున్నాను. ఆయన ఒంటె ముకుతాడు పట్టుకొని ముందుకు నడిచారు. ఈ విధంగా మేము ఎండ పెటపెటలాడే (మిట్ట మధ్యాహ్నం) వేళకు సైన్యాలు విడిది చేసిన చోటుకు చేరుకున్నాము. (ఈ మాత్రం సంఘటనకే) వారు (నా మీద అపవాదు వేసి) నాశనమయ్యారు. ఈ అపవాదును లేపడంలో అబ్దుల్లా బిన్ ఉబై ప్రధాన పాత్ర వహించాడు.

ఈ హదీసును ఉల్లేఖించిన వారిలో ఒకరైన హజ్రత్ ఉర్వా (రహ్మలై) ఇలా తెలియజేస్తున్నారు:- అతని (అంటే అబ్దుల్లా బిన్ ఉబై) సమావేశంలో ఈ అపవాదును గురించి బాహాటంగా చర్చ జరిగింది. రకరకాల మాటలు కల్పించబడ్డాయి. అతను వారిని సమర్థిస్తూ వారు చెప్పే ప్రతి మాటనూ శ్రద్ధగా

వింటూ విషయం మరింత తీవ్రరూపం దాల్చేలా (దానికి మిర్చీ మసాలా రాసి) మాట్లాడేవాడు. అపవాదు లేపిన వారిలో హస్సాన్ బిన్ సాబిత్ (రజి), మిస్తహ్ బిన్ ఉసాసా (రజి), హుమ్నా బిన్తె జహష్ (రజి)ల పేర్లు మాత్రమే నాకు తెలుసు. వీరే కాకుండా మరికొందరు కూడా ఉన్నారు. వారి* పేర్లు నాకు తెలియదు. కాకపోతే దివ్య ఖుర్ఆన్‌లో "ఈ అపవాదును మీలోనే ఒక ముఠా లేపింది" (24:11) అనే సూక్తిని బట్టి వారొక ముఠాకు చెందిన వారని మాత్రం నాకు తెలుసు. ఆ ముఠాలో ప్రధాన సూత్రధారి అబ్దుల్లా బిన్ ఉబయ్యే. హజ్రత్ ఆయిషా (రజి) తన ముందు ఎవరైనా హజ్రత్ హస్సాన్ బిన్ సాబిత్ (రజి)ని మాత్రం నిందిస్తే సహించేవారు కాదు. "నా తల్లిదండ్రులు, నా గౌరవ ప్రతిష్ఠలు ముహమ్మద్ మహనీయు (సల్లం)ని గౌరవ ప్రతిష్ఠల పరిరక్షణకై సమర్పితం. అందులోనే నా గౌరవం ఇమిడి ఉంది - అనే కవిత హస్సానే కదా చెప్పింది" అని అంటారు ఆమె. హజ్రత్ ఆయిషా (రజి) (తమ కథనాన్ని) కొనసాగిస్తూ ఇలా తెలియజేస్తున్నారు :-

ఆ తరువాత మేము మదీనాలో ప్రవేశించాము. మదీనా తిరిగొచ్చిన తరువాత నేను ఓ నెల రోజుల దాకా జబ్బుపడ్డాను. అపవాదు లేపిన వారి మాటలు విని ప్రజలు పరి పరి విధాలా చెప్పుకునేవారు. కాని నాకా సంగతే తెలియదు. అయితే నేను ఇది వరకు జబ్బు పడినప్పుడు దైవప్రవక్త (సల్లం) నా పట్ల కనబరిచే ప్రేమ, సానుభూతుల్ని ఇప్పుడు జబ్బు పడి ఉన్నప్పుడు కనబరచకపోవడం గమనించి నాక్కొంచెం అనుమానం వచ్చేది. నేనీ జబ్బుపడి ఉన్న రోజుల్లో దైవప్రవక్త (సల్లం) నా దగ్గరికి వచ్చి సలాం మాత్రం చేసేవారు. (నా ఆరోగ్యం గురించి నన్నడగకుండా) "ఈవిడకు ఎలా ఉంది?" అని (ఇంట్లో ఉండే ఇతర సభ్యుల్ని) అడిగేవారు. ఈ ధోరణి మాత్రమే నాక్కాస్త అనుమానం కలిగించేది (ఆయన నా మీద అలిగారేమోనని). అంతకు మించి నాకు అపవాదు గురించి బొత్తిగా తెలియదు.

నేను జబ్బు నుండి కొంచెం కోలుకున్న తరువాత ఓ రోజు ఉమ్మె మిస్తహ్ (రజి)తో కలసి 'మనాసా' ప్రదేశానికి బయలుదేరాను. ఇది మా స్త్రీల బహిర్భూమి. మేమక్కడికి రాత్రి వేళల్లో మాత్రమే వెళ్ళొస్తుంటాము. ఇది మా ఇండ్ల దగ్గర మరుగుదొడ్లు నిర్మించబడని నాటి సంగతి. ప్రాచీన అరబ్బుల అలవాటు ప్రకారం మేము బహిర్భూమి కోసం (ఊరి బయట చెట్లు చేమలుండే) అడవి ప్రదేశానికి వెళ్ళేవారము. ఆనాడు ఇండ్ల సమీపంలో మరుగుదొడ్లు నిర్మించడాన్ని జనం అసహ్యించుకునేవారు. ఉమ్మె మిస్తహ్ (అంటే మిస్తహ్ తల్లి) అబూరహమ్ బిన్ ముత్తలిబ్ బిన్ అబ్దుమునాఫ్ గారి కుమార్తె. ఆమె తల్లి బిన్తె సఖర్ బిన్తె ఆమిర్ (మా నాన్న) హజ్రత్ అబూబకర్ (రజి)కు పినతల్లి అవుతుంది. నేను ఉమ్మె మిస్తహ్ (రజి) ఆ తరువాత బహిర్భూమి నుండి ఇంటికి తిరుగు ముఖం పట్టాము. దారిలో ఉమ్మె మిస్తహ్ (రజి) కాలు దుప్పటిలో ఇరుక్కుపోయి ఆమె తూలి పడిపోయింది. అప్పుడామె (అప్రయత్నంగా) "మిస్తహ్ పాడుగాను!" అని అన్నది. నేను (విషయం అర్థం గాక) "నువ్వు చాలా దారుణమైన మాటన్నావు. బద్ర్ యుద్ధంలో పాల్గొన్నటువంటి వ్యక్తిని నిందిస్తున్నావా నువ్వు?" అని అడిగాను. దానికామె "పిచ్చి పిల్లా! అతనేమన్నాడో నీకేమైనా తెలుసా?" అని అన్నది. నేను

★ ఇక్కడ మూలభాషలో ప్రయోగించిన 'ఉస్బా' అనేపదానికి పది నుండి నలభై మంది వ్యక్తుల ముఠా అని అర్థం వస్తుంది (సంకలనకర్త)

"ఏమన్నాడేమిటి?" అని అడిగాను. అప్పుడామె నాపై అపనింద వేసిన వారు ఎలాంటి మాటలు కల్పించి ప్రచారం చేస్తున్నారో తెలియజేసింది. ముందే జబ్బు పడి ఉన్న నేను ఈ మాటలు వినడంతో నా జబ్బు మరింత ఎక్కువైపోయింది. నేను ఇంటికి చేరుకునేటప్పటికి దైవప్రవక్త (సల్లం) వచ్చి ఉన్నారు. నన్ను చూసి ఆయన సలాం చేశారు. ఆ తరువాత "ఈవిడ పరిస్థితి ఎలా ఉంది?" అని అడిగారు (ఇంట్లోని ఇతర సభ్యులతో). నేనాయనతో "నేను నా తల్లిదండ్రుల ఇంటికి వెళ్ళడానికి అనుమతిస్తారా?" అని అన్నాను. ఈ అనుమతి అడగడంలో నా ఉద్దేశ్యం, నా తల్లిదండ్రుల ఇంటికెళ్ళి ఈ వదంతి గురించి నిజానిజాలు తెలుసుకోవాలన్నదే. దైవప్రవక్త (సల్లం) నాకు పుట్టింటికెళ్ళేందుకు అనుమతిచ్చారు. నేను (వెళ్ళి) మా అమ్మతో "అమ్మా! జనం ఏమిటీ ఇలా చెప్పుకుంటున్నారు?" అని అడిగాను. దానికామె సమాధానమిస్తూ "అమ్మా! బాధపడకు. దైవసాక్షిగా చెబుతున్నాను. సాధారణంగా ఎవరికైనా అందమైన భార్య ఉండి అతనామెను బాగా ప్రేమిస్తూ ఉన్నప్పుడు ఆమె సవతులు ఆమెలో ఏదో ఒక లోపాన్ని ఎత్తి చూపుతూనే ఉంటారు. ఇది సహజం" అని అన్నది. నేనీ మాట విని "సుబ్హానల్లాహ్! (ఆశ్చర్యార్థక పదం) ఇప్పుడు మరికొందరు కూడా ఇలాంటి అభూత కల్పనలకు పాల్పడుతున్నారా?" అని అన్నాను. ఆ రాత్రంతా నా కంటి మీద కునుకే లేదు. తెల్లారే దాకా ఏడుస్తూనే ఉండిపోయాను. తెల్లవారిన తరువాత కూడా నా కన్నీరు ఆగలేదు.

దైవప్రవక్త (సల్లం) దివ్యావిష్కృతి (వహీ) అవతరణలో ఆలస్యమయినందున హజ్రత్ అలీ బిన్ అబూ తాలిబ్ (రజి), హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి)లను పిలిపించి, ఆయన తమ భార్య నుండి (అంటే నా నుండి) విడిపోయే విషయమయి వారిద్దర్నీ సంప్రదించారు. అప్పుడు హజ్రత్ ఉసామా (రజి) మాట్లాడుతూ "దైవప్రవక్తా! మీ భార్యామణిని మీ నుండి వేరు చేయకండి. ఆమెలో మేము మంచితనం తప్ప మరేదీ చూడలేదు" అని అన్నారు. అయితే హజ్రత్ అలీ మాట్లాడుతూ "దైవప్రవక్తా! దేవుడు మీకు ఎలాంటి ఇబ్బందీ పెట్టలేదు. ఆయిషా (రజి)యే గాకుండా (లోకంలో) చాలా మంది స్త్రీలున్నారు. మీరామె సేవకురాలిని అడిగి చూడండి, ఆమె వాస్తవమేమిటో చెబుతుంది" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) (నా సేవకురాలు) హజ్రత్ బరీరా (రజి)ను పిలిపించి "బరీరా! నీకు ఆయిషా (రజి) పట్ల అనుమానం కలిగించే సంఘటన ఏదైనా జరిగినట్లు నువ్వు చూశావా?" అని అడిగారు. హజ్రత్ బరీరా (రజి) సమాధానమిస్తూ "మీకు సత్యధర్మమిచ్చి పంపిన శక్తి స్వరూపుని సాక్షి! హజ్రత్ ఆయిషా (రజి)లో నాకు అనుమానం కలిగించే ఎలాంటి చెడు విషయం నేనింతవరకు చూడలేదు. కాకపోతే ఆమె ఇంకా చిన్నపిల్లే అయినందున, ఇంట్లో పిండి కొట్టి ఉంచితే దాన్ని (నిర్లక్ష్యంగా) వదిలేసి నిద్రపోతుంది. ఈలోగా మేక వచ్చి దాన్ని కాస్తా తినిపోతుంది" అని అన్నది.

దైవప్రవక్త (సల్లం) ఈ మాటలు విన్న తరువాత ఆ రోజే (మస్జిద్‌లో) వేదిక ఎక్కి (కపట విశ్వాసి) అబ్దుల్లా బిన్ ఉబైని శిక్షించే విషయం గురించి ప్రజలను అడిగారు. ఆయన ప్రజలను సంబోధిస్తూ ఇలా అన్నారు : "(సోదర) ముస్లింలారా! నా భార్యపై అపనింద మోపి నన్ను, నా కుటుంబాన్ని బాధించిన వ్యక్తిపై నా తరపున ప్రతీకారం తీర్చుకునేవారు ఎవరైనా ఉన్నారా? దేవుని మీద ప్రమాణం చేసి చెబుతున్నాను, నేను నా భార్యలలో మంచితనం తప్ప మరేదీ చూడలేదు. అపవాదు మోపబడిన ఆ వ్యక్తిలో కూడా నేనింతవరకు ఎలాంటి చెడు చూడలేదు. అతను నా ఇంటికి ఎప్పుడొచ్చినా నేనింట ఉన్నప్పుడే వచ్చేవాడు. నేను లేనప్పుడు ఎన్నడూ రాలేదు."

దైవప్రవక్త (సల్లం) పలికిన ఈ మాటలు విని బనీ అబ్దుల్ అష్హల్ ఉప తెగకు చెందిన హజ్రత్ సాద్ బిన్ ముఅజ్ (రజి) లేచి "దైవప్రవక్తా! నేను మీ తరపున ప్రతీకారం తీర్చుకోవడానికి సిద్ధంగా ఉన్నాను. ఆ వ్యక్తి ఔస్ తెగవాడై ఉంటే నేను స్వయంగా అతడ్ని హతమారుస్తాను. ఒకవేళ అతను మా సోదర తెగ ఖజ్రజ్‌కు చెందిన వాడయితే అతడ్ని గురించి మీరాజ్ఞాపించండి, మేము మీ ఆజ్ఞను పాటిస్తాము" అని అన్నారు. ఈ మాట విని ఖజ్రజ్ తెగ నాయకుడు హజ్రత్ సాద్ బిన్ ఉబాదా (రజి) లేచి నిలబడ్డారు. ఆయన హజ్రత్ హస్సాన్ బిన్ సాబిత్ (రజి) తల్లికి వరుసకు సోదరుడవుతారు. (అంటే ఆమె పిన తండ్రి కొడుకు). ఆయన సాధారణంగా మంచి మనిషే. కాని సాద్ బిన్ ముఅజ్ (రజి) మాటలు విన్న తరువాత ఆయనలో అజ్ఞాన కాలంనాటి జాతీయ దురభిమానం పెల్లుబికింది. దాంతో ఆయన (ఉద్రేక పూరితుడయి) "నిత్య జీవుడయిన ప్రభువు సాక్షి! నీవు అబద్ధమాడుతున్నావు. నీవతడ్ని హతమార్చవు, హతమార్చలేవు కూడా. అతను గనక నీ తెగవాడయి ఉంటే, అతను చంపబడటానికి నీవు ఎన్నటికీ కోరవు" అని అన్నారు హజ్రత్ సాద్ బిన్ ముఅజ్ (రజి)తో.

హజ్రత్ సాద్ బిన్ ముఅజ్ (రజి) పిన తండ్రి కొడుకు హజ్రత్ ఉసైద్ బిన్ హజీర్ (రజి) ఈ మాట విని (దిగ్గున) లేచి నిలబడ్డారు. ఆయన సాద్ బిన్ ఉబాదా (రజి)ని సంబోధిస్తూ "నిత్య జీవుడయిన ప్రభువు సాక్షి! నువ్వొట్టి అబద్ధాల రాయుడివి. మేమతడ్ని తప్పకుండా సంహరిస్తాం. నువ్వు కపట విశ్వాసిలా ఉన్నావు. అందుకే నువ్వు కపట విశ్వాసుల కొమ్ము కాస్తున్నావు" అని అన్నారు. ఈ సంభాషణ పెద్ద వివాదానికి దారి తీసింది. ఔస్, ఖజ్రజ్ రెండు తెగలు పరస్పరం భగ్గుమన్నాయి. కొట్లాటకు సిద్ధమయ్యాయి. దైవప్రవక్త (సల్లం) వేదికపై నిలబడి ఉభయ తెగల వారికీ మాటి మాటికి సర్ది చెబుతూ వారిని శాంతపరచడానికి ప్రయత్నించారు. చివరికి ఎలాగో అందరూ శాంతించారు. గొడవ సద్దుమణిగింది. దైవప్రవక్త (సల్లం) కూడా మౌనంగా ఉండిపోయారు. నేనా రోజంతా ఏడుస్తూనే ఉండిపోయాను. కంటి మీద కునుకు కూడా రాలేదు.

నా తల్లిదండ్రులు నా దగ్గరే ఉన్నారు. నేనిలా ఒక పగలు, రెండు రాత్రులు నిరంతరాయంగా దుఃఖిస్తూ ఉన్నాను. కన్నీరు ఆగలేదు. నిద్ర కూడా పట్టలేదు. ఏడ్చి ఏడ్చి నా గుండె పగిలి పోతుందా అన్పించింది. కాస్సేపటికి ఒక స్త్రీ వచ్చి లోపల ప్రవేశించడానికి అనుమతి అడిగింది. నేనామెకు అనుమతిచ్చాను. ఆమె కూడా నాతోపాటు కూర్చొని ఏడ్వసాగింది. మేమీ స్థితిలో ఉన్నప్పుడు దైవప్రవక్త (సల్లం) (మా ఇంటికి) వచ్చారు. ఆయన సలాం చేసి కూర్చున్నారు. నా మీద అపనింద మోపబడిన నాటి నుంచి ఈ రోజు వరకు ఆయన నా దగ్గర కూర్చోలేదు. ఒక నెల గడచిపోయినా అపనింద విషయంలో ఆయనపై ఎలాంటి దివ్యావిష్కృతి (వహీ) అవతరించలేదు.

ఆయన కూర్చొని ముందుగా షహాదత్ కలిమా (సాక్ష్య వచనం) పఠించారు. ఆ తరువాత ఇలా అన్నారు : "ఆయిషా! నీ గురించి నేనీ మాట విన్నాను. నీవు ఏ పాపమెరగని దానివయితే త్వరలోనే దేవుడు నీ పాతివ్రత్యాన్ని బహిర్గతం చేస్తాడు. ఒకవేళ నీ వల్ల ఏదైనా తప్పు జరిగి ఉంటే, పశ్చాత్తాప హృదయంతో దేవుని ముందు క్షమాపణ వేడుకో. దాసుడు తన పాపాన్ని ఒప్పుకొని పశ్చాత్తాప హృదయంతో క్షమాపణ వేడుకుంటే, దేవుడు అతని పాపాన్ని (తప్పకుండా) క్షమిస్తాడు."

దైవప్రవక్త (సల్లం) తమ సంభాషణ ముగించగానే నా కన్నీటి ప్రవాహం ఒక్కసారిగా ఆగిపోయింది. ఆ తరువాత నా కళ్ళ నుంచి ఒక్క కన్నీటి బిందువు కూడా రాలలేదు. నేను మా నాన్నగారి వైపుకు తిరిగి "దైవప్రవక్త (సల్లం) చెప్పిన దానికి నా తరఫున మీరు సమాధానం ఇవ్వండి" అని అన్నాను. (మా నాన్న) హజ్రత్ అబూ బకర్ (రజి) మాట్లాడుతూ "(అమ్మాయ్!) దైవ సాక్షిగా చెబుతున్నాను. ఈ విషయంలో దైవప్రవక్త (సల్లం)కు ఏమని సమాధానమివ్వాలో నాకేమీ అర్థం కావడం లేదు" అని అన్నారు. ఆ తరువాత నేను మా అమ్మతో "(అమ్మా!) దైవప్రవక్త (సల్లం)కు నువ్వయినా సమాధానమివ్వు" అని అన్నాను. కాని మా అమ్మ కూడా "దైవప్రవక్త (సల్లం)కు ఏం సమాధానమివ్వాలో నాకేమీ తోచడంలేదు" అని అన్నది.

ఆ తరువాత నేను మాట్లాడటం మొదలెట్టాను. అప్పటికి నేను పెద్దగా వయసు లేని బాలికను. ఖుర్ఆన్ కూడా నేనెక్కువగా పఠించలేదు. అయినా నేను మాట్లాడటానికి ఉపక్రమించాను. "మీరీ (అపనింద) మాటను బాగా విని ఉండటం వల్ల అది మీ అందరి హృదయాల్లో తిష్ఠవేసింది. అందరూ దీన్ని నిజమని భావిస్తున్నారు. అలాంటప్పుడు నేను ఏ పాపమెరుగని దాననంటే మీకు నమ్మకం కలగదు. ఒకవేళ నేను తప్పు చేయకపోయినా చేశానని ఒప్పుకుంటే మీరు వెంటనే నమ్ముతారు. కాని నేను ఎలాంటి పాపానికీ ఎంత మాత్రం పాల్పడలేదు. ఆ సంగతి దేవునికి తెలుసు. అందువల్ల దైవసాక్షిగా చెబుతున్నాను. ఇప్పుడు నా పరిస్థితి, మీ పరిస్థితి హజ్రత్ యాఖూబ్ (అలైహి) పరిస్థితిలా ఉంది. ఈ స్థితిలో నేను హజ్రత్ యాఖూబ్ (అలైహి) అన్న మాటనే అంటాను. 'ఇప్పుడు నేను ఉత్తమ రీతిలో సహనం వహిస్తాను. మీరు కల్పించి చెబుతున్న దాని గురించి నేనిక దేవుడ్ని మాత్రమే సహాయం అర్థించాలి' (యూసుఫ్-18) అని అన్నారు ఆమె."

ఇలా మాట్లాడిన తరువాత నేను పడక మీదికెళ్ళి పక్కకు తిరిగి పడుకున్నాను. నేను ఏ పాపమెరగని అమాయకురాలినని దేవునికి బాగా తెలుసు. అందువల్ల ఆయన నా పాతివ్రత్యాన్ని తప్పకుండా బహిర్గతం చేస్తాడని నాకు గట్టి నమ్మకం ఉండింది. అయితే దేవుడు నా ఈ వ్యవహారంలో (ప్రళయం దాకా) నిత్యం పఠించబడేలా దివ్య వచనాలను అవతరింపజేస్తాడని నేను కలలో కూడా ఊహించలేదు. నా వ్యవహారంలో దేవుడు ప్రత్యేకంగా (దివ్య)వాణిని అవతరింపజేయడానికి నేనంతటి గొప్పదానను కూడా కాను. కాని దైవప్రవక్త (సల్లం) కలలో అలాంటిదేదైనా కన్పిస్తుందని మాత్రం నాకు నమ్మకముండింది.

అయితే దైవప్రవక్త (సల్లం) తమ స్థానం నుండి లేవకుండా అలాగే కూర్చున్నారు. అటు మా ఇంట్లో వాళ్ళు కూడా ఎవరూ లేచి బయటకు వెళ్ళలేదు. (ఎక్కడ కూర్చున్న వాళ్ళు అక్కడే మట్టి బొమ్మల్లా కూర్చుండిపోయారు). అంతలో దైవప్రవక్త (సల్లం)పై 'దివ్యావిష్కృతి' (వహీ) అవతరించింది. దివ్యావిష్కృతి సమయంలో ఏర్పడే అనిర్వచనీయమైన బాధ ఆయన్ని క్రమ్ముకుంది. దైవవాణి మోపిన భారం వల్ల తీవ్రమైన చలిలో సయితం ఆయన శరీరం నుండి చెమట బిందువులు రాలసాగాయి. కాస్సేపటికి ఈ పరిస్థితి దూరమయింది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) పెదవులపై దరహాసం తొణికిసలాడింది. ఆయన నోట వెలువడిన మొట్టమొదటి వాక్యం (చూడండి). "ఆయిషా!

దేవుడు నీ పాతివ్రత్యాన్ని ధృవపరిచాడు" అని అన్నారు ఆయన.

మా అమ్మ ఈ మాట వినగానే "ఇక లే. లేచి దైవప్రవక్త (సల్లం)కు కృతజ్ఞతలు చెప్పుకో" అని అన్నది. నేను (తల అడ్డంగా తిప్పుతూ) "నేను లేవను. దైవసాక్షి! పరమోన్నతుడయిన నా ప్రభువుకు తప్ప మరెవరికీ నేను కృతజ్ఞతలు చెప్పుకోను" అని అన్నాను - దివ్యావిష్కృతి ద్వారా నూర్ సూరాలోని ఈ సూక్తులు వెలువడ్డాయి :

"ఈ అపవాదును మీలోనే ఒక వర్గం లేవదీసింది. (జరిగిందేదో జరిగింది, కాని) దీన్ని మీరు (మీ విషయంలో) చెడుగా భావించకండి. ఇది మీకు (ఒకందుకు) మంచిదే. ఇందులో ఎవరు ఎంత పాత్ర వహించారో ఆ మేరకు వారు పాపాన్ని మూటగట్టుకున్నట్లే. ఈ వ్యవహారం గురించి అత్యధిక బాధ్యతను నెత్తిమీద వేసుకున్న ప్రధాన పాత్రధారికి మాత్రం కఠినాతి కఠినమైన శిక్ష కాచుకొని ఉంది. (11)

"ఈ నిందారోపణను వినగానే విశ్వాసులైన స్త్రీ పురుషులు అనుమానానికి లోను కాకుండా సహృదయంతో ఎందుకు ఉండలేదు? మీరు అప్పటికప్పుడు ఇది పూర్తిగా నిరాధారమైన అపనింద అని ఎందుకు ఖండించలేదు? వారు (తమ నిందారోపణను నిరూపించుకోవడానికి) నలుగురు సాక్షులను ఎందుకు తీసుకురాలేదు? వారు సాక్ష్యం తీసుకురాలేదు. (తీసుకు రాలేరు కూడా, కనుక) దేవుని దృష్టిలో వారే పచ్చి అబద్ధాలరాయుళ్ళు. (12, 13).

"మీ మీద ఇహపరలోకాల్లో దేవుని అనుగ్రహం, ఆయన కరుణాకటాక్షాలే గనక లేకపోయి ఉంటే, మీరు ఏ (నిరాధారమైన) మాటల్లో పడిపోయారో వాటి పర్యవసానంగా మీపై ఓ ఘోరమైన విపత్తు వచ్చిపడేదే. ఈ అసత్యారోపణ (ఎంత చెడ్డ విషయమో కాస్త మీరే ఆలోచించండి అది) మీ మధ్య ఒకరి నుంచి మరొకరికి (కార్చిచ్చులా) వ్యాపిస్తూ పోయింది. మీకు వాస్తవం ఏమిటో తెలియని విషయం మీ నోట వెలువడసాగింది. మీరు దాన్ని సాధారణ విషయమని భావిస్తూ ఉండేవారు. కాని దేవుని దృష్టిలో ఇది చాలా తీవ్రమైన విషయం. (14-15)

"ఈ విషయం వినగానే 'ఇలాంటి మాటలు పలకడం మనకు తగదు, దేవుడు పరిశుద్ధుడు. ఇది పూర్తిగా నీలాపనింద' అని మీరు ఎందుకు అనలేదు? మీరు విశ్వాసులే అయితే ఇక ముందు ఎన్నటికీ ఇలాంటి పనులకు పాల్పడకూడదని దేవుడు మీకు ఉపదేశిస్తున్నాడు. (మీరు విషయాన్ని అర్థం చేసుకోవడానికి) దేవుడు మీకు తన బోధనలను విడమరచి తెలియజేస్తున్నాడు. ఆయన సర్వం తెలిసిన వాడు, ఎంతో వివేకవంతుడు. (16-18)

"విశ్వసించినవారి మధ్య అశ్లీల విషయాలు వ్యాపించాలని కోరుకునేవారు ఇటు ప్రపంచంలోనూ, అటు పరలోకంలోనూ వ్యధాభరితమైన శిక్షకు అర్హులవుతారు. (అశ్లీలం సమాజం మీద ఎంత దుష్ప్రభావం వేస్తుందో) దేవునికి తెలుసు; మీకు తెలియదు. మీ మీద దేవుని అనుగ్రహం, ఆయన కారుణ్య కటాక్షాలు గనక లేకపోయి ఉంటే, దేవుడు వాత్సల్య మూర్తి,

దయామయుడు అయి ఉండకపోతే (మీ మధ్య వ్యాపింపజేయబడిన ఈ విషయం దారుణమైన పరిణామాలకు దారి తీసి ఉండేది). (19, 20)

"కనుక విశ్వాసులారా! షైతాన్ అడుగుజాడల్లో నడవకండి. వాడు తనను అనుసరించే వారికి చెడు, అశ్లీలతలను గురించే ఆదేశిస్తాడు. మీ మీద దేవుని అనుగ్రహం, ఆయన కారుణ్య కటాక్షాలే గనక లేకపోతే మీలో ఏఒక్కడూ పరిశుద్ధుడు కాలేడు. అయితే దేవుడు తాను కోరిన వ్యక్తిని పరిశుద్ధం చేస్తాడు. ఆయన సర్వం వినేవాడు. సమస్తం ఎరిగిన వాడు. (21)

"మీలోని ఉదార స్వభావులు, (ఆర్థిక) స్తోమత కలిగినవారు. (ఈ అపనిందలో పాలు పంచుకున్న) తమ బంధువులకు, నిరుపేదలకు, దైవమార్గంలో ఇల్లు వాకిలి వదలి వలస వచ్చిన వారికి సహాయం చేయము అని ప్రతిన బూనకూడదు. వారిని క్షమించాలి, ఉదారంగా వ్యవహరించాలి. దేవుడు మిమ్మల్ని క్షమించాలని మీరు కోరుకోరా? దేవుడు ఎంతో క్షమాశీలి, దయామయుడు. (22)

"శీలవంతులయిన అమాయక ముస్లిం మహిళలపై లేనిపోని అపనిందలు మోపేవారు ఇటు ప్రపంచంలోనూ, అటు పరలోకంలోనూ శాపగ్రస్తులవుతారు. వారి కోసం కఠినాతి కఠిన శిక్ష ఉంది. (23)

"ఇలా అపనిందలు మోపేవారు, స్వయంగా తమ నోళ్ళు, తమ కాళ్ళు చేతులే తమ అకృత్యాలను గురించి (తమకు వ్యతిరేకంగా) సాక్ష్యమిచ్చే రోజు ఒకటి వస్తుందన్న సంగతి మరచిపోకూడదు. ఆ రోజు దేవుడు వారి కర్మలను బట్టి వారికి పూర్తి ప్రతిఫలాన్నిస్తాడు. అప్పుడు తెలుస్తుంది వారికి దేవుడే సత్యమని, దేవుడే నిజాన్ని నిజం చేసి చూపేవాడని. (24, 25)

అపవిత్ర స్త్రీలు అపవిత్ర పురుషులకొరకు, అపవిత్ర పురుషులు అపవిత్ర స్త్రీల కొరకు తగినవారు. అలాగే పవిత్ర స్త్రీలు పవిత్ర పురుషుల కొరకు, పవిత్ర పురుషులు పవిత్ర స్త్రీల కొరకు యోగ్యులు. జనం చెప్పుకునే (తప్పుడు) మాటల నుండి వారు పరిశుద్ధులు, పవిత్రులు. వారి కోసం మన్నింపు), ఉదారమైన ఉపాధి ఉన్నాయి." (26)

(దివ్య ఖుర్ఆన్ - 24:11-26)

ఈ సూక్తుల్ని దేవుడు నా పవిత్రత, పాతివ్రత్యాలను గురించి అవతరింపజేశాడు. (మా నాన్న) హజ్రత్ అబూ బకర్ (రజి) (తమ నిరుపేద బంధువయిన) మిస్తహ్ బిన్ అసాసా (రజి)కు ధన సహాయం చేస్తుండేవారు. అయితే (నా మీద వచ్చిపడిన అపనిందలో ఆయన కూడా భాగం పంచుకోవడం వల్ల) ఆయన (ఆగ్రహం వెలిబుచ్చుతూ) "దైవసాక్షి! (నా కుమార్తె) ఆయిషా (రజి)ను గురించి మిస్తహ్ (రజి) అన్న మాటలకు (నా హృదయం తూట్లు పడింది) నేనిక నుండి అతని కోసం ఒక్క పైసా కూడా ఖర్చు పెట్టను" అని అన్నారు. ఆయనలా అన్నందుకు దేవుడీ సూక్తిని అవతరింపజేశాడు : "మీలో దయానుగ్రహం పొందినవారు, (ఆర్థిక) స్తోమత కలిగిన వారు (ఈ అపనిందలో పాలు పంచుకున్న) తమ బంధువులకు, నిరుపేదలకు, ఇల్లు వాకిలి వదలి దైవమార్గంలో వలస వచ్చిన వారికి సహాయం

చేయబోమని ప్రతిన బూనకూడదు. వారిని క్షమించాలి, వారి పట్ల ఉదారంగా మసలుకోవాలి. దేవుడు మిమ్మల్ని క్షమించాలని మీరు కోరుకోరా? దేవుడు ఎంతో క్షమాశీలి. దయామయుడు." (24:22) ఈ సూక్తి అవతరించిన తరువాత హజ్రత్ అబూ బకర్ (రజి) (మనసు మార్చుకొని) "దైవసాక్షి! దేవుడు నన్ను క్షమించాలనే నేను కోరుకుంటున్నాను. ఇక నుంచి నేనీ సహాయాన్ని ఎన్నటికీ నిలిపి వేయను" అని అన్నారు. ఆయన మిస్తహ్ (రజి)కు ఇది వరకు ఎంత ధన సహాయం అంద చేస్తుండేవారో ఆ సహాయాన్ని తిరిగి అందజేయడం ప్రారంభించారు.

దైవప్రవక్త (సల్లం) నా వ్యవహారం గురించి (విశ్వాసుల మాతృమూర్తి) హజ్రత్ జైనబ్ బిన్తె జహష్ (రజి)ని కూడా విచారించారు. "ఈ విషయంలో నీకేమయినా తెలుసా?" అన్నారు ఆయన. దానికామె "దైవప్రవక్తా! నేను నా కళ్ళు చెవుల విషయంలో చాలా జాగ్రత్తగా మసలుకుంటాను. (చూడకుండా, వినకుండా, నోటికొచ్చినట్లు మాట్లాడను). దైవసాక్షి! నేనామెలో మంచితనం తప్ప మరేదీ చూడలేదు" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) భార్యలలో ఒక్క జైనబ్ (రజి) మాత్రమే నాకు పోటీగా నిలిచే స్త్రీ. (అయినప్పటికీ ఆమె ఈ వ్యవహారంలో సవతి అసూయ ప్రదర్శించకుండా న్యాయంగా మాట్లాడారు) ఆమెలోని భక్తి పరాయణత వల్ల దేవుడు ఆమెను (ఈ రొంపి నుండి) కాపాడాడు. అయితే హజ్రత్ జైనబ్ (రజి)ను ఎల్లప్పుడూ సమర్థిస్తూ మాట్లాడే ఆమె సోదరి మాత్రం అపవాదు లేపిన వారితో చేరి నాశనమయిపోయింది.

అపవాదు వ్యవహారంలోకి, నాతో పాటు ఈడ్చబడిన ఆ వ్యక్తి* అన్న పలుకులు కూడా ఎంతో గమనార్హమైనవి. ఆయన "దేవుడు మాత్రమే పరిశుద్ధుడు, పవిత్రుడు. కాని నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ దేవుని సాక్షిగా చెబుతున్నాను. ఈ రోజు వరకు నేను ఏనాడూ ఏ (పర) స్త్రీ వలువ విప్పలేదు" అని అన్నారు. ఈయన ఆ తరువాత కొన్నాళ్ళకు దైవమార్గంలో పోరాడుతూ అమరగతులయ్యారని హజ్రత్ ఆయిషా (రజి) తెలిపారు.

**(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజీ, 34వ అధ్యాయం - హదీసిల్ ఇఫ్క్)**

1764. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- నా మీద లేనిపోని అపనింద మోపబడినప్పుడు నాకా సంగతే తెలియదు. దైవప్రవక్త (సల్లం) ప్రసంగించడానికి (వేదికపై) నిలబడ్డారు. మొదట ఆయన షహాదత్ కలిమా (సాక్ష్య వచనం) పఠించారు. తరువాత దేవుడ్ని ఆయన ఔన్నత్యానికి తగిన విధంగా స్తుతించారు. ఆ తరువాత ఇలా అన్నారు. "నా భార్య మీద అపనింద మోపిన వ్యక్తిని గురించి మీరు నాకేదయినా సలహా ఇవ్వండి. దైవసాక్షిగా చెబుతున్నాను. నా కుటుంబ సభ్యులను గురించి ఎలాంటి చెడు విషయం కూడా ఎన్నడూ నా దృష్టికి రాలేదు. నా భార్యతో పాటు ఈ అపనిందలో ఇరికించబడిన వ్యక్తి గురించి కూడా నేనెప్పుడూ చెడు విషయం వినలేదు. అతను నా ఇంటికి నేను లేనప్పుడు ఎన్నడూ రాలేదు. నేనెప్పుడైనా ప్రయాణమయి ఎక్కడికైనా వెళ్తే అతను కూడా నాతో పాటే ఉండేవాడు."

హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) నా యింటికి వచ్చి నా గురించి నా

---

★ ఈ వ్యక్తి పేరు హజ్రత్ సఫ్వాన్ బిన్ ముఅత్తల్ (రజి) - (సంకలనకర్త)

సేవకురాలిని విచారించారు. దానికి ఆమె సమాధానమిస్తూ "ఎంత మాత్రం లేదు. నేను ఆయిషా (రజి)లో ఏనాడూ ఎలాంటి చెడునూ చూడలేదు. కాకపోతే ఆమె (అప్పుడప్పుడు) ఆదమరచి నిద్ర పోతుంది, అప్పుడు మేక వచ్చి పిండి తినిపోతుంది" అని అన్నది. నా యీ సేవకురాలిని ప్రవక్త అనుచరులలో కొందరు గదమాయించారు, కోపగించుకున్నారు. అయినప్పటికీ ఆమె "దేవుడు పరిశుద్ధుడు. దైవసాక్షిగా చెబుతున్నాను. స్వర్ణకారుణికి మేలిమి బంగారం గురించి ఏం తెలుసో ఆయిషా (రజి)ను గురించి కూడా నాకు అదే తెలుసు. (అంతకు మించి మరేమీ తెలియదు)" అని అన్నది. ఈ అపవాదులో నాతోపాటు ఇరికించబడిన వ్యక్తికి* అపవాదు సంగతి తెలిసినపుడు "దేవుడు పరిశుద్ధుడు. దైవసాక్షిగా చెబుతున్నాను. నేనీ రోజు వరకు ఏ (పర) స్త్రీ వలువ విప్పలేదు" అని అన్నాడు. ఈయన ఆ తరువాత కొన్నాళ్ళకు దైవమార్గంలో పోరాడుతూ అమరగతులయ్యారు.

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 24వ సూరా - నూర్, 11వ అధ్యాయం - ఇన్నల్లజీన యుహిబ్బూన అన్తషీ అల్ ఫాహిషతు ఫిల్లజీన ఆమనూ)**

★ ఈ వ్యక్తి పేరు హజ్రత్ సఫ్వాన్ బిన్ ముఅత్తల్ (రజి) - (సంకలనకర్త)

# కపట విశ్వాసుల ప్రకరణం

## కపట చేష్టలు

1765. హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి) కథనం :- మేము దైవప్రవక్త (సల్లం)తో కలసి ప్రయాణం చేశాము. ఈ ప్రయాణంలో ప్రజలు చాలా ఇబ్బందులకు గురయ్యారు. (కపటాగ్రేసరుడు) అబ్దుల్లా బిన్ ఉబై తన అనుచర మూకతో మాట్లాడుతూ "దైవప్రవక్త (సల్లం)కు దగ్గరగా ఉన్నవారికి మీరెలాంటి సహాయం చేయకండి. దాంతో వారాయన్ని వదిలేసి వెళ్ళిపోతారు" అని అన్నాడు. అంతే కాకుండా "మనం మదీనా వెళ్ళిన తరువాత మనలో గౌరవనీయుడు నీచుల్ని అక్కడ్నుంచి తీసివేస్తాడు" అని కూడా అన్నాడతను. నేనీ మాటలు విని దైవప్రవక్త (సల్లం) దగ్గరకెళ్ళి ఆయనకు విషయాలన్నీ తెలియజేశాను. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఒక వ్యక్తిని అబ్దుల్లా బిన్ ఉబై దగ్గరకు పంపి దీనిపై వివరణ కోరారు. అతను ప్రమాణం చేసి నా మాటలను ఖండించడానికి ప్రయత్నించాడు. తానలాంటి మాటలేమీ అనలేదన్నాడు. ప్రజలు అతని మాటలు విని "జైద్ బిన్ అర్ఖమ్ (రజి) దైవప్రవక్త(సల్లం)కు అబద్ధాలు చెప్పాడ"ని అనసాగారు. వారి మాటలు నాకెంతో బాధ కలిగించాయి. చివరికి దేవుడు 'మునాఫిఖూన్ సూరా' అవతరింపజేసి నా నిజాయితీని నిరూపించాడు. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) అతని పాప మన్నింపు కోసం దైవాన్ని ప్రార్థించేందుకు అతడ్ని పిలిపించారు. కాని అతను తల అడ్డంగా తిప్పాడు (ప్రవక్త పిలుపును ఖాతరు చేయలేదు). దేవుడు (తన గ్రంథంలో) "వీరు చూడటానికి బోలు కర్రల్లా కన్పిస్తారు" (63:4) అని అన్నాడు. అంటే వీరు పైకి చాలా మంచి వాళ్ళుగా కన్పించేవారు.

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 63వ సూరా - మునాఫిఖూన్, 3వ అధ్యాయం - ఖౌలిహీ (జాలిక బి అన్నహుమ్ ఆమనూ సుమ్మ కఫరూ)**

1766. హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) కథనం :- అబ్దుల్లా బిన్ ఉబై భౌతిక కాయాన్ని సమాధిలోకి దించిన తరువాత దైవప్రవక్త (సల్లం) వచ్చారు. ఆయన అతని శవాన్ని బయటికి తీయించి దానిపై తన లాలాజలాన్ని వేసి, దానికి తమ చొక్కాను ధరింపజేశారు.*

**(సహీహ్‌బుఖారీ:- 23వ ప్రకరణం - జనాయిజ్, 23వ అధ్యాయం - అల్‌కఫని ఫిల్ ఖమీసిల్లజి యుకఫ్ అవ్‌లా యుకప్ఫు)**

1767. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- (కపట విశ్వాసి) అబ్దుల్లా బిన్ ఉబై చనిపోయినప్పుడు అతని కుమారుడు దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! మీ చొక్కా ఇవ్వండి, నేను దానితో అతని (అబ్దుల్లా బిన్ ఉబై) భౌతిక కాయానికి వస్త్ర సంస్కారం చేస్తాను. అతని

★ కపట ముస్లిం అబ్దుల్లా బిన్ ఉబై చనిపోయినప్పుడు అతని బంధువులు దైవప్రవక్త (సల్లం) రావడానికి ఇబ్బంది కలుగుతుందేమోనని భావించి తొందరగా అతని శవాన్ని ఖననం చేశారు. దైవప్రవక్త (సల్లం) వచ్చేటప్పటికి వారు అతని శవాన్ని సమాధిలోకి దించారు. అందువల్ల దైవప్రవక్త (సల్లం) ఆ శవాన్ని బయట తీయించి దానిపై తమ లాలాజలాన్ని వేసి దానికి తమ చొక్కా ధరింపజేశారు.
(సంకలనకర్త)

పాప మన్నింపు కోసం దైవాన్ని ప్రార్థించండి" అని అన్నాడు. వెంటనే కారుణ్యమూర్తి (సల్లం) తన చొక్కా తీసి అతనికిచ్చి "(శవ సంస్కారం తరువాత) నాకు తెలియజెయ్యి, నేనతని కోసం శవప్రార్థన చేస్తాను" అని అన్నారు. ఆయన చెప్పినట్లే వారు తెలియజేశారు. దైవప్రవక్త (సల్లం) వెళ్ళి అతని కోసం శవ ప్రార్థన (జనాజా నమాజ్) చేయడానికి సిద్ధమయ్యారు. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) ఆయన అంగవస్త్రం పట్టుకొని "దైవప్రవక్తా! కపట విశ్వాసుల కోసం జనాజా నమాజ్ చేయకూడదని దేవుడు మిమ్మల్ని వారించలేదా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చారు : "నాకు రెండింటిని గురించి అధికారం ఇవ్వబడింది. దేవుడు (తన గ్రంథంలో) - ప్రవక్తా! అలాంటి వారి కోసం నీవు పాప మన్నింపు ప్రార్థన చేసినా, చేయకపోయినా ఒకటే. నీవు వారి పాప మన్నింపు కోసం డెబ్బై సార్లు ప్రార్థించినా సరే దేవుడు వారిని ఎన్నటికీ క్షమించడు (9:80) - అని అన్నారు."

దైవప్రవక్త (సల్లం) ఇలా సమాధానమిచ్చి అతని జనాజా నమాజ్ చేశారు. అప్పుడు ఈ సూక్తి అవతరించింది - "ఇక ముందు వారిలో (అంటే కపట విశ్వాసులలో) ఎవరు చనిపోయినా వారి కోసం జనాజా నమాజ్ ఎంత మాత్రం చేయకూడదు, వారి సమాధుల దగ్గర కూడా నిలబడకూడదు." (9:84)★

**(సహీహ్ బుఖారీ:- 23వ ప్రకరణం - జనాయిజ్, 13వ అధ్యాయం - అల్ కఫని ఫిల్ ఖమీసిల్లజీ యుకప్ఫా ఔలా యుకఫ్)**

1768. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) కథనం :- కాబా గృహం దగ్గర ఇద్దరు ఖురైష్ తెగ వ్యక్తులు, ఒక సఖీఫ్ తెగ మనిషి లేక ఇద్దరు సఖీఫ్ తెగ వ్యక్తులు, ఒక ఖురైష్ తెగ మనిషి గుమికూడారు. వారి దేహాల్లో కొవ్వు బాగానే ఉంది, కాని వారి మనోమస్తిష్కాలలో విజ్ఞతా వివేచనలే చాలా తక్కువగా ఉన్నాయి. వారిలో ఒకడు మాట్లాడుతూ "దేవుడు మన మాటలను వింటాడా? దీనిపై మీ అభిప్రాయం ఏమిటి?" అని ప్రశ్నించాడు. దానికి రెండోవాడు సమాధానమిస్తూ "మనం బిగ్గరగా మాట్లాడితే దేవుడు వింటాడు. మెల్లిగా మాట్లాడితే వినలేడు" అని అన్నాడు. మూడోవాడు తన అభిప్రాయం వెలిబుచ్చుతూ" బిగ్గరగా మాట్లాడేటప్పుడు వినగలిగితే, మెల్లిగా మాట్లాడేటప్పుడు కూడా వింటాడనుకుంటా" అని అన్నాడు.

ఆ సందర్భంలో ఈ సూక్తి అవతరించింది - "మీరు ప్రపంచంలో రహస్యంగా పాపాలు చేస్తున్నప్పుడు, (మరణానంతరం) మీ కళ్ళు, చెవులు, (చివరికి) మీ చర్మాలు (సయితం) మీకు వ్యతిరేకంగా సాక్ష్యమిస్తాయన్న ఆలోచన కలగలేదు మీకు. మీరసలు దేవునిక్కూడా మీ కర్మల్లో చాలా భాగం తెలియదని భావించేవారు." (41:22)

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 41వ సూరా - ఫుస్సిలత్, 2వ అధ్యాయం - ఖౌలిహీ (వజాలికుమ్ జన్నుకుమ్)**

---

★సహీహ్ ముస్లిం గ్రంథంలో అదనంగా ఇలా ఉంది: "దైవప్రవక్త (సల్లం) మాట్లాడుతూ 'నేను డెబ్బై సార్లకంటే ఎక్కువే పాపమన్నింపుకై ప్రార్థన చేస్తాను' అని అన్నారు. అయితే హజ్రత్ ఉమర్ (రజి) అభిప్రాయానికి అనుకూలంగా దైవాజ్ఞ అవతరించింది". ఇమామ్ నవవీ (రహ్మలై) ఇలా రాస్తున్నారు: అబ్దుల్లా బిన్ ఉబై కపట ముస్లిం అని దైవప్రవక్త (సల్లం)కు తెలిసినప్పటికీ చిత్తశుద్ధిగల ముస్లిం అయిన అతని కొడుకు కోసం ఆయన ఇదంతా చేశారు. కొన్ని ఉల్లేఖనాల ప్రకారం అబ్దుల్లా బిన్‌ఉబై గతంలో హజ్రత్ అబ్బాస్ (రజి)కు ఒక చొక్కా ఉచితంగా ఇచ్చి ఉండటం వల్ల దైవప్రవక్త (సల్లం) అతని రుణాన్ని తీర్చుకోవడానికి తమ చొక్కాను అతని శవం కోసం ఇచ్చారు. (సంకలనకర్త)

1769. హజ్రత్ జైద్ బిన్ సాబిత్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఉహుద్ యుద్ధానికి బయలుదేరినప్పుడు ఆయన అనుచరుల్లో కొందరు (యుద్ధం చేయకుండా దారిలోనే వెనక్కి) తిరిగి వెళ్ళిపోయారు. అప్పుడు కొందరు ముస్లింలు "మేము వాళ్ళను హతమారుస్తాం" అంటే, మరికొందరు "మేము వాళ్ళను హతమార్చము" అని అన్నారు. ఆ సందర్భంలో ఈ సూక్తి అవతరించింది -

"ఆ కపట విశ్వాసులు సంపాదించుకున్న దుష్కర్మల కారణంగా దేవుడు వారిని వెనక్కి తిప్పివేశాడు. అలాంటి కపటులను గురించి మీ మధ్య రెండు అభిప్రాయాలా? ఏమయింది మీకు?" (4:88)

(సహీహ్ బుఖారీ:- 29వ ప్రకరణం - ఫజాయిలి మదీనా, 10వ అధ్యాయం - అల్ మదీనతు తన్ఫిల్ ఖబస్)

1770. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) కాలంలో కపట విశ్వాసులు దైవప్రవక్త (సల్లం) యుద్ధానికి బయలుదేరితే, ఆయనతో పాటు వెళ్ళేవారు కాదు. దైవప్రవక్త (సల్లం) ఆజ్ఞను ఉల్లంఘించి ఇండ్లలోనే ఉండిపోయేవారు. (పైగా తామేదో ఘన కార్యం వెలగబెట్టినట్లు) దానిపై తెగ సంబరపడిపోయేవారు. అయితే దైవప్రవక్త (సల్లం) యుద్ధం నుండి తిరిగి రాగానే ప్రమాణాలు చేసి మరీ (రకరకాల) సాకులు చెప్పేవారు. వారు తాము నెరవేర్చని పనులను గురించి ప్రశంసలు పొందాలని కోరుకునేవారు. వారి ఈ వైఖరిపై ఈ సూక్తి అవతరించింది: "తమ నిర్వాకం పట్ల సంతోషిస్తున్నవారు (దైవ) శిక్ష నుండి తప్పించుకుంటారని మీరు భావించకండి. వారు, తాము నెరవేర్చని పనులను గురించి ప్రశంసలు పొందాలని కోరుకుంటున్నారు." (3:188)

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 3వ సూరా, ఆలి ఇమ్రాన్, 16వ అధ్యాయం - ఖౌలిహీ (లా తహ్సబన్నల్లజీన యఫ్రహూన బిమాఅతవ్))

1771. హజ్రత్ అల్ఖమా బిన్ వఖ్కాస్ (రహ్మాలై) కథనం :- మర్వాన్ తన సేవకుడ్ని పిలిచి "నీవు అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) దగ్గరికి వెళ్ళి ఆయన్ని ఇలా అడుగు - ఒకవేళ తాను చేసిన పనిని గురించి సంతోషిస్తూ 'తాను చేయని పనిని గురించి కూడా ప్రశంసలు పొందాలని కోరుకునే ప్రతి వ్యక్తీ దైవ శిక్షకు అర్హుడయిపోతే, మాలో ప్రతి వ్యక్తీ దైవశిక్షకు అర్హుడవుతాడన్న మాట (ఎందుకంటే ఈ లోపం మాలో ప్రతి ఒక్కడిలో ఉంది మరి)" అని అన్నాడు. దానికి హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ఇలా సమాధానమిచ్చారు:- ఈ సూక్తితో మీకేమిటి సంబంధం? దైవప్రవక్త (సల్లం) కొందరు యూదుల్ని పిలిపించి ఒక విషయం గురించి అడిగినప్పుడు వారు అసలు విషయాన్ని దాచి ఆయనకు మరొక విషయం చెప్పారు. వారు దైవప్రవక్త (సల్లం)కు ఆయన అడిగిన దానికి తాము ఉన్నది ఉన్నట్లు నిజం చెప్పామని, అందువల్ల తాము ప్రశంసలకు అర్హులమని భావించారు. పైగా తాము అసలు విషయం చెప్పకుండా దాచామని వారు సంతోషించారు కూడా. ఆ సందర్భంలో ఈ సూక్తి అవతరించింది -

"గ్రంథోపదేశాలను ప్రజలలో వ్యాపింపజేయాలని, వాటిని మరుగు పరచరాదని, అల్లాహ్ వారితో చేయించిన ప్రమాణాన్ని కూడా గ్రంథ ప్రజలకు జ్ఞాపకం చెయ్యండి. కాని వారు గ్రంథాన్ని తమ వీపుల వెనుక

పడవేశారు. స్వల్ప మూల్యానికి దానిని అమ్మివేశారు. వారు చేసే ఈ వ్యాపారం ఎంత చెడ్డది! తాము చేసిన పనులకు సంతోష పడేవారు, యదార్థంగా తాము చేయని పనులకు తమకు ప్రశంసలు లభించాలని కోరేవారు శిక్షను తప్పించుకుంటారని భావించకండి. వాస్తవానికి వారి కొరకు బాధాకరమైన శిక్ష సిద్ధంగా ఉంది.

(ఆలి ఇమ్రాన్ - 187, 188)

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 3వ సూరా - ఆలి ఇమ్రాన్, 16వ అధ్యాయం - (ఖౌలిహీ (లా తహ్సబన్నల్లజీన యఫ్ర హూన) బిమా అతవ్)

1772. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం :- ఒక వ్యక్తి పూర్వం క్రైస్తవుడు, ఆ తరువాత ముస్లిం అయ్యాడు. అతను బఖరా, ఆలి ఇమ్రాన్ సూరాలు నేర్చుకొని దైవప్రవక్త (సల్లం)కు కార్యదర్శి అయ్యాడు. అయితే కొన్నాళ్ళకు అతను మళ్ళీ క్రైస్తవుడయిపోయి "ముహమ్మద్ (సల్లం)కు నేను వ్రాసిచ్చిన విషయాలు మాత్రమే తెలుసు (అంతకు మించి మరేమీ తెలియదు)" అని (నలుగురితో) చెప్పడం మొదలెట్టాడు. తరువాత కొంత కాలానికి అతను చనిపోయాడు. క్రైస్తవులు అతని శవాన్ని సమాధి చేశారు. కాని మరునాడు ఉదయం వెళ్ళి చూస్తే అతని శవాన్ని భూమి బయటికి విసరి పారేసింది. అప్పుడా క్రైస్తవులు "ఇది ముహమ్మద్ (సల్లం), ఆయన అనుచరులు చేసిన పనే. మా యీ మనిషి వాళ్ళను వదలిపెట్టి వచ్చాడు గనక వారే ఇతని సమాధిని త్రవ్వి ఉంటారు" అని అనుకున్నారు. ఆ తరువాత వారు మరో చోట వీలైనంత లోతుగా గొయ్యి త్రవ్వి అందులో ఆ శవాన్ని తిరిగి పూడ్చి పెట్టారు. అయితే ఆ మరునాడు ఉదయం వెళ్ళి చూస్తే, (మళ్ళీ అదే దృశ్యం) భూమి అతని శవాన్ని బయటికి విసిరి పారేసింది. అప్పుడు వారికి అర్థమయింది - ఇది మానవుల పని కాదని (ఇతరులకు గుణ పాఠం కోసం ఇతనికి దేవుడు శిక్షిస్తున్నాడని). అందువల్ల వారతని శవాన్ని అలాగే పడి ఉండనిచ్చి వెళ్ళిపోయారు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతిన్నుబువ్వతి ఫిల్ ఇస్లాం)

## 1వ అధ్యాయం - ప్రళయం - స్వర్గనరకాలు

1773. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఉపదేశించారు :- "ప్రళయ దినాన (దేవుని సన్నిధికి) లావుపాటి ఒక పెద్ద మనిషిని తీసుకురావడం జరుగుతుంది. కాని దేవుని దగ్గర అతనికి దోమ రెక్కంత కూడా విలువుండదు* అని అన్నారు. (కావాలంటే) మీరీ సూక్తి చదువుకోండి - "ప్రళయ దినాన మేము వారికి ఎలాంటి బరువు (అంటే విలువ)నివ్వము" (18:105)

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 18వ సూరా - కహఫ్, 6వ అధ్యాయం - ఉలాయి కల్లజీన కఫరూ బిఆయాతి రబ్బిహిమ్)

---

★ ఈ హదీసులో పీకల దాకా మెక్కి పెంచుకునే స్థూలకాయాన్ని ఖండించడం జరిగింది. దేవుని దృష్టిలో బాహ్య వేషధారణ, దేహబలం, రూపురేఖలకు ఎలాంటి విలువలేదని, హృదయపూర్వకమైన విశ్వాసానికే విలువుందని కూడా ఈ హదీసు ద్వారా తెలుస్తోంది.
(సంకలనకర్త)

1774. హజ్రత్ అబ్దుల్ బిన్ మస్‌వూద్ (రజి) కథనం :- యూద మత పండితుడొకడు దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి ఇలా అన్నాడు - "ముహమ్మద్ (సల్లం)! మా గ్రంథాలలో ఈ విధంగా వ్రాసి ఉంది - దేవుడు (ప్రళయ దినాన) ఒక వ్రేలిపై సప్తాకాశాలను, మరొక వ్రేలిపై భూమండలాలను, వేరొక వ్రేలిపై వృక్షాలను, ఇంకొక వ్రేలిపై నేలను, నీటిని, మిగిలిన సమస్త సృష్టి రాసుల్ని ఒక వ్రేలిపై ఎత్తి పట్టుకొని 'నేనే విశ్వ సామ్రాజ్యాధినేతను' అని అంటాడు" అని అన్నాడు.

దైవప్రవక్త (సల్లం) అతని మాటలు విని వాటిని ధృవపరుస్తున్నట్లు పకపకా నవ్వారు. ఆ నవ్వులో ఆయన చిగుళ్ళు కూడా కన్పించాయి. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) ఈ సూక్తి పఠించారు. "వారసలు దేవునికి తగిన విధంగా విలువనివ్వలేదు. ప్రళయ దినాన యావత్తు భూమండలం ఆయన పిడికిలిలో ఇమిడి ఉంటుంది. ఆకాశాలు మరొక చేతిలో చుట్టబడి ఉంటాయి. వీరు చేస్తున్న బహుదైవారాధనకు ఆయన ఎంతో అతీతుడు, పవిత్రుడు." (39:67)

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 39వ సూరా - అజ్జుమర్, 2వ అధ్యాయం - వమాఖదరుల్లాహ హఖ్ఖ ఖదరిహీ)

1775. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- దేవుడు (ప్రళయ దినాన) భూమండలాన్ని తన పిడికిలిలో ఇముడ్చుకొని, ఆకాశాన్ని కుడిచేతిలో చుట్టి పట్టుకొని "నేనే చక్రవర్తిని. భూలోకంలో తమకు తాము (పెద్ద) చక్రవర్తులమని చెప్పుకున్న వారిప్పుడేమయ్యారు?" అని అంటాడు.

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 44వ అధ్యాయం - యఖ్బిజుల్లాహుల్ అర్జ)

1776. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రపక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- ప్రళయ దినాన దేవుడు భూమండలాన్ని తన పిడికిలిలో ఇముడ్చుకొని, ఆకాశాన్ని తన కుడి చేతిలో చుట్టి పట్టుకొని "నేనే చక్రవర్తిని" అని అంటాడు.

(సహీహ్ బుఖారీ:- 97వ ప్రకరణం - తౌహీద్, 19వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (లిమాఖలఖ్తు బి యదయ్య)

## 2వ అధ్యాయం - పునరుత్థానం, ప్రళయదినాన భూమి పరిస్థితి

1777. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలిపారు:- ప్రళయ దినాన మానవుల్ని మైదా రొట్టెలా తెలుపు, ఎరుపుల సమ్మిశ్రిత వర్ణంతో కూడిన భూమి మీద సమీకరించడం జరుగుతుంది. అప్పుడు భూమిపై ఎలాంటి ఇండ్లు, గోపురాలు, కట్టడాలు ఎంత మాత్రం ఉండవు.*

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 44వ అధ్యాయం - యఖ్బిజుల్లాహుల్ అర్జ)

★ ఆ రోజు భూమి అంతా ఓ పెద్ద మైదానంలా మారిపోతుంది. దానిపై గుట్టలు, కొండలు, ఇండ్లు గోపురాలు ఏమీ ఉండవు. అంటే నేడు మనం చూస్తున్న ఈ భూమి, స్వరూపం పూర్తిగా మారిపోయి పెద్ద మైదానంలా ఏర్పడుతుందన్న మాట. (సంకలనకర్త)

## 3వ అధ్యాయం - స్వర్గవాసులకు (తొలి) విందు

1778. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఓసారి ఇలా ప్రవచించారు:- "ప్రళయదినాన భూమి రొట్టెలా మారుతుంది. మీరు ప్రయాణంలో ఉన్నప్పుడు రొట్టెను (వండేందుకు) అటు ఇటూ తిప్పినట్లు, దేవుడు ఈ భూమిని తన చేత్తో అటు ఇటు తిప్పి రొట్టెలా మార్చివేస్తాడు. ఆ రొట్టె స్వర్గవాసులకు (తొలి) విందు అవుతుంది." దైవప్రవక్త (సల్లం) ఈ సంగతి చెబుతున్నప్పుడు ఒక యూదుడు వచ్చి "అబుల్ ఖాసిం! కరుణామయుడు మీపై శ్రేయోశుభాలు వర్షింపజేయుగాక! ప్రళయ దినాన స్వర్గవాసులకు ఎలాంటి విందు లభిస్తుందో నేను చెప్పనా" అని అన్నాడు. దానికి దైవప్రవక్త (సల్లం) చెప్పమన్నారు. అప్పుడతను దైవప్రవక్త (సల్లం) మాకు తెలిపినట్లే, భూమి రొట్టెలా మారిపోతుందని చెప్పాడు. దైవప్రపక్త (సల్లం) అతని మాటలు విని మా వైపు చూస్తూ, చిగుళ్ళు బయటకి కన్పించేలా పకపకా నవ్వారు. ఆ తరువాత ఆ యూదుడు "సరే, నేను మీకు స్వర్గవాసులు తినే కూరను గురించి చెప్పనా? వారి కూర వృషభం, మీనం అవుతుంది" అని అన్నాడు. అది విని ప్రవక్త అనుచరులు "వృషభం, మీనం అంటే ఏమిటి?" అని అడిగారు. దానికా యూదుడు "అంటే ఎద్దు, చేప అని అర్థం. వాటి గుండెకాయల ఒక్క ముక్కను డెబ్బై వేల మంది (స్వర్గవాసులు) కడుపు నిండా తింటారు" అని అన్నాడు.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 44వ అధ్యాయం - యఖ్బిజుల్లాహుల్ అర్జ)**

1779. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- యూదులలో పది మంది (గొప్ప) వ్యక్తులు గనక నన్ను విశ్వసిస్తే, (వారిని అనుసరిస్తూ మిగిలిన) యూదులంతా ముస్లిములవుతారు.*

**(సహీహ్ బుఖారీ:- 63వ ప్రకరణం - మనాఖిబిల్ అన్సార్, 52వ అధ్యాయం - ఇతియానిల్ యహూది అన్నబియ్య హీన ఖుదూమిహీ అల్ మదీనత)**

## 4వ అధ్యాయం - ఆత్మను గురించి యూదుల ప్రశ్న, దేవుని సమాధానం

1780. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం :- నేను దైవప్రవక్త (సల్లం) వెంట మదీనా పొలాల గుండా నడచి వెళ్తున్నాను. దైవప్రవక్త (సల్లం) ఖర్జూరపు కర్ర పట్టుకొని దాని ఊతంతో నడవసాగారు. ఆ స్థితిలో మేము వెళ్తుంటే కొందరు యూదులు తారసపడ్డారు. అప్పుడు వారిలో కొందరు, ఆత్మను గురించి ఆయన్ని అడుగుదాం అన్నారు. మరికొందరు "వద్దు, మనకు నచ్చని విషయమేదయినా ఆయన మనకు విన్పించవచ్చు" అని అన్నారు. అయితే కొందరు "ఆయన్ని (ఆత్మను గురించి) అడగవలసిందే"నని తీర్మానించారు.

---

★ అంటే జన సామాన్యంపై అధికారం కలిగి ఉన్న యూద నాయకుల్లో కనీసం పది మంది ఇస్లాం స్వీకరించినా వారి అడుగుజాడల్లో నడుస్తూ యావత్తు యూదులు ముస్లిములయిపోతారన్న మాట. ఆనాటి యూద అగ్ర నాయకుల పేర్లు ఇవి: బనీ నజీర్ తెగలో (1) అబూ యాసిర్ బిన్ అఖ్తబ్, (2) అతని సోదరుడు హుయ్యి బిన్ అఖ్తబ్, (3) కాబ్ బిన్ అష్రఫ్, (4) రాఫె బిన్ అబుల్ హఖీఖ్; బనీ ఖైనుఖా తెగలో (5) అబ్దుల్లా బిన్ హనీఫ్, (6) ఫన్హాస్, (7) రిఫాగా బిన్ జైద్; బనీ ఖురైజా తెగలో (8) జుబైర్ బిన్ బాతియా, (9) కాబ్ బిన్ అసద్, (10) షముయేల్ బిన్ జైద్. యూద నాయకులలో అబ్దుల్లా బిన్ సలాం మాత్రమే ఇస్లాం స్వీకరించారు. (సంకలనకర్త)

దాని ప్రకారం వారిలో ఒక వ్యక్తి ముందుకు వచ్చి "అబుల్ ఖాసిం! ఆత్మ అంటే ఏమిటసలు?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) తక్షణమే సమాధానమివ్వకుండా క్షణం పాటు మౌనంగా ఉండిపోయారు. దాంతో నేను ఆయనపై వహీ అవతరిస్తోందని భావించి నిలబడ్డాను. వహీ అవతరణ సమయంలో ఏర్పడే పరిస్థితి దూరమయిన తరువాత ఆయన దైవసూక్తిని ఇలా పఠించారు - "వీరు నిన్ను ఆత్మను గురించి ప్రశ్నిస్తున్నారు. వారికిలా చెప్పు - ఈ ఆత్మ నా ప్రభువాజ్ఞానుసారం వస్తుంది. కాని మీకున్న జ్ఞానం చాలా పరిమితమైనది." (17:85)

(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం - ఇల్మ్, 47వ అధ్యాయం - ఖౌలిల్లాహితఆలా (వమా ఊతీతుమ్ మినల్ ఇల్మి ఇల్లా ఖలీలా))

1781. హజ్రత్ ఖబ్బాబ్ (రజి) కథనం :- పూర్వం అజ్ఞాన కాలంలో నేను కమ్మరి పని చేస్తుండేవాడ్ని. ఆస్ బిన్ వాయిల్ నాక్కొంత బాకీ పడ్డాడు. నేనొక రోజు వెళ్ళి ఆ బాకీ అడిగితే అతను (ఒక షరతు పెడ్తూ) "నువ్వు ముహమ్మద్ (సల్లం) దౌత్యాన్ని (అంటే నబువ్వత్‌ని) నిరాకరించనంతవరకు నేను నీ బాకీ డబ్బులు ఇవ్వను" అని అన్నాడు. నేనప్పుడు "నువ్వు చచ్చినా, తిరిగి బ్రతికించబడినా సరే, నేనాయన దౌత్యాన్ని ఎన్నటికీ నిరాకరించను" అని అన్నాను. అతను నా మాటలు విని "సరే నేను చనిపోయి, తిరిగి బ్రతికించబడనంతవరకు నీ బాకీ నన్నడగకు. నేను తిరిగి బ్రతికించబడితే నాకు నా ధనమూ లభిస్తుంది, సంతానం కూడా. అప్పుడు నీ బాకీ తీర్చుతాను" అని అన్నాడు. ఈ విషయాన్ని గురించి ఈ సూక్తి అవతరించింది - "నా సూక్తుల్ని నిరాకరించిన వాడ్ని చూశారా? అతను '(చనిపోయిన తరువాత కూడా) తనకు సంతానం సిరిసంపదలు ప్రసాదించబడుతూనే ఉంటాయి' అని అంటున్నాడు. అతని దగ్గర అతీంద్రియ జ్ఞానం ఏదైనా ఉందా? లేక కరుణామయుని నుండి ఏదయినా వాగ్దానం తీసుకున్నాడా?" (19:78)

(సహీహ్ బుఖారీ:- 34వ ప్రకరణం - బుయూ, 29వ అధ్యాయం - జిక్రుల్ ఖైని వల్ హద్దాద్)

## 5వ అధ్యాయం - 'వమా కానల్లాహు లియుఅజ్జిబహుమ్' అనే దైవసూక్తికి వివరణ

1782. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం :- అబూ జహల్ దైవాన్ని వేడుకుంటూ "దేవా! ఈ (ఇస్లాం) ధర్మం నీ వైపు నుండి వచ్చిన సత్య ధర్మమయితే, మా మీద ఆకాశం నుండి రాళ్ళ వర్షం కురిపించు లేదా (విశ్వసించని వారిని) కఠినాతి కఠినంగా శిక్షించు" అని అన్నాడు. ఆ సందర్భంలో దేవుడు ఈ సూక్తుల్ని అవతరింపజేశాడు - "ఆ సమయంలో దేవుడు వారిపై (ఆకాశం నుండి) శిక్ష దించేవాడే. కాని వారి మధ్య నీవున్నావు. అదీగాక (కొందరు) ప్రజలు ఒక వైపు పాప క్షమాపణ వేడుకుంటూ ఉన్నప్పుడు వారిపై శిక్షను దించడం దేవుని సంప్రదాయం కాదు. అయితే వారు పవిత్ర మస్జిద్ (కాబా గృహం)లో ప్రార్థన చేసుకోనివ్వకుండా ప్రజలను నిరోధిస్తున్నారు. అలాంటి వారిపై ఇప్పుడు దేవుడు తన శిక్షను ఎందుకు అవతరింపజెయ్యకూడదు. వారు ఈ మస్జిదుకు ధర్మ సమ్మతమైన ధర్మకర్తలు కారు. దానికి ధర్మ సమ్మతమైన ధర్మకర్తలు దైవభీతి పరాయణులు మాత్రమే కాగలుగుతారు. ఈ వాస్తవం చాలా మందికి తెలియదు." (8 : 33, 34)

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 8వ సూరా - అన్ఫాల్, 4వ అధ్యాయం - వమా కానల్లాహు లియు అజ్జిబహుమ్ వ అన్త ఫీహిమ్)

## 7వ అధ్యాయం - దుఖాన్ (పొగ)

1783. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం :- ఖురైష్ బహుదైవారాధకులు దైవప్రవక్త (సల్లం)ను నిరాకరించి ఆయనకు బద్ధ విరోధులయిపోయారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) వారిని శపిస్తూ "దేవా! హజ్రత్ యూసుఫ్ (అలైహి) కాలంలో వచ్చినటువంటి కరువును వీరిపై తెచ్చి పడవెయ్యి" అని ప్రార్థించారు. దాంతో వారి మీద తీవ్రమైన కాటకం వచ్చి పడింది. ప్రజలు (ఆకలితో మల మల మాడిపోతూ) ఎముకలు సయితం తిన్నారు. ఆ స్థితిలో వారిలో ఎవరైనా ఆకాశం వైపుకు చూస్తే ఆకాశం నిండా అతనికి పొగ కన్పించేది. ఇది తీవ్రమైన ఆకలి వల్ల కలిగిన పరిస్థితి. ఇదే పొగ సంఘటన. దీన్ని గురించే దేవుడు ఈ సూక్తిని అవతరింపజేశాడు - "సరే, ఆకాశం నిండా పొగ కమ్ముకునే రోజు కోసం ఎదురు చూడండి. అది ప్రజల మీద ఆవరిస్తుంది. అదొక బాధాకరమైన శిక్ష." (దుఖాన్ : 10, 11).

ఖురైషీయుల తరపున ఒకతను వచ్చి "దైవప్రవక్తా! మిజర్ తెగ వారి కోసం వర్షం కురిపించమని దేవుడ్ని ప్రార్థించండి. వారు (ఈ కరువు వల్ల) నాశనమయిపోతున్నారు" అని అన్నాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "ఏమిటి మిజర్ తెగవారికా (వర్షం కోసం ప్రార్థించమని నీవు అడుగుతున్నది)? మీకెంత ధైర్యం!"* అని అన్నారు. ఆ తరువాత ఆయన దుఆ (ప్రార్థన) చేశారు. వర్షం కురిసింది. ఆ తరువాత ఈ సూక్తి అవతరించింది - "మేము మీపై నుండి శిక్షను కాస్త తొలగిస్తాం. కాని మీరు పూర్వం చేసిన (సత్య తిరస్కారపు) పనులే చేస్తారు." (దుఖాన్ : 15)

(వర్షం ద్వారా) సుఖ సంతోషాలు అనుభవించే రోజులు రాగానే వారు మళ్ళీ సత్య తిరస్కార కార్యకలాపాలు ముమ్మరం చేశారు. అప్పుడు దేవుడు ఈ సూక్తిని అవతరింపజేశాడు - "మేము మీపై పెద్ద వ్రేటు వేసే రోజు (త్వరలోనే) వస్తుంది. అదే మేము మీపై ప్రతీకారం తీర్చుకునే రోజు." (దుఖాన్ : 16)

పెద్ద వ్రేటు అంటే ఇక్కడ బదర్ యుద్ధమని అర్థం.

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 44వ సూరా - దుఖాన్, 2వ అధ్యాయం - ఖౌలిహీ (యగషన్నాస హాజా అజాబున్ అలీం))**

## 8వ అధ్యాయం - చంద్ర ఖండన మహిమ

1784. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) కాలంలో చంద్రుడు చీలిపోయి రెండు ఖండాలుగా మారిపోయాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "సాక్షులుగా ఉండండి" అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 27వ అధ్యాయం - సవాలుల్ ముష్రికీన అయ్యూరియహుమ్ అన్నబియ్యు - సల్లం - ఆయతన్ ఫ అరాహుమ్ ఇన్షి ఖాఖల్ ఖమర్)**

★ అంటే ఒక వైపు మీరు విగ్రహారాధకులుగా ఉంటూ, దైవప్రవక్త (సల్లం)ను వ్యతిరేకించడం మానుకోలేదు; మరో వైపు మీ కోసం దైవాన్ని ప్రార్థించమని ఆ ప్రవక్తనే అర్థిస్తున్నారు. ఇలా నన్ను విరోధిస్తూనే నా సహాయం కోరుకున్నారంటే మీ ధైర్యమే ధైర్యం. (సంకలనకర్త)

1785. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం :- మక్కావాసులు దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ "మాకేదయినా మహిమ (మోజిజా) చూపించండి" అని అడిగారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) చంద్రుడ్ని రెండు ఖండాలుగా చీల్చి చూపించారు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 27వ అధ్యాయం - సవాలుల్ ముష్రికీన అయ్యురియహుమ్ అన్నబియ్యు - సల్లం - ఆయతన్ ఫ అరాహుమ్ ఇన్షిఖాఖల్ ఖమర్)

1786. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) కాలంలో చంద్రుడు చీలిపోయి రెండు ముక్కలుగా మారిపోయాడు.*

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 27వ అధ్యాయం - సవాలుల్ ముష్రికీన అయ్యురియహుమ్ అన్నబియ్యు - సల్లం - ఆయతన్ ఫఅరాహుమ్ ఇన్షిఖాఖల్ ఖమర్)

## 9వ అధ్యాయం - దేవుడ్ని మించిన సహనశీలి మరెవరూ లేరు

1787. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు:- కష్టం కలిగించే మాటలు విని సహనం వహించడంలో దేవుడ్ని మించిన వారెవరూ లేరు. మానవులు దేవునికి (కూడా) సంతానం ఉన్నారనే దాకా పోయారు. అయినా దేవుడు వారిని వెంటనే శిక్షించకుండా యథా ప్రకారం వారికి ఉపాధి ప్రసాదిస్తున్నాడు.

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 71వ అధ్యాయం - అస్సబ్రి అలల్ అజా)

## 10వ అధ్యాయం - అవిశ్వాసి (శిక్ష తప్పించుకోవడానికి) తన దగ్గర భూమి నిండా బంగారం ఉన్నా అదంతా ఇవ్వడానికి సిద్ధపడతాడు

1788. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- దేవుడు అందరికంటే అత్యల్ప శిక్ష విధించబడే నరకవాసితో "ఒకవేళ నీకు ప్రపంచంలోని సమస్త వస్తు సంపద లభిస్తే, అదంతా నీవు (ఈ శిక్ష నుండి తప్పించుకోవడానికి) పరిహారంగా ఇవ్వగలవా?" అని అడుగుతాడు. దానికా వ్యక్తి ఇస్తానంటాడు. అప్పుడు దేవుడు "నీవు ఆదం (అలైహి) వెన్నులో ఉన్నప్పుడు నేను నిన్ను ఇంతకంటే ఎంతో తక్కువ దాన్ని అడిగాను. నీవు నా దైవత్వంలో మరెవరికీ సాటి కల్పించకూడదని అన్నాను. కాని నీవు (ఈ మాత్రం మాటను కూడా) అంగీకరించడానికి ఒప్పుకోకుండా బహుదైవారాధన చేస్తూ సత్యాన్ని నిరాకరించావు" అని అంటాడు.

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 1వ అధ్యాయం - ఖల్ఖి ఆదమ సలవాతుల్లాహి అలైహి వ జుర్రియ్యతిహీ)

## 11వ అధ్యాయం - అవిశ్వాసి బొక్కబోర్లా లేపబడతాడు

1789. హజ్రత్ అనస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) సన్నిధికి ఒక వ్యక్తి వచ్చి "దైవప్రవక్తా! సత్య తిరస్కారి (ప్రళయ దినాన) బొక్కబోర్లా లేపబడతాడన్నది నిజమేనా?" అని అడిగాడు. దానికి

---

★ హజ్రత్ ఖతాబీ (రహ్మలై) ఇలా రాస్తున్నారు. మహాప్రవక్త ముహమ్మద్ (సల్లం) చూపిన చంద్రఖండన మహిమ (మోజిజా) ఎంతో గొప్ప మహిమ. మొత్తం దైవప్రవక్తల మహిమల్లో ఏ ఒక్క మహిమ కూడా దీనికి సాటిరాదు. ఈ మహిమ వల్ల యావత్తు విశ్వంలోనే ఓ విచిత్ర పరిస్థితి జనించింది. ఆకాశంలో అంతిమ దైవప్రవక్త (సల్లం) ద్వారా తప్ప మరే ప్రవక్త ద్వారా ఇలాంటి మహిమ వెలువడలేదు. (సంకలనకర్త)

దైవప్రవక్త (సల్లం) "ప్రపంచంలో మానవుణ్ణి రెండు కాళ్ళతో నడిపించిన శక్తిమంతుడు ప్రళయదినాన అతడ్ని బొక్క బోర్లా లేపి నడిపించలేడా?" అని అన్నారు.

ఈ హదీసు ఉల్లేఖకుల్లో హజ్రత్ ఖతాదా (రహ్మలై) హదీసు ఉల్లేఖించిన తరువాత "ఎందుకు నడిపించలేడు. మా ప్రభువు గౌరవ ప్రతిష్ఠల సాక్షి! ఆయనకు తప్పకుండా ఆ సామర్థ్యం ఉంది" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 25వ సూరా - ఫుర్ఖాన్, 1వ అధ్యాయం - అల్లజీన యుహ్షరూన అలా వుజూహిహిమ్ ఇలా జహన్నమ్)

## 14వ అధ్యాయం - విశ్వాసి - అవిశ్వాసి

1790. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- విశ్వాసి (మోమిన్) మృదువయిన లేత మొక్కలాంటి వాడు. ఆ మొక్కగాలి వీస్తే వంగిపోతుంది. అలాగే విశ్వాసి కాస్త నిలదొక్కుకున్నాడనుకుంటే అంతలో ఏదో ఒక ఆపద వచ్చిపడి అతడ్ని వంచివేస్తుంది. దీనికి భిన్నంగా అవిశ్వాసి (కాఫిర్) తాటి చెట్టులాంటి వాడు. తాటి చెట్టు దృఢంగా, నిటారుగా ఉంటుంది. అయితే దేవుడు తలచుకుంటే దాన్ని ఒక్కసారిగా కూకటి వేళ్ళతో సహా పెకిలించి పారేస్తాడు.

(సహీహ్ బుఖారీ:- 75వ ప్రకరణం - మర్జ, 1వ అధ్యాయం - మాజాఅ ఫీ కప్ఫారతిల్ మరీజ్)

1791. హజ్రత్ కాబ్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- విశ్వాసి పొలంలోని మృదువైన లేత మొక్కలాంటి వాడు. దాన్ని గాలి ఒక్కోసారి వంచుతుంది. ఒక్కోసారి నిటారుగా ఉంచుతుంది. కాని కపట విశ్వాసి (మునాఫిఖ్) తాటి చెట్టులాంటి వాడు. తాటి చెట్టు సాధారణ పరిస్థితిలో ఎల్లప్పుడూ నిటారుగానే ఉంటుంది. అయితే దానికి రోజులు దగ్గరపడితే అది ఒక్కసారిగా ఊడి క్రింద పడిపోతుంది (ఇక ఎన్నటికీ పైకి లేవదు).

(సహీహ్ బుఖారీ:- 75వ ప్రకరణం - మర్జ, 1వ అధ్యాయం - మాజాఅ ఫీ కప్ఫారతిల్ మరీజ్)

## 15వ అధ్యాయం - విశ్వాసి ఖర్జూరపు చెట్టులాంటి వాడు

1792. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఉద్బోధిస్తూ "ఆకులు రాలనటువంటి ఒక చెట్టుంది. ముస్లిం ఆ చెట్టు లాంటివాడు. ఆ చెట్టు పేరేమిటో చెప్పండి" అని అడిగారు మమ్మల్ని. అనుచరులు ఈ మాట విని అడవి చెట్లను గురించి ఆలోచించడం మొదలెట్టారు. అది ఖర్జూర చెట్టని నా మనస్సుకు తోచింది. కాని చెప్పడానికి నేను మోహమాటపడిపోయాను. తరువాత ప్రవక్త అనుచరులు "దైవప్రవక్తా! మీరే చెప్పండి ఆ చెట్టు పేరేమిటో" అని అన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "అది ఖర్జూరపు వృక్షం" అనీ చెప్పారు.

(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం - ఇల్మ్, 4వ అధ్యాయం - ఖౌలిల్ ముహద్దిస్ (హద్దసనా అల్ అఖ్బరనా అవ్ అన్బానా)

## 17వ అధ్యాయం - కేవలం ఆచరణ వల్ల ఎవరూ స్వర్గానికి పోలేరు, దైవానుగ్రహం ఉండాలి

1793. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఉద్బోధిస్తూ "మీలో ఏ ఒక్కడూ

కేవలం తన కర్మల బలంతో మోక్షం పొందలేడు" అని అన్నారు. అనుచరులు ఈ మాట విని "దైవప్రవక్తా! మీరు కూడానా?" అని అడిగారు. "ఔను, నేను కూడా కర్మల బలంతో మోక్షం పొందలేను. మోక్షం పొందడానికి ఒకే ఒక మార్గం ఉంది. అది, దేవుడు నన్ను తన కారుణ్య ఛాయలోకి తీసుకోవాలి. కనుక మీరు సరయిన రుజు మార్గంలో నడవండి (ముక్తి విషయాన్ని దైవానుగ్రహంపై వదలిపెట్టండి)" అన్నారు దైవప్రవక్త (సల్లం).

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 18వ అధ్యాయం - అల్‌ఖస్ది వల్ ముదావమతి అలల్ అమల్)**

1794. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) హితోపదేశం చేస్తూ "మీరు సరయిన రుజుమార్గంలో నడవండి. వీలైనంత వరకు సరయిన మార్గాన నడవడానికి కృషి చేయండి. మీ కర్మలకు పుణ్యఫలం లభిస్తుందని ఆశిస్తూ ఉండండి. ఏ వ్యక్తినీ కేవలం అతని కర్మలు స్వర్గానికి గొనిపోలేవు" అని అన్నారు. అనుచరులు ఈ మాట విని "దైవప్రవక్తా! మరి మిమ్మల్ని కూడానా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) "నేను కూడా కర్మల బలంతో స్వర్గానికి పోలేను. స్వర్గ ప్రవేశానికి ఒకే ఒక మార్గం ఉంది. అది, దేవుడు నన్ను తన కారుణ్య ఛాయలోకి తీసుకోవాలి. (ఆయన కరుణా కటాక్షాలే నన్ను స్వర్గానికి చేర్చుతాయి)" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 18వ అధ్యాయం - అల్‌ఖస్దివల్ ముదావమతి అలల్ అమల్)**

## 18వ అధ్యాయం - అత్యధిక సత్కార్యాలు, కఠోర సాధన

1795. హజ్రత్ ముగైరా బిన్ షాబా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) రాత్రివేళ (గంటల తరబడి) నిల్చొని నమాజు చేస్తుండేవారు. చివరికి (ఈ కఠోర సాధన వల్ల) ఆయన పాదాలు లేక పిక్కలు వాచిపోయేవి. అనుచరులు ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ "దేవుడు మీ భూత భవిష్యత్ పొరపాట్లన్నిటినీ క్షమించాడు కదా! మరీ మీరింతగా శ్రమ పడతారెందుకు?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "అయితే (దేవుడు నాకు చేసిన మేలుకుగాను) నేను కృతజ్ఞుడయిన దాసుడిగా తయారు కావద్దా?" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 19వ ప్రకరణం - అత్తహజ్జుద్, 6వ అధ్యాయం - ఖియామున్నబియ్యి (సల్లం) హత్తా తరిమ ఖదమాహు)**

## 19వ అధ్యాయం - బోధ, హితోపదేశాలలో మధ్యే మార్గం అవలంబించాలి

1796. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) హదీసు :- అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) ప్రతి గురువారం ప్రజలకు ధర్మబోధ చేస్తుండేవారు. ఓ రోజు ఒక వ్యక్తి లేచి "అబూ అబ్దుర్రహ్మాన్! మీరు మాకు ఇలా ప్రతిరోజూ ధర్మ బోధ చేస్తే ఎంత బాగుంటుంది?" అని అన్నాడు. దానికి ఆయన ఇలా సమాధానమిచ్చారు : "నేనిలా రోజూ ధర్మ బోధ చేస్తుంటే మీరు నా బోధతో విసుగెత్తి పోతారేమోనని భయపడుతున్నాను. మా కోసం దైవప్రవక్త (సల్లం) ధర్మబోధ దినాన్ని ఎలా నిర్ణయించారో నేను కూడా మీ కోసం ధర్మబోధ దినాన్ని నిర్ణయించాను. దీనివల్ల ఎవరికీ భారమనిపించదు."

**(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం - ఇల్మ్, 12వ అధ్యాయం - మన్‌జఅలలి అహ్లిల్ ఇల్మి అయ్యామన్ మాలూమాహ్)**

# స్వర్గ భాగ్యాల, స్వర్గవాసుల ప్రకరణం

1797. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- నరకం మనో వాంఛలతో కప్పి వేయబడింది. స్వర్గం కష్టాలు కడగండ్లతో కప్పివేయబడింది. ★

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 28వ అధ్యాయం - హుజిబతిన్నారు బిష్షహవాత్)**

1798. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- దేవుడు ఈ విధంగా అన్నాడు - "నేను నా పుణ్య దాసుల కోసం (స్వర్గంలో) ఎవరి కళ్ళూ చూడని, ఎవరి చెవులూ వినని, ఎవరి మనస్సుకూ అందనటువంటి సామగ్రిని సిద్ధం చేసి ఉంచాను."

హజ్రత్ అబూ హురైరా (రజి) ఈ హదీసు తెలిపిన తరువాత, "దీనికి ఆధారం కావాలంటే మీరీ ఖుర్ఆన్ సూక్తిని చదువుకోండ"ని ఈ క్రింది సూక్తిని వినిపించారు - "వారి కర్మలకు ప్రతిఫలంగా వారి కండ్ల చలువ కోసం దేవుడు ఏ ప్రాణికీ తెలియని అపూర్వ సామగ్రిని సిద్ధపరచి ఉంచాడు."

(అస్సజ్దా : 17)

**(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్ఇల్ ఖల్ఖ్, 8వ అధ్యాయం - మాజాఅ ఫీ సిఫతిల్ జన్నత్ వ అన్నహా మఖ్లూఖతున్)**

## 1వ అధ్యాయం - స్వర్గంలో ఉన్న ఓ మహావృక్షం నీడన రౌతు నూరేండ్లు నడిచినా ఆ నీడ తరగదు

1799. హజ్రత్ అబూ హురైరా (రజి) దైవప్రవక్త (సల్లం) ప్రవచించిన ఒక ప్రవచనాన్ని ఈ విధంగా తెలిపారు :- స్వర్గంలో ఒక మహావృక్షం ఉంది. దాని నీడలో ఒక రౌతు వందేండ్లు నడిచినా ఆ నీడ చివరి దాకా చేరుకోలేడు.

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 56వ సూరా - వాఖియా, 1వ అధ్యాయం - ఖౌలిహీ తఆలా వజిల్లిన్ మమ్దూద్)**

1800. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- స్వర్గంలో ఒక మహావృక్షం ఉంది. దాని నీడలో ఒక రౌతు వందేండ్లు నడిచినా ఆ నీడ చివరి దాకా చేరుకోలేడు.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 51వ అధ్యాయం - సిఫతిల్ జన్నతి వన్నార్)**

1801. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :-

---

★ అంటే స్వర్గంలో ప్రవేశించే మార్గం కష్టాలు, కడగండ్లతో నిండి ఉంది. మరో మాటలో చెప్పాలంటే స్వర్గప్రవేశం చేయాలంటే కష్టాలు, బాధలు సహించవలసి ఉంటుందన్నమాట. అలాగే నరకానికి దారితీసే మార్గం మనోవాంఛలతో నిండి ఉంది. అంటే మనస్సుకు తోచిన విధంగా ప్రాపంచిక వ్యామోహంతో విశృంఖల జీవితం గడిపితే అది మనిషిని నరకానికి గొని పోతుందన్నమాట. ఈ హదీసు దైవప్రవక్త (సల్లం) మాటల్లోని మర్మానికి, సమగ్రతకు ఒక మచ్చుతునకని, ఇమామ్ నవవీ (రహ్మాలై) అన్నారు. (సంకలనకర్త)

స్వర్గంలో ఒక మహావృక్షం ఉంది. దాని నీడ క్రింద ఒక రౌతు వేగంగా పరుగెత్తే గుర్రమెక్కి వందేండ్లు పయనించినా అతనా నీడ అంచుకు చేరుకోలేదు.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 51వ అధ్యాయం - సిఫతిల్ జన్నతి వన్నార్)**

## 2వ అధ్యాయం - స్వర్గవాసులకు దేవుని ప్రసన్నతా భాగ్యం

1802. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు :- దేవుడు స్వర్గవాసుల్ని "స్వర్గవాసులారా!" అని పిలుస్తాడు. దానికి స్వర్గవాసులు "మేము నీ సమక్షంలో హాజరయ్యాము ప్రభూ!" అనంటారు. "మీరు సంతోషంగా ఉన్నారా?" అని అడుగుతాడు దేవుడు. "మేమిక సంతోషంగా ఎందుకు ఉండము? నీవు నీ సృష్టిరాసుల్లో ఎవరికీ ప్రసాదించని మహాభాగ్యాలు మాకు ప్రసాదించావు" అంటారు స్వర్గవాసులు. "నేను మీకు ఇంతకన్నా శ్రేష్ఠమైన మహాభాగ్యం ప్రసాదిస్తాను" అంటాడు దేవుడు. "ప్రభూ! ఇంతకన్నా శ్రేష్ఠమైన మహాభాగ్యం ఇంకేముంటుంది?" అంటారు స్వర్గవాసులు. అప్పుడు దేవుడు "నేను మీకు నా ప్రసన్నతా మహాభాగ్యం అనుగ్రహిస్తాను. ఇక నుండి నేను ఎన్నడూ మీ మీద ఆగ్రహించను" అని అంటాడు.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 51వ అధ్యాయం - సిఫతిల్ జన్నతి వన్నార్)**

## 3వ అధ్యాయం - స్వర్గవాసులు, తోటి స్వర్గవాసుల (మేడల)ను నింగిలోని తారలుగా చూస్తారు

1803. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- "స్వర్గంలో స్వర్గవాసులు ఒకరి మేడలను మరొకరు మీరిక్కడ ఆకాశంలో నక్షత్రాలను చూస్తున్నట్లు చూస్తారు."

హదీసు ఉల్లేఖకుని ఉవాచ :- నేనీ హదీసుని నూమాన్ బిన్ అయాష్ (రహ్మాలై) నుండి గ్రహించాను. ఆయన ఈ హదీసు గురించి చెబుతూ "నేనీ హదీసుని హజ్రత్ అబూ సయీద్ (రజి) నోట విన్నానని సాక్ష్యమిస్తున్నాను" అని అన్నారు. అయితే ఆయన ఈ హదీసులో అదనంగా "మీరు ప్రాక్పశ్చిమ దిగ్మండలాలపై అస్తమిస్తుండే నక్షత్రాలను చూస్తున్నట్లు" అని అనేవారు.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 51వ అధ్యాయం - సిఫతిల్ జన్నతి వన్నార్)**

1804. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఉద్బోధిస్తూ "స్వర్గవాసులు తమపై నుండే మేడలలోని వారిని, మీరు ప్రాక్పశ్చిమ దిగ్మండలాలపై దేదీప్యమానంగా మెరిసే నక్షత్రాలను చూస్తున్నట్లు చూస్తారు. దీనిక్కారణం స్వర్గవాసుల్లో కూడా అంతస్తులు, తరగతులు ఉంటాయి" అని అన్నారు. అనుచరులు ఈ మాట విని "దైవప్రవక్తా! ఈ మేడలు దైవప్రవక్తల గృహాలయి ఉంటాయా? అక్కడకు వారు తప్ప మరెవరూ చేరుకోలేరు కాబోలు" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) "ఎందుకు చేరుకోలేరు! నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ దేవుని సాక్షి!

వీరసలు దేవుడ్ని విశ్వసించి ఆయన ప్రవక్తలను సమర్థించిన వారయి ఉంటారు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్యిల్ ఖల్ఖ్, 8వ అధ్యాయం - మాజాఅ ఫీ సిఫతిల్ జన్నతి వ అన్నహా మఖ్లూఖతున్)**

## 6వ అధ్యాయం - స్వర్గ ప్రవేశం చేసే మొదటి సమూహం పూర్ణచంద్రునిలా ప్రకాశిస్తూ ఉంటుంది

1805. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- స్వర్గంలో ప్రవేశించే మొట్టమొదటి సమూహంలోని ప్రజల ముఖాలు పున్నమి రాత్రి చంద్రునిలా దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉంటాయి. వారి తరువాత స్వర్గంలో ప్రవేశించే వారి ముఖాలు మెరిసిపోయే ముత్యాల్లాంటి ప్రకాశవంతమైన నక్షత్రాల్లా ధగధగ మెరిసిపోతూ ఉంటాయి. ఈ నక్షత్రాలు ఆకాశంలో ఇతర నక్షత్రాల కన్నా ఎక్కువగా మెరుస్తూ ఉంటాయి. స్వర్గవాసులు మల మూత్ర విసర్జన చేయరు. అదీగాక వారు ఉమ్మరూ, చీదరు కూడా. వారి దువ్వెనలు బంగారంతో చేసినవయి ఉంటాయి. వారి చెమట నుండి కస్తూరి సువాసన గుబాళిస్తుంది. వారి ఉంగరాలపై సుగంధ పరిమళంతో కూడిన సామ్రాణి జ్వలిస్తూ ఉంటుంది. వారి భార్యలు విశాలమైన నల్లటి కళ్ళు గల (అందమైన) స్త్రీలయి ఉంటారు. స్వర్గవాసులందరి రూపాలు వారి పితామహుడు హజ్రత్ ఆదం (అలైహి) రూపంలా ఒకే విధంగా ఉంటాయి. వారి ఎత్తు అరవై బారలు ఉంటుంది.

**(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 1వ అధ్యాయం - ఖల్కి ఆదము సలవాతుల్లాహి అలైహి జుర్రియతిహీ)**

## 9వ అధ్యాయం - స్వర్గవాసుల కుటీరాలు, అందులో ఉండేవారి భార్యల లక్షణాలు

1806. హజ్రత్ అబూ మూసా అష్ అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- (స్వర్గవాసి) కుటీరం ఒక ముత్యమయి ఉంటుంది (అది ఏక ముత్య కుటీరం). దాని లోపలి భాగం మెరుగుదిద్దబడి ఉంటుంది. దాని ఎత్తు ముప్పై మైళ్ళు (48 కిలో మీటర్లు) ఉంటుంది. అందులోని ప్రతి గదిలో విశ్వాసుల కోసం భార్యలు ఉంటారు. వారిని ఇతరులెవరూ చూడలేరు.

**(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్యిల్ ఖల్ఖ్, 8వ అధ్యాయం - మాజాఅ ఫీ సిఫతిల్ జన్నత్ వ అన్నహా మఖ్లూఖతున్)**

## 11వ అధ్యాయం - స్వర్గంలో ప్రవేశించే కొందరి హృదయాలు పక్షుల హృదయాల్లా ఉంటాయి

1807. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- దేవుడు (తొలి మానవుడైన) హజ్రత్ ఆదం (అలైహి)ను సృష్టించాడు - అప్పుడాయన ఎత్తు అరవై బారలు ఉండింది - దేవుడు ఆయనతో "దైవదూతల దగ్గరికెళ్ళి వారికి సలాం చెయ్యి, దానికి వారేమి సమాధానమిస్తారో విను. వారు పలికిన సలామే నీ, నీ సంతానం సలాం, ప్రతి సలాం అవుతుంది" అని అన్నాడు. అప్పుడు హజ్రత్ ఆదం (అలైహి) వెళ్ళి వారికి 'అస్సలాము అలైకుం' అని

సలాం చేశారు. దానికి వారు "అస్సలాము అలైక వ రహ్మాతుల్లాహ్" అని ప్రతి సలాం చేశారు. వారు రహ్మాతుల్లాహ్ అనే పదాన్ని అదనంగా పలికారు - స్వర్గంలో ప్రవేశించే ప్రతి మానవుని రూపం ఆదం (అలైహి) రూపంలా ఉంటుంది - ఆ (తొలి మానవుని సృష్టి) తరువాత ఈనాటి వరకూ మానవుల ఎత్తు నిరంతరాయంగా తగ్గుతూ వస్తోంది.★

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 1వ అధ్యాయం - ఖల్ఖి ఆదమ సలవాతుల్లాహి అలైహి వజుర్రియతిహీ)

## 12వ అధ్యాయం - నరకాగ్ని ఉష్ణ తీవ్రత, నరక కూపం లోతు

1808. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఉద్బోధించారు - "నరకాగ్ని మీ (ఇహలోక) అగ్నికి డెబ్బై రెట్లు ఎక్కువ తీవ్రంగా ఉంటుంది." అనుచరులు ఈ మాట విని "దైవప్రవక్తా! (కాల్చడానికి) ఈ అగ్ని కూడా సరిపోతుంది కదా!" అని అన్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) "నరకాగ్నికి మీ (ప్రాపంచిక) అగ్నిపై అరవై తొమ్మిది రెట్ల ఆధిక్యత ఉంది. దాని డెబ్బై భాగాలలోని ప్రతి భాగం తీవ్రతలో మీ అగ్ని మాదిరిగా ఉంటుంది" అని సమాధానమిచ్చారు.

(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్ఉల్ ఖల్ఖ్, 10వ అధ్యాయం - సిఫతిన్నారి వ అన్నహా మఖ్లూఖహ్)

## 13వ అధ్యాయం - స్వర్గానికి బలహీనులు, నరకానికి బలవంతులు పోతారు

1809. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- స్వర్గ నరకాల మధ్య వాదోపవాదాలు జరిగాయి. నరకం మాట్లాడుతూ "నాలో గర్విష్ఠులు, బలవంతులు ప్రవేశిస్తారు గనక నేను గొప్పదాన్ని" అని అన్నది. స్వర్గం మాట్లాడుతూ "నాలో మటుకు బలహీనులు, నిస్సహాయులు, ప్రజల దృష్టిలో విలువ లేని వాళ్ళు మాత్రమే ప్రవేశిస్తారు" అని అన్నది. అప్పుడు దేవుడు జోక్యం చేసుకుంటూ స్వర్గంతో "నీవు నా కారుణ్యానివి. నీ ద్వారా నా దాసులలో నేను తలచుకున్న వారిని కరుణిస్తాను" అని అన్నాడు. ఆ తరువాత నరకంతో "నీవు 'యాతన'వు మాత్రమే. నీ ద్వారా నా దాసులలో నేను తలచుకున్న వారిని శిక్షిస్తాను" అని అన్నాడు. ఆ తరువాత స్వర్గ నరకాలు రెండిటినీ నింపడం జరుగుతుందని దేవుడు వాగ్దానం చేశాడు. అయితే నరకంలో దేవుడు తన కాలు పెట్టే దాకా అది నిండదు. దేవుడు నరకంలో తన కాలు పెట్టినప్పుడు "చాలు చాలు ఇక చాలు" అంటుంది నరకం తన కడుపు నిండిపోయినట్లు. అది తనంతట తాను సంకోచిస్తుంది. దేవుడు తన సృష్టి రాసుల్లో ఎవరికీ ఎలాంటి అన్యాయం చేయడు. ఇక స్వర్గం విషయానికొస్తే దాన్ని నింపడానికి దేవుడు కొత్తగా మరికొందరిని సృష్టిస్తాడు.

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 5వ సూరా - ఖాఫ్, 1వ అధ్యాయం - ఖౌలిహీ వతఖూలు హల్ మిమ్మజీద్)

---

★ ఈ హదీసు శీర్షికకు అనుగుణమైన హదీసు కాదు. దానిక్కారణం విషయసూచిక సహీహ్ ముస్లిం నుండి గ్రహించబడింది. సహీహ్ ముస్లిం విషయసూచిక ఈ అధ్యాయం క్రింద దీంతో పాటు మరో హదీసు కూడా ఉంది. అది సహీహ్‌బుఖారీలో లేదు. అందువల్ల మూలంలో పక్షుల్లాంటి హృదయాలన్న ప్రస్తావన లేదు. (అనువాదకుడు)

1810. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- నరకం మాటి మాటికీ ఇంకేదయినా ఉంటే తెచ్చి పడేయండి" అని అంటుంది. చివరికి దేవుడు తన కాలిని దాని మీద పెడతాడు. అప్పుడు నరకం "నీ గౌరవ ప్రతిష్ఠల సాక్ష్యం! చాలు చాలు" అని అంటుంది. అది తనంతట తాను సంకోచించిపోతుంది.

(సహీహ్ బుఖారీ:- 83వ ప్రకరణం - ఐమాన్ వన్నుజూర్, 11వ అధ్యాయం - అల్‌హల్ఫి బిఇజ్జతిల్లాహి వ సిఫాతిహీ వ కలిమాతిహీ)

1811. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు : (ప్రళయదినాన) మృత్యువు ఒక తెల్లని పొట్టేలు రూపంలో తీసుకురాబడుతుంది. ఒక ప్రకటనకర్త ఎలుగెత్తి "స్వర్గవాసులారా!" అని పిలుస్తాడు. స్వర్గవాసులు తలలు పైకెత్తి అతని వైపు చూస్తారు. ఆ ప్రకటనకర్త "దీన్ని మీరు గుర్తించారా?" అని అడుగుతాడు వారిని. స్వర్గవాసులు దాన్ని ఇంతకు పూర్వం కూడా చూసి ఉన్నందున "గుర్తించాము. అది మృత్యువు" అని అంటారు. తర్వాత ఆ ప్రకటనకర్త నరకవాసుల్ని కూడా ఎలుగెత్తి పిలుస్తాడు. వారు కూడా తలలు పైకెత్తి అటు వైపు చూస్తారు. "మీరు దీన్ని గుర్తించాగా?" అని అడుగుతాడు ప్రకటనకర్త. నరకవాసులు కూడా దాన్ని ఇంతకు పూర్వం చూసి ఉన్నందున "గుర్తించాము అది మృత్యువు" అని అంటారు. ఆ తరువాత దాన్ని కోసివేయడం జరుగుతుంది. అప్పుడు ప్రకటనకర్త అందరినీ సంబోధిస్తూ "స్వర్గవాసులారా! ఇప్పుడు జీవితం శాశ్వతమయిపోయింది. ఇక (మీకెవరికీ) మరణం రాదు. నరకవాసులారా! ఇప్పుడు జీవితం శాశ్వతమయిపోయింది. ఇక (మీకెవరికీ) మరణం రాదు" అని అంటాడు.

ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) ఈ సూక్తి పఠిస్తారు : "ప్రవక్తా! ఏమరుపాటుకు లోనయి సత్యాన్ని విశ్వసించని వారిని తీర్పు దినం గురించి భయపెట్టు. ఆ రోజు తీర్పు జరిగిన తరువాత దుఃఖం తప్ప మరేదీ మిగలదు." (19:39)

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 19వ సూరా - మర్యం, 1వ అధ్యాయం - ఖౌలిహీ (వ అన్జిర్‌హుమ్ యౌ మల్‌హస్రా))

1812. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- స్వర్గవాసులు స్వర్గంలో, నరకవాసులు నరకంలో ప్రవేశించిన తరువాత మరణాన్ని స్వర్గనరకాల మధ్యకు తెచ్చి నిలబెట్టడం జరుగుతుంది. తరువాత దాన్ని కోసివేస్తారు. అప్పుడు ఒక ప్రకటనకర్త లేచి "స్వర్గవాసులారా! ఇక నుండి మరణం ఉండదు. నరకవాసులారా! ఇక నుండి మరణం ఉండదు" అని ప్రకటిస్తాడు. ఈ ప్రకటన వినగానే స్వర్గవాసుల ఆనందం అవధులు దాటుతుంది; నరకవాసులు దుఃఖంతో మరింత క్రుంగిపోతారు.

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 51వ అధ్యాయం - సిఫతిల్ జన్నతి వన్నార్)

1813. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- సత్యతిరస్కారి రెండు భుజాల మధ్య ఎంత అంతరం ఉంటుందంటే, భుజం మీద వేగంగా నడిచే

రౌతు గనక నడిస్తే అతను మూడు రోజుల దాకా నడుస్తూనే ఉంటాడు.★

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 51వ అధ్యాయం - సిఫతిల్‌జన్నతి వన్నార్)

1814. హజ్రత్ హారిస్ బిన్ వహబ్ ఖుజాయి (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : నేను మీకు స్వర్గవాసుల్ని గురించి చెప్పనా? అల్పుడని, నీచుడని లోకులు భావించే ప్రతి బలహీనుడు, నిస్సహాయుడు గనక దేవుని మీద పూర్తి నమ్మకం ఉంచి ప్రమాణం చేస్తే దేవుడు దాన్ని నిజపరుస్తాడు. నేను మీకు నరకవాసుల్ని గురించి చెప్పనా? జగడాలమారి, పిసినిగొట్టు, అహంకారి, గర్విష్ఠి అయిన ప్రతి వ్యక్తీ (నరకవాసియే).

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 68వ సూరా - ఖలమ్, 1వ అధ్యాయం - ఉతుల్లిఁబాద జాలిక జనీమ్)

1815. హజ్రత్ అబ్దుల్లా బిన్ జమా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఉపన్యాసమిస్తుంటే విన్నాను. ఆయన (హజ్రత్ సాలిహ్ (అలైహి) గారి) ఒంటె సంగతి, దాని పాదుగును కోసి వేసిన వ్యక్తి సంగతి ప్రస్తావించారు. "ఆ జాతిలో అందరికన్నా బలవంతుడు దిగ్గున లేచాడు" (అష్షమ్స్ : 12) అనే సూక్తి పఠించి, ఆ ఒంటె పాదుగు కోసినవాడు ఆ జాతిలో అందరికన్నా బలాఢ్యుడు, పరమ దుర్మార్గుడు, జగడాలమారి, నోటిదురుసు గలవాడు" అని అన్నారు. ఆ తరువాత ఆయన స్త్రీలను గురించి ప్రస్తావిస్తూ "మీలో కొందరు మీ భార్యలను బానిసల్ని కొట్టినట్లు కొడ్తున్నారు. కాని అదే రోజు చివరి భాగం (రాత్రివేళ)లో ఆమెను తమ దగ్గర పడుకోబెట్టుకుంటున్నారు. (ఇది చాలా అనుచితమైన చర్య)" అని అన్నారు. ఆ తర్వాత ఆయన జనానికి హితోపదేశం చేస్తూ "ఎవరి నుంచయినా (శబ్దంతో) అపానవాయువు వెడలినప్పుడు నవ్వడం చాలా తప్పు. తాను చేసే పనినే ఇతరులు చేస్తే దానికి నవ్వడమెందుకు?" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 91వ సూరా - అష్షమ్స్, 1వ అధ్యాయం - హద్దసనా మూసా బిన్ ఇస్మాయీల్)

1816. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- నేను నరకంలో అమ్ర్ బిన్ ఆమిర్ బిన్ లుహయ్యి ఖుజాయీని చూశాను. అతను తన పేగులు లాక్కుంటున్నాడు. ఇతనే అందరికన్నా ముందు (అరేబియాలో) విగ్రహం పేరుతో మొక్కుబడి చేసి ఒంటెను వదిలే దురాచారాన్ని ప్రారంభించినవాడు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 9వ అధ్యాయం - ఖిస్సతిఖుజాఅ)

## 14వ అధ్యాయం - విశ్వనాశనం, ప్రళయదినాన యావత్తు మానవుల సమీకరణ

1817. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) మాట్లాడుతూ "ప్రళయదినాన మానవులు నగ్న పాదాలతో, నగ్న శరీరాలతో, ఖత్నా (వడుగు) చేయబడనివారిగా లేపబడతారు" అని తెలిపారు. నేనీ మాట విని "దైవప్రవక్తా! (ఆ స్థితిలో) స్త్రీలు పురుషులు ఒకర్నొకరు

★ నరక శిక్ష తీవ్రతను చవిచూడటానికి వీలుగా సత్యతిరస్కారుల శరీరం ఆ మేరకు చాలా పెద్దదిగా ఉంటుంది. సహీహ్ ముస్లిం ఉల్లేఖనంలో సత్యతిరస్కారి దవడ ఉహుద్ పర్వతమంత ఉంటుందని కూడా ఉంది. ఇవన్నీ సత్యాలు, వీటిని ముస్లింలు విధిగా విశ్వసించాలి. (ఇమామ్ నవవీ - రహ్మాలై)

చూసుకుంటారా?" అని అడిగాను. దైవప్రవక్త (సల్లం) దానికి సమాధానమిస్తూ "ఆ సమయంలో వారంతా తీవ్రమైన ఆపదకు లోనయి ఉంటారు. ఒకరివైపు మరొకరు చూసుకునే ఆలోచనే తట్టదు వారికి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 45వ అధ్యాయం - కైఫల్ హష్ర్)

1818. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) లేచి మా ముందు ఉపన్యాసమిస్తూ "మీరు ప్రళయ దినాన లేపబడినప్పుడు నగ్న పాదాలతో, నగ్న శరీరాలతో, ఖత్నా (వడుగు) చేయబడనివారయి ఉంటారు. దివ్య ఖుర్ఆన్‌లో - 'మేము మానవుణ్ణి మొదట్లో ఏ విధంగా పుట్టించామో తిరిగి అదే విధంగా చేస్తాము' అని ఉంది. ప్రళయదినాన అందరికంటే ముందు బట్టలు హజ్రత్ ఇబ్రాహీం (అలైహి)కు ధరింపజేయడం జరుగుతుంది" అని అన్నారు. ఆ తరువాత ఆయన ఇలా తెలియజేశారు -

"ఆ రోజు నా అనుచర సమాజానికి చెందిన కొందరిని తీసుకొచ్చి ఎడమ పక్షం వారిలో చేర్చడం జరుగుతుంది. నేనప్పుడు 'ప్రభూ! వీరు నా అనుచరులు కదా!' అనంటాను. దానికి దేవుడు 'నీ తదనంతరం వీరు (ధర్మంలో లేని) ఎన్ని కొత్త కొత్త విషయాలు సృష్టించారో నీకు తెలియదు' అనంటాడు. నేనీ మాట విని దేవుని పుణ్యదాసుడు (హజ్రత్ ఈసా-అలైహి) పలికిన పలుకులే పలుకుతాను". ఆయన పలుకులు ఈ విధంగా ఉన్నాయి - "(ప్రభూ!) నేను వారి మధ్య ఉన్నంత వరకే నేను వారి మీద పర్యవేక్షకుడిగా ఉన్నాను. తమరు నన్ను వెనక్కి పిలిపించుకున్న తరువాత వారిపై తమరే పర్యవేక్షకులు. ఇప్పుడు తమరు వారిని శిక్షించదలచుకుంటే వారు తమరి దాసులే. ఒకవేళ వారిని క్షమిస్తే తమరు సర్వాధికారి, ఎంతో వివేకవంతులు." (5:117, 118) ఆ తరువాత నాతో "(నీవు ప్రపంచం నుండి వెళ్ళిపోయిన తరువాత) వీరు మతభ్రష్టులయి జీవితాంతం అదే స్థితిలో ఉండిపోయారు" అని అనబడుతుంది.

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 45వ అధ్యాయం - కైఫల్ హష్ర్)

1819. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- పునరుత్థాన దినాన మానవులు మూడు వర్గాలుగా చీలిపోతారు. ఒక వర్గంలో భయం, ఆశ కలిగిన వారు ఉంటారు. (రెండవ వర్గంలో) ఒక ఒంటె మీద ఇద్దరు, మరొక ఒంటె మీద ముగ్గురు, వేరొక ఒంటె మీద నలుగురు చొప్పున ఉంటారు. మిగిలిన (మూడో వర్గం) వారిని అగ్ని ఒక చోట సమీకరిస్తుంది. వారు మధ్యాహ్నం వేళ ఎక్కడయినా నడుం వాల్చితే ఈ అగ్ని కూడా వారితో పాటే ఉంటుంది. రాత్రివేళ వారు ఎక్కడయినా గడిపితే అప్పుడు కూడా ఈ అగ్ని వారిని వెన్నంటే ఉంటుంది. ఉదయం లేచేటప్పుడు కూడా వారిని వెన్నంటే ఉంటుంది. సాయంత్రం అయినప్పుడు కూడా ఈ అగ్ని వారిని వెన్నంటే ఉంటుంది. (అంటే వారు ఎక్కడికి పోయినా, ఏ స్థితిలో ఉన్నాసరే అగ్ని వారిని వెన్నాడటం మానదన్నమాట).

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 45వ అధ్యాయం - కైఫల్ హష్ర్)

## 15వ అధ్యాయం - ప్రళయదిన బీభత్సం

1820. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- మానవులు విశ్వ ప్రభువు సన్నిధిలో నిలబడే రోజు వారి పరిస్థితి చెమటలతో చాలా ఆందోళనకరంగా ఉంటుంది. కొందరు తమ చెవుల సగభాగం వరకు తమ సొంత చెమటతోనే మునిగి ఉంటారు.

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 83వ సూరా - వైలుల్లిల్ ముతఫ్ఫిఫీన్)

1821. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- ప్రళయదినాన మానవుల శరీరాల నుండి చెమట విపరీతంగా కారుతూ ఉంటుంది. ఆ చెమట నేల మీద డెబ్బై గజాల దాకా ప్రవహిస్తూ ఉంటుంది. వారు తమ నోళ్ళు, చెవుల దాకా చెమటలోనే మునిగి ఉంటారు.

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - అర్రిఖాఖ్, 47వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (అలా యజున్ను ఉలాయిక అన్నహుమ్ మబ్ఊసూన లి యౌమిన్ అజీమ్)

## 17వ అధ్యాయం - మృతునికి అతని అసలు స్థానం స్వర్గం లేక నరకం చూపబడుతుంది

1822. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు :- మీలో ఎవరైనా చనిపోయినప్పుడు అతనికి (సమాధిలో) ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం అతను ఉండవలసిన శాశ్వత స్థానం చూపబడుతుంది. అతను గనక స్వర్గవాసి అయి ఉంటే అతనికి స్వర్గవాసుల స్థానం చూపబడుతుంది; నరకవాసి అయి ఉంటే అతనికి నరకవాసుల స్థానం చూపబడుతుంది. అప్పుడు "ఇదే నీ అసలు స్థానం. నిన్ను ప్రళయదినాన లేపినప్పుడు ఈ స్థానానికే నీవు చేరుకోవలసి ఉంటుంది" అని అతనికి చెప్పబడుతుంది.

(సహీహ్ బుఖారీ:- 23వ ప్రకరణం - జనాయిజ్, 90వ అధ్యాయం - అల్‌మయ్యతి యూరజు అలైహి మఖ్ అదుహు బిల్ ఘదాతి వల్ అషియ్యి)

1823. హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారీ (రజి) కథనం :- సూర్యాస్తమయం అయిన తరువాత దైవప్రవక్త (సల్లం) ఇంటి నుంచి బయలుదేరారు. ఒక చోట ఆయన ఒక (విధమైన భయంకర) ధ్వని విని "ఇది సమాధిలో ఒక యూదుడి నుండి వస్తున్న ధ్వని. అతను సమాధి యాతన అనుభవిస్తున్నాడు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 23వ ప్రకరణం - జనాయిజ్, 88వ అధ్యాయం - అత్తవ్వుజు మిన్ అజాబిల్ ఖబ్ర్)

1824. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- మనిషి (మృతదేహం)ని సమాధిలో పెట్టి (పూడ్చి) అతని బంధుమిత్రులు వెళ్ళిపోతారు. అతనింకా వారి చెప్పుల శబ్దం వింటూ ఉండగానే అతని దగ్గరికి ఇద్దరు దైవదూతలు వస్తారు. వారతడ్ని లేపి కూర్చోబెట్టి, దైవప్రవక్త (సల్లం)ను గురించి ప్రశ్నిస్తూ "ఇతడ్ని గురించి నీ అభిప్రాయం ఏమిటి?" అని అడుగుతారు. అతను విశ్వాసి అయి ఉంటే "ఆయన దేవుని దాసుడు, దేవుని ప్రవక్త అని నేను సాక్ష్యమిస్తున్నాను" అని అంటాడు. అప్పుడు వారు అతనితో ఇలా అంటారు : "ఇదిగో చూడు ఇది

నీ (శాశ్వత) స్థానం కావలసిన నరకం. దీనికి బదులు దేవుడు నీకిప్పుడు స్వర్గంలో నివాసస్థానం ప్రసాదించాడు" అని చెబుతారు. ఈ విధంగా అతను తన రెండు స్థానాలను చూసుకుంటాడు.

(సహీహ్ బుఖారీ:- 23వ ప్రకరణం - జనాయిజ్, 87వ అధ్యాయం - మాజాఅ ఫీ అజాబిల్ ఖబ్ర్)

1825. హజ్రత్ బరాబిన్ ఆజిబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు:- విశ్వాసిని సమాధిలో పెట్టిన తరువాత అతని దగ్గరకు (ఇద్దరు దైవదూతలు) వస్తారు. అప్పుడు విశ్వాసి "అష్హదు అన్ల్లాయిలాహ ఇల్లల్లాహు వఅష్హదు అన్న ముహమ్మదర్ రసూలుల్లాహ్" అని అంటాడు. దివ్య ఖుర్ఆన్‌లోని "విశ్వసించిన వారికి దేవుడు ఒక స్థిర వచనం ఆధారంగా ఇహపర లోకాలలో స్థిరత్వాన్ని ప్రసాదిస్తాడు" (ఇబ్రాహీమ్ - 27) అనే సూక్తికి వివరణ ఇదే.

(సహీహ్ బుఖారీ:- 23వ ప్రకరణం - జనాయిజ్, 87వ అధ్యాయం - మాజాఅ ఫీ అజాబిల్ ఖబ్ర్)

1826. హజ్రత్ అబూ తల్హా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) బద్ర్ యుద్ధం నాడు ఖురైష్ నాయకుల్లో ఇరవై నాలుగు మంది వ్యక్తుల (మృతదేహాల)ను బద్ర్‌లోని ఒక పాడుబడిన బావిలో పడవేయమని ఆజ్ఞాపించారు.

దైవప్రవక్త (సల్లం) సాధారణంగా ఏదైనా జాతిపై విజయం సాధించినప్పుడు ఆ ప్రాంతంలో మూడు రాత్రుల పాటు బస చేస్తారు. బద్ర్ యుద్ధం ముగిసిన మూడవ రోజు రాగానే ఆయన తన స్వారీని తీసుకురమ్మని ఆజ్ఞాపించారు. దానిపై జీను కట్టిన తరువాత ఎక్కి బయలుదేరారు. అనుచరులు కూడా ఆయన వెంట బయలుదేరారు. దైవప్రవక్త (సల్లం) ఏదైనా పని మీద ఎక్కడికో వెళ్తున్నారని వారు భావించారు. చివరికి దైవప్రవక్త (సల్లం) ఆ పాడుబడిన బావి ఒడ్డుకు వెళ్ళి నిలబడ్డారు. ఆయన ఆ హతులను వారి, వారి తండ్రుల పేర్లతో సంబోధిస్తూ "ఫలానా కొడుకు ఫలానా! ఫలానా కొడుకు ఫలానా!! మీరు దేవునికి, దైవప్రవక్త (సల్లం)కు విధేయులయి ఉండి ఉంటే బాగుండేదన్న వాస్తవాన్ని మీరు ఇప్పుడైనా బాగా గ్రహించారా? మేము మాత్రం మా ప్రభువు మాకు చేసిన వాగ్దానం నెరవేరిందని గ్రహించాము. మరి మీ ప్రభువు మీకు చేసిన వాగ్దానం నెరవేరిందని మీరు తెలుసుకున్నారా?" అని అన్నారు. హజ్రత్ ఉమర్ (రజి) ఈ మాట విని "దైవప్రవక్తా! మీరు ఆత్మలు లేని దేహాలతో మాట్లాడుతున్నారా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "ముహమ్మద్ (సఅసం) ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆయన సాక్షిగా చెబుతున్నాను. నేను చెబుతున్న దానిని ఈ శవాలు నీకంటే బాగా వింటున్నాయి, అర్థం చేసుకుంటున్నాయి" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 8వ అధ్యాయం - ఖత్లి అబీజహల్)

## 18వ అధ్యాయం - కర్మల విచారణ

1827. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- నాకు తెలియని విషయం గురించి నేనెప్పుడైనా వింటే దాన్ని గురించి నేను దైవప్రవక్త (సల్లం)ను అడిగి పూర్తిగా తెలుసుకుంటాను. (ఓ రోజు) ఆయన "ఎవరి నుండి లెక్క తీసుకోవడం జరుగుతుందో అతను (నరక) యాతనకు గురయినట్లే" అని అన్నారు.

అప్పుడు నేను "(ఖుర్‌ఆన్‌లో) 'అతని నుండి తేలికపాటి లెక్క తీసుకోవడం జరుగుతుంది' అని దేవుడు సెలవిచ్చాడు కదా!" అని అన్నాను.

దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "దానర్థం లెక్క తీసుకోవడం కాదు. కర్మల పత్రం చూపడం మాత్రమే. దీనికి భిన్నంగా ఎవరిని నిలదీసి లెక్కతీసుకోబడుతుందో అతను సర్వనాశనమవుతాడు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 3వ ప్రకరణం - ఇల్మ్, 35వ అధ్యాయం - మన్‌సమిఅ షైఅన్‌ఫరాజఅ హత్తా యారిఫహు)**

1828. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు :- దేవుడు ఏ జాతిపైనయినా శిక్ష విధించినపుడు ఆ జాతిలో ఉన్న వారందరిపై ఆ శిక్ష విరుచుకుపడుతుంది (పుణ్యాత్ములు, పాపాత్ములు అంతా ఆ విపత్తుకు గురి అవుతారు). అయితే ప్రళయదినాన వారు తమ తమ కర్మలను బట్టి లేపబడతారు (వారికి వారి కర్మలను బట్టి పుణ్యఫలమో పాప ఫలమో లభిస్తుంది).

**(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - 'ఫితన్', 19వ అధ్యాయం - ఇజా అన్జలల్లాహు బిఖౌమిన్ అజాబన్)**

# ప్రళయ సూచనల ప్రకరణం

## 1వ అధ్యాయం - కలహాలు, కల్లోలాలు, యాజూజ్ మాజూజ్‌ల ఆనకట్ట

1829. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ జైనబ్ బిన్తె జహష్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఓ రోజు నా ఇంటికి ఆందోళన చెందుతూ వచ్చారు. రాగానే "లా ఇలాహ ఇల్లల్లాహ్ సమీపానికి వచ్చిన ఉపద్రవం వల్ల అరబ్బులకు కీడు మూడింది. ఈ రోజు యాజూజ్ మాజూజ్‌ల ఆనకట్టకు ఇంత రంధ్రం పడింది" అని అన్నారు ఆయన తన చూపుడు వ్రేలిని, బొటన వ్రేలిని వృత్తాకారంలో కలిపి చూపుతూ. నేనీమాట విని "దైవప్రవక్తా! మాలో సజ్జనులు ఉన్నప్పటికీ మేము నాశనమవుతామా?" అని అడిగాను. దానికి ఆయన "అవుతారు. దుర్మార్గం దుష్కార్యాలు మితిమీరినప్పుడు (సజ్జనులు ఉన్నా సరే జనం నాశనమవుతారు)" అని సమాధానమిచ్చారు.

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా 7వ అధ్యాయం - ఖిస్సతి యాజూజ్ వ మాజూజ్)

1830. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : "యాజూజ్, మాజూజ్‌ల ఆనకట్టకు ఇంత రంధ్రం పడింది." ఈ మాట చెబుతూ ఆయన తన చేత్తో తొంభయ్యో సంఖ్యను చేసి చూపారు.

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 7వ అధ్యాయం - ఖిస్సతి యాజూజ్ వ మాజూజ్)

## 2వ అధ్యాయం - కాబాపై దాడి చేసే ఉద్దేశ్యంతో వచ్చే సైన్యం భూమిలో దిగబడటం

1831. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఒక భవిష్యత్ ప్రకటన చేస్తూ "ఒక సైన్యం కాబా గృహం మీద దాడిచేసే ఉద్దేశ్యంతో వస్తుంది. అయితే ఆ సైన్యం 'బైదా' ప్రాంతంలో ఉండగానే అది మొదలు నుంచి చివరి దాకా భూమిలోకి కూరుకుపోతుంది" అని చెప్పారు. నేనీ మాట విని "దైవప్రవక్తా! అది మొదలు నుంచి చివరి దాకా భూమిలోకి ఎలా కూరుకుపోతుంది? వారిలో బజారున పోయేవారు, వారిలో చేరని వారు కూడా ఉంటారు కదా!" అని అడిగాను. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "మొదటి నుంచి చివరి దాకా అందరూ భూమిలోకి కూరుకుపోతారు. అయితే ఆ తరువాత (ప్రళయదినాన) బ్రతికించి లేపబడేటప్పుడు వారి వారి సంకల్పాలను బట్టి లేపబడతారు (అంటే అమాయకులను వదలి పాపాత్ములను మాత్రమే శిక్షించడం జరుగుతుంది)" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 34వ ప్రకరణం - అల్‌బుయూ, 49వ అధ్యాయం - మాజుకిర ఫిల్ అస్వాఖ్)

## 3వ అధ్యాయం - ఉపద్రవాలు వర్షపు బిందువులు రాలినట్లు రాలిపడతాయి

1832. హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఒక ఎత్తైన ఇంటి మీదికెక్కి ఇలా

అన్నారు, "నాకు కనిపిస్తున్నది మీకు కన్పించడం లేదా? వాన చుక్కలు రాలిపడే ప్రదేశాలను చూసినట్లు నేను మీ ఇండ్ల మధ్య ఉపద్రవాలు విరుచుకుపడే ప్రదేశాలను చూస్తున్నాను."

(సహీహ్ బుఖారీ:- 29వ ప్రకరణం - ఫజాయిలి మదీనా, 8వ అధ్యాయం - ఆతామిల్‌మదీనా)

1833. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- సమీప కాలంలో (మీ మధ్య) కల్లోలాలు చెలరేగుతాయి. అప్పుడు నిలబడిన వాని కంటే కూర్చున్నవాడు, నడుస్తున్న వానికంటే నిలబడి ఉన్నవాడు, పరుగెత్తుతున్న వానికంటే నడుస్తున్నవాడు క్షేమంగా ఉంటాడు. ఆ కల్లోలాలను ఎవరైనా తొంగి చూసినా సరే అవి అతడ్ని తమ వైపుకు లాక్కుంటాయి. అలాంటి పరిస్థితిలో ఎవరికి ఏ ఆశ్రయం దొరికితే అతనా ఆశ్రయానికి వెళ్ళి దాక్కోవాలి.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతిన్నుబువ్వతి ఫిల్ ఇస్లాం)

## 4వ అధ్యాయం - ఇద్దరు ముస్లింలు పరస్పరం ఖడ్గాలతో తలపడినప్పుడు?

1834. హజ్రత్ అహ్నఫ్ బిన్ ఖైస్ (రహ్మలై) కథనం :- నేనతనికి (అంటే హజ్రత్ అలీ - (రజి)కి సహాయం చేద్దామని వెళ్తుంటే దారిలో హజ్రత్ అబూ బక్రా (రజి) తారసపడి "ఎక్కడికి వెళ్తున్నావు?" అని అడిగారు. నేను "అతనికి సహాయం చేద్దామని వెళ్తున్నాను" అని అన్నాను. హజ్రత్ అబూ బక్రా (రజి) ఈ మాట విని ఇలా అన్నారు : "తిరిగెళ్ళిపో, ఇద్దరు ముస్లింలు పరస్పరం కత్తులతో తలపడినప్పుడు హతుడు, హంతకుడు ఇద్దరూ నరకానికి పోతారని దైవప్రవక్త (సల్లం) చెబుతుంటే నేను విన్నాను. అప్పుడు నేను, దైవప్రవక్తా! హంతకుడు నరకానికి పోతాడన్న మాట సమంజసంగానే ఉంది. కాని హతుడు నరకానికి పోవడమేమిటీ? అని అడిగాను. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ 'అతను కూడా తన ప్రత్యర్థిని చంపదలచుకున్నాడు కదా!' అని అన్నారు."

(సహీహ్ బుఖారీ:- 2వ ప్రకరణం - ఈమాన్, 22వ అధ్యాయం - అల్ మఆసిమిన్ అమ్రిల్ జాహిలియ్యా)

1835. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు:- (ముస్లింలకు చెందిన) రెండు పెద్ద వర్గాలు పరస్పరం పోట్లాడుకుని వారి మధ్య తీవ్రంగా యుద్ధం జరగనంత వరకూ ప్రళయం సంభవించదు. ఈ రెండు వర్గాల వాదన ఒక్కటే★.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతిన్నుబువ్వతి ఫిల్ ఇస్లాం)

## 6వ అధ్యాయం - ప్రళయం దాక జరిగే విశేషాలను గురించి దైవప్రవక్త (సల్లం) భవిష్యత్ ప్రకటన

1836. హజ్రత్ హుజైఫా బిన్ యమాన్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఒక ఉపన్యాసమిస్తూ ప్రళయం దాకా సంభవించే విశేషాలన్నీ పూస గుచ్చినట్లు తెలియజేశారు. ఈ విశేషాలను గుర్తుంచుకున్న

---

★ అంటే రెండు వర్గాలు సత్యం, ధర్మం తమ వైపునే ఉన్నాయని, తాము ఇస్లాం కోసమే పోరాడుతున్నామని చెప్పుకుంటాయి. పూర్వం హజ్రత్ అలీ (రజి), హజ్రత్ ముఆవియా (రజి)ల మధ్య యుద్ధం జరిగినప్పుడు కూడా ఆ రెండు వర్గాలు ఇలాగే చెప్పుకున్నాయి.

(సంకలనకర్త).

వాడు వాటి (వాస్తవికత)ని తెలుసుకున్నాడు. మరచిపోయినవాడు వాటి (వాస్తవికత)ని తెలుసుకోలేదన్నమాట (అంటే కొందరు వాటిని అర్థం చేసుకొని గుర్తుంచుకున్నారు. మరికొందరు మరచిపోయారు). ఇక నా సంగతికొస్తే నేనేదయినా మరచిపోయిన విషయం సంభవించడం చూస్తే దాన్ని నేను వెంటనే గుర్తుపడ్తాను - గతంలో చూసి ఉన్న దాన్ని చూడగానే గుర్తుపట్టేవాడిగా.

(సహీహ్ బుఖారీ:- 82వ ప్రకరణం - అల్‌ఖద్ర్, 4వ అధ్యాయం - వకాన అమ్రుల్లాహి ఖదరమ్మఖ్‌దూరా)

## 7వ అధ్యాయం - సముద్ర కెరటాల్లా లేచే కల్లోలం

1837. హజ్రత్ హుజైఫా బిన్ యమాన్ (రజి) కథనం :- మేము (ఖలీఫా) హజ్రత్ ఉమర్ (రజి) దగ్గర కూర్చొని ఉన్నాము. ఆయన మాతో మాట్లాడుతూ "మీలో ఎవరికైనా ఉపద్రవాన్ని గురించి దైవప్రవక్త (సల్లం) ప్రవచించిన ఏదైనా హదీసు గుర్తుందా?" అని అడిగారు. నేను వెంటనే "నాకు గుర్తుంది" అని అన్నాను. "ఈ విషయంలో నీవు చాలా ధైర్యశాలివి" అన్నారు ఆయన. "మనిషి తన ఇల్లు, ధనం, సంతానం, పొరుగువాళ్ళ మూలంగా ఉపద్రవం (ఫిత్నా)లో చిక్కుకుపోతే నమాజ్, ఉపవాసం, దానధర్మాలు, దుష్టనివారణ శిష్ట విస్తరణ (ధర్మ ప్రచారం)ల ద్వారా ఆ పాపం పరిహరించబడుతుంది" అన్నాను నేను. హజ్రత్ ఉమర్ (రజి) ఈ మాటలు విని "నేనీ ఉపద్రవం గురించి అడగలేదు. భయంకరమైన ఉప్పెనలా విరుచుకుపడే ఉపద్రవం గురించి అడుగుతున్నా" అని అన్నారు. "విశ్వాసుల నాయకా (అమీరుల్ మోమినీన్)! దానివల్ల మీకెలాంటి ప్రమాదం లేదు. మీకు, ఆ ఉపద్రవానికి మధ్య ఒక మూయబడిన తలుపు ఉంది" అన్నాను నేను. "అయితే ఆ తలుపు తెరుచుకుంటుందా లేక విరిగిపోతుందా?" అడిగారు ఆయన మళ్ళీ. "అది విరిగిపోతుంది" చెప్పాను నేను. ఈ మాట విని "అంటే అది ఇక ఎన్నటికీ మూసుకోదన్న మాట" అన్నారు ఆయన. ఈ హదీసు ఉల్లేఖించిన వారిలో ఒకరి కథనం :- మేము హజ్రత్ హుజైఫా (రజి)తో మాట్లాడుతూ "హజ్రత్ ఉమర్ (రజి)కు ఆ తలుపు గురించి తెలుసంటారా?" అని అడిగాను. దానికి ఆయన "ఈ రోజు పగటి తరువాత రాత్రి తప్పకుండా వస్తుందన్న సంగతి మీకెంత తెలుసో ఆ తలుపు గురించి ఆయనకు అంతకంటే బాగా తెలుసు" అని అన్నారు. - మేమాయన ముందు ఎలాంటి సందేహానికి తావులేని ఒక హదీసు గురించి ప్రస్తావించాము - మేము హజ్రత్ హుజైఫా (రజి)కు భయపడి ఆయన్ని మరే విషయం అడగలేక హజ్రత్ మస్రూఖ్ (రహ్మాలై) ద్వారా అడిగించాము. అప్పుడు హజ్రత్ హుజైఫా (రజి) "ఆ తలుపు స్వయంగా ఉమర్ (రజి) గారే" అని తెలియజేశారు.

(సహీహ్ బుఖారీ:- 9వ ప్రకరణం - మవాఖీతిస్సలాత్, 4వ అధ్యాయం - అస్సలాతి కప్పారా)

## 8వ అధ్యాయం - ఫరాత్ నది అడుగు నుండి పసిడి పర్వతం బయల్పడనంతవరకు ప్రళయం రాదు

1838. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- సమీప కాలంలో ఫరాత్ నది ఎండిపోతుంది. దాని అడుగు భాగం నుండి ఓ (పెద్ద) బంగారు నిక్షేపం బయల్పడుతుంది. కనుక ఆ కాలంలో ఉండేవారు (ఆ నిక్షేపాన్ని చూస్తే) అందులో నుంచి రవ్వంత

(బంగారం) కూడా తీసుకోకూడదు.

(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్, 24వ అధ్యాయం - ఖురూజున్నార్)

## 14వ అధ్యాయం - హిజాజ్ నుండి ఒక అగ్ని (జ్వాల) బయల్పడనంతవరకు ప్రళయం రాదు

1839. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు:- హిజాజ్ నుండి ఒక అగ్ని బయల్పడనంతవరకు ప్రళయం రాదు. ఆ అగ్ని వెలుగుతో బుస్రా[1]లోని ఒంటెల మెడలు మెరసిపోతాయి.

(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్, 24వ అధ్యాయం - ఖురూజున్నార్)

## 16వ అధ్యాయం - షైతాన్ కొమ్ములు ఉదయించే తూర్పు దిక్కున కల్లోలం రేగుతుంది

1840. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) తూర్పు దిక్కుకు తిరిగి ఇలా చెబుతుంటే విన్నాను - "గుర్తుంచుకోండి, షైతాన్ కొమ్ములు ఉదయించే ఈ దిక్కు నుండి కల్లోలం చెలరేగుతుంది."[2]

(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్, 16వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) - అల్‌ఫిత్నతు మిన్ ఖిబలిల్ మష్రిఖ్)

## 17వ అధ్యాయం - దౌస్ తెగ జుల్ఖలస్త విగ్రహాన్ని ఆరాధించనంతవరకూ ప్రళయం రాదు

1841. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- దౌస్ తెగ స్త్రీలు జుల్ఖలస్త విగ్రహం చుట్టూ ప్రదక్షిణ చేయనంతవరకూ ప్రళయం సంభవించదు. జుల్ఖలస్త అనేది దౌస్ తెగ ప్రజల విగ్రహం. అజ్ఞాన కాలంలో వీరీ విగ్రహాన్ని పూజించేవారు.

(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్, 23వ అధ్యాయం - తగ్‌యీరిజ్జమాని హత్తా.యాబుదుల్ అవ్‌సాన్)

## 18వ అధ్యాయం - సమాధిని చూసి మనిషి మృత్యువుని కోరుకునేటంతటి కల్లోలాలు చెలరేగనంతవరకు ప్రళయం రాదు

1842. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- మనిషి ఏదైనా సమాధి సమీపంగా పోవడం జరిగి 'ఈ సమాధిలో శవానికి బదులు నేనుంటే ఎంత బాగుండు'

---

1. బుస్రా అనేది సిరియా దేశంలోని ఒక పట్టణం పేరు. దాన్ని హూరాన్ అని కూడా అంటారు. డెమాస్కస్ నుండి ఈ పట్టణం మూడు మజిలీల దూరంలో ఉంది. (సంకలనకర్త)

2. దైవప్రవక్త (సల్లం) తూర్పు దిక్కుకు తిరిగి ఆ మాట చెప్పడానికి కారణం ఆనాడు తూర్పు వాసులంతా అవిశ్వాసులుగా ఉండటమే. ప్రారంభ కాలంలో జరిగిన జమల్ యుద్ధం, సఫ్ఫీన్ యుద్ధం, ఖవారిజ్ దాడులు మొదలైన కల్లోలాలన్నీ తూర్పున ఉన్న నజద్, ఇరాఖ్, వాటి చుట్టుప్రక్కల ప్రాంతాల్లోనే సంభవించాయి. (సంకలనకర్త)

అని అనేటంతటి (కల్లోల) పరిస్థితి దాపురించనంతవరకూ ప్రళయం రాదు.

**(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్, 22వ అధ్యాయం - లా తఖూముస్సాఅతు హత్తా యుగ్బత అహ్లిల్ ఖుబూర్)**

1843. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- అబిసీనియాకు చెందిన చిన్న పాదాలు (పిక్కలు) గల ఒక వ్యక్తి కాబా గృహాన్ని ధ్వంసం చేస్తాడు.

**(సహీహ్ బుఖారీ:- 25వ ప్రకరణం - హజ్, 47వ అధ్యాయం - ఖౌలిల్లాహితఆలా (జఅలల్లాహుల్ కాబతల్ బైతల్ హరాం))**

1844. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- ఖహ్తాన్ తెగకు చెందిన మహాబలాఢ్యుడొకడు లేచి తన కర్ర (అధికార బలం)తో ప్రజలపై (తాను కోరిన విధంగా) పెత్తనం చలాయించనంతవరకూ ప్రళయం సంభవించదు.

**(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 7వ అధ్యాయం - జిక్రి ఖహ్తాన్)**

1845. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- వెంట్రుకలతో తయారయిన పాదరక్షలు ధరించే జాతి ప్రజలతో మీరు యుద్ధం చేయనంతవరకూ ప్రళయం రాదు. అలాగే సొట్టబోయిన డాలు వంటి ముఖాలు గల జాతి ప్రజలతో కూడా యుద్ధం చేయనంతవరకూ ప్రళయం సంభవించదు.

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 96వ అధ్యాయం - ఖితాలిల్లజీన యతనఅలూనషఅర)**

1846. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- "ఖురైష్ (తెగ)కు చెందిన ఈ (ఉప) తెగ[1] ప్రజలను (అన్యాయంగా) హతమార్చుతుంది." ప్రవక్త అనుచరులు ఈ మాట విని "అయితే ఈ విషయంలో మాకు మీ ఆజ్ఞ ఏమిటి?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "అప్పుడు ప్రజలు వారికి దూరంగా ఉండటం మంచిది[2] (అంటే వారితో ఏ విధంగాను సహకరించకూడదు)" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతిన్నుబువ్వతి ఫిల్ ఇస్లాం)**

1847. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు :- (ఈరాన్ చక్రవర్తి) కిస్రా నాశనమయిపోయాడు. ఇక అతని తరువాత మరే కిస్రా రాడు. అలాగే (రోమ్ చక్రవర్తి) ఖైసర్ కూడా నాశనమవుతాడు. అతని తరువాత కూడా మరే ఖైసర్ ఉండడు. మీరు వారిద్దరి సిరిసంపదల్ని (స్వాధీనం చేసుకొని) దైవ మార్గంలో దానం చేస్తారు.

**(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 157వ అధ్యాయం - అల్‌హర్బు ఖుద్ అహ్)**

1848. హజ్రత్ జాబిర్ బిన్ సముర (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా సెలవిచ్చారు :- కిస్రా నాశనమయిపోయిన తరువాత మరే కిస్రా రాడు. ఖైసర్ నాశనమయిపోయిన తరువాత కూడా

(1) ఈ తెగ అంటే బనీ ఉమయ్యా తెగ అని అర్థం. (సంకలనకర్త)

(2) దైవప్రవక్త (సల్లం) ప్రవచనం తీరును బట్టి ఇలా జరగదని తెలుస్తోంది. అయితే అలాంటి సమయంలో అంటే ముస్లింలు పరస్పరం పోరాటానికి, రక్తపాతానికి తలపడినప్పుడు ఇతర ముస్లింలు ఏ వర్గంతోనూ సహకరించకుండా తటస్థంగా ఉండటమే సరయిన పద్ధతి. (అనువాదకుడు)

మరే ఖైసరూ రాడు. నా ప్రాణం ఎవరి అధీనంలో ఉందో ఆ శక్తిమంతుని సాక్షి! మీరు వారిద్దరి సిరిసంపదల్ని తప్పకుండా (స్వాధీనం చేసుకొని) దైవమార్గంలో దానం చేస్తారు.

**(సహీహ్ బుఖారీ:- 57వ ప్రకరణం - ఫర్జుల్ ఖుమ్స్, 8వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) ఉహిల్లత్ లకుముల్ గనాయిమ్)**

1849. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు :- యూదులు మీతో యుద్ధం చేస్తారు. అయితే మీరే వారిపై విజయం సాధిస్తారు. అప్పుడు (యూదులు పారిపోయి దాక్కోవడానికి వృథా ప్రయత్నం చేస్తారు) రాయి (సయితం) "ముస్లింలారా! ఇదిగో నా వెనుక యూదుడు దాక్కున్నాడు, ఇతడ్ని సంహరించండి" అని అంటుంది.

**(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతిన్నుబువ్వతి ఫిల్ ఇస్లాం)**

1850. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా సెలవిచ్చారు :- దాదాపు ముప్పై మంది అబద్ధాలకోరులు (అసత్య ప్రవక్తలు) పుట్టనంత వరకు ప్రళయం సంభవించదు. వారిలో ప్రతివాడూ తాను దైవప్రవక్తనని ప్రకటించుకుంటాడు.

**(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతిన్నుబువ్వతి ఫిల్ ఇస్లాం)**

## 19వ అధ్యాయం - ఇబ్నె సయ్యాద్ ప్రస్తావన

1851. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్(రజి) కథనం :- హజ్రత్ ఉమర్(రజి) కొందరు ప్రవక్త అనుచరులతో కలసి దైవప్రవక్త (సల్లం) వెంట ఇబ్నె సయ్యాద్ దగ్గరకు వెళ్ళారు. వారతడ్ని బనీ ముగాలకోట దగ్గర పిల్లలతో ఆడుకుంటూ ఉండగా చూశారు - అప్పటికి ఇబ్నె సయ్యాద్ యౌవన దశలోకి ప్రవేశించాడు - మేమక్కడికి చేరుకునే దాకా అతను మా రాకను గమనించనేలేదు. చివరికి దైవప్రవక్త (సల్లం) చేత్తో అతని వీపు తట్టి, "నేను దైవప్రవక్తనని నీవు సాక్ష్యమిస్తావా?" అని అడిగారు అతనితో. ఇబ్నె సయ్యాద్ ఈ మాట విని దైవప్రవక్త (సల్లం) వైపు (కొరకొర) చూస్తూ "మీరు ఉమ్మీల (అంటే నిరక్షరాస్యుల) దైవప్రవక్త అని నేను సాక్ష్యమిస్తున్నాను"* అని అన్నాడు. ఆ తరువాత అతను "మరి మీరు నేను దైవప్రవక్తనని సాక్ష్యమిస్తారా?" అని అడిగాడు. దైవప్రవక్త (సల్లం) దానికి సమాధానమిస్తూ "నేను దేవుడ్ని, ఆయన ప్రవక్తను విశ్వసిస్తున్నాను" అని అన్నారు. ఆ తరువాత ఆయన "నీకేం కనిపిస్తోంది?" అని అడిగారు అతడ్ని. దానికి ఇబ్నె సయ్యాద్ "నా దగ్గరికి సత్యమంతులూ వస్తారు. అబద్ధాల కోరులు కూడా వస్తారు" అని అన్నాడు. "అయితే నీ కోసం వ్యవహారం గందరగోళమయిపోయింది. నిజమేదో, అబద్ధమేదో తెలియకుండా అనుమానాస్పదం చేయబడింది - సరే, నేను నీ కోసం ఒక విషయాన్ని దాచి ఉంచాను (అదేమిటో చెప్పగలవా?)" అన్నారు దైవప్రవక్త (సల్లం). "అది దుఖ్" అన్నాడు ఇబ్నె సయ్యాద్. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "ఓరి నీచుడా! నీవు నీ స్థాయికి మించి ఏమాత్రం ఎదగలేదు. (అంటే జ్యోతిష్కులకు తెలిసినంతే నీకు తెలుసు. అంతకు మించి నీకేమీ తెలియదు అన్న మాట)" అని అన్నారు.

---

★ ఇబ్నె సయ్యాద్ దైవప్రవక్త (సల్లం)ను ఉమ్మీల ప్రవక్త అనడానికి కారణం అతను యూదుడై అంటే గ్రంథ ప్రజల్లోని వాడయి ఉండటమే. గ్రంథ ప్రజలు అరబ్బులను ఉమ్మీ (నిరక్షరాస్యు)లు అంటారు. ఈ విధంగా అతను దైవప్రవక్త (సల్లం)ను దైవప్రవక్తగా ధృవపరచినప్పటికీ ఆయన దౌత్యాన్ని విశ్వసించలేదు. (సంకలనకర్త)

తిర్మిజీ గ్రంథంలోని ఒక ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) 'దుఖాన్' సూరాను మనసులో పెట్టుకొని (పై విధంగా) అడిగారు. అంటే "యౌమ తాతిస్సమాయి బిదుఖానిమ్ముబీన్" అనే సూక్తిని అన్నమాట. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) "దైవప్రవక్తా! నాకు అనుమతివ్వండి. ఇతడ్ని వధిస్తాను" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని "ఇతను (నిజంగా) దజ్జాలే అయి ఉంటే ఇతడ్ని నీవు చంపలేవు. ఒకవేళ ఇతను దజ్జాల్ కాకపోతే ఇతడ్ని చంపడం వల్ల (మనకు) ఎలాంటి ప్రయోజనం చేకూరదు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 178వ అధ్యాయం - కైఫ యూరజుల్ ఇస్లాము అలస్సబియ్యి)

1852. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఓ రోజు హజ్రత్ ఉబై బిన్ కాబ్ (రజి)ని వెంటబెట్టుకొని ఇబ్నె సయ్యాద్ ఉంటున్న ఖర్జూరపు తోట దిశగా వెళ్ళారు. దైవప్రవక్త (సల్లం) ఆ తోటలో ప్రవేశించి ఖర్జూరపు చెట్ల వెనుక నక్కి నిల్చున్నారు. ఇబ్నె సయ్యాద్ ఏమరపాటులో ఉండి తనను చూడకముందే అతని మాటలను విందామనుకున్నారు దైవప్రవక్త (సల్లం). ఆ సమయంలో అతను దుప్పటి కప్పుకొని పడుకొని ఉన్నాడు. దుప్పటిలో నుంచి ఒక విధమైన వింత ధ్వని విన్పించసాగింది. అయితే దైవప్రవక్త (సల్లం) చెట్ల చాటున నక్కి ఉండటాన్ని ఇబ్నె సయ్యాద్ తల్లి గమనించి వెంటనే "సాఫ్ (ఇబ్నె సయ్యాద్ పేరు)!" అని అరిచింది. తల్లి కేక వినగానే ఇబ్నె సయ్యాద్ ఒక్క ఉదుటున లేచి నిలబడ్డాడు. తరువాత దైవప్రవక్త (సల్లం) ఇబ్నె సయ్యాద్ని గురించి ప్రస్తావిస్తూ "ఇతని తల్లి గనక ఇతడ్ని లేపి ఉండకపోతే మనకు అతడ్ని గురించిన నిజానిజాలు తెలిసి ఉండేవి" అని వ్యాఖ్యానించారు.

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 178వ అధ్యాయం - కైఫ యూరజుల్ ఇస్లాము అలస్సబియ్యి)

1853. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- (1852వ హదీసులోని రెండవ అంశం) ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) ప్రజల ముందు ఉపన్యాసమిచ్చారు. ముందుగా ఆయన దేవుని ఔన్నత్యానికి తగిన విధంగా స్తోత్రం చేశారు. ఆ తర్వాత దజ్జాల్ని గురించి ప్రస్తావిస్తూ ఇలా అన్నారు: "నేను మిమ్మల్ని దజ్జాల్ని గురించి భయపెడ్తున్నాను. ప్రతి దైవప్రవక్తా తన జాతి ప్రజలకు దజ్జాల్ని గురించి భయపెట్టారు. చివరికి హజ్రత్ నూహ్ (అలైహి) కూడా తన జాతి ప్రజలకు అతడ్ని గురించి భయపెట్టారు. అయితే దజ్జాల్ గురించి పూర్వం ఏ దైవప్రవక్త కూడా తన జాతి ప్రజలకు తెలియజేయని ఒక విషయం నేను మీకు తెలుపుతున్నాను. గుర్తుంచుకోండి; దజ్జాల్ ఒంటికన్ను గలవాడయి ఉంటాడు. దేవుడు మాత్రం ఒంటికన్ను గలవాడు కాదు."

(సహీహ్ బుఖారీ:- 56వ ప్రకరణం - జిహాద్, 178వ అధ్యాయం - కైఫ యూరజుల్ ఇస్లాము అలస్సబియ్యి)

## 20వ అధ్యాయం - దజ్జాల్★ రూపురేఖలు, అతని శక్తిసామర్థ్యాలు

1854. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) ఓ రోజు ప్రజల ముంధు

★ దజ్జాల్ అనే పదం దజల్ అనే ధాతువు నుండి రూపాంతరం చెందింది. దజల్ అంటే దోషం, మోసం అని అర్థాలున్నాయి. దజ్జాల్ అంటే ప్రళయకాలం సమీపంలో పుట్టి తానే దేవుణ్ణని ప్రకటించుకునేవాడన్నమాట. అతను అనేక విధాల అసాధారణ శక్తులు కూడా కలిగి ఉంటాడు. ఇవన్నీ ముస్లింల విశ్వాసాన్ని పరీక్షించడానికి సంభవిస్తాయి. (సంకలనకర్త)

దజ్జాల్‌ని గురించి ప్రస్తావిస్తూ ఇలా సెలవిచ్చారు - "నిస్సందేహంగా మసీహ్ దజ్జాల్ ఒంటి కన్ను గలవాడయి ఉంటాడు. ఆ కన్ను పైకి ఉబికి వచ్చి ద్రాక్షపండులా స్పష్టంగా కన్పిస్తుంది. అయితే దేవుడు ఎంతమాత్రం ఒంటి కన్ను గలవాడు కాదు."

**(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 48వ అధ్యాయం - వజ్కుర్ ఫిల్ కితాబి మర్యం)**

1855. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- ప్రతి దైవప్రవక్త తన జాతి ప్రజలను ఒంటి కన్ను గలవాడయిన అసత్య దజ్జాల్‌ని గురించి భయపెట్టాడు (నేను కూడా మిమ్మల్ని ఆ దుర్మార్గుణ్ణి గురించి హెచ్చరిస్తున్నాను). గుర్తుంచుకోండి; అతను ఒంటికన్ను గలవాడయి ఉంటాడు. కరుణామయుడయిన మీ ప్రభువు మాత్రం ఒంటి కన్ను గలవాడు కాదు, దజ్జాల్ రెండు కండ్ల మధ్య "కాఫిర్" (సత్య తిరస్కారి) అని రాసి ఉంటుంది.

**(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్, 26వ అధ్యాయం - జిక్రిద్దజ్జాల్)**

1856. హజ్రత్ ఉఖ్బా బిన్ అమ్ర్ (రహ్మలై) హజ్రత్ హుజైఫా బిన్ యమాన్ (రజి)తో మాట్లాడుతూ "మీరు స్వయంగా దైవప్రవక్త (సల్లం) నోట విన్న హదీసులు మాకు విన్పించరా?" అని అడిగారు. దానికి హజ్రత్ హుజైఫా (రజి) సమాధానమిస్తూ "నేను దైవప్రవక్త (సల్లం) నోట ఈ హదీసు విన్నాను" అని చెబుతూ ఇలా విన్పించారు - "దజ్జాల్ బయల్వెడలినప్పుడు అతని దగ్గర నీరు, అగ్ని ఉంటాయి. అయితే ప్రజల కంటికి అగ్నిగా కన్పించేది నిజానికి చల్లటి నీరు మాత్రమే. అలాగే వారు నీరు అనుకునే వస్తువు మాడ్చివేసే అగ్ని అవుతుంది. కనుక మీలో ఎవరికైనా దజ్జాల్ తారసపడితే, అతను పైకి అగ్నిగా కనపడే దానిలో తనను తాను పడవేసుకోవాలి. ఎందుకంటే అది (అగ్ని కాదు) చల్లటి నీరు మాత్రమే అవుతుంది."

**(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 50వ అధ్యాయం - మాజుకిర అన్ బనీ ఇస్రాయీల్)**

1857. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- దజ్జాల్ గురించి ఏ దైవ ప్రవక్తా తన జాతి ప్రజలకు తెలపని సంగతి నేను మీకు తెలుపనా? దజ్జాల్ ఒంటికన్ను గలవాడయి ఉంటాడు. అతని దగ్గర స్వకల్పిత స్వర్గనరకాలు ఉంటాయి. అయితే అతను స్వర్గమని చెప్పేది నరకం అవుతుంది. హజ్రత్ నూహ్ (అలైహి) తన జాతి ప్రజలకు దజ్జాల్‌ని గురించి ఎలా భయపెట్టారో అలా నేను కూడా మిమ్మల్ని అతణ్ణి గురించి భయపెడ్తున్నాను.★

**(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 3వ అధ్యాయం - ఖౌలిల్లాహి (వలఖద్ అర్సల్నా నూహన్ ఇలా ఖౌమిహీ)**

---

★ ఇమామ్ నవవీ (రహ్మలై) ప్రకారం ఖాజీ అయాజ్ (రహ్మలై) ఇలా అన్నారు : దజ్జాల్ గురించి వచ్చిన హదీసులు అతనొక విశిష్ఠ వ్యక్తి కాగలడని నిరూపిస్తున్నాయి. దేవుడు ఇతని ద్వారా తన దాసులను పరీక్షిస్తాడు. దేవుడు తనకు మాత్రమే గల శక్తులలో కొన్నిటిని దజ్జాల్‌కు ప్రసాదిస్తాడు. ఉదాహరణకు : అతను మృతుల్ని బ్రతికిస్తాడు; అతని కాలంలో సిరిసంపదలు ఉంటాయి; అతని దగ్గర స్వకల్పిత స్వర్గనరకాలు ఉంటాయి; ప్రపంచ నిక్షేపాలపై అతనికి అధికారం ఉంటుంది; అతను ఆకాశాన్ని ఆదేశించి వర్షం కురిపిస్తాడు; అతని ఆజ్ఞతో భూమి అతను కోరిన చెట్లు మొలకెత్తిస్తుంది. ఇవన్నీ విధి నిర్ణయం ప్రకారం సంభవిస్తాయి. ఆ తరువాత దేవుడు అతని నుండి ఈ అసాధారణ శక్తులన్నిటినీ వెనక్కి తీసుకుంటాడు. దాంతో అతని పీచం అణగిపోతుంది. చివరికి అతణ్ణి హజ్రత్ మసీహ్ (అలైహి) సంహరిస్తారు. దేవుడు నిజమైన విశ్వాసులకు సత్యం, ధర్మంపై స్థిరంగా ఉండే సద్బుద్ధి ప్రసాదిస్తాడు. కపట విశ్వాసులు దజ్జాల్ వలలో చిక్కుకొని అవమానం పాలయి నాశనమవుతారు. యావత్తు షరీఅత్ వేత్తలు, హదీసు పండితుల దృక్పథం కూడా ఇదే. (సంకలనకర్త).

## 21వ అధ్యాయం - దజ్జాల్ వృత్తాంతం - దజ్జాల్ మదీనాలో ప్రవేశించలేడు

1858. హజ్రత్ అబూ సయీద్ ఖుదరీ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) మాకు దజ్జాల్ గురించి చాలా వివరంగా చెప్పారు. ఆయన చెప్పిన విషయాల్లో ఒకటి: మదీనా వీధుల్లో ప్రవేశించడం దజ్జాల్‌కు నిషేధించబడినందున అతను మదీనా చుట్టుప్రక్కల ఉన్న రాతి ప్రదేశాలలోని ఒక రాతి ప్రదేశానికి చేరుకుంటాడు. అప్పుడు అతని దగ్గరకు ఒక వ్యక్తి వెళ్తాడు. ఆ వ్యక్తి మదీనా పౌరులందరిలోకెల్లా ఎంతో మంచివాడయి ఉంటాడు. లేదా మదీనాలోని ఉత్తమ పౌరుల్లో ఒకడయి ఉంటాడు - అతను దజ్జాల్ దగ్గరికెళ్ళి "దైవప్రవక్త (సల్లం) తమ ప్రవచనాల్లో ప్రస్తావించిన దజ్జాల్ నువ్వేనని నేను సాక్ష్యమిస్తున్నాను" అని అంటాడు. అప్పుడు దజ్జాల్ జనంతో "మీ అభిప్రాయం ఏమిటి? నేనితణ్ణి చంపి తిరిగి బ్రతికిస్తే అప్పుడు కూడా మీరు నా గురించి అనుమానిస్తారా?" అని అంటాడు. దానికి వారు 'అనుమానించం' అనంటారు. దజ్జాల్ ఈ మాట విని ఆ వ్యక్తిని చంపివేస్తాడు. తరువాత అతణ్ణి బ్రతికిస్తాడు. ఆ వ్యక్తి తనను దజ్జాల్ బ్రతికించగానే "దైవసాక్షి! నాకీ రోజు ఇదివరకెన్నడూ లభించనంతటి దూర దృష్టి లభించింది" అని అంటాడు. దజ్జాల్ ఈ మాట విని "ఇప్పుడు నేనితణ్ణి చంపలేను, మీరు చంపండి" అని అంటాడు (తన అనుచర మూకతో).

(సహీహ్ బుఖారీ:- 29వ ప్రకరణం - ఫజాయిలిల్ మదీనా, 9వ అధ్యాయం - లా యద్ఖులుద్దజ్జాలుల్ మదీనా)

1859. హజ్రత్ ముగైరా బిన్ షాబా (రజి) కథనం :- నేను దజ్జాల్‌ని గురించి దైవప్రవక్త (సల్లం)ను అడిగినంతగా మరెవరూ అడగలేదు. (నేనిలా అడుగుతుంటే) "అతని వల్ల నీకొచ్చే నష్టమేమిటీ?" అని అన్నారు దైవప్రవక్త (సల్లం). "అతని దగ్గర రొట్టెల కొండ, నీటి కాలవ ఉంటాయని జనం చెబుతున్నారు. అందుకని నేను (భయపడి వివరాలు అడుగుతున్నాను)" అని అన్నాను నేను. దానికి దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ "ఉంటే ఉండవచ్చు. కాని దేవుని దృష్టిలో అతనికి పూచికపుల్లంత విలువ కూడా లేదు. అతని దగ్గర ఏమున్నప్పటికీ వాటి ద్వారా అతను విశ్వాసుల్ని సన్మార్గం నుంచి తప్పించలేడు" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్, 26వ అధ్యాయం - జిక్రిద్దజ్జాల్)

## 23వ అధ్యాయం - దజ్జాల్ రాక

1860. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- మక్కా, మదీనాలు తప్ప దజ్జాల్ ప్రవేశించని పట్టణం ఏదీ ఉండదు. ఈ రెండు పట్టణాల వీధుల్లో, సందుల్లో దైవదూతలు బారులు తీరి వాటిని పరిరక్షిస్తూ ఉంటారు. ఆ తరువాత మదీనా పట్నం తనలో నివసించే వారిని మూడు ఊపులు ఊపివేస్తుంది. తద్వారా దేవుడు మదీనా నుండి ప్రతి అవిశ్వాసిని, ప్రతి కపట విశ్వాసిని తీసి బయటికి విసిరేస్తాడు.

(సహీహ్ బుఖారీ:- 29వ ప్రకరణం - ఫజాయిలిల్‌మదీనా, 9వ అధ్యాయం - లా యద్ఖులుద్దజ్జాలుల్ మదీనా)

## 26వ అధ్యాయం - ప్రళయ సమీపంలో సంభవించే పరిణామాలు

1861. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ప్రళయం సంభవించే సమయంలో ప్రపంచంలో జీవించి ఉండే ప్రజలు అత్యంత నీచులయి ఉంటారు.

**(సహీహ్ బుఖారీ:- 92వ ప్రకరణం - ఫితన్, 5వ అధ్యాయం - జహూరిల్ ఫితన్)**

1862. హజ్రత్ సహెల్ బిన్ సాద్ (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) తమ చూపుడు వ్రేలును మధ్య వ్రేలుతో కలిపి చూపిస్తూ "నన్ను, ప్రళయాన్ని ఈ విధంగా పక్కపక్కన కలిపి పంపడం జరిగింది" అని అన్నారు (అంటే ప్రళయం అతి త్వరలోనే సంభవించనున్నదన్నమాట).

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 79వ సూరా (వన్నాజిఆత్))**

1863. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు :- దైవప్రవక్త (సల్లం) తమ చూపుడు వ్రేలిని, మధ్య వ్రేలితో కలిపి చూపిస్తూ "నన్ను ప్రళయాన్ని ఈ విధంగా పక్కపక్కన కలిపి పంపడం జరిగింది" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 39వ అధ్యాయం - ఖౌలిన్నబియ్యి (సల్లం) బుఇస్తు అనావస్సాఅతుకహాతైన్)**

## 27వ అధ్యాయం - రెండు శంఖారావాల మధ్య విరామం

1864. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- "రెండు శంఖారావాల మధ్య విరామం నలభై ఉంటుంద"ని దైవప్రవక్త (సల్లం) అన్నారు. ఒకతను ఈ ఉల్లేఖనం విని "నలభై అంటే నలభై రోజులా?" అని అడిగాడు. దానికి హజ్రత్ అబూ హురైరా (రజి) "నాకు తెలియదు" అని అన్నారు. ఆ వ్యక్తి మళ్ళీ "నలభై నెలలా?" అని అడిగాడు. "నేను చెప్పలేను" అన్నారు హజ్రత్ అబూ హురైరా (రజి). అతను మళ్ళీ "నలభై సంవత్సరాలా?" అని అడిగాడు. "నేనేదీ చెప్పలేను" - ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) ఇలా చెప్పారు :- "తర్వాత దేవుడు ఆకాశం నుండి వర్షం కురిపిస్తాడు. దాంతో మానవులు పచ్చిక మొలచినట్లు పునరుజ్జీవులయి లేస్తారు. ఒక గుదాస్థి* తప్ప మానవుని దేహమంతా చీకి మట్టి అయిపోతుంది. ఆ ఎముకతోనే మానవుల్ని ప్రళయ దినాన తిరిగి బ్రతికించడం జరుగుతుంది."

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 78వ సూరా - అమ్మ యతసాలూన్)**

---

★ ఇది వెన్నెముకలో చివరిదైన ఒక ముఖ్య భాగం. దీన్ని గుదాస్థి అంటారు, ఈ భాగం నుండే జంతువుల తోక పుట్టుంది. ఈ ఎముక చాల దృఢంగా, శిథిలం కాకుండా ఉంటుంది. గుదాస్థితో కూడిన వెన్నెముక మానవ దేహంలో కీలకస్థానం వహిస్తుంది. మొత్తం శరీర సమతౌల్యం దీని మీదే ఆధారపడి ఉంటుంది. (సంకలనకర్త)

# ప్రేమైక వచనాల ప్రకరణం

## ప్రాపంచిక వ్యామోహాన్ని పోగొట్టి హృదయాల్ని మృదువుగా మార్చే ప్రవచనాలు

1865. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- మృతుని వెంట మూడు వస్తువులు (సమాధి దగ్గరకు) వెళ్తాయి. వాటిలో రెండు వెనక్కి తిరిగివస్తాయి; ఒకటి మృతునితో పాటే ఉంటుంది. మృతుని వెంట వెళ్ళే మూడు వస్తువులు ఇవి - (1) మృతుని బంధుమిత్రులు, (2) అతని ఆస్తి (బానిసలు, పశువులు వగైరా), (3) అతని కర్మలు. వీటిలో బంధుమిత్రులు, ఆస్తి వెనక్కి తిరిగి వస్తాయి. కర్మలు మాత్రమే అతనితో పాటు ఉంటాయి.

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 42వ అధ్యాయం - సకరాతిల్ మౌత్)

1866. హజ్రత్ అమ్ర్ బిన్ ఔఫ్ అన్సారీ (రజి) - (ఈయన బద్ర్ యుద్ధంలో పాల్గొన్నారు. బనీ ఆమిర్ బిన్ లవ్వి తెగతో సంబంధమున్న మనిషి) కథనం :- దైవప్రవక్త (సల్లం) జిజ్యా (రక్షణ రుసుము) వసూలు చేసి తీసుకురావటానికి హజ్రత్ అబూ ఉబైదా బిన్ జిరాహ్ (రజి)ను బహ్రైన్‌కు పంపారు. దైవప్రవక్త (సల్లం) బహ్రైన్ ప్రజలతో సంధి చేసుకొని, హజ్రత్ ఇలా బిన్ హజ్రమీ (రజి)ని వారికి నాయకునిగా నియమించారు. హజ్రత్ అబూ ఉబైదా బిన్ జిరాహ్ (రజి) బహ్రైన్ నుండి జిజ్యా సొమ్ము తీసుకొని వచ్చారు. ఈ సంగతి అన్సారులకు తెలిసింది. మరునాడు ఉదయం నమాజు తర్వాత అందరూ దైవప్రవక్త (సల్లం) చుట్టూ గుమికూడారు. హజ్రత్ అబూ ఉబైదా (రజి) నమాజు ముగిసిన తరువాత వెళ్ళిపోతుంటే కొందరు అన్సారులు (సొమ్ము తెచ్చావా? అని) సైగ చేస్తూ అడిగారు. దైవప్రవక్త (సల్లం) అది గమనించి "అబూ ఉబైదా (రజి) సొమ్ము తెచ్చిన సంగతి మీకు తెలిసిందనుకుంటా" అన్నారు చిరునవ్వుతో. దానికి వారు "తెలిసింది దైవప్రవక్తా!" అన్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు : "మరి మీకు శుభవార్తే! మీకు సంతోషం కలిగించే వస్తువు మీకు లభిస్తుందని ఆశించండి. అయితే (ఒక విషయం) దైవసాక్షి! మీరు దారిద్ర్యానికి లోనవుతారని నాకెలాంటి భయం లేదు. నా భయమల్లా ప్రాపంచిక వ్యామోహం గురించే. గత సమాజాల ప్రజల్లా మీరూ ప్రాపంచిక వ్యామోహంలో ఒకర్నొకరు మించిపోవడానికి పోటీ పడతారేమోనని నేను భయపడుతున్నాను. ఈ ప్రపంచం (అంటే ఐహిక వ్యామోహం) వారిని నాశనం చేసినట్లే మిమ్మల్ని కూడా నాశనం చేస్తుంది."

(సహీహ్ బుఖారీ:- 58వ ప్రకరణం - జిజ్యా, 1వ అధ్యాయం - అల్‌జిజ్యతి వల్ మువాదఅతి మాఅహ్లిల్‌హర్బ్)

1867. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- మీలో ఎవరైనా ఐశ్వర్యంలో, దేహ నిర్మాణంలో (అంటే అందంలో) తనకంటే అధిక్యత ప్రసాదించబడిన మనిషిని గనక చూస్తే అతను తనకంటే తక్కువ స్థాయి గలవారిపై కూడా దృష్టి సారించాలి.

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 30వ అధ్యాయం - లియన్జుర్ ఇలామన్‌హువ అస్ఫలు మిన్హు వలా యన్జురు ఇలామన్ హువ ఫౌఖహు)

1868. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు:- పూర్వం ఇస్రాయీల్ సంతతిలో ఒక కుష్టు రోగి, ఒక బట్టతలవాడు, ఒక అంధుడు ఉండేవారు. దేవుడు వారు ముగ్గుర్నీ పరీక్షించదలచి ఒక దైవదూతను పంపాడు. ఆ దైవదూత (మానవాకారంలో) మొట్టమొదట కుష్ఠురోగి దగ్గరికెళ్ళి "నీకు అన్నిటికంటే ఎక్కువ యిష్టమైన వస్తువేది?" అని అడిగాడు. దానికా కుష్టురోగి "అందమైన రంగు, చర్మం. ముందు ఈ వ్యాధిపోవాలి. దీని మూలంగానే జనం నన్ను అసహ్యించుకుంటున్నారు" అని అన్నాడు. దైవదూత అతని శరీరాన్ని స్పృశించాడు. దాంతో అతని కుష్టురోగం పోయి అందమైన చర్మం, ఆకర్షవంతమైన రంగు లభించాయి. అప్పుడు దైవదూత అతనితో "నీకెలాంటి సంపద అంటే ఇష్టం?" అని అడిగాడు మళ్ళీ. దానికా వ్యక్తి "నాకు ఒంటెలంటే ఇష్టం" అని అన్నాడు. వెంటనే అతనికి పది నెలల సూడి ఒంటెలు ప్రసాదించబడ్డాయి. దైవదూత అతడ్ని ఆశీర్వదిస్తూ "దేవుడు నీ పశుసంపదలో శుభాభివృద్ధులు ప్రసాదించుగాక" అని అన్నాడు.

ఆ తరువాత దైవదూత బట్టతల వాడి దగ్గరకు వెళ్ళి "నీకు అన్నిటికంటే ఎక్కువ ఏది యిష్టం?" అని అడిగాడు. "నాకు అందమైన శిరోజాలంటే ఇష్టం. నా బట్టతలను చూసి జనం నన్ను అసహ్యించుకుంటున్నారు. అందుచేత ముందు ఈ బట్టతల పోయి మంచి వెండ్రుకలు రావాలి" అన్నాడు బట్టతలవాడు. దైవదూత చేత్తో అతని తల నిమిరాడు. దాంతో అతని బట్టతలపై అందమైన వెండ్రుకలు వచ్చేశాయి. "మరి నీకెలాంటి సంపదంటే ఇష్టం?" అని అడిగాడు దైవదూత మళ్ళీ. దానికా వ్యక్తి "నాకు ఆవులంటే మహా యిష్టం" అన్నాడు. వెంటనే దైవదూత అతనికి సూడి ఆవులు ఇచ్చేశాడు. పైగా "దేవుడు నీ యీ పశుసంపదలో శుభాభివృద్ధులు కలిగించుగాక!" అని దీవించాడు.

ఆ తరువాత దైవదూత అంధుడి దగ్గరకు వెళ్ళి "నీకు అన్నిటికంటే ఎక్కువ ఇష్టమైన వస్తువేది?" అని అడిగాడు. దానికా వ్యక్తి "దేవుడు నాకు దృష్టి ప్రసాదిస్తే చాలు, అదే నాకు పదివేలు" అని అన్నాడు. దైవదూత అతని ముఖంపై చెయ్యి తిప్పాడు. దేవుడు అతనికి దృష్టి ప్రసాదించాడు. అప్పుడు దైవదూత "సరే, నీకు ఎలాంటి సంపద అంటే ఇష్టం?" అని అడిగాడు. దానికా వ్యక్తి "నాకు మేకలంటే ఇష్టం" అని అన్నాడు. దైవదూత అతనికి సూడి మేకల్ని ఇచ్చాడు.

దైవదూత ఇచ్చిన ఒంటెలు, ఆవులు, మేకలు ఈని పశుసంపద వృద్ధి అయ్యింది. కుష్టురోగి దగ్గర ఒంటెల మంద, బట్టతల వాని దగ్గర ఆవుల మంద, అంధుని దగ్గర మేకల మంద అయ్యాయి.

కొంత కాలానికి ఆ దైవదూత ఇది వరకటి లాగే మానవాకారంలో (ఒకప్పటి) కుష్టురోగి దగ్గరకు వచ్చి "నేనొక పేదవాడ్ని, ప్రయాణంలో నా సాధన సంపత్తి అంతా పోయింది. ఇప్పుడు నేను దేవుని (దయ), నీ సహాయం లేకుండా నా యింటికి కూడా చేరుకోలేని పరిస్థితి వచ్చింది. అందుచేత నీకు అందమైన దేహం, రూపం, సిరిసంపదలు ప్రసాదించిన దేవుని పేరుతో అర్థిస్తున్నాను. నాకొక ఒంటెను దానం చెయ్యి. దాని మీదెక్కి నేను నా ఇంటికి చేరుకుంటాను" అని అన్నాడు. దానికా కుష్టురోగి (తన గత జీవితాన్ని విస్మరించి) ప్రస్తుతం నా బాధ్యతలు, ఖర్చులు బాగా పెరిగిపోయాయి (నేను నీకు ఎలాంటి సహాయం చేయలేను)" అని అన్నాడు. దైవదూత ఈ మాటలు విని "బహుశా నేను నిన్ను గుర్తుపట్టాననుకుంటా. నీవు గతంలో కుష్టురోగిగా ఉండేవాడివి కదూ? దాని వల్ల జనం నిన్ను అసహ్యించుకునేవారు. నీవు పేదవాడిగా ఉంటే, దేవుడు నీకు ఈ సంపద ప్రసాదించాడు. ఔను

కదూ?" అని అన్నాడు. కుష్ఠురోగి (ఈ వాస్తవాలను అంగీకరించకుండా) "ఈ సిరి సంపదలు తరతరాల నుంచి వస్తూ నాకు వారసత్వంలో లభించాయి" అని అన్నాడు. దానికి దైవదూత "నీవు చెప్పింది అబద్ధమయితే దేవుడు నిన్ను తిరిగి పూర్వస్థితికి చేర్చుగాక!" అని శపించాడు.

ఆ తరువాత దైవదూత తన మొదటి రూపంలోనే బట్టతల వాని దగ్గరకు వెళ్ళి, కుష్ఠురోగితో అన్న మాటలే అతనితో కూడా అన్నాడు. దానికి బట్టతల వాడు కూడా కుష్ఠురోగి ఇచ్చినటువంటి సమాధానమే ఇచ్చాడు. దైవదూత అతడ్ని కూడా శపిస్తూ "నీవు చెప్పింది అబద్ధమయితే దేవుడు నిన్ను పూర్వ స్థితికి తిరిగి చేర్చుగాక!" అని అన్నాడు.

అక్కడ్నుంచి దైవదూత తన మొదటి ఆకారంలోనే అంధుని దగ్గరకు వెళ్ళి "నేనొక నిరుపేదను, బాటసారిని, నా ప్రయాణ సామగ్రి అంతా అంతమయిపోయింది. ప్రస్తుతం నేను దేవుని (దయ), నీ సహాయం లేకుండా నా ఇంటికి చేరుకోలేని పరిస్థితి వచ్చింది. అందుచేత నీకు దృష్టి ప్రసాదించిన దేవుని పేరుతో అర్థిస్తున్నాను. నాకొక మేకను ఇచ్చెయ్యి. దాంతో నేను నా ప్రయాణాన్ని కొనసాగిస్తాను" అని అన్నాడు. దానికా అంధుడు సమాధానమిస్తూ "నిజమే, నేను అంధుడిగా ఉన్నప్పుడు దేవుడు నాకు దృష్టి ప్రసాదించాడు. నేను పేదవాడిగా ఉన్నప్పుడు ఆయన నన్ను ధనికుడిగా చేశాడు. నేనాయన పట్ల కృతజ్ఞతగా నా ఆస్తిలో నీవు కోరుకున్నది తీసుకునే అధికారం నీకిస్తున్నాను, దైవసాక్షి! ఈ రోజు నీవు దేవుని పేరుతో (నా ఆస్తిలో) ఏది తీసుకున్నా దానికి నేనెలాంటి అభ్యంతరం చెప్పను (నీవు నిస్సంకోచంగా తీసుకో)" అని అన్నాడు. దైవదూత ఈ మాటలు విని "నీ సంపద నీకే శుభప్రదం (నాకేమీ అవసరం లేదు). ఇదొక పరీక్ష మాత్రమే. (ఇందులో నీవు నెగ్గావు) తత్ఫలితంగా దేవుడు నీ పట్ల ప్రసన్నుడయ్యాడు. (ఈ పరీక్షలో) నీ సహచరులిద్దరు (విఫలమయి) దైవాగ్రహానికి గురయిపోయారు" అని అన్నాడు.

**(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 51వ అధ్యాయం - హదీసు అబ్రస్ వ అఖ్రు వ ఆమా ఫీ బనీ ఇస్రాయీల్)**

1869. హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి) కథనం :- నేను దైవమార్గంలో (శత్రువులపై) బాణాలు వదలిన మొట్టమొదటి అరబ్బు వ్యక్తిని[1] జబలా, సమర్ (వృక్షాల)[2] ఆకులు తప్ప తినడానికి మా దగ్గర ఏమీ లేని స్థితిలో కూడా మేము దైవమార్గంలో యుద్ధం చేశాము. ఆ రోజుల్లో మేము (ఆకులు, అలములు తినడం వల్ల) మేక పెంటికల్లాంటి మలాన్ని విసర్జించేవాళ్ళము. అందులో మరేమీ ఉండేది కాదు. అయినప్పటికీ ఈ రోజు ఈ బనీ అసద్ తెగవాళ్ళు నా ఇస్లామీయ ఆచరణ పట్ల (ఆగ్రహిస్తూ) నన్ను శిక్షింపజేయదలిచారు[3]. అలాగయితే నా జీవితం నిరర్థకమయినట్లే, నేను

---

(1) అవిశ్వాసుల వర్తక బిడారాల కదలికలను గమనించడానికి దైవప్రవక్త (సల్లం) ఒక చిన్న సైనిక దళాన్ని 'రాబగ్' అనే ప్రాంతానికి పంపించారు. అప్పుడు రెండు పక్షాల మధ్య బాణాలతో యుద్ధం జరిగింది. ఇది ముస్లింలకు - అవిశ్వాసులకు మధ్య జరిగిన మొదటి పోరాటం. ఆ సందర్భంలో హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి) ఇస్లాం తరపున మొట్టమొదటి బాణం (శత్రువులపై) వదిలారు. (సంకలనకర్త)

(2) జబలా, సమర్ అనేవి అడవి చెట్లు. (సంకలనకర్త)

(3) హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి) కూఫా ప్రాంతానికి గవర్నర్‌గా ఉన్నప్పుడు ఓసారి బనీ సాద్ తెగవాళ్ళు ఖలీఫా హజ్రత్ ఉమర్ (రజి) దగ్గరికెళ్ళి, హజ్రత్ సాద్ (రజి) నమాజ్ సరిగా చేయించరని ఫిర్యాదు చేశారు. అంతేగాక ఆయన చేస్తున్న మరికొన్ని పనుల పట్ల కూడా వారు అభ్యంతరం తెలిపారు. ఆ సందర్భంలో హజ్రత్ సాద్ (రజి) ఈ మాట అన్నారు: తాను దైవమార్గంలో మొట్టమొదటి బాణం వదలిన వ్యక్తిననీ, గడ్డు కాలంలో కూడా ధర్మయుద్ధం చేశానని, అలాంటి తన మీద వీరు చేస్తున్న ఈ ఆరోపణలు గనక నిజమయితే తన సత్కర్మలు, ఇస్లాంకు తాను చేసిన సేవలన్నీ నిరర్థకమయిపోయినట్లేనని ఆయన అన్నారు. (సంకలనకర్త)

చేసినదంతా బూడిదలో పోసిన పన్నీరయిపోతుంది.

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 17వ అధ్యాయం - కాన ఐమున్నబియ్యి (సల్లం) వఅస్‌హాబిహీ వ తఖల్లీహిమ్ మినద్దునియా)

1870. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు :- "దేవా! ముహమ్మద్ కుటుంబానికి కుటుంబం గడిచేటంత ఉపాధిని (మాత్రమే) ప్రసాదించు."

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 17వ అధ్యాయం - కానఐమున్నబియ్యి(సల్లం) వఅస్‌హాబిహీ)

1871. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- ముహమ్మద్ (సల్లం) కుటుంబం మదీనా వచ్చిన తరువాత ఏనాడూ వరుసగా మూడు రోజుల పాటు గోధుమ రొట్టెలు కడుపు నిండా తిని ఎరగదు. దైవప్రవక్త (సల్లం) నిర్యాణం దాక పరిస్థితి అలాగే ఉండింది.

(సహీహ్ బుఖారీ:- 70వ ప్రకరణం - అత్‌యిమ, 23వ అధ్యాయం - మాకానన్నబియ్యి (సల్లం) వఅస్‌హాబుహూ యాకులూన)

1872. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- ముహమ్మద్ కుటుంబం ఎప్పుడైనా రెండు రకాల ఆహారం తింటే అందులో ఒకటి తప్పకుండా ఖర్జూర పండ్లయి ఉండేవి.

(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 17వ అధ్యాయం - కైఫ కానఐమున్నబియ్యి (సల్లం) వ అస్‌హాబిహీ)

1873. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (ర.అన్‌హా) హజ్రత్ ఉర్వా (రజి)తో ఇలా అన్నారు : "బాబూ! మేము ఒక చంద్రుడ్ని చూసేవాళ్ళము; రెండు చంద్రుల్ని చూసేవాళ్ళము. ఈ విధంగా రెండు నెలల్లో మాకు మూడు చంద్రులు కన్పించేవారు. ఆ రెండు నెలల కాలంలో ముహమ్మద్ (సల్లం) ఇండ్లల్లో పొయ్యి రాజేయడమే జరిగేది కాదు".

హజ్రత్ ఉర్వా (రజి) ఈ మాట విని "పిన్నీ! మరి మీరప్పుడు ఏం తినేవారు?" అని అడిగారు. దానికి హజ్రత్ ఆయిషా (రజి) సమాధానమిస్తూ "రెండు నల్లని వస్తువులు తినేవాళ్ళము. అంటే ఖర్జూర పండ్లు, నీళ్ళు. అయితే అప్పుడప్పుడు దైవప్రవక్త పొరుగిళ్ళలోని అన్సార్ ముస్లింలు కొందరు ఆయన కోసం పాలు పంపేవారు. వారి దగ్గర పాడిపశువులు ఉండేవి. మేమా పాలను దైవప్రవక్త (సల్లం)కు ఇచ్చేవాళ్ళము" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 51వ ప్రకరణం - హిబా, 1వ అధ్యాయం - అల్‌హిబతి వ ఫజ్లిహా వత్తహ్‌రీజి అలైహి)

1874. హజ్రత్ ఆయిషా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) నిర్యాణం చెందే వరకు మేము రెండు నల్లని వస్తువులతో, అంటే ఖర్జూర పండ్లు, నీళ్ళతో మాత్రమే కడుపు నింపుకునేవాళ్ళము.

(సహీహ్ బుఖారీ:- 70వ ప్రకరణం - అత్‌యిమ, 6వ అధ్యాయం - మన్‌అకల హత్తాషబిఅ)

1875. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం :- దైవప్రవక్త (సల్లం) కుటుంబం ఏనాడూ వరుసగా మూడు రోజుల పాటు కూడా గోధుమ రొట్టెలు కడుపు నిండా తిని ఎరగదు. ప్రవక్త నిర్యాణం దాకా పరిస్థితి అలాగే ఉండేది.

(సహీహ్ బుఖారీ:- 70వ ప్రకరణం - అత్‌యిమ, 1వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (కులూమిన్ తయ్యిబాతి మా రజఖ్‌నాకుమ్)

## 1వ అధ్యాయం - దైవశిక్షకు గురయిన వారి ఊళ్ళ మీదుగా పోవలసివస్తే రోదిస్తూ వెళ్ళండి

1876. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఉపదేశించారు :- దైవశిక్ష విరుచుకుపడిన వారి (ప్రాంతాల) సమీపానికి వెళ్ళకండి. అటుగా వెళ్ళవలసివస్తే రోదిస్తూ వెళ్ళండి. రోదించలేని పక్షంలో అటుగా వెళ్ళకండి. వారిపై విరుచుకుపడిన శిక్ష మీపై కూడా విరుచుకుపడే ప్రమాదం ఉంది.[1]

(సహీహ్ బుఖారీ:- 8వ ప్రకరణం - సలాత్, 53వ అధ్యాయం - అస్సలాతి ఫీమవాజియిల్ ఖస్ఫి వల్ అజాబి)

1877. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం :- ప్రజలు ఓసారి దైవప్రవక్త (సల్లం) వెంట ప్రయాణమయి సమూద్ (జాతివాళ్ళ) ప్రాంతంలో విడిది చేశారు. అక్కడి బావుల్లో నుంచి నీళ్ళు చేదుకొని దాంతో పిండి పిసికారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు, "బావుల్లో నుండి తోడిన నీటిని పారబోయండి. ఆ నీరు కలిపి, పిసికిన పిండిని ఒంటెలకు (ఆహారంగా) వేయండి. హజ్రత్ సాలిహ్ (అలైహి) గారి ఒంటె నీరు త్రాగిన బావి నుండి మాత్రమే మీరు నీటిని చేదుకోండి."

(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం - అంబియా, 17వ అధ్యాయం - ఖౌలిల్లాహి తఆలా (వ ఇలా సమూద అఖాహుమ్ సాలిహా)

## 2వ అధ్యాయం - పేదలు, అనాథలు, వితంతువుల్ని ఆదుకోవాలి

1878. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు :- పేదలు, అనాథలు, వితంతువులు, ఏ ఆధారం లేని స్త్రీలకు సేవ చేస్తూ, వారి సంక్షేమం కోసం కృషి చేస్తూ ఉండేవాడు దైవమార్గంలో ధర్మపోరాటం చేసే వారి లాంటివాడు. లేదా పగలంతా ఉపవాసం పాటిస్తూ రాత్రిళ్ళు (దైవారాధనలో) గడిపే వారితో సమానుడవుతాడు.[2]

(సహీహ్ బుఖారీ:- 69వ ప్రకరణం - నఫఖాత్, 1వ అధ్యాయం - ఫజ్లిన్నఫఖతి అలల్ అహ్లి)

## 3వ అధ్యాయం - మస్జిద్ నిర్మాణం గొప్ప పుణ్యకార్యం

1879. హజ్రత్ ఉబైదుల్లా ఖౌలాని (రహ్మాలై) కథనం :- మస్జిదె నబవీ (ప్రవక్త మస్జిదు) నిర్మాణం విషయంలో ప్రజలు అభ్యంతరం లేవనెత్తినప్పుడు వారితో హజ్రత్ ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్ (రజి) ఇలా అన్నారు : "మీరు చాలా మాటలు కల్పించి చెప్పారు. కాస్త దైవప్రవక్త (సల్లం) ప్రవచనం కూడా వినండి- కేవలం దేవుని ప్రసన్నతను ఆశిస్తూ మస్జిద్‌ని కట్టించినవాడి కోసం దేవుడు స్వర్గంలో అలాంటిదే ఒక గృహాన్ని కట్టిస్తాడు - అని ఆయన (స) చెబుతుంటే నేను విన్నాను."

(సహీహ్ బుఖారీ:- 8వ ప్రకరణం - సలాత్, 65వ అధ్యాయం - మన్ బనా మస్జిదా)

---

1. దైవప్రవక్త (సల్లం) తమ అనుచరులతో తబూక్ దండయాత్రకు వెళ్తూ సమూద్ జాతి ప్రాంతమయిన 'హజ్ర్' ప్రాంతం గుండా నడవవలసివచ్చినప్పుడు ఈ మాట అన్నారు. సమూద్ జాతి ప్రజలపై పూర్వం దైవశిక్ష విరుచుకుపడింది. (సంకలనకర్త)

2. అంటే అలాంటి వ్యక్తికి ధర్మపోరాటం, ఉపవాసం లాంటి గొప్ప సత్కార్యాలు చేసినంత పుణ్యం లభిస్తుందని అర్థం. (సంకలనకర్త)

## 5వ అధ్యాయం - లోకుల మెప్పు కోసం చేసే పనులు నిషిద్ధం

1880. హజ్రత్ జున్దుబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :- ఎవరు తన సత్కార్యాలను గురించి జనానికి చెప్పుకుంటాడో దేవుడు (ప్రళయ దినాన) అతని (దుష్ట సంకల్పం, ప్రదర్శనా బుద్ధుల్ని) గురించి ప్రజల ముందు బట్టబయలు చేస్తాడు. అలాగే ఎవరు తన సత్కార్యాలను ప్రజల ముందు ప్రదర్శిస్తాడో దేవుడు (ప్రళయదినాన) అతని (నరక యాతనల)ని ప్రజలకు చూపుతాడు*.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 36వ అధ్యాయం - అర్రియాయి వస్సుమ్ అతి)**

## 6వ అధ్యాయం - నోటిని అదుపులో ఉంచుకోవాలి

1881. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు:- ఒక్కోసారి మనిషి అనాలోచితంగా ఒక మాట అంటాడు. దాని వాస్తవిక భావం, పర్యవసానాలను గురించి అంతగా పట్టించుకోడు. కాని ఆ ఒక్క మాట వల్లే అతను నరకాగ్నిలోకి జారి, తూర్పు నుండి పడమర అంత దూరాన పడిపోతాడు.

**(సహీహ్ బుఖారీ:- 81వ ప్రకరణం - రిఖాఖ్, 23వ అధ్యాయం - హిఫ్జిల్లిసాన్)**

## 7వ అధ్యాయం - లోకులకు నీతులు చెప్పి తాను మాత్రం నీతిరాహిత్యంలోనే పడి ఉండేవాడు

1882. హజ్రత్ అబూ వాయిల్ (రహ్మాలై) కథనం:- హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి)తో కొందరు మాట్లాడుతూ "మీరు ఆయన దగ్గరకు (అంటే హజ్రత్ ఉస్మాన్-రజి దగ్గరకు) వెళ్ళి (ఈ సంక్షోభం గురించి) ఎందుకు మాట్లాడరు?" అని అన్నారు. దానికి హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) సమాధానమిస్తూ "నేనిప్పుడే మీ ముందే ఆయనతో మాట్లాడుతానని భావిస్తున్నారా మీరు? నేనాయన్ని ఏకాంతంలో కలసి మాట్లాడుతాను. కల్లోలం మరింత రేకెత్తని విధంగా మాట్లాడుతాను. అందరికన్నా ముందు నేనీ కల్లోల ద్వారం తెరవదలచుకోలేదు. నేను దైవప్రవక్త (సల్లం) నోట ఒక మాట విన్న తర్వాత కూడా, మనకు నాయకుడయిన వాడు అందరికన్నా మంచివాడని నేను చెప్పలేను" అని అన్నారు. వారి మాటలు విని "ఇంతకు మీరు దైవప్రవక్త (సల్లం) నోట ఏం విన్నారు?" అని అడిగారు. దానికి హజ్రత్ ఉసామా (రజి) "నేను దైవప్రవక్త నోట ఈ మాట విన్నా"నంటూ ఈ విధంగా తెలియజేశారు -

"ప్రళయదినాన ఒక వ్యక్తిని తెచ్చి నరకంలో వేయడం జరుగుతుంది. అతని ప్రేగులు (కడుపులో నుండి) బయటికి వచ్చి పడతాయి. అతనా ప్రేగుల్ని పట్టుకొని గానుగెద్దులా తిరుగుతూ

---

★ హాఫిజ్ మన్జరీ (రహ్మాలై) ఇలా రాస్తున్నారు : పేరు ప్రతిష్ఠల కోసం, ప్రదర్శనా బుద్ధితో తన సత్కర్మలను ప్రజలకు చూపే వ్యక్తి దుష్ట సంకల్పాన్ని దేవుడు ప్రళయ దినాన ప్రజల ముందు బట్టబయలు చేసి అతడ్ని అవమానం పాలు చేస్తాడని ఈ హదీసు భావం. అంతే కాదు, ప్రపంచంలో అతడ్ని ఎంతో పుణ్యాత్ముడని భావించిన వారంతా అతని నిజస్వరూపాన్ని, దుష్టబుద్ధిని తెలుసుకోవడానికి దేవుడు వారందరి ముందు అతడ్ని తీవ్రంగా శిక్షిస్తాడు కూడా. (సంకలనకర్త)

ఉంటాడు. (తోటి) నరకవాసులంతా అతని దగ్గరకు చేరి "అరే! ఏమయింది నీకు (ఇలా నరకంలోకి వచ్చి పడ్డావు)? నీవు ప్రజలకు సత్కార్యాలను గురించి ఉపదేశిస్తూ దుష్కార్యాల నుండి వారిస్తూ ఉండేవాడివి కదా?" అని అంటారు. దానికా వ్యక్తి సమాధానమిస్తూ "నిజమే. నేను మీకు సత్కార్యాలను గురించి హితబోధ చేసేవాడ్ని. కాని నేను మాత్రం ఎలాంటి సత్కార్యాన్ని చేసేవాడ్ని కాను. మిమ్మల్ని దుష్కార్యాలు చేయవద్దని వారిస్తూ ఉండేవాడ్ని. కాని స్వయంగా నేనా దుష్కార్యాలకు పాల్పడుతుండేవాడ్ని" అని అంటాడు.

**(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్ఉల్ ఖల్ఖ్, 10వ అధ్యాయం-సిఫతిన్నారి వఅన్నహా మఖ్లూఖా)**

## 8వ అధ్యాయం - మనిషి తన రహస్య పాపాలను బయట పెట్టుకోకూడదు

1883. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు:- తమ పాపాలను తాము స్వయంగా బహిర్గతం చేసుకున్న వారి పాపాలు★ తప్ప నా అనుచర సమాజం (ఉమ్మత్) వారి పాపాలన్నీ క్షమించబడతాయి. మనిషి రాత్రివేళ ఏదైనా పాపకార్యం చేసి, తెల్లవారిన తరువాత దేవుడు తన పాపాన్ని మరుగు పరచి ఉన్నప్పటికీ దాన్ని ఇతరుల ముందు బయటపెట్టుకుంటూ "నేను రాత్రి ఈ పాపం చేశాను" అని చెప్పుకోవడం కూడా సిగ్గుమాలిన పనే అవుతుంది. అతని ప్రభువు (తెలిసి కూడా) అతని పాపాలను మరగుపరచి ఉంచితే, అతను తెల్లవారిన తర్వాత లేచి వాటిని జనం ముందు బయట పెట్టుకుంటున్నాడు. (అంతకంటే సిగ్గు చేటయిన పని మరేముంటుంది?)

**(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 60వ అధ్యాయం - సత్రిల్ మూమిని అలా నఫ్సిహీ)**

## 9వ అధ్యాయం - తుమ్మిన వాడికి 'యర్హముకల్లాహ్' అని సమాధానమివ్వాలి, ఆవులించడం మంచిది కాదు

1884. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) సన్నిధిలో ఇద్దరు వ్యక్తులు తుమ్మారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) వారిలో ఒకనికి 'యర్హముకల్లాహ్' (దేవుడు నిన్ను కరుణించుగాక!) అని చెప్పారు. రెండో వ్యక్తికి ఏమీ చెప్పలేదు. దానికి కారణం ఏమిటని అడిగినప్పుడు ఆయన ఇలా చెప్పారు, "అతను (తుమ్మి) 'అల్హమ్దులిల్లాహ్' అన్నాడు. రెండవతను అల్హమ్దులిల్లాహ్ అని చెప్పలేదు. (అంచేత ఈ రెండో వ్యక్తికి నేను 'యర్హముకల్లాహ్' అని సమాధానమివ్వలేదు).

**(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 123వ అధ్యాయం - అల్హమ్దిలిల్ ఆతిస్)**

1885. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు:- ఆవు

★ అంటే కొందరు సిగ్గూ ఎగ్గూ లేకుండా అందరి ముందు బహిరంగంగా పాపకార్యాలకు పాల్పడతారని అర్థం. లేదా తమ పాపకార్యాలను గురించి తామేదో ఘనకార్యం చేసినట్లు గర్వపడుతూ నలుగురి ముందూ బాహాటంగా చెప్పుకుంటారని అర్థం.

(అనువాదకుడు)

లింత షైతాన్ తరఫు నుండి వస్తుంది. కనుక మీలోఎవరికైనా ఆవులింతవస్తే అతను వీలైనంతవరకు దాన్ని ఆపుకోవడానికి ప్రయత్నించాలి.[1]

(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బదఉల్‌ఖల్ఖ్, 11వ అధ్యాయం - సిఫతి ఇబ్లీస వ జునూదిహీ)

## 11వ అధ్యాయం - ఎలుక ప్రస్తావన

1886. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు:- ఇస్రాయీల్ సంతతికి చెందిన ఒక వర్గం అదృశ్యమయిపోయింది. వారేమయిపోయారో తెలియదు. వారు ఎలుకలుగా మారిపోయి ఉండవచ్చని నేను భావిస్తున్నాను. ఎందుకంటే ఈ ఎలుకల ముందు ఒంటె పాలు పెడితే వాటిని త్రాగవు (యూద మతంలో ఒంటె నిషిద్ధం); మేక పాలు పెడితే మాత్రం హాయిగా తాగేస్తాయి.

హజ్రత్ అబూ హురైరా (రజి) ఉవాచ:- నేనీ హదీసుని కాబ్ అహ్‌బార్ (రహ్మలై)కు విన్పించినప్పుడు ఆయన (దాన్ని ఓ పట్టాన నమ్మలేక) "ఈ మాటను మీరు దైవప్రవక్త (సల్లం) నోట విన్నారా?" అని అడిగారు. నేను 'ఔనన్నాను'. కాని ఆయన ఈ ప్రశ్నే అనేకసార్లు అడిగారు. చివరికి నేను "కాకపోతే నేను తౌరాత్ గ్రంథం చదివాననుకుంటున్నారా?" అని అన్నాను.[2]

(సహీహ్ బుఖారీ:- 59వ ప్రకరణం - బద్‌యిల్‌ఖల్ఖ్, 15వ అధ్యాయం - ఖైరుమాలిల్ ముస్లిమి గనమ్ యత్‌బవు బిహా షాఫల్ జిబాల్)

## 12వ అధ్యాయం - విశ్వాసి ఒక రంధ్రం గుండా రెండు సార్లు నెట్టబడలేడు

1887. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- విశ్వాసి ఒక

(1) ఆవులింత షైతాన్ తరఫు నుండి వస్తుంది అంటే, మనిషి విలువైన ఆహారాన్ని హద్దు మీరి తినడం వల్ల ఉదర భారంతో ఆవులిస్తాడు. ఇక్కడ హద్దు మీరి తినడాన్ని షైతాన్ చేష్టగా వర్ణించటం జరిగింది. ఆవులింత అవసరానికి మించి తినడాన్ని సూచిస్తుంది. ఆవులింతను ఆపడం అంటే, ఆవులింతకు కారణభూతమయ్యే పనులను మానుకోవాలని అర్థం. ఉదాహరణకు - మితిమీరి తినడం, అతిగా విశ్రాంతికి అలవడటం ఇత్యాదివి. వీలైనంతవరకు ఆవులింత రాకుండా ఆపుకోవడం అని కూడా అర్థం వస్తుంది. ఒకవేళ ఆవులింత ఆగకపోతే ఆ సమయంలో షైతాన్ ఆశయం నెరవేరకుండా, అంటే వాడు నోట్లో దూరి మనిషి ముఖాన్ని చెడగొట్టనీకుండా నోటి మీద చెయ్యి పెట్టుకోవాలి. (సంకలనకర్త)

(2) రూపాంతరం చెందిన మానవ సంతతి ప్రపంచంలో కొనసాగుతుందా లేదా అనే విషయమయి ధర్మవేత్తలలో భేదాభిప్రాయాలున్నాయి. అబూ ఇస్‌హాఖ్, జజాజ్, ఇబ్నె అరబి, అబూబకర్ (రహ్మలై)లు ప్రస్తుత వానరాలు బనీ ఇస్రాయీల్ ప్రజల్లో రూపాంతరం చెందిన వర్గానికి చెందిన సంతతి అని అభిప్రాయపడ్డారు. దీనికి వారు ఈ హదీసుని ప్రమాణంగా పేర్కొంటున్నారు. కాని అధిక సంఖ్యాక ధర్మవేత్తల దృక్పథం ప్రకారం రూపాంతరం చెందిన మానవ వర్గం సంతతి కొనసాగదు అంటే అది ఎప్పుడో అంతరించి ఉంటుందని భావం. దీనికి వారు హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్‌వూద్ (రజి) గారి హదీసుని ప్రమాణంగా పేర్కొంటున్నారు. ఆయన ఇలా అన్నారు : "దేవుడు ఏదైనా జాతిని నాశనం చేయదలచుకుంటే దానిపై (ప్రకృతి వైపరీత్యాలు వగైరా రూపంలో) శిక్ష అవతరింపజేస్తాడు. దాంతో శిక్షకు గురయిన ఆ జాతి వారి సంతతి (ప్రపంచంలో) మిగిలి ఉండదు."

హజ్రత్ అబూ హురైరా (రజి) "నేను తౌరాత్ గ్రంథం చదివాననుకుంటున్నారా?" అని అన్నారంటే తౌరాత్ లేక తల్మూద్ గ్రంథంలో అలాంటి విషయం ఏదైనా ఉండవచ్చని తెలుస్తోంది. హజ్రత్ కాబ్ అహ్‌బార్ (రజి) ఇస్లాం స్వీకరించక పూర్వం యూద మతంలో ఉండి తల్మూద్ (తౌరాత్) గ్రంథాన్ని కాచి వడబోసి ఉన్న గొప్ప పండితుడు. ఆయనకు ఈ విషయం తెలిసి ఉంటుంది. అందువల్ల ఈ మాట ఆయన హజ్రత్ అబూ హురైరా (రజి) నోట విన్నప్పుడు బహుశా ఆయన తౌరాత్ చదివో లేక ఏ యూదుని ద్వారా వినో ఉంటారని అనుమానించి 'మీరీ మాటను నిజంగా దైవప్రవక్త (సల్లం) నోట విన్నారా?' అని రెట్టించి అడిగారు. దానికి హజ్రత్ అబూ హురైరా (రజి) తాను తౌరాత్ చదవలేదని అన్నారు. (సంకలనకర్త)

రంధ్రం గుండా రెండు సార్లు త్రోయబడలేడు (అంటే, ఒక పనివల్ల చేదు అనుభవం ఎదురయిన తరువాత విశ్వాసి తిరిగి అదే పని జోలికిపోడన్నమాట. విశ్వాసికి ఆ మాత్రం అప్రమత్తత, దూరదృష్టి ఉండాలి).

(సహీహ్ బుఖారీ:- 78వ ప్రకరణం - అదబ్, 83వ అధ్యాయం - లా యుల్దగుల్ మూమిను మిన్ జుహ్రిన్ మర్రతైన్)

## 14వ అధ్యాయం - మితిమీరిన ముఖస్తుతి మంచిది కాదు

1888. హజ్రత్ అబూ బక్రా (రజి) కథనం:- ఒకతను దైవప్రవక్త (సల్లం) ముందు ఒక వ్యక్తిని పొగిడాడు. దైవప్రవక్త (సల్లం) అది విని "నువ్వు చెడ్డపని చేశావు. నీవు పొగడ్తలతో, నీ మిత్రుని గొంతుకోశావు" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ మాట అనేకసార్లు అన్నారు. తర్వాత ఆయన ఇలా అన్నారు : "మీలో ఎవరైనా మీ సోదరుణ్ణి పొగడటం చాలా అవసరమని భావించినప్పుడు ఈ విధంగా అనాలి - 'ఇది నా అభిప్రాయం. వాస్తవ పరిస్థితి దేవునికి మాత్రమే తెలుసు. నేను దేవునికి వ్యతిరేకంగా ఎవరి పవిత్రతనూ నిరూపించడం లేదు. ఆ వ్యక్తి ఇలాంటివాడు, అలాంటివాడు అని అన్నానంటే ఇది నా వ్యక్తిగత అభిప్రాయం మాత్రమే' - ఈ మాటలయినా ఆ మనిషిని గురించి మీకు వ్యక్తిగతంగా తెలిసి ఉన్నప్పుడే అనాలి. (అంతేగాని ఎవరో చెప్పిన మాటలు విని పొగడకూడదు)".

(సహీహ్ బుఖారీ:- 52వ ప్రకరణం - అష్షహాదాత్, 16వ అధ్యాయం - ఇజా జక్కా రజులున్ రజులన్ కఫాహు)

1889. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం:- ఒకతను ఒక వ్యక్తిని మితిమీరిన పొగడ్తలలో ముంచెత్తాడు. దైవప్రవక్త (సల్లం) అది విని "నువ్వు అతణ్ణి నాశనం చేశావు కదా!" అని అన్నారు. లేక "నువ్వు అతని నడుం విరగ్గొట్టావు కదా!" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 52వ ప్రకరణం - అష్షహాదాత్, 17వ అధ్యాయం - మాయుక్రహు మినల్ ఇతనాబ్ ఫిల్ మద్హి వల్యఖుల్ మాయాలమ్)

## 15వ అధ్యాయం - వయస్సులో పెద్దవారికి (ముందుగా) ఇవ్వాలి

1890. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు:- నేను (కలలో) మిస్వాక్ (పలుదోము పుల్ల)తో పళ్ళు తోముకుంటుంటే నా దగ్గరకు ఇద్దరు వ్యక్తులు రావడం చూశాను. వారిలో ఒకడు వయస్సులో పెద్దవాడు. నేను నా పలుదోము పుల్లను వారిద్దరిలో చిన్నవాడికిచ్చాను. అప్పుడు నాతో ఎవరో "పెద్దవాడికిచ్చేయి" అని అన్నారు. నేనీ మాట విని మిస్వాక్ని పెద్దవాడికి ఇచ్చేశాను.

(సహీహ్ బుఖారీ:- 4వ ప్రకరణం - వుజూ, 74వ అధ్యాయం - దఫయిస్సివాకి ఇలల్ అక్బర్)

## 16వ అధ్యాయం - నింపాదిగా మాట్లాడాలి, విద్యను వ్రాయాలి

1891. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) మాట్లాడేటప్పుడు చాలా నెమ్మదిగా (ఆగి ఆగి) మాట్లాడుతారు. ఆయన మాటలను ఎవరైనా లెక్కించదలచుకుంటే వాటిని సులభంగా లెక్కించుకోగలరు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 23వ అధ్యాయం - సిఫతిన్నబియ్యి(సల్లం))

## 19వ అధ్యాయం - దైవప్రవక్త (సల్లం) హిజ్రత్ (వలస) సంఘటన

1892. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం:- హజ్రత్ అబూబకర్ (రజి) మా నాన్న గారి దగ్గరకు (ఇంటికి) వచ్చి ఆయన వద్ద ఒక అంబారీని కొన్నారు. ఆయన మా నాన్నగారు ఆజిబ్‌తో మాట్లాడుతూ "మీ అబ్బాయిని నా వెంట పంపించండి, ఈ అంబారీని మా ఇంటికి చేర్చుతాడు" అని అన్నారు. అప్పుడు నేను అంబారీని ఎత్తుకొని ఆయన వెంట బయలుదేరాను. మా నాన్నగారు కూడా డబ్బు వసూలు చేసుకోవడానికి బయలుదేరారు. ఆ సందర్భంలో మా నాన్నగారు ఆయనతో మాట్లాడుతూ "అబూబకర్! మీరు దైవప్రవక్త (సల్లం) (మక్కా నుండి మదీనాకు) బయలుదేరిన సంఘటన కాస్త నాకు తెలియజేయండి" అని అన్నారు. అప్పుడు హజ్రత్ అబూబకర్ (రజి) ఇలా తెలియజేశారు - "సరే (వినండి). మేము ఆ రోజు రాత్రంతా నడిచాము. మరునాడు ఉదయం కూడా నడక సాగించాము. సూర్యుడు నెత్తి మీద వచ్చి మధ్యాహ్నం వేళ అయ్యే వరకు నడుస్తూనే పోయాము. దారిలో ఎక్కడా ఒక్క బాటసారి కూడా లేకుండా పరిసరాలు నిర్మానుష్యంగా ఉన్నాయి. ఆ స్థితిలో మా ఎదురుగా ఓ పొడుగాటి చట్టుబండ కన్పించింది. అక్కడ మంచి నీడ కూడా ఉంది. మేము అక్కడికెళ్ళి దిగాము. దైవప్రవక్త (సల్లం) విశ్రాంతి తీసుకోవడానికి వీలుగా నేను నేలను చదునుచేసి, కంబళి పరచి "దైవప్రవక్తా! మీరిక విశ్రాంతి తీసుకోండి. నేను మీ భద్రత కోసం పరిసరాలను గమనిస్తూ కాపలా కాస్తూ ఉంటాను" అని అన్నాను. ఆ తరువాత నేను లేచి నలువైపులా ఓసారి కలియచూశాను. అప్పుడు అకస్మాత్తుగా నాకొక మేకల కాపరి మేకలను తోలుకుంటూ మా వైపు రావడం కన్పించింది. అతను కూడా మాలాగే నీడలో విశ్రాంతి తీసుకోదలిచాడు. అతను దగ్గరకు వచ్చిన తరువాత "అబ్బాయీ! నువ్వు ఎవరి బానిసవు?" అని అడిగాను. దానికా కుర్రవాడు "మక్కా లేక మదీనాలో (ఉల్లేఖకునికి అనుమానం కలిగింది) ఫలానా వ్యక్తి బానిసను" అని అన్నాడు. "సరే, నీ మేకల పొదుగుల్లో పాలున్నాయా?" అని అడిగాను మళ్ళీ. అతను ఉన్నాయ్ అన్నాడు. "మరి మాకు పాలిస్తావా?" అడిగాను నేను. అతను ఇస్తానన్నాడు. ఆ తరువాత అతను ఒక మేకను పట్టుకొని తెచ్చాడు. నేనతనితో "దాని పొదుగు మీదున్న మురికి, మలినం, వెంట్రుకల్ని శుభ్రపరచు" అని అన్నాను.

- ఉల్లేఖకుని ఉవాచ: హజ్రత్ హుజైఫా (రజి)ఈ హదీసు వివరిస్తూ తన చేతుల్ని ఒక దాని మీద మరొకటి పెట్టి కొట్టి విదిలిస్తూ ఈ విధంగా అని చూపారు -

అప్పుడా కుర్రవాడు ఒక పాత్రలో కొంచెం పాలు పితికాడు. దైవప్రవక్త (సల్లం) నీళ్ళు త్రాగడానికి, వుజూ చేసుకోవడానికి పనికొస్తుందని నేను ఒక తోలు సంచి కూడా వెంట తెచ్చుకున్నాను. సరే, నేనా పాలను తీసుకొని దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళాను. అప్పుడాయన నిద్రపోతున్నారు. నేనాయనకు నిద్రాభంగం చేయదలచుకోలేదు. అయితే నేను వెళ్ళేటప్పటికి యాదృచ్ఛికంగా ఆయనే మేల్కొన్నారు. నేను చల్లదనం కోసం ఆ పాలలో కొంచెం నీళ్ళు కలిపి (పాత్రను అందిస్తూ) "దైవప్రవక్తా! ఈ పాలు త్రాగండి" అని అన్నాను. ఆయన పాలు త్రాగారు. దాంతో నా మనస్సుకు ఊరట కలిగింది. ఆ తరువాత ఆయన "మనం బయలుదేరే సమయం ఇంకా రాలేదా?" అని అన్నారు. "ఎందుకు రాలేదు, వచ్చింది" అన్నాను నేను. సూర్యుడు నెత్తిమీది నుండి కాస్త వాలగానే మేము బయలుదేరాము.

(మేము వెళ్తుంటే మా వెనుక) సురాఖా బిన్ మాలిక్ మమ్మల్ని వెంబడించడం చూసి "దైవప్రవక్తా! వారు మనదాకా చేరుకున్నారు" అని అన్నాను (ఆందోళనపడుతూ). దానికి ఆయన "భయపడకండి, అల్లాహ్ మనకు తోడున్నాడు" అని అన్నారు.

ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) అతడ్ని శపించారు. దాంతో అతని గుర్రం నేలగట్టిగా ఉన్నా అతడ్ని తీసుకొని పొట్టదాకా నేలలో దిగబడిపోయింది. సురాఖా (మమ్మల్ని సంబోధిస్తూ) "నన్ను మీరిద్దరు శపించారనుకుంటా. (ఈ ఆపద నుండి నన్ను కాపాడమని) దైవాన్ని ప్రార్థించండి. దేవుడు మీ వైపున్నాడు. మీకు తోడుగా (నాకీ మేలు చేస్తే) మిమ్మల్ని వెంబడిస్తూ వచ్చే (ప్రతివాడ్నీ) నేను మీ వైపుకు రాకుండా నిరోధిస్తాను" అని అన్నాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) అతని కోసం దైవాన్ని ప్రార్థించారు. దాంతో అతనా ఆపద నుండి బయటపడ్డాడు. ఆ తరువాత అతను దారిలో కనపడే ప్రతి వ్యక్తితో "నేనీ వైపు క్షుణ్ణంగా చూశాను. వారిటువైపు రానే రాలేదు" అని చెప్పి తిప్పి పంపేవాడు. ఈ విధంగా సురాఖా తన వాగ్దానాన్ని నిలబెట్టుకున్నాడు.

(సహీహ్ బుఖారీ:- 61వ ప్రకరణం - మనాఖిబ్, 25వ అధ్యాయం - అలామాతిన్నుబువ్వతి ఫిల్ ఇస్లాం)

# వ్యాఖ్యాన ప్రకరణం

1893. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు:- ఇస్రాయీల్ సంతతివారికి "పట్టణ ముఖద్వారం గుండా వంగి హిత్తతున్, హిత్తతున్* అంటూ ప్రవేశించండి" (2:58) అని ఆజ్ఞ అయింది. కాని వారు దైవాజ్ఞ భావాన్ని మార్చివేశారు. పాప క్షమాపణ అనడానికి బదులు 'వెన్నులో గింజ' అంటూ పిరుదులను ఈడుస్తూ (కుప్పిగంతులేస్తూ) ప్రవేశించారు.

**(సహీహ్ బుఖారీ:- 60వ ప్రకరణం-అంబియా, 28వ అధ్యాయం - హద్దసనీ ఇస్‌హాఖుబ్ను నస్ర్)**

1894. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం:- దైవప్రవక్త (సల్లం) జీవిత చరమదశలో దేవుడు నిరంతరాయంగా మాటిమాటికి దివ్యావిష్కృతి (వహీ)ని అవతరింపజేశాడు. ముఖ్యంగా ఆయన నిర్యాణానికి ముందు అనేకసార్లు దివ్యావిష్కృతి అవతరించింది. ఆ తర్వాత ఆయన ఇహలోకం వీడిపోయారు.

**(సహీహ్ బుఖారీ:- 66వ ప్రకరణం - ఫజాయిలె ఖుర్ఆన్, 1వ అధ్యాయం - కైఫ నుజూలుల్ వహీయి)**

1895. హజ్రత్ తారిఖ్ బిన్ షిహాబ్ (రహ్మలై) కథనం:- ఒక యూద మతస్థుడు హజ్రత్ ఉమర్ (రజి)తో మాట్లాడుతూ "విశ్వాసుల నాయకా! మీ గ్రంథంలో మీరు పఠించే ఒక సూక్తి ఉంది. ఆ సూక్తి గనక మా యూదులపై అవతరించి ఉంటే, మేమా సూక్తి అవతరించిన రోజును పండుగ దినంగా చేసుకునేవాళ్ళము" అని అన్నాడు. హజ్రత్ ఉమర్ (రజి) "ఆ సూక్తి ఏది?" అని అడిగారు. యూదుడు ఆ సూక్తిని ఇలా పఠించాడు, "నేనీ రోజు మీ కోసం మీ ధర్మాన్ని సంపూర్ణం గావించి, మీకు (ప్రసాదించవలసిన) నా అనుగ్రహ భాగ్యాన్ని పూర్తి చేశాను. మీ కోసం ఇస్లాంను మీ ధర్మంగా ఆమోదించాను". (5:3)

దానికి హజ్రత్ ఉమర్ (రజి) సమాధానమిస్తూ "ఆ రోజు ఏదో మాకు బాగా తెలుసు. పైగా దైవప్రవక్త (సల్లం)పై ఈ సూక్తి ఎక్కడ అవతరించిందో కూడా మాకు తెలుసు. ఆ రోజు శుక్రవారం. దైవప్రవక్త (సల్లం) అరఫాత్ ప్రాంతంలో (ప్రసంగించడానికి) నిల్చున్నారు. (శుక్రవారం ముస్లింలకు ఇంతకు ముందు నుంచే పండుగ రోజుగా పరిగణించబడుతూ వస్తోంది)" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:-2వ ప్రకరణం - ఈమాన్, 33వ అధ్యాయం-జియాదతిల్ ఈమాని వనుఖ్సానిహీ)**

1896. హజ్రత్ ఉర్వా బిన్ జుబైర్ (రజి) కథనం:-(దివ్యఖుర్ఆన్‌లో) "మీరు అనాథలకు న్యాయం చేకూర్చలేమని భయపడితే, మీకు నచ్చిన స్త్రీలలో ఇద్దర్ని (గాని), ముగ్గుర్ని (గాని), నల్గుర్ని(గాని) వివాహమాడండి" (4:3) అనే దైవసూక్తిని గురించి నేను విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి)ను అడిగాను. దానికామె ఈ విధంగా సమాధానమిచ్చారు:-

---

★ 'హిత్తతున్' అంటే 'ఇది క్షమాపణ కోరవలసిన సమయం, పాపాలు దూరమవుతున్నాయి' అని అర్థం. (సంకలనకర్త)

"బాబూ! దానికి అనాథ బాలిక అని అర్థం. ఒకరి (అంటే ఒక బంధువు) సంరక్షణలో పోషించబడుతూ, సంరక్షకునికి తన సంపదలో భాగం కల్పించిన అనాథ బాలిక ఆమె. ఆ తరువాత ఆ సంరక్షకుడు ఆమె అందాన్ని, ఆమె ఆస్తిని మోహించి మహర్ విషయంలో న్యాయం చేకూర్చకుండా ఆమెను వివాహమాడగోరుతాడు. అంటే ఆమెకు ఇతర స్త్రీలకు ఇచ్చేటంత మహర్ ఇవ్వడానికి అంగీకరించడు. అందువల్ల ఈ సూక్తిలో అలాంటి బాలికలను మహర్ విషయంలో న్యాయం చేకూర్చకుండా వివాహమాడకూడదని ఆజ్ఞాపించబడింది. సంరక్షకుడు అలాంటి బాలికను వివాహమాడదలిస్తే ఆమెకు చెల్లించవలసిన మహర్‌ని పూర్తిగా చెల్లించాలి. తరువాత ఆ బాలికలే కాకుండా మీకు నచ్చిన ఇతర స్త్రీలను కూడా చేసుకోవచ్చని ఈ సూక్తిలో తెలియజేయబడింది.

"ఈ సూక్తి అవతరించిన తరువాత ప్రజలు మళ్ళీ దైవప్రవక్త (సల్లం)ను దాని గురించిన వివరాలు అడిగారు. అప్పుడు ఈ (క్రింది) సూక్తి అవతరించింది - "ప్రజలు నిన్ను స్త్రీలను గురించి తీర్పు అడుగుతున్నారు. వారికిలా చెప్పు, వారి విషయంలో దేవుడు మీకు తీర్పు యిస్తున్నాడు. దాంతోపాటు ఈ గ్రంథంలో మీకు ఇంతకు పూర్వం వినిపించిన ఆజ్ఞలను కూడా ఆయన మీకు గుర్తు చేస్తున్నాడు. అంటే అనాథ బాలికలకు సంబంధించిన ఆజ్ఞలు. ఆ బాలికల హక్కులను మీరు నిర్వర్తించరు. వారికి పెళ్ళిళ్ళు చేయరు (వారి అందం, ఆస్తి చూసి స్వయంగా మీరే వారిని వివాహమాడడానికి ఉవ్విళ్ళూరుతారు). ఎలాంటి శక్తిస్థోమతాలేని పసిపిల్లలకు సంబంధించిన ఆజ్ఞలు కూడా. అనాథలకు న్యాయం చేకూర్చాలని దేవుడు మీకు ఉపదేశిస్తున్నాడు". (4:127)

"ఈ గ్రంథంలో మీకు ఇంతకు పూర్వం విన్పించిన ఆజ్ఞలు" అంటే 'మీరు అనాథలకు న్యాయం చేకూర్చలేమని భయపడితే, మీకు నచ్చిన స్త్రీలను ఇద్దర్ని (గాని), ముగ్గుర్ని (గాని), నల్గుర్ని (గాని) వివాహమాడండి' అనే మొదటి సూక్తి అన్నమాట. రెండవ సూక్తిలో 'వారికి పెళ్ళిళ్ళు చేయరు లేదా స్వయంగా మీరే వారిని వివాహమాడడానికి ఉవ్విళ్ళూరుతారు' అంటే సంరక్షకునికి తన సంరక్షణలో ఉండే అనాథ బాలికపట్ల ఆకర్షణ అని అర్థం. సంరక్షకుడ్ని ఆకట్టుకునేటంత అందం, ఆస్తి లేకపోతే అతనామె వివాహాన్ని చేయకుండా ఆమె ఆస్తిని స్వాహా చేస్తాడు. అందం, ఆస్తి ఉంటే స్వయంగా అతనే ఆమెను వివాహమాడతాడు. ఇక్కడ ఆకర్షణ అనేది రెండు పరిస్థితులకూ వర్తిస్తుంది. అందువల్ల (ఈ వైఖరి మానుకొని) అనాథ బాలికలకు న్యాయం చేకూర్చాలని ఆదేశించడం జరిగింది. వారిని వివాహమాడదలచుకుంటే వారికి చెల్లించవలసిన మహర్ ధనాన్ని పూర్తిగా చెల్లించి న్యాయం చేకూర్చాలి. ఒకవేళ ఆమెను వివాహమాడడం తనకు ఇష్టం లేకపోతే ఇతరులకిచ్చి వివాహం జరిపించాలి. ఆ విధంగానైనా ఆమెకు న్యాయం చేకూర్చాలి".

(సహీహ్ బుఖారీ:- 47వ ప్రకరణం - షిర్కత్, 7వ అధ్యాయం - షిర్కతిల్‌యతీమి వ అహ్లిల్ మీరాస్)

1897. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- "అనాథ (పిల్లల) సంరక్షకుడు ధనికుడయి ఉంటే అతను దేవునికి భయపడుతూ (వారి పట్ల) మసలుకోవాలి. పేదవాడయి ఉంటే సముచిత రీతిలో (అనాథ పిల్లల ఆస్తిని) తినాలి". (దివ్యఖుర్‌ఆన్-4:6)

అనాథ సంరక్షణ బాధ్యత వహిస్తూ అతని ఆస్తిని కాపాడే వ్యక్తి విషయంలో ఈ సూక్తి అవతరించింది. అలాంటి సంరక్షకుడు పేదవాడయి ఉంటే అతను అనాథ ఆస్తిని న్యాయబద్ధంగా - సముచితరీతిలో - అనుభవిస్తే అందులో ఎలాంటి తప్పులేదు.

**(సహీహ్ బుఖారీ:- 34వ ప్రకరణం - బుయూ, 95వ అధ్యాయం - మన్ అజ్రా అమ్రల్ అమ్సారి అలా మాయత అరఫూన్ బైనహుమ్)**

1898. హజ్రత్ ఆయిషా (రజి) కథనం:- "స్త్రీకి తన భర్త తనను వేధిస్తాడని లేదా నిరాదరిస్తాడని భయముంటే" (ఖుర్‌అన్-4:128)....

ఒక పురుషుడు తన భార్యను అంతగా పట్టించుకోకుండా ఆమెను వదిలేద్దామని భావిస్తాడు. ఆ స్థితిలో అతని భార్య '(నాకు విడాకులివ్వకు) నీవు రెండో పెళ్ళి చేసుకోవడానికి నేను అనుమతి స్తున్నాను'★ అని అంటుంది. అలాంటి భర్త విషయంలో ఈ సూక్తి అవతరించింది.

**(సహీహ్ బుఖారీ:- 46వ ప్రకరణం - మజాలిమ్, 11వ అధ్యాయం - ఇజా ఖల్లలహూ మిన్ జుల్మిహీ ఫలా రుజూ అమినహు)**

1899. హజ్రత్ సయీద్ బిన్ జుబైర్ (రజి) కథనం:- ఒక సూక్తి భావం విషయంలో కూఫా ప్రజల్లో భేదాభిప్రాయాలు వచ్చాయి. నేనప్పుడు హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) దగ్గరకు వెళ్ళి ఆ సూక్తిని గురించి అడిగాను. ఆయన దానికి సమాధానమిస్తూ "ఎవరైనా విశ్వాసిని ఉద్దేశ్యపూర్వకంగా చంపితే దాని ప్రతిఫలం నరకం అవుతుంది- (4:93) అనే సూక్తి ఈ వ్యవహారం గురించి అవతరించిన చివరి సూక్తి. దీన్ని మరే సూక్తీ రద్దు చేయలేదు" అని అన్నారు.

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 4వ సూరా - నిసా, 16వ అధ్యాయం - వమయ్యఖ్తుల్ మూమినన్ ముత అమ్మిదన్ ఫజజావుహూ జహన్నమ్)**

1900. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ అబ్జా (రజి) కథనం:- (1) "ఎవరైనా విశ్వాసిని ఉద్దేశ్యపూర్వకంగా చంపితే దాని ప్రతిఫలం నరకం అవుతుంది" (4:93); (2) "అల్లాహ్‌ను తప్ప మరే దైవాన్ని మొరపెట్టుకోని వారు, అల్లాహ్ నిషేధించిన ఏ ప్రాణినీ అన్యాయంగా చంపనివారు, వ్యభిచారానికి పాల్పడనివారు - ఈ (పాప) కార్యాలు చేసేవాడు తన పాపాలకు పర్యవసానం అనుభవిస్తాడు". (25:68)

నేనీ రెండు సూక్తుల్ని గురించి హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి)ని అడిగితే ఆయన ఈ విధంగా తెలియజేశారు: "ఈ రెండవ సూక్తి అవతరించినప్పుడు మక్కా బహుదైవారాధకులు (నొసలు చిట్లిస్తూ) 'మనం బహుదైవారాధన (షిర్క్) కూడా చేశాము, దేవుడు నిషేధించిన ప్రాణిని ఉద్దేశ్యపూర్వకంగా హతమార్చడం కూడా చేశాము, నీతిమాలిన చర్యలకూ్కడా పాల్పడ్డాము. (అంటే మనం సరాసరి నరకంలోకి పోయి పడతామన్నమాట. మన పాపాల మన్నింపుకు మరో దారే లేదన్నమాట)' అని అన్నారు. అప్పుడు ఈ సూక్తి అవతరించింది - '(పాపం చేసిన తరువాత) పశ్చాత్తాపంతో పాపక్షమాపణ

★ అంటే నాకు విడాకులివ్వకు అని అర్థం. విడాకుల కంటే (రెండో పెళ్ళి చేసుకోవడం ద్వారా) పరస్పరం రాజీపడటం మంచిది. స్త్రీ భర్తతో కొంతకాలం కాపురం చేసింది గనుక, మిగిలిన జీవితం కూడా అతనితో పాటు గడపటమే మంచిది.

వేడుకొని, సత్యాన్ని విశ్వసించి సదాచార వైఖరి అవలంబించిన వారు తప్ప. అలాంటి వారి పాప కార్యాలను దేవుడు పుణ్యకార్యాలుగా మార్చుతాడు. ఆయన గొప్ప క్షమాశాలి, అపార దయామయుడు' (25:70)".

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 25వ సూరా - ఫుర్ఖాన్, 3వ అధ్యాయం - యుజాఅఫు లహుల్ అజాబు యౌమల్ ఖియామ)**

1901. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) కథనం:- "ఎవరైనా మీ దగ్గరకు సలాం చేస్తూ వస్తే అతనికి వెంటనే 'నీవు విశ్వాసివి కావు' అని చెప్పకండి. మీరు ప్రాపంచిక ప్రయోజనాలు కోరుతున్నారా? అయితే..." (4:94). మేకలు కలిగి ఉన్న ఒకతని దగ్గరకు ముస్లింలు వచ్చినప్పుడు అతను వారిని చూసి అస్సలాము అలైకుం అన్నాడు. కాని ఆ ముస్లింలు అతడ్ని (విశ్వాసిగా నాటకమాడుతున్న శత్రువనుకొని) చంపివేశారు. చంపి అతని మేకల్ని కూడా తీసికెళ్ళారు. ఆ సందర్భంలో ఈ సూక్తి అవతరించింది. ఇందులో ప్రాపంచిక ప్రయోజనాలంటే అతని దగ్గరున్న కొన్ని మేకలన్నమాట.

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 4వ సూరా -నిసా, 17వ అధ్యాయం - వలా తఖూలూ లిమన్ అల్ఖా ఇలైకుముస్సలామ లస్త మూమిన)**

1902. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం:- "మీరు మీ ఇండ్లలోకి దొడ్డి దారిన ప్రవేశించడం పుణ్యకార్యం కాదు. దేవుని ఆగ్రహం నుండి తప్పించుకోవడమే అసలైన పుణ్యకార్యం. కనుక మీరు మీ ఇండ్లలోకి ముఖద్వారం గుండానే ప్రవేశించండి". (2:189)

ఈ సూక్తి మా గురించి అవతరించింది. అన్సారులు హజ్ యాత్ర నుండి తిరిగొచ్చిన తరువాత తమ ఇండ్లలోకి వాటి ముఖద్వారాల గుండా ప్రవేశించకుండా దొడ్డి దారిన ప్రవేశిస్తారు. ఇది వారి ప్రాచీన సంప్రదాయం. దాని ప్రకారం ఒక అన్సారీ ముస్లిం హజ్ యాత్ర నుండి తిరిగొచ్చి తన ఇంట్లోకి దొడ్డి దారిన ప్రవేశించాడు. ఆ సందర్భంలో ఈ సూక్తి అవతరించింది.

**(సహీహ్ బుఖారీ:- 26వ ప్రకరణం-ఉమ్రా, 18వ అధ్యాయం - ఖౌలిల్లాహితఆలా (వాతుల్ బుయూత మిన్ అబ్వాబిహా)**

1903. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) కథనం:- మానవుల్లో కొందరు జిన్నులలో కొందరిని పూజిస్తూ వుండేవారు. తరువాత ఆ జిన్నులు ముస్లిములయిపోయారు. కాని ఈ మనుషులు మాత్రం ఇంకా ఆ జిన్నులనే పూజిస్తూ ఉండిపోయారు, అలాంటి మానవుల్ని గురించి ఈ సూక్తి అవతరించింది- "వీరు ఎవరిని మొరపెట్టుకుంటున్నారో వారు స్వయంగా తమ ప్రభువు సాన్నిధ్య మార్గాన్ని అన్వేషిస్తున్నారు. వారు పరస్పరం పోటీపడుతూ ఆయన కారుణ్య కటాక్షాలను ఆశిస్తున్నారు. ఆయన శిక్షకు భయపడుతున్నారు." (17:57)

**(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం- తఫ్సీర్, 17వ సూరా - బనీ ఇస్రాయీల్, 7వ అధ్యాయం - ఖులిద్ ఉల్లజీన జఅమ్తుమ్ మిన్ దూనిహీ)**

## 5వ అధ్యాయం - తౌబా, అన్ఫాల్, హష్ర్ సూరాల వ్యాఖ్యానం

1904. హజ్రత్ సయీద్ బిన్ జుబైర్ (రజి) కథనం:- నేను హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి)ని తౌబా సూరాను గురించి అడిగితే ఆయన ఇలా సమాధానమిచ్చారు: "తౌబా సూరా (అవిశ్వాసుల్ని, కపటుల్ని) అవమానపరిచే సూరా. ఈ సూరాలో 'వారిలో ఒకడు, వారిలో ఒకడు' అని మాటి మాటికి సూక్తులు

అవతరిస్తున్న తీరును గమనిస్తే, ఎవరినీ వదలి పెట్టడం జరగదని, అందర్నీ ప్రస్తావించడం జరుగుతుందని మాకు అనుమానం కలిగేది".

ఆ తరువాత నేను అన్ఫాల్ సూరాని గురించి అడిగితే "ఈ సూరా బద్ర్ యుద్ధం గురించి అవతరించింది" అని అన్నారు ఆయన. ఆ తరువాత నేను హష్ర్ సూరాని గురించి అడిగాను. దానికాయన "ఈ సూరాలో బనీ నజీర్ (తెగయూదుల) గురించిన ప్రస్తావన ఉంది" అని అన్నారు.

(సహీహ్ బుఖారీ:- 65వ ప్రకరణం - తఫ్సీర్, 59వ సూరా-హష్ర్, 1వ అధ్యాయం-హద్దసనా ముహమ్మద్ బిన్ అబ్దుర్రహీం)

## 6వ అధ్యాయం-మద్య నిషేధం గురించిన సూక్తి అవతరణ

1905. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి)కథనం:- హజ్రత్ ఉమర్ (రజి) ప్రవక్త వేదిక (మింబర్) పై నిలబడి ప్రసంగిస్తూ "సారా నిషేధం గురించిన ఆజ్ఞ అవతరించింది. ఆ రోజుల్లో సారా అయిదు రకాల వస్తువులతో తయారు చేయబడుతుండేది (1) ద్రాక్ష, (2) ఖర్జూరం, (3) సాధారణ గోధుమలు, (4) జొరకం గోధుమలు, (5) తేనె. బుద్ధిమాంద్యం కలిగించే ప్రతి వస్తువునీ (అరబీ భాషలో) 'ఖమర్' అంటారు. అదీగాక [1]తాత [2]వారసుల్లేకుండా చనిపోయేవాడు[3] వడ్డీకి సంబంధించిన ఒక రకం. ఈ మూడు విషయాలను గురించి కూడా దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని వీడిపోకముందే స్పష్టమైన ఆదేశాలు ఇస్తే బాగుంటుందని నేను కోరుకునేవాడ్ని".

(సహీహ్ బుఖారీ:-74వ ప్రకరణం - అష్రిబా, 5వ అధ్యాయం-మాజాఅ ఫీఅన్నల్‌ఖమ్ర మాఖామరల్ అఖ్ల మినష్షరాబ్)

## 7వ అధ్యాయం -'హాజాని ఖస్మానిఖ్‌త సమూ ఫీ రబ్బిహిం' అనే సూక్తికి వ్యాఖ్యానం

1906: హజ్రత్ ఖైస్ (రహ్మలై) కథనం:- హజ్రత్ అబూజర్ గిఫ్ఫారి (రజి) ప్రమాణం చేసి ఇలా అన్నారు- "ఈ రెండు పక్షాల మధ్య తమ ప్రభువు విషయంలో జగడం వచ్చింది" (22:19) అనే సూక్తి బద్ర్ యుద్ధం నాడు పంక్తుల నుండి బయటికి వచ్చి పరస్పరం పోరాడిన యోధుల్ని గురించి అవతరించింది. ఇందులో (ముస్లింల తరపున) (1) హజ్రత్ హమ్జా (రజి) (2) హజ్రత్ అలీ (రజి), (3) హజ్రత్ ఉబైదా (రజి); (అవిశ్వాసుల తరపున) రబీయా కొడుకులు (1) ఉత్బా, (2) షీబా, (3) మరొకతను వలీద్ బిన్ ఉత్బా పాల్గొన్నారు.

(సహీహ్ బుఖారీ:- 64వ ప్రకరణం - మగాజి, 8వ అధ్యాయం - ఖత్లి అబీజహల్)

---

(1) అంటే, తాత వదలిన ఆస్తి సమస్య.

(2) చనిపోయేటప్పుడు సంతానం తల్లిదండ్రులు లేకుండా సోదరసోదరీలుగాని, లేదా దూరపు బంధువులు గాని మాత్రమే కలిగి ఉండే వ్యక్తి. ఇలాంటి వ్యక్తిని 'కలాలా' అంటారు. కొందరి దృష్టిలో కేవలం సంతానం లేకుండా చనిపోయే వ్యక్తిని 'కలాలా' అంటారు. హజ్రత్ ఉమర్ (రజి) జీవితాంతం ఈ వ్యవహారం గురించి సందిగ్ధంలో పడి ఉన్నారు. అయితే కొందరు షరీఅత్ వేత్తలు హజ్రత్ అబూ బకర్ (రజి) అభిప్రాయాన్ని సమర్థించారు. అంటే సంతానం, తల్లిదండ్రులు లేకుండా సోదర సోదరీలు, దూరపు బంధువులు మాత్రమే కలిగి ఉండేవాడు 'కలాలా' క్రిందికి వస్తాడని ఆయన అభిప్రాయం. ఖుర్‌ఆన్ ద్వారా కూడా ఈ విషయం ధృవపడుతోంది. ఖుర్‌ఆన్ కలాలా వ్యక్తి ఆస్తికి అతని సోదరీని వారసురాలిగా పరిగణించింది (4:176). తండ్రి జీవించి ఉంటే సోదరీకి వాటా లభించే ప్రసక్తే ఉండదు.

(3) ఇది 'రిబా' అల్‌ఫజల్ రకం వడ్డీ. ఇందులో మళ్ళీ రెండు రకాలున్నాయి. ఒకటి అప్పిచ్చి దాని మీద లాభం తీసుకోవడం. అప్పు గడువు పెరిగిన కొద్దీ వడ్డీ కూడా పెరుగుతుంది. ఇలాంటి వడ్డీ పద్ధతిని ఖుర్‌ఆన్ నిషేధించింది. దీని విషయంలో ధర్మవేత్తల మధ్య ఎలాంటి భేదాభిప్రాయాలు లేవు. రెండో రకం వడ్డీ గురించి ప్రవక్త ప్రవచనంలో ఆరు వస్తువుల ప్రస్తావన ఉంది: (1) బంగారం, (2) వెండి, (3) గోధుమలు, (4) యవలు, (5) ఖర్జూరం, (6) ఉప్పు. మిగతా వస్తువుల విషయంలో ధర్మవేత్తల మధ్య భేదాభిప్రాయాలు ఉన్నాయి. (సంకలనకర్త)